MANDALI VENKATA KRISHNA RAO
Vyaasaalu, Upanyaasaalu

మండలి వెంకట కృష్ణారావు
వ్యాసాలు-ఉపన్యాసాలు

సంపాదకులు : డా॥ డి. చంద్రశేఖర రెడ్డి

ముద్రణ : సెప్టెంబరు, 2013

మూల్యం : రూ.175/-

ISBN : 978-93-82203-95-7

ముఖచిత్రం : స్టార్ ఫీచర్స్, హైదరాబాద్.

ప్రింటర్స్ : సాయిలిఖిత ప్రింటర్స్, హైదరాబాద్.

ప్రచురణ
ఎమెస్కో బుక్స్
1-2-7, బానూ కాలనీ,
గగన్‌మహల్ రోడ్, దోమలగూడ,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ & ఫ్యాక్స్ : 040-23264028
e-mail : emescobooks@yahoo.com,
www.emescobooks.com

పంపిణీదారులు
సాహితి ప్రచురణలు
29-13-53, కాళేశ్వరరావు రోడ్డు,
సూర్యారావుపేట, విజయవాడ - 2.
ఫోన్ : 0866-2436643
e-mail: sahithi.vja@gmail.com

# ముందుమాట

రాజనీతి, రాజకీయం అన్నమాటలున్నాయి. రాజనీతి అన్నది ఒక శాస్త్రంగాను, ఒక రాజ్యపాలనలో అనుసరించవలసిన విధానంగానూ కనిపిస్తుంది. రాజకీయం ఒక పరిపాలనా వ్యవస్థను ఏర్పరచుకోవడానికి ప్రజలు అవలంబించే పద్ధతి. ఇప్పుడు రాజనీతి అన్నమాట పుస్తకాలకే పరిమితమై పోయింది. రాజకీయం అన్నమాట గౌరవం కోల్పోయింది. రాజకీయం చేయడమంటే కుట్రలు, కుతంత్రాలు చేయడమనే అర్థం ఏర్పడిపోయింది. రాజకీయం చేసే రాజకీయనాయకులంటే ప్రజల్లో ఏమాత్రం గౌరవాదరాలు కనిపించడం లేదు.

రాజ్యం అంటే ప్రజలు. ప్రజాస్వామ్యంలో ప్రజలే ప్రభువులు. తమ పాలకులను ప్రజలు తామే ఎన్నుకుంటారు. వాస్తవానికి ఇలా ఎన్నికైన నాయకులు ప్రజల సేవకులు. కాని నేటి పరిస్థితి ఆ ఓట్లని సంపాదించిన రాజకీయ నాయకుడు పాలకుడనీ, ప్రజల పట్ల అతనికేమీ బాధ్యతలేదనీ ఇప్పుడనిపిస్తుంది.

స్వాతంత్ర్యానంతరం కొంతమాత్రమైనా ఉన్న ఆదర్శాలు క్రమక్రమంగా నశించి నిస్వార్థ ప్రజాసేవ నుండి ఇప్పుడు స్వార్థప్రయోజనాల సాధనే ఏకైక లక్ష్యంగా రాజకీయం ముందుకు సాగుతున్నది. అవినీతి ఆరోపణలు లేని రాజకీయనాయకులను కాగడా వేసి వెతకవలసిన దుస్థితి దాపురించింది. ఇవ్వాళ వక్రమార్గాల్లో ధనసంపాదన విషయంలో గొప్ప పోటీ నెలకొంది. నాయకుల్లో ఇది సహజమై పోగా ప్రజలు కూడా వెనుకంజ వేయడం లేదు.

ఇప్పుడు మనకు కావలసింది రాజకీయాల్లో స్వచ్ఛమైన జీవితం గడిపిన వాళ్లు, ఆదర్శాలకోసం, సిద్ధాంతాలకోసం దేన్నైనా ఎదిరించినిలిచిన వాళ్లు, పదవులకోసం అర్రులు చాచని వాళ్లు, ప్రజల కష్టాల్లో మమైకమై పోయేవాళ్లు, నమ్మిన సిద్ధాంతం కోసం దేన్నైనా త్యాగం చేయగలిగినవాళ్లు,

తరువాతి తరాలకు ఆదర్శం నెలకొల్పగలిగినవాళ్లు. ఇలా మాట్లాడితే వినేవాళ్లు చాలా మంది నవ్వుకుంటారు ఇవ్వాళ. కానీ ఒకప్పుడు ఇటువంటి రాజనీతిజ్ఞులు పలువురు మనదేశంలోనే ఉన్నారు. వారిని ఆదర్శంగా తీసుకోగలిగితే నేటి మన రాజకీయాలు కూడా మారిపోతాయి.

ఒకప్పటి రాజకీయ నాయకులలో సేవాభావం, నిస్వార్థం, త్యాగం, శాంతి అహింసల పట్ల అంకితభావం విస్తారంగా ఉండేవి. అటువంటి రాజకీయనేతలలో మండలి వెంకటకృష్ణారావుగారు ఒకరు. ఈ సద్గుణాలతో పాటు వారిలో గొప్ప వక్తృత్వం, బహుగ్రంథ పఠనాసక్తి, రచనా నైపుణ్యం కూడా ఉన్నాయి. ఆయన వివిధ సందర్భాలలో రచించిన వ్యాసాలు, చేసిన ప్రసంగాలు దేశమూ సమాజమూ పట్ల ఆయనకున్న అవగాహనను వెల్లడిస్తాయి. ఆ వ్యాసాల వైవిధ్యాన్ని చూసినప్పుడు వారి బహుముఖ వైదుష్యం వ్యక్తమవుతుంది.

ఈ పుస్తకం మండలి వెంకటకృష్ణారావుగారి వ్యాసాలు–ఉపన్యాసాల సంకలనం. ఈ వ్యాసాల్లో ఆయన దేశభక్తి, ఆంధ్ర దేశం ప్రజల పట్ల ఆయనకున్న భక్తి గౌరవాలు, ఆంధ్రాభిమానం స్పష్టంగా కనిపిస్తాయి. పంచాయితీ రాజ్ వంటి పాలన వ్యవస్థలు, విద్య, సామాజిక అభివృద్ధి సమస్యలు వంటి విషయాలపై ఆయనకున్న అవగాహన స్పష్టమవుతుంది. రాజకీయ నాయకులలో అరుదుగా కనిపించే రచనా శక్తి ఆయనలో నిండుగా కనిపిస్తుంది.

ప్రస్తుత రాజకీయ వాతావరణంలో ప్రజలకు ఒక ఆదర్శాన్ని నిరూపించవలసిన ఆవశ్యకత ఉంది. ఈ గ్రంథం అటువంటి ఆదర్శాన్ని నెలకొల్పగలదనీ ప్రజలు తమకు ఎటువంటి రాజకీయ నాయకులు కావాలో నిర్ణయించుకోవడానికి మార్గదర్శకం కాగలదనీ ఆశిస్తున్నాం.

**ఎమెస్కో విజయకుమార్**

# విషయసూచిక

## తెలుగు తేజం


శుభాకాంక్షలు 11

తెలుగు తేజానికి అక్షరనీరాజనం 12

1. తెలుగు తేజం 17
2. దేశభాషలందు తెలుగు లెస్స 22
3. తెలుగువారు : సహనం - సహజీవనం 26
4. ఆంధ్రప్రదేశ్ సహజసంపద 29
5. తెలుగుదేశ పురోభివృద్ధికి సమైక్యకృషి 33
6. తెలుగుసంస్కృతి : ప్రభుత్వప్రోత్సాహం 37
7. మన అధికారభాష - తెలుగు 46
8. వాడుకభాషగా తెలుగు-సాధకబాధకాలు 52
9. ప్రపంచ తెలుగు మహాసభలు ఎందుకు? 55
10. ప్రపంచ తెలుగు మహాసభల ప్రాధాన్యం - ప్రయోజనం 58
11. ప్రపంచ తెలుగు మహాసభలు - స్వాగతోపన్యాసం 62
12. ప్రపంచ తెలుగు మహాసభలు - పర్యావలోకనం 65
13. ప్రపంచ తెలుగు మహాసభలు - తెలుగుజాతిపై వాటి ప్రభావం 71
14. రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు - ఆవశ్యకత 77
15. అంతర్జాతీయ తెలుగు సంస్థ 80
16. తరతరాల తెలుగుజాతి 84
17. తెలుగుజాతి - సమైక్యం 87
18. విదేశాల్లో తెలుగువారు - సాంస్కృతికవికాసం 92
19. మారిషస్‌లో తెలుగువారు 97
20. బ్రిటన్‌లో తెలుగువారు 102
21. విదేశాలలో తెలుగువారు - దక్షిణాఫ్రికా 106
22. మలేషియాలో తెలుగువారు 111
23. ఉత్తర అమెరికాలో తెలుగువారు 116


## గాంధీ దర్శనం


పరిచయం : పద్మభూషణ్ డా॥ మోటూరి సత్యనారాయణ 121

సంపాదకుని ప్రస్తావన : జోశ్యుల సూర్యనారాయణమూర్తి 125

1. గాంధీ దర్శనం 127
2. కాశీలో గాంధీజీ ప్రథమ ఉపన్యాసం 130
3. గాంధీ - గాంధీయిజం 133

4. కార్మిక సంక్షేమం - గాంధీజీ 137
5. నిర్మాణ కార్యక్రమము - గాంధీజీ 141
6. నిర్మాణ కార్యక్రమము - నాడు-నేడు 146
7. అన్ని వాదాలకన్నా గాంధీయవాదం మిన్న 149
8. విదేశాలలో గాంధీ ప్రభావం 152
9. గాంధీయ మార్గంలో రాజకీయ వ్యవస్థ సాధ్యమా? 154
10. ప్రపంచానికి గాంధీయ మార్గమే శరణ్యం 158
అనుబంధం శ్రీ మండలితో ఇష్టగోష్ఠి 160

**ప్రజా ఉద్యమాలు : రాజకీయాలు**

1. భారత జాతీయ కాంగ్రెసు మహత్తర చరిత్రలో మహోజ్జ్వల ఘట్టాలు 167
2. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ పూర్వాపరాలు 184
3. స్వాతంత్ర్య పోరాటంలో ఆంధ్రప్రదేశ్ 192
4. బందరు విద్యార్థుల 1946 చారిత్రక పోరాటం 199
5. భారత రాజ్యాంగం - పూర్వాపరాలు 201
6. భారతదేశ భవిష్యత్తును తీర్చిదిద్దే మధ్యంతర ఎన్నికలు కాంగ్రెసు సంఘముల బాధ్యతలు! కార్యకర్తల కర్తవ్యం! 209
7. కాంగ్రెస్ కార్యకర్తలు : నిర్మాణ కార్యక్రమం 222
8. లోక్‌సభ మధ్యంతర ఎన్నికలు - కాంగ్రెసు అఖండ విజయం : కాంగ్రెసు సంఘాల అభ్యర్థుల కార్యకర్తల కర్తవ్యం 226
9. బాలారిష్టాలు అధిగమించిన ఆంధ్రప్రదేశ్ ప్రగతి పథగమనం 229
10. నూరేళ్ల పండుగ 234

**భాష : సంస్కృతి**

1. అంతర్జాతీయ తెలుగు సంస్థ 241
2. ఇతర రాష్ట్రాలలో తెలుగువారు : విద్యా సాంస్కృతిక సమస్యలు 245
3. ప్రపంచ తెలుగు మహాసభలు - వాటి ప్రత్యేకత 250
4. ద్రవిడ భాషాశాస్త్రవేత్తల 6వ అఖిలభారత మహాసభ అధ్యక్షోపన్యాసం 254
5. తిరువాయూరులో 130 వార్షిక శ్రీత్యాగరాజస్వామి వారి ఆరాధనోత్సవాలు 258

**విద్య**

1. విద్యావ్యాప్తి 263
2 నాగార్జున విశ్వవిద్యాలయ అవతరణ 274
3. కాకతీయ విశ్వవిద్యాలయ ప్రారంభం 279
4. ఆరోగ్య జనాభా విద్యాసదస్సు 283

5. రాజస్థానీ శిక్షాసమితి, నిజామాబాదు ఆధ్వర్యాన నడుస్తున్న
శిక్షాసంస్థల వారికోత్సవ సందేశం 288
6. సామాజిక పరివర్తన సాధనం - 'విద్య' 292
7. విద్యామంత్రిగా నా భావాలు - అనుభవాలు 298
8. దండలు - విందులు ఊరేగింపులు - బాణసంచాలు 304
9. భారత రాజనీతి శాస్త్ర మహాసభ - 35వ సమావేశం 309
10. విద్య లక్ష్యాలు 318
11. మైసూరులోని దక్షిణాది ప్రాంతీయ భాషా కేంద్రం,
భారతీయ భాషల కేంద్ర సంస్థ - ప్రాముఖ్యత 324
12. విద్యారంగంలో ఆంధ్రప్రదేశ్ సాధించిన గణనీయ ప్రగతి 330
13. పన్నెండు సూత్రాల కార్యక్రమము 335
14. ప్రాథమిక విద్య బోధనాంశాల పునర్నిర్మాణం -
సామాజిక విద్య మరియు భాగస్వామ్యం కార్యకలాపాల అభివృద్ధి 338

**1977 జలప్రళయం**

1. 1977 నాటి జలప్రళయ జ్ఞాపకాలు 345
2. ప్రళయం - చేపట్టిన సేవా కార్యక్రమాలు 359
2. ఘోర విపత్తు - ఎదుర్కొన్న తీరు 362
3. నాటి వల్లకాడు గొల్లపాలెం - నేటి రమణీయ గ్రామం రామకృష్ణపురం ! 367
4. ఆనాటి చింతకోళ్ళ ఈనాటి ప్రభాకర్‌జీ పురం 371
5. విశ్వహిందూ పరిషత్ కృషి ఫలితమే - హంసలదీవి 373
6. తుఫాను, ఉప్పెన ప్రాంతాలలో రామకృష్ణమిషన్ విశిష్టసేవలు 375
7. కృష్ణాజిల్లాలో - పోలీసుల సేవ
సేవాభావంతో ఖాకీలు కారుణ్యమూర్తులైనవేళ... 380
8. బిల్లీ గ్రాహంనగర్ - దైవస్వరూపుని కానుక 384
9. దివిసీమ ఉప్పెనపై... 387
11. ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థలు, సామాజిక సేవా కార్యకర్తల
సంఘం మహాసభ - తిరుపతి - ప్రధానోపన్యాసం 395

**స్మృతి పథంలో**

1. నవభారతనిర్మాత శ్రీ జవహర్ లాల్ నెహ్రూ 409
2. విశ్వరత్న - మన భారతరత్న ఇందిరాగాంధీ 412
3. ప్రపంచ నాయకుడు రాజీవ్ గాంధీ 414
4. నామీద డాక్టరు పట్టాభిగారి ప్రభావం 416
5 అమరజీవి పొట్టి శ్రీరాములు 419
6. శాంతి యాత్రికుడు - ప్రభాకర్ జీ 422

7. ఆంధ్రలో నీటివనరులు "ఆంధ్రభగీరథు" ని కృషి 425
8. ఆంధ్రప్రదేశ తొలి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి 431
9. నైతిక విలువలకు పట్టంగట్టిన శ్రీ నీలం సంజీవరెడ్డి 435
10. ప్రతిభ – రాజకీయ విజ్ఞత మూర్తీభవించిన
నాయకుడు శ్రీ జలగం వెంగళరావు 439
11. సమైక్యతా సారథి శ్రీ జలగం వెంగళరావు 443
12. నవయుగ వైతాళికుడు- కందుకూరి వీరేశలింగం పంతులు 450
13. దేశోద్ధారక, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 453
14. చరిత్రకెక్కిన వ్యక్తి – విశ్వనాథ 457
15. కోసూరు పున్నయ్య 459
16. పదవులను ఆశించని ప్రజానాయకుడు : రంగాజీ 460
17. కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి : కల్యాణకల్పవల్లి 462
18. మానవతావాది – ఇందిరాగాంధి 464
19. 'ఆంధ్రుల అభిమాన నాయకుడు' శ్రీ సంజీవరెడ్డి 468
20. నేనెరిగిన సంజీవయ్య 473
21. కాంగ్రెసు స్వరాజ్య ఉద్యమాలకు జీవగఱ్ఱ శ్రీ బారు రాజారావు 476
22. రాజకీయాలలో అదృష్టవంతుడు అనగాని 478


**ఇతరాలు**


1. మత్స్యపరిశ్రమ – మత్స్యపారిశ్రామికులు 483
2. వెనుకబడిన తరగతుల సంక్షేమం 488
3. భూ సంస్కరణలు – వాటి ఆవశ్యకత 497
4. అత్యయికపరిస్థితిలో అమోఘమైన ఒక ఏడాది 503
5. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు 508
6. సాంఘికసంక్షేమం- హరిజనోద్ధరణం 511
7. అవినీతిని నిరోధించడం ఎలా? 514
8. సాంఘిక విప్లవము- అనివార్యము 522
9. కాంగ్రెసు శిబిరం, నాగార్జునసాగర్ ప్రస్తుత సమస్యలు:
కొన్ని పరిష్కార మార్గాలు 526
10. సాంఘిక సంస్కరణలు- సమైక్యత 537
11. బస్సు రవాణా జాతీయం 543
12. సాంఘిక సమైక్యానికి మత, వర్ణాంతర వివాహాలు 547
13. పంచాయతీ రాజ్య వ్యవస్థ – గ్రామీణాభివృద్ధి 550
14. ఆంధ్రప్రదేశ్ సమైకత్యతపై
అవనిగడ్డ నియోజకవర్గ ప్రజలకు విన్నపము 556

## విషయసూచిక


శుభాకాంక్షలు 11

తెలుగు తేజానికి అక్షరనీరాజనం 12

1. తెలుగు తేజం 17
2. దేశభాషలందు తెలుగు లెస్స 22
3. తెలుగువారు : సహనం – సహజీవనం 26
4. ఆంధ్రప్రదేశ్ సహజసంపద 29
5. తెలుగుదేశ పురోభివృద్ధికి సమైక్యకృషి 33
6. తెలుగుసంస్కృతి : ప్రభుత్వప్రోత్సాహం 37
7. మన అధికారభాష – తెలుగు 46
8. వాడుకభాషగా తెలుగు–సాధకబాధకాలు 52
9. ప్రపంచ తెలుగు మహాసభలు ఎందుకు? 55
10. ప్రపంచ తెలుగు మహాసభల ప్రాధాన్యం – ప్రయోజనం 58
11. ప్రపంచ తెలుగు మహాసభలు – స్వాగతోపన్యాసం 62
12. ప్రపంచ తెలుగు మహాసభలు – పర్యావలోకనం 65
13. ప్రపంచ తెలుగు మహాసభలు – తెలుగుజాతిపై వాటి ప్రభావం 71
14. రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు – ఆవశ్యకత 77
15. అంతర్జాతీయ తెలుగు సంస్థ 80
16. తరతరాల తెలుగుజాతి 84
17. తెలుగుజాతి – సమైక్యం 87
18. విదేశాల్లో తెలుగువారు – సాంస్కృతికవికాసం 92
19. మారిషస్‌లో తెలుగువారు 97
20. బ్రిటన్‌లో తెలుగువారు 102
21. విదేశాలలో తెలుగువారు – దక్షిణాఫ్రికా 106
22. మలేషియాలో తెలుగువారు 111
23. ఉత్తర అమెరికాలో తెలుగువారు 116

# శుభాకాంక్షలు

శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారికి 60 సంవత్సరములు నిండిన శుభసందర్భమున మీరు వెలువరించిన తెలుగు తేజము చూచినాను.

శ్రీ కృష్ణారావు ప్రత్యక్షరాజకీయాలలోనున్నా, వారి హృదయము గాంధేయ నిర్మాణ కార్యక్రమములోను నిమగ్నము. అదేవారి దృష్టి, లక్ష్యము, సాధన. వారిని ఉత్సాహము తరుగని కర్మిష్ఠిగా నేను భావిస్తుంటాను. అనేక సంవత్సరాల పరిచయము తర్వాత వారంటే నాకు గౌరవము, అభిమానము పెరుగుచునే యున్నవి.

దివిసీమ ఉప్పెన సమయములో వారుచేసిన సేవలు అనన్య సాధ్యములు.

ప్రపంచ తెలుగు మహాసభల విషయమై వారుసల్పిన కృషి, చూపిన శ్రద్ధ, తిరిగిన ప్రయాణాలు నాకు జ్ఞాపకమున్నవి.

నిరాడంబరమైన సరళజీవితము వారిది. ఇతోధికముగా వారు సేవాకార్యక్రమములు సాగించుచుండవలెనని నా అభీష్టము. వారికి నా శ్రద్ధాభిమానములతో కూడిన శుభాకాంక్షలు ఈ సందర్భమున పంపగలుగుచున్నందులకు నాకు పరమసంతోషముగా నున్నది. సుఖీభవ, విజయీభవ అని మనసారా కోరుచున్నాను.

విజయదశమి — బెజవాడ గోపాలరెడ్డి

12-10-86

శాంతినికేతన్,

నెల్లూరు -3

# తెలుగు తేజానికి అక్షరనీరాజనం

ఇది విద్యాసాంస్కృతిక పరమైన వ్యాసాల సంకలనం. మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు రాష్ట్ర విద్యా సాంస్కృతిక అధికార భాషా శాఖామాత్యులుగా, ఆయా సందర్భాలను పురస్కరించుకొని పత్రికలలో ప్రచురించిన, సభలలో ప్రసంగించిన వ్యాసాలేకాక, తరువాత విదేశ పర్యటనలను పురస్కరించుకొని రెండవ ప్రపంచ తెలుగు మహాసభల ఆవశ్యకతను గూర్చి చేసిన ప్రసంగాలు, ప్రచురించిన వ్యాసాలుకూడా ఈ సంకలనంలో చోటుచేసుకొన్నాయి.

1974, 1975 సంవత్సరములలో తెలుగుజాతి గర్వించదగిన అనేక ఉత్సవాలు, మహాసభలు జరిగాయి. అంతకుముందు ఆంధ్రప్రదేశ్ గుండెను చీల్చటానికి ప్రయత్నించిన రెండు ఉద్యమాలతో ప్రజలు విసిగి వేసారిపోయారు. రాష్ట్ర అభివృద్ధి కుంటుపడింది. ప్రభుత్వ యంత్రాంగం స్తంభించే పరిస్థితి ఏర్పడింది. మంత్రివర్గం రాజీనామా చేయటంవల్ల రాష్ట్రపతి పరిపాలన విధించబడింది. అప్పుడు పరిస్థితులను సరిదిద్దగల నాయకునికోసం జరిగిన అన్వేషణ ఫలితంగా, మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు 1973 డిసెంబర్ 10వ తేదీన రాష్ట్రముఖ్యమంత్రిగా పదవీస్వీకారంచేసి, రాష్ట్రాన్ని మరల ప్రగతిపథంలో నడిపించే బాధ్యత స్వీకరించారు. మాన్యశ్రీ వెంగళరావుగారి మంత్రివర్గంలో విద్యాసాంస్కృతిక – అధికారభాషా శాఖామాత్యులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు పదవీబాధ్యతలు స్వీకరించారు.

శాతవాహనుల యుగంలో, చాళుక్యుల పరిపాలనలో, కాకతీయుల యుగంలో కుతుబ్‌షాహీల పరిపాలనలో ఏకచ్ఛత్రం క్రింద ఉన్న మండలాలు బ్రిటిష్‌వారి హయాంలో చీలిపోయాయి. ఆ మండలాలు

స్వాతంత్ర్యానంతరం 1956లో, ఆంధ్రప్రదేశ్ అవతరణలో, మరల ఒకే గొడుగు క్రిందకు వచ్చాయి. కానీ, దురదృష్టవశాత్తు, విచ్ఛిన్నకరశక్తులకు అవకాశం లభించే పరిస్థితులు కల్పితమైనాయి. ఇందుకు ప్రధానకారణం మూడుమండలాల ప్రజలలో ఏకతాభావన లేకపోవటం. ప్రజలలో ఏకతాభావన కలిగించటానికి భాష ఒక్కటే సాధనం కాలేకపోయిందనీ, సాంస్కృతిక పరమైన చైతన్యం ప్రజలలో వెల్లివిరిసిననాడు వారిలో ఏకతాభావన తప్పక కలుగుతుందని నూతన మంత్రివర్గం గుర్తించింది. అందుకు ప్రపంచ తెలుగు మహాసభలు జరపడం ఒక మంచి సాధనం కాగలదని ఆ మంత్రివర్గం తలపోసింది. 1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాది నాటి నుంచి వారంరోజులపాటు ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలన్న సూచన సూత్రప్రాయంగా అంగీకరించబడింది.

ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలంటే ఎంతో కృషి జరగవలసి వుంది. ఎందరెందరో కార్యకర్తలు, ఎంతో ఉత్సాహంతో, ఒక సంవత్సరం పాటు అయినా కృషిచేస్తేనే అవి తప్పక విజయవంతం అవుతాయి. ఇది దృష్టిలో పెట్టుకొని, ప్రయోగప్రాయంగా 1974 మార్చి 24 ఉగాదినాటి నుండి వారం రోజుల అఖిలభారత తెలుగు సాంస్కృతిక ఉత్సవాలు నిర్వహించాలని మాన్యశ్రీ మండలివారు చేసిన సూచనలు, ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగంవారు అంగీకరించారు. ఆ ఉత్సవాలు, నైజాం కళాశాలలోని విశాలమైన మైదానంలో వైభవోపేతంగా జరిగాయి. ఆ ఉత్సవం తొలిరోజుననే అధికారభాషా సంఘాన్ని ఏర్పాటుచేసినట్లు, దానికి తొలిఅధ్యక్షులుగా ఉండటానికి శ్రీవావిలాల గోపాలకృష్ణయ్యగారు అంగీకరించినట్లు ముఖ్యమంత్రి ప్రకటించారు.

ఈ సాంస్కృతికోత్సవాల నిర్వహణలో మాన్యశ్రీ మండలివారి కార్యనిర్వహణ దక్షత అందరి ప్రశంసలు అందుకొన్నది. ప్రపంచ తెలుగు మహాసభలను కూడా వైభవోపేతంగా నిర్వహించగలమన్న ధైర్యం చేకూరింది. వెంటనే, మహాసభల నిర్వహణకు ఆహ్వానసంఘం మాన్యశ్రీ జలగంవారి అధ్యక్షతలో ఏర్పడింది. మాన్యశ్రీ మండలివారు కార్యనిర్వాహక – అధ్యక్షుల, ఆయా కార్యక్రమాలు నిర్వహించటానికి సహాయులైన పెద్దల అధ్యక్షతలో అనేక ఉపసంఘాలు ఏర్పడినాయి. రవీంద్రభారతి మొదటి

అంతస్తులో ఆహ్వానసంఘం ప్రధానకార్యాలయం పనిచేయటం ప్రారంభించింది. ప్రతిరోజు ఉదయం 8 గంటల నుంచి రాత్రి సుమారు 12 గంటలవరకు కార్యాలయం తొమ్మిది నెలలపాటు నిర్విరామంగా పనిచేసింది. ఆహ్వానసంఘానికి ప్రధానకార్యదర్శిగా పనిచేసే సదవకాశం నాకు లభించింది. ఆ విధంగా మహాసభల నిర్వహణకు సంబంధించిన అన్ని విధాలయిన కార్యక్రమాలతో నాకు సాన్నిహిత్యం చేకూరింది.

అఖిలభారత సాంస్కృతికోత్సవాల తరువాత జరిగిన మరొక మహోత్సవం అఖిలభారత బాలల ఉత్సవం. ఇది 1974 దసరానుంచి నాలుగురోజులపాటు విశాలమైన కేశవ మెమోరియల్ హైస్కూలు ఆవరణలో జరిగింది. రాష్ట్రం నలుమూలలనుంచే కాక, వివిధ రాష్ట్రాలనుంచి కూడా తెలుగు బాలలు పాల్గొన్న ఆ ఉత్సవం మరపురాని ఘట్టం.

ప్రపంచ తెలుగు మహాసభల ఆహ్వానసంఘ కార్యకలాపాలు చురుకుగా సాగుతున్నవన్న సంతృప్తితో 1975వ సంవత్సరాన్ని సాంస్కృతిక సంవత్సరంగా ప్రభుత్వం ప్రకటించింది. రాజధానిలోనే కాక రాష్ట్రవ్యాప్తంగా సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభమైనాయి. మహాసభల నిర్వహణకు నిధులను సమకూర్చటానికై, మద్రాసులోని తెలుగు సినీ కళాకారుల సంఘం ముందంజవేసి, రాష్ట్రంలో పలుచోట్ల సాంస్కృతిక ప్రదర్శనలిచ్చి, నిధులు సమకూర్చటంతోపాటు మహాసభల నిర్వహణకు పూర్వరంగం సుసంపన్నం చేసింది. జంటనగరాల నడిబొడ్డులో ఉన్న లాల్‌బహదూర్ స్టేడియంలో ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించటానికి నిర్ణయమైంది.

1975 ఏప్రిల్ 12వ తేదీన తెలుగు ఉగాదినాడు ప్రారంభమైన ప్రథమ ప్రపంచ తెలుగుమహాసభలు, వారంరోజులపాటు చరిత్రలో కనీ వినీ ఎరుగనంత వైభవోపేతంగా జరిగాయి. విదేశాలనుంచి తెలుగువారి ప్రతినిధులు సుమారు వేయిమంది విచ్చేశారు. ఇంకా రాష్ట్రం నలుమూలలనుంచి వచ్చిన ప్రతినిధుల సంఖ్య వేలలో ఉంది. ప్రతిరోజు మహాసభల కార్యక్రమాలను, సుమారు మూడేసి లక్షలమంది ప్రేక్షకులు తిలకించారు. నాటి ఉపరాష్ట్రపతి మాన్యశ్రీ బి.డి. జట్టి గారు మహా సభలను ప్రారంభిస్తూ తెలుగులో ఉపన్యాసం చేశారు. చివరిరోజున నాటి రాష్ట్రపతి మాన్యశ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌గారు స్నాతకోపన్యాసం చేశారు. నాడు

రాష్ట్ర గవర్నరుగా పదవీబాధ్యతలు నిర్వహిస్తున్న జస్టిస్ ఓబుల్‌రెడ్డిగారు తెలుగువారు కావటంవల్ల మహాసభలకు మరింత నిండుతనం చేకూరింది. విదేశాల నుంచి వచ్చిన ప్రతినిధులకు రాష్ట్రపర్యటన ఏర్పాటు చేయబడింది.

సుమారు 2500 సంవత్సరాల తెలుగువారి సుదీర్ఘచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన మహోజ్జ్వలఘట్టం ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణ. ఈ మహాసభల ఫలితంగా తెలుగువారిలో ఏకతాభావన దీప్తిమంతమైంది. రాష్ట్రం ముక్కలయ్యే ప్రమాదం తప్పింది, రాష్ట్రమంతటా 'తెలుగు' నినాదం ప్రతిధ్వనించింది. ఆ నాటి ఆ 'తెలుగు' నినాదాన్ని నేటి ప్రభుత్వం సద్వినియోగం చేసుకొన్న విషయం చారిత్రక సత్యం.

మహాసభలలో తీసుకొన్న నిర్ణయం ప్రకారం ప్రభుత్వం అంతర్జాతీయ తెలుగు సంస్థను నెలకొల్పింది. ఈ సంస్థకు స్థాపకదర్శకుడుగా పనిచేసే అవకాశం కూడా నాకు లభించింది. మహాసభల సందర్భంగా ఏర్పాటయిన ఉత్తమ సాంస్కృతిక వస్తుప్రదర్శన స్ఫూర్తినీయగా, 2500 సంవత్సరాల తెలుగువారి చరిత్రను, సంస్కృతిని ప్రతిబింబించే తెలుగు సాంస్కృతిక సంగ్రహాలయం నిర్మించాలన్న నిర్ణయం తీసుకోబడింది. అంతర్జాతీయ తెలుగుసంస్థకు ప్రారంభం, తెలుగు సాంస్కృతికసంగ్రహాలయానికి శంకుస్థాపన రాష్ట్రపతి మాన్యశ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌గారే 1975 సెప్టెంబర్ నెలలో చేశారు.

మాన్యశ్రీ మండలివారి పట్టుదల వలన రాష్ట్రంలో 'బాలల అకాడమీ' కూడా ఏర్పడింది. అంతర్జాతీయ తెలుగు సంస్థ పక్షాన వివిధరాష్ట్రాలలో ఉన్న తెలుగు సంఘాల ప్రతినిధులతో రెండు సెమినార్లుకూడా నిర్వహింప బడినాయి.

శ్రీ మండలివారు మలేషియా, సింగపూర్ దేశాలను ముందుగా సందర్శించారు. తరువాత మారిషస్‌లో జరిగిన ద్వితీయ విశ్వహిందీ సమ్మేళన్‌లో పాల్గొన్నారు. ఆ తరువాత బ్రిటన్, జర్మనీ, అమెరికా, కెనడా మొదలయిన దేశాలను సందర్శించి, ఆ యా దేశాలలోని తెలుగువారితో ఆత్మీయతను పెంచుకొన్నారు.

ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల చివరి రోజున, మలేషియా నుంచి వచ్చిన ప్రతినిధులు, రెండవ ప్రపంచ తెలుగు మహాసభలను మలేషియాలో జరుపగలమని ప్రకటించారు. వారి కోరిక సూచనప్రాయంగా ఆ నాడు అంగీకరించబడింది. తరువాత 1978వ సంవత్సరంలో తెలుగు ఉగాది నుంచి ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు నాలుగురోజులపాటు మలేషియా రాజధాని కౌలా లంపూర్‌లో జరపాలన్న నిర్ణయం తీసుకోబడింది. అందుకు సన్నాహాలు జరిగాయికూడా. కాని, అవి జరుగలేదు. అసలు, ప్రపంచ తెలుగు మహాసభలే అక్కర్లేదన్న ప్రచారం జరిగింది. అధికారంలో లేకపోయినప్పటికి మరల మండలి వారే రంగంలోకి దిగవలసి వచ్చింది. వారి కృషిఫలితంగానే ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలు 1981 ఏప్రిల్ నెలలో కౌలా లంపూర్‌లో జరిగాయి.

ఇవి, శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారి ఆధ్వర్యంలో జరిగిన సాంస్కృతికోత్సవాలలో కొన్నిమాత్రమే ఆయా సందర్భాలను పురస్కరించుకొని వారు చేసిన ప్రసంగాలకు, ప్రచురించిన వ్యాసాలకు ఇది గ్రంథరూపం, చేయవలసిన కృషిని గూర్చి లోతుగా ఆలోచించటం, ఆకళించుకోవటం, కార్యకర్తలను కూడగట్టుకొని సమర్థంగా నిర్వహించటం – శ్రీ కృష్ణారావు గారిలోని ప్రత్యేకతలు. వారి రచనలలో కూడా ఈ గుణాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు సార్థకంగా అరవై సంవత్సరాలు పూర్తిచేసుకొని, 1986 ఆగస్టు 4వ తేదీన 61వ సంవత్సరంలో అడుగు పెడుతున్నారు. ఈ శుభసందర్భంలో "చంద్రునికో నూలుపోగు" అన్నట్లుగా వారి రచనలనే గ్రంథరూపంలో అందించగలిగినందుకు ఆనందంగా ఉంది, ఈ వ్యాససంకలనం సహృదయ హృదయాకర్షకం కాగలదని విశ్వసిస్తున్నాను.

4, ఆగస్టు 1986

**పోణంగి శ్రీరామ అప్పారావు**
సంపాదకుడు

# 1. తెలుగుతేజం

తెలుగువారు ఎప్పటివారు? ఎక్కడివారు? ఎటువంటివారు? ఆలోచిస్తూంటే ఒళ్లు జలదరిస్తుంది. నేను తెలుగువాణ్ణి అనుకొన్నప్పుడు ఒళ్లు పరవశిస్తుంది. నాది తెలుగుగడ్డ అనుకోగానే ఏదో దివ్యలోకంలో వున్న అనుభూతి కలుగుతుంది. అందుచేతనే కాబోలు శ్రీమదప్పయ్య దీక్షితులవారు అన్నారు, కాదు సగర్వంగా అన్నారు.

"ఆంధ్రత్వ మాంధ్ర భాషాచ నాల్పస్య తపసః ఫలమ్"

నిజమే, ఎంతో తపస్సు చేసుకొంటేనే కాని, ఈ పవిత్రభూమిలో జన్మించటం సంభవించే విషయం కాదు.

పదహారణాల పరమసత్యం!

తెలుగువారు ఎప్పటివారు; తెలుగువారు 2,500 సంవత్సరాల చరిత్ర కలవారు. ఎక్కడివారు? ఉత్తర దక్షిణ భారతాలకు నడిబొడ్డున కీలకస్థానంలో ఉన్నారు. ఎటువంటివారు? భారతదేశాన్ని ఒకప్పుడు ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలినవారు. ఇప్పుడు ఏలగల సమర్థులు. అయితే తెలుగువారి ఈ విశిష్టత ఏమిటో కొంచెం పర్యాలోచన చేద్దాం.

తెలుగువారి చరిత్ర 2,500 సంవత్సరాల నాటిది అనుకొన్నాం కదా! అంటే తెలుగుజాతి చరిత్రకు ఎక్కినది అప్పటి నుంచే అన్నమాట. అంతకు ముందు ఇంకా ఎంత చరిత్రవుందో మనకు కచ్చితంగా తెలియదు. చరిత్రకెక్కిన తొలి తెలుగు చక్రవర్తులు శాతవాహనులు. వీరిని పురాణాలలో ఆంధ్రులనీ, శాసనాలలో శాతవాహనులనీ అన్నారు. శాతవాహన సామ్రాజ్యం గూర్చి మెగస్తనీసు ఈ విధంగా అన్నాడు (మౌర్య సామ్రాజ్య చంద్రగుప్తుని ఆస్థానం సందర్శించిన గ్రీసు దేశపు రాయబారి ఈ మెగస్తనీసు). "మౌర్యచక్రవర్తులతో అన్ని విధాలా సమానమైనవారు ఆంధ్ర చక్రవర్తులు. వారికి చుట్టూ ప్రాకారాలు ఉన్న ముప్పై నగరాలు ఉన్నవి. నూరువేల పదాతి దళం, రెండువేల ఆశ్విక

దళం, వేయి గజదళం ఉంది" ఇది క్రీస్తు పూర్వం మూడు, నాలుగు శతాబ్దాలనాటి మాట; తెల్లవాళ్ళు చెబితేనే మనకు మరింత నమ్మకం కదా? మరి తెలుగు వారి ఆ నాటి విశిష్టతను గూర్చి ఇంతకంటె సాక్ష్యం అక్కరలేదనుకొంటాను.

ఇంకా, చారిత్రకంగా, సాంఘికంగా, భాషాపరంగా, ఆర్థికంగా మన విశిష్టత లేమిటో సంక్షిప్తంగా వివరించే ప్రయత్నం చేస్తాను.

శాతవాహన చక్రవర్తులను గూర్చి ఇంతకుముందే పేర్కొన్నాను. నేటి ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న తెలుగు భాగాలు అన్నీ మొట్టమొదటిసారిగా ఒకే పరిపాలన క్రిందకు వచ్చింది శాతవాహనుల కాలంలోనే. అంతేకాదు, ఆరవ శాతవాహన చక్రవర్తి అయిన శాతకర్ణి దక్షిణావని కంతటికే ప్రభువు (దక్షిణాపథపతి) కాగా, 15వ చక్రవర్తి అయిన పులోమావి మగధ సామ్రాజ్యాన్ని కూడా జయించి ఉత్తర దక్షిణ భారతాలకు చక్రవర్తి అయినాడు. శాతవాహనుల అనంతరం తెలుగు దేశం విచ్ఛిన్నమై అనేకుల పాలన క్రిందకి వచ్చింది. మళ్ళీ తెలుగు భూభాగాలన్నింటిని ఏకంచేసిన ఖ్యాతి కాకతీయ గణపతి దేవునకు లభించింది. తరువాత మళ్ళీ విచ్ఛిన్నమైంది తెలుగుదేశం. అప్పుడు గోల్కొండ నవాబులైన కుతుబ్ షాహీల పరిపాలనలో తెలుగు భూభాగాలన్నీ ఒక పరిపాలనలోకి వచ్చాయి. ఆంగ్లేయుల పరిపాలనకాలంలో మరల విడిపోయాయి. చివరకు తెలుగు భూభాగాలన్నీ అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మాహుతితో ఏకమై, ఆంధ్రప్రదేశ్ అవతరించింది. భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు కారకులైన తెలుగు వారంతా ఆంధ్రప్రదేశ్‌తో ఏకం కాగలిగినారు. నేడు ఆంధ్రప్రదేశ్‌లో తెలుగువారు సుమారు ఐదుకోట్లు ఉన్నారు. దేశంలోని వివిధరాష్ట్రాల్లో, విదేశాలలో తెలుగువారు సుమారు ఇంకో కోటి వున్నారు.

మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు సాధించిన ఘనవిజయం వల్ల ప్రపంచంలోని తెలుగువారంతా ఏకం కావడం అందరకూ తెలిసిన సత్యమే.

మన చుట్టు తమిళనాడు, కర్ణాటక, ఒరిస్సా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలు ఉన్నవి. ఇన్ని రాష్ట్రాల మధ్య ఉండి కూడా, సుమారు 600 మైళ్ళ పొడవు గల సముద్రతీరం వున్న రాష్ట్రం భారతదేశంలో ఇంకోటి లేదంటే అతిశయోక్తి కాజాలదు. ఇన్ని రాష్ట్రాలమధ్య ఉండడంచేత వారి ప్రభావం మనమీద, మన ప్రభావం వారిమీద వుండటం సహజం. తక్కిన వారిమాట ఎట్లా ఉన్నా మనం మాత్రం వారందరితో సఖ్యంగా ఉంటూ వారిమధ్యకూడా పరస్పరం సదవగాహన ఏర్పడటానికి తోడుపడుతున్నాం. ఇది తెలుగువారి సహజీవనానికి మంచి నిదర్శనం. తెలుగుదేశం దక్షిణ భారత దేశంలోనే

కాక మొత్తం భారతదేశానికి కీలకస్థానంలో వుంది. మరి తెలుగుదేశ రాజధాని హైదరాబాద్, భారతదేశానికి రెండవరాజధాని కావటం ఇందుకు తార్కాణం. ఇంకా రాజకీయనాయకత్వంలో, అఖిల భారత స్థాయిలో తెలుగువారి శక్తిసామర్థ్యాలను ప్రత్యేకంగా వివరించి చెప్పవలసిన అవసరం లేదనుకొంటాను.

తెలుగుదేశం సాంఘికంగా ఎంతో అభివృద్ధి సాధించింది. సహజీవనం విషయంలో తెలుగుదేశం భారతదేశం అంతటికీ మార్గదర్శకమైంది. విభిన్నమతాలకు, విభిన్న సంస్కృతులకు తెలుగుదేశం సంగమస్థానం. మహమ్మదీయ దండయాత్రల ప్రవాహం దక్షిణ భారత దేశం చేరుకోకుండా చెలియలి కట్టగా నిలిచిన విజయనగర సామ్రాజ్య రాజధానీ నగరంలోనే, మహమ్మదీయ సోదరుల సౌకర్యం కోసం మసీదులు వెలసినవంటే మతసహనానికి వేరే తార్కాణం ఇంకేంకావాలి? కొత్తదనంలో ఏ మాత్రం మంచి కనిపించినా స్వీకరించి సొంతం చేసుకొనే గుణం తెలుగువారికి వెన్నతో పెట్టిన సుగుణం. కావుననే బౌద్ధం, జైనం మొదలైన మతాలు ఆ నాడు తెలుగుదేశంలో ప్రాబల్యం సంపాదించుకొన్నవి. రాజు ఒక మతాన్ని అభిమానిస్తే, రాణి ఇంకో మతాన్ని అభిమానించినప్పటికీ సామరస్యంతో సంసారం చేసుకొంటూ, రెండు మతాలను సమానంగా ఆదరించి, పోషించిన ఘట్టాలు తెలుగుదేశచరిత్రలో ఎన్నో వున్నాయి.

సంఘసంస్కరణోద్యమాలు ఉత్తరభారత దేశంలో ఇంకా ఉపన్యాసాల స్థాయిలోనే వున్న సమయంలో తెలుగుదేశంలో కందుకూరి ప్రభృతులు ఆచరణలో పెట్టారు. గాంధీ మహాత్ముడు హరిజనోద్ధరణోద్యమాన్ని చేపట్టడానికి చాలా ముందే అంటే 1909లోనే చిలకమర్తివారు రాజమహేంద్రవరంలో హరిజనుల కోసం పాఠశాలను నెలకొల్పినారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో తెలుగువారు చేసిన త్యాగాలు దేశంలో మరెవరి త్యాగాలకు తీసిపోవు. ఆంధ్రకేసరులకు, ఆంధ్రరత్నలకు, దేశభక్తులకు, విశ్వదాతలకు, అమరజీవులకు, ఆంధ్ర పితామహులకు పుట్టినిల్లు తెలుగుదేశం. దేశశ్రేయస్సు కోసం తుపాకిగుండుకు రొమ్మువిదురొడ్డిన ఆంధ్రకేసరి, ప్రాణాలనే త్యాగంచేసిన అల్లూరి సీతారామరాజు, ఆత్మాహుతి చేసుకొన్న అమరజీవి పొట్టి శ్రీరాములు, ప్రభృతులు తెలుగుమాత ముద్దుబిడ్డలు. భాషాప్రయుక్త రాష్ట్రాల ఉద్యమనాయకులు తెలుగువారే అన్న విషయం ఇంతకు ముందే పేర్కొన్నాను. త్రికరణశుద్ధిగా పనిచేస్తున్న సంఘ సేవకులకు, సంఘసేవికలకు తెలుగుదేశంలో ఏ నాడూ లోటులేదు. అంతర్జాతీయ ఖ్యాతివహించిన దుర్గాబాయమ్మ పేరు ఈ సందర్భంలో తప్పక చెప్పుకోవాలి. స్త్రీల విద్యావిషయంలో కూడా తెలుగుదేశం చాలా ముందంజ వేసిందని చెప్పక తప్పదు.

భాషాపరంగా చెప్పవలసింది చాలా వుంది. ఒకప్పుడు భారతదేశంలో వ్యవహార భాషగావుండి నేటికీ సంస్కృతిభాషగా నిలిచివున్న సంస్కృతభాషకు తెలుగువారు ఎంతో సేవచేశారు. ఎందరో తెలుగురాజులు సంస్కృతభాషలో కావ్యాలు, లక్షణగ్రంథాలు వ్రాశారు. విద్యానాథుని ప్రతాపరుద్రీయం, మల్లినాథసూరి కావ్యవ్యాఖ్యానాలు, అన్నంభట్టు తర్కశాస్త్రం నేటికీ భారతదేశమంతటా పఠన–పాఠన వ్యవహారంలో వున్నాయి. ఢిల్లీ పాదుషాకు గౌరవపాత్రుడైన జగన్నాథపండితరాయలు తెలుగువాడు. నిర్దుష్టమైన ఉచ్చారణతో వేదపఠనం నేటికీ ఒక్క తెలుగుదేశంలోనే వినిపిస్తుంది. వేదాలకు వ్యాఖ్యలు వెలయించిన సాయణాచార్యుడు తెలుగువాడు. తెలుగువాడైన వల్లభాచార్యులవారు ఉత్తర భారతంలో ఆచార్యపీఠం వహించారు. ఇంక తెలుగుభాష విషయం చూద్దాం. తెలుగులో వెయ్యిసంవత్సరాల ప్రౌఢసాహిత్యం వుంది. ఉత్తర భారత దేశ భాషలలో సాహిత్యలతలు ఇంకా మొగ్గతొడగకముందే తెలుగు సాహిత్యం పుష్పఫలభరితమైంది. "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్"గా పేరుపొందిన మధుర భాష తెలుగు. ఏ భాషాపదాన్ని అయినా, స్వీకరించి, సొంతం చేసుకోగల శక్తి తెలుగుభాషకు వున్నంతగా మరి ఏ భాషకూ లేదు. అంతేకాదు, వ్రాసినట్లుగా పలకడానికి, పలికినట్లుగా వ్రాయడానికి అనువైన భాష తెలుగు. ఏ భాషకైనా తెలుగు సన్నిహితం కాగలదు. అందుచేతనే భారతదేశంలో సంధానభాషగా రూపొందించ డానికి అర్హత ఒక్క తెలుగుభాషకే వున్నదని ప్రొఫెసర్ కె.బి.ఎస్. హాల్డెన్ అన్నాడు.

ఇప్పుడు తెలుగులో లేని సాహిత్యప్రక్రియ లేదు. తెలుగులో వ్యక్తం చేయలేని భావం అంటూలేదు. విశ్వవిద్యాయల విద్యామాధ్యమం కాగల స్వీయశక్తిని తెలుగుభాష ఇటీవల నిరూపించుకొన్నది. ఈ విషయంలో చాలా భారతీయభాషలు ఇంకా వెనుకబడి వున్న విషయం అందరకూ తెలిసిందే.

ఇంక కళల విషయంలో ప్రపంచంలోని ఏదేశానికీ తెలుగుదేశం తీసిపోదు. కర్ణాటక సంగీతం నేర్చినవారు ఏభాషవారైనా, ఏ ప్రాంతంవారైనా–కృతకృత్యులు కావాలంటే ఈ నాటికీ త్యాగరాజస్వామివారి తెలుగు కృతులను సాధనచేయక తప్పదు. చిరకాలంగా వస్తున్న భరతమహర్షి నాట్యసంప్రదాయాన్ని యథాతథంగా కాపాడుకొంటూ వస్తున్న కూచిపూడి సంప్రదాయం మనకందరకూ ఆనందదాయకమైంది. అంతేకాదు, అభినయ దర్పణకర్త శంకేశ్వరుడు తెలుగువాడు. అది మరికొన్ని నృత్య, నాట్యసంప్రదాయాలకు మార్గదర్శకమైనదన్న సత్యం మనకు గర్వకారణంకూడా. జగత్ప్రసిద్ధి పొందిన అజంతా గుహలలో, కనీసం నాలుగు అయినా, తెలుగు శిల్పుల హస్తకౌశలానికి నిదర్శనాలని విజ్ఞులందరూ అంగీకరించిన విషయమే.

ఇంక ఆర్థికరంగానికి వద్దాము. బహుశః తెలుగుదేశంలో ఉన్నన్ని వనరులు ఇక ఏ రాష్ట్రంలోనూ లేవేమో? దేశాన్ని సస్యశ్యామలం చేయగలిగిన ఎన్నో జీవనదులకు తెలుగుదేశం ఆలవాలం. ఇక భూమి అనేక విధాలుగా వుంది. ప్రతిచోటా ఏదో ఒక పంట పుష్కలంగా పండుతుంది. తెలుగుదేశం భారతదేశ ధాన్యాగారంగా పేరొందింది. నిజానికి తెలుగుదేశం భారతదేశానికి "అన్నపూర్ణ". ఇంతకుముందే పేర్కొన్నట్టుగా తెలుగుదేశానికి 600 మైళ్లు పొడవు గల సముద్రతీరం వుంది. ప్రపంచంలో "సహజమైన హార్బర్లు" చాలా అరుదు అంటారు. మరి అటువంటిది తెలుగుదేశంలో విశాఖపట్టణంలో ఉంది. దీన్ని పురస్కరించుకొని ఎన్నో భారీ పరిశ్రమలు నెలకొన్నాయి, ఇంకా నెలకొంటున్నాయి. మనకున్న అటవీసంపద కూడా చాలా అమూల్యమైనది.

అంతేకాదు, మనకున్న ఖనిజసందదకు విలువకట్టే షరాబులు ప్రపంచంలోనే లేరు అనడం అతిశయోక్తికాదు, బొగ్గు, ఇనుము, మాంగనీస్, బరైటిజ్, రాగి, సీసం, గ్రానైట్, మైకా, బాక్సైట్ వంటి ఖనిజాలు తెలుగుదేశంలో ఏదో ఒకచోట వున్నాయి. అంతేకాదు, పుష్కలంగా ఉన్నాయి. ఇంక విస్తృతంగా దొరికే సున్నపురాయివంటి వాటిని గూర్చి ప్రత్యేకంగా పేర్కొనవలసిన అవసరం లేదు. పెట్రోలు, నాచురల్ గ్యాస్ బాగాదొరికే అవకాశాలు ఇటీవల ఎక్కువగా కనిపిస్తున్నవి.

విద్యారంగంలోకూడా తెలుగుదేశం ఇటీవల చాలా ప్రగతి సాధించింది. ముఖ్యంగా వెనుకబడిన జాతులవారి విషయంలో మన ప్రభుత్వం చాలా కృషి చేస్తున్నది. సమసమాజస్థాపనే మన లక్ష్యం.

ఏ విధంగా చూసినా మన ఆంధ్రప్రదేశ్ ఆ నాడూ ఈ నాడు కూడా ఉత్తర-దక్షిణ - భారతాలమధ్య కీలకస్థానంలో ఉంది. ఉన్న వనరులను, వచ్చే అవకాశాలను సద్వినియోగం చేసుకోగలిగితే మనం ఇంకా ఎంతో అభివృద్ధి సాధించి, భారతదేశానికి మార్గదర్శకులమే కాక, గర్వకారణంకూడా కాగలము.

*(1979)*

# 2. దేశభాషలందు తెలుగు లెస్స

మానవజాతి తన మనోభావాలను, ఆలోచనలను, అవగాహనలను ఎదుటివారికి వ్యక్తపరచుకోవడానికి భాష ఒక వాహికగా ఏర్పడింది. ప్రతి జాతికి తమదంటూ ఒక భాష ఉంటుంది.

భారతదేశంలో ప్రధానంగా రెండు భాషాకుటుంబాలు కన్పిస్తాయి. ఒకటి ఆర్యభాషా కుటుంబం, రెండు ద్రావిడభాషా కుటుంబం. తెలుగు భాష ఆర్య భాషాకుటుంబానికి చెందినదని, ద్రావిడభాషా కుటుంబానికి సంబంధించినదే అనీ రెండువాదాలున్నాయి. కాని ఇటీవలి కాలంలోని పరిశోధనలవల్ల తెలుగుభాష ద్రావిడ భాషాకుటుంబానికి చెందినదనే అభిప్రాయమే బలపడింది.

భారతదేశంలో హిందీ మాట్లాడేవారి తరువాత తెలుగు మాట్లాడే ప్రజల సంఖ్యే ఎక్కువగా వుంది. అంటే భారతదేశంలోని భాషల్లో తెలుగు భాషకు రెండవ స్థానం ఉందని చెప్పవచ్చు.

"దేశభాషలందు తెలుగు లెస్స" అని ఇటు ప్రాచ్యులచేత, "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని అటు పాశ్చాత్యులచేత సమాదరింపబడిన తెలుగు భాష ప్రపంచభాషలలోని ఉన్నతభాషల సరసన చేర్చదగినది. ప్రతి భాషకు తనదంటూ ఒక ప్రత్యేకత ఉంటుంది. అదే విధంగా మన తెలుగు భాష ఒక విలక్షణమైన, విశిష్టమైన ఒరవడిని కలిగివుంది. అయితే తెలుగు భాషకు ఆంధ్ర, తెనుగు అనే పర్యాయపదాలుకూడా వాడుకలోవున్నాయి. ఆంధ్ర, తెలుగు. తెనుగు అన్నవి నేడు జాతిపరంగా, దేశపరంగా, భాషాపరంగా వాడబడుతున్నాయి.

ఆదికావ్యావతరణకు ముందు ఆంధ్ర అనే పేరుతో ఉన్న ఈ పదానికి తరువాతి కాలంలో తెలుగు, తెనుగు అనే పర్యాయపదాలు విరివిగా కనిపిస్తూ, క్రమేణా అవి ప్రాచుర్యంలోకి వచ్చాయి. తెలుగు అనే పదం ఏర్పడడానికి, ఈ దేశం ఓంకార రూపంగా త్రిలింగాలతోగూడి ఉన్నందున, ఇది త్రిలింగదేశమనీ, క్రమేణా ఇది తెలుగుదేశంగా రూపాంతరం చెందిందనీ, పూర్వం తెలాంగులు అనే జాతివారు ఈ ప్రదేశాన్ని

పరిపాలించినందున దీనికి తెలుగుదేశమనే పేరు ఏర్పడిందనీ భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడుతున్నారు. ఇక తెనుగు అనే మాట – తేనె అగు తెనుగు అని, అంటే ఈ భాష తేనెలాంటి తియ్యదనాన్ని కలిగివుంది కాబట్టి తెనుగు అనబడిందనీ కొందరు అభిప్రాయపడ్డారు. ఏది ఎలా ఉన్నప్పటికి మన తెలుగుభాష అజంత భాష కావడం వల్ల అది మధురంగా, కర్ణపేయంగా వుంటుందన్న విషయం అందరూ ఒప్పుకోవలసిందే.

అయితే తెలుగుభాష ఇంతటి ఉత్కృష్టదశకు చేరుకోవడానికి, దీని వెనుక ఎందరో మహనీయుల కృషి ఉంది. తెలుగుదేశం అనేక వంశాల రాజుల ఏలుబడిలో అభివృద్ధిచెంది తేజరిల్లింది. తెలుగుదేశాన్ని మొట్టమొదట శాతవాహనులు పరిపాలించారు. తరువాత ఇక్ష్వాకులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, ఆనందగోత్రికులు, బృహత్ఫలాయనులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు, నాయకరాజులు, బహమనీ సుల్తానులు, గోలకొండ నవాబులు, నిజాంప్రభువులు, బ్రిటిషువారు వరుసగా పరిపాలించారు.

11వ శతాబ్దిలో చాళుక్యరాజైన రాజరాజనరేంద్రుని ఆస్థానంలో వున్న నన్నయ్యభట్టారకుడు, తెలుగుకు మొట్టమొదట కావ్యత్వగౌరవాన్ని ఆపాదించిన ఆదికవి. అప్పటి ఒక మహాకావ్యానికి కావలసినంత పదజాలం, భాషాసామగ్రిలేని దశలో ఈ తెలుగుభాషను చేపట్టి, దానికొక సమగ్రతను, సామగ్రిని ఏర్పరచి, ఆ భాషలో ఒక మహాకావ్య నిర్మాణాన్ని కొనసాగించాడు నన్నయ. అంతకుముందు సంస్కృతం, ప్రాకృతం చలామణిలో ఉన్నదశలో తెలుగులో ఒక కావ్యం కూడా వెలువడలేదు. ఎడనెడ శాసనపద్యాలు మాత్రం మినుకుమినుకుమంటూ ఉండేవి. భారతావతరణ నాటికి తెలుగుభాష ఒక గొప్పతేజాన్ని, స్వయంప్రకాశాన్ని పుణికిపుచ్చుకుంది.

తెలుగుభాష శక్తిమంతమై సాహిత్యాన్ని పుష్టిమంతం చేయసాగింది. తెలుగుభాషలో ఎక్కువగా సంస్కృత పదజాలం కలిసివుండడం వల్ల ఇది సంస్కృతవాఙ్మయగతిలో వలెనే అదేరీతిలో తన నడకను సాగించింది. తిక్కన, ఎఱ్ఱన, పోతన వంటి వారల చేతిలో, శ్రీనాథుని సీసాలతో తెలుగుభాషాసాహిత్యం పలు సొగసులు తీరింది. సొబగులు వెలార్చింది.

ఆంధ్ర వాఙ్మయంలో స్వర్ణయుగంగా పేర్కొనదగిన కృష్ణదేవరాయల కాలంలో తెలుగు సాహిత్య దీప్తిచ్ఛటలు దిగ్దిగంతాల వ్యాపించినవి. రాయల కొలువులో అష్టదిగ్గజకవులు, తెలుగు సాహిత్యంలో ప్రబంధప్రక్రియను పరిపుష్టం చేశారు. కర్ణాటక

చక్రవర్తి, స్వయంగా కన్నడిగుడైన కృష్ణదేవరాయలు "దేశభాషలందు తెలుగు లెస్స" అని చాటడమే కాకుండా తెలుగులో "ఆముక్తమాల్యద" అనే ప్రౌఢకావ్యాన్ని విరచించాడు. అటుతరువాత తంజావూరు, మధురై, పుదుక్కోట, చెంజి మొదలైన ప్రాంతాలను పరిపాలించిన నాయకరాజుల కాలంలో తెలుగు సాహిత్యం అనేకవిధాలుగా పరిఢవిల్లింది. దాదాపుగా యీదశలోనే తెలుగుపద కవితలు వెలువడి క్షేత్రయ్య, అన్నమాచార్యులు, త్యాగయ్య, రామదాసు వంటి వాగ్గేయకారుల వలన తెలుగు భాషాసాహిత్యం శ్రావ్యతతోబాటు సంగీతసురభిళాన్ని సంతరించుకుంది.

భాష ఒక జీవనది వంటిది. అది నిరంతరం పారుతూ, మార్పులకు లోనవుతూ కొత్తరూపాన్ని పొందుతూ ఉంటుంది.

17వ శతాబ్దిలో ఈస్టిండియా కంపెనీవారి రాకతో తెలుగుభాషపైన, సాహిత్యంపైన పాశ్చాత్యభాషా ప్రభావం ప్రసరించింది. తత్ఫలితంగా ఆధునికయుగంలో భాషా స్వరూపంలో బహిరంగంగా ఎన్నో మార్పులు వచ్చాయి. కందుకూరి వంటి సంస్కరణ వాదులు, గురజాడవంటి నూతన కవితాప్రక్రియానిర్మాతలు, గిడుగువంటి భాషోద్యమకారులు తెలుగుభాషను, తెలుగుసాహిత్యాన్ని కొత్తదారికి మళ్ళించారు. దాని ఫలితంగానే ఈనాడు సాహిత్యంలో వ్యావహారికభాష చోటుచేసుకుంది.

2,500 సంవత్సరాల చరిత్ర కలిగిన తెలుగుజాతి, ఉత్తమమైన, ఉన్నతమైన సాహిత్యాన్ని నిర్మించిన తెలుగుభాష, సహజసంపదలకు కాణాచియైన తెలుగుదేశం నిజంగా ప్రపంచదేశ భాషాసాహిత్యాలలోకెల్లా ఉన్నతమైనదని చెప్పడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు; అందుకే అప్పయ్య దీక్షితులవంటి మహానుభావుడు "ఆంధ్రుడగుటయు, ఆంధ్రభాష చదువుటయు, బహుపూర్వజన్మల తపస్సు యొక్క ఫలము" అన్నారు.

తెలుగువారు చిరకాలం నుంచి వృత్తివ్యాపారాలరీత్యా, విజ్ఞానవ్యాప్తి సామ్రాజ్యాల స్థాపనల నిమిత్తంగా మనదేశంలోని యితరప్రాంతాలకేగాక విదేశాలకు సైతం తరలివెళ్ళారు. ఈ ప్రాంతాల్లో, దేశాలలో తెలుగుకు అక్కడి భాషలతో ఏర్పడిన సంపర్కం మూలంగా ఎన్నో కొత్తపదాలు, పలుకుబళ్ళు చేర్చుకున్నారు. వీటన్నిటిని సమగ్రంగా సేకరించి, ఆమోదించడం జరగలేదు. ఇంతటి మహోన్నతమైన చరిత్ర కలిగిన మన భాషాసాహిత్యాలను, సంస్కృతీసంప్రదాయాలను మరింత పటిష్ఠం చేసుకునేందుకు, వాటిని సదా పరిరక్షించుకునేందుకు, ప్రతి తెలుగువారు నిరంతరం శ్రమించవలసిన అవసరం ఎంతైనా వుంది.

అమూల్యమైన పెన్నిధులుగా తమకు సంక్రమించిన ఈ తెలుగుభాషను, తెలుగుసంస్కృతిని, తెలుగుదనాన్ని నిలుపుకొని, మెరుగుపరచి రానున్న కాలంలో ఉజ్జ్వల విజయాలు సాధించటానికి ఈ గొప్పతనం నాది అన్న స్ఫూర్తికావాలి. సగర్వంగా దీన్ని సంస్మరించుకుని శాయశక్తుల కృషి చేసే దీక్ష కావాలి. దేశవిదేశాలలో వున్న వివిధ తెలుగు మాండలికాలనుంచి మాతృరాష్ట్రంలోని భాషాసాహిత్యాలు, మాతృరాష్ట్రంలోని భాషా సాహిత్యాలద్వారా అక్కడి మాండలికాలు అభివృద్ధి పొందవలసి వున్నది.

ప్రపంచ తెలుగు మహాసభల ద్వారా, ప్రాదేశిక తెలుగుమహాసభల ద్వారా ఇటువంటి కృషి ఆరంభమై పరిపుష్టి పొందగలదని ఆశించవచ్చు.

# 3. తెలుగువారు : సహనం - సహజీవనం

కాశ్మీరం నుంచి కన్యాకుమారిదాకా ఉన్న భారతదేశం మొత్తం ఒక పూల తోట. రంగురంగుల పూలు, పెద్దవీ, చిన్నవీ, రకరకాల తావులు విరజిమ్మేవి ఈ తోటలకు శోభనిస్తున్నాయి. మొత్తం దృశ్యంలోనూ, సౌరభంలోనూ, వ్యవస్థలోనూ కలిసిమెలిసి ఉండి పరిపూర్ణతను ఇస్తున్న అన్నిజాతులలోను ఏ జాతికి ఆ జాతికి ప్రత్యేకత ఉంది, అట్లా ఉన్న విశిష్టత, వైవిధ్యం సమగ్రతకు దోహదం చేసేవే కాని భంగం కలిగించేవి కాదు. అందుచేత ఏదో ఒక రకం పూలను గూర్చి, వాటి తావిని గూర్చి, వాటి రామణీయకతను గూర్చి ప్రశంసాపూర్వకంగా చెప్పుకోవటం తప్పుకాదు.

అనాదికాలం నుంచి తెలుగువారికి భారతేతిహాసంలో ఒక ప్రత్యేకత ఉంది. భౌగోళికంగా ఉత్తర దక్షిణాపథాలకు మధ్యస్థంగా ఉన్నందున, తెలుగువారిలో ఆ రెండు ప్రాంతాల సంస్కృతులు, నాగరికతలు చక్కగా మేళనం పొందినాయి. ఉభయదృక్పథాల పట్ల సానుభూతి, సదవగాహనగల తెలుగువారు, ఆ విధంగా దేశసమైక్యంలో ప్రధానపాత్ర వహించగలిగారు.

తెలుగువారి విశిష్టతను గురించి చెప్పుకొనేటప్పుడు మొట్టమొదటగా చెప్పుకోవలసిన విశేషం, వాళ్ళ స్వేచ్ఛాప్రయత్నం. తమ స్వేచ్ఛకు మరొకరు అడ్డుతగిలితే సహించలేనివాళ్ళు కనకనే ఇతరుల స్వేచ్ఛకూ వారు అడ్డురారు. ఆ కారణంగా ఎటువంటి వాతావరణంలోనైనా, పరిసరాలలోనైనా తెలుగువాళ్ళు ఇమిడిపోగలరు. తెలుగువాళ్ళు ఏ ఇతరరాష్ట్రంలోగాని, ఏ ఇతరదేశంలోగాని నివసించవలసి వచ్చినా, అక్కడి పరిస్థితులలో ప్రతికూలత అన్నది లేకుండా చక్కని సహజీవనం సాగిస్తూ ఉండటం ఈనాడు మనం గమనించవచ్చు. ఇది అనాదినుంచీ వస్తున్నదే. గోదావరి తీరవాసులయిన తెలుగువారు సముద్రాలు దాటి విదేశాలకు – ముఖ్యంగా ఆగ్నేయ ఆసియా దేశాలకు వెళ్ళి రాజ్యాలు స్థాపించారు. ఈ దేశం నుంచి తీసుకొని వెళ్ళిన ఆధ్యాత్మిక, శిల్పాదిశాస్త్ర విజ్ఞానం అక్కడ పంచిపెట్టారు. స్థానిక జీవనవిధానంలో ఎంతో పరిణతి తెచ్చారు. చివరకు ఆ ప్రజలతో మమేకంగా కలిసిపోయినారు. తెలుగువారి వల్ల, రాజ్యాల స్థాపనవల్ల స్థానికులకు ప్రయోజనం చేకూరిందే గాని కించిత్తు కూడా నష్టం వాటిల్లలేదు. అట్లాగే విజయనగర

సామ్రాజ్యం తరువాత మదురై, తంజావూరు మొదలయిన దక్షిణ ప్రాంతాలకు తరలివెళ్ళిన తెలుగువారు గాని, నూరు, నూటయాభై సంవత్సరాల వెనక మారిషస్, దక్షిణ ఆఫ్రికా, మలేసియా మొదలయిన దేశాలకు వెళ్ళి అక్కడి జీవితంలో భాగస్వాములై స్థిరపడిపోయిన తెలుగువారుగాని, ఆయా దేశ-రాష్ట్రాల జీవితంలో పడుగు పేకలుగా అల్లుకొని పోయినవారే. వారు నడిపింది, నడిపేది కేవలం శాంతియుత సహజీవనం మాత్రమే కాదు, ప్రయోజనాత్మకమైన సహజీవనం.

తెలుగువారిలో కనబడే మరొక చారిత్రకలక్షణం దృఢస్వభావం. ఇందులో ఎన్నో గుణాలు కలిసి ఉన్నాయి. ఏ పనిగానీ అరకొరలుగా చేయక పోవటం, తాము అనుభవించినా, మరొకరికి పెట్టినా అరమరికలు లేకపోవటం, సాహసం, కష్టసహిష్ణుత ఇవన్నీ కలిసి ఏర్పడినదే ఆ స్వభావదార్ఢ్యం. ఏవో చిన్న చిన్న లోపాలు ఉండవని కాదు. తెలుగువారికి రామాయణం మీదకంటే భారతం మీదనే మక్కువ ఎక్కువ అన్నమాట అందరికీ తెలిసిందే. తెలుగుదనం మూర్తీభవించిన తిక్కన మహాకవి, భారతపాత్రల నన్నిటినీ తెలుగు జనంగానే తీర్చిదిద్దినట్లు విమర్శకులు చెబుతూ ఉంటారు. కనుక ఒక విధంగా భారతపాత్రలను చూస్తే తెలుగువారి విశిష్టత అర్థం అవుతుంది. ఆవేశం ఉంది; ఆలోచనా ఉంది; పరాక్రమం ఉంది; మంచితనానికి ఎంతగా ప్రాణమిస్తారో కల్లాకపటాలను అంతగా ఏవగించుకుంటారు.

తెలుగువారిలో ఆచారమౌర్ఖ్యం లేదు. మంచిది ఏదివచ్చినా, కొత్తదైనా పాతదైనా ఆదరిస్తారు. వేదమతాన్ని ఆదరించినట్లే, జైన బౌద్ధధర్మాలను ఆదరించారు. ప్రాచీన రాజకుటుంబాలలో రాజు వైదికధర్మాన్ని ఆదరిస్తే, రాణి బౌద్ధారామాలను సేవించిన సందర్భాలు ఎన్నో! శైవ, వైష్ణవ సంప్రదాయాలను సమానంగా తెలుగు దేశం ఆదరించింది. హరిహరాద్వైతాన్ని ప్రబోధించింది. మన సహనానికి మారు పేరు తెలుగు సంస్కృతి. మతాతీతమైన లౌకికసంప్రదాయాన్నే తెలుగు రాజరికాలు ఆదినుంచీ అనుసరించాయి. శ్రీకృష్ణదేవరాయల పాలనలో సైన్యంలో ఉన్న మహమ్మదీయుల కోసం మసీదుల నిర్మాణం జరిగింది.

విద్యలు, విజ్ఞానం మాట వచ్చినా తెలుగువారిది వీరసంప్రదాయమే. ఆచార్య నాగార్జునులు, విద్యారణ్యస్వాములు యావద్భారతానికే విజ్ఞానభిక్ష పెట్టిన మహనీయులు. భారతసంస్కృతికే మూలాధారమైన సంస్కృతభాషకు తెలుగు వారు చేసిన సేవ అపారం. కత్తిపట్టి కదనరంగంలోదూకి పాటలీపుత్రం దాకా తెలుగు బావుటా ప్రభలు వ్యాపింప జేస్తే శిల్ప, చిత్రకళలలో, వేదవేదాంగవిజ్ఞానంలో తెలుగు కీర్తిని దేశాంతరాల దాకా

పాకించారు. అమరావతి, నాగార్జున కొండ విద్యాకేంద్రాలు విదేశీయులను సైతం ఆకర్షించాయి.

తెలుగువారి రాజనీతి కూడా అపారమైనది. ఆత్మగౌరవం కోసం, పట్టుదలల కోసం రాజ్యస్థాపనచేసి చిన్నచిన్న రాజ్యాలను ఎంతగట్టిగా పరిపాలించారో, అంత సులువుగాను, దేశశ్రేయస్సు దృష్ట్యా ఒకే ఒక్క సార్వభౌమాధికారాన్ని ఆమోదించి కలిసి పోగలిగారు. "ధర్మాన్ని మనం రక్షిస్తే, ధర్మం మనలను రక్షిస్తుంది" అనే సిద్ధాంతమే తెలుగు రాజ్యాలను, సామ్రాజ్యాలను నడిపిన మూలమంత్రం. సాహిత్యాన్ని, భాషను లలితకళలను పోషించటమే రాజ్యాన్ని పాలించటంకన్నా గొప్ప విషయం అనే సూత్రాన్ని వారు దృఢంగా అనుసరించారు.

తెలుగు జనసామాన్యానికి పాపభీతి, దైవభక్తి ఎక్కువ. అనురక్తి ఎంత ఎక్కువో విరక్తి అంత ఎక్కువే. ఎంతటి ఆవేశపరులో అంతటి అల్పసంతోషులు. తెలుగువారి మనస్సులో వికాసమూ ఎక్కువే. వైశాల్యం ఎక్కువే. ఇతరులలో దోషం కొంచెం కన్పించినా ఎట్లా తెగనాడగలడో, తనలో దోషం ఉన్నా అట్లా ఒప్పుకోగలడు తెలుగు మనస్వి.

తెలుగుతల్లి తన బిడ్డలకు ఎంతో అమూల్యమైన సిరిసంపదలు ప్రసాదించింది. పుష్కలమైన జలం, జవసత్త్వాలున్న సారవంతమైన భూములు ఇచ్చింది. తెలుగువాడు కష్టించి పనిచేయటం నేర్చినవాడు, జన్మతః కృషీవలుడు, ధీరోదాత్తత, ధీరలాలిత్యం కలిసి రంగరించిన మూర్తి. సౌమనస్యం, సౌజన్యం ఉన్నవాడు. అనుభవించటం నేర్చినా ఆతిథ్యధర్మం మరవనివాడు. తెలుగువాడి చేయి భారీ చేయి. తెలుగువాడి అంతరంగం అమృతం. ఆ తీరు ఒక్కొక్కప్పుడు వేడిగా, వాడిగా ఉన్నదనిపించినా మనసు మాత్రం సుతిమెత్తనిది.

తెలుగు సంస్కృతి చరిత్ర 25 వందల సంవత్సరాలది. ఇందులో నొచ్చుకోదగిన ఘట్టాలు మృగ్యాలు. మెచ్చుకోవలసినవి, తల ఎత్తుకొని 'ఇది నా తెలుగుతనం' అని సగర్వంగా చెప్పుకోవలసినవి అసంఖ్యాకమైనవి.

తెలుగువాడుగా పుట్టటం, తెలుగు మాట్లాడటం మనకు సిద్ధించిన అపురూప వరాలు. ఆ భావంతో తెలుగుతల్లి సేవకు మనం అంకితం కావాలని, 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' అని పాడుకుంటూ, ఆ పాడుకొనే వేళ మనమంతా ఒక్కొక్కరూ ఆ దండలోని మల్లెపువ్వులు కావాలని ఆకాంక్షిస్తూ, ప్రతి తెలుగు ఉగాదికీ పండుగలు చేసుకొందాం.

*(1976)*

# 4. ఆంధ్రప్రదేశ్ సహజసంపద

ఏ దేశప్రగతి అయినా ఆ దేశ సహజసంపదల పైన ఆధారపడి ఉంటుంది. భారతదేశంలో సహజసంపదల ఆలవాలమైన ప్రథమ రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. నదీజలాలు, అడవులు, ఖనిజాలు, సుదీర్ఘమైన సముద్రతీరము కలిగివుండటంచేత ఆంధ్రప్రదేశ్ సమగ్రాభివృద్ధికి ఎంతైనా అవకాశాలున్నాయి. ప్రకృతిసహజంగా లభించే సహజవనరులే దేశపురోభివృద్ధికి కాణాచి.

ప్రాకృతికమై భూసంపద, జనసంపద, ఆటవీసంపద, ఖనిజసంపద ఉండటం వలన 1956 సం॥లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత సత్వర అభివృద్ధికి అవకాశాలు కలిగాయి- వ్యవసాయం, పరిశ్రమలు అభివృద్ధి పొందగలిగాయి.

ఆంధ్రప్రదేశ్ భారతదేశ విస్తీర్ణంలోనూ, జనాభాలోనూ ఐదవ స్థానం ఆక్రమించి ఉంది. మొత్తంమీద సహజసంపదల విషయంలో ప్రథమస్థానాన్ని పొందుతుంది. భౌగోళికంగా పడమట పీఠభూమి, తూర్పు కనుమలు, తీరప్రాంతం అని మూడు సహజమండలాలుగా ఆంధ్రప్రదేశ్‌ను విభజించవచ్చును.

పైమూడు సహజ మండలాల్లో లభ్యమౌతున్న ప్రకృతిసంపద, ఆ మండలాల ప్రత్యేకలక్షణాలను బట్టి మారుతూవుంటుంది. అక్కడ ప్రజల జీవనసరళి, పంటలతీరు ఆయా మండలాల శీతోష్ణస్థితులపై ప్రధానంగా అధారపడి ఉంటున్నాయి.

**నదీజలాలు**

ఆంధ్రప్రదేశ్ నదులకు పుట్టినిల్లు, రాష్ట్రంలో ప్రవహించి బంగాళాఖాతంలో కలిసే జీవనదులు కృష్ణా గోదావరీ నదులతో సహా అన్ని నదులనుంచి రాష్ట్రానికి వాడదగిన నీటిలో ఎనభైనాలుగు శాతం నీరు లభిస్తుంది. నాగావళి, వంశధార, పెన్న నదులు, తుంగభద్ర, మంజీర, ప్రాణహిత, మూసి, పాలేరు, మునేరు మొదలైన అనేక ఉపనదులు ఇంకా అనేక వాగులు ఉన్నవి. దాదాపు ఎనిమిదికోట్ల క్యూసెక్కుల నీరు ప్రవహిస్తూ ఉంది.

నాగార్జునసాగర్, పోచంపాడు, తుంగభద్ర, నిజాంసాగరు, సోమశిల, వంశధార, శ్రీశైలం ప్రాజెక్టులు ఉన్నాయి. అనేక మధ్యతరహా, చిన్నతరహా ప్రాజెక్టులు ఉన్నాయి. మరికొన్ని నిర్మాణంలో ఉన్నవి. నలభైఅయిదు లక్షల హెక్టార్లభూమి సేద్యం అవుతున్నది. భూగర్భజలాలను వినియోగించి లక్షలాది ఎకరాలు సాగుచేస్తున్నారు. గోదావరి డెల్టాభూమి వలన తీరమైదానంలో మంచిపంటలు పండిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ భారతదేశ ధాన్యాగారము అనే పేరు అర్థవంతమవుతోంది. ఆయకట్టు అభివృద్ధికి, సాంద్ర వ్యవసాయానికి రైతాంగానికి తోడ్పడడానికి అనేక పథకాలు రూపొందించి అమలు జరుపుతున్నారు. ఆంధ్ర రైతులు అనేక రాష్ట్రాలకు వెళ్ళి ఆదర్శమైన వ్యవసాయ క్షేత్రాలను నిర్వహిస్తున్నారు. నదీజలాలను పూర్తిగా సద్వినియోగపరచడానికి పథకాలు రూపొందుతున్నాయి. గోదావరి, కృష్ణా, పెన్న, నదులను కలిపే ప్రయత్నాలు సఫలీకృతం అయితే, మెట్ట ప్రాంతాలకు కూడా నీటి సమస్య తీరుతుంది. మద్రాసుకు కూడా మనం నీరందించవచ్చు. రాయలసీమలోని కొంత ప్రాంతానికి కూడా నీరు లభిస్తుంది,

**ఖనిజసంపద**

ఆంధ్రప్రదేశ్‌లో అపారమైన ఖనిజసంపద ఉంది. తెలంగాణలో బొగ్గు విస్తారంగా దొరుకుతుంది. శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం జిల్లాలో మాంగనీసు లభిస్తుంది. బైరాటీస్ (ముగ్గురాయి) మన దేశంలో దొరికే మొత్తంలో తొంభై తొమ్మిది శాతం రాయలసీమలో దొరుకుతుంది. ముడి ఇనుము, సున్నపురాయి, ఎమడైట్, గ్రాఫైట్, మైకా, క్వార్జ్ దొరుకుతాయి. బంగారం కూడా లభిస్తోంది.

ఖనిజనిక్షేపాలను వెలికితీయడానికి, వినియోగించడానికి, విదేశాలకు ఎగుమతి చేయడానికి అనేకచర్యలు తీసుకొంటున్నారు. ఖనిజసంపదలు ఆధారంగా అనేక పరిశ్రమలు స్థాపించబడ్డాయి. ఖనిజసంపదను సద్వినియోగపరచుకుంటే ఆంధ్రప్రదేశ్‌లో సత్వర పారిశ్రామిక అభివృద్ధి సాధింపవచ్చును.

**అటవీసంపద**

తూర్పు కనుమలు, పీఠభూమి, తూర్పు సరిహద్దులలో దట్టమైన అడవులు కనిపిస్తాయి. మన రాష్ట్రంలో అరవై ఐదు వేల చదరపుకిలోమీటర్లు మాత్రం అడవులు వ్యాపించి ఉన్నాయి. ఈ వైశాల్యం రాష్ట్రవైశాల్యంలో ఇరవై మూడు శాతం ఉంది,

భారతదేశంలో 33 శాతం వుంటే మనం పదిశాతం తక్కువలో ఉన్నా మన్న మాట. అడవులు తగ్గుతున్నాయి, అందుచేత వర్షాలు కూడా తగ్గుతున్నాయి. ప్రపంచంలో దొరకని ఎర్ర చందనం మన అడవులలో దొరుకుతుంది. అడవుల ఆసరాతో పలు కాగితపు మిల్లులు స్థాపించబడినాయి. అడవులను పెంచాలి. అడవులే కాకుండా ప్రతిగ్రామంలో ప్రతి ఇంటా చెట్లను పెంచడానికి సోషల్ ఫారెస్టరీ స్కీము అమలు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. అటవీసంపద అన్ని రకాల అభివృద్ధికి, వాతావరణానికి తోడ్పడుతుంది.

## సముద్రసంపద

ఆంధ్రప్రదేశ్‌లో తడ నుండి ఇచ్ఛాపురం వరకు వెయ్యి కిలోమీటర్ల సముద్రతీరం ఉన్నది. సముద్రగర్భంలో అనేక రకాల ఖనిజసంపదలున్నాయని ఇటీవలి సర్వే వలన తేలింది. కృష్ణా గోదావరి నదులు సముద్రంలో కలిసేచోట్ల చమురుకోసం అన్వేషణ సాగుతున్నది. మూడు బావులలో నూనె వస్తున్నట్లు, కొన్ని బావులలో సహజవాయువు లభిస్తున్నట్లు వార్తలు అందుతున్నాయి. కొన్ని బావులలో ఖనిజసంపద కూడా లభించగల సూచనలు అందినాయి.

## మత్స్యసంపద

సముద్రంలో అపారమైన మత్స్యసంపద ఉంది. విశాఖపట్టణం, కాకినాడ, మచిలీపట్టణం, నిజాంపట్టణం రేవుల ప్రాంతాలలో జాలరులు మరబోట్ల ద్వారా సముద్రంలోనికి వెళ్ళి చేపలను పడుతున్నారు. చిన్న చిన్న రేవులను అభివృద్ధి పరుస్తూ సముద్రంలోని సంపదను ఇంకా వెలికితీయవచ్చు. పడవలలో సామాన్య జాలరులు వేటకు వెళుతూ అనేకబాధలకు గురిఅవుతున్నారు. వారికి రహదారి సౌకర్యాలు, జట్టీలు, శీతల గిడ్డంగులు, మంచినీటి సదుపాయాలు కలిగించే పథకాలను అమలు జరిపితే మత్స్యపరిశ్రమ ఎంతగానో అభివృద్ధి కాగలదు. ఆ విధంగా రాష్ట్రసంపద పెరుగుతుంది. సముద్రంలో ముప్పైరెండు వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతంలో చేపలుపట్టే అవకాశం మనకు ఉన్నప్పటికీ, ఇప్పటికీ పదివేల కిలోమీటర్ల ప్రాంతాన్ని కూడా ఉపయోగించు కొనలేకపోతున్నాం. ఆంధ్రప్రదేశ్‌లోని నదులు, ఉపనదులు, కాలువలు, జలాశయాలు, చెఱువులు మొదలగు వనరుల వలన మత్స్యపరిశ్రమ అభివృద్ధికి ఎన్నో అవకాశాలు ఉన్నాయి.

**పశు సంపద**

వ్యవసాయరంగంతో సన్నిహితసంబంధం ఉన్న పశుసంపద విషయంలో మన పరిస్థితి గణనీయంగా ఉంది. పశువులు, పాడి పరిశ్రమ, ఉత్పత్తుల నుండి రాష్ట్రానికి వచ్చేది నలభై నాలుగు కోట్ల ఆదాయం అని అంచనా వేయబడింది. 3 కోట్ల పశువులు ఉన్నట్లు అంచనా. వ్యవసాయంతోపాటు పాడి పరిశ్రమ కూడా మన రాష్ట్రంలో అభివృద్ధి చెందింది. ఇంకా అభివృద్ధి చేయడానికి అనేకపథకాలు అమలు చేస్తున్నారు.

మన రాష్ట్రంలో విస్తారంగా లభిస్తున్న వివిధ రకాల సహజవనరులను సక్రమంగా వినియోగించుకోవడానికి ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. వివిధప్రణాళికలతో రాష్ట్రం వివిధ ప్రాంతాల సత్వర అభివృద్ధికి గట్టి కృషి జరుగుతూనే ఉన్నది. ప్రాంతీయ వ్యత్యాసాలను తొలగించి సత్వరాభివృద్ధికి సమైక్యకృషి చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆరు కోట్ల మానవ సంపద ఉంది. విజ్ఞానవేత్తలున్నారు. సాంకేతికనిపుణులున్నారు. వివిధరంగాలలో అనుభవజ్ఞులైన వారెందరో ఉన్నారు. ఆవేశాన్ని తగ్గించుకొని, ఆలోచనలను పెంచుకొని సమైక్యంగా కృషి చేసేత ఆంధ్రులకు మించిన వారెవరూ ఉండరు. సహజవనరులను వినియోగించుకొని సమగ్ర అభివృద్ధికి కృషి చేస్తే ఆంధ్రప్రదేశ్‌కు మించిన రాష్ట్రమే ఉండదు!

రాష్ట్రపురోభివృద్ధికి అందరమూ కృషిచేద్దాం. సర్వజనులు సుఖజీవనం చేయాలని కోరుదాం.

# 5. తెలుగుదేశ పురోభివృద్ధికి సమైక్యకృషి

దాదాపు రెండువేల సంవత్సరములకు ముందు వింధ్యపర్వతాలకు దక్షిణమునందున్న హిందూదేశ భాగమునకంతటికీ దక్షిణా పథమని పేరుండెను. అందు నేటి బరంపురము నుండి చెన్నపట్టణమువరకూ, పశ్చిమాన నేటి తుంగభద్రాతీరము వరకునూ సుమారు ఒక్కటే రూపముననున్న భాష ప్రజలు మాట్లాడుచుండిరి. అది అనాటి తెలుగు భాష. ఆ భాషకు ఆ నాడు వ్యాకరణంగానీ, సారస్వతంగానీ, రాజపోషణగానీ లేకున్నది. నేటి తెలుగు గడ్డకు నడిబొడ్డుగా భాసించిన అమరావతి అనగా గుంటూరు మండలమున ప్రాకృతభాష రాజభాషగానుండెను. ఆ నాటి తెలుగు రాజులు తమ నిత్యవ్యవహారాల్లో ప్రాకృతభాషనే వాడిరి. వారే శాలివాహన వంశజులు.

ఒక భాషా, ఒకే చరిత్ర, ఒకే సంస్కృతిగల అతి ప్రాచీనమైన సభ్యతగల తెలుగుజాతి మనది. ఆంధ్రులమైన మనం ఐతరేయ బ్రాహ్మణమునందు కూడా పేర్కొనబడి యున్నాము. మహాభారతకాలంనాటికి జనమేజయునితో తెలుగు వాళ్ళం పోరాటం సలిపాం- అంటే మన తెలుగుజాతి అంతకుముందే ఉన్న అతిప్రాచీనజాతియని సుస్పష్టంగా తెలియుచున్నది.

తొలుదొల్త తెలుగువాళ్ళు కృష్ణాతీర నివాసులుగా ఉండి క్రీస్తు శకమునకు కొన్ని శతాబ్దములకు పూర్వమే బందరు సమీపమున శ్రీకాకుళమును రాజధానిగా చేసుకొని రాజ్యపాలన గావించారు. ఆ తరువాత ధాన్యకటకం రాజధాని అయింది. అటు పిమ్మట కొంతకాలానికి తెలుగువాళ్లు, క్రమంగా దక్షిణాపథము నంతటినీ వశం చేసుకొని, ఉత్తరదేశమునకు వ్యాపించి తుదకు గంగాతీరాన మగధవంశజుల స్థానమగు పాటలీపుత్రమును రాజధానిగా చేసుకొని క్రీస్తుశక ప్రారంభమునకు పూర్వము 2 వేల సంవత్సరాల క్రితమే ఆంధ్ర సామ్రాజ్యాన్ని విస్తరించి, తమ ధైర్యపరాక్రమాలతో భారతదేశానికే అధినేతలై 450 సంవత్సరాలు నిర్విఘ్నంగా పరిపాలించి చరిత్ర ప్రసిద్ధి గడించారు.

గౌతమీపుత్ర శాతకర్ణి శాతవాహనుడు సుధాన్య కటక నగర మహామండలాన్ని, క్రీ.పూ. 300 సంవత్సరాల క్రితం ఆంధ్రజాతి విజయవికాస విజ్ఞానమణిదీపంగా వెలయించినాడు. కళింగ, శ్రీముఖం పట్టణాలు, అమరావతి క్షేత్రం, వేంగీ, వరంగల్లు, విద్యానగరాలు ఎన్నియో వెలసి ప్రపంచఖ్యాతి నార్జించి, విజ్ఞానకేంద్రాలుగా, యాత్రా స్థలాలుగా విలసిల్లినాయి. మధ్యయుగంలో వేంగీ చాళుక్యుల పరాక్రమం, అటు తరువాత ఓరుగల్లులో కాకతీయ వంశజులగు ప్రతాపరుద్రగణపతిదేవ, రుద్రమదేవుల చరిత్రలు సుప్రసిద్ధములు. బళ్లారి మండలమున, పంపాసరోవర ప్రాంతమున విద్యానగరాన్ని వైభవోపేతంగా పరిపాలించి దిగ్విజయయాత్రలు చేసి, ఏకఛత్రాధిపత్యము నెరపి క్రీ.శ.1530 వరకు పరాక్రమోపేతుడగు కృష్ణదేవరాయలు తెలుగుదేశాన్ని భువన విజయ మొనరించాడు. తెలుగు జాతీయ జీవన వికాసానికీ, సాహిత్యసంస్కృతులకు ఎనలేని శోభను చేకూర్చాడు. దేశ భాషలందు తెలుగులెస్సయని ఘోషించాడు. పలనాటివారి వీరవిహారం, క్షత్రియుల క్షాత్రతేజం, నాయకుల వీరావేశం, కమ్మవీరుల పరాక్రమం, రెడ్డిరాజుల నాయకత్వం, నిరంతరం విదేశీయుల దురాక్రమణలనుండి ఆంధ్రదేశాన్ని సంరక్షిస్తూ వచ్చాయి. ఇదంతా తెలుగువాళ్ళ గత వైభవాలు. ఉజ్జ్వలభవిష్యత్తుకు సోపానాలు.

ఒకే భాషా, ఒకే సంస్కృతి ఒకే చరిత్ర కలిగిన తెలుగు ప్రజలకు ప్రత్యేకరాష్ట్రం ఉండాలనే ప్రాతిపదికపై ఆంధ్రుల భాషా రాష్ట్రోద్యమం సాగింది. ఎన్నో అవాంతరాలు ఎదుర్కొంది. ఏకదీక్షగా ముందుకే సాగింది. ఎంతో వ్యతిరేకతనూ, ఎన్నో ప్రతికూల యత్నాలనూ ఎదురొడ్డి నిలిచి, ధ్యేయాన్ని సాధించింది. తెలుగు ప్రతిభకు రూపరేఖలు దిద్దుకుంది.

ఒక ప్రదేశాన్ని ఆక్రమించుకొని ఒక భాషను మాట్లాడు సజనులను ఒక రాష్ట్రములో చేర్చుటచేత సరిపాలనలో సౌలభ్యమేకాకుండా సౌష్ఠవం ఏర్పడుతుంది. భాషోన్నతి ఆ ప్రజల ఔన్నత్యాన్ని ప్రకటిస్తుంది. ప్రజలకూ, భాషకూ నిరంతర అన్యోన్యసంబంధం ఉంది. భాషద్వారానే విజ్ఞానం ఏర్పడుతుంది. భాషను సంపన్నం చేసినకొలదీ దానిని నేర్చుకొని ప్రజలు అభివృద్ధిచెందుతారు. భాష, ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య సారథిగా ఏర్పడి సమైక్యాన్ని సాధిస్తుంది. సంపూర్ణ భావ ప్రకటనకు గానీ, తద్వారా మనోవికాసానికి గానీ, సంస్కృతీసంప్రదాయాలను వృద్ధి చేయుటకు గానీ, మానవునకు మాతృభాష తోడ్పడినంతగా మరి ఏ యితర భాషకూడా తోడ్పడజాలదు. కావున ప్రగతికి సోపానం మాతృభాష. జాతీయతను పెంపొందింపజేయుటకదే మార్గము. మనుష్యుని హావభావ

ప్రకటనకు గానీ, ఒక విషయాన్ని సంపూర్ణంగా తెలుపుటకుగానీ, తెలుసుకొనుటకు గానీ మాతృభాషయే మూలం. ఇదే దృష్టి భాషా రాష్ట్రాలకు ప్రాతిపదిక. మాతృభాష స్వదేశాన్ని ప్రేమించి జాతీయభావాన్ని కలిగి ఉంటుంది. తెలుగు వాళ్ళందరూ ఏకం కావాలనే పవిత్రత ఆకాంక్షకు ప్రతిస్వరూపమే భాషా ప్రయుక్త రాష్ట్రావతరణ.

ఆంధ్రరాష్ట్ర అవతరణ 1953 అక్టోబరు 1వ తేదీన జరిగిన పిమ్మట, తదనుగుణంగా రాష్ట్రాల పునర్విభజన జరిగి, 1956 నవంబరు 1వ తేదీన హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ నిర్మాణం జరిగినప్పుడు తెలుగుజాతికి ఒక చరిత్ర ఏర్పడింది.

ఇక తెలుగును అధికారభాషగా గుర్తించాలనే ఆందోళన బయలుదేరింది. తెలుగు భాషలో పరిపాలన వ్యవహారాలు సాగించుకొన్నందువల్ల కలిగే లాభాలను గురించి తెలుగు భాషను అటువంటి గుర్తింపు ఆవశ్యకతను గురించి గొంతెత్తి చాటారు. ఎట్టకేలకు 1966 సంవత్సరములో తెలుగు అధికారభాషగా ప్రకటించబడినది. చట్టం కూడా రూపొందించబడింది. అధికారభాషగా తెలుగును ప్రవేశ పెట్టడానికి కీ.శే. బూర్గుల రామకృష్ణారావుగారు ఏ నాడో నాందీ ప్రస్తావన గావించారు. అట్టి కీర్తి వారికి దక్కుతుంది. త్రిభాషాసూత్రాన్ని అంగీకరించే విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ముందంజ వేసిందనే చెప్పాలి. తెలుగును బోధన భాషగా అంగీకరించటంలో కూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆదర్శాన్ని చూపింది. జాతి సమైక్యానికీ, జాతి ఏకీకరణకూ తెలుగులోనే బోధన జరగడం ఎంతైనా ఆవశ్యకమైయున్నది. ఆంధ్రప్రదేశ్ అధికారభాషాచట్టానికి అనుగుణంగా, రాష్ట్ర అధికార కార్యాలకూ, శాసనమండలిలో వ్యవహార నిర్వహణకు ఉపయోగించవలసిన భాషగా తెలుగు భాషను స్వీకరించటం జరిగింది. కాని ముందు జరగవలసిన కృషి ఎంతో ఉన్నది. ఈ సంవత్సరం తాలూకా స్థాయిలో తెలుగును అధికారభాషగా ప్రయోగించడం జరిగింది. వచ్చే సంవత్సరం అంటే 1975లో జిల్లాస్థాయిలోనూ, ఆ తరువాత రాష్ట్రస్థాయిలోనూ తెలుగును అధికారభాషగా ప్రవేశపెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

గడిచిన సంవత్సరాలలో మన రాష్ట్రంలో పంచాయతీ రాజ్యపరిపాలన యేర్పాటు ఒక ముఖ్యమైన సంఘటన. గ్రామ స్వరాజ్యం, అధికార వికేంద్రీకరణ ఆదర్శాలుగా స్థానిక స్వపరిపాలన వ్యవస్థ అవతరించింది. గ్రామ పంచాయతీ, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుల ద్వారా, అభివృద్ధి పథకాల అమలు బాధ్యత యీ సంస్థలకు అప్పగించబడినది. ప్రకృతి ప్రసాదించిన అన్ని వనరులు సమకూడిన ఆంధ్రప్రదేశ్ భారతదేశానికి అన్నపూర్ణగా వెలసింది. కృష్ణా, గోదావరి నదులు మన పెన్నిధులు. నదుల

జలాలను సక్రమంగా వినియోగించుకుంటే మన రాష్ట్రంలో దుర్భిక్షమే ఉండదు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు, పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణాల ప్రథమ దశ పూర్తి అయింది. విద్యుచ్ఛక్తి ఉత్పాదన పథకంగా శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణమౌతున్నది. అన్ని రంగాలలో ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు ఆశాజనకంగా ఉన్నదని చెప్పగలం.

ఆంధ్రప్రదేశ్‌లో విద్యాభివృద్ధి అవకాశాలు విస్తృతమైనాయి. ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు ఎన్నో స్థాపించబడ్డాయి. తిరుపతి విశ్వవిద్యాలయం, స్వాతంత్ర్యానంతర ఫలం. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయరంగంలో జరిగిన అభివృద్ధిలో వ్యవసాయ విశ్వవిద్యాలయం ఏర్పాటు గణనీయమైనది. కేంద్ర ప్రభుత్వ రీజినల్ ఇంజినీరింగు కళాశాలలతో పాటు మరికొన్ని ఇంజినీరింగు, వైద్య కళాశాలలు కొత్తవి స్థాపించబడినాయి. మూడు ప్రాంతాలలో పోస్టు గ్రాడ్యుయేటు కేంద్రాలు ఏర్పడ్డాయి. ఒక కేంద్ర విశ్వ విద్యాలయం ఏర్పాడు కావించబడింది. వరంగల్లు - గుంటూరులలో విశ్వవిద్యాలయాలు నెలకొల్పుటకు చర్యలు తీసుకొంటున్నాం. ఇంకా మూడు పి.జి. సెంటర్లు, పది కళాశాలలో పి.జి. కోర్సులు పెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. తెలుగులో బోధన జరగవలెనని సర్వత్రా అంగీకరించబడినది, హర్షింపబడినది. సత్వర భవిష్యత్తులో ఇంకెన్నో అభివృద్ధి పనులు జరగాల్సియున్నవి. మనలో నిష్ఠ, క్రమశిక్షణ, సమైక్యబలం ఉన్ననాడే ఆంధ్రప్రదేశ్ మూడు పువ్వులు ఆరుకాయలుగా శోభించగలదు. ప్రాంతీయదురభిమానాలకూ, స్థానికవ్యామోహాలకూ, రాజకీయవర్గాలకూ అతీతంగా అందరూ కలసి కట్టుగా కృషి సలుపవలసిన తరుణం ఇది. రెండు పర్యాయాలు ఉభయ ప్రాంతాలలో జరిగిన ప్రాంతీయ ఉద్యమాలు అభివృద్ధిని నిరోధించాయి. తెలుగుసీమలోని ప్రకృతి ప్రసాదించిన పుష్కలసంపదతో, వ్యావసాయికంగా పారిశ్రామికంగా సర్వతోముఖాభ్యుదయానికి సమస్తసదుపాయాలు గల ఈ మన రాష్ట్రం ఇతోధికంగా అభివృద్ధి చెందాలనీ, మనలో భావసమైక్యం సాధించబడి, తెలుగుజాతి, సంస్కృతి తరతతరాల దాక పరిరక్షింపబడాలని ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ శుభవేళ ఆకాంక్షిస్తున్నాను.

*(1974)*

# 6. తెలుగు సంస్కృతి : ప్రభుత్వప్రోత్సాహం

## సంస్కృతి అంటే

కోటానుకోట్లుగా ఉన్న మనుషులలో ఎవరి వ్యక్తిత్వం వారికి ఉంది. ముఖకవళికలలో, మాట్లాడే తీరులో, హావభావాలలో, అలవాట్లలో ఒక్కొక్కరిది ఒక్కొక్క ప్రత్యేకత. అయితే ఒకే భాష మాట్లాడే సమాజంలో ఒకే భౌగోళికప్రాంతంలో నివసించే సముదాయంలో, చిరకాలంగా వ్యవస్థాగతమైన ఒకే సంప్రదాయసమితిని అనుసరించే వర్గంలో సభ్యులయినట్టి వ్యక్తుల ప్రత్యేకతలను అన్నిటినీ ముడివేసి, ఆ వైవిధ్యంలో ప్రధానమైన సర్వసామాన్యలక్షణాలను అన్నిటినీ ఒక సాముదాయికవిశిష్టతగా ప్రదర్శించే జీవనలక్షణం కొంత ఉంటుంది. అదే ఆ జాతి సంస్కృతి. బాహిరమైన జీవితంకంటె కూడా జాతి ఆంతరంగికజీవితం సంస్కృతిలో ప్రాధాన్యం వహిస్తుంది. ఆ విధంగా తాత్త్వికచింతన, జీవితంపట్ల దృక్పథం, ఆటపాటలు, పండుగలు, పర్వాలు, కళాభిరుచి మొదలైనవి జాతి సంస్కృతిలోని అంతర్వాహినులు.

## తెలుగు సంస్కృతే ఒకనాడు దాక్షిణాత్య సంస్కృతి

ఒక విధంగా చూస్తే సర్వభారతీయులకు సమానమని చెప్పదగినది ఒకే మహా సంస్కృతి ఉంది. దాని సారాన్నే తనలో ఇముడ్చుకొని, సూక్ష్మాంశాలలో మాత్రం కొంత కొంత విభిన్నత, విలక్షణత కనబరుస్తూ భారతదేశంలోని వివిధ ప్రాంతీయ సంస్కృతులూ రూపొందినాయి. అట్లాంటి వాటిలో తెలుగువారి సంస్కృతి మిక్కిలి ప్రాచీనమైన వాటిలో ఒకటి ఒకప్పుడు అదే యావత్ దక్షిణాపథానికి చెందిన సంస్కృతి.

చరిత్రకు అందినంత వరకు తెలుగు సీమను పాలించిన మొట్టమొదటి రాజవంశం శాతవాహన రాజవంశం. అంతేకాదు మొత్తం దక్షిణభారతంలోనే అది మొట్టమొదటి మహాసామ్రాజ్యం. ఆ ఆంధ్ర శాతవాహనులే దక్షిణాన సంస్కృతికి రూపుదిద్దినవారు. పునాదులు వేసినవారు- అని చరిత్రవేత్తలు వివరిస్తున్నారు.

## సంస్కృతీపరిరక్షణ

తరతరాల చరిత్రలో రూపు దిద్దుకొన్ని సంస్కృతిని పెన్నిధిగా భావించి కాపాడు కోవలసిన బాధ్యత ప్రతి సమాజంపైనా ఉంది. పాలకులుగా మన దేశాన్ని ఏలిన రాజులందరూ దేశంలోని శాంతిభద్రతలకు, సుఖజీవనానికి ఎంత ప్రాధాన్యమిచ్చారో, అంత ప్రాధాన్యమూ సారస్వతాది కళాపోషణకూ ఇచ్చారు. ఈ నాడు ప్రజాస్వామ్యంలో సైతం ప్రభుత్వం ఆ బాధ్యతను గుర్తిస్తున్నది.

మన దేశంలోను, మన రాష్ట్రంలోను ఈ సందర్భంగా ఏర్పడి ఉన్న ప్రత్యేక పరిస్థితిని మనం గమనించవలసి ఉంది. విదేశీయుల క్రింద రమారమి రెండు శతాబ్దాలపాటు ఉండిపోయిన మన దేశంలో, సాంస్కృతికకార్యకలాపాలకు సముచిత స్థానం లేకపోయింది. ఇక మన తెలుగు సీమ కథచూస్తే, అనేక చారిత్రకల పరిస్థితుల వల్ల, తెలుగు మాట్లాడే ప్రజలు సుదీర్ఘమని చెప్పదగినకాలం విడివిడిగా భిన్న రాష్ట్రాలలో ఉండిపోవలసి వచ్చింది.

1953లోను, 1956లోను జరిగిన రాష్ట్రవిభజన, భాషాప్రయుక్తరాష్ట్రాల స్థాపనలలో విడివిడిగా ఉండిపోయిన తెలుగువారంతా ఒక రాష్ట్రంలోకి- ఆంధ్రప్రదేశ్‌లోకి- వచ్చారు. అయితే, భాషావిషయకంగా ఏకత్వాన్ని సాధించు కోవడంతో పాటుగా సంస్కృతిపరంగా కూడా ఏకత్వం సాధించుకోవటానికి ప్రయత్నాలు అవసరమైనాయి.

మనమంతా ఒక్కటే అన్నభావం ప్రజలలో పాతుకుపోవాలంటే భాషాసంస్కృతులే ప్రధానమార్గాలు. మనం అందరమూ ఒకే ఒక్క మహాసంప్రదాయానికి చెందినవారమనే భావన భావసమైక్యానికి పునాది. అందరికీ సమానమైన భాషా సంస్కృతీ మహాసంప్రదాయాలను గూర్చి మననం చేసుకోవడం మీదనే మన కలయిక, మనుగడ ఆధారపడి ఉన్నాయి. ఈ భావంతోటే మన రాష్ట్రప్రభుత్వం సాంస్కృతిక జీవితవికాసానికి అన్ని విధాలా దోహదం చేయాలని తలపెట్టింది.

## అకాడమీల స్థాపన

రాష్ట్రంలో సాంస్కృతిక కార్యక్రమాలను ప్రోత్సహించడానికి, నిర్వహించడానికి రాష్ట్రప్రభుత్వం 1957లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీని, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీని స్థాపించింది. ఆ తరువాత 1961లో లలితకళా అకాడమీని

నెలకొల్పింది. బాలల సర్వతోముఖవికాసం కోసం ఈ సంవత్సరమే బాలల అకాడమీని కూడా ఒక దానిని స్థాపించడం జరిగింది.

వీటిలో సాహిత్య అకాడమీ భాషాసాహిత్యాలకు సంబంధించిన పనిచేస్తున్నది- ఇందులో తెలుగుకు ప్రాధాన్యం ఉన్నప్పటికీ ఉర్దూ, సంస్కృత, హిందీ భాషా సాహిత్యాలకు కూడా తగినంత ప్రోత్సాహం లభిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ కృషి ఇంతవరకు సంగీతం, నాటకం, నృత్యం, చలనచిత్రాలు- వీటికి సంబంధించినది. అయితే ఇటీవల చలనచిత్రాల అభివృద్ధికోసం వేరే పథకాలను రూపొందించినందువల్ల, ఇక మీదట సంగీత నాటక అకాడమీ వాటిని గూర్చి శ్రద్ధ వహించవలసిన అవసరం ఉండదు. సంగీతం, నృత్యం, నాటకం- ఈ మూడూ పరస్పరసంబంధం ఉన్న కళలు కావటంచేత ఈ మూడింటినీ ఒకే అకాడమీకి అప్పగించటం జరిగింది. కర్ణాటకసంగీతంతో పాటుగా హిందుస్తానీ సంగీతం, కూచిపూడి నృత్యంతో పాటుగా భరతనాట్యం వగైరా నృత్యాలు, తెలుగు నాటక సమాజాలతోపాటుగా ఇతరభాషల నాటకసమాజాలు కూడా ఈ అకాడమీ ప్రోత్సాహాన్ని, సహాయాన్ని పొందుతున్నాయి.

లలితకళా అకాడమీ చిత్రలేఖనం, విగ్రహశిల్పం మొదలైన కళలకు సంబంధించినది అయితే ఇందులో ప్రస్తుతం చిత్రలేఖనమే ఎక్కువ ప్రోత్సాహం పొందుతున్నది.

ఇదేవిధంగా ఫోటోగ్రఫీ అభివృద్ధికోసం ప్రత్యేకంగా నెలకొల్పిన ఫొటోగ్రఫీ అకాడమీ కృషిచేస్తున్నది. ప్రత్యేకంగా బాలల సంస్కృతి, విజ్ఞానాలకోసం పనిచేసే ఉద్దేశంతో బాలల అకాడమీని నెలకొల్పడమైనది. ఇంతవరకు రాష్ట్రం వెలుపల స్థిరపడి ఉన్న చలనచిత్రపరిశ్రమను తెలుగు దేశంలోకి తీసుకొనిరావడానికి తగిన సహకారాన్ని, ప్రోత్సాహాన్ని అందించటానికి, చలనచిత్ర ప్రమాణాలను పెంచటానికి కూడా రాష్ట్ర ప్రభుత్వం చలనచిత్ర సహాయకసంస్థ ద్వారాను, బహుమతులు, సబ్సిడీ పథకాల ద్వారాను కృషిచేస్తున్నది.

**రవీంద్రభారతి - కళాభవన్**

గురుదేవుడు రవీంద్రనాథ్ టాగూరు శతజయంతిని పురస్కరించుకొని వివిధ రాష్ట్ర రాజధానులలోను జాతీయ నాటకశాలలు నిర్మించడం జరిగింది. అట్లా వెలసినదే హైదరాబాదులో శాసనసభల భవనాలకు సమీపంలో ఉన్న రవీంద్రభారతి. సంగీత

కచ్చేరీలకు, నృత్య నాటక ప్రదర్శనాలకు ఎంతో అనువుగా ఉన్న ఈ రవీంద్రభారతి, మన జంటనగరాలకు ఒక వరప్రసాదం వంటిది. ఇందులో సంవత్సరం పొడవునా ప్రదర్శనలు జరుగుతూనే ఉంటాయి. దేశంలోని అన్ని జాతీయ నాటకశాలలలోకి సంవత్సరం పొడుగునా ఇంత ఉపయుక్తంగా ఉన్నది మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు. స్థానిక సాంస్కృతికసంస్థల కార్యక్రమాలకు మాత్రమేకాక, రవీంద్రభారతి ఇతర రాష్ట్రాలనుంచి, ఇతర దేశాలనుంచి ఆహ్వానితులై వచ్చే అనేక సాంస్కృతిక బృందాల ప్రదర్శనలను కూడా వీలుగా ఉన్నది.

సాహిత్య, సంగీత, నాటక, లలితకళా అకాడమీలు అన్నీ ఒకేచోట ఉండి కలసి పనిచెయ్యటానికి వీలుగా, రవీంద్రభారతి ఆవరణలోనే 1965లో కళాభవన్ నిర్మాణం జరిగింది.

### సాంస్కృతిక వ్యవహారాల విభాగం

రాష్ట్రస్థాయిలో సాంస్కృతికకార్యక్రమాలను ప్రోత్సాహపరచి చక్కగా సమన్వయం చెయ్యటంకోసం రాష్ట్రప్రభుత్వంలో 1964లో సాంస్కృతికవ్యవహారాలకంటూ ఒక విభాగాన్ని ఏర్పాటు చెయ్యటం జరిగింది. ఆర్. అప్పారావు (ప్రస్తుతం ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు) తొలి సాంస్కృతిక వ్యవహారాలమంత్రి. అప్పుడే రాష్ట్రస్థాయిలో సాంస్కృతికవ్యవహారాలను చూచేటందుకు ఒక ప్రత్యేకాధికారి నియామకం కూడా జరిగింది. అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టర్‌గా ఉంటున్న డా॥పి.ఎస్.ఆర్. అప్పారావును అప్పుడు మొదటి ప్రత్యేకాధికారిగా నియమించి, ఆ బాధ్యతను అప్పగించారు.

ప్రసిద్ధ కవిపండితులచేత కావ్యగానం, ఉపన్యాసాలు చేయించి సన్మానించటం, మంచి స్థాయి ఉన్న గ్రంథాల ప్రచురణకు ద్రవ్యసహాయం చేయటం, ప్రభుత్వశాఖ పక్షాన తెలుగు సంస్కృతికి సంబంధించిన కొన్ని చిన్న చిన్న పుస్తకాలను ప్రచురించటం, ఉత్తమగ్రంథాలు విరివిగా కొని ప్రోత్సహించడం మొదలయిన కార్యకలాపాలను సాంస్కృతికవ్యవహారాల విభాగం అప్పట్లో నిర్వహించింది.

### సాంస్కృతికకార్యక్రమాల విస్తరణ

సాంస్కృతికంగా రాష్ట్రవ్యాప్తంగా ఉత్తేజం రావాలని, సాంస్కృతిక కార్యకలాపాలు విస్తృతంగా జరగాలని పెద్దలు అనుకోవటం జరిగింది. ఈ విషయమై బాగా ఆలోచించి

తగిన సూచనలను చేసే నిమిత్తం రాష్ట్రప్రభుత్వం 1972లో అకాడమీల పరిశీలక సంఘాన్ని నియమించింది. ఈ సంఘంవారు విస్తృతంగా పర్యటించి, విజ్ఞుల అభిప్రాయాలను సేకరించి, 1973 నవంబరు 1వ తేదీన ఒక నివేదిక సమర్పించారు. ఆ నివేదికలోని సప్తమాధ్యాయంలో రాష్ట్రవ్యాప్తంగా సాంస్కృతిక కార్యకలాపాలు జరగవలసిన విధానం స్పష్టంగా సూచించబడింది. ఈ నివేదికలోని కొన్ని ప్రధాన సూచనలను రాష్ట్రప్రభుత్వం ఆమోదించి, 1974-75లోనే అమలు జరిపింది.

అందులో మొదటిది: అకాడమీలు తమ కార్యకలాపాలను బాగా విస్తృత పరచటానికి వీలుగా వాటి ఆర్థికస్తోమతను పెంచటం, ఈ చూచనలను అనుసరించి మూడు అకాడమీలకు అంతకు ముందు వస్తున్న గ్రాంటును రెట్టింపుచేయటం జరిగింది. అసహాయులైన వృద్ధరచయితలకు, కవులకూ, కళాకారులకూ ఇంత వరకు వస్తున్న గౌరవభృతిని పెంచటం. ఇంకా ఎక్కువ మందికి గౌరవభృతి సౌకర్యం కలిగించటం. కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం కలిసి పూర్వం సుమారు 200 మందికి ఈ గౌరవ భృతిని ఇచ్చేవి. ఇందులో ఎక్కువ మందికి నెలకు రూ॥50/-లేదా రూ॥75/- మాత్రమే ఇచ్చేవారు. ఇప్పుడు వీరందరికి నెలకు రూ॥100/-ల దాకా పెంచటమే గాక 1974-75 సంవత్సరమునుండి 30 మందికి కొత్తగా గౌరవభృతిని మంజూరు చేసింది. ఇంకా కొత్తవారికి మరికొంతమందికి ఇవ్వటానికి అవకాశం ఉన్నది. కేంద్రప్రభుత్వం కూడా మళ్ళా ఈ ప్రణాళికను పునరుద్ధరించటానికి ఈ నడుమ నిశ్చయించడం ముదావహమైన విషయం.

లలితకళలకు సంబంధించిన గ్రంథాల ప్రచురణకు, కొనుగోలుకు ద్రవ్యం కేటాయించటం ద్వారా ప్రభుత్వం సహాయంచేస్తూ వచ్చింది. అలా కేటాయించిన మొత్తాన్ని ఇప్పుడు లక్ష రూపాయల దాకా పెంచటం జరిగింది.

పరిశీలక సంఘం వారు చేసిన మరో ముఖ్యమైన సూచనజిల్లా స్థాయిలో సాంస్కృతికవ్యవహారాల సంఘాలను నియమించడం. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా రాష్ట్రప్రభుత్వం 1975వ సంవత్సరాన్ని తెలుగు సాంస్కృతికసంవత్సరంగా ప్రకటించింది. ప్రధానంగా జిల్లాలలో సాంస్కృతికకార్యక్రమాలను పెంపొందించటం కోసమూ, ఆనుషంగికంగా ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణలో తోడ్పడటం కోసమూ జిల్లా, పురపాలక సంఘ, తాలూకా స్థాయులలో సాంస్కృతికసంఘాలను నియమించటం జరిగింది. జిల్లాస్థాయి సంఘానికి జిల్లా కలెక్టర్, పురపాలక స్థాయి సంఘానికి డి.ఆర్.ఓ., తాలూకా స్థాయి సంఘానికి తహసీల్‌దార్ అధ్యక్షుడు.

అధికారులతో, అనధికారులతో, కళాకారులతో, రచయితలు ఈ సంఘాలలో సభ్యులుగా ఉన్నారు.

## ఉగాది సంస్కృతీ మహోత్సవాలు

1974వ సంవత్సరం ఉగాది నుంచి వారం రోజులపాటు హైదరాబాదులో అఖిల భారత తెలుగు సాంస్కృతికోత్సవాలు జయప్రదంగా జరిగాయి. 1975లో పెద్దఎత్తున ప్రపంచ తెలుగు మహాసభలు వైభవోపేతంగా జరపాలన్న ఆకాంక్షకు ఆ ఉత్సవాల విజయం దారితీసింది. ప్రపంచ తెలుగు మహాసభలు ఆశించినదానికన్నా అధికంగా విజయం సాధించిన తరువాత, 1976లో కూడా ఇదేవిధంగా హైదరాబాదులో ఉగాది సంస్కృతి మహోత్సవాలు వారంరోజులపాటు కన్నుల పండుగగా జరిగినాయి. ఇటువంటి ఉత్సవాలకు జిల్లాలోను కళాశాలలోను కూడా జరపాలన్న ఉత్సాహాన్ని పలువురు పెద్దలు వ్యక్తం చేశారు. సాంస్కృతికోత్సవాలలో నృత్య, నాటక, జానపద కళారూపాలను ప్రదర్శించటం మాత్రమే కాక, తెలుగు భాషా, సాహిత్య చరిత్ర, సంస్కృతులను గూర్చి, ప్రస్తుతస్థితిగతులు, అభ్యుదయం మొదలయిన అంశాలను గూర్చి అభిజ్ఞుల విద్వద్గోష్ఠులను కూడా ఏర్పాటుచేసి ప్రత్యేకసంచికలను వెలువరించటం జరుగుతున్నది.

## ప్రపంచ తెలుగు మహాసభలు

సహృదయులైన మన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారి ఆమోదాశీస్సులతో 1975లో హైదరాబాదులో జరిగిన మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగువారి చరిత్రలోనే ఒక అపూర్వఘట్టం. తెలుగువారు ప్రపంచంలో ఏ మూలన ఉన్నా ఒక్కటే అన్న ఆత్మీయత, ఆనందం, నవచైతన్యం, ఆ సభలలో వెల్లివిరిశాయి. ప్రపంచ వ్యాప్తంగా తెలుగు భాషకు, తెలుగు వారికి గుర్తింపు వచ్చింది. తెలుగు సంస్కృతిని సమగ్రంగా అవగాహన చేసుకొని చాటటానికి, భద్రపరచు కోవటానికి ఇతోధికకృషి జరగాలని అందరూ కలసి నిర్ణయించారు.

## ప్రపంచ తెలుగు మహాసభల సత్ఫలితాలు

ప్రపంచ తెలుగు మహాసభలలో వెల్లివిరిసిన చైతన్యానికి ఒక రూపం ఇచ్చి, ఆ మహాసభ అమూల్యాశయాలను ఆచరణలోకి తేవటానికి కృషిచేసే నిమిత్తం, అంతర్జాతీయ తెలుగు సంస్థ ఏర్పడింది.

ఇతర రాష్ట్రాలలో, ఇతరదేశాలలో ఉన్న తెలుగువారికి సాంస్కృతిపరంగా, విద్యా విషయకంగా తగు ప్రోత్సాహం ఇవ్వటానికి ప్రభుత్వస్థాయిలో, విద్యాశాఖలో ఒక ప్రత్యేకవిభాగం ఏర్పడింది.

ఆ మహాసభల సందర్భంగా ఏర్పాటైన తరతరాల తెలుగుజాతి అనే సాంస్కృతిక ప్రదర్శనను చిరస్థాయిగా చేయటానికి, హైదరాబాదులో పబ్లిక్ గార్డెన్స్‌లో ఒక సంగ్రహాలయం నెలకొల్పటానికి శంకుస్థాపన జరిగింది. జంటనగరాల పౌరులు వసూలుచేసిన అయిదు లక్షల రూపాయలకుతోడుగా ప్రభుత్వం మరొక పదిహేను లక్షలు ఖర్చుపెట్టి, భవనం నిర్మించటానికి అంగీకరించింది. ఇందులో భద్రపరచిన సాంస్కృతిక వస్తువుల సేకరణకు ఇంకొక ఇరవై అయిదు లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. ఈ సంగ్రహాలయనిర్మాణం పూర్తి అయిన తరువాత ఇరవై అయిదు శతాబ్దాల తెలుగుజాతి చరిత్ర సమగ్ర స్వరూపాన్ని ఒక్కచోట చూసే అవకాశం దీనివల్ల కలుగుతుంది. ఇది భారతదేశంలోనే అపూర్వమైనదని చెప్పవచ్చు.

## ఇతరరాష్ట్రాలలోని తెలుగువారికి ధనసహాయం

భారతదేశంలో ఇతరరాష్ట్రాలలో ఉంటున్న తెలుగువారి విద్యాసాంస్కృతిక సమస్యలను క్షుణ్ణంగా అవగాహనచేసుకొని, వారికి విద్యాసాంస్కృతిక రంగాలలో చేయదగిన సహాయం చేసే నిమిత్తం, అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆధ్వర్యం క్రింద గత ఫిబ్రవరిలో ఒక మూడు రోజుల సదస్సు నిర్వహించటం జరిగింది. ఆ సదస్సుకు వచ్చిన వివిధసంస్థల ప్రతినిధులను విద్యాశాఖలోని ప్రత్యేక విభాగం ఉద్యోగులు కలుసుకున్నారు.

పాఠశాలలకు, గ్రంథాలయాలకు, తగిన భవననిర్మాణం చేయటంలోను, పుస్తకాలను సమకూర్చటంలోను ఆ ప్రతినిధులు రాష్ట్రప్రభుత్వ సహాయాన్ని ముఖ్యంగా అపేక్షించారు. దానితో పాటుగా ఆయా ప్రాంతాలలో తెలుగు కళాకారుల సాంస్కృతిక ప్రదర్శనలకు, చలనచిత్రప్రదర్శనలకు ఏర్పాట్లు చేయమని కూడా కోరారు.

రాష్ట్రప్రభుత్వం గ్రాంట్ల రూపంలో ఇతర ప్రాంతాలలోని తెలుగు సంస్థలకు ద్రవ్యసహాయం చేస్తూ ఉన్నది. 1975-76 సంవత్సరంలో సుమారు పది లక్షల రూపాయల గ్రాంటును ప్రకటించి, అంతర్జాతీయ తెలుగు సంస్థద్వారా ఆ మొత్తాన్ని పంపిణీచేయటం జరిగింది. ప్రస్తుత ఆర్థికసంవత్సరంలోకూడా ఈ పద్ధతిని కొనసాగించటానికి, యథావకాశంగా ఆ మొత్తాన్ని పెంచటానికి, రాష్ట్రప్రభుత్వం

కృతనిశ్చయంతో ఉన్నది. రాబోయే సంవత్సరాలలో కూడా ఈ పద్ధతి కొనసాగగలదు. రాష్ట్రప్రభుత్వం అందించే ధనసహాయానికి ఉదారంగా తమ సహాయాన్ని కూడా చేర్చటానికి తిరుమల-తిరుపతి దేవస్థానం వారు కూడా అంగీకరించడం ఆనంద కారణం.

ఇతరరాష్ట్రాలలోను, ఇతరదేశాలలోను స్థిరపడిపోయి, పరిస్థితుల ప్రాబల్యంచేత తెలుగు భాషతో సన్నిహితత్వం కోల్పోయినవారు అనేకులు, ఇప్పుడు తిరిగి తెలుగుతో సన్నిహితసంబంధాలు పునరుద్ధరించుకోగోరుతుండడం ఎంతో ఆనందదాయకమైన విషయం. ప్రపంచ తెలుగు మహాసభలు సాధించిన సంతృప్తికరమైన ఫలితాలలో ఇది ఒకటి. వారి తక్షణ అవసరాల దృష్ట్యా తెలుగు లిపిలో మాత్రమేకాక ఇతర భారతీయ భాషాలిపుల ద్వారాను, రోమను లిపి ద్వారాను తెలుగు నేర్చుకోవటానికి వీలయ్యే పుస్తకాలను ప్రకటించటానికి అంతర్జాతీయ తెలుగు సంస్థ నిశ్చయించింది. త్వరలోనే వీటిని సిద్ధం చేసి విడుదల చెయ్యటం జరుగుతుంది.

**విదేశాలలోని తెలుగువారికి సహాయం**

విదేశాలలో ఉన్న తెలుగువారు ఆంధ్రప్రదేశ్‌కు వచ్చి ఇక్కడ వృత్తివిద్యలను, సాధారణవిద్యను కూడా నేర్చుకోవాలన్న కోరికను వ్యక్తం చేశారు. ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాలలో ఇంజినీరింగు, వైద్యం మొదలయిన కోర్సులలో రెండు శాతం సీట్లను అటువంటి వారికి కేటాయించాలన్న సూత్రాన్ని ఇటీవల విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు సమావేశంలో ఆమోదించటం జరిగింది.

తెలుగు సాంస్కృతికబృందాలను, ప్రసిద్ధ కవిపండితులను విదేశాలలోని తెలుగువారివద్దకు పంపే యోచన కూడా ఉంది. రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు త్వరలో మలేసియాలో జరుగనున్నందున, మొదట ఇటువంటి వారిని ఇక్కడికే పంపటం జరుగుతున్నది. డాక్టర్ దాశరథి, డాక్టర్ నారాయణ రెడ్డి, ఈ జూలై నెలలో మలేసియా దర్శించి, అక్కడ వివిధప్రాంతాలలో తెలుగువారిని కలుసుకుంటున్నారు. సాంస్కృతిక బృందాల పర్యటన విషయంలో కూడా త్వరలో ఏర్పాట్లు పూర్తి కాగలవు.

అమెరికాలో గ్రేటర్ వాషింగ్టన్ తెలుగు సాంస్కృతిక సమితివారు అమెరికా స్వాతంత్ర్య ద్విశతోత్సవాల సందర్భంలో తెలుగు సంస్కృతిని చాటిచెప్పే ఒక ప్రదర్శన ఏర్పాటు చెయ్యటానికి నిశ్చయించుకున్నారు. దానికి కావలసిన అనేకచిత్రాలను, ఫోటోలను అంతర్జాతీయ తెలుగు సంస్థ వారికి సమకూరుస్తున్నది. తెలుపు నలుపుల

లోను, రంగులలోను దాదాపు నాలుగు వందల ఫోటో నెగెటివ్‌లను ఈ సందర్భంగా వారికి పంపటం జరిగింది. వాటి ప్రతులను వారు తీసి పదిలపరుచుకొని నెగెటివ్‌లను తిరిగి పంపుతారు. వాటిని సక్రమంగా ఇతరదేశాలకు కూడా అందజెయ్యటం జరుగుతుంది.

తెలుగు సంస్కృతిని విశదపరిచే పాటలు, చలనచిత్రాలు మొదలయినవాటిని కూడా ఇదే విధంగా క్రమక్రమంగా విదేశాలలోని తెలుగువారికి పంపించటానికి, వారికి తగిన వాచకపుస్తకాలను, పఠనీయగ్రంథాలను సమకూర్చటానికి కూడా సంస్థ సన్నాహాలు చేస్తున్నది.

ఈ విధంగా ప్రపంచ తెలుగు మహాసభలలో ఏర్పడిన సన్నిహితత్వాన్నిసాంస్కృతిక సమైక్యభావాన్ని పరిరక్షించుకొని పెంపుచేయటానికి రాష్ట్రప్రభుత్వం కృషిచేస్తున్నది. ఇంకా ఇంకా చేయవలసింది ఎంతో ఉన్నది. సాధించవలసింది ఎంతో ఉన్నది. అన్నివిధాలా ప్రభుత్వం సహాయసహకారాలను అందిస్తూ, ఈ సాంస్కృతిక కార్యకలాపాలను ప్రోత్సహించటానికి కంకణం ధరించి ఉన్నది.

# 7. మన అధికారభాష-తెలుగు

మనమందరం ఉగాదిని "తెలుగు" ఉగాదిగా జరుపుకుంటున్నాం. తెలుగు ఉగాది అంటే తెలుగుభాషను అధికారభాషగా ప్రభుత్వపు అన్ని శాఖాలలోనూ ఒక్కసారిగా రాష్ట్రమంతటా అమలు జరుపుతున్నాము. అందుకే ఇది నిజమైన 'తెలుగు' ఉగాది. ఈ సందర్భంలో మన ప్రధాని ఇందిరాగాంధీ 1967లో అన్న ఈ క్రింది మాటలు గుర్తుకు వస్తున్నాయి.

మనం మన ప్రాంతీయభాషలన్నీ అభివృద్ధిచేసి, ఆ భాషలలోనే జనసామాన్యాని కందుబాటులో వుండే తక్కువ వెలకు లభించేలాగ చేయాలి! తద్వారా జనసామాన్యానికి విద్యావిజ్ఞానాలు అందించి, ప్రపంచంలోని వైజ్ఞానికపురోగతిని, సాంకేతికవిజ్ఞానాన్ని ప్రజలకు అందించే వంతెనగా ఈ భాషలను మనం తయారు చేయాలి.

ఆ నాడు ఆమె చెప్పిన పై మాటలు ఈ నాడు అధికారభాషగా తెలుగును ప్రవేశపెట్టి ప్రజల అందుబాటులో ప్రభుత్వకార్యకాలాపాలు జరిగేటందుకు 14 ఏళ్ళు పట్టింది. ఆలస్యంగానైనా ఈ చరిత్రాత్మకనిర్ణయాన్ని ఈ నాడు తెలుగు ఉగాదిని-అమలు జరుపుకోవడం మనకందరికి ఆనందకరమైనది.

ఈ నిర్ణయం వల్ల ప్రభుత్వశాఖలన్నింటిలోనూ తాలూకా స్థాయిలో ఉత్తర ప్రత్యుత్తరాలు తెలుగులోనే జరుగుతాయి. 24-3-1974 నుంచి ఈ శుభసమయాన జాతీయవారోత్సవాలు జరుపుకుంటున్నాము. మన తెలుగుతెలుగులోని అందం సాహిత్యం, సంగీత నాటక కళాప్రదర్శనల ద్వారా దేశమంతటా ఒక నూతనచైతన్యం ఉద్భవించేలాగ, దీన్ని మనందరం జయప్రదం చేయాలి! ఇది తెలుగుజాతికే గర్వకారణం.

**గతచరిత్ర**

ఈ సందర్భంగా కొన్ని గత సంఘటనలను గుర్తుచేసుకుంటే యీ నాటి ఈ నిర్ణయం వెనుకనున్న ఉద్దేశం అవగాహనకు వస్తుంది. అసలు తెలుగు భాషను రాజభాషగా నిర్ణయించాలన్న వాళ్ళు బ్రిటిషువారు. కడప, కర్నూలు వంటి జిల్లాలలో

తెలుగులో తీర్పులు (Judgments) వ్రాయడం ఆ నాడే ప్రారంభించారు. తర్వాత 'ఆంధ్రమహాసభ' అసలు భాషారాష్ట్రాలు ఏర్పడక ముందే, దేశంలో మొదటిసారిగా ప్రాంతీయభాషలు ఆధారంగా రాష్ట్రాల పునర్విభజనోద్యమం ప్రారంభమైంది. తెలుగువారి తరువాత ఇతరభాషలవారు ఈ ఉద్యమంలో చేరారు. ఐతే నిత్యం ప్రభుత్వం జరిపే ఉత్తరప్రత్యుత్తరాలు ప్రాంతీయభాషలో జరపడంలో తమిళనాడు వారు మనకంటే ముందంజ వేశారు. బస్సుల పేర్ల నుంచి రాష్ట్రం పేరు దాకా ('మద్రాసు నుంచి తమిళనాడుగా) ఆకాశవాణి పేరును గూడా మార్చి వేసి, తమిళభాష అంతర్జాతీయ మహాసభలు ఘనంగా జరుపుకున్నారు. మనం కూడా అనతికాలంలోనే ఆ స్థాయికి రాగలమని ఆశిస్తున్నాను.

తర్వాత ఆ నాటి ప్రకాశం మంత్రివర్గహయాంలో తెలుగు భాషను శాసనసభా చర్చలలోనూ, ప్రభుత్వంలోనూ ప్రవేశపెట్టాలని రాష్ట్ర శాసనసభ తీర్మానించింది.

తర్వాత మెట్టు 1966లోని తెలుగు రాజభాషాశాసనం Official Language Act. ఈ చట్టం ద్వారా తెలుగు అధికారభాషగా ప్రకటించబడింది. ఈ చట్టం ప్రకారం ఒక తెలుగు అధికారభాష కమీషను (Official Language Commission) ఏర్పాటైంది. ఈ మధ్యనే శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారిని కమీషన్ అధ్యక్షులుగా నియమించారు.

ఈ సందర్భంగా ప్రభుత్వం అనేకకార్యాలయాలలో తెలుగు భాషను వాడటంలోని సాధకబాధకాలను చర్చించిన అధికారభాష సమీక్షా సంఘం నివేదిక (Official Language Review Committee Report) ద్వారా జరిగిన ప్రగతిని సమీక్షించి, అందులోని సూచనలను అమలుచేస్తూ ఉత్తర్వులు జారీచేసింది.

ఈ నివేదిక వెనుక అనేక చరిత్రాత్మకమైన మార్పులు సంభవించాయి. వాటి పర్యవసానంగానే ఈనాడు తెలుగును అధికారభాషగా అన్ని శాఖలలోనూ తాలూకా వరకు ప్రవేశపెట్టడం కూడా జరుగుతోంది. తెలుగు భాషను అమలు చెయ్యడంలో జరిగిన విలంబనను ప్రజల దృష్టికి, ప్రభుత్వదృష్టికి తీసుకుని వచ్చింది. ఈ సమీక్షా సంఘం నివేదిక.

ఈ నివేదికలోని సిఫారసులననుసరించి రాష్ట్రంలో (1) ఒక "తెలుగు అకాడమీ", (2) తెలుగు పాఠ్యగ్రంథాల ముద్రణకై ఒక ప్రెస్సూ అవతరించాయి. (3) అనువాదశాఖ డైరక్టరూ (4) పారిభాషిక పదకోశాలూ (5) న్యాయశాఖలో చట్టాలను అనువదించే ఒక కమిటీ (దీనికి మాజీ ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు అధ్యక్షులు)

మొదలయిన సంస్థలో ఆవిర్భవించాయి. సచివాలయంలో ఒక భాషాశాఖ (Official Language cell) ఒక ఉపకార్యదర్శితో ఇటీవలే ఏర్పాటైంది.

## నేటి బాధ్యత

ఇది గతచరిత్ర. ఇక నేటి పరిస్థితి వచ్చే ముందు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి హయాంలో హైదరాబాద్ ప్రభుత్వం చేసిన తెలుగుభాషా ఉత్తర్వులు కూడా గుర్తు చేసుకుందాం. ఆ నాడే తెలుగును అధికారభాషగా వర్తింపచేయడమే గాక, ఆంధ్రేతరులైన తెలుగురాని వారికి సహాయకారిగా ప్రభుత్వసర్వీసులలో తెలుగు నేర్చుకునే పద్ధతిని వారు తెలుగు పరీక్షల్లో ఉత్తీర్ణులయ్యే వరకూ నిర్బంధనియమావళిని పెట్టి గవర్నమెంటు ఉద్యోగులలో ప్రతివారికి విధిగా తెలుగు రావాలని, తెలుగులోనే ఉత్తరప్రత్యుత్తరాలు జరగాలని చేసిన కొన్ని చరిత్రాత్మకమైన ప్రభుత్వపు ఉత్తర్వులు (జి.వో.లు) కొన్ని తెలంగాణలోని తెలుగుభాషాచరిత్రలోనే సువర్ణాక్షరాలుగా నిలిచి పోయాయి. తెలంగాణలోని తెలుగు భాషాభిమానం అట్టిది.

ఇప్పుడు మన ప్రభుత్వం తెలుగును తాలూకా స్థాయి వరకూ అన్ని శాఖల్లోనూ వర్తింపజేయటం, గుమాస్తాలకు, అధికారులకు తెలుగులో శిక్షణ ఇచ్చేందుకు తెలుగు అకాడమీలో ఒక విస్తృతపథకమూ, తెలుగు టైపిస్టులూ, టైపుమిషన్లూ విరివిగా సప్లై కావడం, అన్ని శాఖల అధికారులు సంకోచంవిడిచి తెలుగును అమలుజరపడానికి కావలిసిన ఆదేశాలను ఇవ్వడం జరుగుతున్నది.

## తెలుగు భాషలో పరిపాలన సాధ్యమా?

ఈ నాడు ఈ ప్రశ్నకే తావులేదు. ఎందువల్లనంటే ఆ నాడు అయ్యదేవర కాళేశ్వరరావుగారి నుంచి ఈ నాటి వరకూ అనేక పారిభాషిక నిఘంటువులు, పదకోశాలు వెలువడ్డాయి. పాఠ్యగ్రంథాలు విరివిగా ప్రచారంలోకి వచ్చాయి. తెలుగు మాతృభాష కాని వారందరకూ తక్కువ కాలంలోనే తెలుగును నేర్పే పథకాలనేకం త్వరలోనే ప్రభుత్వం చేపట్టబోతున్నది. అంతేగాక తెలుగు ప్రవేశపెట్టడం మూలంగా పరభాష వల్ల కలుగుతున్న అపోహలు, సందేహాలు నివృత్తి అవుతాయి.

ప్రజలందరు ఒకే భాషలో మాట్లాడుకోవడం ప్రజలు మాట్లాడుకునే భాషలోనే ప్రభుత్వకార్యకలాపాలు కూడా జరగడం–నిజమైన ప్రజాస్వామ్యాన్ని ప్రజలస్థాయిలోకి తీసుకురావడానికి సహాయపడే అతిముఖ్యమైన మెట్టు! అంతే కాదు మనరాష్ట్రంలో

ఏర్పడిన అనేక రాజకీయవిభేదాలకు ఒకే ఒక మాతృభాష అనేది అమృత లాంటి చల్లని తీయని మందు! పరస్పరాభిమానాలు వృద్ధియై, రాష్ట్రం ఐకమత్యంతో బలపడి, ఒక్కటిగా ఆర్థిక పారిశ్రామిక వ్యవసాయరంగాలలో ఇనాళ్ళూ నిలిచిపోయిన పురోగతి తిరిగి సాధించాలనే వుద్దేశ్యంతో మన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారు ఈ 'ఉగాది' నుంచీ పరిపాలనలో తెలుగును అమలు చేస్తామని శాసనసభలో తమ నిశ్చయాలను ప్రకటించారు.

ఇది కేవలం వాగ్దానం మాత్రమే కాకుండా, మంత్రిమండలి సమావేశంలో తెలుగు అధికారభాష విషయమై ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఇందులో గౌరవనీయ మంత్రులు శ్రీ చల్లా సుబ్బారాయుడు, శ్రీ రాజారాం, నేను ఉన్నాము. ప్రభుత్వం పరిపాలనశాఖ డిప్యూటీ కార్యదర్శి శ్రీ వేదవ్యాస్ ఐ.ఎ.ఎస్. ఈ ఉప సంఘానికి కార్యదర్శిగా పనిచేశారు. 5-3-1974 నుంచి మూడు సమావేశాల అనంతరం, ఈ ఉపసంఘం ప్రభుత్వానికి తమ నివేదికను 15 రోజుల్లోగా సమర్పించింది. తర్వాత మంత్రి మండలి ఈ నివేదికను యథాతథంగా ఆమోదించింది.

దీని ఫలితమే ఈ నాడు ఉగాది సందర్భంగా మనం జరుపుకొనే తెలుగుభాషా వారోత్సవాలు ఇలాగ ఆనంద సంవత్సరంలో ప్రారంభమై, ఈ తెలుగుభాషాకార్యక్రమం ద్వారా ప్రభుత్వాన్ని ప్రజలకు సన్నిహిత మయ్యేలాగ చేసి రాష్ట్ర ఏకతను సాధించి అందరికి ఆనందాన్ని పంచి పెట్టగలవని ఆశిస్తున్నాను.

**ఆంధ్రప్రదేశ్-సాంస్కృతిక వ్యవహారాలు**

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత రాష్ట్రంలో సాంస్కృతిక కార్యక్రమాల ప్రోత్సాహానికి, నిర్వహణకు రాష్ట్రప్రభుత్వం వరుసగా మూడు అకాడమీలను స్థాపించింది. 1957లో సాహిత్య అకాడమీ, సంగీత నాటక అకాడమీ, 1961లో లలితకళా అకాడమీ ఏర్పడినాయి. ఈ మూడు అకాడమీలు ఒకే చోట కలిసి పనిచేయడానికి వీలుగా రవీంద్రభారతి ఆవరణలో "కళాభవన్" నిర్మాణం జరిగింది. 1965 నుంచి ఈ మూడు అకాడమీలు అందులోనే పని చేస్తున్నవి. ఈ అకాడమీల పేర్లు కొంత వరకు వాటి కార్యక్రమాలను సూచిస్తున్నవి. 'సాహిత్య అకాడమీ' భాషా-సాహిత్యాలకు సంబంధించి పని చేస్తున్నది. ఇందులో తెలుగుకు ప్రాధాన్యం ఉన్నప్పటికి ఉర్దూ, సంస్కృతం, హిందీ భాషాసాహిత్యాలకు కూడా తగినంతగా ప్రోత్సాహం లభిస్తున్నది. సంగీతం, నృత్యం, నాటకం, చలనచిత్రాలకు సంబంధించినది 'సంగీత నాటక అకాడమీ'

చలనచిత్రాల అభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేకపథకాలు అమలు పరుస్తున్నందున, అకాడమీ ఆ విషయంలో శ్రద్ధ వహించవలసిన అవసరం లేదు. ఇక సంగీతం, నృత్యం, నాటకం ఈ మూడు పరస్పరం సన్నిహితసంబంధమున్న కళలు. అందుచేతనే ఈ మూడు కళలను ఒకే అకాడమీకి అప్పగించటం జరిగింది. కర్ణాటకసంగీతంతో పాటు హిందూస్థానీ సంగీతం, కూచిపూడి నృత్యంతో పాటు, భరతనాట్యం వగైరా నృత్యాలు, తెలుగు నాటక సమాజాలతో పాటు ఇతరభాషల నాటకసమాజాలు ఈ అకాడమీ ప్రోత్సాహాన్ని, సహాయాన్ని పొందుతున్నవి. లలితకళా అకాడమీ చిత్రలేఖనం, విగ్రహశిల్పం మొదలైన కళలకు సంబంధించింది. ఇందులో ప్రస్తుతం చిత్రలేఖనమే ఎక్కువ ప్రోత్సాహం పొందుతున్నది.

గురుదేవుడు రవీంద్రనాథ్ టాగూరు శతజయంతిని పురస్కరించుకొని, వివిధ రాష్ట్రరాజధానులలో జాతీయ నాటకశాలల నిర్మాణం జరిగింది. దానిని పురస్కరించుకొని హైదరాబాదులో రవీంద్రభారతి నిర్మాణం జరిగింది. సంగీత కచేరీలకు, నృత్య, నాటక, ప్రదర్శనాలకు ఎంతో అనువుగా ఉన్న ఈ రవీంద్రభారతి జంటనగరాలకు ఒక వరప్రసాదం వంటిది. ఇందులో సంవత్సరం పొడుగునా ఉపయుక్తమవుతున్నది మన రవీంద్రభారతి ఒక్కటే అనటంలో అతిశయోక్తి లేదు. కాగా అకాడమీల స్థాపనతో, రవీంద్రభారతి నిర్మాణంతో ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరంలో సాంస్కృతిక కార్యకలాపాలకు అధికంగా ప్రోత్సాహం లభించింది. అంతేకాదు ఇతర రాష్ట్రాల నుంచి విదేశాల నుంచి వచ్చే సాంస్కృతికబృందాలను అకాడమీలు ఆహ్వానించి, పరస్పర స్నేహసంబంధాలను పటిష్ఠం చేస్తున్నవి. రవీంద్రభారతి అనాయాసంగా వారి ప్రదర్శనాలను ఏర్పాటుచేయటం జరుగుతున్నది.

మన రాష్ట్రపతి పూజ్యులు శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ గడిచిన సెప్టెంబర్ 8వ అంతర్జాతీయ తెలుగు సంస్థకు శుభోదర్కంగా ప్రారంభోత్సవం జరిపారు. ఆ తరువాత మూడు నాలుగు నెలల్లోనే ఈ సంస్థను క్రమంగా కాలూని, మొట్టమొదట పెద్ద కార్యక్రమంగా ఇప్పుడు ఒక సదస్సును మూడు రోజుల పాటు నిర్వహిస్తున్నది (14-2-1976) మనదేశంలోని తక్కిన రాష్ట్రాలలో తెలుగు వారు ఎక్కడెక్కడ ఉన్నారు. వాళ్ళు నడుపుకుంటున్న విద్యా సాంస్కృతిక సంస్థలు ఏవి, అవి ఎట్లా పని చేస్తున్నాయి, అల్పసంఖ్యాకవర్గాలుగా ఆయా రాష్ట్రాలలో తెలుగువారు పొందుతున్న సాధక బాధకాలు ఏమిటి? మొదలయిన వివరాలను ప్రశ్నావళి ద్వారా సేకరించటానికి సంస్థ పూనుకొంది.

ఆయా రాష్ట్రాలలో నివసిస్తున్న తెలుగువారి సమస్యలు ఏమిటో తెలుసుకొని గదా, మనం ఏ విధమైన సహాయం ఎట్లా చేయవలసింది నిర్ణయించుకోగలం?

దానితోపాటే ఈ ఫిబ్రవరి నెల 14, 15, 16 (1976) తేదీలలో హైదరాబాదులో పబ్లిక్ గార్డెన్స్‌లోని జూబ్లీహాలులో ఇతర రాష్ట్రాలలోని తెలుగువారు, విద్యా సాంస్కృతిక సమస్యలు అనే సదస్సును ఈ సంస్థ ఏర్పాటు చేసింది. పంజాబ్, బెంగాల్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక, తమిళనాడు, గోవా మొదలైన ప్రాంతాల నుంచి సుమారు 40-50 సంస్థల ప్రతినిధులను, 50 మందికి పైగా అక్కడికి ప్రముఖవ్యక్తులను ఈ సదస్సుకు ఆహ్వానించారు.

మూడు రోజుల ఈ సదస్సులో సాహిత్యం, గ్రంథాలయాలు, పాఠ్యగ్రంథాలు, భవననిర్మాణం, వినోదకార్యక్రమాలు, సాంస్కృతికబృందాలు, తెలుగు బోధన అధ్యాపకులు తెలుగు వాచకాలు, పాఠశాలలు మొదలయిన అన్ని అంశాల మీద సమగ్రమయిన చర్చలు జరిపి వారి అవసరాలను అంచనా వేయటం జరుగుతుంది. ఈ సదస్సు ద్వారా వాళ్ల అవసరాలకు అదుకోవటం, అందరం కలిసి ఒక్కటే అన్న ఆత్మీయత దృఢపడతాయనటం నిస్సందేహం.

ఫలితాంశంగా ఒక్కమాట చెప్పుకొనాలి. సంస్థలను భవనాలను నిర్మించటం కంటే జాతీయ హృదయస్పందనను, సదవగాహనను, దీక్షానిరతిని నిర్మించటం గొప్పది. మొదట చెప్పినవాటిని కొందరు వ్యక్తులు, ప్రభుత్వం చేపట్టి నిర్మించవచ్చు. కాని రెండవది మనం అందరమూ, మనలో ప్రతి ఒక్కరూ, చిత్తశుద్ధితో నిర్మించుకోవలసింది. ఆ విషయం గమనించి అందరూ ముందుకు వస్తే మనమందరమూ కలసి ముందంజ వేద్దాం.

# 8. వాడుకభాషగా తెలుగు-సాధకబాధకాలు

తెలుగుభాష ఇంత వరకు ఎక్కువ భాగం సాహితీప్రయోజనాలను మాత్రమే సమర్థంగా నెరవేరుస్తున్నది. అందుకు కావలసిన శబ్దసంపదను, ఆలోచనావిధానాలను పూర్వం సంస్కృతం నుంచి తెలుగు స్వీకరించింది. మధ్యయుగాలలో ముస్లిం పరిపాలన కారణంగా తెలుగు మీద పరిపాలన వ్యవహారాలకు సంబంధించినంత వరకు ఉర్దూ ప్రభావం పడ్డది. అయితే అప్పటి భూస్వామ్యవ్యవస్థలోని సంఘప్రయోజనాలకు, ఇప్పటి ఆధునికసమాజంలోని సంఘావసరాలకు పోలికేలేదు. ప్రభుత్వయంత్రాంగం, న్యాయ పరిపాలనవ్యవస్థ, ప్రజాస్వామిక శాసనసభావ్యవహారాలు రోజురోజుకు విస్తరిస్తున్నవి. అంటే ఆధునిక సమాజావసరాలు, కార్యకలాపాలు పెరిగిపోతున్నవని అర్థం. అందువల్ల మన అవసరాలకు ఆలోచనలకు, అనుగుణంగా మన భాష పెరగవలసి వుంది. మన భాషను మనం అభిమానించడం కన్నా అభివృద్ధి చేసుకోవడమే ఎక్కువ అవసరం. కొత్త మాటలు, సరికొత్త విజ్ఞానవిశేషాలు భాషలో చేరకపోతే అభివృద్ధి సాధ్యంకాదు.

1966లోనే ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు అధికారభాష కావాలని శాసనసభ తీర్మానించింది. అంటే ప్రభుత్వకార్యాలయాలలో, శాసనసభ, నిజానికి న్యాయ పరిపాలనలో కూడా మనం తెలుగులోనే వ్యవహరించాలని తీర్మానించామన్న మాట. ఒక్కసారిగా ఇంగ్లీషు నుంచి తెలుగులోకి మారడంలో చాలా ఇబ్బందు లుంటాయి. కాబట్టి మొదట 1974 నుంచి తాలూకా స్థాయి వరకు 1976 నుంచి జిల్లా స్థాయి వరకు, తరువాత కాలక్రమంలో రాష్ట్రస్థాయి వరకు అన్ని వ్యవహారాలు తెలుగులోనే జరపాలనుకున్నాం. ఒక్కసారే అకస్మాత్తుగా మారాలంటే వచ్చే ఇబ్బందులనేకం. మొదటి సమస్య ప్రభుత్వోద్యోగులందరు తెలుగులో మాట్లాడం వ్రాయడం, చదవడం చేతనై వుండాలి. చారిత్రకకారణాల వల్ల ఆంధ్రప్రదేశ్‌లోని ప్రభుత్వోద్యోగులందరు తెలుగు వచ్చినవారు కారు. రాని వారికి తెలుగు చదవడం, వ్రాయడం నేర్పడానికి శిక్షణ తరగతులు నిర్వహించవలసివుంది. ఉద్యోగవ్యవహారాలు స్తంభించకుండా వుండాలంటే ఆఫీసు సమయం తరువాతనే ఈ పని చేయక తప్పదు. పూర్తి సమయం శిక్షణ ఇవ్వడం వీలుపడదు. కాబట్టి, ఎక్కువ కాలవ్యవధి కావలసి వస్తుంది.

రెండవది అందరికి ఒకే సమయంలో తెలుగు బోధించడానికి చాలినన్ని తరగతులు, కావలసినంత మంది ఉపాధ్యాయులు, కావలసినంత స్థలం ఒకసారి దొరకడం కష్టం. మూడవది ఆఫీసులలోని వ్రాతకోతలన్నీ తెలుగులోనే జరగాలంటే సుశిక్షితులైన టైపిస్టులు, కావలసినన్ని టైప్‌రైటర్లు కావాలి. ఇంతకు ముందున్న ఇంగ్లీషులో టైపింగ్, షార్ట్‌హాండ్ నేర్చిన వారందరికి, ఆ విద్యలు తెలుగులో నేర్చుకోవడానికి, నేర్పడానికి ఒక క్రమపద్ధతిలో ఏర్పాటు జరగాలి. ఒక్క రోజున ఇవన్నీ సమకూడడం, సమకూర్చడం సాధ్యపడదు. అయిదవది ఇంత కాలంగా పరిపాలనలో వాడుతున్న పదాలకు, పదబంధాలకు తెలుగు అనువాదాలు సిద్ధం చేయడమే కాక, వాటిని ఉపయోగించడం కూడా అందరికి అలవాటు కావాలి. ఇందుకు కొంతకాలం పడుతుంది.

ఆధునిక ప్రభుత్వయంత్రాంగంలో వందల వేల సంఖ్యలో ఉద్యోగాలు, విభాగాలు, ఉద్యోగాల కార్యాభారాలు వున్నాయి. వీటన్నిటికి తెలుగు మాటలు వాడుకలో ఉంటే స్వీకరించడం, లేకపోతే సృష్టించడం. అదీ సాధ్యం కాకపోతే ఇతర భాషాపదాలను వాడుకోవడం తప్పనిసరి. ఇది అనుకున్నంత సులభం కాదు. క్షణంలో నెరవేరేది కాదు. ఇందులో చాలా చిక్కులున్నాయి. ఉదాహరణకు-శాసనసభను వాయిదా వేయడానికి సంబంధించిన ఇంగ్లీష్ మాటలు తీసుకోండి - adjournment, adjournment sinedie అనే రెండు మాటలకు న్యాయశాస్త్రరీత్యా వేరు వేరు అర్థాలున్నాయి. శాసనసభను prorogue చేయడం dissolve చేయడం, Suspend చేయడం Suspended animation లో వుంచడం ఒక్కటికాదు. న్యాయశాస్త్రదృష్టిలో ఆయా మాటలకు వేరు వేరు ప్రయోజనాలు వున్నాయి. ఈ అర్థభేదాలన్నిటిని తెలుగులో చూపగలగాలి.

పరిపాలన అంటే కేవలం ప్రభుత్వయంత్రాంగం చేసే రోజువారీ కార్యక్రమం మాత్రమే కాదు. శాసనసభలలో న్యాయస్థానాలలో వాగ్రూపంలోను, లిఖితరూపంలోను జరిగే కార్యకలాపాలన్నీ ఇందులో భాగాలే. దేశం ఈ మూడు ప్రధానవిభాగాలు ఈ శాఖ పనులను సూచించే పదాలు సూక్ష్మ భేదాలను వివరించగలగాలి. ఈ శక్తిని భాషకు తెలుగు భాషకు సంపాదించే మార్గాలు అన్వేషించాలి. ఎందుకంటే పరభాష అయిన ఇంగ్లీష్‌పై శాశ్వతంగా ఈ ప్రయోజనాల కోసం ఆధారపడితే తెలుగు భాష అభివృద్ధి చెందదు. మన భాషకు, మనకు, మన సమాజానికి ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం అస్తిత్వం లోపిస్తాయి. అది జరగరాదు.

ఈ కాలంలో విద్యావిజ్ఞానాలు అపారంగా పెరిగిపోతున్నాయి. ఆధునికదేశాలలో ఆధునికవిజ్ఞానం క్షణక్షణం కొత్త పుంతలు తొక్కి, కొత్త విశేషాలను సాధించి సమాజాన్ని అభివృద్ధికి తెస్తున్నది. మానవశాస్త్రాలు, విజ్ఞానశాస్త్రాలు, సాంకేతికవిద్య మొదలైన అనేకరంగాలలో సొంతభాషను వినియోగిస్తారు. మనమేమో నిన్న మొన్నటి వరకు ఈ రంగాలన్నింటిలో ఇంగ్లీష్ భాష ద్వారానే ప్రయోజనాలు పొందుతుండేవారం. 1961 నుంచి ఆయాశాస్త్రాలను తెలుగులో బోధించడానికి ప్రభుత్వం, విశ్వ విద్యాలయాలు సహకరించి పనిచేస్తాయి. మొదట ఇంటర్మీడియట్ స్థాయి వరకు, తరువాత డిగ్రీ స్థాయి వరకు తెలుగు అకాడమీ పాఠ్యగ్రంథాలను తెలుగులో సిద్ధం చేసింది. అయితే ఆ గ్రంథాలు సమస్త శాస్త్రాలలోను రాలేదు. వచ్చినంతలో ఒక్కొక్క పుస్తకమే తెలుగులో దొరుకుతుంది. రిఫరెన్సు పుస్తకాలు కొన్ని వచ్చినా ఇంకా చాలా రావలసి వుంది.

ఇన్ని సమస్యలను ఆకళించుకొంటే కాని తెలుగు భాషను సర్వతోముఖంగా అభివృద్ధి చేసి ఈ మన సమాజానికి అన్నిరంగాలలో ఉపయోగపడేటట్లు చేయలేము. భాషకున్న ప్రధానప్రయోజనం సమాజసేవ. సమాజానికున్న ప్రధానావసరం భాష ద్వారా తన ప్రయోజనాలను నెరవేర్చుకోవడం. ఈ సందర్భంలో వచ్చే చిక్కులను, వాటిని తొలగించుకొనే మార్గాలను సూచించడం సమాజంలోని మేధావుల, భాషావేత్తల పరిపాలకుల బాధ్యత.

ఈ ఉద్దేశంతో భిన్నరంగాలలోని ప్రముఖులు ఈ సందర్భంలో చర్చించి సూచిస్తే బాగుంటుందని, తెలుగు అకాడమీ 1976 జూన్ 10,11 తేదీలలో ఒక సదస్సు నిర్వహిస్తున్నది. హిందీ భాషను ప్రయోజనాత్మకభాషగా పెంపొందించే విషయంలో కొంత అనుభవం సంపాదించిన కేంద్ర హిందీ సంస్థ వారి సహాయసంపదలు కూడా మనకు లభ్యమవుతున్నాయి. మన రాష్ట్రంలోనే కాక దేశంలోని ఇతర ప్రాంతాలలో భిన్నరంగాలలో పేరు ప్రఖ్యాతులు సంపాదించిన తెలుగువారిని, తదితరులను ఈ సదస్సులో పాల్గొనడానికి ఆహ్వానించాము. మేధావులు, ఉద్యోగులు ఈ సదస్సులో చేసిన సూచనలను ప్రభుత్వం గమనించి, తగిన చర్యలు తీసుకుంటుందని ఆశిస్తాను.

# 9. ప్రపంచ తెలుగు మహాసభలు ఎందుకు?

**రా**బోవు (1975) తెలుగు ఉగాది ప్రపంచ తెలుగు మహాసభలు ఆంధ్రప్రదేశ్ రాజధానిలో జరుపుటకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము చేసిన నిర్ణయము చరిత్రలో ఒక సువర్ణాధ్యాయం సృష్టించగలదు. కనీ వినీ ఎరుగని రీతి ప్రపంచము నలుమూలలనుంచి తెలుగువారు హైదరాబాదు తరలిరాగలరు, కొన్ని వేలమంది ప్రతినిధులతో కొన్ని లక్షల ప్రేక్షకులతో క్రిక్కిరిసి ఈ మహాసభలు రాష్ట్ర చరిత్రలోనే అపూర్వ మనదగిన విధంగా జరగగలవు. అన్ని రంగాలలోని తెలుగు ప్రముఖులు ఈ మహాసభలకు ఆహ్వానింపబడుచున్నారు. సాహిత్య, సాంస్కృతిక, సాంఘిక, విజ్ఞానశాస్త్ర, క్రీడా, పారిశ్రామిక రంగాలలో తరతరాల చరిత్ర, అభివృద్ధి, ఒక నిర్దిష్టస్వరూపంతో తెలుగువారు చూచుటకు ఈ సభల సందర్భంలో అవకాశం కలుగుతుంది.

**తెలుగువారి కీర్తి పతాక**

తెలుగుజాతి ఏ నాటినుంచి ప్రాభవమును పొంది, పురోగమించినదీ, అన్న ప్రశ్నకు పరిశోధన విమర్శకులు పరిశీలించి, దాదాపు 2500 సంవత్సరముల క్రితం నుంచి తెలుగుజాతి క్రమక్రమ పరిణతి పొందినదని పేర్కొన్నారు. శాతవాహనులు, తూర్పు చాళుక్యులు, విజయనగరరాజులు, మొదలగు పరిపాలకులు తెలుగు జాతి ఔన్నత్యమునకు, సాంస్కృతిక అభివృద్ధికి తోడ్పడినారు. సాహితీరంగంలో నన్నెచోడుని కాలం నుంచీ నేటి ఆధునిక కవితాయుగం వరకు ఎన్నో సుప్రసిద్ధమైనవి, సాహితీ పరిణామంలో మైలురాళ్ల వంటివి కనిపించుచున్నవి. సాంస్కృతిక వినోద రంగాలలో ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నటులు, నర్తకులు, నాటకకర్తలు, ఎందరో తెలుగు చరిత్రలో ప్రస్ఫుటం అగుచున్నారు. క్రీడలలో కూడ ప్రసిద్ధికెక్కిన తెలుగువారందులో ఉన్నారు. ప్రపంచ ప్రఖ్యాతి నార్జించిన విజ్ఞానశాస్త్రవేత్తలలో అగ్రస్థానం వహించి పురోగమించు చున్నారు. ఇటీవల జరిగిన అఖిల భారత తెలుగు బాలల ఉత్సవాలు తెలుగుజాతి భవిష్య పౌరుల ప్రతిభాసంపత్తులు తొణికిసలాడించుచున్నవి.

## విదేశాలలో తెలుగువారు

భారతదేశ భాషలలోకెల్ల తెలుగు అతిమధురమైనది. దీనిని "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని ప్రముఖులు ప్రశంసించిరి. భారతీయ భాషలలో మాట్లాడే భాషల దృష్ట్యా తెలుగుకు ద్వితీయ స్థానం ఉన్నది. ప్రపంచంలో వలసపోయిన వారిలో సంఖ్యరీత్యా పరిశీలించినచో తెలుగువారు విదేశాలలో గణనీయమైన సంఖ్యలో నివసిస్తున్నారు. మారిషస్, ఫిజీ, బర్మా, సిలోన్, మలేషియా, సింగపూర్, యూరోపియన్ దేశాలు, అమెరికా, రష్యా, మెక్సికో, యునైటెడ్ కింగ్‌డమ్, ఆఫ్రికా, ఈ దేశములన్నిటిలో కూడా తెలుగువారు వేలసంఖ్యలో నివసిస్తున్నారు. కొన్ని ముఖ్యమైన విదేశాల తెలుగువారు ఆంధ్ర మహాసభలు ఏర్పరచుకొని తెలుగు భాషాసాంస్కృతిక పునరుజ్జీవనానికి తమ ప్రాంతాలలో ప్రయత్నము చేయుచున్నారు. విదేశాలలోని తెలుగు వారికి సమస్యలు ముఖ్యంగా భాష నేర్చుకొనుట, తమ పిల్లలకు తెలుగు సంస్కృతి తెలియజేయుట, తెలుగు దేశంలోని వారితో సన్నిహిత సంబంధములు పెంపొందించుకొనుట. వీటి దృష్ట్యా త్వరలో జరగబోవు ప్రపంచ తెలుగు మహాసభలు కొంత విశిష్టతపొంది కొన్ని నిర్దిష్టమైన పథకముల ద్వారా వారి లక్ష్యశుద్ధికి ప్రయోజనం కలుగగలదు.

## కళాప్రాంగణం - సంస్కృతీదర్పణం

చరిత్రలో ఎందరో మహానుభావులు తెలుగువారు కీర్తి పతాకలు ఎగురవేసి విశిష్టమైన స్థానం పొందియున్నారు. వారందరిని స్మరించుటకు తెలుగుదేశంలో వివిధ ప్రాంతాలలో వారి స్మారకచిహ్నాలు నెలకొల్పుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. సాహిత్య, సాంస్కృతిక, వైజ్ఞానిక, క్రీడారంగములలో వివిధప్రముఖుల వివరాలు సేకరించి "ఎవరెవరు" అనే గ్రంథము గూడా వెలువరించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. తరతరాల తెనుగువారి సర్వతోముఖ అభివృద్ధిని ప్రతిబింబించే విశిష్టమైన ప్రదర్శన ఒకటి ఏర్పాటు అగుచున్నది. తెనుగు వారి ప్రతిభ అన్ని రంగాలలో క్రోడీకరించే సదస్సులు ఏర్పాటు అవుచున్నవి. తెనుగువారికీ, ఇతరభాషలవారికీ ఉన్న సన్నిహిత సాహితీ, సాంస్కృతికసంబంధాలు ప్రతిబింబించడానికి చర్చాగోష్ఠులు ఏర్పాటు అవుతున్నవి. సామాన్య ప్రజానీకము సంతోషముతో ఉప్పొంగి వీనులవిందుగా, కన్నులపండువుగా ఆనందించుటకు వివిధరంగాలలోని ప్రముఖుల ఉపన్యాసములు ఏర్పాటు అగుచున్నవి. తెనుగుజాతి నృత్య, నాటక, కళాప్రతిభాసంపత్తి చాటుటకు ప్రత్యేకమైన వినోద ప్రదర్శనలుకూడా ఏర్పాటు అవుచున్నవి.

భారతదేశంలో వివిధ ముఖ్యపట్టణాలలో ప్రాంతీయ ఉపసంఘాలు ఏర్పాటు చేసి అచటి తెనుగు ప్రముఖుల సహాయంతో ప్రపంచ తెనుగు మహాసభను దిగ్విజయం చేయుటకు సన్నాహాలు జరుగుచున్నాయి. భారతదేశంలో వివిధరాష్ట్రాలలో అనేక ఆంధ్ర మహాసభలు, తెనుగు సంస్థలు కోకొల్లలుగా ఉన్న ఉనికి, ఈ సభల సందర్భంలో ప్రత్యక్షగోచరము కాగలదు. ప్రాంతీయ ఉపసంఘముల ద్వారా వివిధరాష్ట్రాలలోనూ తెనుగుదేశం నలుమూలలా ఈ ప్రపంచ తెనుగు మహాసభల సందర్భంలో సాంస్కృతిక ఉత్సవాలు మూడు రోజులపాటు జరిపించుటకు నిర్ణయమైనది.

**నూతన అధ్యాయం**

ఈ క్రొత్త సంవత్సరము తెలుగువారి ప్రియతమమైన సంక్రాంతి పండుగ ప్రారంభంతో నూతనశోభ సంతరించుకొని తెలుగుజాతికే విరూపాక్ష దర్శనస్థితి కలిగేలా సాహితీ, సాంస్కృతిక నూతనస్వరూపం పొందుచున్నది. ఈ నూతనసంవత్సరం తెలుగుజాతి చరిత్రలో ఒక క్రొత్త అధ్యాయం. ఇటు ప్రభుత్వం, అటు ప్రజలు సమీకరించుకొని సన్నిహితులై ప్రజాస్వామ్యసూత్రాలు ఆధారంగా అనుపమాన ఏకతపొంది, ఒక బ్రహ్మాండమైన ఉత్సవము జరుపు విశిష్టదినాలు ఉగాది నుంచి ప్రారంభమౌతున్నాయి. నిజం పరిశీలిస్తే ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారి ఆధ్వర్యంలో వారి సంపూర్ణ సహకారంతో జరిగే ఈ సభలు, తెనుగుజాతి చరిత్రకే నూతన వన్నెలు తీసుకురాగలవని నా విశ్వాసం. ముఖ్యమంత్రితోబాటు అనేకులైన మంత్రివర్యులు కూడా ఈ మహాసభలో సన్నిహితులై కార్యక్రమాలలో ఉత్కృష్టమైన రీతిలో చైతన్యవంతంగా పనిచేయడం మన అదృష్టం. యువజనులు, విద్యార్థులు, స్త్రీలు, రచయితలు, కళాకారులు, క్రీడాకారులు, విజ్ఞాన శాస్త్రవేత్తలు, బాలల సంఘాలు, ఈ ప్రపంచ తెనుగు మహాసభల ఉద్యమానికి సంపూర్ణసహకారం అందివ్వడం ప్రశంసనీయం. ఈ మహాసభల సందర్భంగా ఎంతో ఖర్చు కాగలదు అన్నది ప్రశ్నకాదు. ఇదే అన్వయం వివిధపథకాల ద్వారా ఒక నిర్దిష్టస్వరూపం పొందగలదు. అందుకే మనందరి ప్రయత్నం. అందరి సహకారం అందిననాడు ఆనందం పరవళ్లు త్రొక్కుతూ రాబోయే తెలుగు ఉగాది పండుగ నవ్యరాగమయమై విరాజిల్లగలదు. ఇట్లా సమైక్య కృషితో, చైతన్యవంతమైన నవ్యయుగానికి నాందిపలకటం కోసమే రాబోయే ప్రథమ ప్రపంచ తెనుగు మహాసభలు.

*(1974)*

## 10. ప్రపంచ తెలుగు మహాసభలు ప్రాధాన్యం - ప్రయోజనము

ప్రపంచ జనాభాలో భారతీయుల సంఖ్య ఆరవవంతు అయితే భారతదేశ జనాభాలో ఆంధ్రుల సంఖ్య పదియవవంతు. మనది ఏకజాతి ప్రజలు నివసించే సువిశాలమైన దేశం. ఆ మాటకువస్తే రష్యా మినహాగా విభిన్నజాతులకు చెందిన ప్రజలు నివసించే దాదాపు మొత్తం ఐరోపాఖండం అంత విశాలమైనది భారతదేశం. ఆంధ్రప్రదేశ్ వైశాల్యంలోనూ, జనాభాలోకూడా ఐరోపా ఖండంలోని కొన్ని పెద్ద రాజ్యాలకంటె పెద్దది. తెలుగు మాట్లాడేవారి సంఖ్య అయిదుకోట్లకు పైచిలుకుగా ఉన్నది. భారతదేశంలో అధికారభాష అయిన ఒక హిందీని మినహాయిస్తే, సంఖ్యాబలంలో తెలుగుదే ప్రథమస్థానం.

భాష అన్నది ఇప్పుడు అభిప్రాయప్రకటనకు ఉపయుక్తం అయ్యే సాధన మాత్రమే కాదు, భారతదేశంలోని ఒక ఉపజాతి గుర్తింపునకు, పరిగణనకు ఇది ఒక చిహ్నం. ఇదే భాషారాష్ట్రాల వ్యవస్థీకరణకు ప్రాతిపదిక సిద్ధాంతం. దేశంలో భావసమైక్యసాధనకు ఇది అత్యంత శక్తిమంతమైన సాధనం. ఆంధ్రప్రదేశ్‌లో నివసించే ప్రజలను మాత్రమే కాక దేశంలో ఇతర ప్రాంతాలలోనూ, ప్రపంచంలో ఇతర దేశాలలోను ఈ భాష మాట్లాడే ప్రజలు అందరినీ కలిపే ఒక అనుసంధానసాధనంగా తెలుగు ఉపయుక్తం అవుతున్నది. ఇలా భాషమూలంగా ఏర్పడిన సంబంధాలను మరింత దృఢతరం చెయ్యడానికే ఈ ప్రపంచ తెలుగు మహాసభలు ఏర్పాటుచేయాలని ఉద్దేశించారు.

తెలుగు అనగానే మన సంస్కృతి, మన జాతి ఔన్నత్యం, మన చరిత్ర అంతా ఒక్కసారి స్ఫురణకు వస్తుంది. ఇది కొన్ని సంప్రదాయాలు, పద్ధతులు, అలవాట్లు, ఆలోచనారీతులు - మొత్తంమీద ఒక విలక్షణమైన, ఒకానొక జీవనవిధానాన్ని ప్రతిబింబిస్తుంది.

ప్రపంచ తెలుగు మహాసభ ఏర్పాటు మూలంగా దేశదేశాలనుంచి వచ్చిన సోదరులంతా ఒకచోట – ఆంధ్రప్రదేశ్ రాజధానీనగరంలో కలుసుకోడానికి అవకాశం కలుగుతుంది. ఇది ఈ మహాసభ మొదటి ప్రయోజనం. ఇటు ఎక్కడో మారిషస్ దీవులనుంచీ, మలేషియానుంచీ వచ్చిన తెలుగువారు అటు కీన్యానుంచీ, దక్షిణ

ఆఫ్రికానుంచీ, వచ్చిన తెలుగువారిని కలుసుకొని పరిచయం కలిగించుకొన వచ్చును. అలాగే దేశంలో దక్షిణప్రాంతాలు – తంజావూరు, మదురై, కోయంబత్తూరుల నుంచి వచ్చిన తెలుగువారు అటు గంజామ్, బర్హంపూర్, బస్తర్, చాందా, మాతుంగ, మరాఠ్వాడా ప్రాంతాల నుంచి వచ్చిన తెలుగువారిని కలుసుకొన వచ్చును. ఇందువల్ల ఇటుదేశంలోనే కాక, అటు ప్రపంచం మొత్తం మీద వివిధదేశాలలోని తెలుగు ప్రజల మధ్య భావసమైక్యం సాధించడానికి ఇందుమూలంగా దోహదం కలుగుతుంది.

ఇక రెండవ ప్రయోజనం – అది సాంస్కృతికపరమైన ప్రయోజనం. తెలుగువారికి అపూర్వమైన అనంతమైన సాంస్కృతికసంపద ఉన్నది. చిత్రలేఖనం, శిల్పం, నృత్యం, నాటకం, సంగీతం, సాహిత్యం, వంటి లలితకళారంగాలలో తెలుగువారు అపారమైన సేవచేశారు. దేశదేశాలకు పరివ్యాప్తమైన అఖండమైన కీర్తిప్రతిష్ఠలు గడించారు. లేపాక్షి దేవాలయాలలోని అందమైన కుడ్యచిత్రాలు, అమరావతి, నాగార్జున కొండలలో అనాది బౌద్ధారామాలలోని అపురూపశిల్పాలు జగద్విఖ్యాతములు అయ్యాయి. వాటికి న్యాయంగా రావలసిన కీర్తి వచ్చింది. కాని వాటిని మరింత గాఢంగా, కళాదృష్టితో నిశితంగా పరిశీలించి రసాస్వాదన చేయవలసిన అవసరం ఉన్నది. ఇతరులకు వాటిని గురించి పూర్వాపరాలు వివరించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ కళాఖండాల పరిశీలన సందర్భంగా ఆంధ్రప్రదేశ్‌లో బౌద్ధమతవ్యాప్తి, విజయనగర సామ్రాజ్య విస్తరణలకు సంబంధించిన చరిత్ర మరింత వివరంగా పునశ్చరణ చేసుకోవలసి ఉన్నది. అలాగే కూచిపూడి నాట్యం, నృత్యరూపకాల వైలక్షణ్యం గురించీ, భరతనాట్యశాస్త్రంలో దీని ప్రాధాన్యం గురించీ మరింత వివరంగా చెప్పుకోవలసి ఉన్నది.

త్యాగరాజు తమిళనాడులో జీవితం గడిపినా, క్షేత్రయ్య, ఆంధ్రదేశం నడిబొడ్డులో జీవించినా వారు ఇద్దరూ 'తెలుగులోనే' గానం చేశారు. వారు అలా తెలుగు భాషా మాధుర్యాన్ని లోకవిదితం చెయ్యడం వల్లనే తెలుగుభాషకు ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అన్న ప్రశస్తి వచ్చింది. పాశ్చాత్యదేశాలలో ఇటాలియన్ భాష ఎంత మధురమైనదో, తూర్పుదేశాలలో తెలుగుభాష అంత మధురమైనది. ఇది అజంతమైన భాష. పదాలలో మార్దవం ఎక్కువ ఉండడం వల్ల ఇతరదేశాలవారు ఈ భాషను ఇంతగా మెచ్చుకొన్నారు. ఇంగ్లీషుభాషకు షేక్స్‌పియరు మహాకవి ఎంతఖ్యాతి తెచ్చారో తెలుగు భాషకు అదేవిధంగా త్యాగరాజు శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలు గడించిపెట్టారు.

సంస్కృత భాషాప్రభావం, సంస్కృతకావ్యాల ప్రభావం ఎంత ఉన్నప్పటికీ, తెలుగు సాహిత్యం అతిప్రాచీనకాలం నుచి నన్నయ్య, తిక్కనాదుల కాలం నుంచి అతి నవీనకాలం

వరకు దాశరథి, నారాయణరెడ్డి వరకు తన ప్రత్యేకతను, తన వ్యక్తిత్వాన్ని నిలువరించు కొన్నది. తెనుగుభాషపై సంస్కృతప్రభావం యావత్తు సాహిత్యాన్ని కమ్మేసుకొన్నా కూడా, తెనుగు ప్రత్యేకత, వైలక్షణ్యం ఏ మాత్రం పోగొట్టుకోలేదు. విభిన్న లక్షణాలు కన్పించినా తెనుగుతనం - తెనుగు నుడికారం చెడలేదు. ఇలాంటి విషయాలన్నీ ఒక్కసారి మళ్ళీ ఆకళింపు చేసుకోడానికి అవగాహన చేసుకోడానికి, ఈ మహాసభ మూలంగా సదవకాశం కలుగుతుంది.

ఇందుకు మంచి ప్రాతిపదిక ఏర్పరిచారు. ప్రపంచ తెనుగు మహాసభలు జరగడానికి కొన్ని వారాల ముందుగా రాష్ట్రంలో ముఖ్యమైన వివిధకేంద్రాలలో కవిసమ్మేళనాలు, నాటకప్రదర్శనలు, కళలకు సంబంధించిన అంశాలపై చర్చలు, గోష్ఠులు, ఇతర కళలకు సంబంధించిన అంశాలపై చర్చలు, గోష్ఠులు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు ఈ ఉద్దేశంతోనే ఏర్పాటు అయ్యాయి.

తెనుగు వారికి ఎంతో ఉత్తమమైన, అపూర్వమైన పూర్వచరిత్ర ఉన్నదనే విషయం జ్ఞాపకం చెయ్యడం కోసం ఈ మహాసభల సందర్భంగా ఆంధ్రుల చారిత్రకవైభవాన్ని గురించి వివరించే ప్రదర్శనలు కూడా ఏర్పాటు చేస్తారు మన పూర్వవైభవానికి కారకులయిన మహాకవుల, యోధుల, చక్రవర్తుల, నాయకుల గౌరవార్థం రాష్ట్రంలో పలుచోట్ల చిహ్నాలు నెలకొల్పుతారు.

ఈ మహాసభల సందర్భంగా విద్యావేత్తలకూ, తెనుగు భాషారంగంలో విజ్ఞాన సముపార్జనకై కృషి చేస్తున్నవారికీ ఆసక్తిదాయకమైన, ప్రయోజనకరమైన కార్యక్రమాలు కూడా నిర్వహిస్తారు. తెనుగు సంవత్సరాదినాడు ఏప్రిల్ 12వ తేదీన ప్రారంభమై వారంరోజులపాటు ఈ మహాసభల సందర్భంగా రోజూ వివిధ అంశాలపై వేరువేరుగా గోష్ఠులు, చర్చలు, గోష్ఠీసమావేశాలు జరుగుతాయి. ప్రపంచంలో వివిధప్రాంతాల నుంచి విచ్చేసే విద్వాంసులు ఒకరి అభిప్రాయాలు ఒకరికి పరస్పరం తెలియజేసుకోడానికి ఇందుమూలంగా మంచి అవకాశం కలుగుతుంది.

ఈ సందర్భంగా నాలుగు ప్రత్యేకసంచికలు - ఒకటి తెనుగులో, రెండవది ఇంగ్లీషులో, మూడోది ఉర్దూలో, నాల్గోది హిందీలో వెలువడతాయి. ఆంధ్రుల జీవితం, సాహిత్యం, చరిత్రలకు సంబంధించి వివిధ అంశాలపై ప్రముఖులు వ్రాసిన చిన్న పుస్తకాలు సుమారు 80 వరకు వెలువరిస్తారు. ఇందులో అధికభాగం తెనుగులో ముద్రిస్తారు. కొన్నింటిని ఇంగ్లీషులో కూడా ప్రచురించటం జరుగుతుంది.

తెనుగు అధ్యయనవ్యవహారాల అంతర్జాతీయ సంస్థ ఒకటి ఏర్పాటు చెయ్యడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. ప్రపంచంలో వివిధ ప్రాంతాల నుంచి వచ్చే పరిశోధకులు తెనుగుభాష విషయంలోనూ, సాహిత్యవిషయంలోనూ గట్టిగా ప్రత్యేకమైన కృషి చెయ్యడానికి ఇందులో అన్ని సౌకర్యాలు కల్పిస్తారు. వారు పరిశోధన జరిపి క్రొత్త విషయాలు కనిపెట్టడానికి అన్నివిధాలా ప్రోత్సాహం కల్పిస్తారు.

ఈ మహాసభ ప్రయోజనం ఒక వారం రోజులపాటు సమావేశాలు జరపడమే కాదు, ఈ మహాసభల ప్రధాన ఉద్దేశాలకు వాటి మూలంగా ప్రచారం లభిస్తుంది. అయితే ఈ మహాసభల అనంతరం కూడా తెనుగు సాంస్కృతికసంవత్సరంగా పరిగణించే వచ్చే సంవత్సరం పొడుగునా కార్యక్రమాలు అప్పుడప్పుడూ జరుగుతూ ఉంటాయి. సాంస్కృతిక సమైక్యం సాధించాలనే పరస్పరం సహకారం అందచేసుకోవాలనే సందేశం ఈ మహాసభకు విచ్చేసే ప్రతినిధుల సహాయంతో ప్రపంచం నలుమూలలకూ వ్యాప్తం చెయ్యడం జరుగుతుంది.

ఈ మహాసభలు అనంతరం ఈ మహాసభలో పాల్గొన్న ప్రతి తెనుగు వారికి తాను తెనుగువాణ్ణి అనే గర్వం కలుగుతుంది. తాను భారతీయుణ్ణి అన్న గర్వంతోపాటు, మంచి విషయపరిజ్ఞానం సంపాదించిన ఉత్తమ తెనుగు బిడ్డగా ఉత్తమ భారతీయుడు అవుతాడు. సత్పురుషుడైన తెలుగు సోదరుడు ఇక్కడ హైదరాబాదులో లేదా అక్కడ హైదల్‌బర్గ్‌లో, ఇక్కడ విజయవాడలో లేదా అక్కడి వాషింగ్టన్‌లో ఎక్కడ ఉన్నా ప్రపంచంలో మంచి పౌరుడుగా పరిగణన పొందుతాడు.

*(1974)*

# 11. ప్రపంచ తెలుగు మహాసభలు - స్వాగతోపన్యాసం

ఇది ఒక పర్వదినం - ఈ ఉగాది తెలుగు సంస్కృతికి యుగాది. తెలుగుజాతి జీవితంలో నవశక నిర్మాణానికి యిదే పునాది. మన సాంఘికపునరుజ్జీవనానికి, సాంస్కృతిక పురోగమనానికి, సర్వతోముఖాభివృద్ధికి కొత్తరస్తాలు తెరిచే అపూర్వ సన్నివేశం నేడే ప్రారంభం అవుతోంది. మున్నెన్నడూ జరగనిది. మున్ముందెన్నడు జరుగునో తెలియనిది - నాటి నుండి నేటివరకూ కనీ విని యెరుగనిది యీ ప్రపంచ తెనుగు మహాసభ! చరిత్రాత్మకమైన యీ మహాసభలకు నేల నాలుగు చెరగుల నుండి విచ్చేసిన సదస్యులకు, సౌహార్ద ప్రతినిధులకు హృదయపూర్వకంగా స్వాగతసుమాంజలి సమర్పిస్తున్నాము.

మన రాష్ట్రం నుండి, వివిధరాష్ట్రాల నుడి, దేశదేశాల నుండి తెనుగుతల్లి ప్రియపుత్రులెందరో విచ్చేసేరు. విద్యాధికులు - సాహిత్యవేత్తలు, ప్రముఖ మేధావులు, ప్రఖ్యాత కళాకారులు, బహుముఖ ప్రజ్ఞావంతులు ఎందరెందరో యీ సభాప్రాంగణంలో సమావేశమయ్యేరు. ఇరుగు పొరుగు రాష్ట్రాల్లో లక్షలాది తెనుగు ప్రజలు మన సాంస్కృతిక వారసత్వాన్ని పరిపోషించుకుంటూ మన జాతీయ సాంస్కృతిక సంపదను సుసంపన్నం చేస్తున్నారు - విదేశాలలో సహితం అసంఖ్యాకంగా నివసిస్తున్న తెనుగు ప్రజల ప్రతినిధులు ఖండఖండాంతర కీర్తిప్రతిష్ఠలను తెనుగుతల్లికి చేకూర్చిపెట్టేరు. అట్టి మహనీయులెందరో! ఆ మహానుభావులందరికీ వందనము లర్పిస్తున్నాను. ఈ మహాసభకు మారిషస్, శ్రీలంక, ఫిజి, ఆఫ్ఘనిస్తాన్, బంగ్లాదేశ్, పశ్చిమజర్మని, సింగపూరు, ఇండోనేషియా, ఫ్రాన్సు, జాంబియా, మలేషియా, దక్షిణ ఆఫ్రికా, అమెరికా, బ్రిటన్, కెనడా, రష్యా మొదలైన దేశాల నుంచి వచ్చిన ప్రతినిధులు, మనదేశంలోని పలు ప్రాంతాలైన కలకత్తా, బొంబాయి, ఢిల్లి, గంజామ్, బరంపురం, బస్తర్, చాందా, తంజావూరు, మదురై, కోయంబత్తూర్, సేలం, కోలార్, బెంగళూరు, మద్రాసునుండి వచ్చిన ప్రతినిధులు ప్రత్యేకంగా ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాల నుంచి వచ్చిన ప్రతినిధులు ఉన్నారు. ఒకే భాష, ఒకే సంస్కృతి కలిగి, ఒకే రక్తం పంచుకొని, ఒకే కర్తవ్యం ముందుంచుకొని తెనుగు ప్రజలంతా ఒకేమాట, ఒకేబాట - అదేపాటగా ముందుకు, మున్ముందుకు పురోగమించగలరని ఆశిద్దాం.

వేదకాలంలో ఐతరేయబ్రాహ్మణంలో ఆవిర్భవించింది ఆంధ్రజాతి– సూత్ర వాఙ్మయంలో–అపస్తంబ, యాజ్ఞవల్క్య, బోధాయనుల స్మృతి సూత్రగ్రంథాలలో ప్రస్తుతించబడిన జాతి మనది. ఇతిహాసకాలంలోనూ, పురాణ యుగంలోను సుప్రసిద్ధి చెందిన జాతిమనది. రెండువేల రెండువందల సంవత్సరాల క్రితమే సువిశాల సామ్రాజ్యాన్ని స్థాపించి, నవశకాన్ని ప్రారంభించిన శాలివాహనులు మన పూర్వీకులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు, తూర్పు చాళుక్యులు, కాకతీయ విజయ నగరరాజన్యులెందరో మన సాంస్కృతిక చరిత్రకు విజయస్తంభాలు ఎత్తినారు; తరతరాలనుండి తెనుగు వెలుగులు దశదిశల వెదజల్లినారు! ఇట్టి మహోజ్జ్వల చారిత్రక వారసత్వ సంపద కలిగిన తెనుగు ప్రజల భావిపురోగతికి సమష్టిగా శపథం తీసుకొనే శుభసమయంలో ఉన్నాం మనం. గత వైభవాన్ని ఘనకీర్తిని గుర్తుంచుకొని, నవచైతన్యంతో, నవ్యోత్తేజంతో, సముజ్జ్వల భవితవ్యాన్ని నిర్మించుకొని ప్రపంచ చరిత్రలో చరిత్రాత్మకమైన పాత్ర తెనుగు ప్రజలు నిర్వహించుటకు ప్రతిన పూనాలి! ఈ మహాసభల పవిత్ర ఆశయం నెరవేరేందుకు తెనుగు జాతి దీక్ష వహించాలి!

మన దేశ జాతీయ స్వాతంత్ర్యసాధన చరిత్రలో తెనుగువారికి ఎన్నో ఉజ్జ్వలమైన ఘట్టాలు ఉన్నాయి. గత చరిత్రలోని అపూర్వమైన వారసత్వం ఉంది. ఆ ఉజ్జ్వలమైన ఘట్టాలను, ఆ వారసత్వాన్ని నేటి యువతరం ఆకళింపు చేసుకొని, ఆలోచించుకొని ప్రకృతి సంపదలన్నింటిని మానవప్రయోజనానికి వినియోగించే అవకాశం కల్పించాలన్న సత్సంకల్పం కూడా ఉది. ఈ విధమైన ఆలోచనలతో ఈ మహాసభలను ఏర్పాటు చేశాం. ఇందుకు తెనుగు భాషను, తెనుగు సంస్కృతిని ప్రాతిపదికగా స్వీకరించాం. తెనుగు ప్రజలలో భావసమైక్యానికి పునాదులు వేయాలనుకున్నాం. ఇందుకు తెనుగువారి శిల్పం, తెనుగువారి నాట్యం, తెనుగువారి సంగీతం, తెనుగువారి సాహిత్యం, తెనుగువారి చిత్రలేఖనం తోడ్పడుతాయి. ఒక్క తెనుగువారికే గాక భారతీయులలో వివిధ ప్రాంతముల వారికీ, ప్రపంచములోని తదితర దేశములవారికి ఇవి తోడ్పడి ప్రసిద్ధిగాంచినవని కూడ మనకందరికి తెలుసు. అంతేకాదు, అమరావతి, నాగార్జున విశ్వవిద్యాలయములలోని విద్య, అమరావతి, నాగార్జునకొండ, రామప్పగుడిలోని అపురూపశిల్పాలు, కూచిపూడి నాట్యం, త్యాగయ్య, క్షేత్రయ్య మొదలైనవారి సంగీతం, తిక్కన, పోతన, నన్నయ్య మొదలైనవారి సాహిత్యసంపద, కృష్ణా, గోదావరి, పెన్న, తుంగభద్ర మొదలైన నదీజలాలలో తెనుగు సంస్కృతికి వన్నెను సమకూర్చుకున్న సంగతి మనందరికి తెలుసు.

గతాన్ని పరామర్శించుకొని, భవిష్యత్తుని ఆశాజనకం చేసుకొని, తెనుగువారి జీవనాన్ని పునరుజ్జీవింపజేయడానికి, ఈ మహాసభలను నిర్వహించుకుంటున్నాం.

భారతదేశంలోని వివిధప్రాంతాలలో హిందీభాషీయులు అత్యధికసంఖ్యలో ఉన్నారు. హిందీని మినహాయిస్తే భారతీయభాషలలో తెనుగువారికే ప్రధానస్థానం వస్తుంది. తెనుగు భాష మాట్లాడేవారి సంఖ్య అయిదు కోట్లకు పైబడి ఉంది. హిందీకి ప్రథమస్థానం, తెనుగుకు ద్వితీయస్థానం ప్రత్యేకించి వుంది. భాషావిషయకంగానే గాక, తెనుగు ప్రాంతమంతా ప్రకృతిసంపద బహుముఖంగా ఉంది. నదీసంపద, భూసంపద, అటవీ సంపద, ఖనిజసంపద, సముద్రసంపద మనకు సహజంగా ఉన్నాయి. ఈ సంపదలన్నింటిని సద్వినియోగం చేసుకోడానికే సమైక్యమైన కృషి జరగాలి. ఈ సమైక్యమైన కృషిని పెంపొందించుకొనడానికి, ఈ విధమైన సమావేశాలను సద్వినియోగం చేసుకొనడానికి ఈ సమావేశానికి వచ్చిన ప్రముఖులయిన విద్యావంతులు, పెద్దలయిన అనుభవజ్ఞులు, విద్యావంతులయిన విజ్ఞులు వివిధ విధములయిన విచారవిధానముల ననుసరించే తెలుగుదేశాన్ని సుసంపన్నం చేయడానికి విషయవిపులీకరణ చేయాలని కోరుతున్నాము.

ఈ మహాసభలు వారం రోజులు జరుపుకొనబోతున్నాం. ఈ వారంరోజుల కార్యక్రమాలలో అందరూ పాల్గొని అన్నివిధాల సహకరించి, ఈ మహాసభలను జయప్రదం చేయాలని కోరుతున్నాను.

ఈ మహాసభలు తెనుగువారి పురోభివృద్ధికి తోడ్పడేలా, అందరూ సహకరిస్తారని ఆశిస్తున్నాను.

మా ఆహ్వానాన్నందుకొని, అత్యంతాసక్తితో, బహుళసంఖ్యలో విచ్చేసి సభలు జయప్రదం కావడానికి తోడ్పడుతున్నందుకు మరోమారు అందరికీ నా హృదయ పూర్వకమైన సుస్వాగతం యిస్తున్నాను.

*(1975)*

# 12. ప్రపంచ తెలుగు మహాసభలు - పర్యావలోకనం

**తె**లుగుజాతి చరిత్రలో మరపురాని మహోజ్జ్వలఘట్టంగా ప్రపంచ తెనుగు మహాసభల మహోత్సవాలు హైదరాబాదులో కాకతీయనగరంలో కడువైభవంగా జయప్రదంగా జరుపుకున్నాం.

తెనుగు ప్రజలమధ్య భావసమైక్యసాధనకు ప్రపంచ తెనుగు మహాసభలు ప్రధానంగా ఉద్దేశించబడ్డాయి. ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలలో వచ్చిన రెండు ఉద్యమాల ఫలితంగా మానసికంగా దెబ్బతిన్న తెనుగు హృదయాలను కదిలించి, పునరుజ్జీవింపజేసి, "మనమంతా తెనుగువారం. అన్నదమ్ములం" అనే భావాన్ని పెంచడానికి ఇవి ఉద్దేశించ బడ్డాయి. భాషా ప్రయుక్తంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన మాట నిజం. కాని భాష ఒక్కటే సమైక్యాన్ని పెంచలేదన్నది అనుభవం మీద రుజువు అయింది. అందువల్ల భాషకు చేదోడుగా సంస్కృతిని రక్షించుకోవడం కూడా అవసరమని భావించాము. సంస్కృతి అన్నప్పుడు కట్టు-బొట్టు -భావవ్యక్తీకరణ పద్ధతులు - ఆహారపు అలవాట్లు - సంగీతం- నాట్యం, నృత్యం, చిత్రకళ, శిల్పకళ వగైరాలు- ప్రజల జీవితంతో పెనవేసుకున్నవన్నీ చేరి ఉంటాయి. ప్రజలను భావరీత్యా సమైక్యపరచగల శక్తి వీటికే ఉంది. అందువల్లనే ప్రపంచ తెనుగు మహాసభలలో సాంస్కృతిక కార్యక్రమాలకు అంతగా ప్రాధాన్యమివ్వడం జరిగింది. కనీ వినీ ఎరుగని ఊరేగింపుతో సహా మహాసభలు జరిగిన ఆ వారం రోజులూ, కనీసం 18 నుండి 20 లక్షల మంది అయినా ప్రజలు వివిధకార్యక్రమాలలో పాల్గొన్నారని అంచనా. ఇన్ని లక్షల మంది ప్రజలను ఆకర్షించిన మహాసభ ఇంతవరకు మన చరిత్రలో జరగలేదంటే అతిశయోక్తి కాబోదు. మహాసభల ప్రధానలక్ష్యం నెవేరిందనడానికి ఇది పెద్ద నిదర్శనం. నిజం చెప్పాలంటే మేము వేసుకున్న అంచనాలన్నింటిని మించిన స్థాయిలో ఈ మహాసభలు జరిగాయి. అందుకు తెనుగు ప్రజలందరికి మా అందరి పక్షాన కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

**సదస్సులు**

మరొక విశేషం - ఈ మహాసభకు ప్రజలు వేల సంఖ్యలో ప్రేక్షకులవలె రావడంతోపాటు, వివిధరంగాలలో గణనీయమైన కృషి చేస్తున్న ఆచార్యులు, కవులు,

రచయితలు, మేధావులు, కళాకారులు, అన్ని ప్రాంతాలవారు, ఎంతో ఉత్సాహంగా ఈ సభలలో పాల్గొన్నారు. నాగార్జున పీఠంలో రోజూ ఉదయం 9 గంటల నుంచి మధ్యాహ్నం 1 గంటవరకు, మధ్యాహ్నం 2 గంటల నుంచి సాయంకాలం 6 గంటల వరకు, అంటే రోజూ ఎనిమిది గంటల చొప్పున సుమారు 60 గంటలసేపు విద్వద్గోష్ఠులు జరిగాయి. 28 అంశాలు సమగ్రంగా చర్చించబడ్డాయి. 108 ప్రసంగ వ్యాసాలు చదవబడ్డాయి. దాదాపు 500 మంది గోష్ఠులలో పాల్గొన్నారు. ఈ గోష్ఠులకు హాజరయిన సదస్యులు కూడా వేల సంఖ్యలో ఉన్నారు. అందులో మహిళలు చాలా హెచ్చుమంది ఉండడం గమనార్హం. ఆ విధంగా వైజ్ఞానికదృష్ట్యా, సాహిత్యపరంగా చూసినా ఇన్ని వేల మంది మేధావులు, విభిన్నరంగాలవారు ఇంత ఉత్సాహంగా గోష్ఠులలో పాల్గొనడాన్నిబట్టి కూడా ఈ మహాసభల లక్ష్యం నెరవేరిందని గట్టిగా చెప్పుకోవచ్చు. రాజకీయాలకు, విభిన్నమైన భావాలకు అతీతమైన సమైక్యశక్తి సంస్కృతికి ఉందని, దాని ద్వారా ప్రజాసమైక్యాన్ని సుస్థిరం చేయవచ్చునని ఈ మహాసభలు సగర్వంగా నిరూపించాయి.

## సాంస్కృతికకార్యక్రమాలు

సాంస్కృతికకార్యక్రమాలలో ఇంకొక విశేషం వుంది. కాకతీయనగర్‌లోని శ్రీకృష్ణ దేవరాయల దర్బారులో ప్రతిరోజూ రాత్రి 7 గంటలు మొదలుకొని తెల్లవారుజామున 4, 5 గంటల వరకు అంటే దాదాపు 10 గంటల సేపు సాంస్కృతికప్రదర్శనలు జరిగాయి. రోజూ 10 నుండి 15 చొప్పున మొత్తం మీద సుమారు 100 ప్రదర్శనలు ఏర్పాటు చేశాము. వీనిలో సుమారు 1500 మంది కళాకారులు పాల్గొన్నారు. తెనుగు ప్రజల జీవితంలో అంతర్భాగంగా ఉన్న హరికథ, బుర్రకథ, తోలుబొమ్మలు, వీధి భాగవతం, యక్షగానం, డప్పుల నృత్యం వగైరాలు ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్నాయి. వాస్తవానికి ఇవన్నీ ప్రజల కళలు; సజీవమైనవి; భావసమైక్యం సాధించేవి. ఇంతపెద్ద ఎత్తున వీనిని ఇలా ప్రదర్శించడం ఇదే ప్రథమం. ఇవి ఎంత సజీవమైనవో, ప్రజలను ఎంతగా ఆకట్టుకోగలవో ఈ మహాసభలు అక్షరాల ధ్రువపరచాయి. అంతేకాదు, భావసమైక్యానికి సంస్కృతి పునాది కాగలదన్న మా ఆశయాన్ని సిద్ధింపజేశాయి.

## తరతరాల తెలుగుజాతి ప్రదర్శన

కాకతీయనగర్‌లో సాంస్కృతికకార్యక్రమాలకు తోడు శాతవాహన నగరంలో సాంస్కృతికకార్యక్రమంలో తరతరాల తెలుగు వెలుగు ప్రదర్శనం కూడా ఏర్పాటు చేశాము. ఇది తెనుగు జాతికి దర్పణం వంటిది. 2,500 సంవత్సరాల తెనుగుజాతి

చరిత్రను కళ్ళకుగట్టినట్లు ఈ ప్రదర్శన చూపింది. ఇది కూడా ప్రజలను విరివిగా ఆకర్షించింది. దీనిని సందర్శించినవారు – మన చరిత్ర ఎంత గొప్పది! మనం ఎంత గొప్పజాతివారము!! ఈ గొప్పతనాన్ని సంరక్షించుకునే బాధ్యత మనది!! అనే భావాలు ముప్పిరిగొనగా, సగర్వంగా కృతనిశ్చయంతో బయటకు వచ్చినారు. వారి మనస్సులలో తెనుగు వెలుగులను గురించి ఈ ప్రదర్శనం ద్వారా పడిన ముద్ర ఏ నాటికీ చెదిరి పోవడం అసంభవం. మహాసభలలో జనసందోహాన్ని చూచి సంబరపడిన తెనుగు హృదయం, ఈ ప్రదర్శనశాలలో పూర్వ చరిత్రను తెలుసుకొని ఉప్పొంగి పోయింది. ఇది వ్యక్తిగతమైన అనుభవంగా, సామూహికమైన చైతన్యంగా హృదయంలో మిగిలిపోతుంది; కొత్త చైతన్యాన్నిస్తుంది; కొత్త ఆలోచనలు తెస్తుంది.

## తెలుగు వెలుగుల సన్మానం

మరొక సంగతి కూడా ఈ సందర్భంలోనే చెప్పుకోవలసి ఉంది. మహాసభలలో సుమారు 250 మంది తెలుగు వెలుగులను సన్మానించాము. రాష్ట్రస్థాయిలోనే కాక, జాతీయ–అంతర్జాతీయ స్థాయిలో ప్రసిద్ధికెక్కిన పెద్దలను గౌరవించుకున్నాము. ఇంతమంది మహనీయులను ఒక్క దఫా చూడడం నిజంగా ఒక అదృష్టం. చరిత్రలో ఇంతమందిని సగర్వంగా గౌరవించుకొనడం తెనుగు ప్రజల అదృష్టం. చరిత్రలో రాజరాజనరేంద్రుడు, శ్రీకృష్ణదేవరాయలు, గోల్కొండ నవాబులు చేసిన సన్మానాలు, సత్కారాలు కథలుగా చదువుకున్నాము. అది రాజరికాల యుగం. ఇది ప్రజల యుగం ప్రజలు మెచ్చిన పెద్దలను, ప్రజల నుంచి ఎన్నికైన ప్రభుత్వం లక్షల మంది సమక్షంలో ఇలా సన్మానించడం ఇంతవరకు జరగలేదన్నది చారిత్రకసత్యం, అలాచేసే అవకాశం తెనుగు ప్రజలు మాకు కలిగించినందుకు వారికి మా ధన్యవాదాలు.

## ఫలితాలు

ఈ మహాసభలు జయప్రదంగా నిర్వహించబడటం వల్ల కొన్ని సత్ఫలితాలు చేకూరాయి. తెలుగుభాష భారతదేశంలో హిందీ తర్వాత ప్రధానమైన జాతీయభాష అనేది దేశానికే కాదు, ప్రపంచమంతటికీ తెలియవచ్చింది. ఇతర రాష్ట్రాలనుంచి విదేశాలనుంచి వచ్చిన ప్రతినిధులు ఈ అంశాన్ని మరింత ధ్రువపరిచారు. ఈ మహాసభలద్వారా వారితో మనకు సన్నిహితమైన సంబంధం ఏర్పడింది. అది వైజ్ఞానికమైనది. సాంస్కృతికమైనది. దీనిని సుస్థిరం చేయడం కోసం అంతర్జాతీయ

తెలుగు సంస్థను నెలకొల్పడానికి, దాని ద్వారా జాతీయ–అంతర్జాతీయ స్థాయిలో తెలుగు సంస్కృతి–భాషల పునరుజ్జీవనానికి ప్రభుత్వం కృషి చేయ సంకల్పించింది. ఈ సంస్థకు మూడు లక్షలు యిప్పుడు కేటాయించి అంతర్జాతీయ విజ్ఞాన సమితి సహాయాన్ని కూడా పొందాలని నిర్ణయించుకున్నది. ఈ అంతర్జాతీయ తెలుగుసంస్థ అవతరణ – మహాసభల తొలి ఫలితంగా ఉదహరించవచ్చు.

అలాగే "తరతరాల తెలుగు వెలుగు" మ్యూజియంను హైదరాబాదు నగరంలో శాశ్వతంగా ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది. దానికి రాజధాని నగరవాసులు సుమారు రెండు లక్షల సేకరించి యిచ్చారు. ప్రభుత్వం కూడా కొంత మొత్తాన్ని దీనికి చేర్చి – ఈ మ్యూజియంను హైదరాబాదు నగరానికి గర్వకారణంగా, తెలుగు ప్రజల వైజ్ఞానిక యాత్రాకేంద్రంగా రూపొందించాలన్న కృతనిశ్చయంతో ఉంది. ఇలా ఈ మ్యూజియం ఏర్పాటుకూడా ఈ మహాసభల రెండవ ఫలితంగా చెప్పుకోవచ్చు.

విదేశాలలోని, ఇతర రాష్ట్రాలలోని తెలుగు ప్రజల సంస్కృతీపరిరక్షణకు ప్రభుత్వం సహాయం చేయవలసిన ఆవశ్యకత ఎంతో ఉన్నదనే సత్య ఈ మహాసభల వల్ల నిరూపితమైంది. ఇందుకోసం సెక్రెటేరియట్ విద్యాశాఖలో ఒక ప్రత్యేకవిభాగం నెలకొల్పబోతున్నట్లు ముఖ్యమంత్రిగారు ప్రకటించటం ముదావహం. ఇందువల్ల ప్రపంచంలోని ప్రపంచంలోని తెలుగువారందరిమధ్య మరింత సన్నిహితసంబంధాలు నెలకొంటాయన్నది తథ్యం. ఇది మహాసభల మూడవ ఫలితంగా పేర్కొనవచ్చు.

ఈ మహాసభల సందర్భంలో తెలుగు, హిందీ, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలో ప్రత్యేక సంచికల ప్రచురణ జరిగింది. సాహిత్యం, భాష, చరిత్ర, సంస్కృతికి సంబంధించిన 60 మోనోగ్రాఫుల ప్రచురణ జరిగింది. ఇంకా 18 ప్రకటితం కావలసి ఉన్నాయి. ఈ మహాసభల సందర్భంలో ప్రచురించిన ఈ సాహిత్యం అంతటినీ ఒకచోట ఉంచి చూస్తే – తెలుగు జాతి సమగ్రచరిత్ర స్పష్టం అవుతుంది. సాహిత్యసంపద యావత్తూ సంక్షిప్త రూపంలో అందుబాటులో ఉంటుంది. ఇలా అందుబాటు కావడమనేది గతంలో జరగలేదు. ఇంత పెద్ద ఎత్తున ప్రచురణ కార్యక్రమం కూడా ఇతఃపూర్వం అమలు జరగలేదు. ఇది నిజంగా గర్వపడదగిన విషయం. అదికూడా మహాసభల ద్వారా సాధించిన ఫలితమని చెప్పక తప్పదు. విదేశాలలోను, ఇతరరాష్ట్రాలలోనూ ఉన్న తెలుగు ప్రజలతో తెలుగుదేశానికి సన్నిహితసంబంధాలు పెరిగాయి. పరస్పర అవగాహనలు జరిగాయి.

## చలనచిత్రం

మహాసభలలో పాల్గొన్నవారు సాంస్కృతికకార్యక్రమాలు చూశారు. విద్వద్గోష్ఠులలో పాల్గొన్నారు. ప్రదర్శనశాలను సందర్శించారు. పుస్తకపఠనం చేశారు. కాని ఇది చూడని వారు అశేషంగా ఉన్నారు. వారందరికీ ఈ మహాసభలను రేఖామాత్రంగానైనా చూపడానికి చక్కని చలనచిత్రం - న్యూస్‌రీల్ తీయించాము. ఇది శాశ్వతమైన దృశ్యకావ్యంగా ఉండిపోతుంది. దీనిని ప్రజలకందరికీ చూపించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. అలాగే దీనిని 16 ఎం.ఎం.లో తీయించి, అన్ని పాఠశాలల, కళాశాలల విద్యార్థులకు ప్రదర్శింపజేయాలని తలపెట్టాము. మహాసభల వైభవాన్నే కాక తరతరాల తెలుగు వెలుగు కూడా విద్యార్థి లోకం, యువతరం తనివితీర చూడగలిగేట్లు చేస్తున్నాము. మహాసభలు జరుగక పోతే - ఇలాంటి కృషి జరిగినా, సమగ్రంగా, అర్థవంతంగా ఫలించే అవకాశం వుండేది కాదు. ఈ మహాసభల వల్ల ఇలాంటి చక్కని అవకాశం లభించింది.

## ఆదాయవ్యయాలు

ఇంతటి సత్ఫలితాలను సాధించి, ఇంతటి సంచలనాన్ని కలిగించిన ఈ మహాసభల నిర్వహణకు ఎంత ఖర్చు అయింది? అనే ప్రశ్న చాలామందికి కుతూహలాన్ని కలిగిస్తుంది. ప్రజల సభలుగా ఇవి జరగాలని ఆది నుంచి భావించినాము. ముఖ్యమంత్రిగారి సూచన మేరకు రు. 25 కట్టిన ప్రతివారిని ప్రతినిధులుగా చేర్చుకొన్నాము. ఈ మహాసభల నిమిత్తంగా వసూలు అయిన మొత్తం 32.85 లక్షలు. ఇందులో రాష్ట్రప్రభుత్వం వారి విరాళం పది లక్షలు, కేంద్రప్రభుత్వం వారి విరాళం ఒక లక్ష. తిరుమల-తిరుపతి దేవస్థానం వారి విరాళం ఒక లక్ష. సిరిపూర్ పేపర్ మిల్స్ వారి విరాళం 80 వేలు. ఆంధ్రపేపర్ మిల్స్ వారి విరాళం ప్రింటింగ్ పేపరు రూపంలో సుమారు 90 వేలు, జంటనగరాల ప్రజల మ్యూజియం కోసం వసూలు చేసి ఇచ్చిన రెండు లక్షలు చేరి ఉన్నాయి. తెలుగు సినీ కళాకారుల ప్రదర్శనల వల్ల వచ్చిన మొత్తం ఆదాయం రు. 13.84 లక్షలు. తక్కినది ప్రకటనల వల్ల, ఇతర విరాళాలవల్ల సమకూరింది.

ఇప్పటికి అయిన ఖర్చు రు. 25.29 లక్షలు. మహాసభల కార్యాలయం నిమిత్తం కొన్న ఫర్నిచరు, యంత్రసామగ్రి విలువ సుమారు ఒక లక్ష. తరతరాల తెలుగు ప్రదర్శనం నిమిత్తం తయారు చేయించిన చిత్రాలు, తైలవర్ణచిత్రాలు. చార్టులు, కట్‌అవుట్‌లు మొదలైనవాటి విలువ సుమారు మూడు లక్షలు. ఈ నాలుగు లక్షల విలువ గలవి శాశ్వతమైనవి. ఫర్నిచరు, యంత్రసామగ్రి "అంతర్జాతీయ తెలుగు సంస్థ"కు, చిత్రాలు

వగైరాలు మ్యూజియంకు ఇవ్వబడుతాయి. ఈ నాలుగు లక్షలు పోగా మిగిలిన ఖర్చు రు. 21.29 లక్షలు. ఇందులో తెలుగు సినీ ఆర్టిస్ట్ అసోసియేషన్ వారికి విరాళంగా ఇచ్చిన మూడు లక్షలు తీసి వేస్తే మిగిలిన ఖర్చు 18 లక్షల చిల్లర, అంటే మహాసభలలో పాల్గొన్న సుమారు 18 లక్షల మందికి వ్యక్తికి ఒక్కొక్క రూపాయి చొప్పున ఖర్చు అయిందన్న మాట.

ఇప్పటికి ఇంకా ఉన్న మిగులు సుమారు ఏడున్నర లక్షల విషయం; ఇంకా చెల్లించవలసిన బకాయిలు సుమారు ఒకటిన్నర లక్షలు ఉంటాయి. రెండు లక్షలు మ్యూజియం కోసం కేటాయించబడుతుంది. మహాసభల నివేదిక సదస్సులలో చదివిన వ్యాసాలు, కొన్ని మోనోగ్రాఫ్‌లు ఇంకా ముద్రించవలసి ఉన్నది. వీటికి సుమారు ఒక లక్షల అవుతుంది. మహాసభల సందర్భంగా విద్యాసంస్కృతి ప్రబోధాత్మకంగా తీయబడిన చలనచిత్రాన్ని రాష్ట్రమంతటా విద్యాలయాలలో ప్రదర్శింపజేయాలని మా సంకల్పం. ఒక్కొక్క కాపీ సుమారు మూడువేలు అవుతుంది. ఒక వంద కాపీలు కొని పంపుతే మూడు లక్షలు అవుతుంది. ఆ యా సంస్థల నుంచి సొమ్ము వసూలు చేసిన తరువాత, ఈ మూడు లక్షలు అంతర్జాతీయ తెలుగు సంస్థకు మూలధనంగా ఇవ్వబడుతుంది.

నిజం చెప్పాలంటే, ఇంత తక్కువ ఖర్చుతో ఇంత పెద్ద ఎత్తున అంతర్జాతీయ మహాసభలు జరగడం గొప్ప విశేషం.

ఈ మహాసభలకు విదేశాల నుండి 108 మంది ప్రతినిధులు, ఇతరరాష్ట్రాల నుంచి 1,200 మంది ప్రతినిధులు, మన రాష్ట్రం నుంచి 5,000 మంది ప్రతినిధులు వచ్చారు. మన రాష్ట్రంలో గతంలో జరిగిన ఏ సభలకుగానీ ఇంత హెచ్చు సంఖ్యలో ప్రతినిధులు, ప్రేక్షకులు హాజరుకాలేదు. ఇందులోనే ఈ మహాసభల ప్రత్యేకత ఉంది. ఈ మహాసభల లక్ష్యాలు ప్రజాహృదయాన్ని చూరగొన్నందువల్లనే ఒక వెల్లువగా ఉత్సాహం ఉప్పొంగింది. పగలు, రాత్రి అనక - వేలు కాదు - లక్షల సంఖ్యలో ప్రజలను ఏకోన్ముఖం చేసినవి. భావసమైక్యాన్ని ఉద్దీపింప జేసినవి. అందువల్లనే ప్రపంచ తెలుగు మహాసభలు ముమ్మూర్తులా ప్రజల సభలు, తెలుగు హృదయాల సభలు అని భావించవలసి వుంది.

తెలుగు చరిత్రలో మరపురాని మహోజ్జ్వలఘట్టంగా నిర్వహించబడిన ఈ మహాసభల వలన ప్రజలలో వచ్చిన చైతన్యోత్సాహాలను సమైక్యతాస్రవంతికి మళ్లించి సహజసంపదలకు ఆలవాలమైన ఆంధ్రప్రదేశ్ ప్రగతికి కృషి చేయడమే మన కర్తవ్యంగా ప్రతిజ్ఞ తీసుకొందాం.

(1975)

# 13. ప్రపంచ తెలుగు మహాసభలు - తెలుగుజాతిపై వాటి ప్రభావం

ప్రపంచంలో ప్రతి దేశానికి, ప్రతి జాతికి తమదంటూ ఒక సంస్కృతి ఒక సంప్రదాయం ఉంటుంది. ఆర్షధర్మబద్ధమయిన, వేదభూమియైన మన భారతదేశ సంస్కృతీ సంప్రదాయాలు ఎంతో ఉన్నతమయినవనీ, ఉత్కృష్టమయినవనీ మన ఇతిహాసాలు చెబుతున్నాయి.

భారతదేశం విభిన్నమయిన భాషాసంస్కృతులసంగమ మయినప్పటికీ పూలలో దారంలా, భిన్నత్వంలో ఏకత్వంలా అన్నింట్లో ఒకే భావన భాసిస్తోంది. అదే భారతీయత. అయినప్పటికీ ఏ రాష్ట్రానికి ఆ రాష్ట్రం, ఏ జాతికి ఆ జాతి తమ సాంస్కృతిక వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూ వస్తున్నాయి.

అదే విధంగా మన ఆంధ్రదేశానికి, ఆంధ్రజాతికి 2,500 సంవత్సరాల చరిత్ర, సంస్కృతులు ఉన్నాయి. వీటిని విశ్వవ్యాప్తంచేసి, ప్రపంచస్థాయిలో ఒక ప్రత్యేకస్థానాన్ని ఏర్పరచుకొనేందుకు చరిత్రలో అనేకులు అనేకవిధాలుగా కృషిచేశారు; కృతకృత్యు లయినారు. నాడు శాతవాహనులు, ఇక్ష్వాకులు, సాలంకాయనులు. విష్ణుకుండినులు, బృహత్ఫలాయనులు, పల్లవులు, చాళుక్యులు, ఆనందగోత్రికులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగరరాజులు వంటి వంశాల వారందరూ, తెనుగు దేశానికి, తెనుగు భాషాసాహిత్యాలకు ఎనలేని సేవచేసి, వాటిని వెలుగులోనికి తెచ్చినారు. నాడు ముక్కచెక్కలుగా ఉన్న తెనుగువారందరినీ ఏకచ్ఛత్రం క్రిందకి తీసుకొనివచ్చి ఏలుబడి సాగించినవాడు కాకతీయ గణపతిదేవుడు. కవులేకాక శ్రీకృష్ణదేవరాయల వంటి రాజకవులు 'దేశభాషలందు తెనుగులెస్స' యని పలికి, తెనుగు సాహితీసంస్కృతులను సుసంపన్నం చేశారు.

ఆధునికయుగంలో భారతదేశానికి స్వాతంత్ర్యం ఏర్పడిన తరువాత భాషా ప్రాతిపదిక మీద రాష్ట్రాలు ఏర్పడినాయి. ఆ విధంగా మళ్ళీ మన తెనుగువారంతా 1956లో ఏకచ్ఛత్రం క్రిందికి చేరి విశాలాంధ్రను సాధించుకోవడం జరిగింది. అంటే రాజకీయంగా తెనుగు వారంతా సన్నిహితులు కావటం జరిగింది. కాని, సుమారు రెండు

శతాబ్దాలపాటు వేర్వేరు పరిపాలనల్లో విభిన్నసంస్కృతుల ప్రభావానికి లోనైన తెనుగువారిలో భావసమైక్యాన్ని సాధించటానికి గట్టి ప్రయత్నం జరుగలేదు. "తెనుగువారం మనమంతా ఒక్కటే" అన్న సమైక్యభావం పెంపొదలేదు. తత్ఫలితంగా క్రమక్రమంగా వేర్పాటు ధోరణులు తలయెత్త సాగాయి. దీనిని ఆసరాగా తీసుకొని కొన్ని సంఘవిద్రోహశక్తులు, రాజకీయ ముఠాలు రాష్ట్రంలోని ప్రజలభావ సమైక్యానికి గొడ్డలి పెట్టులా తయారయ్యాయి. ఫలితంగా తెలంగాణ, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమాలు బయలుదేరాయి. భాషాప్రాతిపదికపై రాష్ట్రపునర్నిర్మాణం జరగాలని ఎలుగెత్తి చాటిన తెనుగువారు దీంతో అపహాస్యానికి గురి అయ్యే పరిస్థితి ఏర్పడింది.

ఒకవైపు ఇది ఇలా ఉండగా, నాడు బ్రిటిష్ వారి పరిపాలనకాలంలో చాలామంది తెలుగువారు ఇతరదేశాలకు, ఇతర రాష్ట్రాలకు వలస వెళ్ళటం జరిగింది. 19 వ శతాబ్ది మధ్యభాగంలో దేశంలో రైలు మార్గాలు పడినప్పటి నుంచి, ఇతరరాష్ట్రాలలోని, ఇతర దేశాలలోని వ్యవసాయానికి, పరిశ్రమల పెంపుదలకు స్వరాష్ట్రం నుంచి, స్వదేశం నుంచి అనేకులు కూలీలుగా, కార్మికులుగా ఇక్కడి నుంచి తరలింపబడ్డారు. అలా వెళ్ళినవారు అక్కడి రబ్బరు తోటల్లో, కాఫీ తోటల్లో, పారిశ్రామికకేంద్రాలలో పనిచేస్తూ తమ జీవనోపాధిని ఏర్పాటు చేసుకొని అక్కడే స్థిరపడిపోవటం జరిగింది; వీరు మళ్ళీ స్వదేశానికి తిరిగి రావటం జరుగలేదు. దాదాపు రెండు శతాబ్దాల కాలం నుంచి తమ స్వభాష, సంస్కృతీ సాహిత్యాలకు దూరంగా ఉన్న వీరిలో, నానాటికీ తమ భాషాసంస్కృతులను, చరిత్ర సాహిత్యాలను పరిరక్షించుకోవాలనే కోరిక బలపడుతూ వచ్చింది. అంతేకాదు, వారు వాటిని మరచిపోకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ వచ్చారుకూడా. కానీ వారిలో స్వరాష్ట్రాన్ని చూడాలి, ఇక్కడి సంస్కృతీసంప్రదాయాలను కళ్ళారా చూచి ఆనందించాలనే తహతహ బాగా కలిగింది.

ఇటు స్వరాష్ట్రంలోని ఆందోళనను శాంతింపజేసి, అటు విదేశాల్లో, రాష్ట్రేతర ప్రాంతాల్లో ఉన్న తెలుగువారి ఆశకు ఒక ఆకృతి ఇచ్చి, భావసమైక్యాన్ని పటిష్ఠం చేసి, భాషాసంస్కృతులను పరిరక్షించుకొనేందుకు, కొందరు మేధావులు మార్గాలను అన్వేషించారు. రాష్ట్రంలోని ప్రజలందరి సమైక్యానికి భాష ఒక్కటే సాధనం కాజాలదని నిరూపణ అయింది. మరి దానికంటె బలవత్తరమైన సాధనం ఏమిటి అన్నప్పుడు సంస్కృతి అని గ్రహించారు కొంతమంది. ఆ సాధనం ద్వారా భావసమైక్యాన్ని సాధించడానికి నాటి ప్రభుత్వం నడుం కట్టింది. దానిని క్రియారూపంలోనికి తెచ్చింది. ఫలితంగా మొట్టమొదటిసారిగా హైదరాబాదులో 1974 ఉగాది నుంచి వారం రోజులపాటు 'అఖిల

భారత తెలుగు సాంస్కృతికోత్సవాలు' జరిగాయి. అపూర్వంగా జరిగిన ఈ ఉత్సవాలు ప్రజలలో నూతనచైతన్యాన్ని కలిగించాయి. అంతే కాదు, విద్యాబోధనతోపాటు పరిపాలనకూడా మాతృభాషలోనే జరిగితే ప్రజలు, ప్రభుత్వం మరింత సన్నిహితమవడానికి ఆస్కారం ఉందన్న సత్యాన్ని గ్రహించినాడు ప్రభుత్వం 1974 ఉగాది నుంచి రాష్ట్రమంతటా తాలూకా స్థాయిలో తెలుగును అధికారభాషగా పరిగణించింది. జిల్లా, రాష్ట్రస్థాయిలో కూడా తెలుగును అధికారభాషగా పరిగణించటం కూడా క్రమంగా జరుగుతుంది.

1974 ఉగాది నుంచి జయప్రదంగా జరిగిన అఖిల భారత తెలుగు సాంస్కృతికోత్సవాల సమయంలో ప్రపంచ తెలుగు మహాసభలు' జరపాలనే ప్రతిపాదన బలపడింది. దీనిద్వారా మనం కేవలం రాష్ట్రంలోని ప్రజల మధ్యనే కాకుండా యావత్ప్రపంచంలోని తెలుగువారికి సన్నిహితమయి, వారి మధ్య సంబంధ బాంధవ్యాలను పటిష్ఠం చేసుకొని, విశ్వవ్యాప్తంగా మన భాషా సంస్కృతులను పరిరక్షించుకొనవచ్చుననే నమ్మకం కలిగింది. దాని ఫలితంగానే 1975లో తెలుగుజాతి చరిత్రలో మరపురాని మహోజ్జ్వలఘట్టంగా మొదటి ప్రపంచ తెలుగు మహాసభల మహోత్సవాలు జరిగాయి. ఇవి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజధాని హైదరాబాదు నగరంలో 1975 ఏప్రిల్ 12 వ తేదీ నుంచి 18వ తేదీ వరకు వైభవోపేతంగా, అత్యంతమూ వేడుకగా నిర్వహింపబడ్డాయి.

ఈ ప్రపంచ తెలుగు మహాసభలు తెలుగు ప్రజల మధ్య భావ సమైక్యతసాధనకు ఉద్దేశింపబడ్డాయి. తెలుగుదేశంలోని రెండు ప్రాంతాల మధ్య వచ్చిన రెండు ఉద్యమాల ఫలితంగా మానసికంగా గాయపడిన ఐదుకోట్ల తెలుగు హృదయాలను కదిలించి, పునరుజ్జీవింపజేసి, 'మనమంతా తెలుగువారం, అన్నదమ్ములం' అనే సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడానికి ఈ మహాసభలు నిర్వహింపబడ్డాయి. ముక్క చెక్కలవుతుందని ఆందోళనపడ్డ ఆంధ్రదేశాన్ని ఒక్కటిగా కలిపే ఒకసూత్రంగా ఈ మహాసభలు జరుపబడ్డాయి.

వారంరోజులు జరిగిన ఈ మహాసభలలో దాదాపు 20 లక్షల మంది తెలుగు ప్రజలు అమితోత్సాహంతో, వెల్లివిరిసిన నవచైతన్యంతో పాల్గొన్నారు. వీరిలో ఆంధ్రదేశంలోనివారు, భారతదేశంలోని ఇతర రాష్ట్రాలలో ఉన్నవారు, విదేశాలలో ఉన్న తెలుగువారందరూ ఉన్నారు. వీరందరిని ఒక వేదికపైకి తీసుకొని వచ్చి, వీరిలో భావసమైక్యాన్ని, సుహృద్భావ సత్సంబంధాలను నెలకొల్పడానికి ప్రయత్నం జరిగింది. ఒక వైపు రాష్ట్రంలోని ప్రజల మధ్య భావసమైక్యసాధన; మరొక వైపు రాష్ట్రేతర ప్రాంతాలలో,

విదేశాలలో ఉన్న తెలుగువారికి తిరిగి వారి మాతృభూమిపై కాలుమోపి, కళ్ళారా ఇక్కడి భాషాసంస్కృతులను చూసుకొనే అవకాశం కల్పించడం – రెండూ సాధించబడ్డాయి.

ఈ మహాసభల సందర్భంగా సుమారు 250 మంది తెలుగు వెలుగులను సన్మానించడం జరిగింది. రాష్ట్రస్థాయిలోనేగాక, జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో విఖ్యాతి పొందిన మేధావులను గౌరవించడం, సమాదరించడం జరిగింది. ఇంత మంది మహనీయులను, మహానుభావులను ఒక వేదికపైకి తీసికొనివచ్చిన ఈ దృశ్యం నాటి రాజరాజనరేంద్రుడు, శ్రీకృష్ణదేవరాయలు, గోల్కొండ నవాబులు చేసిన సన్మానాలను, సత్కారాలను స్ఫురణకు తెచ్చాయి.

ఈ మహాసభలు జయప్రదంగా నిర్వహించబడటం వల్ల కొన్ని సత్ఫలితాలు చేకూరాయని చెప్పవచ్చు. తెలుగుభాష భారతదేశంలో హిందీ తరువాత ప్రధానమైన జాతీయ భాష అనేది దేశానికేకాదు, ప్రపంచమంతటికి తెలియవచ్చింది. ఇతరరాష్ట్రాల నుంచి విదేశాల నుంచి వచ్చిన ప్రతినిధులు ఈ అంశాన్ని మరింత ధ్రువపరిచారు. ఈ మహాసభల ద్వారా వారితో మనకు సన్నిహితమైన సంబంధం ఏర్పడింది. అది వైజ్ఞానికమైనది, సాంస్కృతికమైనది. దీనిని సుస్థిరం చేయడంకోసమే ప్రభుత్వం అంతర్జాతీయ స్థాయిలో తెలుగు సంస్కృతి, భాష, చరిత్రల పునరుజ్జీవనానికి ప్రభుత్వం కృషి చేయ సంకల్పించింది. అదేవిధంగా "తరతరాల తెలుగు వెలుగు" సంగ్రహాలయాన్ని హైదరాబాదు నగరంలో శాశ్వతంగా ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం కృతనిశ్చయమై ఒక నిర్ణయం తీసుకొని, దాని నిర్మాణానికి పునాదులు వేసింది. ఈ మ్యూజియం హైదరాబాదు నగరానికి గర్వకారణంగా, తెలుగు ప్రజల వైజ్ఞానిక యాత్రాకేంద్రంగా రూపొందించాలనే భావం ఈ మహాసభల ఫలితమని చెప్పవచ్చు.

వీటి ప్రభావం ప్రపంచవ్యాప్తమయినదని చెప్పవచ్చు. విదేశాల నుంచి వచ్చిన 108 మంది ప్రతినిధులు, ఇతర రాష్ట్రాల నుంచి వచ్చిన 1,200 మంది ప్రతినిధులు ఈ మహాసభల వైభవాల సస్మృతులను పదిలంగా దాచుకొని, స్వస్థానాలకు తరలి వెళ్ళారు. ఇక్కడ విప్పి చెప్పుకొన్న ఈ స్మృతుల పరిమళాలు అక్కడి వారందరిలో తెలుగు జాతి, తెలుగు దేశం, తెలుగు చరిత్ర భాషాసంస్కృతుల పట్ల అపారమైన ఆదరాభిమానాలను పెంపొందించేందుకు దోహదం చేశాయి. తద్వారా రాష్ట్రంలోని ప్రజల మధ్య భావసమైక్యం చేకూరటమే కాకుండా విశ్వవ్యాప్తంగా తెలుగువారంతా ఒక్కటై తెలుగు సంస్కృతిని దిగ్దిగంతాల చాటుదాం; తెలుగు భాషాచరిత్రల కేతనాన్ని విశ్వగోళంపై నాటుదామనే

ప్రగాఢమయిన వాంఛ బయలుదేరింది. దీని ద్వారా సాంస్కృతికంగా, రాజకీయంగా కూడా ప్రపంచవ్యాప్తంగా సత్సంబంధాలు బలపడే శుభసూచన కనిపించింది.

అందుకే ఈ మహాసభలచే అమితంగా ప్రభావితులయిన విదేశాంధ్రులలో రెండవసారి ఈ మహాసభలను విదేశాల్లో చేయాలనే భావన బలపడింది. అందుకు మలేసియా ఆంధ్ర సంఘం వారు ముదుకువచ్చి తమ ఆహ్వానాన్ని అందించారు. రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మలేసియా రాజధాని కౌలాలంపూర్‌లో జరుపవలెనని, మొదటి ప్రపంచ తెలుగు మహాసభల తుది సమావేశాలలో లాంఛనప్రాయంగా నిర్ణయం తీసుకోవడమయినది. మలేసియా ఆంధ్ర సంఘం వారు ఈ మహాసభలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అంతర్జాతీయ తెలుగు సంస్థల సంపూర్ణ సహకారాన్ని అర్థిస్తూ, తమ దేశంలో ఈ మహాసభలను వైభవంగా జరపడానికి ప్రయత్నిస్తామని తెలిపారు.

ఈ మహాసభల వల్ల దక్షిణ భారత దేశానికీ, ఆగ్నేయాసియా దేశాలకు మధ్య సాహితీ సాంస్కృతిక, రాజకీయసత్సంబంధాలు దృఢతరమయి, తెలుగువారి మధ్య సదవగాహనను, సమైక్యాన్ని నెలకొల్పుకోవటం జరుగుతుందని ఆశిద్దాం –

అందుకు కార్యరూపంగా రెండవ ప్రపంచ తెలుగు మహాసభలను 1977 ఏప్రిల్‌లో అంటే తెలుగు సంవత్సరాదినాడు మలేసియాలో ప్రారంభించాలని మొదట్లో భావించారు. కాని అక్కడి తెలుగువారంతా స్థానికంగా ఒక ఆడిటోరియం నిర్మించుకొంటున్నందున దాని నిర్మాణకార్యక్రమం పూర్తికానందున ఈ మహాసభలను 1978 నాటికి వాయిదా వేశారు. కానీ దురదృష్టవశాత్తు 1977 నవంబరులో తెలుగుదేశాన్ని ఉప్పెన, తుఫాను మహమ్మారిలా కబళించింది. ఈ విషాదసమయంలో ఆనందస్వరాలను పలకలేక, ఈ మహాసభలను 1979కి వాయిదా వేయడం జరిగింది.

ఏవో కారణాలవల్ల రెండుసార్లు వాయిదా వేయబడిన ఈ మహాసభలు, 1979లో ఎలాగైనా జరపాలనే కృతనిశ్చయంతో మలేసియా ఆంధ్ర సంఘం వారు తమ ఏర్పాట్లను ముమ్మరంగా కొనసాగించటం ప్రారంభించారు. ఆదిలో వారు కోరినవిధంగానే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అంతర్జాతీయ తెలుగు సంస్థ నుంచి సహకారాన్ని అర్థించారు. కానీ 1979లో జరపాలన్న వారి కృతనిశ్చయానికి ఇతరుల నుంచి వారికి సరియైన సహాయసహకారాలు సమయానికి అందకపోవడం వల్ల, ఈ మహాసభలు 1980లో జరపాలని భావించారు. కానీ 1980లో జరపడానికి కూడా వారికి సకాలంలో సహాయ సహకారాలు అందలేదనీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు ఈ మహాసభలను జూలై

ప్రాంతాల్లో జరిపించమని సూచించినట్లు తెలియవచ్చింది. కానీ జూలై ప్రాంతంలో అక్కడి మహాసభల నిర్వహణకు సరియైన స్థలం, వేదిక లభించని కారణంగా ఈ మహాసభలు డిసెంబరు ప్రాంతాల్లో జరుపుతామని మలేషియా ఆంధ్ర సంఘం వారు తెలియజేశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు నవంబరులో ఆంధ్రరాష్ట్రావతరణ రజతోత్సవాలు జరిపే ఏర్పాట్లలో ఉన్నందున ఈ మహాసభలను మలేసియాలో ఏప్రిల్ 1981లో జరిపేలా చూడవచ్చును.

ఏది ఏమయినప్పటికీ, మొదటి ప్రపంచ తెలుగు మహాసభల ప్రభావంగా ఈ నాడు రాష్ట్రమంతట భావసమైక్యం, తెలుగు ప్రజలందరి మధ్యన సదవగాహన పటిష్ఠంగా ఉన్నాయని చెప్పవచ్చు; అంతేకాదు ప్రపంచ పరివ్యాప్తంగా కూడా ఈ మహాసభల ప్రభావంచేత తెలుగు సంస్కృతి, భాషాచరిత్రలకు కొత్త జిలుగులు ఏర్పడినాయని నిస్సందేహంగా చెప్పవచ్చు. అయితే వీటిని సదా ఇలాగే పరిరక్షించుకొంటూ రాష్ట్ర పురోగతిని సోపానంగా మలచుకోవలసిన ఆవశ్యకత అటు ప్రభుత్వంపైన, ఇటు ప్రజలపైన ఎంతయినా ఉందని గట్టిగా చెప్పవచ్చు. ప్రజల మనిషిగా పేరొందిన నూతన ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య గారి ఆధ్వర్యంలో, విదేశాలలో మొదటి ప్రపంచ మహాసభలు జయప్రదంగా జరుగగలవని, విదేశాలలో నేడు కూడా తెలుగు కీర్తి పతాకను ఎగురవేయగలమని ఆశించుదాం!

*(1980)*

# 14. రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు - ఆవశ్యకత

ప్రపంచంలోని తెలుగు ప్రజలందరి మధ్య భావసమైక్యసాధనంగా వైభవోపేతంగా 1975లో హైదరాబాదు నగరంలో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి. దేశ విదేశాల నుంచి వేలాది సంఖ్యలో తెలుగువారు ఈ మహాసభలకు ప్రతినిధులుగా విచ్చేసి వీటిని విజయవంతం చేశారు.

ఈ మహాసభల వైభవాన్ని చూసిన మలేషియా ప్రతినిధులు ఉత్తేజితులై రెండవ ప్రపంచ తెలుగు మహాసభలను మలేషియా రాజధాని కౌలా లంపూర్‌లో జరుపగలమని అక్కడికక్కడ ప్రకటించటం తెలుగు వారందరికీ ఎంతో సంతోషకరమైన విషయం.

ఆ తరువాత మలేషియా ఆంధ్ర సంఘం వారు ఆహ్వానసంఘం ఏర్పరచి, ఒక నిర్ణయం తీసుకొని, 1978లో తెలుగు సంవత్సరాది నుంచి అయిదు రోజుల పాటు ఈ రెండవ ప్రపంచ తెలుగు మహాసభలను జరపగలమని తెలియజేశారు.

మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలోనే పరంపరగా ఈ విధమైన మహాసభలను జరపాలని, వీటిని ఒకసారి స్వదేశంలో, ఒకసారి విదేశాలలో జరపాలని ఒక నిర్ణయాన్ని తీసుకోవడం జరిగింది. ఆ మేరకు రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మొదటిసారిగా భారతదేశం వెలుపల మలేషియాలో జరిపేందుకు మలేషియా ఆంధ్ర సంఘం వారు ముందుకు రావడం అందరికీ హర్షదాయకమైంది.

ఈ మహాసభల వల్ల ఆగ్నేయాసియా దేశాలకు, దక్షిణ భారతదేశానికి ముఖ్యంగా తెలుగుదేశానికీ మధ్య సాహితీ సాంస్కృతిక సంబంధాలు దృఢతరమై, తెలుగువారిమధ్య సదవగాహన, సమైక్యం నెలకొంటాయని భావించడమయినది.

మలేషియా ఆంధ్ర సంఘాధ్యక్షులు డాక్టర్ సి. అప్పారావుగారు ఈ మహాసభలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అంతర్జాతీయ తెలుగు సంస్థల సంపూర్ణసహకారాన్ని అర్థించారు. మహాసభలు జరిగే అయిదు రోజులు వచ్చిన ప్రతినిధులకు ఆహ్వానసంఘం వారే ఆతిథ్యం, వసతి ఏర్పాట్లు చేస్తామని తెలియపరిచారు. ప్రతినిధులుగా వారు దాదాపుగా 600 మందిని ఈ మహాసభలకు ఆహ్వానించదలచినట్లు తెలిపారు. వీరిలో స్థానికులు 300

మంది, మిగతా 300 మందిలో 50 మంది ప్రతినిధులు విదేశాల నుంచీ, 250 మంది ప్రతినిధులు భారతదేశం నుంచి రావాలనీ భావించారు. భారతదేశం నుంచి వచ్చిన వారిలో 50 మంది రాష్ట్రేతరప్రాంతాలలో ఉన్నవారు, 200 మంది ఆంధ్రరాష్ట్రం నుంచి వచ్చే ప్రతినిధులుగా వారు ఆదిలో అంచనా వేసుకొన్నారు. కాని ఆంధ్రరాష్ట్రం నుంచి ప్రతినిధులుగా వెళ్ళేందుకు అనేకులు ఉత్సాహంతో ముందుకు రావడం గమనించిన మలేషియా ఆంధ్ర సంఘం వారు, ఆంధ్రరాష్ట్రం నుంచి 300 మంది ప్రతినిధులు రావడానికి అంగీకరించారు.

ఆదిలో అనుకున్నట్లుగా ప్రతిరెండేళ్ళకు ఈ మహాసభలు జరగవలసిన పక్షంలో ఈ రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు 1977లోనే జరగవలసినవి. కాని మలేషియా ఆంధ్ర సంఘం వారు స్థానికంగా ఆంధ్ర భవనం నిర్మాణాన్ని తలపెట్టి, మహాసభల నాటికి పూర్తి చెయ్యాలని అనుకున్నందున ఈ మహాసభలను 1978లో జరపాలని భావించారు. కాని దురదృష్టవశాత్తు ప్రకృతి ప్రకోపించి, ఆంధ్రప్రదేశ్‌లో 1977 నవంబరులో ఏర్పడిన భయంకర తుపాను, ఉప్పెనల మూలంగా ఈ మహాసభలు మరొక్క సంవత్సరంపాటు వాయిదా వేయటం జరిగింది. అంటే 1979 ఏప్రిల్‌లో ఈ మహాసభలు జరపాలనే కృతనిశ్చయంతో మలేషియా ఆంధ్ర సంఘం వారు స్థానికంగా ఏర్పాటు ముమ్మరంగా కొనసాగించారు.

ఈ మహాసభలకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అంతర్జాతీయ తెలుగు సంస్థల సహాయ సహకారాలను కోరుతూ, మలేసియా ఆంధ్ర సంఘం అధ్యక్షులు డాక్టర్ సి. అప్పారావుగారు హైదరాబాదు వచ్చి ప్రభుత్వాధికారులతో, ప్రముఖులతో చర్చలు జరిపారు.

అయితే ఈ మహాసభలు అనుకొన్నట్లుగా 1970 ఏప్రిల్‌లో జరుగలేదు. 1979 జూలై తరువాత మరెప్పుడైనా జరిగేట్లుగా సభలను వాయిదా వేసినట్లయితే తగినంత వ్యవధి లభించి వీటిని వైభవంగా నిర్వహించే వీలు ఉండగలదని రాష్ట్రప్రభుత్వం అభిప్రాయపడింది. అందుమీదట ప్రభుత్వ ఆదేశానుసారం, మహాసభల నిర్వహణలో సహకారపాత్ర వహిస్తున్న అంతర్జాతీయ తెలుగు సంస్థ, ఆ మేరకు మలేషియా ఆంధ్ర సంఘానికి సూచనచేసింది. వారు తమ దేశంలోని వాతావరణాది పరిస్థితుల అనుకూలత్వాన్ని దృష్టిలో ఉంచుకొని, 1980 ఏప్రిల్‌లో జరపడానికి నిర్ణయించి సంస్థకు, రాష్ట్రప్రభుత్వానికి తెలియజేశారు.

మలేషియాలోని తెలుగు ప్రజలు వారి భావనకు ఒక రూపకల్పన చేయడానికి వారు తెలుగు ప్రజల, ప్రభుత్వం సహాయసహకారాలను అర్థిస్తున్నారు. ఈ మహాసభల

నిర్వహణకు ప్రతి తెలుగు పౌరుడు తోడ్పడి వాటిని విజయవంతం చేయడం, తద్వారా తెలుగుతేజాన్ని విదేశాలలో సైతం విస్తరింపజేయడం ఎంతైనా సముచితం.

తెలుగు భాష, తెలుగు జాతి సముజ్జ్వలమైన ప్రాచీనమైన చరిత్ర కలవి. అయినా ప్రత్యేక రాష్ట్రం లేని కారణంగా తెలుగువారికి రాదగిన గుర్తింపు లేదు. దానితోపాటు దురదృష్టవశాత్తు తెలుగువారిలో ఉన్న అనైక్యం తోడైంది. ఈ లోపాలను సరిదిద్ది తెలుగువారికి ఉజ్వలభవిష్యత్తు చేకూర్చటానికి మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు తోడ్పడినవనటంలో సందేహం లేదు. ఇదేవిధంగా ఏ మూడేళ్ళకో, నాలుగేళ్ళకో ఒకసారి ఇటువంటి మహాసభలు విజయవంతంగా జరిపినట్లయితే, తెలుగుభాషాసంస్కృతులను సంఘశక్తిని అభివృద్ధిపరచటానికి ఒక క్రమమార్గం, స్ఫూర్తి ఏర్పడి మేలుజరుగగలదనే భావం ఈ నాడు తెలుగువారందరిలోను ఉన్నది. తెలుగు జాతి యావన్మంది హృదయాల లోను స్పందించే ఈ ఆశయాన్ని, లక్ష్యాన్ని సిద్ధింపజేయటంలో రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మరొక మెట్టు కాగలవు. ఇందువల్ల తెలుగువారందరికి, ముఖ్యంగా మలేషియా ఆంధ్రులకు, ఎనలేని ప్రయోజనాలు సిద్ధించగలవు.

మన ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యగారు కార్యశూరులు. ఇన్నాళ్ళుగా అనుకున్నట్లుగా కౌలా లంపూర్‌లో రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు జరపటాన్ని వారు ఆమోదించి తమ ఆశీస్సులు అందజేశారు. వీరి ఆధ్వర్యంలో, తొలిసారిగా, ఒక విదేశంలో ప్రపంచ తెలుగు మహాసభలు జరుగగలవని ఆశిద్దాం.

తెలుగు తల్లిని స్మరించి భక్తిశ్రద్ధలతో ఈ కార్యక్రమంలో ముందడుగువేసి విజయాన్ని సాధిద్దాం.

*(1960)*

# 15. అంతర్జాతీయ తెలుగు సంస్థ

తెలుగుజాతి చరిత్రలో మరపురాని మహోజ్జ్వలఘట్టంగా ప్రపంచ తెలుగు మహాసభల మహోత్సవాలను హైదరాబాదు కాకతీయనగరంలో వారం రోజుల పాటు కడువేడుకలగా జరుపుకొన్నా తెలుగు ప్రజల మధ్య భావసమైక్యసాధనకు ప్రపంచ తెలుగు మహాసభలు ప్రధానంగా ఉద్దేశింపబడినవి. రాష్ట్రంలో వచ్చిన రెండు ఉద్యమాల ఫలితంగా మానసికంగా దెబ్బతిన్న తెలుగు హృదయాలను కదిలించి పునరుజ్జీవింపజేసి, "మనమంతా తెలుగువారం, అన్నదమ్ములం" అనే భావాన్ని పెంపొందించమే వీటి లక్ష్యం. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన ప్రాతిపదికగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన మాట నిజమే. కాని, భాష ఒక్కటే సమైక్యాన్ని పెంచలేదన్నది అనుభవం మీద రుజువయింది. అందువల్ల భాషకు చేదోడుగా సంస్కృతిని సంరక్షించుకోవడం అవసరమని భావించినాము. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు ప్రజలు, భాషాభిమానులు ఒకే వేదిక కలుసుకొని పరస్పరం సంప్రదింపులు, చర్చలద్వారా సాంస్కృతిక, భాషా విషయిక సంబంధాలను దృఢపరచుకోవడానికి ఈ మహాసభలు అవకాశం కల్పించాయి.

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా హైదరాబాదులోని కాకతీయ నగరం (లాల్ బహదూర్ స్టేడియం) లోని నాగార్జున పీఠమందు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా కమీషన్ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షతన 1975 ఏప్రిల్ 13వ తేదీ ఉదయం జరిగిన సదస్సుల తొలి సమావేశంలో క్రింది తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది. ఈ తీర్మానాన్ని ఇంగ్లండు నుంచి విచ్చేసిన ప్రతినిధి శ్రీ జె.పి.ఎల్. గ్విన్ ప్రతిపాదించగా, అమెరికా నుంచి వచ్చిన ప్రతినిధి ఆచార్య కెల్లీ బలపరచారు.

"తెలుగు సంస్కృతీసాహిత్యాల పఠనపాఠనాదుల పరిశోధనలను, ఇతరరాష్ట్రాలలో, ఇతరదేశాలలో ఉన్న తెలుగువారితో, తెలుగు అభిమానులతో సాంస్కృతిక సంబంధాలను అభివృద్ధి చేసే నిమిత్తం అంతర్జాతీయ తెలుగు సంస్థను ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా నెలకొల్పవలెననీ,

ఈ సంస్థను సక్రమంగా, సమర్థతతో నిర్వహించుటకు ప్రతియేటా తగినంత రికరింగు గ్రాంటు, భవనాలు మొదలగు వాటిని నిర్మించుటకు చాలినంత కాపిటల్ గ్రాంటు మంజూరు చేయవలెననీ,

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరుటకున్నూ**

ఈ అంతర్జాతీయ తెలుగు సంస్థ గ్రంథాలయాభివృద్ధికి, లాంగ్వేజి లాబొరేటరీ స్థాపనకు, పరిశోధన ప్రణాళికలకు, గ్రంథప్రచురణకు, విదేశాలలో పరిశోధకుల విద్యార్థుల వినిమయానికి తగిన ఆర్థికసహాయం చేయవలెననీ-

భారతప్రభుత్వాన్ని, యునెస్కోను అర్థించుటకున్నూ తీర్మానించడమైనది.

మహాసభలలో ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానాన్ని పురస్కరించుకొని సమస్యలను సమగ్రంగా పరిశీలించి, "అంతర్జాతీయ తెలుగు సంస్థ"ను స్థాపించడానికి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయం ప్రకారం అంతర్జాతీయ తెలుగు సంస్థను సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టం క్రింద రిజిస్టరు చేసినాము.

ఈ విధంగా, మహాసభల తొలి ఫలితంగా అంతర్జాతీయ తెలుగు సంస్థ రూపొందింది. దేశవిదేశాలలో ఉన్న తెలుగువారి మధ్య సాంస్కృతికసంబంధాలను పెంపొందించటం, తెలుగు భాష, సాహిత్యం, చరిత్ర, కళలు, సంస్కృతి మొదలైన రంగాలలో జాతీయ, అంతర్జాతీయ సంస్థల, విద్వాంసుల సహకారంతో పరిశోధనలు, అధ్యయనాలు పెంపొందించటం ఈ సంస్థ ప్రధానాశయాలు. పరిశోధనలకు అనువైన వాతావరణం. సదుపాయాలు చేకూర్చి, అవసరమైతే ఉన్నతపరిశోధనలకు తగినట్లుగా వ్యక్తులను సుశిక్షితులను చేసి, పరిశోధనలు కొనసాగిస్తుంది. దేశవిదేశాలలో ఉన్న ప్రవీణుల మధ్య సన్నిహితసంబంధాలు ఏర్పరచి, వారు ప్రతిపాదించే పరిశోధన విషయాలను అందరికీ అందుబాటులోకి తెస్తుంది. ఇంకా ఈ సంస్థ దేశవిదేశాల మధ్య అధ్యయన సాంస్కృతికపర్యటనలను పెంపొందిస్తుంది. సాంస్కృతికసంబంధమైన సమావేశాలను, సదస్సులను, చర్చాగోష్ఠులను, వేసవి పాఠశాలలను నిర్వహిస్తుంది.

ఇంతవరకు వివరించిన కార్యక్రమాలనే కాక దేశవిదేశాలలో ఉన్న తెలుగు వారి మధ్య సాంస్కృతికంగా, భాషావిషయకంగా సంబంధాలను దృఢతరం చేయటానికి అవసరమైన కార్యక్రమాలను, ప్రణాళికలను ఈ సంస్థ చేపడుతుంది. వారి అవసరాలలో కొన్నింటిని పేర్కొనవచ్చు. ఇతరరాష్ట్రాలలో, ఇతరదేశాలలో ఉన్న తెలుగువారి పిల్లలకు తెలుగు బోధించే ఉపాధ్యాయులు కావాలి. చదువుకోడానికి ముద్రితమైన తెలుగు

సాహిత్యం, తెలుగు పత్రికలు, తెలుగులో పాఠ్యగ్రంథాలు వారికి కావాలి. చూచి ఆనందించటానికి తెలుగు సినిమాలు కావాలి. విని తన్మయత్వం చెందటానికి తెలుగు సంగీతం కావాలి. సాంస్కృతికభాషావిషయక సంబంధాలు దృఢతరం చేసుకోవటానికి సాంస్కృతికబృందాల వినిమయం జరగాలి. దేశవిదేశాలలో ఉన్న తెలుగువారి ఈ సాంస్కృతిక అవసరాలను తీర్చడానికి ప్రభుత్వ విద్యాశాఖలో ఒక ప్రత్యేకవిభాగం ఏర్పాటు అయింది. ఈ ప్రత్యేకవిభాగానికి అంతర్జాతీయ తెలుగు సంస్థ సంపూర్ణసహకారాన్ని అందిస్తుంది. ప్రభుత్వం చేపట్టిన కార్యక్రమాల విజయానికి తోడ్పడుతుంది.

ప్రపంచ మహాసభలవల్ల తెలుగుభాష భారతదేశంలో హిందీ తరువాత ప్రధానమైన భాష అనీ, భారతదేశానికే కాక ప్రపంచమంతటికీ వెల్లడించడం జరిగింది. ఇతర రాష్ట్రాలనుంచి, ఇతర దేశాలనుంచి వచ్చిన ప్రతినిధులు ఈ అంశాన్ని మరింత దృఢపరిచారు. తెలుగు మాట్లాడే ప్రజలు ప్రపంచంలో దాదాపు ఆరుకోట్లవరకు ఉన్నారు. అయినప్పటికీ తెలుగునుగూర్చి, తెలుగువారిని గూర్చి, తెలుగువారి సంస్కృతిని గూర్చి ఇతరదేశాలలోనే కాక, ఇతరరాష్ట్రాలలో కూడా అంతగా తెలియదు. ఇట్టి పరిస్థితికి మన ప్రయత్నలోపం కూడా ఒక కారణం కావచ్చు. అంటే మనలనుగూర్చి ఇతరులకు తెలిపే అవకాశం మనం కల్పించలేదు. అందుచేత మన చరిత్ర, సంస్కృతి, సాహిత్యం, మొదలైనవాటిని అయినా హిందీలోకి ముందుగా అనువాదం చేయించి, ప్రచురించవలసిన అవసరం ఎంతో ఉంది. ఇందుకు అంతర్జాతీయ తెలుగు సంస్థ పూనుకొంటుంది.

మాతృభాషలో ఉన్నతవిద్యాబోధన జరుగుతున్న ఈ కాలంలో చక్కని అనువాదాలకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఉభయభాషలలో ప్రవీణులైనవారికి అనువాదపద్ధతులలో సుశిక్షణ అవసరం. అంతేకాదు ఇతరభాషలలో ప్రవీణులైనవారికి తెలుగునేర్పి, వారిని మంచి అనువాదకులుగా తీర్చిదిద్దవలసి ఉంటుంది. అందుచేత అనువాదశాఖకు ఈ సంస్థలో ప్రముఖమైన స్థానం ఉంటుంది. ఇట్లా అనువాదాలు చేయించి, గ్రంథాలు ప్రకటించడానికి చాలా కాలం పడుతుంది. అందుచేత ఒక త్రైమాసపత్రిక ప్రచురణద్వారా తెలుగు సంస్కృతిని గురించి ఇతరులకు చెప్పటానికి ఈ సంస్థ ముందుగా పూనుకొంటుంది.

తెలుగు తెలియనివారు తెలుగు నేర్చుకోడానికి ఇప్పుడున్న అవకాశాలు చాలా తక్కువ. ఉన్న అవకాశాలలో కూడా ఆధునికసౌకర్యాలు అందుబాటులో లేవు. దేశం

నుంచీ, విదేశాలనుంచీ వచ్చే పరిశోధకులకు, విద్వాంసులకు, విద్యార్థులకు ఆధునిక పద్ధతులలో తెలుగు నేర్పడానికి, ఈ అంతర్జాతీయ సంస్థలో ఒక లాంగ్వేజి లాబొరేటరీని నెలకొల్పడం జరుగుతుంది. తెలుగుభాషాధ్యయనం సులభతరం అయినప్పుడు ఈ భాషను నేర్చుకోవడానికి ఇతరభాషలవారు ముందుకు వస్తారు. ఇందువల్ల వివిధ భాషాసాహిత్యాలను గూర్చి, సంస్కృతులను గూర్చి తులనాత్మకమైన అధ్యయనం, పరిశోధనలు సాధ్యపడుతాయి.

తెలుగువారి భాషాసాహిత్యాలను గూర్చి, చరిత్రనుగూర్చి, సంస్కృతిని గూర్చి వివిధ రంగాలలో అధ్యయనం, పరిశోధనలు కొంతవరకు సాగుతున్నవి. కాని జరుగవలసింది ఇంకా ఎంతో ఉంది. ఈ విషయాలపై కృషి చేసే పరిశోధకులకు, సంస్థలకు, విద్వాంసులకు, విద్యార్థులకు సౌకర్యాలు సమకూరే విధంగా ఈ సంస్థను రూపొందించటానికి ప్రయత్నం జరుగుతుంది. ఇందు నిమిత్తం ఈ మాజీ జమీందారుల వద్ద, ప్రభువుల వద్ద మంచి మంచి గ్రంథాలయాలు ఉన్నవి. వీటిని ఈ అంతర్జాతీయ సంస్థకు బహూకరించవలసినదిగా ఈ సందర్భంగా విజ్ఞప్తి చేస్తున్నాను. ఇందువల్ల బహుళ ప్రయోజనకారి అయిన ఒక ఉత్తమకృషికి దోహదం చేసినవారు అవుతారు.

ఈ సంస్థ చేపట్టిన ప్రణాళికలను విజయవంతం చేయటంలో సాహితీవేత్తలు, కళాకారులు, సహృదయులందరూ సంపూర్ణమైన సహాయసహకారాలు అందించగలరని విశ్వసిస్తున్నాను. ఇట్లాగే కేంద్రప్రభుత్వం, యునెస్కో వంటి అంతర్జాతీయ సమితులు ఈ సంస్థను గుర్తించి పుష్కలంగా ఆర్థికసహాయం చేయగలవని నమ్ముతున్నాను.

ఆంధ్రప్రదేశ్‌లో అంతర్జాతీయ తెలుగు సంస్థ ఒక అపూర్వసంస్థ. పూజ్య రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్‌గారు సెప్టెంబరు 8వ తేదీన ఈ సంస్థకు ప్రారంభోత్సవం చేయటం అదృష్టంగా భావిస్తున్నాను. వారి ఆశీస్సులవల్ల ఈ అంతర్జాతీయసంస్థ అన్వర్థమైన సంస్థగా రూపొందగలదని విశ్వసిస్తున్నాను.

*(1975)*

# 16. తరతరాల తెలుగుజాతి

తెలుగు వారికి 2,500 సంవత్సరాలకు మించిన సుదీర్ఘ చరిత్రవున్నది. క్రీ.పూ. 800 ప్రాంతంనాటి ఐతరేయబ్రాహ్మణంలో ఆంధ్రులను గురించి తొలి ప్రస్తావన కానవస్తుంది. మౌర్యసామ్రాజ్యం క్షీణించిన పిమ్మట అధికారం హస్తగతం చేసుకొన్న శాతవాహన రాజవంశీయులు, తెలుగువారి విశిష్టచరిత్రకు నాంది పలికారు. సుప్రసిద్ధ చరిత్రకారుడు మెగస్తనీస్ తన రచనలో ఆంధ్రులను గురించి వివరిస్తూ, దక్షిణాపథం ఆగ్నేయభాగంలో రాజ్యాధికారం వహించిన వారుగా పేర్కొన్నాడు. రెండవ శాతకర్ణి తన అధికారాన్ని విస్తరింపజేసి మాళ్వ కళింగులను ఓడించాడు. క్రీ.పూ. 28 ప్రాంతంలో శాతవాహన చక్రవర్తి మొదటి పులమావి కాణ్వులను జయించి మగధను స్వాధీన పరచుకొన్నాడు. శాతవాహనుల ఏలుబడిలో వారి సామ్రాజ్యమంతటా పరిపూర్ణ స్వాతంత్ర్యం, శాంతిసౌభాగ్యాలు విలసిల్లాయి. కళలకు, సాహిత్యానికి విశేష ఆదరణ లభించింది. శాతవాహన సామ్రాజ్యం పతనమయ్యాక ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు, తూర్పు చాళుక్యులు పాలకులయ్యారు. తూర్పుచాళుక్య మహీపతి రాజరాజనరేంద్రుని కాలంలో, నన్నయ కవీంద్రుని ద్వారా ఆంధ్రమహా భారత కావ్యావతరణ జరిగింది.

క్రీ.శ. 13వ శతాబ్ది కాకతీయ సామ్రాజ్యం వర్ధిల్లిన మహోజ్జ్వలఘట్టాన్ని దర్శించింది. కాకతి గణపతిదేవ చక్రవర్తి కాలంలో తెలుగుజాతి యావత్తూ ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందికి వచ్చింది. 14వ శతాబ్దిలో పరిపాలన సాగించిన కొండవీటి రెడ్డిరాజులు. రేచర్లనాయక ప్రభువులు, విజయనగర చక్రవర్తులు తెలుగు భాషా సాహిత్యాలను, లలితకళలను ఆదరించి పోషించారు. ఈ రాజులలో స్వయంగా పండితులైన వారున్నారు. సాహిత్య సమరాంగణ సార్వభౌముడుగా వినుతికెక్కిన శ్రీకృష్ణదేవరాయలు సంస్కృతాంధ్రభాష లందు గొప్ప పండితుడు, కవి, కళాపోషకుడు.

16వ శతాబ్దిలో గోల్కొండ నేలిన కుతుబ్‌షాహీ వంశ మూలపురుషుడు కులీకుతుబ్‌షా కాలంలో తెలుగువారు తిరిగి ఏకైకపాలన క్రిందికి వచ్చారు. బ్రిటిషువారి

హయాములో తెలుగువారు వేర్వేరు పాలనాధికారాల క్రింద విభజితమయ్యారు. రాష్ట్రపునర్వ్యవస్థీకరణ ఫలితంగా తెలుగు మాట్లాడే ప్రజలందరూ మరల ఒకే సమైక్య పాలనావధిలోనికి రాగలిగారు. ఆంధ్ర రాష్ట్రనిర్మాణం కోసం ప్రాణత్యాగం చేసిన అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగువారి నందరిని ఏక రాష్ట్రపరిధిలోనికి తెచ్చేందుకు కారణభూతులయ్యారు.

ఆర్థిక, తదితరకారణాలను పురస్కరించుకొని తెలుగువారు ఆయా కాలాలందు ఇతరదేశాలకు తరలివెళ్ళటం తటస్థించింది. ఈనాడు మలేషియా, బర్మా, శ్రీలంక, మారిషస్ మొదలైన తూర్పుదేశాలలోను, యూరపు దేశాలలోను తెలుగువారు అనేకమంది నివసిస్తున్నారు. తెలుగువారు ఆయాదేశాలలోని జీవనవిధానాలను, సంప్రదాయాలను అలవరచుకొన్నప్పటికీ తమ ప్రత్యేకవ్యక్తిత్వాన్ని, సాంస్కృతిక వేదిక కావాలని చిరకాలంగా కలలు కంటున్నారు. ముఖ్యమంత్రి శ్రీజలగం వెంగళరావుగారు ఈ స్వప్నాలను ఫలింపజేశారు. 1975 ఏప్రిల్ 12వ తేదీ తెలుగు ఉగాదినాడు ప్రారంభమై వారం రోజులపాటు జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో, తెలుగువారి చరిత్ర, భాష, సాహిత్యం, సంస్కృతి మొదలైన అన్ని అంశాలను వివరించే ప్రదర్శన ఒకటి ఏర్పాటు అయినది. 'తరతరాల తెలుగుజాతి' అనే పేరుతో ఏర్పాటైన ఈ ప్రదర్శనను వేలాది ప్రజలు తిలకించారు. తెలుగు మాట్లాడే ప్రజలందరిలో ఈ ప్రదర్శన ఏకతాభావాన్ని వర్ధిల్లజేసింది. ఈ ప్రదర్శనను చూచి తమతమ వ్యక్తిగత విభేదాలకు వారు స్వస్తిచెప్పారు. వారిలో సాన్నిహిత్యం పెంపొందింది. తత్ఫలితంగా భావసమైక్యం ఏర్పడింది. అందుచేత శాశ్వతప్రాతిపదికపై ఒక మ్యూజియం నెలకొల్పడం సముచితంగా వుంటుందని భావించడం జరిగింది. చిన్నదిగా ప్రారంభమై ఈ మ్యూజియం ప్రాచీన కాలంనుంచి వస్తున్న తెలుగువారి సాంఘిక, సాంస్కృతిక జీవనస్రవంతి దర్పణంగా పరిఢవిల్లగలదు. ప్రపంచ తెలుగు మహాసభలకోసం సేకరించిన వస్తుసముదాయాన్ని ఈ మ్యూజియంలో భద్రపరచడం జరుగుతుంది. విద్యా,చారిత్రకప్రయోజనాల నిమిత్తం ఇది అంతర్జాతీయ మ్యూజియంగా వుంటుంది. పబ్లిక్ గార్డెన్స్‌లో గల సరూబాగ్‌లో ఈ మ్యూజియం భవనానికి భారత రాష్ట్రపతి శంకుస్థాపన జరిపేందుకు దయతో అంగీకరించడం మన అదృష్టం. కళాభిమానులైన జంటనగరాల పౌరులు ఈ మ్యూజియంకోసం 5 లక్షలరూపాయలు విరాళంగా ఇచ్చారు. తెలుగువారిలో భావసమైక్యాన్ని పటిష్ఠంచేసే వుద్దేశంతో చైతన్యమూర్తి మన ముఖ్యమంత్రి దీనికోసం 5 లక్షల రూపాయలు మంజూరుచేసేందుకు వాగ్దానం

చేశారు. మ్యూజియం నిర్మించదలచిన స్థలాన్ని రాష్ట్రప్రభుత్వం ఉచితంగా ఇస్తున్నది. భారత రాష్ట్రపతి శంకుస్థాపనోత్సవం జరుపుతున్న ఈ మ్యూజియం, దేశంలో ఉత్తమ సాంస్కృతిక వస్తుప్రదర్శనశాలలో ఒకటిగా విరాజిల్లగలదు. దీనిని ఇట్టి ఆదర్శసంస్థగా తీర్చిదిద్దేందుకు అవిరళకృషిచేసే కార్యకర్తలు మన కున్నారు. అందుచేత 'తరతరాల తెలుగుజాతి' అనే పేరుతో నెలకొల్పుతున్న ఈ మ్యూజియం అగ్రశ్రేణికి చెందిన అంతర్జాతీయ వస్తుప్రదర్శనశాలగా రూపొందగలదని నా దృఢవిశ్వాసం, తెలుగు ప్రజలు తమ గతవైభవాన్ని దర్శించి, తెలుగుజాతి సాంస్కృతిక వారసత్వసంపదలో నిబిడమైవున్న ఉదాత్తగుణాలను అలవరచుకొనేందుకు ఈ మ్యూజియం తోడ్పడగలదు.

*(1978)*

# 17. తెలుగుజాతి - సమైక్యం

**2**,500 సంవత్సరాల మహోజ్జ్వలచరిత్రగల తెలుగుజాతి విభిన్నప్రాంతాలుగా విడిపోవటం, మరల అనేకవిధాలుగా సమైక్యం కావటం జరుగుతూ వచ్చింది. ఆంధ్ర శాతవాహన రాజులకాలం నుంచీ తెలుగువారి పరిపాలన చరిత్ర మనకు తెలియ వస్తూంది. సుమారు నాలుగు శతాబ్దాలపాటు దక్షిణ హిందూదేశంలో ఆంధ్ర శాతవాహన రాజుల పరిపాలన అవిచ్ఛిన్నంగా సాగింది. విదేశీదండయాత్రలతో, అంతఃకలహాలతో ఉత్తర హిందూదేశం సతమతమవుతూ ఉంటే, శాతవాహన రాజుల పరిపాలనలో దక్షిణ హిందూదేశం శాంతిసౌఖ్యాలను అనుభవిస్తూ, పాడిపంటలతో సుభిక్షంగా ఉండేది. తెలుగువారి నందరినీ తొలిసారిగా ఏకచ్ఛత్రం క్రిందికి తీసుకొని వచ్చిన ఘనత శాతవాహనులకు దక్కుతుంది. అంతేకాదు ఆంధ్రశాతవాహన చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణి, తన ప్రతిభాప్రాభవాలతో శాతవాహన సామ్రాజ్యాన్ని ఉత్తరాన గంగానది నుంచి, దక్షిణాన కన్యాకుమారి వరకు విస్తరింపజేశాడు. కాని, తరువాతి కాలంలో తెలుగుదేశాన్ని పరిపాలించిన వారు శాతకర్ణివంటి ప్రతిభాప్రాభవాలు కలవారు కాకపోవటంచేత, శాతవాహన సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది. తెలుగువారు అనేక ప్రాంతాలుగా చీలిపోయినారు.

తెలుగువారి నందరినీ మరల ఏకచ్ఛత్రం క్రిందికి తీసుకొని రావలెనని ప్రయత్నించి కృతకృత్యుడైనవాడు, కాకతీయ గణపతిదేవ చక్రవర్తి, తెలంగాణంలోని ఓరుగల్లు రాజధానిగా 60 సంవత్సరాలకు పైగా గణపతిదేవుడు సమర్థతతో పరిపాలన సాగించినాడు. కృష్ణామండలంలోని దివిసీమ ఆడపడుచులను వివాహం చేసుకొని, రెండు మండలాలకు రాజకీయంగానే కాక సాంఘికంగా కూడా సాన్నిహిత్యం చేకూర్చిన తొలి చక్రవర్తి గణపతిదేవుడనటంలో సందేహం లేదు.

గణపతిదేవుని అనంతరం తెలుగువారు మరల వేర్వేరు పరిపాలనల క్రిందికి వచ్చారు. సమైక్యం మరల విచ్ఛిన్నమై పోయింది. అయితే కుతుబ్‌షాహీల పరిపాలనలో తెలుగువారినందరినీ ఏకపరిపాలన క్రిందికి తీసుకొని రావలెనని మరల జరిగిన

ప్రయత్నం సఫలమైంది. నేడు ఆంధ్రప్రదేశ్‌గా ఉన్న ప్రాంతమంతా ఆ నాడు కుతుబ్‌షాహీల పరిపాలన క్రింద ఉండేదని చెప్పవచ్చు. ఈ కుతుబ్‌షాహీ పరిపాలకులు తెలుగు భాషా సాహిత్యాలకు ఎనలేని ప్రోత్సాహం కూడా ఇచ్చారు. కాని అసఫ్‌జాహీల పరిపాలనలో మొదట సర్కారు జిల్లాలు, తరువాత రాయలసీమ జిల్లాలు, తూర్పు ఇండియా కంపెనీలకి దత్తం కావటంతో తెలుగువారు పూర్తిగా చీలిపోవటం సంభవించింది. ఇంతటితో తెలుగువారి భావసమైక్యం పూర్తిగా దెబ్బతిన్నదనటంలో సందేహం లేదు.

నైజాము పరిపాలనలో తెలంగాణంలో తెలుగు భాషాసాహిత్యాలకు, తెలుగువారికీ విలువలేకుండా పోయింది. అసలు తెలుగుతనమే నివురు గప్పిన నిప్పులా కాంతివిహీనమై పోయింది. ఇంక ఆంగ్లేయుల పరిపాలనలో సర్కారు జిల్లాల, రాయలసీమ జిల్లాల అభివృద్ధి కుంటుపడింది. అంతేకాదు, రాయలసీమ – సర్కారు జిల్లాల తెలుగువారిలో భేదాభిప్రాయాలు పొడసూపినవి. తెలుగువారికి ప్రత్యేకంగా ఆంధ్రవిశ్వవిద్యాలయం ఏర్పడినప్పుడు, రాయలసీమ వారు మద్రాసు విశ్వవిద్యాలయానికే అనుబంధంగా ఉండటానికి నిశ్చయించుకొన్నారు. 'విభజించి పాలించు' సూత్రాన్ని అమలుపరచటంలో ఆంగ్లేయులు కృత్యకృత్యులైనారు.

ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడితేనే కాని తెలుగుజాతి సమైక్యం సాధ్యం కాదని గ్రహించిన పెద్దలు, భాష ప్రాతిపదికగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రంకోసం 1913 నుంచీ ఆందోళన జరుపుతూ వచ్చారు. చివరికి, అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆత్మాహుతి ఫలంగా, 1953లో ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడింది. భాష ప్రాతిపదికగా తెలుగువారు జరిపిన ఆందోళన ఇతరభాషలవారిని కూడా ఆకర్షించింది. వారి ఆందోళన ఫలితంగా భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడి, 1956లో నేటి 'ఆంధ్రప్రదేశ్' అవతరించింది. చీలిపోయిన తెలుగువారు అంతా మరల ఏకపాలన క్రిందికి వచ్చారు. అంటే రాజకీయంగా తెలుగువారు అంతా సన్నిహితులవటం జరిగింది. కాని, సుమారు రెండు శతాబ్దాలపాటు వేర్వేరు పరిపాలనలో విభిన్న సంస్కృతుల ప్రభావానికి లోనైన తెలుగువారిలో భావసమైక్యాన్ని సాధించటానికి గట్టి ప్రయత్నం జరుగలేదు. 'తెలుగువారం మనమంతా ఒక్కటే' అన్న సమైక్యభావం పెంపొందలేదు. ఫలితంగా వేర్పాటు భావం వేరులు తన్ని సాగింది. ఫలితంగా ఆంధ్ర తెలంగాణలు విడిపోవాలంటూ రెండు ఆందోళనలు సాగాయి. భాషలు ప్రాతిపదికగా రాష్ట్రాల పునర్నిర్మాణానికి దారిచూపిన తెలుగువారు అపహాస్యం పాలు అయ్యే పరిస్థితులు దాపురించాయి.

కాగా, రాష్ట్రంలోని ప్రజలందరి సమైక్యానికి భాష ఒక్కటే సాధనం కాజాలదని నిరూపణ అయింది. మరి దానికంటె బలవత్తరమైన సాధనం ఏమిటి? అన్నప్పుడు 'సంస్కృతి' అని పెద్దలు గ్రహించారు. సంస్కృతి ద్వారానే భావసమైక్యం సాధ్యమని గ్రహించిన శ్రీ వెంగళరావుగారి ప్రభుత్వం, అధికారంలోకి వచ్చిన నాలుగునెలలో "అఖిల భారత తెలుగు సాంస్కృతికోత్సవాలు" హైదరాబాదులో 1974 ఉగాది నుంచి వారం రోజుల పాటు జరిపించింది. అపూర్వంగా జరిగిన ఈ ఉత్సవాలు ప్రజలలో ఒక నూత్న చైతన్యాన్ని కలిగించాయనటం నిస్సందేహం. అంతేకాదు విద్యాబోధనలతోపాటు పరిపాలన కూడా మాతృభాషలోనే జరిగితే ప్రజలు, ప్రభుత్వం మరింత సన్నిహిత మవడానికి అవకాశం ఉన్నదన్న సత్యాన్ని గుర్తించిన శ్రీ వెంగళరావుగారి ప్రభుత్వం 1974 ఉగాది నుంచి రాష్ట్ర మంతటా తాలూకా స్థాయిలో తెలుగును అధికారభాషగా పరిగణించింది. జిల్లా, రాష్ట్ర స్థాయులలో కూడా తెలుగును అధికారభాషగా పరిగణించటం కూడా క్రమంగా జరుగుతుంది.

1974 ఉగాది నుంచి జయప్రదంగా జరిగిన అఖి భారత తెలుగు సాంస్కృతికోత్సవాల సమయంలో "ప్రపంచ తెలుగు మహాసభలు" జరపాలనే ప్రతిపాదన బలపడింది. తరువాత రాష్ట్రంలోని పెద్దలంతా సమావేశమై, 1975 ఉగాది నుంచి వారంరోజులు ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలనే నిర్ణయం తీసుకొని, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారిని ఆహ్వాన సంఘం అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు. అంతటితో కార్యక్రమం ఆరంభమైంది. 1974 విజయదశమి నుంచి నాలుగురోజులపాటు అఖిల భారత తెలుగు బాలల ఉత్సవాలు వైభోవోపేతంగా జరిగినవి. 1975వ సంవత్సరం తెలుగు సాంస్కృతిక సంవత్సరంగా పరిగణించబడింది. 1975 ఉగాదిలోపల రాష్ట్రమంతటా పలుచోట్ల సంగీత నృత్య - నాటకాది ఉత్సవాలు జరిగినవి. ఇదంతా ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణకు పూర్వరంగ మన్న మాట.

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న తెలుగువారిలోనే కాక, ప్రపంచ మంతటా వ్యాపించి ఉన్న సుమారు ఆరుకోట్ల తెలుగువారిలో భావసమైక్యం సాధించటం ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహించటంలోని ప్రధానోద్దేశం. ఈ సంవత్సరం ఉగాది నుంచి వారం రోజులు కనుల పండువుగా, వీనుల విందుగా, మెదడుకు మేతగా జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలు, 2,500 సంవత్సరాల తెలుగువారి మహోజ్జ్వలచరిత్రలో మరపురాని మధురఘట్టం, సువర్ణాక్షరాలతో లిఖించబడే అపూర్వ సంఘటన. తెలుగువారిలో

భావసమైక్యం సాధించటంలో ప్రపంచ తెలుగు మహాసభల పాత్ర అమూల్యమైన దనటంలో ఎటువంటి సందేహమూలేదు.

మహాసభల సందర్భంగా ఒక సాంస్కృతికప్రదర్శన ఏర్పాటు అయింది. "తెలుగువారి చరిత్రను, సంస్కృతిని ప్రతిబింబించే ఈ ప్రదర్శనకు స్థిరమైన రూపం ఇవ్వవలెననే ఆలోచన ప్రజలకూ, ప్రభుత్వానికి కలిగింది. ప్రజలు ఐదు లక్షల రూపాయల విరాళంతో ముందుకు వచ్చారు. ప్రభుత్వం తక్కిన ఖర్చు భరించటానికి అంగీకరించింది. దీని ఫలితమే పబ్లిక్ గార్డెన్సులో నిర్మింపబడనున్న 'సాంస్కృతికసంగ్రహాలయం.' దీనిని సందర్శించే యాత్రికులు తెలుగుదేశ సమగ్ర స్వరూపాన్ని ఒక్కచోట చూడగలుగుతారనటం నిస్సందేహం. ప్రపంచ తెలుగు మహాసభలవల్ల కలిగిన సత్ఫలితాలలో ఇది మొదటిది అని చెప్పవచ్చు.

మహాసభల ఫలితంగా ఇతర రాష్ట్రాలలో, ఇతర దేశాలలో నివసిస్తున్న తెలుగువారంతా తెలుగుదేశానికి సన్నిహితులైనారు. తెలుగుదేశంతో సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకొని తమ భాషాసంస్కృతులను పరిరక్షించుకోవాలన్న ప్రగాఢవాంఛ వారిలో ప్రబలింది. అందుకోసం మహాసభల సందర్భంగా జరిగిన సదస్సులలో వారు అనేకసూచనలు జేశారు. ఆ సూచనలను పరిశీలించి అమలు జరపటానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విద్యాశాఖలో ఒక ప్రత్యేకవిభాగం ఏర్పాటు చేయబడింది. అంతేకాక దేశవిదేశాలలో ఉన్న తెలుగువారితో, తెలుగు అభిమానులతో నిరంతరమైన సంబంధాలు నెలకొల్పుతూ, వారితో తెలుగు భాష, సాహిత్యం, చరిత్ర, కళలు, సంస్కృతి మొదలగువాటి పరిశోధనలను, అధ్యయనాన్ని ప్రోత్సహించటానికి ఒక ప్రత్యేకమైన సంస్థ అవసరమని ఆ సదస్సుల ప్రారంభంలోనే ఒక తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది. అందుకు ప్రభుత్వం అంగీకరించి, "అంతర్జాతీయ తెలుగు సంస్థ"ను నెలకొల్పింది. ఈ సంస్థ దేశవిదేశాలలో ఉన్న తెలుగువారి భావసమైక్యాన్ని మరింత దోహదం చేసి, సుస్థిరం చేయగలదని నేను విశ్వసిస్తున్నాను. ప్రపంచ తెలుగు సంస్థ ఆవిర్భావం.

ప్రపంచ తెలుగు మహాసభల వల్ల ప్రజలలో ఒక నూత్నచైతన్యం కలిగింది. ఉత్సాహం వెల్లివిరిసింది. సమైక్యసద్భావాలు పెంపొందాయి. వీటిని ప్రోదిచేసి కాపాడుకొనటం మన కర్తవ్యం. అంతేకాదు, తెలుగుదేశం సహజమైన వనరులను ఆలవాలం. నీరు, భూమి, గనులు, అటవీసంపద పుష్కలంగా ఉన్నాయి. వీటిని పూర్తిగా

వినియోగించుకొని, ప్రజలలో వచ్చిన భావసమైక్యం ఆధారంగా, తెలుగుదేశం సమగ్రాభివృద్ధికి పాటుబడి, తద్వారా తెలుగువారు పాడిపంటలతో, సుఖశాంతులతో తులతూగేటట్లు చేయడానికి మనమంతా ఈ శుభసమయంలో ప్రతిజ్ఞ తీసుకొందాం. సామాన్యప్రజల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రవచించిన 20 సూత్రాల ఆర్థికపథకాన్ని ఆంధ్రప్రదేశ్‌లో అమలు జరపటానికి మన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారు పూనుకొన్నారు. వారి నాయకత్వంలో, క్రమశిక్షణతో, సమైక్యంగా కృషి చేసి ఈ 20 సూత్రాల ఆర్థికపథకాన్ని విజయవంతం చేద్దాం.

*(1975)*

# 18. విదేశాల్లో తెలుగువారు-సాంస్కృతిక వికాసం

**2**,500 సంవత్సరాల మహోజ్జ్వలచరిత్ర కలిగిన తెలుగుజాతి సంస్కృతి, ప్రపచ నాగరికసంస్కృతులలో పురాతనమైనది; అతివిశిష్టమైనది. ఆది నుంచి మన జాతి ప్రపంచంలోని ఇతరజాతులతో, ఇతరదేశాలతో సత్సంబంధాలను పెంచుకొంటూ, సాంస్కృతికౌన్నత్యాన్ని పెంపొందించుకొంటూ వున్నది.

నాటి రాచరికపువ్యవస్థలో ఒక జాతి, ఒక దేశం మరో జాతితో, మరో దేశంతో రాజకీయంగాను, వ్యాపార వాణిజ్యవిషయకంగాను, విద్యారంగపరంగాను, సత్సంబంధాలను పెంచుకొంటూనో, సమరాలు సాగిస్తూనో ముందుకు సాగిపోతూ ఉండేవి. ఇందుకు నాడు ప్రధానంగా నౌకాయానం రవాణా సౌకర్యంగా ఉండేది. ఈ విధంగా ప్రపంచ దేశాలలోని పరస్పర ఆదానప్రదానాలవల్ల ఆయా జాతుల, దేశాల సంస్కృతి, వికాసం పొందుతూ ఉండేది. అంతేకాదు, విదేశీ రాయబారుల, యాత్రికుల, మతస్థుల, విద్యార్థుల పర్యటన వల్ల కూడా ఒక జాతి, ఒక దేశ సంస్కృతి మరో దేశంలో ప్రచారం చేయబడి, మరో జాతిని ప్రభావితం చేస్తూ వచ్చేది. అందుకే ప్రపంచంలోని ప్రతి జాతి సంస్కృతిలో అంతస్సూత్రంగా ఒకే భావం భాసిస్తుంది; పైకి కనిపించే లక్షణాలలో వైవిధ్యం గోచరించినా, ఒక్కోవైవిధ్యం ఒక్కోలక్షణాన్ని కలిగి, ఆయా జాతుల సంస్కృతికి విశిష్టతను సంతరిస్తాయి. ఈ విధంగా సంతరించబడిన విశిష్టతలలో మన తెలుగు జాతి సంస్కృతికి గొప్ప స్థానం ఉంది.

ఈ నాడు ఆధునికయుగంలో ప్రపంచదేశాల నడుమ నాడు ఉన్నంతగా సంకుచిత పరిధులు లేవు. మానవుడు వైజ్ఞానికంగా పురోగమిస్తున్నాడు. ఈ వైజ్ఞానికపురోగమనంలో ఒక జాతి, ఒక దేశం అంటూ గిరిగీసుకొనకుండా విశ్వగోళం విశాల పరిధిలో ఈనాటి మనిషి విహరిస్తున్నాడు. అందుకే ఈ నాడు ఎల్లలు లేకుండా అన్ని దేశాలు, అన్ని ఖండాలు అతిసునాయాసంగా చుట్టి వస్తున్నాడు. ఇందుకు రాజకీయ, సాంఘిక, సాంకేతిక, వైజ్ఞానిక, విద్యావిషయకమైన కారణాలు అనేకం ఉన్నాయి, ఈ విధమయిన భ్రమణం 'వసుధైక కుటుంబం' అనే సద్భావనకు దారితీస్తుందని ఆశించవచ్చు.

ఈ రకమైన గమనంలో మన తెలుగు జాతి కూడా ప్రముఖమైన పాత్రనే చేపట్టినది. మన తెలుగు వారిలో కూడా చాల మంది అనేకకారణాలవల్ల ఇతర దేశాలకు వెళ్ళటం జరిగింది.

ఈస్టిండియా కంపెనీవారి రాకతో భారతదేశ జీవనగమనంలో ప్రధానమయిన మార్పు వచ్చింది. 19వ శతాబ్ద మధ్యభాగంలో భారతదేశంలో రైలు మార్గాలు పడినప్పటి నుంచి ఇతరదేశాలలోని వ్యవసాయానికీ, పరిశ్రమల పెంపుదలకు స్వదేశం నుంచి అనేకులు కూలీలుగా, కార్మికులుగా వలస వెళ్ళవలసి వచ్చింది. బ్రిటిష్‌వారి పరిపాలనకాలంలో భారతదేశం నుంచి ఈ విధంగా కాందిశీకులుగా తరలింపబడిన వారిలో తెలుగు వారు కూడా ఉన్నారు. వీరు విదేశాలలోని రబ్బరు, కాఫీ, తేయాకు, కలప వంటి తోటలలో కార్మికులుగా పనిచేస్తూ జీవనోపాధి గడుపుతూ ఉండేవారు. అయితే భారతదేశానికి స్వాతంత్ర్యం సంక్రమించిన తరువాత కూడా వీరిలో చాలా మంది మళ్ళీ తిరిగి స్వదేశానికి రాలేదు.

ఆ విధంగా అక్కడ స్థిరపడిపోయిన తెలుగువారు, తమ పరిధిలో తమ మాతృభాషా సంస్కృతులను పరిరక్షించుకొంటూనే అక్కడి స్థానికభాషాసంస్కృతులను సమాదరిస్తూ ప్రవాసాంధ్రులుగా ఉండిపోయారు. అయితే వీరి తరువాతి తరాలవారు తమ స్వీయ సంస్కృతిని, సంప్రదాయాన్ని, భాషాచరిత్రను మరచిపోయే ప్రమాదం కూడా లేకపోలేదు. అందువల్ల వారిలో ఎప్పుడూ ఆ స్పృహను జాగరితం చేయడానికి, వారిలో వాటిపట్ల అభిమానాన్ని, ఆదరణను పెంచడానికి, మన సంస్కృతీసంప్రదాయాలను, వాటి పుట్టు పూర్వోత్తరాలను, ఔన్నత్యాన్ని తెలియజెప్పవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది.

స్వాతంత్ర్యానంతరం, ఇటీవలి కాలంలో మాత్రం చాలవరకు ఉద్యోగాల రీత్యా, ఉన్నతవిద్యార్జన కోసం వెళుతున్నవారు ఉన్నారు. అలా వెళ్ళినవారు అక్కడి తెలుగువారిలో రేఖామాత్రంగా ఉన్న తెలుగు సంస్కృతీసంప్రదాయాల వికాసానికి తోడ్పడాలి. అంటే విదేశాలలోని తెలుగు వారిలో మన సంస్కృతీ సంప్రదాయాలను వికసింపజేయడానికి అటు ప్రజలు, ఇటు ప్రభుత్వం వారు కూడా కృషి చేయవలసిన అవసరం ఉంది.

ఈ నాడు మలేషియా, మారిషస్, దక్షిణాఫ్రికా, ఫిజి, బర్మా, సింగపూర్, అమెరికా, శ్రీలంక, యు.కె., కెనడావంటి దేశాలలో దాదాపుగా ఐదు లక్షలమంది తెలుగువారు నివసిస్తున్నట్లుగా, ఇటీవల జరిగిన సర్వేవల్ల వెల్లడయినది. అయితే వీరంతా తమ అస్తిత్వానికి, వ్యక్తిత్వానికి మూలమైన సంస్కృతిని మరిచిపోకూడదు. కేవలం మన

సంస్కృతిని మనం పరిరక్షించుకోవడం, ప్రచారం చేసుకోవడమే కాకుండా ఎదుటివారి సంస్కృతిపట్ల కూడా సమాదరదృష్టిని కలిగి ఉండాలి. అంతేకాని పొరుగువారి సంస్కృతీ వ్యామోహంలో పడిపోయి, మన సంస్కృతిని విస్మరించ కూడదు.

విదేశాలలో ఉన్న తెలుగువారి ఇళ్ళను చూడగానే, వారి కట్టుబొట్టు తీరును చూడగానే, తెలుగు సంస్కృతి ప్రతిబింబించేలా ఉండాలి. అంటే ముంగిళ్ళలో ముగ్గులు తీర్చి, గడపకు తోరణం కట్టి, పసుపు పారాణి పెట్టుకొనే తెలుగు సంస్కృతి కొట్టవచ్చినట్టు కనిపించాలి.

నేను మారిషస్, మలేసియాలలో పర్యటించినప్పుడు అక్కడి కొన్ని తెలుగు కుటుంబాల వారిలో తమ వాకిళ్ళ ముందు ముగ్గులు తీర్చిదిద్దుకొని, గడపకు తోరణాలు కట్టుకొని, పసుపు కుంకుమలు రాసుకొనే తెలుగు సంస్కృతిని అక్కడ చూశాను. ఈ విధమైన మన సంస్కృతి ప్రపంచదేశాలలో ఉన్న తెలుగువారి ఇళ్ళలో వికాసం పొందాలని ఆశించాను. ఈ నాటికీ విదేశాలలోని తెలుగు స్త్రీలలో మన సంస్కృతి వుట్టిపడుతూ వుంటుంది – తెలుగు ఉగాది, విజయదశమి దీపావళి పండుగలకు తెలుగువారు జరుపుకొనే సాంస్కృతిక కార్యక్రమాలు, మన సంస్కృతిని ప్రదర్శిస్తూ ఉంటాయి.

ఈ సాంస్కృతికవికాసం అన్నది కేవలం వైయక్తికంగా జరిగేదికాదు. సామూహికంగా, స్వచ్ఛందసంస్థలద్వారా, ప్రభుత్వసహకారంతో కొనసాగవలసినది. వైయక్తికంగా అయితే ఇటీవలి కాలంలో అక్కడికివెళ్ళిన విద్యావంతులయినారు. పూర్వం నుంచీ అక్కడే స్థిరపడి, తెలుగు సంస్కృతీ సంప్రదాయాలకు దూరంగా ఉండి, వాటి ఉనికిని గురించి అంతగా తెలియని వారికి తమ భాషణల ద్వారా, చిన్న చిన్న గోష్ఠుల ద్వారా, ఉపన్యాస, కార్యక్రమాలద్వారా, అక్కడి తెలుగు వారికి తెలియజెప్పే అవకాశం ఉంటుంది. ఈ విధంగా స్వకీయమైన సంస్కృతిని గురించి కొద్దిపాటిగా తెలుసుకొన్న వారిలో, వాటిని గురించి కూలంకషంగా తెలుసుకోవాలి, అవలోకనం చేయాలి అనే జిజ్ఞాస బయలుదేరుతుంది, వారిలో ఈ బీజావాపానికి, అంకురార్పణకు చేయూతగా కొన్ని స్వచ్ఛందసంస్థలుగానీ, ప్రభుత్వరంగంగాని పూనుకొని కృషి చేయాలి. వారిలోని చిరుకోరికకు ఆలంబనగా వారికి ముందుగా గ్రంథజాలం అవసరం. ఇందుకు ముందుగా వారికి భాషలో ప్రవేశం ఉండాలి; అందుకు మొదటి సోపానంగా విద్యను ప్రవేశపెట్టాలి. విదేశాలలో ఉన్న తెలుగు వారికి, వారి పిల్లలకు మాతృభాషాసౌకర్యాలను ఏర్పాటు చేయడంలో ప్రభుత్వం శ్రద్ధ కనబరచాలి.

విద్యాబోధన పథకాన్ని ప్రవేశపెట్టడమేకాదు. వారికి తగు పాఠ్యగ్రంథాలు అందుబాటులో ఉండేలా చూడడం, వాటిని వారి గ్రహణశక్తికి అనుగుణంగా రూపొందించడం అవసరం. అంతేకాదు, ఆయా స్థానికగ్రంథాలయాలలో తెలుగు పుస్తకాలు లభ్యమయ్యే ఏర్పాట్లు చేయడం వంటి బాధ్యతలను కూడా చేపట్టాలి.

సాంస్కృతిక వికాసంలో పత్రికలు, సినిమాలు, నాటకాల వంటి సాధనా లెన్నో ఉపకరిస్తాయి. ఉదాహరణగా అక్కడ ఉన్న తెలుగు కుటుంబాల వారు తెలుగు పర్వదినాన్ని జరుపుకోవడానికి వారికి ఆయా తిథి వార నక్షత్రాలు తెలియజెప్పే పంచాంగంవంటివి అందుబాటులో ఉండాలి. పత్రికల ద్వారా ఎప్పటికప్పుడు వారికి వారి స్వజాతి నిత్య జీవనవ్యవహారాలు కళ్ళకు కట్టినట్లుగా చూపగలుగుతూ ఉండాలి. సినిమాలు, నాటకాల వంటి ప్రక్రియల ద్వారా మన పౌరాణికచరిత్ర వైభవాన్ని, మన జానపద జీవితచిత్రణను, సాంఘిక ఆచారవ్యవహారాలను వారికి దృశ్యరూపంలో ప్రదర్శించి చూపితే, అవి వారి మనసుల్లో హత్తుకుని తమ సంస్కృతి ఔన్నత్యం పట్ల ఉన్న ఆత్మాభిమానంతో వ్యక్తిత్వాన్ని మహోన్నతంగా రూపొందించుకోగలరు. వీటి ద్వారా ముందుగా వారిలో 'మనమంతా ఒక్కటే, మన సంస్కృతి ఒక్కటే' అనే స్వీయభావన ఏర్పడుతుంది. తద్వారా జాతీయ సమైక్యం పెంపొందుతుంది. ఈ జాతీయసమైక్యం దేశప్రగతికి, జాతి ఔన్నత్యానికి మూలకందమవుతుంది.

ఇక్కడ మరొక ముఖ్యమయిన అంశాన్ని గూర్చి ముచ్చటించుకోవలసిన అవసరం ఉన్నది. విదేశాలలో ఉన్న తెలుగువారిలో తెలుగు సంస్కృతిని వికసింపజేసి, ఆయా దేశాలలో కూడా మన సాంస్కృతికవిప్లవాన్ని కొనసాగించాలంటే, ముందుగా అక్కడి స్థానికుల అండదండలు కూడా ఎంతో అవసరం. అందుకు వారు కూడా సహకరించ వలసిన ఆవశ్యకత ఉంది. అంటే వారికి ముందుగా మన సంస్కృతిలోని ప్రత్యేకతను, విశిష్టతను తెలియజెప్పి, వారికి మన సంస్కృతిపట్ల సదభిప్రాయం, సమాదరణ ఉండేలా చూడడానికి ప్రయత్నించాలి. ఇందుకు పెద్ద ఎత్తున కార్యక్రమాలు ప్రారంభించవలసి ఉంటుంది. దీనిలో ప్రభుత్వం ప్రధానపాత్ర వహించవలసి ఉంటుంది.

ఇందుకు నాందిగా అప్పుడప్పుడు విదేశాలలో కూడా మన తెలుగు మహాసభలను నిర్వహిస్తూ ఉండడం ముఖ్యం. అందుకే రాబోవు రెండవ ప్రపంచ తెలుగు మహాసభలను మలేసియాలో జరపాలనే ఒక యోచన కూడా ప్రభుత్వం దృష్టిలో ఉంది. వీటిద్వారా సాంస్కృతికవికాసం పెద్ద ఎత్తున జరుగుతుంది.

ఈ విధమయిన ప్రపంచ మహాసభల ద్వారా ఒక జాతి, ఒక రాష్ట్రం, తద్వారా ఒక దేశం సాధించేది ఎంతైనా ఉంది. ప్రపంచదేశాల సరసన సమున్నతస్థానాన్ని పొందడం, దేశ గౌరవప్రతిష్ఠలను ఇనుమడింప జేసుకోవడం వీటి వల్ల సాధించే ఫలితాలుగా చెప్పుకోవచ్చును.

విదేశాలలో తెలుగు సంస్కృతి వికసనం కోసం మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తన పరిధిలో తాను కృషి చేస్తుందనే చెప్పవచ్చు. విదేశాలలో ఉన్న తెలుగువారి సాంస్కృతికావసరాలను తీర్చడానికి రాష్ట్రప్రభుత్వం రాష్ట్ర రాజధానీనగరం హైదరాబాదులో అంతర్జాతీయ తెలుగు సంస్థ పేరిట ఒక సంస్థను స్థాపించినది.

అంతర్జాతీయ తెలుగు సంస్థ ప్రభుత్వ ప్రతినిధిగా రాష్ట్రేతర, విదేశాంధ్రులకు తన పరిధిలో తాను సేవ చేస్తూనే ఉన్నది. ప్రధానంగా ఈ సంస్థ అక్కడి తెలుగు పిల్లలు తెలుగు నేర్చుకోవటానికి అనువుగా తెలుగు వాచకాల వంటి పాఠ్యగ్రంథాలను రూపొందించి, వాటిని వారికి సరఫరా చేయడం, పత్రికలు, పాఠ్యగ్రంథాలు, పఠనీయ గ్రంథాలు, ఆధునికప్రక్రియలయిన నవల, కథ, కవిత వంటి సాహిత్యసామగ్రిని వారికి అందజేయటం, అప్పుడప్పుడు సినిమాలు, నాట్య, నాటకబృందాల వారిని పంపడం వంటి కార్యక్రమాలను ఈ సంస్థ చేపట్టి ప్రభుత్వం వారి సహాయసహకారాలతో నెరవేరుస్తూ ఉంది.

ఇదేవిధమయిన సేవానిరతితో, జాత్యభిమానంతో, మన భాషాసంస్కృతుల పరిరక్షణకు, వికాసానికి ప్రభుత్వపక్షాన స్థాపించబడిన అంతర్జాతీయ తెలుగు సంస్థ ద్విగుణితమయిన ఉత్సాహంతో ముందు ముందు మరిన్ని ఉత్తేజకరమయిన ప్రణాళికలను రూపొందించి, వాటిని సక్రమంగా నిర్వహిస్తే విదేశాలలో మనం సాంస్కృతిక చైతన్య కేతనాన్ని ఎగురవేయవచ్చు.

ప్రభుత్వం యోచిస్తున్న రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు కూడా విదేశంలో జరిగితే మన సాంస్కృతిక విప్లవంలో ఒక మైలు రాయిగా నిలిచిపోయి మన గౌరవ ప్రతిష్ఠలకు ఒక కలికితురాయిగా మిగిలిపోగలదు. అద్యతనభావిలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, ప్రభుత్వం పక్షాన అంతర్జాతీయ తెలుగు సంస్థ ఈ మహాయజ్ఞాన్ని కొనసాగించడంలో ముందుకు వచ్చి కృతకృత్యమవుతాయని మనమంతా ఆశిద్దాం.

*(1980)*

# 19. మారిషస్‌లో తెలుగువారు

ఆగస్ట్ మాసాంతంలో మారిషస్ ద్వీపంలో ద్వితీయ విశ్వహిందీ సమ్మేళనం జరిగింది. భారతదేశం నుంచి ఈ మహాసభలలో పాల్గొనడానికి ఒక అధికారిక ప్రతినిధివర్గం వెళ్ళింది. వారితో ఒక సభ్యుడుగా మారిషస్ వెళ్ళే సదవకాశం నాకు లభించింది. ఈ అవకాశం నాకు కల్పించిన భారతప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ గారికి, మన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారికి నా ధన్యవాదాలు తెలుపుకొంటున్నాను.

మారిషస్ దీవి హిందూమహాసముద్రంలో నైఋతీ తీరానికి 1,250 మైళ్ళ దూరాన మకరరేఖపై ఉంది. ఆఫ్రికా ఖండం సమీపంలో ఉన్న మెడగాస్కర్ దీనికి ఇది 500 మైళ్ళు దగ్గరలో ఉంది. హైదరాబాదు నుంచి బొంబాయి మీదుగా సుమారు 4,000 మైళ్ళు.

మారిషస్ ద్వీపం 40 మైళ్ళు పొడవు, 30 మైళ్ళు వెడల్పు ఉంది. మూపు ఎదిగిన తాబేలు మాదిరిగా ఉంటుంది. ఈ దీవి వైశాల్యం 720 చదరపుమైళ్ళు; జనాభా 7.5 లక్షలు. ఈ ద్వీపం ప్రకృతిసౌందర్యం వర్ణనాతీతం. తీరం చుట్టూ సముద్రం–కొండలు, లోయలు, జలపాతాలు, సరస్సులు, తోటలు, చెట్టుచేమలు, నిత్యకల్యాణం పచ్చతోరణం అన్న మాట ఈ దీవికి అక్షరాలా వర్తిస్తుంది.

దీవి మధ్యభాగం ఎత్తుగా ఉండి, చల్లగా ఉంటుంది. కొద్ది కొద్ది దూరాలలోనే వాతావరణం మారిపోతూ ఉంటుంది. ఎండలు తక్కువే. ఆకాశం ఇంద్రధనుస్సు రంగులతో అందంగా కనబడుతుంది. మొత్తం మీద వాతావరణం ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా, మనోహరంగా ఉంటుంది.

మారిషస్‌లో పట్టణాలు, గ్రామాలు చాలా ఉన్నాయి. పూర్వం రైళ్ళు ఉండేవి కాని యిప్పుడు లేవు. దీవి అంతటా ప్రయాణం చెయ్యటానికి పూర్తిగా బస్సులను ప్రవేశపెట్టారు. ఆధునికసౌకర్యాలన్నీ లభిస్తున్న ఈ దీవిపైన ఫ్రెంచి భాషాసంస్కృతుల ప్రభావం ఎక్కువగా కనబడుతుంది. అక్కడి ఇళ్ళు కూడా ఫ్రెంచి సంస్కృతి ప్రభావాన్నే కనబరుస్తాయి. ఇళ్ళకు

ముందు భాగాన అద్దాలు, ఆ అద్దాల పైన రంగురంగుల పెద్ద పెద్ద తెరలు, ఇంటింటా సోఫాలు, రేడియో, టెలివిజన్, ఫోన్ ఉంటాయి. ఈ దేశంలో చాలామందికి కార్లు ఉన్నాయి. రేకులతోను, చెక్కలతోను కట్టిన ఇళ్ళు కూడా చాలా ఉన్నాయి ఇక్కడ. పైకి చూడటానికి సామాన్యంగా కనిపిస్తాయి కాని లోపలికి వెళ్ళి చూస్తే ఆధునికపరికరాలతో శోభతో విరాజిల్లుతుంటాయి. దేశమంతటా పరిశుభ్రమైన తారురోడ్లు ఉన్నాయి. దుమ్ముగాని, చెత్తగాని, రోడ్డుమీద ఎక్కడా కనబడదు. రోడ్లకు ఇరువైపులా కొంచెం కూడా చోటు వృథా కాకుండా చెరకు పండిస్తారు.

ఒక్కమాటలో చెప్పాలంటే సుందరనందనవందనం మారిషస్. ఈ దీవిలో చెరకు విస్తారంగా పండుతుంది. భారతదేశంలో దొరకే కూరగాయలన్నీ ఇక్కడ దొరుకుతాయి. అక్కడక్కడ మునగచెట్లు కూడా కనబడతాయి. చెరకు కాక, టీ, పొగాకు, లవంగాలు కూడా ఇక్కడ పండుతున్నాయి. వీటిని వాళ్ళు ఇతరదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. తమకు అవసరమయిన వస్తువులను విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటారు.

మారిషస్ కొద్దిలో ఒక ప్రపంచం; ఇక్కడ హిందువులు, బౌద్ధులు, క్రైస్తవులు మహమ్మదీయులు ఉన్నారు; ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు, చైనావారు, నీగ్రోలు, భారతీయులు ఉన్నారు. ఒకప్పుడు ఈ దీవిని ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు పరిపాలించారు. ఇక్కడ ఇంగ్లీషు, ఫ్రెంచి ప్రభుత్వభాషలు అయినా, హిందీ, తమిళం, తెలుగు, ఉరుదూ, మరాఠీ, చైనా భాషలకు కూడా సముచితప్రాధాన్యం ఉన్నది. ప్రజలందరూ విరివిగా వాడే భాష క్రియోలి – ఇది ఫ్రెంచి ప్రభావం ఉన్న మిశ్రమభాష. దీనికి లిపిలేదు.

మారిషస్‌లో నాలుగు లక్షలకు పైగా భారతీయులు ఉన్నారు. భారతీయులంతా హిందీ మాట్లాడగలరు. మారిషస్ ప్రభుత్వంలో హిందీ వారి ప్రాధాన్యం హెచ్చు. అందుచేత వారు ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలను అక్కడకు ఆహ్వానించి నిర్వహించారు. ఈ మహాసభలు అక్కడి ప్రభుత్వ ఆధ్వర్యంలోనే జరిగాయి.

మారిషస్ ప్రధానపట్టణం పోర్ట్‌లూయిస్. దానికి సమీపంలోనే ప్రకృతిశోభకు ఆలవాలంగా ఉన్న మెకా అన్నచోట భారత, మారిషస్ ప్రభుత్వాల పరస్పరసహకారంతో నిర్మించిన మహాత్మా గాంధీ ఇన్‌స్టిట్యూట్ ఉంది. ఈ ఇన్‌స్టిట్యూట్ ప్రాంగణంలోనే హిందీ మహాసభలు జరిగాయి.

1901లో మహాత్మా గాంధీ దక్షిణాఫ్రికా నుంచి మారిషస్ వచ్చి, అక్కడి భారతీయుల పరిస్థితులను స్వయంగా చూచి, వారిలో జాతీయభావాలను ప్రచారం చేశారు. మహాత్ముడు అప్పుడు అడుగుపెట్టినచోటనే ఆ సంస్థ నిర్మాణం జరిగింది.

హిందీ ప్రచారం ద్వారా మహాత్ముడు అక్కడ రాజకీయచైతన్యం తెచ్చారని చెప్పి ప్రధానమంత్రి సర్ శివూసాగర్ రామ్ గులామ్ తమ ప్రారంభోపన్యాసంలో మహాత్మునికి శ్రద్ధాంజలి ఘటించారు. భారతీయ ప్రతినిధివర్గనాయకుడు డా॥ కరణ్‌సింగ్ అధ్యక్షత వహించారు. కన్నులపండువుగా జరిగిన ఈ మహాసభలలో అనేక దేశాల ప్రతినిధులు, మంత్రులు, హిందీ సాహిత్య వేత్తలు, కళాకారులు పాల్గొన్నారు.

ఆగస్టు ఇరవై ఎనిమిదవ తేదీన జరిగిన సభలకు అధ్యక్షవర్గంలో అదృష్టవశాత్తు నాకు కూడా అవకాశం వచ్చింది. హిందీని అంతర్జాతీయభాషగా రూపొందించాలని, ఐక్యరాజ్యసమితి అధికారభాషలలో హిందీని చేర్చాలని, విశ్వహిందీ కేంద్రాన్ని మారిషస్‌లో ఏర్పాటు చేయాలని నేను సూచనలు చేశాను. నా సూచనలకు మహాసభల ఆమోదం లభించింది. మూడు రోజుల పాటు సభలు జరిగాయి.

హిందీ వారి తరవాత మారిషస్ భారతీయులలో తమిళులు, తెలుగువారు ఎక్కువమంది ఉన్నారు. తెలుగువారు సుమారు 50 వేల మంది ఉంటారు. అక్కడ అరవై పాఠశాలలలో తెలుగు సెక్షన్లు ఉన్నాయి. 110 మంది తెలుగు ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. అక్కడి టీచర్స్ ట్రైనింగ్ కాలేజీలో తెలుగు సెక్షన్ ఉంది.

15-7-1838వ తేదీ యానాం నుంచి ఫ్రెంచివారి ప్రోత్సాహంతో ఆంధ్రులు మారిషస్ దీవి చేరుకున్నారు. వీరంతా అక్కడ వ్యవసాయాభివృద్ధికి తోడ్పడ్డారు. 1946లో మారిషస్‌లోని ఆంధ్రులు మారిషస్ ఆంధ్ర మహాసభ ఏర్పాటు చేసుకున్నారు. ఈ సంస్థను అక్కడి ప్రభుత్వం గుర్తించింది. ఈ సంస్థ సొంత భవనం పోర్ట్‌లూయిస్‌లో ఉన్నది. దీనికిప్పుడు 60 శాఖలున్నాయి. వీటిలో 59 శాఖలకు సొంత భవనాలు ఉన్నాయి. ఈ మారిషస్ ఆంధ్రమహాసభలో 3,332 మంది సభ్యులు ఉన్నారు.

అక్కడి తెలుగువారి స్థితిగతులు తెలుసుకోవాలనే కుతూహలంతో, హిందీ మహాసభలు ప్రారంభం కావడానికి నాలుగురోజులు ముందే అంటే, ఆగస్టు 23వ తేదీన మారిషస్ చేరాను. 24వ తేదీన ఆంధ్ర మహాసభ కార్యాలయంలో సభ ఏర్పాటు చేశారు. మారిషస్ ప్రభుత్వ పార్లమెంటరీ కార్యదర్శి, తెలుగు ప్రముఖులు అయిన శ్రీ సింహాద్రి

వీరాస్వామిగారు అధ్యక్షత వహించారు. మారిషస్ ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ అచ్చన్న, కార్యదర్శి శ్రీ బాలగోపాలుడు మహాసభ ఆశయాలను తెలియజేశారు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు మారిషస్ తెలుగువారికి ఇచ్చిన సందేశాన్ని సభలో చదివి వినిపించాను. మారిషస్ విద్యామంత్రి శ్రీ సెఫాన్‌గారి ద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అంతర్జాతీయ తెలుగుసంస్థ ఇచ్చిన పుస్తకాలు, ఫొటోలు, తెలుగు తల్లి – డాక్యుమెంటరీ చిత్రం, కుమారి ఉమాభారతి కూచిపూడి నృత్యాల ఫిల్ము ఆంధ్ర మహాసభకు బహూకరించాము. భారత రాయబారి శ్రీ మదన్‌మోహన్ ఖురానాగారు కూడా ఈ సభలో పాల్గొన్నారు. ఆంధ్రుల ఉత్సాహానికి అంతులేదు.

నాలుగురోజుల పాటుతెలుగువారు ఉన్న 30 కేంద్రాలను నిర్విరామంగా తిరిగిచూచాను. మారిషస్‌లోని అనేకపాఠశాలలను సందర్శించాను. తెలుగువారు తెలుగు నేర్చుకొంటున్న తీరును, అక్కడి తెలుగు ఉపాధ్యాయులు పిల్లలకు తెలుగు నేర్పుతున్న పద్ధతిని పరిశీలించాను. అనేకసభలలో తెలుగులోనే ఉపన్యసించాను. అక్కడి వారికి అర్థమయ్యే పద్ధతిలో సులభశైలి తెలుగులో మాట్లాడాను. తెలుగువారు ఆబాలగోపాలం, 86 సంవత్సరాల ముదుసలుల దగ్గరి నుంచి చిన్న పిల్లలవరకు సమావేశాలకు వచ్చారు; ఎంతో గౌరవాన్ని, ఆప్యాయతను వారు ప్రదర్శించారు. 'మా తాతముత్తాతల దేశాన్నుండి నాయనా, వచ్చావు. నిండు సంతోషము, మాయింటికి రావాలి' అంటూ పండు ముత్తయిదువలు నన్ను తీసుకొనివెళ్ళి వారి యిండ్లను చూపించారు. తెలుగు ప్రజలలో వచ్చిన ఉత్సాహం వర్ణింపనలవికానిది. వారి మాటలు, వారు పాడిన పాటలు, చేసిన భజనలు తన్మయత్వం కలిగించాయి. అక్కడ ముదుసలులు పాడిన జానపదగీతాలు మన తెలుగుదేశాన్ని మరిపించాయి. ప్రార్థనలు, భజనలు, పాటలు, వీనులవిందుల చేకూర్చినాయి. తెలుగువారు ఆ దీవికి వెళ్ళి 140 సంవత్సరాలు అయినా, తెలుగుదనాన్ని ఈ నాటికీ కాపాడుకొంటున్నారు. తెలుగుభాషను, సంస్కృతిని పోషించుకొంటున్నారు.

మారిషస్ ప్రధానమంత్రి సర్ శివూసాగర్ రామ్‌గులామ్, విద్యాశాఖామంత్రి శ్రీ సెఫాన్, ఆర్థికశాఖామాత్యులు శ్రీ వీరాస్వామి రింగడు, యువజన, క్రీడాశాఖామాత్యులు శ్రీ దయానందలాల్ వసంత్‌రాయ్ మొదలయిన ప్రముఖులను కలుసుకొని, తెలుగువారి విద్యాభివృద్ధిని గురించి చర్చించాను. భారత హైకమీషనరు శ్రీ మదన్‌మోహన్ ఖురానాగారు ఈ విషయంలోనూ శ్రద్ధవహించారు. వారంతా తప్పక సహాయం చేస్తామన్నారు. తెలుగును ఇంకా ప్రోత్సహిస్తామని చెప్పారు.

మారిషస్‌లో ఉన్న తెలుగు పాఠశాలలలకు, సంస్థలకు తెలుగు పుస్తకాలు, ఫిల్ములు, రికార్డులు, టేపులు, ప్రింటు చేసుకోవడానికి తెలుగు ప్రింటింగ్ ప్రెస్, టైపు రైటర్లూ కావాలన్నారు. సాంస్కృతికోత్సవాలకు కళాకారులను పంపమని, వేదపండితుని ఒకరిని పంపమని కోరారు. వారి కోరికలను గురించి ముఖ్యమంత్రి గారితో తిరిగి రాగానే చర్చించాను. సాధ్యమైనంత త్వరలో వారికి సహాయం అందజేయటానికి కృషి చేయవలసి ఉంది.

140 సంవత్సరాల క్రితం మారిషస్ వెళ్లి ఆ నాలుగువేల మైళ్ళ దూరంలో ఉన్నా తెలుగు భాషపయిన, తెలుగు సంస్కృతిపయిన, మారిషస్ తెలుగు ప్రజలు చూపుతున్న శ్రద్ధకు వారిని అభినందించాలి. వారి కృషి తెలుగుదేశం నుంచి మనం కూడా అన్ని విధాల తోడ్పడాలి. మారిషస్ ప్రభుత్వం, భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ మూడింటి సమన్విత సహకారంతో ఇటువంటి కృషి విజయవంతంగా కావాలని, కాగలదని నమ్ముతున్నాను.

*(1976)*

# 20. బ్రిటన్‌లో తెలుగువారు

ఆంగ్లదేశానికి, భారతదేశానికి సంబంధం ఏ నాటిదో? శతాబ్దాలు వారు పరిపాలించారు. వారి వేషభాషలు, సంస్కృతీసంప్రదాయాలు కూడ మన అలవాట్లలో చొరబడినాయి. అనేతుసు ఆ దేశం వెళ్ళి బారిస్టర్లు, డాక్టర్లు, విజ్ఞానవేత్తలుగా తయారు అయినారు, రాజకీయవేత్తలుగా రాణించారు. మహాత్మా గాంధీ, ఇంగ్లండులో బారిస్టరుగా చదువుకొన్నారు. ఇందిరాగాంధీ బ్రిస్టల్‌లో చదువుకొన్నారు. రవి అస్తమించని సామ్రాజ్యాధిపతులు వారు. బానిసబ్రతుకులతో ఉన్నవారము మనము. లోకోత్తర మహత్తర సత్యాగ్రహపద్ధతిని మహాత్మా గాంధీ నాయకత్వంలో స్వాతంత్ర్యసమరాలలో అనేక త్యాగాలు చేసి స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్నాము. కాలక్రమేణా రవి అస్తమించని సామ్రాజ్యం అంతరించిపోయింది.

శ్రీ రాజా రామమోహన్‌రాయ్ పేరొందిన గొప్ప న్యాయవాది. దురాచారాలకు, మూఢ విశ్వాసాలకు ఆలవాలమైన ఆ నాటి సమాజస్థితి చూచి మార్పు చేయాలని నిర్ణయించు కొన్నారు. చనిపోయిన భర్తతోపాటు బ్రతికి ఉన్న భార్యను కాళ్ళు, చేతులు కట్టి నోటిలో గుడ్డలుపెట్టి, చితిపై వేసి బలవంతంగా కొట్టి కాల్చివేసే సన్నివేశాన్ని కళ్ళారా చూచి దుఃఖించి, సహగమనాన్ని ఆపడానికి అవిరళకృషి చేసి, అపుచేయించిన మహామనీషి. భారతదేశంలో నవసమాజనిర్మాణానికి నాంది పలికిన మహనీయుడు, సంఘసంస్కర్త శ్రీ రాజా రామమోహన్‌రాయ్. 1833లో ఆంగ్ల దేశంలో బ్రిస్టల్ నగరంలో పరమపదించారు. అక్కడి శ్మశానవాటికలో వారికి స్మృతిచిహ్నం ఏర్పాటు చేశారు. 150వ వర్ధంతి సందర్భంగా 1983 సెప్టెంబరులో బ్రిస్టల్ ఇండియన్ అసోసియేషన్‌వారు నన్ను ఆహ్వానించారు. వారి ఆహ్వానంపై బ్రిస్టల్ వెళ్ళి, శ్రీ రాజా రామమోహన్‌రాయ్ వర్ధంతి ఉత్సవాలలో పాల్గొని శ్రద్ధాంజలి ఘటించాను. యూనివర్శిటీ ప్రొఫెసర్లు సెమినారులో పాల్గొన్నారు. ఇండియన్ హైకమీషనర్, బ్రిస్టల్ మేయర్ ఇంకా ఎందరో పెద్దలు పాల్గొన్నారు. వర్ధంతి కమిటీ సభ్యులు శ్రీ లవణం, ఆంగ్లకవులను గురించి పరిశోధనలో వున్న శ్రీ ఆరుద్ర, శ్రీ ఆవంత్స సోమసుందర్ ఆంగ్లదేశ ఆంధ్ర సంఘ మాజీ అధ్యక్షులు

శ్రీ విశ్వనాథ శ్రీకృష్ణదేవరాయలు, డా॥ రామకృష్ణ, శ్రీమతి వసుంధర నాతోపాటు ఆ సభలలో పాల్గొన్నారు. ఉత్తమ భారతీయ సంఘ సంస్కర్తకు జోహార్లు అర్పించారు.

ఆంగ్లదేశంలో తెలుగువారు చాలాచోట్ల పలు వృత్తులలో వున్నారు. ఆంధ్రప్రదేశ్ నుండి వెళ్ళిన వారేకాకుండా దక్షిణాఫ్రికా, మారిషస్, ట్రినిటాడ్, బర్మాల నుండి వచ్చిన తెలుగువారు కూడ వున్నారు. అందరు వెయ్యి కుటుంబాల వారు ఉండవచ్చును. లండన్‌లో ఎక్కువ మంది ప్రభుత్వ ఉద్యోగాలలో వున్నారు. కొంతమంది డాక్టర్లుగా ఉన్నారు. కొంతమంది చదువుకొంటున్నారు. 1975లో ప్రపంచ తెలుగు మహాసభలు హైదరాబాద్‌లో జరుపుతున్న సమయములో ఉత్సాహము కలిగి లండన్‌లో యు.కె. ఆంధ్రా అసోసియేషన్ పేరుతో ఒక సంఘాన్ని 1975 మార్చిలో స్థాపించారు. కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి తమ్ముడు శ్రీ వెంకటేశ్వర్లుగారి కుమారుడు శ్రీ కృష్ణదేవరాయలు ఆంధ్ర సంఘ స్థాపకులు. వారు తెలుగుతల్లి పత్రిక పెట్టారు. శ్రీ రాయలు 1966లో ఆంగ్లదేశంలో సివిల్ సర్వెంటుగా చేరి పనిచేస్తూ 1982లో రిటైరు అయినారు. వారు ఆంధ్ర సంఘాన్ని శాఖోపశాఖలుగా విస్తరింపచేసి సంఘటిత పరిచారు.

ఇప్పుడు ఆంధ్ర సంఘానికి శ్రీ వి.వి. రెడ్డి అధ్యక్షులు. వారు బర్మింగ్ హాంలో డాక్టరు. వీరిది నెల్లూరు జిల్లా అల్లిపురం. వారి భార్య డా॥ కృపామయి. శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యగారి మేనకోడలు. మంచిపేరు ప్రఖ్యాతులు గల డాక్టరు. బర్మింగ్‌హాంలో వారింటివద్ద తెలుగువారు సమావేశమైనారు. ఎక్కువ మంది డాక్టర్లు. ఆ రోజు శ్రీ ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, డా॥ జమలాపురం హరిగోపాల్ సమావేశంలో పాల్గొన్నారు. బర్మింగ్‌హాం దగ్గరలో ఉన్న స్టావర్డు అనే ఒవెన్ గ్రామానికి వెళ్ళాము. షేక్స్పియర్ పుట్టిన యిల్లు, మెట్టిన ప్రాంతాన్ని, వ్రాసిన గ్రంథములను, ఏర్పాటు చేసిన ప్రదర్శనలను, నిర్మించిన నాటక ప్రదర్శనశాలను చూచినాము.

ప్రెస్టెన్‌లో ఆంధ్రా అసోసియేషన్ సభ ఏర్పాటు చేశారు. శ్రీ ద్వారంపూడి సుబ్బారెడ్డి కార్యదర్శిగా వుండి సంఘాన్ని అభివృద్ధిచేశారు. స్వంతభవనాన్ని కొన్నారు. తెలుగు పుస్తకాలతో గ్రంథాలయము, తెలుగు పత్రికలతో పఠనాలయము, టి.వి. ఉన్నాయి. ఎవ్వరైనా వచ్చినప్పుడు వుండుటకు రెండు గెస్టు రూములున్నాయి. తెలుగువారంతా అప్పుడప్పుడు సమావేశాలు అవుతూవుంటారు. ఎక్కువమంది కార్మికులు. సభ ఏర్పాటు చేశారు. శ్రీ సుబ్బారెడ్డి స్వాగతం చెప్పి ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల అనుభవాలను

వివరించారు. శ్రీ విశ్వనాథ శ్రీకృష్ణదేవరాయలు అధ్యక్షతవహిస్తూ 1977 ఉప్పెన ప్రాంతాలలో చూచిన సహాయకార్యక్రమాలను గురించి వివరించారు డా॥ శ్రీ వీరారెడ్డి తెలుగువారి సమస్యలను వివరించారు. డా॥ కృపామయి ఆంధ్ర సంఘము తరపున నాకు ఒక మెమెంటో యిచ్చారు.

ఆ రాత్రి బాలక్‌పూల్ వెళ్ళాము. అదొక రంగురంగుల కాంతులతో విరాజిల్లుతున్న సుందర నందన సముద్రతీరనగరం. ఎంతో ఆహ్లాదకరంగావుంది. వేలాదిమంది చూడటానికి వస్తుంటారు.

వేల్సులో డా॥ బలరామిరెడ్డి క్వింట్‌లో డా. పగణాల రామకృష్ణారావు, డా. వసుంధరల ఆతిథ్యం స్వీకరించాము.

లండన్‌లో ములుకుట్ల యోగ ప్రకాశరావు, "తెలుగుతల్లి" పత్రిక సంపాదకురాలు ఆధ్వర్యంలో తెలుగువారి సమావేశం జరిగింది. ఆధునిక తెలుగు వ్యాకరణం రచించిన శ్రీ గ్విన్, బ్రౌన్ రచించిన తెలుగు కథలను సంపుటీకరణ చేస్తున్న పీటర్‌వార్డు వచ్చారు. పీటరువార్డు బ్రిటిషు మ్యూజియం లైబ్రరీలో పనిచేస్తు, తెలుగు తమిళ భాషలలో అధ్యయనం చేస్తున్నారు. శ్రీ గ్విన్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో విద్యాశాఖ కార్యదర్శిగా వుండి చాలాకాలంగా పనిచేసినవారు. వారు ఆంగ్లదేశంలో స్థిరపడినారు. శ్రీ గ్విన్ రచించిన తెలుగు వ్యాకరణం ప్రింటింగులో ఉంది. త్వరలో రిలీజు చేయబడుతుంది. వారికి ఉస్మానియా యూనివర్శిటీ ఆచార్యులు భద్రిరాజు కృష్ణమూర్తిగారు తోడ్పడు తున్నారు. దక్షిణాఫ్రికా తెలుగువారిలో డా. దీగుండి నాయుడు పేరొందినవారు, విద్యాధికుడు. సంపన్నుడు. పేరు ప్రఖ్యాతులు కలవారు. 30 సంవత్సరాలుగా లండన్‌లో వుంటున్నారు. శ్రీ గూటాల కృష్ణమూర్తి ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నారు. వారు విదేశాంధ్ర ప్రచురణలు పేరుతో డా. పురిపండ అప్పలస్వామి "పులిపంజా" కావ్యమును శ్రీశ్రీ స్వదస్తూరితో రచించిన మహాప్రస్థానాన్ని ప్రచురించారు. పుస్తకాలతోపాటు వారి సొంత గొంతులతో గీతాలను టేపురికార్డులు తయారు చేయించారు.

టంగుటూరి సూర్యకుమారి లండన్‌లో నృత్యపాఠశాలను నిర్వహిస్తూ, మంచి పేరు ప్రఖ్యాతులలో వున్నారు. ఆంగ్లేయుని వివాహము చేసుకొని స్థిరపడి పోయినారు. పాశ్చాత్యదేశాలలో భారతీయ సంస్కృతికి జీవగర్రగా వుంటున్నారు.

బ్రిటిష మ్యూజియంలో మన శిల్పకళాఖండాలు, పుస్తకాలు ఎన్నో ఉన్నాయి. కిరీటములో పొదిగివున్న మన కోహినూర్ వజ్రాన్ని లండన్ టవర్ మ్యూజియంలో కళ్ళారా చూచి ఆనందించాము. మనకు సంబంధించిన అమూల్యమైన, అపురూపమైన వస్తువులు లండన్ మ్యూజియంలో వున్నాయి. ఏం చేస్తాం? వెళ్ళినవారు చూచి ఆనందించ వలసిందేగా? గుజరాతీలు, మార్వాడీలు మంచి వ్యాపారస్థులుగా రాణిస్తున్నారు. తమిళులు ప్రభుత్వ ఉద్యోగులుగా వున్నారు. అచట చాలా ఇండియన్ రెస్టారెంటులు కనపడుతున్నాయి. ఇడ్లి, సాంబారు దొరుకుతాయి. దోసెలకు మంచి గిరాకీ, నా చిన్నతనంలో తెల్లదొరలు అంటూ వుండేవారు. తెల్లదొరల తెల్లతనం, నల్లదొరల నల్లతనం తగ్గిపోతున్నట్లు కనపడుతుంది.

*(1983)*

# 21. విదేశాలలో తెలుగువారు - దక్షిణాఫ్రికా

**ఆం**ధ్ర కోస్తాప్రాంతం నుండి 19వ శతాబ్దంలో ముఖ్యంగా విశాఖపట్టణం, శ్రీకాకుళం, నేటి విజయనగరం జిల్లాల నుండి తెలుగువారు ఎక్కువమంది విదేశాలకు వలస వెళ్ళారు. విశాఖ రేవు పట్టణం అగుటవల్ల, ఆ జిల్లాలు వెనుకబడిన ప్రాంతాలు కావటం వల్ల, బ్రిటిష్ ప్రభుత్వం వారి ప్రోత్సాహంతో జీవనోపాధి కొరకు వేలాది మంది విదేశాలకు వలస వెళ్ళారు; బర్మా, మలేషియా, జావా, సుమత్ర, సింహళము, ఫిజీ దీవులు, దక్షిణాఫ్రికా, మారిషస్ ప్రాంతాలలో వలస వెళ్లిన తెలుగువారు స్థిరపడి పోయారు.

దక్షిణాఫ్రికాలో 1855లో తెలుగుగడ్డ నుండి కాలుపెట్టిన తొలిబిడ్డ శ్రీ బాబునాయుడు. 1891 జూన్ 28వ తేదీన ఎస్.ఎస్. ఉమ్మాత అనే ఓడలో మద్రాసు హార్బరు నుండి దర్బను చేరిన 490 మందిలో తెలుగువారు 159 మంది. భారతదేశం నుండి వలస వెళ్ళిన వారిలో మూడవవంతు మంది తెలుగు మాట్లాడేవారు. 124 సంవత్సరాల నుండి తెలుగువారు దక్షిణాఫ్రికాలో వున్నారు. తెలుగువారిలో డాక్టర్లు, రైతులు, కార్మికులు, గుమాస్తాలు, సైనికులు, ఉపాధ్యాయులు, చేతి వృత్తులవాళ్లు దక్షిణాఫ్రికా వెళ్ళారు. తెలుగువారి ప్రత్యేకత వ్యవసాయం. వ్యవసాయానికి అనువైన దక్షిణాఫ్రికా తీరప్రాంతంలో తెలుగువారు ఎక్కువగ స్థిరపడ్డారు. చెఱుకు తోటలలో, బొగ్గు బంగారు గనులలో పనిచేస్తున్నారు. దర్బన్, ట్రాన్స్‌వాల్, కేప్‌టౌన్, పోర్ట్ ఎలిజబెత్ ప్రాంతాలలో ఎక్కువ మంది తెలుగు వారున్నారు.

మహాత్మా గాంధీ నడిపిన దక్షిణాఫ్రికా సత్యాగ్రహ మహోద్యమంలో తెలుగువారు అసంఖ్యాకంగా పాల్గొన్నారు. జి.బి. తంబినాయుడు గాంధీజీకి కుడి భుజంగ పనిచేశారు. ట్రాన్స్‌వాల్‌లో శ్రీ పి.కె. నాయుడు గాంధీజీకి ముఖ్య అనుచరుడు.

దక్షిణాఫ్రికాలో ఆరున్నర లక్షల భారతీయులు ఉన్నారు. తెలుగువారు అరువది వేలు ఉంటారు. తెలుగుభాష, సంస్కృతి ఉద్ధరణకు 1931లో దక్షిణాఫ్రికా ఆంధ్ర మహాసభ ఏర్పడింది. అప్పుడు భారత ప్రభుత్వ ప్రతినిధిగా దక్షిణాఫ్రికాలో ఉన్న శ్రీ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు ఆంధ్ర మహాసభకు అండగా ఉండి తెలుగువారి సంక్షేమానికి ఎంతగానో

తోడ్పడ్డారు. మహాసభకు 20 శాఖలు ఉన్నాయి. ఉగాది, దీపావళి, విజయదశమి లాంటి పండుగలలో సాంస్కృతిక ఉత్సవాలు చేసుకొంటారు.

దక్షిణాఫ్రికాలోనే జన్మించి, స్థిరనివాసం ఏర్పాటు చేసుకొన్న శ్రీ పి.యం. నాయుడు గారు ఈ ఆంధ్ర మహాసభ వ్యవస్థాపకులలో ఒకరు. వారి తండ్రి పాపయ్యనాయుడు ఆంధ్ర మహాసభకు అధ్యక్షులు. ఇప్పుడు వారి అల్లుడు శ్రీ ఆర్.ఎస్. నాయుడు మహాసభకు అధ్యక్షులు.

శ్రీ పి.యం. నాయుడు గారు ఇటీవలనే ఆంధ్రప్రదేశ్ వచ్చారు. వారి తల్లిదండ్రుల స్వస్థలాలు అయిన విజయనగరం దగ్గర కోరుకొండ, పర్లాకిమిడి దగ్గర కొండవాలు గ్రామాలలో వారి జ్ఞాపకచిహ్నంగా మంచినీటి వసతిని కల్గించవలెనని ప్రయత్నాలు చేస్తున్నారు.

1977 నవంబరులో ఉప్పెన వచ్చినప్పుడు వారు హైదరాబాదులో ఉండి టి.వి.లో ఆ బీభత్స దృశ్యాలు చూచి చాలా ఖేదపడి, ముఖ్యమంత్రికి అయిదువేల రూపాయల విరాళం తుఫాను నిధికి ఇచ్చారు. ఇప్పుడు తిరిగి మళ్ళీ ఆంధ్రప్రదేశ్ వచ్చి ఉప్పెన ప్రాంతాలలో పునర్నిర్మాణ కార్యక్రమాలుచూసి ఎంతో తృప్తి చెందారు. ఉప్పెన వల్ల నిరాధారులైన వృద్ధుల శరణాలయానికి అవనిగడ్డ సేవాశ్రమంలో శ్రీ నాయుడుగారు శంకుస్థాపన చేసి పదివేలు విరాళం ప్రకటించారు. వారెంతో ఉదారులు. ప్రేమ స్వరూపులు.

దక్షిణాఫ్రికాలో తెలుగువారిని గురించి నా ప్రశ్నలకు శ్రీ పి.యం. నాయుడుగారి సమాధానాలు.

నాయుడుగారూ! నమస్కారం. మీ పేరేమిటి?

నమస్కారం. నా పేరు పి.యం. నాయుడు.

పి.యం. అంటే?

పి. యంటే మా తండ్రి పేరు పాపయ్య,

తండ్రిపేరు పాపయ్య, యం. అంటే?

మునుస్వామి.

పాపయ్య మునుస్వామి నాయుడు. ఇంటిపేరు?

ఇంటిపేరు ఆదిరెడ్డి.

మీరెప్పుడు వెళ్ళారక్కడికి?

మా నాయనమ్మ హయాములో.

మీ నాన్నగారికి ఎన్ని సంవత్సరాలున్నప్పుడు వెళ్ళారు?

తొమ్మిది సంవత్సరాల వయస్సులో వెళ్ళారు.

అంటే మీ నాయనమ్మగారితో వెళ్ళారు మీ నాన్నగారు.

అవును.

అంటే దాదాపు వంద సంవత్సరాలవుతున్నది వాళ్ళు వెళ్ళి.

అంటే మీరెక్కడ పుట్టారు?

సౌతాఫ్రికాలో పుట్టినాను.

మీ నాయన ఎక్కడ పనిజేసేవారు?

మా నాయనొచ్చి చెఱుకుతోటలో పనిచేసేవాడు.

అంటే కూలీగా పనిజేసేవారా?

అవును.

అంటే మీనానమ్మగారు కూడా బహుశః కూలిపని చేసేవారు.

కూలిపనికి వెళ్ళి వుండాలి. చెఱకు కొట్టడం వాటికిని.

అవును.

అంటే మీ వయస్సిప్పు డెంత?

డెబ్బయి నాలుగండి. ఒకవెయ్యి తొమ్మిదివందల ఐదవ సంవత్సరములో నుండి పుట్టినాను.

ఎప్పుడొచ్చారు తమరిక్కడికి?

రెండువారాలౌతున్నది.

ఏమిటి మీ కార్యక్రమము

చూడ్డానికి వచ్చినాను.

తరవాత మీ నాన్నగారి పేరుతో, అమ్మగారి పేరుతో రెండు రిగ్గులు వేయాలనుకొంటున్నారు గదా! ఎక్కడ!

వారి స్వస్థలంలో

అంటే తెలుగుదేశంతో మీకు సంబంధం ఉండాలీ అని చెప్పి మీ ఉద్దేశం.

అంతే.

1977లో వచ్చారు. మళ్ళా ఇప్పుడు వచ్చారు. అంటే మీరు ప్రతి నాలుగైదు సంత్సరాల కొకసారి వస్తున్నారు.

అవును. నా బిడ్డలు అంతా కూడా వచ్చినారు. కోడలు, బిడ్డలు అంతా వచ్చినారు.

అంటే వాళ్ళందరికీ దేశం చూపించటానికి తీసుకొచ్చారు. మరి, మీయింట్లో అంతా ఇప్పుడు తెలుగు మాట్లాడతారా?

ఇంత నిండా లేదు. మీ మాదిరి నిండా లేదు.

అక్కడి తెలుగువాళ్ళంతాకూడా తెలుగు మాట్లాడతారా?

మాట్లాడుతారు, కొంచెం కొంచెం. మధ్యన ఇంగ్లీషుకూడా మాట్లాడుతారు.

ఎక్కువ భాష ఇంగ్లీషే అక్కడ. ఇంగ్లీషుతో కలిపి మాట్లాడుతూ ఉంటారు.

అవును.

మరి అక్కడ కల్చరల్ ప్రోగ్రాములు అవి జరపటానికి మన వాళ్ళెవరైనా వచ్చారా అటు?

ఉమాభారతి నాట్యబృందం వారు వచ్చినారు. ఆంధ్ర సభవారు తీసుకొచ్చినారు.

తరువాత ఇంకెవరైనా వచ్చినారా?

ఇంకెవరు రాలేదు.

వేణు మాధవ్?

వేణుమాధవ్... ట్రూపులో వచ్చినారు. వాళ్ళంతా కలిసే వచ్చారు.

మీరు మన తెలుగువారికి ఏమి సందేశం ఇస్తారు. చెప్పండి.

తెలుగు వారంతా ఎక్కడున్నా అన్నదమ్ముల్లా గుండాలి; అని నా ఆశ. మా వాళ్ళు గూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుంచి ఇక్కడి స్కూళ్ళకు వచ్చినారు. ఇక్కడ చదువుతున్నారు. పూనాలో ఒకరు, ఇంకా కొన్ని చోట్ల ఉన్నారు.

అందుకని ఎక్కువ మంది ఇక్కడ చదువుకొనటానికి అవకాశం ఇవ్వాలి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు కూడా. మరి మేము కూడా యిదివరకు మూడు సీట్లు కేటాయించాము యం.బి.బి.యస్.లోను, బి.ఇ. సీట్లు, అగ్రికల్చరల్, ఇవన్నీ కూడా మేము చేసాము. కాని ఇవి చాలటంలేదు. మా దేశానికి కూడా కొన్ని సీట్లు ఇవ్వాలని మా కోరిక. ఇక్కడ విద్యావకాశాలు కల్పించాలి.

తరువాత అక్కడ పిల్లలకు పుస్తకాలు అటువంటివి?

పుస్తకాలు అవీ కూడా మీరే మాకు పంపించాలి.

సరే చాల సంతోషమండి. మీరు ఎప్పుడూ ఇక్కడికి వస్తూ ఉండాల. మమ్మల్ని చూస్తూ ఉండాల. మీకు మాకు సంబధం, అక్కడి తెలుగువారికి, ఇక్కడి తెలుగువారికి – ఎందుకంటే మనమంతా ఒక భాష, ఒక సంస్కృతి, ఒకే బంధువర్గంలో వాళ్ళం కాబట్టి మనమంతా కలసి ఉండాలి.

అవునండి.

నమస్కారం.

నమస్కారమండి.

# 22. మలేసియాలో తెలుగువారు

ప్రకృతి సౌందర్యానికి, మలయమారుతానికి స్థావరమైన మలేసియా ద్వీపకల్పం సుసంపన్నమైనది. మలేషియాకు, మనదేశానికి అతి ప్రాచీన కాలం నుండి సన్నిహిత సంబంధాలు ఉన్నాయి.

ఆంధ్రదేశాన్ని శాతవాహనులు పాలించేకాలంలో తెలుగుదేశం నుంచి బౌద్ధమత ప్రచారకులు మలేసియా వెళ్ళినట్లు అనేక ఆధారాలున్నాయి. ఆనాడు నిర్మించిన దేవాలయ శిథిలాలు, తదనంతరం అనేక పట్టణాలలో దొరికాయి. కళింగ సంతతికి చెందిన రాజులు మలేసియాను పరిపాలించినట్లు తెలుస్తుంది. కలింగ పదానికి క్లెంగ్ అనే నామాంతరం నేడు వాడుకలో కనిపిస్తుంది.

మలేసియా దేశంలో నూటికి డెబ్బైవంతులు దట్టమైన అడవులున్నాయి. ఎటు చూచినా పచ్చగా, ప్రకృతి రామణీయకంతో కనిపంచే ఈ దేవంలో సంవత్సరానికి 100 అంగుళాలదాకా వర్షాలు కురుస్తాయి. విమానం పైనుంచి క్రిందికి తొంగిచూస్తే ఈ ప్రదేశమంతా ఆకుపచ్చగా కోకో, రబ్బరు, కొబ్బరితోటలతో కళకళలాడుతుంది.

బ్రిటిషువారి పరిపాలనాకాలంలో మలేషియా ప్రాంతం అభివృద్ధికి మన దేశం నుంచి అధిక సంఖ్యలో కార్మికులను తీసుకొనివెళ్ళటం జరిగింది. 1920 ప్రాంతంలో మద్రాసు, విశాఖ రేవుల నుండి తమిళులు, తెలుగువారు వెళ్ళారు. అక్కడికి వెళ్ళిన తెలుగువారిలో విశాఖ, శ్రీకాకుళం ప్రాంతాలకు చెందిన తెలుగువారే ఎక్కువగా ఉన్నారు.

దట్టమైన కారడవులను కొట్టించి, కోకో, రబ్బరు తోటలను పెంచారు. ఈ తోటలలో పనిచేసేవారిలో తెలుగువారే ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. కష్టపడి పనిచేసేవారిలో తెలుగువారే ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. కష్టపడి పనిచేసే తత్త్వం కలిగిన తెలుగువారు మలేషియాను అభివృద్ధి చేయటంలో, సుసంపన్నంగా రూపొందించటంలో ఎంతగానో తోడ్పడ్డారు. మలేషియాలో పెద్దదైన టిన్ను పరిశ్రమలోకూడ తెలుగువారు పనిచేస్తున్నారు. ఇక్కడ నివసిస్తున్న తెలుగు వారిలో చాలామంది కార్మికులే, అయినప్పటికీ వీరంతా

ఆర్థికంగా, సామాజికంగా మంచి ఉన్నత స్థితిలో ఉన్నారని చెప్పటం మనకు గర్వకారణమే. అంతేకాదు, ఇతర ఉద్యోగాలలో, వ్యాపారం, వ్యవసాయ రంగాలలో ఉన్న తెలుగువారే కాకుండా, వృత్తివిద్యల్లో మంచి పేరుపొందిన డాక్టర్లలో తెలుగువారు కూడా ఉండటం చెప్పుకోదగిన విషయం.

మలేషియాలో దాదాపు ఓ యాభై వేల మంది తెలుగువారున్నారు. మలయా, చైనీయులు, తమిళుల తరువాత తెలుగువారే అధికసంఖ్యలో ఉన్నారు. విదేశాలలో అధిక సంఖ్యలో తెలుగువారున్న దేశాలలో మలేషియా మొదటిది. ఇక్కడ ఉన్న తమిళులు, తెలుగువారు మదరాసీయులు, దక్షిణాదివారు అనే పేరుతో పిలువబడుతుంటారు. ఇక్కడ తమిళప్రభావం, ప్రాబల్యం ఎక్కువగా ఉంది. తమిళులు, తెలుగువారు సంబంధ బాంధవ్యాలు చేసుకొంటున్నారు. తమిళులలోకూడా తమిళ నాడు నుంచి వచ్చిన తెలుగువారున్నారు. తమిళులు తెలుగు మాట్లాడుతారు. తెలుగువారు తమిళం మాట్లాడుతారు.

మలేషియాలో ఇండియన్ కాంగ్రెస్ పేరుతో తమిళులు రాజకీయ ప్రాబల్యాన్ని సంపాదించారు. ఆ సంస్థలు తెలుగువారిని ప్రోత్సహించటంలేదు. అందువల్ల 1956లో ప్రత్యేకంగా ఆంధ్ర సంఘం ఏర్పాటు అయింది. ఇక్కడ ఉన్న తెలుగువారంతా కలిసి సాహిత్య, సాంస్కృతిక సత్సంబంధాలను పరిరక్షించుకోవడానికి, తెలుగు విద్యావ్యాప్తికి, తెలుగు భాషాభివృద్ధికి, తెలుగుదనాన్ని చైతన్య వంతం చేయడానికి ఈ సంఘాన్ని స్థాపించుకొన్నారు. అప్పటినుంచి స్థానికంగా తెలుగువారు ఎదుర్కొనే సమస్యలను పరిశీలించడం, వారి సాధకబాధకాలను గమనించడం ఈ సంఘం తన ప్రధాన లక్ష్యంగా పెట్టుకొంది. ఇప్పుడు ఈ సంఘానికి 15 బ్రాంచీలు ఉన్నాయి. మంచి కార్యకర్తలు ఉన్నారు.

ఇక్కడ ఉన్న తెలుగువారు తెలుగు సంప్రదాయాన్ని కాపాడుకొంటూ, ఉగాది, సంక్రాంతి, దీపావళి, విజయదశమి వంటి పండుగలను చేసుకొంటూ ఉంటారు. అప్పుడప్పుడు సాంస్కృతిక ఉత్సవాలు ఎంతో ఉత్సాహంగా జరుపుకొంటూ ఉంటారు. కళావాహిని అనే పేరుతో యువకులంతా కలిసి లలిత గీతాలు, బృందగానాలు, నాటకాలు రూపొందించి సాంస్కృతిక కార్యక్రమాలలో ప్రదర్శిస్తుంటారు. ఇప్పుడు మలేషియాలో ఇరవై అయిదు తెలుగు పాఠశాలలు ఉన్నాయి. యాభై మంది తెలుగు

ఉపాధ్యాయులున్నారు. పదిహేను వందల మంది తెలుగు విద్యార్థినీ విద్యార్థులు ఉన్నారు. మలే, ఆంగ్ల భాషలు తప్ప తక్కి అన్ని పాఠాలు తెలుగు భాషలోనే ఈ పాఠశాలలో బోధింపబడుతున్నాయి. మన తెలుగువారిలో కొందరు మలేసియా ప్రభుత్వ గౌరవ బిరుదాలను పొందిన వారు ఉన్నారు.

సింపాంగ్, అంపాట్‌లో 80 సంవత్సరాల వయసుగల ఎల్లపు వెంకట రత్నంగారిని కలుసుకొన్నాను. వారు 1920లో మలేసియా వచ్చారు. వారిది విశాఖపట్టణంవద్ద వెంగుపాలెం. బ్రిటిషువారి తరఫున తెలుగువారిని తీసుకొని రావడానికి ఏజెంటుగా పనిచేశారు. అప్పటి వారి అనుభవాలను వివరించి చెప్పారు. అదేవిధంగా మడితి అప్పన్న విశాఖపట్టణం వద్ద జగ్గరాజుపేట, గుమ్మడి అచ్చన్న భీమవరం, ఎడ్ల ముత్యాలమ్మ గండిశెట్టిపాలెం, విశాక బుడగళ్ళ సింహాచలం 70 సంవత్సరాలపైన వృద్ధులందరితోను ముచ్చటించినాను. ఆ రోజులలో కూలీ ఆరు రూపాయలు ఇచ్చేవారట. ఇప్పుడు ఆరు డాలర్లు ఇస్తున్నారట. అంటే 24 రూపాయలు ఇస్తున్నారట.

ఇక్కడ తెలుగు బోధించే ఉపాధ్యాయులకు జీతం 300 డాలర్ల నుండి వెయ్యిడాలర్లు వరకు ఉంది. డాలరు మన ఇండియన్ కరెన్సీలో నాలుగు రూపాయలు. వారి కనీస జీతం 250 డాలర్లు, అంటే వెయ్యిరూపాయలు. అందుకే కార్మికుడయినా అక్కడ సుఖజీవనాన్ని గడుపుతున్నాడు. చిన్న ఉద్యోగస్థులు, టీచర్లు కూడా అక్కడ కార్లను కలిగి ఉన్నారు.

అక్కడి తెలుగు పాఠశాలను చూశాను. పిల్లలు తెలుగు మాట్లాడుతారు, స్త్రీలు కూడా చక్కగా తెలుగు మాట్లాడుతారు. తెలుగు సంస్కృతిని అక్కడి వారి ఇళ్ళల్లో, తెలుగు ఆడపడుచుల కట్టుబొట్టు తీరులలో చూడగలుగుతాము. అక్కడి తెలుగువారు తెలుగు మాట్లాడేటప్పుడు వారి మాటల్లో తమిళ, మలయ, చైనీస్ పదాలు దొర్లుతూ ఉంటాయి. అక్కడి చైనీస్ యువకులు కొన్ని సందర్భాలలో నాతో తెలుగు మాట్లాడారు.

హైదరాబాదులో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగినప్పుడు విదేశాల నుంచి వచ్చిన ప్రతినిధులలో మలేసియా నుంచి వచ్చిన విదేశీ ప్రతినిధుల సంఖ్య అధికంగా ఉంది. ఈ ప్రతినిధి బృందానికి మలేసియా ఆంధ్ర సంఘాధ్యక్షులు డాక్టర్ సి. అప్పారావుగారు అధ్యక్షత వహించారు. మొదటి ప్రపంచ తెలుగు మహాసభలలో కలిగిన ఉత్సాహం, ఉత్తేజంతో వీరు రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు తమ దేశంలో

అంటే మలేసియాలో జరపాలని నిశ్చయించుకొని అక్కడికక్కడే తమ ఆహ్వానాన్ని ప్రకటించారు.

అప్పట్లో చేసుకున్న నిశ్చయాల, నిర్ణయాల మేరకు రెండవ ప్రపంచ తెలుగు మహాసభలు మలేసియా రాజధాని కౌలాలంపూర్‌లో 1980 ఏప్రిల్‌లో జరపాలనే కృతనిశ్చయంతో ఉన్నారు అక్కడి తెలుగువారు. అందుకు సంబంధించిన సన్నాహాలు అమితోత్సాహంతో ప్రారంభిస్తున్నారు. యువకులంతా రెండవ ప్రపంచ తెలుగు మహాసభల చిహ్నం కలిగిన బనీన్లను వేసుకొని ఈ కార్యక్రమం నిమిత్తం ఏర్పాట్లలో నిమగ్నమైనారు. ఒక్కొక్కరు 200 డాలర్లు విరాళంగా ఇచ్చి మహాసభలు దిగ్విజయంగా జరగాలనే ఆశయంతో ముందుకొచ్చి దాదాపు 300 మంది ప్రతినిధులుగా చేరుతున్నారు.

మలయమారుతంతో, ప్రకృతిశోభను సంతరించుకొన్న మలయా విశ్వ విద్యాలయం ఆవరణలో ఈ సభలు జరపాలని అక్కడి తెలుగువారు నిర్ణయించుకొన్నారు. హాస్టళ్ళలో సభలకు వచ్చిన ప్రతినిధులకు వసతి సౌకర్యాలు కల్పించడానికి, స్నాతకోత్సవం జరిపే విశాలమయిన హాలులో మూడువేల మందితో ఈ సభలు నిర్వహించడానికి ప్రణాళికలను ఏర్పరచుకొన్నారు. ఈ మహాసభలలో పాల్గొనే ప్రతినిధులు స్థానికంగా 300 మంది, భారతదేశం నుండి నాలుగువందల మంది, విదేశాల నుండి వందమంది మొత్తం సుమారుగా ఎనిమిదివందలమందికి భోజన, వసతి, వినోద పర్యటన ఏర్పాట్లు మహాసభల ఆహ్వానసంఘం చేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ నుండి కళాకారులను, విద్వాంసులను, కవులను మహాసభల సాంస్కృతిక, సాహిత్య కార్యక్రమాలలో పాల్గొనేందుకు పంపవలసి ఉంటుందని వారు అర్థించారు. అక్కడ తెలుగు టైపులు లేనందువల్ల రెండవ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ప్రచురించే మోనోగ్రాపులు, సావనీర్లు మొదలైన వాటి ప్రచురణ కూడా మన రాష్ట్రంలోనే చేయవలసి ఉంటుందని వారి అభ్యర్థన. ఈ మోనోగ్రాపులు మన తెలుగుబాషా, చరిత్ర, సాహిత్యం, సంగీతం లలిత కళలు, పారిశ్రామిక పురోగతి మొదలైన విషయాలను అక్కడి తెలుగువారికి తెలియజెప్పే విధంగా ఉండాలని భావన. అంతేకాదు తెలుగు చలన చిత్రాలలో మంచి చిత్రాలను అంటే మన పౌరాణిక ఔన్నత్యాన్ని, దేశచరిత్రను, జాతి చరిత్రను, మన సంస్కృతీ సంప్రదాయాలను చాటిచెప్పే చక్కని తెలుగు చిత్రాలను మన దేశం నుంచి తీసుకొని వెళ్ళి ఈ మహాసభల సందర్భంగా అక్కడ ప్రదర్శిస్తే బాగుంటుందని వారు కోరారు.

తెలుగువారు ఎక్కువగా ఉన్న సింపాంగ్, అన్‌సన్, సబాక్, టెలుక్, సిత్యవాన్, సూంగ్రసుమన్, బాగ్‌దత్తో, కూలిమ్, క్లువాంగ్, కోలాపేరన్, లడాగ్, బగవాపాస్‌ర్, ఈప్లోసెలంగో మొదలగు కేంద్రాలలో జరిగిన సభలలో పాల్గొని తెలుగువారి స్థితిగతులను గూర్చి తెలుసుకోవటం జరిగింది. పెనాంగ్ సింగపూర్ తెలుగు సమాజ సభలలో పాల్గొనడం కూడా జరిగింది. ఈ సందర్భంగా ధ్వన్యనుకరణ కళాకారులు శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్ వినోద ప్రదర్శనను ఇచ్చారు.

దాదాపు 60 సంవత్సరాల క్రితం వెళ్ళి అచ్చట స్థిరవాసం ఏర్పాటు చేసుకొన్నప్పటికి తెలుగువారు ఈనాటికి భాషను, తమ సంస్కృతిని పరిరక్షించుకొంటూ వస్తున్నందుకు వారిని నిజంగా మనమంతా అభినందించి తీరాలి. ఇప్పటికీ మన పాటలు, జానపదగేయాలు, నృత్యాలు వంటి వాటిని వారు మరిచిపోకుండా అనుసరిస్తు, అభినయిస్తూనే ఉన్నారు. ఇందుకు వారి మాతృభాషా సంస్కృతులపట్ల గల ఆదరాభిమానాలు, గౌరవాలు వ్యక్తం అవుతున్నాయి. రెండవ ప్రపంచ తెలుగు హాసభలు జయప్రదం చేయటం ద్వారా వారిలో ఈ చైతన్యాన్ని, అభిమాన గుణాన్ని ఇనుమడింప జేయటం, వారిలో ఉత్తేజాన్ని కల్గించటం తెలుగువారిగా మనందరి కర్తవ్యం.

# 23. ఉత్తర అమెరికాలో తెలుగువారు

ప్రపంచంలో బహుసంపన్నమైన, అభివృద్ధికాబడినదేశం ఉత్తర అమెరికా. అమెరికాలో డాక్టర్లుగా ఇంజనీర్లుగా చాలామంది ఆంధ్రులు వెళ్ళి ఉద్యోగాలుచేస్తూ సంపాదిస్తున్నారు. చదువుకొనటానికివెళ్ళీ ఉద్యోగాలలో స్థిరపడి, స్థిరనివాసము ఏర్పరచుకొన్నవారుకూడా కొంతమంది ఉన్నారు.

తెలుగు భాషను, తెలుగు సంస్కృతిని మరచిపోకుండా ఉండటానికి తెలుగు సాంస్కృతిక సంఘాలెన్నో ఏర్పడినాయి. 1975లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలను వైభవోపేతంగా హైదరాబాద్‌లో జరిపిన తరువాత వివిధ దేశాలలోని తెలుగువారిలో ఎంతో ఉత్సాహం వచ్చింది. ఇతర రాష్ట్రాలలోని, విదేశాలలోని తెలుగువారి సమస్యలను గురించి తెలుసుకోవడానికి అంతర్జాతీయ తెలుగు సంస్థను ఏర్పాటు చేయటంతో వివిధ ప్రాంతాలలోనున్న తెలుగువారిలో నూతన చైతన్యం కలిగింది. తెలుగువారున్న దేశాలలో తెలుగు సంఘాలు ఏర్పడినాయి.

1976ల ఆగస్టు 26వ తేదీన న్యూయార్కులో వినాయక చవితి సందర్భంగా ఉత్తర అమెరికా తెలుగు మహాసభలను జరపాలనే ఆలోచనలువచ్చాయి. డా॥ గుత్తికొండ రవీంద్రనాథ్, డా॥ కాకరాల సుబ్బారావుగార్ల సహకారంతో 1977 మే 28, 29 తేదీలలో న్యూయార్కు పట్టణంలో ఉత్తర అమెరికా తెలుగు మహాసభలు జరిగాయి. 900 మంది ప్రతినిధులు వచ్చినారు. తానా సంస్థ అంటే తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా ఏర్పడి మేరీలాండ్‌లో రిజిష్టరు చేయబడింది. 1979లో డిట్రాయిట్, 1981లో చికాగో 1983లో వాషింగ్టన్, 1985లో లాస్ ఏంజల్స్‌లో తానా సంస్థ సభలు జరిగాయి. రెండు సంవత్సరాల కొకసారి జరుగుతున్న ఉత్తర అమెరికా తెలుగు మహాసభలు 1987లో 6వ మహాసభలు సెయింట్ లూయిస్‌లో జరపడానికి విపుల ప్రయత్నాలు చేస్తున్నారు.

తెలుగు సైంటిస్టులందరూ పిట్సుబర్గ్‌లో సమావేశమై తెలుగు సైంటిస్టుల అసోసియేషన్‌ను ఏర్పాటు చేసినారు. మనదేశంలో పరిశ్రమల అభివృద్ధికి, సాంకేతిక సలహాలను ఇవ్వడానికి ఈ అసోసియేషన్ పనిచేస్తుంది. పరిశ్రమల అభివృద్ధికి, సాంకేతిక మార్పులకు తానా ఆధ్వర్యంలో ఈ సంస్థ తోడ్పడుతుంది.

1983 అక్టోబర్‌లో ఉత్తర అమెరికా వెళ్ళినపుడు న్యూయార్క్, వాషింగ్‌టన్, చికాగో, డిట్రాయిట్, సెయింట్‌లూయిస్, శాన్‌ఫ్రాన్సిస్‌కో, లాస్‌ఏంజెల్స్, క్లీవ్‌లాండ్, హ్యూస్టన్, పిట్సుబర్గ్, స్ప్రింగ్‌ఫీల్డ్ తెలుగు సాంస్కృతిక సంఘాల సమావేశాలలో, న్యూజెర్సీలో ఏర్పాటుచేసిన దీపావళి ఉత్సవాలలో పాల్గొనే అవకాశం కలిగింది. ఉత్తర అమెరికాలోని తెలుగువారు తెలుగు సంస్కృతిని ఎలా కాపాడుతున్నారో తెలుసుకోగలిగాను. హ్యూస్టన్‌లో శ్రీమతి రత్నపాప, శ్రీమతి ఉమాభారతి నిర్వహిస్తున్న నృత్యపాఠశాలలను చూచినాను. మన కూచిపూడి నృత్యాన్ని నేర్చుకొనడానికి అమెరికన్లు ఎంతోమంది ఉత్సాహంతో వస్తున్నారు.

తానాకు అనేక అనుబంధశాఖలు ఏర్పడి పనిచేస్తున్నాయి. సేవాసంస్థలకు సహాయము చేయడానికి తానా ఫౌండేషన్, వైద్యసహాయముచేయడానికి తానా ఫిజిషియన్, వ్యాపార విషయములలో తోడ్పడటానికి తానా ఛాంబర్ ఆఫ్ కామర్స్, స్త్రీల సంక్షేమానికి తానా మహిళాసంస్థ, సాంకేతిక విషయములనుగురించి తానా తెలుగు శాస్త్రజ్ఞుల విద్యావంతుల కమిటీ యువకులను ఉత్సాహపరచటానికి తానా యువజన సమితి ఏర్పడి వివిధ రంగాలలో కృషి చేస్తున్నాయి. తెలుగువారు అమెరికాలో కష్టపడి సంపాదించిన డబ్బుతో ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలను నెలకొల్పడానికి, ఆసుపత్రులను స్థాపించుటకు ముందుకు వస్తున్నందుకు సంతోషము.

## హిందూ దేవాలయాలు

అమెరికాలో హిందూ దేవాలయాల నిర్మాణం చురుకుగా, జోరుగా సాగుతున్నది. అమెరికన్లుకూడా హిందూ దేవాలయాలకు వచ్చి పూజలు, భజనలు చేస్తున్నారు. పిట్సుబర్గ్, లాస్‌ఏజెల్స్, అరోరా (చికాగో), ఫ్లషింగ్ (న్యూయార్కు)లో వెంకటేశ్వర దేవాలయాలు, ఫ్లెంటులో విశ్వేశ్వర, న్యూయార్కులో గణపతి, ట్రాయి (డిట్రాయిట్), వేపింగరపాల్సులలో విష్ణు దేవాలయములు, లెమెంట్ (చికాగో)లో రామ దేవాలయము సియర్‌లాండ్ (టెక్సాస్)లో మీనాక్షి దేవాలయము, మన్రొవెల్లి, లివర్మోర్‌లలో హిందూ దేవాలయములు కట్టి పూజలు చేస్తున్నారు. పండుగలకు సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వేలాది భారతీయుల్తో పాటు అమెరికన్లు కూడా దేవాలయములకు వెళ్ళుచున్నారు. అమెరికాలో హరేకృష్ణ ఉద్యమం బాగావుంది. అన్ని పట్టణాలలో కేంద్రాలున్నాయి. ఉచితంగా భోజనాలు పెట్టెదరు. పుస్తకాలు పంచి పెట్టుదురు. ప్రసాదము ఇస్తారు. హిందూ రెలిజియస్ ఇన్‌స్టిట్యూట్ (హరి) ప్రారంభించబడినది. హిందువుల పండుగలు, పూజలు చేయటం, భారతీయ సంస్కృతిని, సంగీతాన్ని పోషించటం ఈ సంస్థల ముఖ్యోద్దేశము.

**సాంకేతిక సహకారము**

ఉత్తర అమెరికాలో ఉన్న తెలుగు వారు ఎక్కువమంది మనదేశంలో ఉన్నత విద్య చదువుకొని వృత్తిరీత్యా వెళ్ళి సంపన్నులుగా పెరిగినారు. తిరిగి ఆంధ్రప్రదేశ్ వచ్చే అవకాశాలున్నాయి. అందుచేత మనరాష్ట్రంలో పరిశ్రమల ప్రగతికి, సాంకేతిక సహకారానికి ఉత్తర అమెరికా ఆంధ్రులు ఎక్కువగా ఉపయోగపడవచ్చును.

మలేషియా, మారిషస్, ఫిజీ, దక్షిణాఫ్రికా, శ్రీలంక దేశాలకు వలస వెళ్లిన తెలుగువారు నిరుపేదలు. జీవనోపాధికొరకు వెళ్ళి స్థిరపడిపోయారు. వారు అపుడపుడూ కొంతమంది ఆంధ్రప్రదేశ్‌లోని వారి బంధువులను చూడడానికి రావడమే తప్ప, ఆ దేశాన్ని వదలివచ్చే సమస్యలేదు. స్థిర ఆస్తులను సంపాదించుకొని ఆయా దేశాలలో కలిసిపోయారు.

నేను ఉత్తర అమెరికాలో పర్యటించినపుడు ప్రపంచ తెలుగు మహాసభలను లాస్ ఏంజెలెస్‌లో ఉత్తర అమెరికా తెలుగు మహాసభలతో కలిపి జరపాలని ఎంతో ఉత్సాహమును చూపారు.

ఇతర దేశాలనుండి తెలుగువారు ఆంధ్రప్రదేశ్‌లో సాంకేతిక సహకారానికి, ఆంధ్రప్రదేశ్ నుండి ఇతర దేశాలలో వున్న తెలుగువారి సాంస్కృతిక వికాసానికి తోడ్పడే సమస్యలపై ముఖ్యంగా చర్చించడానికి తృతీయ ప్రపంచ తెలుగు మహా సభలను జరిపితే బావుంటుందని తానా అధ్యక్షులు డా॥ చంద్రశేఖరరావు, ఆహ్వాన సంఘ అధ్యక్షులు డా॥ రాఘవేంద్రప్రసాద్, సెంట్‌లూయిస్‌లో డా॥ రాజేంద్రప్రసాద్, న్యూయార్కులో డా॥ కె.వి. రావు సూచించారు. తిరిగివచ్చిన తరువాత ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుగారితో చర్చించినాను. చూద్దాం అన్నారు. 1975లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు అత్యంత వైభవంగా జరుపుకొన్నాము. 1983లో కౌలాలంపూర్‌లో రెండవ ప్రపంచ తెలుగు మహా సభలను ఉత్సాహంగా మలేషియా తెలుగు సంఘం జరిపింది. మూడవ మహాసభలు జరపడానికి మారిషస్ తెలుగు సంఘం, అమెరికా తెలుగు సంఘం ముందుకు వచ్చాయి. వారికి ఉత్సాహం ఇచ్చేవారు లేక మహాసభలు మాటలలోనే మిగిలి పోయినవి. మరల ప్రపంచంలోని తెలుగువారు ఒకవేదికపైకి రావటం ఎప్పుడో? మహాసభలను నిర్వహించే అదృష్టం ఎవరికో? చేసేది ఏముంది? వేచిచూద్దాం. విదేశాలలో వున్న తెలుగు నిపుణుల సలహాలు తీసుకొని రాష్ట్ర ప్రగతికి తోడ్పడే దానికయినా కృషి చేస్తే మంచిదని సంతోషిద్దాం.

*(1986)*

# విషయసూచిక


| | | |
|---|---|---|
| పరిచయం : పద్మభూషణ్ డా॥ మోటూరి సత్యనారాయణ | | 121 |
| సంపాదకుని ప్రస్తావన : జోశ్యుల సూర్యనారాయణమూర్తి | | 125 |
| 1. | గాంధీ దర్శనం | 127 |
| 2. | కాశీలో గాంధీజీ ప్రథమ ఉపన్యాసం | 130 |
| 3. | గాంధీ - గాంధీయిజం | 133 |
| 4. | కార్మిక సంక్షేమం - గాంధీజీ | 137 |
| 5. | నిర్మాణ కార్యక్రమము - గాంధీజీ | 141 |
| 6. | నిర్మాణ కార్యక్రమము - నాడు-నేడు | 146 |
| 7. | అన్ని వాదాలకన్నా గాంధీయవాదం మిన్న | 149 |
| 8. | విదేశాలలో గాంధీ ప్రభావం | 152 |
| 9. | గాంధీయ మార్గంలో రాజకీయ వ్యవస్థ సాధ్యమా? | 154 |
| 10. | ప్రపంచానికి గాంధీయ మార్గమే శరణ్యం | 158 |
| | అనుబంధం శ్రీ మండలితో ఇష్టగోష్ఠి | 160 |

# పరిచయం

– పద్మభూషణ్ డా॥ మోటూరి సత్యనారాయణ

మిత్రులు మండలి కృష్ణారావు గారు రచించిన "గాంధీ దర్శనం" అమూలాగ్రంగా చదువుతూ ఉంటే గాంధీ యుగంలో నేను స్వయంగా గాంధి గారి సంపర్కంలో గడిపిన కాలంలో జరిగిన ఘట్టాలు, అనుభవాలు జ్ఞాపకం వచ్చినాయి.

1917 సెప్టెంబరు మాసంలో దేశభక్తులు, ప్రఖ్యాత దేశా సేవా నిరతులైన చెరుకువాడ నరసింహంగారి ఉపన్యాసం గాంధీ గారి గురించి కవుతరంలో విన్నది మొదటి జ్ఞాపకం. వారు స్వయంగ అప్పుడప్పుడే గాంధీజీ ప్రారంభించి ఆశ్రమాన్ని చూచి గాంధీ గారి నిత్య జీవితాన్ని గురించి చెపుతూ వారి తపశ్చర్యను, విజ్ఞానాన్ని, సేవాపరత్వాన్ని పరవశులూ వర్ణించి శ్రోతలలో ఆత్మ విస్మృతిని కలిగించారు. అది గాంధీ గారి వ్యక్తిత్వంలోను, వారి విజ్ఞాన వివేక వైదుష్యంలోను నాకు గట్టి నమ్మకం కలగడమే కాక, వారి వ్యక్తిత్వంలో లీనమయి పోవడానికి సంకల్పం చేసుకోవడానికి ప్రేరణ ఏర్పడింది. 1917 నుండి మూడు దశాబ్దాలు ఆయనతో సాన్నిహిత్య మేర్పరచుకొనడమేగాక, ఆయన ప్రేమను, అభిమానాన్ని, ఆదరణని సంపాదించడానికి కృషి చేసిన వాళ్ళలో నేనొకడిని.

ఆయన వ్యక్తిత్వం చూచేవారికి ఒక కాంతి పుంజంగాను, వినే వారికి ఒక జ్ఞాన ప్రకాశికగాను, ఆదర్శ నిర్మాణం చేసుకొనే వారికి ఒక ధ్రువతారగాను ఏర్పడడానికి కారణాలు ఎంతో మంది ఎన్నో విధాలుగా చెప్పుతారు. కొందరు ఆయనను ఋషిగాను, మరికొందరు రాజకీయ

వేత్తగాను, ఇంకా కొందరు సహజంగా దివ్యత్వము సంపాదించుకో గలిగిన మహానుభావుడుగాను అయిన మానవుడుగాను వర్ణిస్తారు. ఈ మధ్య అమెరికాలో పర్యటన చేస్తున్నప్పుడు ఒక పాత్రికేయుడు గాంధీ గారు ఇంత గొప్ప ఖ్యాతిని సంపాదించడానికి కారణమేమిటి అని ప్రశ్న వేస్తే నాకు తోచి చెప్పిన సమాధానమిది. "ప్రపంచంలో ఇతరులను జయించిన వారంతా పరాక్రమవంతులు. వారి పరాక్రమం జయింపబడిన వారి పరాక్రమంతో సాధారణంగా పోల్చబడుతుంది. కాని తనను అంటే తన బలహీనతను తన ఆత్మశక్తితో సాధించి తదితరులెవ్వరూ చూపలేని సాహసాన్ని, చేయలేని కార్యాన్ని, సంపాదించుకోలేని శక్తిని కనపరిచినప్పుడు అతనొక అజేయ పురుషుడుగ పేర్కొనబడతాడు. ఏ బలహీనత ఆయనను లొంగదీయలేనప్పుడు ఆయన ఆత్మ విజయాన్ని సంపాదించి తదితరులకు ఆదర్శపురుషుడవుతాడు. ఇట్టి గొప్పతనమే గాంధీ గారికి తెచ్చిన ప్రఖ్యాతి.

ఆయన తన తపశ్చర్యలవల్ల విజ్ఞానులలో ఉత్తముడైన విజ్ఞానియే కాకుండా, ఉత్తముడైన పండితుడని చెప్పడానికి కూడా ఎన్నో ఘట్టాలు నేనెరుగుదును. ఒకనాడు సేవాగ్రామ్‌లో కాంగ్రెసు కమిటీ మీటింగు జరుగుతుంది. ఒక కఠిన తరమైన సమస్యలను గురించి ముసాయిదా తీర్మానం తయారు చేయవలసి వచ్చింది. కమిటీలో ఎంతో మంది మేధావులున్నా ఈ పని గాంధీ గారికే అప్పజెప్పారు. ఆయన తయారుచేసిన ఆ ముసాయిదా కమిటీ సభ్యులంతా చూచి సరే అన్నారు కాని, నెహ్రూ గారికి నచ్చలేదు. ఆయన ఆవేశంతో ప్రతి వాక్యాన్ని విమర్శించారు. గాంధీ గారు అంతా విని నెమ్మదిగా ఇది సరిదిద్ది నాకివ్వడానికి ఎంత కాలం పడుతుందని పండిత నెహ్రూని అడిగాడు. ఆ రాత్రి చూచి ప్రొద్దున్నే యివ్వగలనని నెహ్రూ ముసాయిదా తీసుకుని వెళ్ళాడు. మార్నాడు ప్రొద్దున్న యథాతథంగా తెచ్చి "బాపూజీ! నేను నిదానంగా ఆలోచించిన తరువాత ఇందులో ఒక వాక్యం కూడ మార్చనక్కరలేదని నిర్ణయించుకున్నాను" అని చెప్పినాడు. బాపూజీ నవ్వి, ముసాయిదాను తీసుకున్నాడు. ఇంగ్లీషులో ప్రకాండ పండితుడుగ పేరు పొందిన అద్భుత పాండిత్యం, అపార పాండిత్యం ఉండి కూడ సరళమైన భాషలో గూఢమైన అభిప్రాయాలు చెప్పగలిగిన

మేధస్సు తదను రూపమైన అనుభవమూ దానికి అణుకువ అంటే నిరాడంబరత్వము ఆయనకు ఉండబట్టే మహాత్మా పదవి పూర్తిగా ఆయనకు చెల్లింది.

"గాంధీదర్శనం" అని సాధారణంగా వాడుతున్నాము. దర్శనమంటే ఒక ఉత్తమోత్తమమైన ఉదాత్తమైన బుద్ధికి అందని పండిత ప్రపంచానికి అంతకీ స్వీకారంకాగల తాత్విక చింతన అని సాధారణంగ అర్థం చెప్పుతారు. కాని మనం వాడుకునే ఈ గాంధీదర్శనంలో ప్రాచీన ఋషులకు మాత్రమే లోబడి మనకు లభ్యమయ్యే దర్శనశాస్త్రం కాదు. ఈ దర్శనశాస్త్రాలు వివేకం, విజ్ఞానంతోకూడి సత్యాన్ని మాత్రమే బోధించే వేదాంతానికి సంబంధించిన ఉపనిషత్సంచయమూకాదు. సంకలనమూ కాదు. ఈ సంచయమూ, సంకలనము భౌతిక ప్రపంచానికి చెందింది. కర్మ ప్రపంచానికిది బహుదూరం. దాని పరిభాష విద్వాంసులకీ, పండితులకి, భాషాశాస్త్రజ్ఞులకి, ధర్మవేత్తలకి, ధర్మప్రచారకులకి కర్మభూమిగా వాడబడుతూ వచ్చింది. కానీ గాంధీ దర్శనంలో ఉన్న వేదాంతమంతా సాధారణమానవుని జీవితంలో పెనవేసుకొని ఉంది. గాంధీ దర్శనానికి ఆధారభూమి మానవజీవితం. ఈ దర్శనశాస్త్ర జ్ఞానపరిణామం ప్రతి మనిషిని కార్యనిష్ఠాపరుని చేయడమే కాకుండా, కార్యనిష్ఠాపరులైన కార్యనిష్ఠకు అంకితమైన జనసముదాయాన్ని తయారుచేయడం. ప్రతిమానవుడు పుట్టుకతో పరావలంబి అయినప్పటికీ స్వశక్తి వల్ల స్వకీయ కార్యప్రణాళికా ప్రభావాలవల్ల స్వావలంబి కావడానికి ప్రయత్నంచేస్తాడు. కానీ ఈ విశాల ప్రపంచంలో స్వావలంబి ఎవరూలేరు. పరావలంబిగా ఉండటానికి స్వయంగా ఇచ్ఛగించేవాళ్ళు కూడ తక్కువ. ఈ పరావలంబనమే ప్రతి నిమిషం ఒకదానికొకటి కలిసి ఒక దాని శక్తిని మరొక దానికి ఇవ్వగలిగినప్పుడే సమాజంలో శాంతిభద్రతలే కాకుండా స్వేచ్ఛ ఏర్పడుతుంది. పరస్పరావలంబనం నేర్పడమే గాంధీదర్శనం యొక్క పరమధ్యేయం. అంతిమ పరిణామం.

నాకు చిరమిత్రులు, నిర్మాణకార్యక్రమక్షేత్రంలో అగ్రగణ్యులు, మానవసేవయే మాధవసేవయని నమ్మి తన జీవితాన్ని గాంధీదర్శన వ్యాప్తికోసం అంకితమొనర్చి గాంధీక్షేత్రాన్ని నడిపిస్తున్న మండలి కృష్ణారావు

గారి 63వ జన్మదినోత్సవం 4, ఆగస్టున జరుగుతుందని ఆ తరుణంలో వారు రచించిన ఈ "గాంధీదర్శనం" ఆవిష్కరింప బడుతుందని తెలుసుకొని ఎంతో ఆనందంగా ఉంది. శ్రీ కృష్ణారావుగారు తాను నమ్మిన ఆదర్శానికి కార్యనిర్వహణకు అనుకూలమైన కార్యకర్తలను ఎన్నుకోవడంలోను, తగిన వనరులను సమీకరించడంలోను గొప్ప దిట్ట. సదుద్దేశ్యంతోనూ, ఉత్కృష్టమైన ఆదర్శంతోను ప్రారంభించిన ఏ పనీ ఎప్పుడూ సమాప్తంకాదు. సమాప్తం కాకూడదు కూడాను. మంచి పనికి సమాప్తి అంటూ లేనేలేదు. వారి గాంధీక్షేత్రం కూడా ప్రవర్ధమానంగా ఉండటమే కాకుండా అనంతంగాను, అతివిస్తృతితో వెలయింప గలిగే శక్తి వారికికలదని, తప్పక కలుగుతుందని నేను విశ్వసిస్తున్నాను.

మద్రాసు — మోటూరి సత్యనారాయణ

27 - 7-1988

# సంపాదకుని ప్రస్తావన

గాంధీజీ సిద్ధాంతాల ప్రభావం తన మీద చిన్ననాడే ప్రసరించటం వల్ల విద్యార్థి దశనుండి జాతీయ భావాలతో పర ప్రభుత్వ ప్రభావాన్నెదుర్కొంటూ, అనేక ఉద్యమాలలో పాల్గొంటూ, రాజకీయ పాఠశాలల ద్వారా సహచరుల్ని అభివృద్ధి పరచుకొంటూ, పురోగమించి క్రియాశీలియై ప్రసిద్ధి పొందిన కార్యకర్త శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు.

తన సేవా భావనకీ, గాంధీజీ ఆశయాలకీ కూడ కార్యరూపాన్నివ్వ గలిగిన ఒక కేంద్రాన్నేర్పరచి బహుశాఖలతో దాన్ని విస్తరింపజేసిన ప్రజ్ఞావంతుడు శ్రీమండలి. ఆ కేంద్రమే సేవా వ్యవసాయానికొక క్షేత్రమయింది. అదే గాంధీక్షేత్రం. అది విద్యాభ్యాసానికితోడు సాంకేతిక విద్యలో కూడ శిక్షణ నందిస్తోంది. పుస్తక ప్రచురణ చేస్తోంది- గాంధేయ సమాజ సేవాసంస్థగా, గాంధీక్షేత్రం తన పేరిట ఒక మాస పత్రికను మూడు సంవత్సరాలకు ముందు ప్రారంభించి ఇప్పుడు నాల్గవ సంపుటిని నడుపుతోంది. అందులో శ్రీ మండలివారు వివిధ విషయాలపైన ఇప్పటివరకు వ్రాసిన వ్యాసాలు ఇరవైకి పైనే ఉన్నాయి. అయితే వాటిలో నుంచి వారు ప్రత్యేకించి గాంధీజీని గురించీ, గాంధీ ఆశయాల్ని గురించీ వ్రాసిన పది వ్యాసాలను గ్రహించి గాంధీ దర్శనం పేరిట ఈ పుస్తకం ప్రచురించటం జరిగింది.

ప్రథమంగా శ్రీ మండలి గాంధీజీని 'సందర్శించిన' సందర్భాన్ని దాని వల్ల తాము పొందిన స్ఫూర్తిని వివరించే"గాంధీ దర్శనం" అనే వ్యాసంతో ఇది ప్రారంభమయింది. తరువాత గాంధీ ప్రథమోపన్యాస విషయం-దాని ప్రాముఖ్యం వివరించారు. ఇందులో పొందుపరచబడిన వివిధ శీర్షికలతో కూడిన వ్యాస పరంపర గాంధీజీని సంక్షిప్త రూపంలో పాఠకునిచేత

దర్శింపజేస్తోంది. అందుచేత కూడ ఈ పుస్తకానికి గాంధీదర్శనమనే నామకరణం చేయబడింది. గాంధీక్షేత్ర మాసపత్రిక ఒకసారి వారితో తాను జరిపిన ఇష్టాగోష్ఠిని దీని కనుబంధంగా ప్రచురించటం జరిగింది. ఈ అనుబంధం శ్రీ మండలి వారి కృషికీ కృతిత్వానికీ ఒక దిగ్దర్శనం అవుతుందనే ఉద్దేశ్యంతో దీన్నిక్కడ అనుబంధించటం జరిగింది. ఒక కార్యకర్త, ఒక జాతీయనాయకుడు గాంధీ భావాల్నీ, కృషినీ, ఫలితాన్నీ తాను గ్రహించిన అనుభవంతో వివరించిన ఈ గాంధీ దర్శనం సంక్షిప్తమై ఉన్నా, పాఠక లోకంలో ఒక సద్భావాన్ని, సత్సంకల్పాన్నీ కలిగించేది కాగలదని ఆశిస్తున్నాం. ఆ ఉద్దేశ్యంతోనే 63వ జన్మదినోత్సవ బహూకృతిగా ఈ కృతిని ఈ కృతికర్తకే అందించటం సంతోషదాయకంగా ఉంది. కృతికర్త ఇంకా కొన్ని కృతులు వెలయించి సమకాలిక సమాజానికి సముత్తేజం కలిగిస్తారని ఆశిస్తూ దీన్నందిస్తున్నాం.

"గాంధీ దర్శనా"నికి పరిచయ వాక్యాలు వ్రాసిన ప్రముఖ గాంధేయవాది పద్మభూషణ డా॥ మోటూరి సత్యనారాయణ గారికి మా కృతాజ్ఞతాభివందనాలు.

– జోశ్యుల సూర్యనారాయణ మూర్తి

సంపాదకుడు

# 1. గాంధీ దర్శనం

మహాత్మాగాంధీని దర్శించడం అంటేనే మహాభాగ్యంగా ప్రజలు తలిచేవారు. గాంధీజీ వస్తున్నారంటే ఆ రోజుల్లో మైళ్ళ కొలదీ నడిచి ఆయన దర్శనానికి వెళ్ళేవారు. దక్షిణాఫ్రికానుండి ఆయన రాగానే శ్రీ గోపాలకృష్ణ గోఖలే సలహామేరకు భారతదేశం అంతా తిరిగారు. ఖాదీ ఉద్యమానికి, హరిజనోద్ధరణకు మారుమూలలలో ఉన్న గ్రామాలకు సైతం గాంధీ వెళ్ళారు. 1929 జులైలో గాంధీజీ కృష్ణాజిల్లాలో పర్యటించినప్పుడు దివిసీమలో అవనిగడ్డ, కోడూరు, నాగాయలంక గ్రామాలకు వచ్చారు. వేలకొలదీ ప్రజలు పాల్గొన్నారు. మా నాన్న శ్రీ మండలి వెంకట్రామయ్యగారు ప్రాథమిక పాఠశాలలో టీచరు. గాంధీభక్తుడు. గాంధీ ఉపన్యాసాలు విని ప్రభావితుడైనాడు. పిల్లలకు, గ్రామాలలోని ప్రజలకు గాంధీజీని గురించి చెప్పి జాతీయోద్యమాన్ని బలపరుస్తూ ఉండేవారు.

అప్పటికి నాకు మూడు సంవత్సరాలవయసు. నాలో జాతీయ భావాలను, గాంధీతత్వాన్ని ఉగ్గుపాలతో మానాన్నగారు రంగరించిపోశారు. 1931లో అవనిగడ్డ ఉన్నతపాఠశాలలో చదువుతున్నప్పుడు పత్రికలలో గాంధీజీ ప్రబోధాలను తెలుసుకొంటూ, వ్యక్తిగత సత్యాగ్రహము చేస్తున్నవారిని చూచి ఉత్తేజితులమయ్యేవారము. ఎచట సత్యాగ్రహం జరిగినా వెళ్ళి 'గాంధీజీకీజై' అంటుండేవారము. గాంధీజీని చూడాలని ఉండేది. 1932 ఆగస్టు ఉద్యమంలో ఉత్సాహంగా పనిచేయడం. 1943 ఆగస్టు 9వ తేదీన అవనిగడ్డలో జరిగిన సభలో లాఠీచార్జీకి గురికావటం, పోలీసులు పట్టుకుని మైనర్లని వదలిపెట్టడం జరిగింది.

గాంధీజీని జైలునుండి విడిచిపెట్టారు. 1942లో కాంగ్రెసు నాయకులు విడుదల అయినారు. బొంబాయిలో కాంగ్రెస్ సమావేశం జరిగింది. గాంధీజీ వస్తున్నారని అచటకు వెళ్ళాము. సాయంత్రం ఆరు గంటలకు ప్రార్థనా సమావేశము. గేటుతీయగానే బిలబిలా ప్రజలంతా సమావేశ స్థలానికి వెళ్ళి కూర్చున్నాము. అంతా నిశ్శబ్దం, గాంధీజీ వచ్చారు. అందరికీ నమస్కరించారు. ఆ తేజోమూర్తిని చూడగానే నాలో అనుకోని చైతన్యం వచ్చింది. ఇంకా చూడాలని ఉంది. కానీ సమావేశము అయిపోయింది.

1946 జనవరి 21 వ తేదీన మద్రాసులో దక్షిణ భారత హిందీ ప్రచారసభ రజతోత్సవాలలో పాల్గొనడానికి కలకత్తా నుండి గాంధీ గారు వస్తున్నారని తెలిసింది. రేపల్లె మీదుగా తెనాలి వెళ్ళాము. 21 వ తేదీ ఉదయం గాంధీజీ స్పెషల్‌ట్రైన్‌లో వచ్చారు. వేలాది ప్రజానీకం జయజయధ్వానాలు చేశారు. కనూగాంధీ, రామకృష్ణబజాజ్ 'రామధున్' ఆలపించారు. గాంధీజీ ప్రజలకు దర్శనమిచ్చారు. రజతోత్సవాలు చూసుకొని తిరిగివెళుతూ ఫిబ్రవరి 5వ తేదీన విజయవాడలో ఆగారు. మరల దర్శనం చేసుకున్నాము. గాంధీని ఎప్పుడు చూసినా నాలో ఏదో తెలియని చైతన్యము, ఉద్వేగం కలుగుతూ ఉండేవి. గాంధీజీ సేవాగ్రాంలో ఉండగా వెళ్ళాలని వారితో కొన్నిరోజులు ఆశ్రమంలో ఉండాలనీ కోర్కె కలిగింది. 1947 ఆగస్టు 15వ తేదీ స్వాతంత్ర్యం వచ్చింది. దేశవిభజన మతకల్లోలాలను రెచ్చగొట్టింది. నవఖాలీలో ఘోరమైన హత్యలతో భీభత్సం అయింది. గాంధీజీ ఆ ప్రాంతాలలో పాదయాత్రచేసి చివరకు ప్రాయోపవేశం చేశారు. దేశం దద్దరిల్లిపోయింది. తిరిగి ఢిల్లీ వచ్చారు. 1948 జనవరి 30వ తేదీన సాయంత్రం ఢిల్లీలో ప్రార్థనా సమావేశానికి వెళుతూ తుపాకీ గుండ్లకు బలిఅయిపోయారు. దివ్యజ్యోతి ఆరిపోయింది. సేవాగ్రాంలో ఉండాలనే కోర్కె నెరవేరనేలేదు.

1948 డిసెంబరులో జయపూర్ కాంగ్రెస్ మహాసభలు డా॥ పట్టాభి అధ్యక్షతన జరిగాయి. పట్టాభిగారు నేనంటే ఎంతో ఆప్యాయతగా ఉండేవారు. శ్రీ ఏలేశ్వరపు కృష్ణమూర్తి, నేను కలిసి పట్టాభిగారి పట్టాభిషేకము చూడాలని జయపూర్ వెళ్ళాము. గాంధీలేని కాంగ్రెసులో అడుగు పెట్టాము. అచ్చట కార్యక్రమాలనన్నిటినీ తిలకించాము. వివిధ నిర్మాణ కార్యక్రమ సంస్థలను చూశాము. గాంధీజీ కార్యక్రమాలను నిర్వహించడానికి మనము కూడా ఒక ఆశ్రమాన్ని ఎందుకు పెట్టకూడదనే ఆలోచన వచ్చింది. ఆలోచిస్తూనే ఉన్నాను. 1957లో అనుకోకుండా పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికయినాను. ప్రజలకు అందుబాటులో ఉండాలని నాగాయలంకనుండి మామగారి కుటుంబంతో అవనిగడ్డ సంతబజారులో ఇల్లుతీసుకొని ఉన్నాము. తరువాత హైస్కూలు దగ్గర 40 సెంట్ల స్థలము తీసుకొని ఆశ్రమము కట్టుకోవాలని అనుకొన్నాము. 4 పూరిపాకలు వేయించాలని అనుకొన్నాము. అప్పుడే కమ్యూనిస్టులు గ్రామంలో గడ్డివాములు, ఇండ్లు తగులబెట్టారు. పూరిపాకలు వేస్తే ఈ ప్రమాదం వస్తుందని బంగాళపెంకుతో ఇల్లు వేయాలని ప్రారంభించాము. అది చివరకు డాబాగా మారింది. ఆశ్రమం కాకపోయినా చెట్లు పెరిగి విశాలమైన స్థలము ఉండుటచే ఆశ్రమము లాగానే ఉంటుంది.

1969లో గాంధీ శతజయంత్యుత్సవాలు దేశమంతటా జరుగుతున్నాయి. ఏమిచేయాలనే ఆలోచన వచ్చింది. దివిసీమ సహకార వ్యవసాయ బృహత్తర ప్రణాళికా ప్రారంభోత్సవానికిగాను హైస్కూలు ప్రక్కన 80 సెంట్లు బాగు చేయించినాము. దీనిని గాంధీ విజ్ఞాన కేంద్రంగా ఏర్పాటు చేయాలని దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితి తరఫున లీజుకు ఇమ్మని జిల్లా పరిషత్‌ను కోరాము. గాంధీజీ నిర్మాణ కార్యక్రమము అమలు జరుపుటకు గాంధీ క్షేత్రంను ఏర్పాటు చేయాలని నిర్ణయించుకుని గాంధీ శతజయంతి ఉత్సవాలను అచట జరిపినాము. అదే గాంధీ క్షేత్రంగా మారింది.

1946లో గాంధీజీ దర్శనమువలన నాలో కలిగిన చైతన్యమే ఈ గాంధీ క్షేత్రం నిర్మాణము. సేవాగ్రాం కల్పించిన స్ఫూర్తియే సేవాశ్రమ స్థాపన.

1941లో గాంధీజీ ప్రబోధాలే స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడానికి ఉత్తేజపరిచాయి. ఒకవైపు చదువు, రెండవవైపు రాజకీయాలలో ప్రవేశం. తరువాత రాజకీయ పదవులు, నిర్మాణ కార్యక్రమాలు అమలు జరుపుతూ ఉన్నాను. పదవిలో ఉన్నా లేకపోయినా, గెలిచినా ఓడినా సమానస్థాయిలో గాంధేయమార్గాన్ని అనుసరిస్తూ నడిచే అవకాశం కలిగినందుకు సంతృప్తి చెందుతూ ఉన్నాను. మానవతకు విలువనిచ్చి, సేవాశక్తిని పెంచి నైతిక విలువలను నిలబెట్టేదే గాంధేయమార్గం. గాంధేయ మార్గమే ప్రపంచ శాంతికి తోడ్పడేది. ఆ మార్గమే మనందరికీ మార్గదర్శకము. ఆచరిద్దాం. ఆదర్శంగా ఉందాం.

# 2. కాశీలో గాంధీజీ ప్రథమ ఉపన్యాసము

**గాం**ధీజీ దక్షిణాఫ్రికా నుండి 1913లో భారతదేశానికి వచ్చారు. రాగానే భారత రాజకీయాలలో అగ్రగణ్యుడైన శ్రీ గోపాలకృష్ణగోఖలే దగ్గరకు వెళ్ళి భారతదేశ పరిస్థితులను గురించి తెలుపమని, వారి కర్తవ్యాన్ని సలహా అడిగారు.

"ఒక సంవత్సరంపాటు ఎచ్చటా ఉపన్యాసంగాని, ఏవిషయముపై ప్రకటనగాని చేయవద్దని, భారత రాజకీయ పరిస్థితులను తెలుసుకొని ప్రజలను చూచి వారిని గమనించా"లనీ, "తరువాత పరిస్థితులను మదింపు చేసుకొని చేయవలసిన కార్యక్రమాన్ని తానే నిర్ణయించుకోవాలని" శ్రీ గోఖలే గాంధీకి సలహా యిచ్చారు. అదే విధంగా తు॥చ॥తప్పకుండా అమలు పరిచారు. కాశీ విశ్వవిద్యాలయం శంకుస్థాపనకు వైశ్రాయిహార్డింజ్ ప్రభువును మదన్‌మోహన్ మాలవ్యా ఆహ్వానించారు. గాంధీని కూడా ఒకరోజు వచ్చి ఉపన్యసించవలసిందిగా మాలవ్యా ఆహ్వానించారు. తన గురువు గోఖలే చెప్పిన విధంగా ఆచరించి సంవత్సరము గడువు పూర్తిఅగుచుండుటచే గాంధీ మాలవ్యా ఆహ్వానాన్ని అంగీకరించారు. భారతదేశానికి వచ్చిన తరువాత ప్రథమముగా గాంధీ బహిరంగసభలో పాల్గొన్నారు. కాశీపట్టణానికి చేరారు. కాశీ విశ్వనాథస్వామివారిని దర్శనము చేసుకొన్నారు. ఆ దేవాలయం చుట్టూవున్న దుర్వాసన, గలీజుగురించి చాలా బాధ పడ్డారు. ఒకప్రక్క దేవుని పవిత్రంగా పూజిస్తూ, మరొక ప్రక్క ఆ పవిత్రమైన దేవాలయ పరిసరాలు దుర్గంధపూరితంగా వుండి అనారోగ్యాన్ని కల్గించే విధంగా వుండటాన్ని తీవ్రంగా నిరసిస్తూ పారిశుద్ధ్యాన్ని గురించి హెచ్చరిక చేశారు.

1916 ఫిబ్రవరిలో వైస్రాయిహార్డింజ్ ప్రభువు కాశీవస్తూన్న సందర్భంగా కనీవినీ ఎరుగని విధంగా భద్రతా ఏర్పాట్లు చేశారు. విప్లవకారులు బాంబులు విసురుతారనే పుకార్లతో వేలాది రక్షకభటులు దారి పొడుగునా, పట్టణం అంతా కాపలా కాశారు. ఈ భద్రతా ఏర్పాట్లనుచూచి గాంధీ నివ్వెరపోయారు. పరిపాలన చేసేవారికి అంత భయమెందుకు? ఆత్మ విశ్వాసం లేనివారు ఎంతకాలం పాలిస్తారు? అని వ్యాఖ్యానించారు.

వైస్రాయిగారు వస్తున్నారని సభను శోభాయామానంగా అలంకరించారు. సంస్థానాధీశులు రత్నఖచిత ఆభరణాలను ఆపాదమస్తకము ధరించి కనులను మిరిమిట్లుకొలిపేటట్లు సభను అలంకరించారు. గాంధీజీ మనసు కలతచెందింది. మరునాడు మాట్లాడుతూ "మీరు మీ ఆభరణములను విసర్జించి వీటిని పేద ప్రజానీకము యొక్క సంపదగా భావించనంతవరకు ఈ దేశానికి శుభముచేకూర"దని గాంధీజీ నిర్మొహమాటంగా హెచ్చరికచేశారు. "స్వదేశ సంస్థానాలలో గాని, బ్రిటిషు ఇండియాలో గాని ఎవ్వరైనా పెద్ద రాజభవనములను నిర్మించుకొన్నారని విన్నచో నా హృదయం విలపించును. వాటి నిర్మాణమునకు అయిన డబ్బంతయు పేదప్రజలనుండి ప్రోగుచేసినదేకదా అని నేను ఆలోచింతును" అని గాంధీజీ అన్నారు.

సంస్థానాధీశులలో తీవ్ర సంచలనం కల్గింది. సభికులకు ఆశ్చర్యం కల్గించింది. భవిష్యత్తు గాంధీ నాలుకనుంచి పలికినటుల తరువాత నిజము అయినాయి. సంస్థానాలు భారత యూనియన్‌లో విలీనం కావడం, వారి ఆస్తులు ప్రభుత్వపరం కావడం, చివరకు రాజభరణాలు రద్దుచేయడం జరిగింది. వారి సంపదను ప్రజలు అనుభవించుచున్నారు.

"ఆంగ్లేయులిచ్చట పాలకులై వుండగా దేశమెన్నటికీ ఉద్ధరించబడజాలదు. వారిచటనుండి వెడలిపోవలసిందే అని వారితో చెప్పుటకు నేనెన్నడునూ వెనుకాడను. ఈ దృఢ సంకల్పాన్ని సమర్థించుకొనుటకు నా ప్రాణార్పణ చేయవలసివచ్చినచో నేనందులకు సంసిద్ధుడను" అని గాంధీజీ అన్న మాటలను విన్న సభికులు వారి ధైర్యాన్ని మెచ్చుకున్నారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, బహిరంగంగా, నిర్మొహమాటంగా, గట్టిగా మాట్లాడిన మొదటి వ్యక్తి గాంధీయే! ఇది గాంధీజీ మొదటి ఉపన్యాసమే. ఆయన ఆశయం, సంకల్పము ఎంత గొప్పదో వాటిని సాధించటానికి కూడా అంత మహత్తరమైన పద్ధతిని అనుసరిస్తుంటారు. సత్యము, అహింస, ధర్మసూత్రాల ననుసరించి సత్యాగ్రహములను లోకోత్తర, మహత్తర పద్ధతిలో స్వాతంత్ర్య సమరాలను నడిపించి, రవి అస్తమించి సామ్రాజ్యాధిపత్యాన్ని ఎదిరించి, బ్రిటిషు వారిని భారతదేశం నుండి వెడలగొట్టి భారతదేశ స్వాతంత్ర్యాన్ని సాధించిన మహోజ్జ్వలమైన నాయకుడు మహాత్మాగాంధీ.

"మన భారతదేశము పేరు నాకత్యంత ప్రియమైనది. హింసాచర్యలకు మనదేశంలో ఏమాత్రమూ చోటీయవద్దని నేను మిమ్ముల్ని అర్థిస్తున్నాను. పాలకులకు మీరు చెప్పదలచిన

మాటలు దాపరికం లేకుండా స్పష్టంగా చెప్పండి. మీ మాటలు వారికి రుచింపక, వారివల్ల మీకేమైనా కష్టాలు కల్గితే వాటిని ఆనందంతో అనుభవించడానికి సిద్ధపడండి. వారి నెవ్వరునూ దూషించవద్దు. పరుషోక్తులు పలుకవలదు" అని గాంధీ సభలో చెప్పెను. విప్లవకారుల దేశభక్తి పట్ల అపారమైన గౌరవం ఉన్నదని దేశం కొరకు వారు ప్రాణత్యాగం చేయుట హర్షణీయమైనదని, కాని వారి హింసాత్మక చర్యలు సమర్థనీయములుకావని విప్లవకారులకు హెచ్చరిక చేశారు. గాంధీ ఉపన్యాసాన్ని శ్రద్ధగా వింటున్న అనీబిసెంట్ కూడ మధ్యలో సంజ్ఞ చేసి ఉపన్యాసాన్ని మధ్యలో ఆపమని కోరారు. గాంధీయొక్క స్పష్టమైన సత్యవచనాలు, నిర్మొహమాటమైన విమర్శనలు ప్రేక్షకులలో అలజడి కల్గించాయి.

ఈ ఉపన్యాసము భారతస్వాతంత్ర్య చరిత్రలో మరుపురానిది. చరిత్ర సృష్టికి మూలకారణమైనది. భారత రాజకీయ నాయకులలో, కార్యకర్తలలో ఆలోచనలను రేకెత్తించి మహోద్యమాలకు దారితీసింది. ప్రజలలో నవచైతన్యానికి నాంది పలికింది. గాంధీవాణి భారతవాణి అయింది.

# 3. గాంధీ - గాంధీయిజం

'**గాం**ధీజీ చనిపోవచ్చు, గాంధీయిజం ఈ ప్రపంచం ఉన్నంతవరకు ఉంటుంది' డా॥ పట్టాభి గాంధీమరణానికి పూర్వం అన్నమాటలివి.

ఏసుక్రీస్తు,బుద్ధులు ప్రబోధాలను ఆచరణలో పెట్టి బృహత్తరమైన భారతదేశానికి మహత్తరమైన స్వాతంత్ర్యాన్ని సాధించిన మహనీయుడు మహాత్మాగాంధీ, ఆశయము ఉన్నతమైనదే కావచ్చు. దానిని సాధించే మార్గము అంతకంటె మహత్తరమైనదిగా ఉండాలని అంటారు గాంధీజీ. భారతదేశ స్వాతంత్ర్యం మహత్తరమైన ఆశయము. దాని సాధనకు మహోన్నత మార్గాన్ని అన్వేషించారు. సత్యము, అహింస, త్యాగములతో కూడిన సత్యాగ్రహమను పోరాట మార్గమును చూపారు.

"తండ్రీ వీరిని క్షమింపుడు. వారేమిచేస్తున్నారో వారికే తెలియదు" అని శిలువ వేస్తున్నప్పుడు ఏసుక్రీస్తు అన్న మాటలను రాజకీయాలతో ప్రయోగంచేసినవారు గాంధీజీ, దక్షిణాఫ్రికాలో జాత్యహంకారంతో అధికారి తన చెంప మీద కొట్టినప్పుడు రెండవ చెంపమీద కొట్టమని చూపారు. దక్షిణాఫ్రికాలో భారతీయుల హక్కుల కొరకు శాంతియుత పోరాటాలునడిపి, విశేషానుభవంతో భారతదేశానికి 1915లో తిరిగి వచ్చిన గాంధీజీ, శ్రీ గోపాలకృష్ణ గోఖలేను కలుసుకుని సలహాను అడిగారు. సంవత్సరం పాటు దేశపరిస్థితులను తెలుసుకుంటూ, ఏమీ మాట్లాడకుండా రాజకీయ పరిణామాలను పరిశీలించవలసిందిగా సలహా యిచ్చారు. గాంధీజీ ఆ సలహాను పాటించి పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించి కాశీ హిందూ విశ్వ విద్యాలయములో శ్రీమాలవ్య ఆహ్వానముపై వెళ్ళి ప్రథమంగా బహిరంగ ఉపన్యాసము చేశారు. ఆ ఉపన్యాసములో ఆశయములు–ఆచరణలను తెలియజేశారు.

"ఆంగ్లేయులిచట పాలకులై యుండగా దేశమెన్నటికి ఉద్ధరింప బడజాలదు. వారిచటనుండి వెళ్ళిపోవలసిందే. మీరిచట నుండి వెళ్ళి పొండి. అని వారితో చెప్పుటకు నేనెన్నడూ వెనుకాడను. ఈ దృఢసంకల్పమును సమర్థించుటకు నా ప్రాణార్పణ చేయవలసి వచ్చినచో నేనందులకు సంసిద్ధుడను కాగలనని నా నమ్మకము. ఇట్టి మరణం

నాదృష్టిలో ప్రతిష్ఠతో కూడిన మరణము" అని తన ఆశయాన్ని గాంధీజీ సూచించారు. "హింసాచర్యలకు మనదేశంలో ఏ మాత్రము చోటీయవద్దని నేను మిమ్మల్ని అర్థిస్తున్నాను. పాలకులకు మీరు చెప్పదలచిన మాటలు దాపరికంలేకుండా స్పష్టముగా చెప్పండి, మీ మాటలు వారికి రుచించక వారి వల్ల మీకేమైనా కష్టాలు కలిగితే సంతోషంతో అనుభవించడానికి సిద్ధంకండి. వారినెన్నడూ దూషించవద్దు పరుషోక్తులు పలుకవలదు" అన్నారు గాంధీ. తన ఆశయసాధనకు మార్గాన్ని చూపించారు.

తన సత్యాగ్రహ విధానాన్ని గాంధీజీ ప్రథమంలో 1. భారతదేశం నుండి కూలీలను వలస పంపకుండా ఉండటానికి, 2. చాంపారన్‌లో రైతుల బాధలను తొలగించడానికి, 3. అహ్మదాబాద్‌లో నూలుమిల్లుల కార్మికుల జీతాలు పెంచడానికి, 4. ఖైరా ప్రాంతములో రైతు సమస్యల పరిష్కారానికి ఉపయోగించి విజయం సాధించారు.

తరువాత రౌలట్ చట్టం వల్ల నిర్బంధవిధానాలకు వ్యతిరేకంగా ముస్లింలకు సంబంధించిన ఖిలాఫత్ ఉద్యమాలలో దేశవ్యాప్తంగా సత్యాగ్రహాలను ప్రయోగం చేశారు. ఉప్పుసత్యాగ్రహం చేపట్టేముందు 1930లో ఇర్విన్ ప్రభువుతో గాంధీజీ ఇలా అన్నారు.

"అహింసలో నాకున్న విశ్వాసం మీకు తెలిసియున్నదే. ఉద్దేశపూర్వకంగా ఏప్రాణినిగాని నేను బాధపెట్టను. ఇక నేను మనుషులను నొప్పించే ప్రశ్నే లేదు. వారు నాకు, లేదా నా దేశానికి కీడు తలపెట్టిన వారై యుండవచ్చును. అయినను నేను వారిని నొప్పించను. భారతదేశంలో బ్రిటిషుప్రభుత్వం అధికారం సాకుతో ఉండటం దురదృష్టమని అనుకొంటున్నాను. ఇక్కడవున్న ఏఒక్క ఆంగ్లేయునికీ ఎట్టికష్టము, నష్టము కలుగకూడదని నాయుద్దేశం" ఈ మాటలు గాంధీజీ ఆలోచనలకు విధానాలకు మూలమైనవి. తరువాత భారతస్వాతంత్ర్య సాధనకు సత్యాగ్రహ పోరాటాలను నడిపించారు. చివరలో 1942 ఆగష్టులో "క్విట్ ఇండియా" "దేశాన్నుండి వెడలిపొండి" అనే నినాదంతో చావో బ్రతుకో తేల్చుకోవాలన్న పిలుపును యిచ్చి ఆగస్టు ఉద్యమాన్ని నడిపారు. 1947లో స్వాతంత్ర్యం వచ్చింది. గాంధీజీ స్వాతంత్ర్య ప్రదాత అయినారు.

గాంధీజీ ఆలోచన, అనడం, ఆచరించడం మనోవాక్కాయ కర్మ ఒక్కటిగా వుండటము వల్ల సత్యం, అహింస, త్యాగము మార్గముగా నడపటం వల్ల మహాత్ముడైనాడు. మానవత, మమత నైతిక విలువలతో కూడిన గాంధీమార్గమే గాంధీయిజం.

ప్రతివారికి తినడానికి తిండి, వుండటానికి ఇల్లు, కట్టుకోవటానికి గుడ్డ, విద్య వైద్య సౌకర్యాలు కలిగి, వారిజీవనము సుఖంగా వుండేటట్లు చేయాలని వారి కోర్కె.

1915లో కాశీ విశ్వవిద్యాలయ శంకుస్థాపనకు వైస్రాయి వచ్చిన సందర్భంగా సంస్థానాధీశులు రత్నఖచిత ఆభరణములను ఆపాదమస్తకము ధరించి కనులు మిరుమిట్లు గొలిపే విధంగా వచ్చారు. వారిని చూచి గాంధీ సభలో మాట్లాడుతూ "సంస్థానాధిపతులు ఆభరణములను విసర్జించి వీటిని పేద ప్రజానీకం యొక్క సంపదగా భావించనంతవరకు ఈ దేశానికి సుఖము చేకూర"దని అన్న మాటలు వారి ఆలోచనలను తెలియజేస్తాయి. మనము ఆస్తులను పుట్టుకతో సంపాదించుకురాలేదని, చనిపోవునప్పుడు పూచికపుల్లకూడా వెంటరాదని, మధ్య సంపాదించే ఈ ఆస్తులకు మనము ధర్మకర్తలం మాత్రమేననియు గాంధీజీ అనేవారు. మన అవసరాలను తీర్చేదానికంటే మించిన ఆస్తి మనం ప్రజల క్షేమానికి వినియోగించాలని చెప్పేవారు. ప్రజలు గుడ్డలేక బాధపడుతున్నారనే భావంతో కొల్లాయిగుడ్డ కట్టుకొంటూ, తన ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారని తనుకూడా ఒకపూటే భోంచేస్తూ దరిద్రనారాయణుడుగా పేరొందారు. పేదలను గురించి చెప్పుతూ వారి బాధలలో భాగస్వామి అయ్యేవారు. బాధపడుతున్నవారి సేవచేయడం గాంధీ ప్రధాన కర్తవ్యంగా భావించేవారు. ఆశ్రమ నిర్వహణలో అన్ని పనులు చేయడంలో గాంధీ పాల్గొనేవారు. వారు కాయగూరలు తరగడం, వంటపనులు చేయడం, పాయఖానాలు ఊడ్చటం వంటి (పారిశుధ్య) కార్యక్రమాలలోకూడా పాల్గొనేవారు. మంగలి పనికూడా చేసేవారు. మానవుడు చేసే ప్రతిపనిలోనూ గౌరవం ఉందని, ప్రతిపనిని ప్రతివారు చేసుకోవాలని ఇతరుల మీద ఆధారపడి ఉండరాదని గాంధీజీ ఆచరించి చూపేవారు. కష్టపడాలి, పనిచేయాలి, స్వయంపోషకత్వం సాధించుకోవాలి అనేవారు. త్యాగం సేవాభావం ప్రతిపనిలో ప్రతిబింబించాలి. స్వార్థం, నిర్లిప్తత, సోమరి తనములకు దూరంగా వుండాలనేవారు.

మార్క్సిజం - హింస = గాంధీయిజం అనేవారు కొందరు. మమతతో కూడిన మానవత, అప్యాయతతో కూడిన ప్రేమ, ద్వేషరహితమైన ఆలోచన, సత్యం, అహింసలతో కూడిన త్యాగము, అభిమానంతో కూడిన ఆదరణ సమాజశ్రేయస్సుకు తోడ్పడుటయే గాంధీయిజం, అదే సర్వోదయం.

ప్రపంచంలో టెర్రరిస్టుల ప్రాబల్యం పెరిగిన కొద్దీ గాంధీ మార్గాన్ని గురించి ఆలోచించడం ప్రారంభం అయింది. హింసాయుత చర్యలవలన శాంతి సాధ్యంకాదని

గాంధీ మార్గాన్ని అనుచరించటం వల్లనే అది సాధ్యం అవుతుందనే భావన వ్యాప్తి చెందుతోంది.

బ్రిటిష్ దేశాన్ని ఎదిరించిన గాంధీని గురించి బ్రిటిషు దేశంలో ప్రఖ్యాత సినీ నిర్మాత శ్రీ రిచర్డ్ అటెన్‌బరో గాంధీజీ విశిష్టతను గురించి సినిమాతీసి ప్రపంచ దృష్టిని మరల్చి నేటి క్లిష్ట పరిస్థితులలో గాంధీని గురించి ఆలోచించే అవకాశాన్ని కలిగించారు. పాశ్చాత్యదేశాలలో ఈ గాంధీ సినిమా మంచి పనిచేసింది. విద్యార్థులలో, యువకులలో మార్పు తీసుకొచ్చింది. గత రెండు సంవత్సరాల క్రితం అమెరికా, కెనడా, బ్రిటన్, యూరప్ దేశాలలో పర్యటించినపుడు నేను ఈ మార్పును గమనించాను. దీనివలన భారతదేశం అంటే ఎంతో గౌరవం పెరిగింది. ప్రపంచ శాంతికి తోడ్పడేవారికి మార్గం దొరికింది. భారతదేశంలో గాంధీని మరచిపోతున్న రోజులలో ప్రపంచంలో గాంధీ విధానాన్ని గురించి శాంతి కొరకు ఆలోచిస్తున్నారు. ప్రపంచ శాంతికి, సౌభాగ్యానికి, సౌభ్రాత్రమునకు, అభివృద్ధికి గాంధేయ మార్గమే తోడ్పడగలదు.

# 4. కార్మిక సంక్షేమం - గాంధీజీ

1869లో పోర్‌బందర్‌లో జన్మించిన గాంధీ 1891లో ఇంగ్లండు వెళ్లి బారిష్టరు అయిన తరువాత 1893లో అబ్దుల్లాసేఠ్ వ్యవహారాలలో కోర్టులో వాదించడానికి దక్షిణాఫ్రికా వెళ్ళారు.

కోర్టులో తలపాగా తీసివేయవలసిందిగా జడ్జి ఆదేశించగా తలపాగా తీసివేయలేదు. కోర్టునుండి బయటకు వచ్చేశారు.

శ్వేత జాతీయులు మాత్రమే ఎక్కవలసిన మొదటితరగతి పెట్టెలో గాంధీ ఎక్కగా సామానుతోపాటు గాంధీని కూడా లాగిపారవేశారు. అన్ని రంగాలలో శ్వేతజాతీయులకు అత్యధిక ప్రాధాన్యత, ప్రత్యేకతలు ఉండటం గాంధీజీ గమనించారు.

జాతి విచక్షణ విధానంతో భారతీయులపై అనేక అత్యాచారాలు చేస్తున్నారు. వీటిన్నింటినీ స్వయంగా అనుభవించిన గాంధీ జాతి విద్వేష విధానానికి వ్యతిరేకంగా శాంతియుత పోరాటాన్ని సాగించాలని నిశ్చయించుకొన్నారు. భారతీయులను, ఆసియా దేశస్థులను ఈ పోరాటాలలో పాల్గొనడానికి గాంధీ సమీకరించారు. ఈ పోరాటాలలో కార్మికులపాత్ర ప్రధానమైనది.

దక్షిణాఫ్రికాలకు వలస వెళ్ళిన కార్మికులు, కొంతకాలం పనిచేసే కాంట్రాక్టు కార్మికులు వేలాదిమంది వెళుతూ ఉండేవారు. బొగ్గుగనులలో తోటలలో పనిచేసేవారు. దక్షిణాఫ్రికాలో గాంధీ ఉద్యమానికి కార్మికులు అండదండగా నిలబడ్డారు. కార్మికుల సంక్షేమానికి జరిగిన పోరాటాలలో వారికి గాంధీ అండగా నిలబడ్డారు. భారత కార్మికులు 3 పౌండ్ల పోల్ టాక్సుకు నిరసనగా సమ్మె చేశారు. న్యూకాబిల్ బొగ్గు గనులలోని భారత కార్మికుల సమ్మెను గాంధీ బలపరిచారు. న్యాయమైన కార్మికుల కోర్కెను ఆయన ఎప్పుడూ బలపరచేవారు. ట్రాన్స్‌వాల్ జైత్రయాత్రలో గాంధీ వెంట రెండువేల మంది కార్మికులు పాల్గొన్నారు. అనేక కష్టాలకు గురి అయ్యారు. కార్మికుల సమస్యలపై న్యాయస్థానాలలో వాదించడం వల్ల కూలీ బారిష్టరు అనేవారు.

దక్షిణాఫ్రికాలో రెండు దశాబ్దాలు జాతి విద్వేషానికి వ్యతిరేకంగా పోరాటాలు చేసి కొంతవరకు కృతకృత్యులై గాంధీజీ 1915లో భారతదేశం తిరిగి వచ్చారు. గోఖ్లే

సలహామేరకు సంవత్సరంపాటు భారతదేశం అంతా తిరిగి పరిస్థితులను తెలుసుకొన్నారు. కార్మికుల, రైతుల సమస్యలను ఆకళింపు చేసుకొన్నారు. 1917లో నీలిమందు తోట యజమానులకు వ్యతిరేకంగా చాంపరాన్‌లో రైతుల ఉద్యమాన్ని నడిపి రైతాంగానికి అండగా నిలబడ్డారు. 1918లో రైతుకూలీల కొరకు ఖేడాలో సత్యాగ్రహము నడిపించారు. అహమ్మదాబాద్ మిల్లు కార్మికుల బోనస్ విషయమై వచ్చిన వివాదంలో గాంధీ, వల్లభాయి పటేల్ మధ్యవర్తులుగా ఉండి, మిల్లు యజమానులతోనూ, కార్మికులతోనూ మాట్లాడగా 35 శాతం పెరుగుదలకు ఒప్పుకొనడానికి ముందు యజమానులు అంగీకరించి తరువాత 20 శాతం కంటే ఎక్కువ ఇవ్వలేమన్నారు. కార్మికులు సమ్మె చేశారు. గాంధీ వారిని బలపరిచారు. సమ్మెవలన కార్మికులు పస్తుండవలసి వచ్చింది. దొంగ కూలీలను యజమానులు ప్రోత్సహిస్తున్నారు. గాంధీ నిరాహార దీక్ష ప్రారంభించారు. మూడు రోజుల తరువాత యజమానులు కార్మికుల కోర్కెలను అంగీకరించారు. 35 శాతం పెంచడానికి ఒప్పుకొన్నారు.

కార్మికుల న్యాయమైన పోరాటాన్ని సాగించుటలో గాంధీ అవలంబించిన పద్ధతి తక్షణం ప్రజలకు నచ్చుతుందనీ, సమరశీల చర్యలకు కార్మికుల దిగకుండా అవుతుందని మిల్లు యజమానులు అర్థం చేసుకొన్నారు. కార్మికుల ఓర్పుకు ఒక హద్దు ఉంటుందని, ఆ హద్దు దాటి పోయాక ప్రమాదం ఉందని గ్రహించిన గాంధీజీ నిరాహార వ్రతానికి ఉపక్రమించారు. ఒక సామాజిక సంఘర్షణ ఉన్నతమైనపుడు ఆయా వర్గాల ప్రవర్తన ఏమిటో గాంధీజీ అర్థం చేసుకోగల్గినా, బాధితులైన కార్మికులే మరింత అహింసాయుతంగా ప్రవర్తించాలని గాంధీ భావన.

భారతదేశంలో ప్రజలు ఆశయం కోసం సాగించిన నిరాహారవ్రతం కార్మికుల పోరాటాలతోనే ప్రారంభం అయినది. అదే మొదటిది.

గాంధీజీ తాను అనుసరించిన లోకోత్తర మహత్తర సత్యాగ్రహ పద్ధతిని ముందు రైతుల సమస్యల పరిష్కారానికి, కార్మికుల కోర్కెల సాధనకు ప్రయోగించి జయమును సాధించారు.

తిలక్ మరణానంతరం 1920లో గాంధీజీ కాంగ్రెసుకు నాయకత్వము వహించారు. 1920,21లో కార్మికోద్యమమునకు ఒక రూపము ఇవ్వబడినది.

లాలా లజపతిరాయ్ ఆధ్వర్యాన అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఏర్పడింది. కార్మికుల సమ్మెలు 1919లో 19 కాగా, 1920లో 200: 1921లో 400కి పెరిగాయి. 1921లో కాంగ్రెసు కార్మికోద్యమానికి ప్రత్యేక కమిటీని నియమించింది.

అస్సాంలో టీ తోటల యజమానులైన బ్రిటిషువారు విపరీతంగా లాభాలు గడించినా, తోటలలో పనిచేసే కూలీలను వేలాదిమందిని తొలగించారు. కొంపల నుండి తరిమివేశారు. స్టీమర్లపై వెళుతున్న కార్మికులను నదిలో పడవేశారు. దాంతో క్రోధావేశాలతో రైలు, స్టీమర్లలో పనిచేసే కార్మికులు నిరసనగా సమ్మె చేశారు. కాంగ్రెసు ఆ పోరాటాన్ని బలపరిచి కార్మికుల క్షేమానికి తోడ్పడింది. గాంధీజీ ఎప్పుడూ కార్మికుల క్షేమాన్ని, పేదల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని పనిచేసేవారు. కార్మికులందరినీ స్వాతంత్ర్య పోరాటాలలో భాగస్వాములను చేశారు. గాంధీజీ తను కలలుగన్న భారతదేశం ఎలా వుండాలో ఈ విధంగా వర్ణించారు.

"అందరికన్నా అతి బీదవాళ్ళుసైతం ఈ దేశం తమ దేశమని భావించాలి. ఆ దేశ నిర్మాణంలో వాళ్ళ వాణికూడా విన్పించాలి. పై తరగతి, క్రింద తరగతి ప్రజలు అనే భేదముండరాదు. అన్ని కులాలు, మతాలవారు పరిపూర్ణ సామరస్యంతో జీవించాలి. ఇవన్నీ వుండే భారతదేశం కోసం నేను కృషి చేస్తాను. ఇది నేను కలలుగనే భారతదేశం" అన్నారు గాంధీజీ.

గాంధీజీ తన 18 అంశాల నిర్మాణ కార్యక్రమంలో కార్మికుల సంక్షేమము ఒక అంశంగా చేసి వారికి అండగా నిలబడినారు.

యజమాని, కార్మికుడు ఒకే కుటుంబంగా భావించి, కృషిచేసి నప్పుడే పరిశ్రమల అభివృద్ధి, కార్మిక సంక్షేమము సాధ్యము అవుతాయి. కార్మికులు సంతృప్తిగా ఉంటేనే ఉత్పత్తికి తోడ్పడగలుగుతారు. ఉత్పత్తి పెరిగితేనే యజమానులు లాభాలు గడించగలుగుతారు. గడించిన లాభాలు యజమానులతోపాటు కార్మికులుకూడా అనుభవించాలి. శ్రామిక పురోభివృద్ధికి సంతృప్తికరమయిన పరిష్కారానికి గాంధీజీ ఇలా అన్నారు.

1) శ్రామికుడు కొన్ని గంటలు పనిచేస్తే కొన్ని గంటలు విశ్రాంతి ఉండాలి.
2) విద్యార్జన, విజ్ఞాన సముపార్జనకు తగు సౌకర్యాలు కలుగజేయాలి.
3) వారి పిల్లలకు పాలు, బట్టలు ఇచ్చి విద్యాసౌకర్యాలు కలుగజేయాలి.
4) ఆరోగ్యకరమైన నివాస వసతులు కలిగించాలి.
5) వృద్ధాప్యంలో వారి పోషణకు నిధులు సమకూర్చాలి.

తక్కువ కూలీతో ఎక్కువ పని చేయించాలనే యజమానులు, ఎక్కువ కూలీతో తక్కువపని చేయాలనే కార్మికుల ప్రయత్నాలు దేశ పురోభివృద్ధికి తోడ్పడవు. హక్కుల కొరకు పోరాటము చేయాలనే ఆరాటమున్నట్లే తమ విధుల నిర్వహణలో కూడా శ్రద్ధ చూపాలి. బాధ్యతాయుతంగా విధినిర్వహణలో నిమగ్నము కావటం వల్ల ఉత్పత్తి సంపద పెంచదానికి తోడ్పడగలరు. సంపద పెరిగినప్పుడు యజమానులు కష్టపడిన కార్మికుల సంక్షేమానికి తోడ్పడాలి. అలా చేసినప్పుడు కార్మికుల యజమానుల సత్సంబంధాలు బలపడతాయి. యజమానులు కార్మికుల సంక్షేమానికి తోడ్పడనపుడు సమ్మెలు అనివార్యము అవుతాయి.

సమ్మె విషయమై గాంధీజీ ఇలా అన్నారు.

1) సమ్మె కారణం న్యాయసమ్మతంగా ఉండాలి.
2) సమ్మె దార్ల మధ్యన కార్యక్రమాచరణలో ఏకీభావం వుండాలి.
3) సమ్మెలోచేరని వారలపై దౌర్జన్యం చేయరాదు.
4) సమ్మెకాలంలో సమ్మెదార్లు కార్మిక సంఘపు విరాళములపై ఆధారపడకుండా తమరిని తాము పోషించుకోగలగాలి. అందులకు ఉపయోగకరము, లాభకరము అయిన ఏదో ఒక తాత్కాలిక వ్యాపకం చేకూర్చుకోవాలి.
5) యజమానులలో పరివర్తన వచ్చి కార్మికులలో న్యాయమైన కోర్కెలు అంగీకరించునట్లు అహింసాయుత పద్ధతులద్వారా పోరాటము నడపాలి.

యజమానులు తమ పరిశ్రమలలో లాభాలను గడించదానికి కార్మికుల కృషి కారణమని భావించాలి. వారి క్షేమానికి తోడ్పడి వారికి ప్రోత్సాహం ఇవ్వాలని, తమ ఆస్తులకు వారు ధర్మకర్తలుగా భావించాలని గాంధీజీ అన్నారు.

పాటుపడే శక్తి ఉండియు పనిగాని, తిండిగాని దొరకని పురుషుడుకాని, స్త్రీకాని దేశంలో ఒక్కరయినా వున్నంతకాలం మనము విశ్రాంతి తీసుకొనడానికిగాని, కడుపునిండా తినటానికిగాని సిగ్గుపడవలసి వుంటుందన్న గాంధీజీ మాటలు మనమంతా గుర్తుపెట్టుకోవాలి. శ్రమ శక్తిని ఉపయోగించి దేశప్రగతికి, సమాజ శ్రేయస్సుకు తోడ్పడాలి. అదే గాంధీ సందేశం. అదే మనందరి కర్తవ్యం.

*(మే 1వ తేదీ మేడే శతవార్షికోత్సవ సందర్భంగా ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం నుండి ప్రసారము చేయబడినది.)*

# 5. నిర్మాణ కార్యక్రమము - గాంధీజీ

భారతదేశ స్వాతంత్ర్య సాధనకు సత్యము, అహింస, త్యాగములతో కూడిన లోకోత్తర మహత్తర పద్ధతిలో లక్షలాది ప్రజలను సమీకరించి రవి అస్తమించని సామ్రాజ్యాధిపతులపై పోరాటాలను సల్పుతూ గాంధీజీ స్వతంత్ర భారతదేశంలో ఎవరి బాధ్యతలను వారు నిర్వర్తించుటకు సంసిద్ధతగా నుండుటకునూ, దేశంలోని పేదరికం, నిరక్షరాస్యతల నిర్మూలనకు, సమైక్యత, సుహృద్భావాలను పెంచుటకును, అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు ప్రజలను ఆయత్తముచేయుటకు, సేవాశక్తిని, సమాజ సేవాభిలాషను పెంపొందించడానికి 18 సూత్రాల నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టారు.

వినోబాభావే వంటి పెద్దలు నిర్మాణ కార్యక్రమానికి నాయకత్వం వహిస్తే, పండిత నెహ్రూ లాంటి రాజకీయవేత్తలు స్వాతంత్ర్య సమరానికి నాయకత్వం వహించారు. గాంధీజీ ఎంత నిర్మాణాత్మకమైన దూరదృష్టి కలవారో మనకు తెలుస్తుంది.

సత్యాగ్రహమును జాతీయస్థాయిలో స్వాతంత్ర్యము కొరకు ప్రయోగించక ముందు అది అహమ్మదాబాద్ మిల్లు కార్మికుల జీతాల పెంపుకు, బార్డోలీ, ఖైరా జిల్లాలో రైతుల సమస్యల పరిష్కారానికి తోడ్పడింది. ఉప్పుసత్యాగ్రహానికి జాతీయస్థాయిలో సత్యాగ్రహ ఆయుధాన్ని ఉపయోగించారు. అన్ని ఉద్యమాలకు సత్యాగ్రహాన్ని ఉపయోగించారు.

1916లో కాశీ విశ్వవిద్యాలయం శంకుస్థాపన సమయంలో “ఆంగ్లేయులు భారతదేశాన్ని విడిచిపెట్టాలి” అని చెప్పిన నాటినుండి 1942 ఆగస్టు, 9వ తేదీన “క్విట్ ఇండియా” తీర్మానముతో అనేక స్థాయిలలో జరుగుతూ వచ్చిన స్వాతంత్ర్యోద్యమము చరమస్థాయికి చేరింది. ఆగస్టు విప్లవ అంతిమ పోరాటంతో బ్రిటిష్ వారు వెళ్ళిపోయారు. 1947 ఆగస్టు 15న స్వాతంత్ర్యం వచ్చింది. గాంధీజీ రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించారు. వాడవాడలా ప్రజలంతా స్వాతంత్ర్యోద్యమమును వైభవంగా చేసుకుంటుంటే గాంధీజీ భోజనం చేయక, మంచినీరు అయినా ముట్టకుండా ఎవరితోనూ మాటాడకుండా మౌనంగా వుండి తనమీద ఏదో బృహత్తరమైన భారం పడినట్లు క్రుంగిపోతూ కనిపించారు. ఆ మరునాడు మన నాయకులు కలుసుకొని “ఏం మహాత్మా. ఈ దేశానికి స్వాతంత్ర్యం తెచ్చిన మహాప్రదాతవు, జాతిపితవు ఎందుకు ఇలా బాధపడుతున్నావు?” అని అడిగినారు.

"నేను కోరిన రాజ్యం ఇది కాదు. బ్రిటిషువారు పోయి భారతీయులు రాజ్యానికి వచ్చారు. ఈ దేశంలో ప్రతివారికి తినడానికి తిండి, కట్టుకోవడానికి గుడ్డ, ఉండటానికి ఇల్లు విద్య సౌకర్యాలు కలుగజేసినప్పుడు మాత్రమే మనకు నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లు" అన్నారు గాంధీజీ. "దీనిని సాధించటానికి మన దేశాన్ని పరిపాలించుటకు మనకు అవకాశం కలిగింది. సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకు మనము ఇంకా ప్రయత్నించాలి. అందులకే నా ఆలోచన" అన్నారు గాంధీజీ.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దేశ విభజన వలన వచ్చిన జనాభా మార్పిడి, మతకలహాల వల్ల మారణహోమాన్ని ప్రభుత్వం ఎదుర్కొనవలసి వచ్చింది. మతకలహాలను గాంధీజీ ఆందోళనచెంది నవఖాళీలో పాదయాత్రలుచేసి చివరకు హిందూ, ముస్లిం సమైక్యతకు నిరాహార దీక్ష చేశారు. కల్లోలాలు తగ్గిపోయాయి. గాంధీజీ ఢిల్లీలో ఉండి, ప్రతిరోజు ప్రార్థనా సమావేశాలలో దేశప్రజల, ప్రభుత్వం కర్తవ్యాన్ని గురించి బోధిస్తున్నారు. శత్రువునికూడా మిత్రునిగాచూచే శాంతిదూత గాంధీజీ. 1948 జనవరి 30వ తేదీ సాయంత్రము 6 గంటలకు ప్రార్థనా సమావేశానికి వెళుతూవుండగా 'గాడ్సే' అనే హిందూ మతోన్మాది గాంధీకి నమస్కరించి పిస్టల్‌తో కాల్చివేశాడు. మానవాళికి 'జ్యోతి'గా ప్రకాశించిన గాంధీజీ ఆ సాయంత్రము రవితోపాటు అస్తమించారు. జ్యోతి ఆరిపోయింది. సభ్యతా ప్రపంచము గాఢాంధకారంలో మునిగిపోయింది. గాంధీజీ శారీరకంగా మన మధ్య లేరు. పంచభూతాలలో లీనమైపోయారు. కాని వారి మహోన్నత ఆశయాలు, మహత్తర కార్యాచరణ విధానాలు మనతోబాటు ఉన్నాయి. గాంధీజీ మానవతగల ప్రతివారి హృదయంలోనూ ఉన్నారు. ఉంటారు. ఈ ప్రపంచము ఉన్నంతవరకూ ఆయన చూపిన మార్గాలుంటాయి. "గాంధీజీ పోయారుకాని గాంధీయిజం ఎప్పుడూ ఉంటు"దని డా॥ పట్టాభి అన్నారు. మనకు దారి చూపిన ఆ కాంతిపుంజము ఆరిపోదు. వెయ్యి సంవత్సరాల తర్వాత కూడా భారతదేశానికేకాక ప్రపంచానికే వెలుగు బాటగా వుండ గలదు అన్నారు శ్రీ నెహ్రూ.

స్వాతంత్ర్య సమరాలతోపాటు గాంధీజీ సూచించిన నిర్మాణ కార్యక్రమములోని చాలా అంశాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అభివృద్ధి, సమాజ వికాస, సంఘసంక్షేమ కార్యక్రమాల క్రింద అమలు జరుపుతూ వస్తున్నాయి. అయినా వాటికి ప్రజలలో ప్రచారానికి, అమలకు సంఘ సేవకులు, సమాజ సేవా సంస్థలు, ఇంకా కృషి చేయవలసి వుంది. గాంధీజీ నిర్మాణ కార్యక్రమములో ముఖ్యమైనవి సామాజిక మార్పుకు ప్రయత్నించేవాటికి సంబంధించినవి.

**1. సమైక్యత**

ఈనాటికి ఆయన నిర్మాణ కార్యక్రమము అవసరమైనది. ఆచరణీయమైనది. జాతి సమైక్యతకు, దేశ సమైక్యతకు నేటికి అవసరమైనదే. గాంధీజీ చెప్పిన సమైక్యతా ప్రాధాన్యత ఎంతైనా ఉంది. జాతి సమైక్యతకు 1948లో గాంధీజీ, దేశ సమైక్యతకు 1984లో ఇందిరాగాంధీ ప్రాణత్యాగాలు చేశారు. వారి ఆశయాలైన జాతి, దేశ సమైక్యతలను నిలబెట్టడానికి ప్రతి భారతీయుడు ప్రతిజ్ఞ తీసుకోవాలి. కృషి చేయాలి.

**2. అస్పృశ్యతా నివారణ**

ప్రభుత్వాలు ఎన్నో చట్టాలు చేశాయి. ఈనాటికీ హరిజనులపై జరుగుతున్న దౌర్జన్యాలు, అత్యాచారాలు రోజూ పేపర్లలో చూస్తునే వున్నాము. హరిజనులని పేరుపెట్టి అస్పృశ్యతా నివారణకు ఉద్యమాలు నడిపి గాంధీజీ చేసిన హరిజనసేవ సమాజంలో ఎంతోమార్పు తీసుకొని వచ్చింది. అయినా వారి ఆశయములు ఇంకా పూర్తిగా నెరవేరలేదు. శాసనసభలలో, అధికారములో వారికి అవకాశాలు ఇచ్చినా సమాజంలో ఇంకా మార్పు రావలసి ఉంది. అందులకు సమాజసేవకులు, సంఘ సేవా పరాయణులు కృషిచేయవలసిఉంది.

**3. విద్యా విధానం**

క్రమశిక్షణ కష్టపడటం, దేశభక్తి, పనియందు ఆసక్తి, స్వయం ఉపాధి కల్గేవిధంగా గాంధీజీ నూతన విద్యా విధానాన్ని రూపొందించారు. దాన్ని బేసిక్ విద్య అంటారు. అయితే ఈనాటికి మన ఆశయాలకు అనుగుణమైన విద్యావిధానం కోసం అన్వేషిస్తూనే వున్నాము. మెకాలే విద్యావిధానం మన దేశానికి పనికిరాదని అందరం అంటున్నాము. కాని సరియగు రూపానికి తీసుకొనిరాలేకపోతున్నాము. నూతన విద్యా విధానాన్ని రూపొందించాలని ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ప్రయత్నిస్తున్నారు. వారి ప్రయత్నము సఫలం కావాలని కోరుకుందాము.

**4. వయోజన విద్య**

దేశంలో జనాభా పెరుగుతోంది. పేదరికం, నిరక్షరాస్యత తరగుటం లేదు. పేదరికం తొలగాలంటే ప్రజలలో నిరక్షరాస్యత తరగాలి. దేశసంపద పెరగాలి. ఎంత ఖర్చు పెట్టినా వయోజనవిద్య వల్ల అనుకొన్నంత ఫలితం రావటంలేదు. ఈనాటికీ సేవాభావంతో

వయోజన విద్యావ్యాప్తికి కృషిచేయవలసివుంది. నిరక్షరాస్యతను తగ్గించడానికి ఒక ఉద్యమములాగ నిర్వహించాల్సి ఉంది.

### 5. మద్య నిషేధం

స్వాతంత్ర్య పోరాటాలలో మద్యనిషేధం ఉద్యమము ప్రత్యేకత సంతరించుకొన్నది. అనారోగ్యం, అజ్ఞానం, అవిద్య, పేదరికం పెంచే మద్యపానమును నిషేదించాలని ప్రజల క్షేమం దృష్ట్యా కాంగ్రెస్ ప్రభుత్వాలు మద్యనిషేదం పెట్టి అమలుపరచుటకు సాధ్యం కాక నెమ్మదిగా ఎత్తివేయడం జరిగింది. ప్రభుత్వ ఆదాయాలకు ప్రధానమైనందున తిరిగి ఆలోచించలేకపోతున్నారు. సామాజిక, నైతిక విలువలను ప్రజలలో పెంచాలంటే మద్యనిషేదం ఎంతైనా అవసరం. సంఘసేవాసంస్థలు సామాజిక సేవా కార్యకర్తలు ప్రజలలో మద్యపానం వల్ల వచ్చే నష్టాలను ప్రచారం చేసి సామాజిక మార్పును తీసుకురావాలి.

### 6. పారిశుధ్యం

ఇంట్లోగాని, పట్టణంలోగాని పారిశుధ్యం ఎంతేని అవసరం. ఇంట్లోను, పరిసరాలు, పరిశుభ్రంగా వుంటేనే ఆరోగ్యానికి, ఆహ్లాదానికి అవకాశం కల్గుతుంది. కొన్ని ప్రాంతాలలో ముక్కుమూసుకొని, కండ్లు మూసుకొని వెళ్ళేటటువంటి దుర్గంధము, అసహ్యాకరమైన చెత్త, చెదారం ఉంటుంది. అంటువ్యాధులకు ఆధారం అవుతున్నాయి. ప్రజలకు ఎంతో కీడు కల్గిస్తుంది. అందుచే గాంధీజీ సూచించిన పారిశుధ్య కార్యక్రమాలు ఎప్పుడూ ఆచరించవలసిందే. ఎవరికివారు తోడ్పడితే గాని పరిసరాలను పరిశుభ్రంగా ఉంచలేము.

### 7. స్త్రీలు

స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలకు ప్రాధాన్యత ఇచ్చి గాంధీజీ సమాజంలో స్త్రీలకు గౌరవాన్ని తెచ్చారు. పురుషులకు, స్త్రీలకు సమాన అవకాశాలు యివ్వాలని, మాతృమూర్తులైన స్త్రీలు గౌరవించబడాలని గాంధీ అనేవారు. ఈనాడు వరకట్నాల సమస్యల వల్ల, ఇతర కారణాల వల్ల ఇంకా స్త్రీలు వేధించబడుతూనే ఉన్నారు. నిర్మాణ కార్యక్రమంలో గాంధీజీ స్త్రీల సమస్యలపై యిచ్చిన ప్రాధాన్య నేటికీ వుంది.

ఖాదీ గ్రామీణ పరిశ్రమల కమీషన్ ద్వారా గ్రామీణ పరిశ్రమలకు ఈనాడు ప్రాముఖ్యం వుంది. ఖాదీకి ప్రాముఖ్యం ఇవ్వడం వల్ల ఈనాటికీ పేదల జీవనోపాధికి తోడ్పడిన వారమగుచున్నాము. హిందీ జాతీయభాషగా పేర్కొనడం వల్ల సంధాన భాషగా

హిందీ వ్యాప్తి అవసరం అగుచున్నది. గిరిజనుల సంరక్షణకు ప్రభుత్వాలు కృషి చేస్తున్నాయి.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమములో అనేక అంశాలను కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాలు వివిధ శాఖల ద్వారా అమలు జరుపుతున్నాయి. సంఘ సేవకులు, స్వచ్ఛంద సేవసంస్థలు, కార్యకర్తలు వాటిని అమలు జేయుటకు తోడ్పడవలసి వుంది. అందుచే గాంధీజీ నిర్మాణ కార్యక్రమము అమలుపరుచుటలో సమాజ వికాసాన్ని కల్గించుటకు కృషి చేస్తూనే వుండాలి. గాంధీజీ ఆశించిన సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించే వరకూ నిర్మాణ కార్యక్రమము ఏదో రూపంలో ప్రభుత్వంచేగాని, ప్రజలచేగాని అమలు జరుపబడుతూనే వుండాలి.

ప్రతివారు సోమరితనాన్ని, నిర్లిప్తతను వదలి కష్టపడి పనిచేసి ఏదో విధంగా ఉత్పత్తికి తోడ్పడాలి. దేశభక్తి సమాజ శ్రేయస్సు ద్వారా దేశ పురోభివృద్ధికి తోడ్పడుటే నిర్మాణ కార్యక్రమ ముఖ్యోద్దేశ్యం.

గాంధీజీ నిర్మాణ కార్యక్రమము నేటికీ అనుసరణీయమైనది. ఇందిరాగాంధీ ఇరువది సూత్రాల పథకం కూడా దేశపురోభివృద్ధికి ముఖ్యదృష్టితో దేశసంపద పెంచడానికి ఉద్దేశించబడింది. అదికూడా ఒక నిర్మాణయుతమైన కార్యక్రమములతో కూడినదే.

# 6. నిర్మాణ కార్యక్రమము - నాడు-నేడు

"నేను రాజ్యముకోరను, స్వర్గముకోరను, పునర్జన్మ లేకుంట కోరను. నేను కోరునది ఆర్తినాశనం" అన్నారు గాంధీజీ. ఈ పవిత్ర భారతదేశంలో ఆకలితో, దుఃఖంతో అలమటించేవారెవ్వరూ ఉండరాదని మహాత్ముని ఆశయం. ప్రతివారికి కనీస అవసరాలు - తినడానికి తిండీ, కట్టుకోవడానికి బట్ట, ఉండటానికి ఇల్లు, విజ్ఞానానికి విద్య, ఆరోగ్యానికి వైద్య సదుపాయాలు కలిగిఉండి సుఖశాంతులతో తులతూగే రామరాజ్యంగా మనదేశం వర్ధిల్లాలని గాంధీజీ ప్రగాఢవాంఛ.

మానవతకు విలువ, ప్రతివారికి సమాన అవకాశాలు కలిగిన ప్రజల రాజ్యం ఏర్పడాలని బాపూజీ ఆలోచన. ఈ ఆశయసాధనకు మన దేశాన్ని మనం పరిపాలించుకోవాలంటే, మనలను బానిసలుగా చేసి పరిపాలిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వం తొలిగిపోవాలని స్వాతంత్ర్య పోరాటం నడిపించారు. రవి అస్తమించని సామ్రాజ్యాధిపతులతో పోరాటం చాలా కష్టతరమైనది. ఆయుధాలుగానీ, ఆర్థిక సంపదగాని లేని ప్రజలు ఏ విధంగా పోరాటం చేస్తారు? క్రీస్తు, బుద్ధుడు ప్రబోధించిన సత్యము, అహింస, త్యాగము - వీటిని ఆధారంగా తీసుకొని లోకోత్తర, మహత్తర సత్యాగ్రహ పద్ధతులను గాంధీజీ అనుసరించి స్వాతంత్ర్య పోరాటం నడిపారు.

ఒకప్రక్క సామ్రాజ్యాధిపతులలో స్వాతంత్ర్యంకోసం పోరాటం చేస్తూనే, రెండవప్రక్క ప్రజాక్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని నిర్మాణ కార్యక్రమం అమలును ప్రబోధిస్తూ వచ్చారు. "ఉపాధి - ఉత్పత్తి" ఆశయంగా గ్రామీణ ఆర్థికాభివృద్ధి, "విజ్ఞానము - వికాసము" ఆధారంగా విద్యా సాంస్కృతికాభివృద్ధి. "స్వావలంబన- స్వయంపోషకత్వం" ఆశయంగా సమాన వికాసం, "సమైక్యత-సద్భావం" కలిగిన సర్వధర్మ ప్రచారం, "దురాలోచన-దురలవాట్లు" నివారించే సంఘ సంస్కరణం కలిగిన 18 అంశాల నిర్మాణ కార్యక్రమాన్ని గాంధీజీ దేశానికి అందజేశారు.

కదురు-కవ్వము ఆడితే కరువు ఉండదని, పాడిపంటలతో దేశం తూలతూగుటకు నిర్మాణ కార్యక్రమం అమలు చేయాలన్నారు. గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు చేయుటకు లక్షలాది ప్రజలు ముందుకు వచ్చారు.

ఒకవైపు విదేశ రాజ్యాధిపతులను వెళ్ళగొట్టడానికి త్యాగంతో పోరాటాలు సాగిస్తూనే రెండవవైపు స్వదేశంలో స్వయంపోషకత్వాన్ని ప్రబోధిస్తూ నిర్మాణాత్మకమైన కార్యక్రమం అమలు పరిచేందుకు గాంధీజీ కృషి చేశారు. స్వాతంత్ర్య పోరాటంవల్ల త్యాగం సేవాభావం నిర్మాణ కార్యక్రమం వల్ల కష్టపడి పనిచేయడం, సహనం ప్రజలు అలవరుచుకోవడానికి అవకాశం కలిగింది.

నిస్వార్థ, నిష్కళంక దేశభక్తితో త్యాగం చేసి దేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించారు. ప్రజలచేత ఎన్నుకోబడి ప్రజలక్షేమానికి కృషి చేసి ప్రజాస్వామ్య రాజ్యాంగాన్ని ఏర్పాటు చేశారు. గాంధీజీ ఆశయం నెరవేరాలంటే, మన రాజ్యాంగం విజయవంతం కావాలంటే ప్రజా ప్రతినిధులు నిస్వార్థంగా, నిర్విరామంగా ప్రజల సమస్యలను పరిష్కరించడానికి కృషిచేయాలి. ప్రజలు వారి విధ్యుక్తధర్మాన్ని దీక్షగా నిర్వహిస్తూ సంపాదించిన ధనాన్ని పొదుపు చేసుకుంటూ, దురలవాట్లకు దూరంగా ఉంటూ దారిద్ర్యాన్ని తొలగించడంలో కృషి చేయవలసి వుంది.

స్వరాజ్యం వచ్చి 38 సంవత్సరాలు అయింది. అనేక ప్రణాళికల ద్వారా దేశం అప్రతిహతంగా పురోగమించింది. ఎంతో అభివృద్ధిని సాధించింది. కానీ ఈనాటికీ దేశంలో నూటికి 60 మంది పేదరికంలో ఉన్నారు. ఒకపూట తిని, ఒకపూట తినక, పిల్లలకు పెట్టి తల్లులు పస్తుండి దారిద్ర్యంతో అలమటించే వారెందరో ఉన్నారు. గాంధీజీ ఆశించిన విధంగా ప్రతివారికి కనీసఅవసరాలు తిండి, బట్ట, ఇల్లు, విద్య, వైద్య సౌకర్యాలు ఏనాడు సాధించి పెట్టగలమో!

స్వరాజ్యం వచ్చిన తరువాత త్యాగం, సేవాభావం తరిగి, స్వలాభం, సోమరితనం పెరిగిపోయాయి. కష్టపడకుండ సంపాదించాలనే వాంఛ ప్రబలింది. కష్టపడేవారు ఒకరు, అనుభవించేవారు మరొకరు అవుతున్నారు.

సమాజంలో వర్గకలహాలు, దోపిడీలు, అవకాశవాదాలు ఎక్కువ అవుతున్నాయి. దోపిడీ చేసిన ఇతర దేశస్థులను పారద్రోలాము. ఇప్పుడు మన దేశంలో మనవారే దోపిడీ చేస్తున్నారు, కొల్లగొడుతున్నారు. సామ్రాజ్యాధిపతులు కాలగర్భంలో కలిసిపోయినా, స్వతంత్ర రాజులు మటుమాయమయినా, జమీందారీ, జాగిర్దారీలు రద్దయినా, భూస్వాముల ఆధిపత్యాలు తరిగినా, ఆదాయం, సంపదలపై పన్ను విధించినా ఇంకా దళారీలు, దోపిడీదారులు, స్మగ్లర్లు, దొంగవ్యాపారస్థులు సామాన్య ప్రజలను పీల్చి పిప్పిచేస్తూనే ఉన్నారు. ధనశక్తితో నూతనవర్గం దేశంలో ఆవిర్భవించింది. ఆ డబ్బుతో రాజకీయ, సాంఘిక రంగాలను అదుపులో పెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. అందుకే

గాంధీజీ ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. నీవు సంపాదించింది నీది కాదు, నీవు సంపాదించిన ఆస్తికి నీవు ధర్మకర్తవు మాత్రం సుమీ" అని హెచ్చరిక చేశారు. దేశంలో అవినీతి, ఆశ్రితపక్షపాతం, స్వార్థం పెరిగి పోయి సామాన్యప్రజల జీవితం దుర్భరంగా తయారయింది. ఏ ప్రజలకోసం స్వాతంత్ర్యం వచ్చిందో ఆ ప్రజలు అభివృద్ధిచెందకుండ అనేక ఆటంకాలు కలుగుతున్నాయి.

ఆ అవరోధాలను తొలగించే వారెవ్వరు? ఆనాడు త్యాగం, సేవాభావంతో పనిచేసిన కార్యకర్తలు ఏరి? ఈనాడు ఆ నాయకులు ఎచట? ఇప్పుడు ఎవరున్నారు? ఈ కలుషిత అంధకార వాతావరణంలో వెలుగు చూపేదెవ్వరు? అటువంటి మహాత్ములు ఎచట?

సమాజసేవకు నిష్కళంక దేశభక్తులు ముందుకు రావాలి! నేటి యువకులలో త్యాగం, సేవాభావం అలవడునట్లు చేయాలి.

స్వాతంత్ర్య ప్రదాత గాంధీజీయే మనకు వెలుగుబాట. వారి నిర్మాణ కార్యక్రమమే మనకు రాచబాట. త్యాగంలేనిదే ఏ దేశం ముందుకు నడువదు, కష్టపడనిదే ఏ దేశం అభివృద్ధి చెందదు, నిర్మాణాత్మక కృషి లేనిదే ఏ సమాజానికి మనుగడ లేదు.

సర్వకాలాలలో సమాజ వికాసానికి, క్షేమానికి, ఆర్థిక స్తోమతను పెంచి పేదరికం తొలగించేందుకు నిర్మూలన దృష్టినుండి నిర్మాణాత్మక కృషికి తోడ్పడేది గాంధీజీ నిర్మాణ కార్యక్రమం. వ్యక్తి, గ్రామం, ప్రాంతం, దేశం స్వయం పోషకత్వాన్ని సాధించాలంటే గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు చేయటం అవసరం. ఆర్థికస్తోమతను పెంచాలన్నా, అందరికి సమాన అవకాశాలు కలిగించాలన్నా గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరుపుదాం.

సంఘసేవకులు, స్వచ్ఛంద సేవా సంస్థలు ముందుకు రావాలి! నేటి దేశ దుర్భర పరిస్థితులను గురించి పరిశీలించాలి. ఆలోచించాలి. త్యాగం, సేవాభావం అలవరచుకోవాలి. గాంధేయమార్గంలో స్వార్థం, సోమరితనం, అవినీతి, దోపిడీలపై పోరాటం సాగించాలి. ఆనాడు త్యాగం చేసి మన పెద్దలు స్వరాజ్యాన్ని సంపాదించారు. ఈ నాడు త్యాగం చేసి మనం సురాజ్యాన్ని సాధించుదాం.

ఇదే ఈనాటి మన కర్తవ్యం.

ఇదే మన ప్రతిజ్ఞ.

# 7. అన్ని వాదాలకన్నా గాంధీయవాదం మిన్న

"బెన్‌థామ్, మిల్‌ల యొక్క ఉపయోగ సిద్ధాంతాలవలనగాని; మార్క్స్, లెనిన్‌ల విప్లవపద్ధతివలనగాని; హబ్స్ యొక్క ప్రకృతి అభిముఖంగా తిరోగమించడమనే ఆశావాదంవలనగాని; నీట్జే యొక్క పరిపూర్ణ శ్రేష్ఠమానవ వేదాంతంవలనగాని నేను పొందలేకపోయిన వివేకనైతిక సంతృప్తి, గాంధీయొక్క అహింసాత్మకమైన తిరుగుబాటులో కనుగొన్నాను. ఇది ఒక్కటే నైతికంగా దళితజాతి ప్రజల స్వాతంత్ర్య సాధనకు ఆచరనీయ విధానమనే భావన నాకు కలిగింది" అని చెప్పిన అమెరికన్ నీగ్రోనాయకుడు డా॥ మార్టిన్ లూథర్‌కింగ్ గాంధీమార్గములో పయనించి, పౌరహక్కుల పరిరక్షణకై అహింసాయుతంగా ఉద్యమించి విజయము సాధించారు. అమెరికన్ గాంధీగా పేరొంది నోబెల్ బహుమతిని పొందిన డా॥ మార్టిన్‌లూథర్‌కింగ్ ఎంతో పరిశీలన తరువాత అనుభవంతో చెప్పిన పైమాటలు ఎంతో విలువైనవి. గాంధీ యొక్క మహత్తర సత్యాగ్రహ పోరాటములు రవి అస్తమించని సామ్రాజ్యాన్ని కదిలించివేశాయి. అప్పటివరకు రక్తపాతంతో స్వాతంత్ర్యం సంపాదించుకొన్న దేశాలు ఆశ్చర్యము చెందాయి. ఆయుధాలు, అవకాశాలు లేని పీడిత ప్రజలకు వారి సమస్యల పరిష్కారానికి మార్గము దొరికింది. జాత్యహంకారంతో తెల్లవారు నల్లజాతివారిమీద అనేక ఆంక్షలను విధించడం, సమాజంలో వారిని వేరుగా చూడటంవంటి జాతి విచక్షణా కార్యక్రమాలను ఎదిరించడానికి అమెరికాలో నీగ్రోల తరపున మార్టిన్ లూథర్‌కింగ్ అనేక ప్రయోగాలను చూచి చివరకు మానవతకు విలువనిచ్చి సోదరభావమును పెంపొందించే త్యాగమయ సత్యాగ్రహ పోరాటాలతో కూడిన గాంధీయమార్గానే అవలంబించారు. ప్రపంచములో ప్రముఖ రాజకీయ, తత్వవేత్తల సూచనలను పరిశీలించి, గాంధీ మార్గమే అత్యుత్తమమైనదని ప్రశంసించారు. ఆచరించారు.

గాంధీమార్గములో ముఖ్యాంశములు సత్యము, అహింస. ఏది అనుకొంటామో, ఏది చెప్తుతామో, ఏది చేస్తామో అదే సత్యం. ఒకే విధమైన మనోవాక్కాయ కర్మలతో కూడిన ప్రక్రియ. తోటి మానవుని ప్రేమించటం, గౌరవించడం, బాధలతో ఉన్నవారిని

ఆదుకోవడం మానవధర్మం. మమతతో కూడినదే మానవత. అహింసా సూత్రానికి మూలము. మానవుని మానవునిగా గౌరవించే మానవత్వం వల్ల సౌభ్రాత్రము, సామరస్యము, శాంతి వర్ధిల్లుతాయి. మానవతని మంట గలిపే అక్రమాల్ని ఎదిరించడానికి, చెడును వ్యతిరేకించడానికి గాంధీజీ సత్యం, అహింసలతో కూడిన ఆగ్రహాన్ని వెల్లడించడమే సత్యాగ్రహమన్నారు. నిజమైన ఆగ్రహంతో పోరాటము, ఇతరులను కష్టనష్టాలకు గురికాకుండా వారు చేస్తున్న అక్రమాలను, చెడును బహిర్గతపరచి వ్యతిరేకాన్ని వ్యక్తం చేస్తూ, చేసే అహింసాయుత పోరాటమే గాంధీ సత్యాగ్రహ పోరాటం. ఈ పోరాటములో పాల్గొనే వ్యక్తి ధైర్యము, సాహసము, ఆత్మశక్తి కలిగివుండాలి. ధర్మముకొరకు పోరాడుతున్నా మనే నమ్మికలిగి వుండాలి. మనము సాధించవలసిన ఆశయము ఎంత ఉన్నతమైనదో, ఆశయ సాధనకు మనము ఉపయోగించే మార్గము కూడా అంత ఉన్నతంగానూ ఉండాలి అని గాంధీజీ అనేవారు. భారత ప్రజలకు స్వాతంత్ర్యము అనే మహత్తర ఆశయాన్ని సాధించడానికి సత్యాగ్రహము అను పోరాటసాధన కూడా లోకోత్తరమైనది. మహత్తరమైనది. క్రీస్తు, బుద్ధుడు ప్రబోధించిన అహింసా సిద్ధాంతాలకు గాంధీజీ తన సత్యవ్రతాన్ని అనుసంధానము చేసి మానవతను రక్షించడానికి నూతన మార్గాన్ని అన్వేషించారు. ఇది అణ్వస్త్రముకంటె గొప్పది.

గాంధీజీ సత్యాగ్రహ పోరాటంవల్ల త్యాగాన్ని, నిర్మాణ కార్యక్రమం ద్వారా నైతిక శక్తిని పెంపొందించారు. ఆ నైతిక శక్తే భారతదేశానికి ప్రపంచంలో అపూర్వ గౌరవాన్ని సాధించిపెట్టింది. అంతర్జాతీయ రంగంలో గాంధీజీమార్గము రూపొందించిన సహజీవన సిద్ధాంతము, అలీన విధానము ప్రపంచశాంతికి దోహదము చేస్తున్నాయి. ఈనాడు అగ్రరాజ్యాలకు కూడ మన విధానాన్ని ప్రశంసింపక తప్పలేదు. గాంధీమార్గము అంతర్జాతీయ రంగంలో విజయవంతమైనది. ఏ నైతికశక్తిని అయితే గాంధీజీ సాధించారో, ఏ నైతికశక్తి శక్తియుక్తులతో అంతర్జాతీయ రంగంలో గౌరవాన్ని చేకూర్చిందో, భారత రాజకీయరంగంలో, ప్రజలలో ఆ నైతిక విలువలు రోజురోజుకు తరిగిపోతున్నాయి. దేశ ఔన్నత్యమునకు చెందిన ఆ నైతికశక్తిని కోల్పోతే మనము ప్రపంచ స్థాయిలో పతనము అవుతాము. దేశంలో అరాచకం ప్రబలుతుంది.

టెర్రరిజం నైతిక పతనానికి మూలము. సత్యాగ్రహానికి పూర్తిగా విరుద్ధమైన పద్ధతి. మానవతను మంటగలుపుతున్న విధానము, మనుషులను అమానుషంగా చంపడంవల్ల బీభత్సాన్ని సృష్టించి వారి ఆశయాలను సాధించాలని టెర్రరిజం సంకల్పం. అలాగునే

నక్సలైట్ల కార్యక్రమము. మానవత్వము, మమతలను మరచిపోయి చేస్తున్న చర్యలు ఇవి. ఈ చర్యలు సమాజంలోని సమస్యలను పరిష్కరించలేవు సరికదా మరింత జటిలంగా వాటిని తయారు చేస్తాయి. అవసరమైతే ఆత్మరక్షణకు హింసామార్గమును ఉపయోగించ వచ్చునని గాంధీజీ అన్నారు. మానవతను కోల్పోయి అకారణంగా హింసాయుత చర్యలవల్ల సాధించేది మారణహోమముతప్ప ఇంకేమి ఉంటుంది?

గాంధీమార్గమే నేటికీ ఉత్తమమైనది. గాంధీజీ మార్గము శాంతికి, అభ్యుదయానికీ తోడ్పడుతుందని అమెరికాలో మార్టిన్ లూథర్‌కింగ్ (అమెరికా గాంధీ), ఆఫ్ఘనిస్తాన్‌లో శ్రీ బాదషా ఖాన్ (సరిహద్దు గాంధీ), జపాన్‌లో ఫూజ్‌గురూజీ (జపాన్ గాంధీ) ఆయా దేశాలలో ఉద్యమాలను నడిపి మానవ కళ్యాణానికి తోడ్పడ్డారు.

ప్రపంచంలో అంతటా టెర్రరిజం పెరుగుతున్న ఈ రోజులలో గాంధీ మార్గమే శరణ్యమనే భావన పెరుగుతూవుంది. త్యాగం, మానవత, సేవలతో కూడిన గాంధీయవాదమే అన్ని వాదాలకంటె మిన్న అని మార్టిన్ లూథర్ అన్నట్లు ప్రపంచానికి ఇంతకంటె గత్యంతరం లేదు.

ఇతర దేశాలు గాంధీవాదాన్ని గుర్తిస్తున్న తరుణంలో గాంధీ మార్గాన్ని అనుసరించిన మన దేశంలో ఆ గుణం మరుగున పడుతుందని ఆందోళన పడుతున్నారు. ప్రాంతీయ, కుల, మతతత్వాలు పెరుగుతున్నాయి. వీటిని అదుపులో పెట్టాలంటే గాంధీయ మార్గమే శరణ్యం. అన్ని రంగాలలో గాంధీయతత్వాన్ని ఆచరించడానికి అందరూ ప్రయత్నించాలి.

# 8. విదేశాలలో గాంధీ ప్రభావం

అమెరికా దేశాధ్యక్షుడు శ్రీ రోనాల్డ్ రీగన్ 1984 సెప్టెబరు24న ఐక్యరాజ్యసమితిలో ఉపన్యసిస్తూ "కిరాతకులు, హంతకులు కొన్నాళ్ళపాటు ఎదురులేనట్లుగా ఉంటారని, కాని చివరకు వారు పరాజయాన్ని పొందుతారని చరిత్ర పుటలు తిరగవేస్తే సత్యం, ప్రేమతో కూడిన మార్గమే ఎప్పుడూ గెలుపొందుతూ వచ్చిం"దని మహాత్మాగాంధీ చెప్పిన ఉదంతాన్ని ఉటంకిస్తూ, తన నమ్మకాన్ని, దృక్పథాన్ని యీ విధంగా గాంధీ అభివర్ణించారని నేటికీ ఇదే సరైన వాస్తవిక దృక్పథమని ఉద్ఘాటించారు.

నేనామధ్య విదేశాలలో పర్యటించిన తరుణంలో జరిగిన అనేకానేక సంఘటనల్లో ఒక సంఘటన. 1983 అక్టోబరు 2వ తేదీన వాటికన్ నగరంలో పోప్ ఉపన్యాసం విన్న తరువాత నడుచుకుంటూ వెళుతున్నాం. ఒక ఇటలీ వృద్ధవనిత నన్ను చూచి "గాంధీ, గాంధీ" అంటూ ప్రక్క వారితో బిగ్గరగా చెపుతోంది. నేను ఆశ్చర్యం నుండి తేరుకొని ఆలోచిస్తే పంచె, చొక్కాతో కూడిన నా వేషధారణయే ఆమె అట్లా భావించడానికి కారణమని అనుకొన్నాం. సుప్రసిద్ధ చలనచిత్ర దర్శకుడు సర్ రిచర్డ్ అటెన్‌బరో నిర్మించిన "గాంధీ" చిత్ర ప్రభావమిది. ఈ చిత్ర ప్రదర్శన విదేశీయులపైన గాంధీ ప్రభావం పడటానికి ఎంతగానో దోహదపడింది.

ఇంకొక సంఘటన అమెరికాలో జరిగింది. శ్రీ వేదాల రంగాచార్య స్వామి అర్చకులుగా ఉంటున్నారు. వారు పంచె కట్టుకొని, ఉత్తరీయం కప్పుకొని ఇంటి నుండి దేవాలయానికి వెళుతుంటే మార్గమధ్యంలో అమెరికా బాలలు 'గాంధీ, గాంధీ'అని పిలుస్తారట. వేషధారణనుబట్టి గాంధీపైన, గాంధీ సిద్ధాంతాలపైన విదేశాలలో చక్కని అవగాహన పెరగడం సంతోషదాయకం. గాంధీ రూపం అక్కడివారి చిత్తాలలో హత్తుకుపోయిందనడంలో అతిశయోక్తిలేదు.

ఈ రోజున గాంధీ సిద్ధాంతాలు ప్రపంచ వ్యాప్తంగా చర్చనీయాంశాలైనాయి.

నీగ్రో నాయకుడైన మార్టిన్ లూథర్ కింగ్, గాంధీ సిద్ధాంత బీజాలను అమెరికావారి మనః క్షేత్రాలలో వెదజల్లాడు. గాంధీ సిద్ధాంతాలు అమెరికాలో ఆదరించబడటానికి యింకొక కారణంకూడా వుంది. అమెరికా, భారతదేశాలు రెండూ ఆంగ్లేయుల పాలనక్రింద మ్రగ్గినట్టివే. అయితే అమెరికా ఎప్పుడో స్వాతంత్ర్యాన్ని తెచ్చుకొంది.

భారతదేశ స్వాతంత్ర్య సమరంలో గాంధీ పూరించిన శంఖారావం అమెరికావారి చెవుల్లో మారుమ్రోగి భారతీయుల యెడ సానుభూతి కలగడానికి పై సంఘటన కారణమయింది.

నేను గత సంవత్సరం ఇంగ్లండు, అమెరికా, ఐరోపా దేశాలలో పర్యటించినప్పుడు గాంధీ సిద్ధాంతాలు విదేశాల్లో ఏ విధంగా చర్చించబడుచున్నవో తెలుసుకొనే అవకాశం లభించింది. గాంధీజీ అహింసా సిద్ధాంతం వారిని బాగా ఆకర్షించింది. యుద్ధాలవల్ల సంభవించే దారుణ మారణహోమం నుండి ప్రపంచాన్ని రక్షించడానికి, మానవకోటి వికాసానికి గాంధీమార్గమే శరణ్యమని వారు నమ్ముతున్నారు.

ఇటువంటి ఆలోచనా సరళి వారిలో కలగడానికి రిచర్డ్ అటెంబరో తీసిన "గాంధీ" చిత్రం ఎంతగానో దోహదం చేసిందని చెప్పక తప్పదు. గాంధీ చిత్రాన్ని అహింసాత్మకమైన ఉద్యమముగా విదేశీయులు భావిస్తున్నారు.

ఈ సందర్భంగా గాంధీ సిద్ధాంతాల ప్రచారమునకు యూనిసెఫ్ వారు అమెరికాలో చేసిన కృషి అనన్యసామాన్యమైనది. గాంధీజీని గురించి గాంధీ చిత్రం ఆధారంగా విద్యార్థులకు అర్థమయ్యేవిధంగా చిన్నచిన్న పుస్తకాలు ప్రచురించారు. గాంధీని గురించి మనకు తెలియని అనేక విషయాలు క్రోడీకరించి విద్యార్థులకు ఆసక్తిదాయకంగా అందించారు.

గాంధీ జీవితంలోని ముఖ్య సంవత్సరాలను తీసికొని, ఆ సంవత్సరాలలో ప్రపంచంలో జరిగిన ముఖ్యఘట్టాలను విద్యార్థులకు ఉపయోగపడేవిధంగా సుబోధకంగా ప్రచురించారు. ఉదా :- 1869లో గాంధీ జన్మించాడు. అదే సంవత్సరంలో సూయజ్ కాలువ తెరవబడింది. ఒక భారతీయుడు ఐ.పి.యస్. పరీక్షలో అందరికంటే అధికంగా మార్కులు సంపాదించాడు. కాని ఆంగ్లేయులు అది సరికాదన్నారు. అమెరికాలో నాల్గు సంవత్సరాలు జరిగిన అంతర్యుద్ధం సమాప్తమయింది.

అట్లాగే 1917లో చంపారన్‌లో నిరుపేదరైతుల మధ్యకువెళ్ళి గాంధీవారి ఉద్ధరణకై కృషి సాగించాడు. ప్రథమ ప్రపంచ యుద్ధంలో అమెరికా తలదూర్చింది. రష్యాలో విప్లవం మొదలయింది. ఈ విధంగా ఎన్నో చెప్పవచ్చు.

గాంధీ చిత్రాన్ని ఒక శాంతియుత ఉద్యమానికి మార్గంగా అమెరికాగాని ఇతరదేశాలుగాని భావించడం ప్రపంచశాంతికే పెట్టని కోటగా భావించవచ్చు.

ఈ విధంగా గాంధీ జీవితమూ, సిద్ధాంతాలు చాలా మందిని చాలా విధాల ప్రభావితుల్నిచేసి వివిధ రంగాల్లో కృషి చేయటానికి, పరిశోధనలకీ, అవగాహనకీ ఉపయోగపడ్డాయనటానికి ఈ సంఘటనలు నిదర్శనం.

# 9. గాంధీయ మార్గంలో రాజకీయ వ్యవస్థ సాధ్యమా?

నీతి, నియమాలులేని రాజకీయాలు మహాపాపం అని, సప్త మహాపాపాలలో ఇదొకటిగా గాంధీజీ పేర్కొన్నారు, నీతి, నియమాలు లేనివే రాజకీయాలుగావున్న, అంతా మహాపాపపంకిలమైన ఈ రోజులలో గాంధీజీ ఆశించిన రాజకీయ వ్యవస్థ సాధ్యమా?

గాంధీజీ రాజకీయ పోరాటాలను నీతి, నియమాలతో నిర్వహించారు. సత్యము, అహింసా సూత్రాల ఆధారంగా, త్యాగము, సేవా భావములతో, ఆత్మవిశ్వాసముతో, ధైర్యసాహసములను కలిగించి నైతికశక్తిని పెంపొందించిన సత్యాగ్రహ పోరాటాలతో స్వాతంత్ర్యాన్ని సాధించారు. ఆనాటి నైతిక విలువలు ఈనాడున్నాయా?

భారతదేశ సమైక్యతకు దోహదము చేయడానికి వివిధ రాష్ట్రాలకు చెందిన యువతీ యువకులు రెండువందలమంది ప్రముఖ సంఘసేవకులు పద్మవిభూషణ శ్రీబాబాఆమ్టే నాయకత్వంలో సైకిళ్ళయాత్ర చేస్తూ జనవరి 23వ తేదీన రాజ్‌భవన్‌లో గవర్నరు కుమారి కుముద్ బెన్ జోషీతో మాట్లాడుతూ గాంధీయ మార్గములో రాజకీయాలను నడిపించగలిగిన దేశప్రగతి, ప్రజల సంక్షేమము సాధ్యమవుతోందని అన్నారు. శ్రీ సి.వి. చారి నన్ను చూపించి ఆ విధంగా ప్రయత్నించుచున్న వారని చెప్పారు. శ్రీ బాబా చెప్పినట్లుగా గాంధీయమార్గములో రాజకీయాలను నడిపించగలమా? అసలది సాధ్యమా?

రాజకీయ స్వాతంత్ర్య పోరాటాలను గాంధీజీ నడిపించారు. కాని అధికార రాజకీయాలను గాంధీజీ అప్పుడే చూడలేకపోయినారు. కాంగ్రెస్ అధికారములోనికి వచ్చిన తరువాత కాంగ్రెస్‌వాదులలో పెరిగిన స్వార్థము పెరుగుతున్న అవినీతి, అనుభవిస్తున్న ఆడంబరజీవితాల్ని చూచి గాంధీజీ నివ్వెరపోయి కాంగ్రెస్‌ను రద్దుచేసి లోక్‌సేవాసంస్థగా మార్చాలని సూచించారు. ఆ సూచనను కాంగ్రెస్ పరిశీలించింది.

కాంగ్రెసు రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించింది. ప్రజలకు రాజకీయంగా సమాన అవకాశాలను కలిగించింది. ఆర్థికంగా ప్రజలు బలపడేటట్లు, దేశప్రగతికి, ప్రజల సంక్షేమానికి కృషి చేయవలసి వుంది. గాంధీజీ ఆశించినట్లు ప్రతివారికి కనీసఅవసరాలు

తీర్చేవిధంగా సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించాలి. ఈ పనిని సాధించాలంటే కాంగ్రెస్ తప్ప భారతదేశంలో బలమైన రాజకీయపార్టీ లేదు. కాంగ్రెస్ సంస్థను రద్దుచేస్తే దేశాన్ని సమైక్యంగా నడిపించగల శక్తిగల పార్టీలు లేవు. చిన్నచిన్న పార్టీలలో ప్రాంతీయతత్వాలు పెరిగి దేశసమైక్యతకు దెబ్బతగులుతోంది. త్యాగముతో పోరాటముచేసి, తెచ్చుకొన్న స్వాతంత్ర్యానికి ముప్పుకలుగుతుందని ఆలోచనచేసి కాంగ్రెస్ నాయకులు కాంగ్రెస్‌ను రద్దుచేయాలనే గాంధీజీ సూచనను అంగీకరించ లేకపోయినారు. రద్దుచేస్తే దేశప్రగతికి, దేశసమైక్యతకు విఘాతం కలుగుతుందనే విషయము తరువాత దేశప్రజలకు అర్థం అయింది. 1948 జనవరి 30వ తేదీన గాంధీజీని ఒక హిందూ మతోన్మాది తుపాకితో కాల్చివేశాడు. గాంధీజీ బ్రతికివుండి మత సామరస్యానికి, జాతి సమైక్యతకు పనిచేశారు. నవఖాళీలో పాదయాత్ర జరిపారు. కలకత్తాలో ఆమరణ నిరాహారదీక్ష వహించి దేశంలో వచ్చిన మత కలహాలను సమసింపచేయడానికి కృషి జరిపారు. గాంధీజీ తన ప్రాణాలను మతసామరస్యం కొరకు అర్పించారు. ప్రాణత్యాగంతో దేశంలో జాతీయ సమైక్యతకు దోహదం చేశారు.

కాని గాంధీజీ ఆత్మార్పణ తరువాత దేశంలో నైతికవిలువలు పతనము అవుతూవచ్చాయి. నైతిక ప్రమాణాలకు విలువనిచ్చి, త్యాగమయ స్వాతంత్ర్య పోరాటాలను నడిపిన కాంగ్రెస్ సంస్థ కాలక్రమేణా నైతిక శక్తికోల్పోతూ వస్తూంది. బాధ్యతారహిత ప్రవర్తన, ఆడంబరమైన జీవితవిధానము, పరస్పర ఆరోపణలు, ఆశ్రితపక్షపాతము, తప్పులను ఖండించేవారు, సరిదిద్దే పద్ధతులు తరిగి, ఉదాసీన వైఖరి పెరగడం, స్వార్థము ఎరిగి అవినీతికి పాల్పడటం కాంగ్రెస్ వాదులలోనే కాకుండా సామాజికంగానే నైతికవిలువలు క్షీణించాయి. గాంధీజీ సత్యాహింసలతో పెంచి పోషించిన నైతికశక్తి తరిగిపోతోంది. హింసాయుత తీవ్రవాద రాజకీయాలతో నైతిక విలువలకు మంగళం పాడే సమయం ఆసన్నమైంది. అణుఆయుధాల తయారీతో ప్రపంచశాంతికి ముప్పు ఏర్పడుతుంది. ప్రజాస్వామ్యమా? తీవ్రవాదమా? ఏది గతి? అనే పరిస్థితులకు దిగజారుతున్నాము.

గాంధీజీ కాంగ్రెస్‌లో ప్రవేశించి సత్యాగ్రహ పోరాటాలను నడిపి విప్లవాదుల విధ్వంసక చర్యలను అదుపుచేశారు. ఆనాటినుండి నైతిక విలువలకు స్థాయి వచ్చింది. బుద్ధుడు, గాంధీ, వినోబా వంటి పెద్దలు పెంచి పోషించిన నైతికశక్తి రోజురోజుకు జారవిడుచు కొంటున్నాము. వ్యక్తిగతంగా, సామాజికంగా, రాజకీయ, ఆర్థిక రంగాలలో

దిగజారిపోతున్నాము. ఏనైతికతతో ప్రపంచ గౌరవాన్ని పొందామో, ఆశక్తి ఏమయిపోతోంది? ఇది ప్రతి భారతీయుడు ఆలోచించుకోవాలి. అన్ని రాజకీయపార్టీలు ఆత్మపరిశీలన చేసుకోవాలి. ముఖ్యంగా నైతిక విలువలకు ప్రాధాన్యం ఇచ్చిన గాంధీజీ నాయకత్వంలో స్వాతంత్ర్య పోరాటాలను నడిపించిన భారత జాతీయ కాంగ్రెస్ కార్యకర్తలు ఆలోచించాలి. గాంధీయ మార్గమును రాజకీయాలలోనికి ప్రవేశపెట్టాలి. ఏ గాంధీయ మార్గంతో స్వాతంత్ర్యాన్ని సాధించామో ఆ మార్గంతోనే ఈ దేశదారిద్ర్యాన్ని, నిరక్షరాస్యతను నిర్మూలించి, ప్రజలకు కావలసిన కనీస అవసరాలను చేకూర్చి, ప్రజలంతా సుఖశాంతులతో తులతూగుతూఉంటే గాంధీ ఆశించిన రామరాజ్యాన్ని స్థాపించాలి. దేశంలో ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించాలంటే రాజకీయ స్వాతంత్ర్యము కొరకు చేసిన త్యాగాలకంటే వేయిరెట్లు త్యాగాలు చేయవలసి వుంటుందని జవహర్‌లాల్ నెహ్రూ అన్నారు. దేశప్రగతికి దేశసమైక్యత అవసరం. ప్రాణాలు అర్పించి దేశసమైక్యాన్ని నిలబెట్టిన ఇందిరాగాంధీ త్యాగమయ జీవితాన్ని గుర్తించుకోవాలి.

నేడు దేశాన్ని నడిపించుటకు బాధ్యత వహించిన కాంగ్రెస్‌పార్టీ రాజకీయాలలో నైతికస్థాయిని పెంచడానికి చర్యలు తీసుకోవాలి. శ్రీ రాజీవ్‌గాంధీ ప్రధాని అయిన తరువాత సామరస్యంగా సమస్యలను పరిష్కరించుకోవడం, అవినీతిని తొలగించడానికి చర్యలు తీసుకొనడం చాలా ముదావహం. కాంగ్రెస్ కార్యకర్తలకు ప్రవర్తనా నియమావళిని రూపొందించడానికి ప్రయత్నించడం శుభసూచకం.

అలాగే అన్ని రాజకీయపార్టీలు ఆలోచించుకోవాలి. తీవ్రవాదం తరగాలంటే గాంధీయవాదం పెరగాలి. గాంధీయ మార్గములోనే రాజకీయాలను నడిపించాలి. నైతికశక్తిని పెంచే నాయకత్వం కావాలి. శ్రీ రాజీవ్ ఆలోచనలు సఫలీకృతం కావాలంటే కాంగ్రెస్‌లో నీతినిజాయితీలను పెంచే నియమాలను పెట్టాలి. ఆచరించాలి.

అందుకు కొన్ని సూచనలు:

1. భారత జాతీయ కాంగ్రెస్ ఆశయమైన సమసమాజస్థాపనకు దేశంలో సుఖశాంతులు చేకూర్చే నవసమాజ నిర్మాణానికి కాంగ్రెస్‌వాదులు అంకితం కావాలి.

2. జాతీయతను, దేశభక్తిని త్యాగాన్ని పెంపొందించుకొని క్రమశిక్షణలో సేవాకార్యక్రమాలలో పాల్గొనాలి.

3. నీతి, నిజాయితీలను పెంపొందిచుకొనటానికి, గాంధీయ మార్గాన్ని, అర్థం చేసుకోవడానికి, స్వాతంత్ర్య సమర చరిత్రను తెలుసుకొని, ఆకళింపు చేసుకొనాలి,హింసాయుత మార్గాలను విసర్జించాలి. ప్రతి విషయమును మానవతా దృష్టితో పరిశీలించాలి.

4. ప్రజల సంక్షేమానికి, దేశప్రగతికి తోడ్పడే విధంగా ఏ పదవినైనా బాధ్యతాయుతంగా స్వీకరించి కృషిచేయాలి.

5. సమాజంలో గౌరవాన్ని పొందే విధంగా ప్రవర్తన వుండాలి. ఆడంబరాలను అదుపులో పెట్టుకొనాలి. చెడు అలవాట్లకు దూరంగా వుండాలి. ఉదాసీనత, అలక్ష్యం, సోమరితనం, దరిచేరనీయరాదు.

6. ప్రజలతో సన్నిహితసంబంధాల్ని పెట్టుకోవాలి. సహనంతో ప్రజల సమస్యల పరిష్కారానికి దోహదం చేయాలి.

ఈ సూత్రాలను కాంగ్రెసువారు ఆచరించితే సమాజంలో గొప్ప మార్పులతోపాటు నైతిక విలువలు పెరుగగలవు. గాంధీయమార్గంలో రాజకీయాలను నడిపించి, దేశగౌరవాన్ని తారస్థాయికి తీసుకొని వెళ్ళవచ్చును.

# 10. ప్రపంచానికి గాంధీయ మార్గమే శరణ్యం

"హింసాయుత మార్గం శక్తిని, సంపదను వృథా చేస్తుంది. ఈ విధంగా వృథా చేసుకోవడం కంటె ఆ శక్తిని, సంపదను ప్రగతి కొరకు ఉపయోగించవచ్చును. వివిధ దేశాలు అణ్వాయుధాలు సమకూర్చుకొనేందుకు పిచ్చిపట్టినట్లు ప్రయత్నిస్తున్న ఈ తరుణంలో శాంతి, అహింసలు మరింత పెరిగిం"దని బొంబాయిలో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు శతజయంత్యుత్సవ సభలో సరిహద్దు గాంధీ అన్నారు.

సోదర భావాన్ని పెంపొందించుటకు దృఢ సంకల్పం, ధైర్యసాహసాలు అవసరమని, ఈ విలువలను సాధించుటలో మహాత్మాగాంధీ విజయం సాధించారని సరిహద్దుగాంధీ అన్నారు.

భారతదేశం, పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్ దేశాల స్వాతంత్ర్య ఉద్యమాలలో ప్రముఖపాత్ర వహించిన మహత్తర స్వాతంత్ర్యయోధులు 96 సంవత్సరాల వయోవృద్ధులు, 1969 తర్వాత మరల భారతదేశానికి వచ్చి గాంధీమార్గమే ప్రపంచానికి శరణ్యమని ఉద్బోధ చేసి వెళ్ళారు. బడుగుదేశాల ప్రజల ఆకలిమంటలు ఒక ప్రక్క, సంపన్నదేశాధినేతల అణు ఆయుధ ప్రయోగాలు మరొకప్రక్క, ప్రపంచ భవిష్యత్తు ఏమవుతుందో తెలియని అయోమయస్థితి. పీడితప్రజల అభివృద్ధికి తోడ్పడేందుకు కృషిచేసేబదులు, కోట్లాదిడబ్బు అణ్వస్త్రములపై ఖర్చుపెట్టి ప్రపంచ మారణహోమానికి యజ్ఞము చేస్తున్నారు. ఇది ఎంత దారుణమైనదోనని శతవృద్ధుడు సరిహద్దుగాంధీ తన ఆవేదనను, పైమాటలలో వ్యక్తంచేశారు. కోట్లాది డబ్బు ఖర్చుపెట్టి, వేలాదిమంది శ్రమతో తయారయి, లక్షలమంది ప్రజలను హతమార్చేదీ మానవ మారణహోమానికి తోడ్పడేదీ అణ్వస్త్రం. పిరికివాడయిన సంపన్నుని ఆయుధం. వ్యక్తియొక్క త్యాగము, సత్యాహింసలతో కూడిన ధైర్యసాహసాలు గల పేదవాని అస్త్రం సత్యాగ్రహం. మానవతద్వారా మానవాళి క్షేమానికి, వారి న్యాయమైన కోర్కెల సాధనకు మార్గము సత్యాగ్రహము.

1945 ఆగస్టు 6వ తేదీన హిరోషియా మీద వేసిన ఆటంబాంబు వల్ల లక్షమంది చనిపోయారు. వెయ్యికోట్లమంది ప్రజలను హతమార్చగల అణుబాంబులను ప్రస్తుతం

నిలువచేశారని ఒక అంచనా. అణుయుద్ధం వస్తే ప్రపంచమే సర్వనాశనం అవుతుంది. అలీనరాజ్యాలకు నాయకత్వం వహిస్తున్న భారత ప్రధాని రాజీవ్‌గాంధీ ఈ ప్రమాదాన్ని నివారించి ప్రపంచశాంతికి కృషి చేస్తున్నారు. అణుఆయుధాల నిర్మాణం నిషేధించాలని కోరుతున్నారు. సంపన్న దేశాలు లక్షలాదికోట్లు ఖర్చు పెడుతున్నాయి. ఇది ఎంతఘోరమో ఆలోచించాలి. రిచర్డు ఎటెన్‌బరో తీసిన గాంధీ ఫిల్ము అనేక దేశాలలో ప్రదర్శించిన తరువాత సత్యము, అహింస, త్యాగములతో వారుచూపిన మార్గము ఉత్తమమైనదని ప్రస్తుతం అతి క్లిష్టపరిస్థితులలో నున్న ప్రపంచానికి వెలుగుబాట అనీ, మానవతకు రక్షణ కలిగించేది శాంతికి తోడ్పడేది గాంధీయమార్గమని పాశ్చాత్య దేశాలలో కూడ విశ్వాసము కలిగింది. సరిహద్దుగాంధీ శ్రీబాద్‌షాఖాన్ చెప్పినట్లు గాంధీయమార్గమే ప్రపంచానికి శాంతిసాధన మార్గము. అదే శరణ్యము.

# అనుబంధం

## శ్రీ మండలితో ఇష్టగోష్ఠి

(1985 ఆగస్టు-సెప్టెంబరు నెలలో "గాంధీక్షేత్రం" మాసపత్రికలో శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి, శ్రీమండలివారితో జరిపిన ఇష్టగోష్ఠి)

ప్రశ్న : జాతీయోద్యమ నాయకులతోను, నిర్మాణ కార్యక్రమాలతోను తమ తొలిపరిచయాలు వివరిస్తారా?

జవాబు : మా నాన్న శ్రీమండలి వెంకట్రామయ్యగారు భావదేవరపల్లి ప్రాథమిక పాఠశాలలో పనిచేస్తుండేవారు. వారు గాంధీయవాది. ఖద్దరు కట్టేవారు. గాంధీగారిని గురించి, కాంగ్రెసును గురించి చెప్తుతూ వుండేవారు. వారి మాటలు, బోధలు వింటూవుండేవాడిని, వారు కాంగ్రెసువాది అని తెలిసి జస్టిస్ పార్టీ జిల్లాబోర్డువారు అనేక చోట్లకు ట్రాన్స్ఫర్ చేశారు. మంగళాపురంలో పనిచేస్తున్నప్పుడు శ్రీ చంద్ర రాజేశ్వరరావు గారు వారి భావాలకు ఉత్తేజితులైనారు. వారు ఏ గ్రామమలో పనిచేసినా జాతీయోద్యమమునకు తోడ్పడుతూ వుండేవారు. ఎన్ని కష్టాలు వచ్చినా ఆ ఉద్యమాలను వదిలిపెట్టలేదు. వారి ప్రభావము నా మీద పడింది. 1940లో నన్ను అవనిగడ్డ ఉన్నత పాఠశాలలో చేర్చారు. గాంధీజీ వ్యక్తిగత సత్యాగ్రహం ప్రారంభించారు. అవనిగడ్డలో శ్రీ వేమూరి నారాయణమూర్తిగారు, బందలాయిచెరువులో శ్రీ చిరువోలు రాధాకృష్ణమూర్తిగారు, మరల అవనిగడ్డలో శ్రీ ఏలేశ్వరపు కృష్ణమూర్తి గారు వ్యక్తిగత సత్యాగ్రహాలు మూడు రోజులు చేశారు. ఈ మూడు సత్యాగ్రహాలను చూడాలనే కుతూహలంతో వెళ్ళాను. శ్రీ ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారు అవనిగడ్డ పార్కుదగ్గర సత్యాగ్రహము చేసినపుడు లాఠీ చార్జి చేశారు. విద్యార్థులుగ ఉన్న మామీద కూడా చేశారు. అదే ప్రథముగ స్వాతంత్ర్య ఉద్యమములో పాల్గొనడం. అవనిగడ్డ జాతీయ విద్యార్థి సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికయ్యాను. శ్రీయుతులు చిలకపాటి సుబ్బారావు, కావూరు వెంకట్రామయ్య చౌదరి యిరువురు తెలుగు పండితులు. జిల్లాపరిషత్తు హైస్కూలులో పనిచేస్తు ఖద్దరుకట్టి, ఈ ఉద్యమాలలో పనిచేస్తున్న మావంటి యువకులను బలపరుస్తూ ఉండేవారు. వారి ప్రోత్సాహముతో మేము అజ్ఞాతంగ అనేక కార్యక్రమాలు చేశాము.

ఒక రాత్రి హైస్కూలు చెట్టుమీద కాంగ్రెసు జండాకట్టి, ఆగస్టు విప్లవోద్యమ కాగితాలు అంటించి బయటకు వస్తుండగ పోలీసులు గస్తీతిరుగుతూ నన్ను పట్టుకున్నారు. లాఠీతో కొట్టారు. అశ్వారావుపాలెం కరణం శ్రీ మండలి సత్యనారాయణగారంటే అప్పుడు అవనిగడ్డలో మంచిపలుకుబడి –వారు మా పినతండ్రిగారని తెలుసుకొని జైలులోనికి తీసుకువెళ్ళిన తరువాత వదలివేశారు. అయినా అద్భుతంగా టెలిగ్రాము తీగలుతెంచి వేయడం, గాలిగోపురముమీద కాంగ్రెసు జండాలు కట్టడం చేశాము. ఈ కార్యక్రమాలలో శ్రీ తూమాటి గాంధీ, శ్రీ బాలకోటేశ్వరరావు మొదలైన మిత్రులుకూడ పనిచేశారు. వారు అరెస్టు అయినారు.

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు జైలునుండి వచ్చిన తరువాత శ్రీ చిలకపాటి సుబ్బారావుగారింటికి వచ్చారు. శ్రీ సుబ్బారావుగారు నన్ను శ్రీ బ్రహ్మయ్యగారికి పరిచయం చేశారు. అప్పటినుండి శ్రీ బ్రహ్మయ్యగారితో కలసి కాలినడకన దివిసీమలో గ్రామ గ్రామాన తిరిగాము. శ్రీ ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారు ఎంతో ప్రోత్సహమిచ్చేవారు. 1942 ఆగస్టు ఉద్యమంలో కాంగ్రెసు, విద్యార్థి కాంగ్రెసు నిషేధించబడినాయి. దివితాలూకా కాంగ్రెసు సమితికి కార్యదర్శిగ నియమించబడినాను. పోలీసులు వెంటాడుతూనే వుండేవారు. మా బాబాయి గారి మీద గౌరవంతో నా మీదకు వచ్చేవారుకాదు.

ఆంధ్రవిద్యార్థి పౌరసత్వ కళాశాలను నిర్వహించాను. ఆచార్య రంగాగారు వచ్చారు. అప్పటినుండి రంగాగారికి ఎంతో అభిమానం. జిల్లా యువజన కాంగ్రెసు ఆర్గనైజరుగా మచిలీపట్టణంలో – విద్యార్థి శిక్షణాలయములను పెట్టినాము. శ్రీ సంజీవరెడ్డిగారు వచ్చారు. ఆంధ్ర రైతాంగ విద్యాలయమునకు శ్రీ గోపాలరెడ్డిగారు వచ్చారు. అలా రాష్ట్ర కాంగ్రెసు పెద్దలతో పరిచయాలు కలిగాయి.

భావదేవరపల్లిలో రైతాంగ సమస్యలు మానాన్నగారు చూస్తూ వుండటం వల్ల, ఆ సమస్యల పరిష్కారంలో వారికి తోడ్పడే అవకాశం కలిగినది. ఇరిగేషన్ సౌకర్యములు, భూములకు పట్టాలు యిప్పించే ఉద్యమాలలో పాల్గొనటంతో గాంధీజీ నిర్మాణ కార్యక్రమాల అమలుకు అవకాశము కలిగింది.

ప్రశ్న : గాంధీవాదానికీ రాజకీయానికీ పొంతన కుదురుతుందా? వీటిని తమరెలా సమన్వయ పరుస్తున్నారు.

జవాబు : గాంధీవాదం మా నాన్నగారి నుండి వచ్చింది రాజకీయం శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి నుండి వచ్చింది. మొదటి నుండి గాంధీజీ నిర్మాణ కార్యక్రమములో నాకు

ఆసక్తి పెరిగింది. అందుచేత స్థానికసమస్యల పరిష్కారానికి, అభివృద్ధికార్యక్రమాలకు తోడ్పడుట ముఖ్యవిధిగా భావించాను. గాంధీజీ ఒకప్రక్క స్వాతంత్ర్యోద్యమాలను నడుపుతూ రెండవప్రక్క 18 అంశాల నిర్మాణ కార్యక్రమాన్ని అమలుజరుపుతూ వుండేవారు. ఆ రెండింటినీ గాంధీజీ సమన్వయం చేసి నడిపేవారు.

ప్రశ్న : గాంధీయవాదం – రాజకీయం, సమన్వయం.

జవాబు : గాంధీజీ అడుగుజాడలలో నిర్మాణ కార్యక్రమాన్ని, రాజకీయకుల ఈ రెండు ఎద్దులను సమాజసేవ అనే బండికికట్టి నడిపించుటవల్ల దేశసౌభాగ్యానికి ఇతోధికంగా తోడ్పడుటకు కృషిచేసిన వారము అవుతామని నా నమ్మకం.

ఈనాటికీ ఆ నమ్మకంతోనే రెంటిని సమన్వయపరచుకొంటూ కృషిచేస్తున్నాను. కాని చాలా కష్టమైనపని ఇది. సత్యనిష్టతో సేవా దృష్టితో కూడినది నిర్మాణ కార్యక్రమము. అసత్యం, అవకాశ వాదంతో కూడదినది. రాజకీయం, గాంధీగారు అందుకే స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రత్యక్ష రాజకీయాలకు దూరంగ వుంటూ నిర్మాణ కార్యక్రమాలకే ప్రాధాన్యత యిచ్చారు.

ఈ రెంటిని సమన్వయ పరచాలనే నా ప్రయత్నంలో అనేక ఇబ్బందులు ఎదురౌస్తున్నాయి. అయినా నా ఆశయాన్ని విడవకుండా నడుస్తున్నాను. నీతి నియమాలు లేని రాజకీయాలు మహాపాపమని గాంధీగారు చెప్పారు. ఆ రెండూ కరువు అయినాయి. అందుకే నేడు దేశ రాజకీయాలు కలుషితం అయి రాజకీయ క్లిష్టదశకు చేరుకున్నాయి.

ఇప్పుడైనా గాంధీ ఆశయాల్ని సాధించాలంటే ఈ రెంటినీ సమన్వయపరిచి నప్పుడే దేశసౌభాగ్యానికి అది తోడ్పడుతుంది.

ప్రశ్న : అవనిగడ్డలో గాంధీక్షేత్ర స్థాపన – దాని పూర్వాపరాలు – ఉద్దేశ్యాలు వివరిస్తారా?

జవాబు : 1957లో బందరు పార్లమెంటు సభ్యుడుగా ఎన్నిక అయినాను. మా నివాసస్థలము భావదేవరపల్లి. అందరికీ అందుబాటులో వుండడానికి అవనిగడ్డ చేరాను. సంతబజారులో 8 వేలకు ఒక ఇల్లుకొని వుంటున్నాము. చిన్ననాటినుండి నిరాడంబరంగ గాంధీజీ విధానంలో నడవాలనే కోరిక ఉండేది. ఉండటానికి ఆశ్రమంలాగ యిల్లు వేసుకోవాలని తలంపు. 40 సెంట్లస్థలము (యిప్పుడున్నది) కొన్నాము. చాలా లోతట్టుగ

ఉండేది. కొత్తపేట, మాచవరం, మోదుమూడి గ్రామాలకు చెందిన మిత్రులు బండ్లతో మట్టితోలి మెరకచేశారు. చుట్టూ గోడకట్టి కొబ్బరిమొక్కలు వేశాను. ఆశ్రమస్థాయిలో వుండటానికి పూరిల్లు కట్టాలని ప్లాను వేశాను. అదేసమయంలో రెండుగ్రామాలలో యిళ్లు తగలబెట్టడం, గడ్డివాముల అగ్నికి అహుతికావడం జరిగింది. అందుచే ఆశ్రమంలాగ పూరిఇండ్లతో లాభంలేదని, పక్కాయిల్లు బంగళాపెంకుతో వేద్దామని పునాదులు త్రవ్వించాము. అచటనుండి డాబాగా మార్చబడింది. సంతబజారులో యిల్లు అమ్మివేశాం. మానాన్నగారు లోనుతీసుకున్న డబ్బుతోను గృహప్రవేశానికి మిత్రులు యిచ్చిన సహాయంతోను ఈ డాబా పూర్తిచేశాం.

1967లో దివిసీమ సమష్టి సహకార వ్యవసాయ బృహత్తర ప్రణాళిక ప్రారంభోత్సవానికి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి వచ్చారు. జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాల ప్రక్కన 80 సెంట్లు, ఖాళీగా, పొదలతో మెరక పల్లాలతో వుదేది. మీటింగు ఏర్పాటుకు దానిని బాగుచేయించినాము. అచట వేదికను కట్టించినాము. తరువాత ఒక చావడివేసి దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితిని స్థాపించి పదిమంది కూర్చోవడం, మాట్లాడుకోవడం జరుగుతూండేది. 1969లో గాంధీ శత జయంతి దేశమంతా పెద్దఎత్తున జరుగుతుంది. మనము ఏమిచేయాలనే ఆలోచన వచ్చింది. దివిసీమ వైజ్ఞానిక సాంఘిక సేవాసమితి ఆధ్వర్యములో గాంధీవిజ్ఞాన కేంద్రాన్ని స్థాపించాలని అనుకొన్నాము. స్థలము లీజుకొరకు కృష్ణాజిల్లా పరిషత్తును కోరాము. గాంధీక్షేత్ర నిర్మాణానికి 99 సంవత్సరాల లీజుపై దివిసీమ వైజ్ఞానిక సమితికి జిల్లాపరిషత్తుతో రిజిష్టరు అగ్రిమెంటు జరిగింది. శ్రీ కోసూరు రత్తయ్యగారు వారిపేర యిచ్చిన 8 వేల విరాళముతో గ్రంథాలయ భవనము నిర్మాణముతో ప్రారంభించబడి ఈనాడు ఎంతో అభివృద్ధి సాధించింది. గాంధీజీ నిర్మాణ కార్యక్రమము అమలు జరుపుట, అమలు జరిపే సంస్థలను ప్రోత్సహించుట వాటిని సమన్వయపరచుట గాంధీక్షేత్ర ముఖ్యోద్దేశ్యము. గాంధీగారితో అత్యంత సన్నిహితంగ పనిచేసిన ప్రభాకర్‌జీ మాకు మార్గదర్శకులుగ వుండుట, గాంధీగారి కోడలు శ్రీమతి నిర్మలా రామదాసుగాంధీ, మనుమడు శ్రీ కనూగాంధీ, మనుమరాలు శ్రీమతి ఆభాగాంధీ 1977లో రెండు పర్యాయములు గాంధీక్షేత్రములో ఉండుట, కార్యక్రమములలో పాల్గొనుట ఎంతో ఉత్సాహాన్ని, ప్రాధాన్యతను కలుగజేసాయి. దక్షిణ భారత నిర్మాణ కార్యకర్తల మహాసభలు, ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల సభలు, ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సేవసంస్థల మహాసభలు జరిగాయి.

1977 ఉప్పెన తరువాత సేవాసంస్థల సమన్వయ కేంద్రంగా గాంధీక్షేత్రం మానవసేవకు అంకితమైంది. 1977 అక్టోబరులో గాంధీ క్షేత్రానికి అనుబంధంగా సేవాశ్రమాన్ని నెలకొల్పి శ్రీమతి నిర్మలా గాంధీగారితో ప్రారంభోత్సవం జరిపించాము. ఉప్పెనవల్ల అనాథులైన బాలబాలికలను సేవాశ్రమము కేంద్రమైంది. వారి విద్యాభ్యాసానికి గాంధీజీ బేసిక్ విద్యలో అనుభవజ్ఞులు, చాలాకాలంగా గాంధీజీతో సేవాగ్రాంలో వున్న శ్రీ కె.ఎస్. ఆచార్యులుగారి ఆధ్వర్యములో (పిల్లల విద్యకు) గాంధీ గురుకులం స్థాపించబడింది. వారికి సాంకేతిక విద్య గరిపేందుకు పశ్చిమ జర్మనీకి చెందిన డా॥ హెచ్. హెచ్. డైక్‌మన్, శ్రీమతి రూత్-డైక్‌మన్ గార్ల భూరి విరాళంలో "రూత్-డైక్‌మన్ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్" స్థాపించబడింది. దీనిలో ప్రింటింగ్, బైండింగ్ కంపోజింగ్, కార్పెంటరీ, షూమేకింగ్, టైలరింగ్, పెయింటింగు, టైపు శిక్షణా తరగతులు నిర్వహించబడుతున్నవి. వీటి నిర్వహణకు ఏ.ఎం.జి. ఇండియా ఇంటర్నేషనల్ (చిలకలూరి పేట) డైరెక్టర్ డా॥ ఎస్.జాన్‌డేవిడ్ ఎంతో తోడ్పడుతున్నారు.

గాంధీక్షేత్రాన్ని గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో ఆదర్శశిక్షణ కేంద్రంగా రూపొందించాలని, నిర్మాణ కార్యక్రమాలకు కార్యక్షేత్రంగా నిలబెట్టాలనే నా ఆశయము. ఆ ఆశయ సాధనకు కృషిచేద్దాం.

ప్రశ్న : తాము నిర్వహించిన సేవా కార్యక్రమాలలో తమకు బాగా తృప్తి కలిగించినదేది?

జవాబు : 1977లో ఉప్పెన - తుఫాను వచ్చినప్పుడు, తరువాత నా ప్రజల మధ్యన ఉండి సహాయ, పునరావాస, పునర్నిర్మాణ కార్యక్రమాలలో జాతీయ, అంతర్జాతీయ సేవాసంస్థల సహాయము, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సహకారము సమన్వయపరచి సేవచేయడమే నాకు సంతృప్తి కలిగించిన సేవాఘట్టం.

కోస్తా ప్రాంతములో ఉప్పెనతో తుడిచిపెట్టబడిన గ్రామాలలో ఇండ్లు, రోడ్లు, ఎలక్ట్రిసిటీ, టెలిఫోను సౌకర్యాలు, తుఫాను రక్షిత నిలయం నిర్మాణంచేసి మంచినీటి పథకాన్ని ఏర్పాటుచేయడం లక్ష్యంగా పెట్టుకొని గ్రామాల్ని పునర్నిర్మించడం జరిగింది. పునర్నిర్మాణ కృషి ఆదర్శప్రాయంగా జరిగిందని చెప్పాలి.

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | భారత జాతీయ కాంగ్రెసు మహత్తర చరిత్రలో మహోజ్జ్వల ఘట్టాలు | 167 |
| 2. | ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ పూర్వాపరాలు | 184 |
| 3. | స్వాతంత్ర్య పోరాటంలో ఆంధ్రప్రదేశ్ | 192 |
| 4. | బందరు విద్యార్థుల 1946 చారిత్రక పోరాటం | 199 |
| 5. | భారత రాజ్యాంగం – పూర్వాపరాలు | 201 |
| 6. | భారతదేశ భవిష్యత్తును తీర్చిదిద్దే మధ్యంతర ఎన్నికలు కాంగ్రెసు సంఘముల బాధ్యతలు! కార్యకర్తల కర్తవ్యం! | 209 |
| 7. | కాంగ్రెస్ కార్యకర్తలు : నిర్మాణ కార్యక్రమం | 222 |
| 8. | లోక్‌సభ మధ్యంతర ఎన్నికలు – కాంగ్రెసు అఖండ విజయం : కాంగ్రెసు సంఘాల అభ్యర్థుల కార్యకర్తల కర్తవ్యం | 226 |
| 9. | బాలారిష్టాలు అధిగమించిన ఆంధ్రప్రదేశ్ ప్రగతి పథగమనం | 229 |
| 10. | నూరేళ్ల పండుగ | 234 |

# 1. భారత జాతీయ కాంగ్రెసు మహత్తర చరిత్రలో మహోజ్జ్వల ఘట్టాలు

ప్రపంచంలోని రాజకీయపార్టీలలో చాలా పురాతనమయిన పార్టీ కాంగ్రెసు సంస్థ. ప్రపంచ ప్రజాస్వామికసంస్థలలో చాలా పెద్ద సంస్థ. రవి అస్తమించని సామ్రాజ్యాధిపత్యాన్ని అహింసాయుతంగా సత్యాగ్రహపోరాటాలతో తొలగించిన పవిత్రమయిన సంస్థ. వచ్చిన స్వాతంత్ర్యంతో ప్రజాస్వామిక, సామ్యవాద రాజ్యాంగ విధానాన్ని ఏర్పరచి పరిపాలన అధికారాన్ని ప్రజలచేతిలోబెట్టిన ప్రజల సంస్థ.

ప్రణాళికాబద్ధంగా నవభారత విధానాన్ని తీర్చిదిద్దిన సంస్థ.

అలీనోద్యమానికి నాయకత్వం వహించి ప్రపంచశాంతికి కృషిచేస్తున్న సంస్థ.

జాతిసమైక్యతకు ప్రాణాలు దారపోసిన గాంధీ, దేశసమైక్యతకు ప్రాణాలర్పించిన ఇందిరాగాంధీ నాయకత్వంలో పునీతమయిన సంస్థ.

62 సంవత్సరాలు దేశస్వాతంత్ర్యంకొరకు మహోద్యమాలను నడిపి, 38 సంవత్సరాలు దేశప్రగతికి కృషిచేసి భారతదేశాన్ని తీర్చిదిద్దిన మహాసంస్థ.

దేశ చరిత్ర కాంగ్రెసు చరిత్ర. మహనీయుల త్యాగమయమే కాంగ్రెసు ఉద్యమాలు. కాంగ్రెసుచరిత్ర చదువుతుంటే కాంగ్రెసు చేసిన త్యాగం వళ్లు జలదరింపచేస్తుంది. చరిత్ర వింటుంటే సేవాభావం ఉప్పొంగుతుంది. చరిత్ర తెలుసుకొంటుంటే ప్రగతికి పాటుపడాలనిపిస్తుంది.

రిచర్డు అటెన్‌బరో తీసిన గాంధీఫిల్ములో మహత్తర త్యాగమహిమలుచూసి ప్రపంచం నివ్వెరపోయింది. కల్లోలప్రపంచానికి మార్గం కనిపించింది. ప్రపంచశాంతికి గాంధేయమార్గమే శరణ్యమని ప్రపంచం గుర్తించింది. ప్రపంచశాంతికి నైతికమార్గాన్ని చూపింది. యువకులలో ఎంతో చైతన్యాన్ని తీసుకొనివచ్చింది. త్యాగము, సేవాభావములను పెంపొందించింది నైతికవిలువలను నిలబెట్టాలంటే కాంగ్రెసు చరిత్రను తెలుసుకోవాలి. కొన్ని వేలపేజీల చరిత్రను ఎంతోమంది చరిత్రకారులు ఎన్నో పుస్తకాలలో రచించిన చరిత్రను తెలుసుకోవాలంటే, చదవాలంటే అసాధ్యం.

భారతజాతీయ కాంగ్రెసు మహత్తర చరిత్రలో మహోజ్జ్వలఘట్టాలను కొద్దిలో తెలుసుకొందాం.

## ఆంగ్లేయుల వ్యాపారం - అధికారం

భారతదేశానికి రెండు మహాసముద్రాల ఆవల ఆరువేల మైళ్ళ దూరంలో బ్రిటనుదీవులనుండి నౌకాయానం చేసి వ్యాపారనిమిత్తం 1600 సంవత్సర ప్రాంతంలో భారతదేశంలో ప్రవేశించిన ఆంగ్లేయులు ఈస్టిండియా కంపెనీని ఏర్పాటుచేసి వ్యాపారాన్ని మరింత అభివృద్ధి చేసుకున్నారు. వర్తక మిషతో అచ్చటచ్చట తీరప్రాంతములలో స్థావరాలను ఏర్పాటు చేసుకుని 150 సంవత్సరాలు వాణిజ్యమే ప్రధానంగా చూసుకున్నారు. భారతదేశంలో రాజులు, సామంతరాజులు తమలోతాము కలహించుకొనుట ఆసరాగా తీసుకుని 1757 నుంచి పరిపాలనా తృష్ణతో ఒక్కొక్కప్రాంతాన్ని స్వాధీనం చేసుకుంటూ 1850 నాటికి భారతదేశాన్ని పూర్తిగా అదుపులోనికి తెచ్చుకున్నారు.

దేశప్రజలలో తాండవిస్తున్న దారిద్ర్యం, నిరక్షరాస్యత, నిర్లక్ష్యం, రాజ్యపాలకుల సంకుచితదృష్టి, పరస్పరకలహాలు, అనైతకృత, పరాధీనతకు కారణములయినాయి ఆంగ్లేయులు ఈ అవకాశాలను వినియోగించుకొని వందసంవత్సరాలలో దేశానికి పాలకులయినారు. నాగరికత, క్రమశిక్షణ, వ్యవహారదక్షత కలిగిన బ్రిటిషువారు తమరాజ్యసుస్థిరతకు క్రమబద్ధంగా కృషిచేశారు.

## ప్రథమ స్వాతంత్ర్య పోరాటం

బ్రిటిషువారు వర్తకంపేరుతో ప్రవేశించి, రాజ్యస్థాపన చేయడంలో స్వతంత్రంగా వ్యవహరించిన రాజ్యాధిపతులు బాధపడుతూనే వున్నారు. బ్రిటిషుదేశాన్నుండి వచ్చినవారికి ఉద్యోగాలు ఇవ్వడం సైనికులను కూడా అచ్చటనుండి తెప్పించడంతో వారి రాజ్యకాంక్ష మితిమీరినట్లు కనిపించింది. కొంతమంది సంస్థానాధిపతులు, వారి సైనికులు తిరుగుబాటు చేశారు. అదే ప్రథమ స్వాతంత్ర్యపోరాటమన్నారు. ఎంతో ధైర్యసాహసాలతో పోరాటాలు చేసినా, బ్రిటిషు సైనికుల క్రమశిక్షణ, నవీనమయిన ఆయుధాలు కలిగివుండుటచే తిరుగుబాటు అణగిపోయింది. ఈ విజయంతో బ్రిటిషుప్రభుత్వం ఈస్టిండియా కంపెనీని రద్దుచేసి బ్రిటిషుపార్లమెంటు ప్రత్యక్షపాలన క్రింద అధికారాన్ని స్వీకరించింది. భారతదేశం చేస్తున్న సౌకర్యాలు వారి రాజ్యసుస్థిరతకేనని ఋజువు అయింది.

ఈ స్వాతంత్ర్యసమరం వలన భారతదేశ ప్రజలలో ఒక చైతన్యం వెల్లివిరిసింది. దేశాన్ని గురించి ఆలోచించటం, బ్రిటిషు పరిపాలన దుష్ఫలితాలను గమనించడం ప్రారంభమయింది.

## రాజకీయ చైతన్యం

బ్రిటిషువారు వారి రాజ్యసుస్థిరతకు రైలుమార్గాలనువేయడం తంతితపాలా సౌకర్యాలను విస్తరించడం, సైనికస్థావరాలను ఏర్పాటుచేయడం చేశారు. ఎచ్చటనయినా తిరుగుబాటుచేస్తే అణచివేయడానికి సిద్ధంగా అన్ని ఏర్పాట్లు చేసుకున్నారు. అయితే ఈ సౌకర్యాలవలన వివిధ ప్రాంతాలలోని భారతీయులు సన్నిహితం కావడానికి అవకాశాలు కలిగి రాజకీయచైతన్యానికి దారితీశాయి. పరస్పర అవగాహన పెరగడానికి పరిస్థితులు తెలుసుకోడానికి అవకాశం కలిగింది. ఆంగ్లేయ ఉద్యోగులకు ఉన్న ప్రతిపత్తి, సౌకర్యాలు అదేస్థాయిలో ఉన్న భారతీయ ఉద్యోగులకు లేకపోవడంతో అసంతృప్తి పెరుగుతూ వచ్చింది. ఆంగ్లేయులు ప్రథమపౌరులుగా, భారతీయులు ద్వితీయ పౌరులుగా భావించటంతో ప్రజలలో నిరసన ప్రారంభం అయింది. ఈ తేడాలను, ప్రజలలో అసంతృప్తిని గమనించిన హ్యూం దొర ప్రభుత్వపాలనలోని లోపాలను సరిదిద్దడానికి, ప్రభుత్వానికి చెప్పే సంస్థ అవసరం అని భావించి దాని నిర్మాణానికి ప్రయత్నాలు సాగించాడు.

## జాతీయ కాంగ్రెస్ స్థాపన

భారతదేశంలో అచ్చటచ్చట స్థానికంగా ఏర్పడిన సంస్థల ప్రతినిధులు, జాతీయ భావములు గల నాయకులు 1885 డిసెంబర్ 28వ తేదీన బొంబాయిలో డబ్ల్యు.సి. బెనర్జీ అధ్యక్షతన సమావేశమై జాతీయ కాంగ్రెసును స్థాపించారు. ఉద్యోగుల మధ్య తేడాలను తొలగించాలని, భారతీయులకు ఉద్యోగ అవకాశాలనుపెంచాలని, సైనిక వ్యయం తగ్గించి అభివృద్ధికి నిధులను కేటాయించాలని, స్థానికస్వపరిపాలన కావాలని, శాసనసభలో భారతీయులకు స్థానము వుండాలని విజ్ఞప్తి చేశారు. ప్రజాసమస్యల పరిష్కారానికి ప్రభుత్వానికి వినతి పత్రాలను సమర్పించడమే ఆశయంగా పేర్కొన్నారు. వినతి పత్రాలను యివ్వటానికి ఏర్పడిన ఈ చిన్న సంస్థ. రవి అస్తమించని సామ్రాజ్యాధిపతులపై స్వాతంత్ర్య పోరాటాలను నడిపించి ప్రపంచంలోనే పెద్ద రాజకీయసంస్థగా రూపొందుతుందని ఎవరూ ఊహించలేదు.

కాంగ్రెసు స్థాపనకు కృషిచేసింది బ్రిటిషు ఉద్యోగి హ్యూం దొర. కాంగ్రెసు తొలి అధ్యక్షుడు శ్రీ డబ్ల్యు. సి. బెనర్జి క్రీస్తు మతస్తుడు, రెండవ సభకు అధ్యక్షులు పార్శీమతస్తులు శ్రీ దాదాభాయి నౌరోజి. మూడవ మహాసభకు అధ్యక్షులు మహమ్మదీయులు శ్రీ బద్రుద్దీన్ తయ్యాబ్జీ. మొదటినుండి కాంగ్రెసు మతాతీతసంస్థ అల్పసంఖ్యాకులకు ప్రాతినిధ్యం యిస్తూన్న సంస్థగా రూపొందుతూ వచ్చింది.

కాంగ్రెసు ప్రజలసమస్యల గురించి బ్రిటిషుప్రభుత్వానికి విజ్ఞాపనపత్రాల ద్వారా తెలియజేస్తున్నా, కోర్కెలను తీర్చలేకపోయినా, సమస్యలయెడ ప్రభుత్వం ఆసక్తికనపరుస్తూ వచ్చింది. తరచుగా కాంగ్రెసు సమావేశాలు, ప్రజలలో దాని వలన వస్తూన్న చైతన్యము ప్రమాదకరంగా తయారవుతుందని ప్రభుత్వం భావించి కాంగ్రెసును నిరుత్సాహపరచడానికి వారి విన్నపాలను లక్ష్యపెట్టకుండా త్రోసిపుచ్చుతూ వచ్చింది.

భారతదేశంపై సానుభూతి కలిగిన ఆంగ్లప్రముఖులచే 1889 లో లండనులో బ్రిటిషు కమిటీ అనే సంస్థ స్థాపించబడింది. కాంగ్రెసు అవలంబించిన మితవాదధోరణి ఆంగ్లప్రభుత్వాన్ని కదిలించలేకపోయింది. పోటీపరీక్షలలో పాల్గొనే అభ్యర్థుల వయస్సు 23 కు పెంచబడినా, ఇండియాలో పరీక్షపెట్టుటకు అంగీకరించలేదు. 1892 శాసనసభల చట్టంవలన భారతీయులకు శాసనసభలో ప్రాతినిధ్యం యిచ్చినా, బడ్జెటుమీద ఓటింగు హక్కులేకుండా చేశారు. హిందూ ముస్లింలమధ్య భేదాలను కలిగించడం ప్రారంభించారు. బెంగాల్‌లోవచ్చిన రాజకీయచైతన్యాన్ని, ఐక్యాన్ని భగ్నం చేయటానికి బెంగలీలను విడదీయాలని బెంగాల్ విభజనను బ్రిటిషు ప్రభుత్వం తలబెట్టింది.

### వందేమాతరం ఉద్యమం

శ్రీ బంకించంద్రచటర్జీ రచించిన 'ఆనందమఠ్' గ్రంథంలోని గీతం వందేమాతరం. దీనికి రాగం ద్వారా ప్రాణం పోసింది విశ్వకవి రవీంద్రుడు. బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమానికి 'వందేమాతరం' విప్లవశంఖం ఊదింది. వందేమాతరం అనగూడదని, పాడగూడదని నిషేధించారు. 'వందేమాతరం' అంటూ వేలాదిప్రజలు జైలుకువెళ్ళారు. లాఠీదెబ్బలకు గురి అయినారు 20 శతాబ్ది ఆరంభంలో భారతస్వాతంత్ర్య సమరానికి రణభేరి మ్రోగించింది వందేమాతరం. బెంగాలులోనే కాకుండా భారతదేశమంతా వందేమాతరం ఉద్యమం విస్తరించబడింది. కలకత్తా కేంద్రంగా, పశ్చిమ బెంగాల్, బీహారు, ఒరిస్సా, ఛోటానాగపూరులు కలిసి పశ్చిమ

బెంగాలు రాష్ట్రంగా, ఢక్కా కేంద్రంగా తూర్పుబెంగాల్, అస్సాంలను కలిపి తూర్పుబెంగాల్ ఏర్పాటుచేయాలని బెంగాలు విభజనను బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది. దీనిని వ్యతిరేకిస్తూ వందేమాతరం ఉద్యమం, స్వదేశఉద్యమాలు సాగాయి. స్వదేశ ఉద్యమమంటే శ్రీ రవీంద్రనాథ్ ఠాగూర్ ఇలా చెప్పారు:

1) విదేశీవస్త్రాలను, వస్తువులను వాడరాదు.

2) ఆంగ్లభాషలో మాట్లాడటం, వ్రాయడం మానాలి. విదేశి పానీయాలు, వాయిద్యాలు, వాడరాదు.

3) దేశవ్యవహారాలకు విదేశీ సహాయం పొందరాదు.

4) దేశానికి కావలసిన వస్తువులను స్వయంగా సమకూర్చుకోవాలి.

5) ప్రభుత్వకోర్టులను బహిష్కరించాలి, పంచాయతీల ద్వారా సమస్యలను పరిష్కరించుకోవాలి.

6) ఆంగ్లవిద్యాలయాలు వదలి జాతీయవిద్యాలయాలలో చదవాలి.

వేలాదిమంది కార్యకర్తలు సమావేశమై వీటిని అమలుజరపటానికి ప్రతిజ్ఞ తీసుకున్నారు. విదేశవస్తువుల బహిష్కరణ, పికిటింగు చేశారు. విద్యార్థులు ఆందోళనలో పాల్గొన్నారు.

**మింటో - మార్లే సంస్కరణలు**

ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలు, రహస్య ఓటింగ్, భారతకౌన్సిలులో భారతీయులకు స్థానం, బడ్జెటులోపాల్గొనే అవకాశం ఇంకా మరికొన్ని సంస్కరణలు చేశారు. వీటిని ప్రజలు అంగీకరించక ఉద్యమాన్ని మరింత ఉద్ధృతం చేశారు. హర్డింజ్ 1910 నవంబరు 21న కలకత్తా వచ్చి పరిస్థితులను స్వయంగా తెలుసుకొన్నారు. హర్డింజ్ చర్చలు జరిపిన తరువాత 1911 నవంబరులో 1. భారతరాజధానిని కలకత్తానుండి ఢిల్లీనగరానికి మార్చడం. 2. బెంగాలును తిరిగి ఐక్యంచేసి గవర్నరును నియమించడం. 3. అస్సాంను ప్రత్యేకరాష్ట్రంగా వుంచడం. 4. బీహార్, ఒరిస్సాలను కలిపి పాట్నా రాజధానిగా ఒకరాష్ట్రాన్ని ఏర్పాటుచేయడం ఈ ప్రతిపాదనలకు ఎక్కువ ఆదరణ వచ్చింది. 1911 డిసెంబర్ 7వ తేదీన ఢిల్లీలో జార్జి చక్రవర్తి ఢిల్లీని రాజధానిగా ప్రకటించారు. 1905 నుండి 1911 వరకు జరిగిన వందేమాతరం ఉద్యమం భారత స్వాతంత్ర్య సమరంలో ఒక ముఖ్యఘట్టం అని చెప్పవచ్చును.

**మితవాదులు - అతివాదులు**

సౌమ్యమయిన పద్ధతిలో ప్రభుత్వాన్ని ఒప్పించి స్వరాజ్యాన్ని తీసుకురావాలనే మితవాదులకు శ్రీ గోపాలకృష్ణగోఖలే, సురేంద్రనాథ్ బెనర్జీ, చింతామణి లాంటి పెద్దలు నాయకత్వం వహించారు. సహాయ నిరాకరణ ద్వారానే కాంగ్రెసుకోర్కెలను సాధించడం సాధ్యమని అతివాదులవాదం. "రాజకీయ స్వాతంత్ర్యం అనేది జన్మతః వచ్చినహక్కు" అని అరవిందఘోష్ ఘోషించారు. 'స్వరాజ్యం నా జన్మహక్కు దాన్ని సాధించితీరుతాను' అని తిలక్ గర్జించారు. బాలగంగాధర తిలక్, లాలా లజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్‌లు లాల్, బాల్, పాల్, అని ఖ్యాతిగాంచిన ఈ పెద్దలు అతివాదులకు నాయకత్వం వహించి దేశమంతా పర్యటించారు. 'ఆయుధాలతో గాక సహాయ నిరాకరణద్వారానే ప్రభుత్వాన్ని ఎదుర్కోవాలి' అని అన్నారు. జాతీయవాదులు ప్రజలను ఆకర్షించగల్గినారు.

**విప్లవ వాదులు**

ఫ్రెంచి విప్లవచరిత్రతో ఉద్వేగులయిన కొంతమంది యువకులు విప్లవవాదులుగా తయారయినారు. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి ఒక రహస్యసంఘాన్ని మహారాష్ట్రలో స్థాపించిన 'వాసుదేవ్ అనంత్‌ఫడ్కే' విప్లవవాదులకు మార్గదర్శకుడయినాడు బెంగాలులో పి. మిత్రా అధ్యక్షతన విప్లవసంఘం ఏర్పడింది. ప్రభుత్వదౌర్జన్యాన్ని దౌర్జన్యంతోనే ఎదుర్కోవాలని బాంబులు, డైనమెట్లు, తయారుచేసి ప్రభుత్వ అధికారులను హింసించడం, ప్రభుత్వ ఆస్తులను నష్టపరచడం మొదలగు అనేక విప్లవకార్యక్రమాలు విప్లవకారులు చేశారు. దేశవ్యాప్తంగా ఈ విప్లవకార్యక్రమాలు విస్తరించబడి అనేకచోట్ల ప్రభుత్వంపై పోరాటాలను చేశారు. జాతీయవాదులకు నాయకులయిన తిలక్‌కు 6 సంవత్సరాలు శిక్ష విధించి మాండలేజైలులో పెట్టారు. రాజకీయాలపై విరక్తి కలిగి అరవిందఘోష్ పాండిచేరిలో ఆశ్రమాన్ని స్థాపించుకొన్నారు. బిపిన్ చంద్రపాల్ విదేశాలకు వెళ్ళిపోయారు. కాంగ్రెసు వివిధవర్గాలుగా వుండడంతో ప్రభుత్వం సహకారంతో ముస్లిం సంస్థలు బలపడినవి.

మొదటి ప్రపంచయుద్ధం 1914 లో ప్రారంభమయింది. ప్రభుత్వం భారతసైనికులను, డబ్బును యుద్ధానికి వినియోగించింది. 12 లక్షలమంది భారతీయ సైనికులను యుద్ధానికి పంపగా పది లక్షలమంది చనిపోయారు. 13 కోట్ల స్టెర్లింగ్‌ల భారతీయ ధనాన్ని యుద్ధానికి ఖర్చుపెట్టింది. భారతీయ సైనికులను బలియివ్వడం భారత ఖజానా నుండి డబ్బును ఖర్చుపెట్టడం, భారత జాతీయవాదులను

కారాగారములో పెట్టడం ప్రజలలో ముఖ్యంగా యువకులలో ఉద్రేకం, ఉద్వేగం పెంచాయి.

## హోం రూలు ఉద్యమం

తిలక్ జైలునుండి విడుదల అయినారు. అనిబిసెంటు అనే ఐరిష్ మహిళ ఆమె వైవాహిక జీవితం విఫలం కావడంతో విరక్తి చెంది ప్రజల్లో స్వేచ్ఛాభావాలు ప్రేరేపించడం ద్వారా ప్రజాసేవకు కంకణం కట్టింది. దివ్యజ్ఞాన సమాజంలో చేరింది, 1893 లో ఇండియాకు వచ్చి సంఘసేవాకార్యక్రమాలలో పాల్గొన్నది. కాంగ్రెస్ నాయకుల మధ్య సఖ్యతకు కృషిచేసి 1914 డిసెంబరులో పూనాలో తిలక్, గోఖలే సమావేశం ఏర్పాటుచేసింది. గోఖలే, ఫిరోజ్‌షా మరణించారు. 1916 లక్నో కాంగ్రెసులో కాంగ్రెసువాదులు ఐక్యమయి హోంరూల్ ఉద్యమాన్ని బలపరిచారు. స్వయంపాలన సాధనకు తిలక్ అంగీకరించారు. ముస్లింలీగ్ కూడా తోడ్పడటంతో హోంరూలు ఉద్యమానికి బలం చేకూరింది. అనిబిసెంట్ అధ్యక్షతన హోంరూలు సంఘము ఏర్పడింది. అనిబిసెంటు దేశమంతా పర్యటించి హోంరూలు శాఖలను ఏర్పరచింది. తిలక్ హోం లీగ్‌ను స్థాపించి 'మేం అడుగుతున్నది స్వాతంత్ర్యముకాదు స్వపరిపాలన మాత్రమే' అని దేశమంతా తిరిగి ప్రచారంచేశారు. తిలక్‌ను లోకమాన్యుడు అన్నారు. తిలక్, అనిబిసెంటు దేశమంతా తిరిగి ప్రజలలో చైతన్యాన్ని తీసుకురావడంతో వారిమీద ప్రభుత్వం ఆంక్షలు విధించింది.

1917 కోల్‌కతా సమావేశానికి అనిబిసెంటు కాంగ్రెసు అధ్యక్షులయ్యారు. అయిదువేలమంది ప్రతినిధులు హాజరుకావడం అపూర్వం. ఆగస్టు 20వ తేదీన బాధ్యతాయుతపాలన వాగ్దానాన్ని ప్రభుత్వం చేసింది. 1919 లో మాంటేగు చెయిమ్స్‌ఫర్డు సంస్కరణలను ప్రవేశపెట్టారు.

లోకమాన్య తిలక్ 1920 లో ఆగస్టు 1వ తేదీన చనిపోయారు. జాతి ఒక అమూల్యరత్నాన్ని కోల్పోయింది. తిలక్ యుగం సమాప్తమయింది.

## గాంధి ప్రవేశము

భారతీయులకొరకు దక్షిణాఫ్రికాలో అనేక సత్యాగ్రహపోరాటాలలో పాల్గొన్న గాంధీ 1915 లో భారతదేశానికి వచ్చారు. మితవాదనాయకులు గోఖలే గాంధీకి ఆదర్శప్రాయులయినారు. గాంధీ భారతదేశంలో అనేకప్రాంతాలను పర్యటించి

పరిస్థితులను తెలుసుకొన్నారు. అహ్మదాబాద్ సబర్మతీ నదీతీరాన ఒక ఆశ్రమం స్థాపించుకొన్నారు.

భారతదేశం నుండి కార్మికులను, కూలీలను కాంట్రాక్టు పద్ధతిన ఇతరదేశాలలోని వలసప్రాంతాలకు పంపితే సత్యాగ్రహం ప్రారంభిస్తానని 1917 లో గాంధీజీ ప్రభుత్వానికి చేసిన మొదటి హెచ్చరికతో ప్రభుత్వం కూలీలను తరలించే పద్ధతికి స్వస్తి పలికింది. ఈ తొలి విజయం గాంధీని భారతనాయకునిగా చేసింది. "చంపారన్ వెళ్ళి ఖైదీల బాధలను తొలగించకపోతే సత్యాగ్రహం చేస్తా"నని అన్నారు. నిషేధాలను కూడా గాంధీ ధిక్కరించారు. నిర్బంధంగా నీలిమందును పండించే విధానాన్ని మార్పు చేస్తూ శిస్తులను తగ్గించటానికి ప్రభుత్వం అంగీకరించింది. చంపారన్ సత్యాగ్రహం తరువాత గ్రామములలో కుటీరపరిశ్రమ అభివృద్ధికి, అస్పృశ్యతా నివారణకు, హిందూముస్లిం సఖ్యతకు కృషిచేశారు.

అహ్మదాబాదులో నూలుమిల్లుల కార్మికుల జీతాలు పెంచడానికి శాంతియుతంగా సత్యాగ్రహం చేశారు. విజయం సాధించారు. కైరాక్షామ ప్రాంతంలో శిస్తులు వాయిదా వేయమని ప్రభుత్వము మీద పన్నులనిరాకరణ ఉద్యమాన్ని నిర్వహించారు. వల్లభ్‌బాయిపటేల్, కృపలానీ, రాజేంద్రప్రసాద్‌ల వంటి పెద్దలు గాంధీకి అనుచరులు అయినారు.

### రౌలట్ సత్యాగ్రహము

ఏ వ్యక్తి నయినా వారంటులేకుండా నిర్బంధించడానికి, ఇల్లు సోదా చేయడానికి, ఆస్తులు వశపరచుకోవడానికి, ప్రభుత్వానికి అధికారాలిస్తూ రౌలట్‌సంఘం, విప్లవవాదుల చర్యలను, ఇతర ప్రభుత్వ వ్యతిరేక చర్యలను అరికట్టడానికి చేసిన సిఫారసుల ననుసరించి చట్టం చేశారు. ప్రజల ప్రాథమిక హక్కులను హరించివేస్తున్న ఈ ఆదేశానికి వ్యతిరేకంగా గాంధీ నిరసన తెలియచేశారు.

1919 ఏప్రిల్ 6వ తేదీన దేశవ్యాప్తంగా ఉపన్యాసాలు ప్రార్థనలు, జరిపి హర్తాళ్లు పాటించవలసిందిగా గాంధీ విజ్ఞప్తితో ఆరోజు దేశమంతా రౌలట్ చట్టానికి నిరసన తెలియచేసింది. గాంధీని అరెస్టుచేశారని వార్త విని విపరీతంగా అన్ని జరిగాయి ఈ దౌర్జన్యాలకు నిరసనగా గాంధీజీ మూడురోజులు నిరాహారదీక్ష చేసిన తరువాత తిరిగి శాంతి నెలకొన్నది.

రౌలట్‌సత్యాగ్రహ సభ సందర్భంగా జలియన్‌వాలాబాగ్ మీటింగులో కాల్పులు జరిపి వెయ్యిమందిని చంపారు. పంజాబు దురాగతాలకు నిరసన వెల్లువను ఆపడానికి ప్రభుత్వం హంటర్‌కమిటీ వేసింది, డయ్యర్ రాజీనామాచేసి వెళ్ళిపోయినారు, ఈ ఉద్యమం జరిగిన మారణహోమానికి కలతచెంది గాంధీజీ రౌలట్ సత్యాగ్రహాన్ని నిలుపుదలచేయించారు.

## ఖిలాఫత్ ఉద్యమం

టర్కీసుల్తాన్ ఖలీఫా ప్రపంచయుద్ధంలో జర్మనీని బలపరిచి ఓడిపోయారు. మక్కా, మదీనా, జెరూసలెం పుణ్యక్షేత్రాలన్నీ యూరోపియనుల వశమయినాయి. ఈ పవిత్రస్థలాలలో సుల్తాన్ అధికారానికి ఎటువంటి హాని కలుగదని చెప్పి బ్రిటిషుప్రధాని మాట తప్పినారు. భారతదేశంలోని ముస్లింలకు ఆగ్రహం వచ్చింది. పవిత్రక్షేత్రాలన్నీ ఖలీఫా ఆధీనంలో ఉండాలని 'ఖిలాపత్ ఉద్యమం' ప్రారంభించారు. హిందూ ముస్లిం ఐక్యతకు ఈ సమస్యను గాంధీజీ వినియోగించారు. అక్టోబరు 17న హిందూ ముస్లింలందరూ ఖిలాపత్ ఉద్యమాన్ని బలపరచటానికి పూర్తి హర్తాళ్‌జరిపి శాంతియుతంగా సమావేశాలు నిర్వహించాలని కోరారు. ప్రముఖ ముస్లింనాయకులు మహమ్మదాలీ, షౌకతాలీ జైలునుండి విడుదల అయినారు. ఆలీ సోదరులు ఉద్యమానికి నాయకత్వం వహించారు. 1920 మార్చి 19వ దేశమంతా హర్తాళ్‌లు జరిపారు. 1920 ఏప్రిల్‌లో హోంరూల్ అధ్యక్షులుగా గాంధీ పదవిని చేపట్టారు.

"టర్కీ శాంతిసంధి" పేరుతో మిత్రరాజ్యాలు మక్కా మదీనాలను ప్రత్యేక రాజ్యంగా పేర్కొన్నారు. ముస్లింలు సంతృప్తి పడలేదు. ఆగస్టు 15వ తేదీన హర్తాళ్ జరపాలని గాంధీ సూచించారు. తిలక్ దీనికి మద్ధతు ప్రకటించి దురదృష్టవశాత్తూ ఆగస్టు 1వ తేదీ తెల్లవారుజామున మరణించారు. గాంధీ ఎంతో విచారపడినారు. లాలాలజపతిరాయ్ అధ్యక్షతన 1920లో కలకత్తా కాంగ్రెస్ సభ జరిగింది. గాంధీజీ నాయకత్వంలో దౌర్జన్యరహితంగా సహాయనిరాకరణ ఉద్యమము చేయడానికి నిర్ణయించారు. 1. ప్రభుత్వం యిచ్చిన బిరుదులను, ప్రభుత్వం స్థానిక సంస్థలలో యిచ్చిన పదవులను త్యజించడం. 2. ప్రభుత్వ సన్మానాలకు దర్బారులకు వెళ్ళకపోవడం. 3. ఆంగ్లవిద్యనువదిలి జాతీయవిద్యను ప్రోత్సహించడం. 4. న్యాయస్థానాలను త్యజించి పంచాయతీలను స్థాపించడం, 5. విదేశవస్తువుల బహిష్కరణ. 6. శాసనసభకు పోటీ చేయకపోవడం, ఓటు వేయకపోవడం. 7. మెసపుటేనియా ప్రాంతాలకు ఎవ్వరూ గుమస్తాలుగా, కార్మికులుగా వెళ్ళకపోవడం.

శాసనసభల బహిష్కరణను జిన్నా, చిత్తరంజన్‌దాస్, బిపిన్‌చంద్రపాల్ వంటి నాయకులు వ్యతిరేకించారు. 7 వోట్ల తేడాతో గాంధీ తీర్మానాన్ని ప్రతినిధి సభ ఆమోదించింది. బహిరంగసభలో వెయ్యివోట్ల మెజారిటీతో ఆమోదించారు. మోతీలాల్ నెహ్రూ, ముస్లింలు గాంధీని బలపరచారు.

1920 డిశంబరులో నాగపూర్ కాంగ్రెస్ సభ విజయ రాఘవాచారి అధ్యక్షతన జరిగింది. చిత్తరంజన్‌దాస్ సహకారంతో గాంధీజీ ప్రవేశపెట్టిన సహాయనిరాకరణ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

గాంధీ ప్రతిపాదించిన సహాయ నిరాకరణోద్యమంలో రెండుభాగాలు ఉన్నాయి. మొదటిది నిర్మాణ కార్యక్రమము, రెండవది బహిష్కరణ కార్యక్రమము.

1921 మార్చి 31న బెజవాడ కాంగ్రెస్ సమావేశంలో నిర్మాణ కార్యక్రమాన్ని నిర్విరామంగా చేపట్టాలని, 20 లక్షల రాట్నాలు పంచిపెట్టి స్వదేశ ఉద్యమానికి పాటుపడాలని నిర్ణయించుకొన్నారు. తిలక్ స్మారక నిధికి అనుకొన్న దానికంటే ఎక్కువగా కోటి పదిహేను లక్షలు వసూలైంది.

కాంగ్రెస్‌లో 50 లక్షలమంది సభ్యులను చేర్చారు. అస్పృశ్యతా నివారణకు హరిజనులతో కలిసి సహపంక్తిభోజనాలు, దేవాలయ ప్రవేశాలు చేశారు. కల్లు, సారాయి దుకాణాలముందు పికెటింగ్ జరిపినారు. ఖాదీఉద్యమము చురుకుగా సాగింది. వెయ్యిమంది ప్లీడర్లు ప్రాక్టీసు వదిలివేశారు. వారిలో చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ, టంగుటూరి ప్రకాశం వంటి పెద్దలున్నారు. 1247 జాతీయ పాఠశాలలు స్థాపించబడి వానిలో 90వేలమంది విద్యార్థులు చేరారు. 24మంది బిరుదులు వదిలేశారు కోట్ల విలువగల విదేశవస్త్రాలను తగులబెట్టారు 1919లో గాంధీ ఆంధ్రాలో తిరుగుట వలన సహాయనిరాకరణోద్యమం ఊపు అందుకొంది. బ్రహ్మాండమైన ఉద్యమంగా తయారైంది. కొన్ని చోట్ల దౌర్జన్యకాండలు జరగడంతో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాన్ని ఆపేశారు.

## స్వరాజ్యపార్టీ

సహాయ నిరాకరణ ఉద్యమము విరమణ తర్వాత కూడ ప్రభుత్వం నిర్బంధ విధానాలను కొనసాగిస్తూ కాంగ్రెస్ వాదులను హింసిస్తూనేవుంది. తిరిగి ఉద్యమాన్ని నడిపించాలనే చాలమంది భావించారు. శాసన సభలలో ప్రవేశించి ప్రభుత్వంపై ఎదురు తిరగాలనే ఆలోచనలు వచ్చాయి.

1922 డిశంబరులో గయ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహిస్తూ చిత్తరంజన్‌దాస్ అధ్యక్షోపన్యాసంలో శాసనసభ ప్రవేశాన్ని సమర్థించారు. ఈ తీర్మానానికి మెజారిటీ రాలేదు. చిత్తరంజన్ దాస్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేసి, మోతీలాల్ నెహ్రూ, కేల్కర్ మొదలగువారితో కలిసి స్వరాజ్యపార్టీని పెట్టారు. కాంగ్రెసులో భాగంగానే స్వరాజ్యపార్టీ కొనసాగింది. అబ్దుల్ కలాం ఆజాద్ కృషి ఫలితంగా 1923 సెప్టెంబరు 15న జరిగిన కాంగ్రెసు సమావేశంలో యిష్టమువచ్చినవారు శాసనసభ ఎన్నికలలో పాల్గొనవచ్చునని తీర్మానించారు. 1923 నవంబరులో జరిగిన ఎన్నికలలో స్వరాజ్యపార్టీకి 48 స్థానాలు రాగా, జిన్నానాయకత్వంలో 24 మంది ఎన్నికయినారు. 145 మంది సభ్యులుకల కేంద్రశాసనసభలలో వీరంతాకలిసి జాతీయపార్టీగా ఏర్పడి ప్రభుత్వ ప్రతిపాదనలను అనేకసార్లు ఓడించారు. బాధ్యతాయుతపాలన ఏర్పాటుచేయడానికి సమావేశాన్ని ఏర్పాటుచేయాలన్న మోతీలాల్ నెహ్రూ ప్రతిపాదన 28 ఓట్ల మెజారిటీతో నెగ్గడంతో స్వరాజ్యపార్టీ ఘనవిజయం సాధించింది. ఆ ప్రతిపాదన నెగ్గినదృష్ట్యా ప్రభుత్వం 'జడ్డిమన్' సంఘాన్ని నియమించింది. స్వరాజ్యపార్టీ శాసనసభలో కొన్ని విజయాలు సాధించినా, ప్రభుత్వాన్ని ప్రతిఘటించినా ఏమీ ప్రయోజనము కనపడలేదు. 1926 మధ్యలో శాసనసభలకు రాజీనామా ఇచ్చారు. చిత్తరంజన్‌దాస్ మరణించారు. స్వరాజ్యపార్టీ అంతరించిపోయింది. గాంధీజీ నిర్మాణకార్యక్రమానికి ప్రాధాన్యం యిచ్చి పనిచేస్తున్నారు.

## సైమన్ కమీషను

నూతన సంస్కరణల ప్రతిపాదనలకు 1927 నవంబరులో బ్రిటిషు ప్రభుత్వం సర్ జాన్ సైమన్ అధ్యక్షులుగా 7గురు సభ్యులతో కమీషనువేసింది. సభ్యులంతా ఆంగ్లేయులే. భారతీయులకు ప్రాతినిధ్యం లేదని, న్యాయం జరగలేదని కాంగ్రెసు సైమన్ కమీషన్‌ను బహిష్కరించాలని నిర్ణయించింది. 1928 ఫిబ్రవరి 3వ తేదీన సైమన్ కమీషన్ బొంబాయిలో దిగేరోజున బొంబాయిలో, ఇతర ప్రాంతాలలో నిరసనప్రదర్శనలు చేశారు. సైమన్‌కమీషన్ ఎచ్చటికి వెళ్ళినా 'సైమన్ వెనక్కి పో' అనే నినాదాలతో నిరసనప్రదర్శనలు చేశారు. లాహోరులో లాలా లజపత్‌రాయ్ ఆధ్వర్యంలో ఊరేగింపుపై పోలీసులు లాఠీచార్జి చేశారు. లజపత్‌రాయ్‌ని విపరీతంగా కొట్టారు. ఆ గాయాలనుండి కోలుకోకుండానే ఆయన మరణించారు.

మద్రాసులో ప్రకాశంగారు పోలీసులకు ఛాతీని చూపి కాల్చమని ధైర్యసాహసాలను ప్రదర్శించారు.

1929 జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షులుగా జరిగిన కాంగ్రెస్ మహాసభ ప్రభుత్వ స్థానాలలో కాంగ్రెస్ వాదులంతా రాజీనామాచేసి సంపూర్ణ స్వరాజ్యంకొరకు శాసనోల్లఘనం చేయాలని తీర్మానించారు.

1930 జనవరి 26వ తేదీన గాంధీ నాయకత్వాన తయారుచేసిన రాజ్యాంగ ముసాయిదాను జనవరి 26వ తేదీన దేశవ్యాప్తంగా సభలు జరిపి చదవాలని నిర్ణయించింది. ఆవిధంగా దేశమంతా సభలు జరిగాయి

## ఉప్పు సత్యాగ్రహం

ప్రజలకు నిత్యావసర వస్తువైన ఉప్పుమీద ప్రభుత్వం వేసిన పన్నును నిరసిస్తూ, ప్రభుత్వ ఉత్తర్వును ధిక్కరిస్తూ శాసనోల్లంఘనం చేయాలని గాంధీ నిర్ణయించారు. 1930 మార్చి 12న సబర్మతీ ఆశ్రమం నుండి గాంధీజీ తన అనుచరులతో 24 రోజులు 240 మైళ్ళు నడిచి ఏప్రిల్ 6న దండి సమీపంలో ఉప్పును తయారుచేసి సత్యాగ్రహము ప్రారంభించారు. సరోజినీనాయుడు ఆధ్వర్యంలో వేలమంది స్త్రీలు ఉప్పుకొటార్లపై దాడి చేశారు. పోలీసులు దారుణంగా హింసించినా వాలంటీర్లు సత్యాగ్రహాన్ని వీడలేదు. డాక్టర్ పట్టాభి ఆధ్వర్యంలో మచిలీపట్నంలో ఉప్పు సత్యాగ్రహం చేశారు. దేశమంతా ఉప్పుసత్యాగ్రహం చేయబడింది. నెహ్రూ, సుభాష్‌చంద్ర బోస్, అబ్దుల్ గఫార్‌ఖాన్‌లాంటి యోధులతో సహా 75వేల మంది సత్యాగ్రహులను ప్రభుత్వం నిర్బధించింది. 103 మంది మరణించారు.

## రౌండు టేబులు సభలు

దేశంలో పెల్లుబికిన సత్యాగ్రహ సమరంతో బ్రిటిషు ప్రభుత్వం అఖిలపక్ష సమావేశం ఏర్పాటుచేసి పరిష్కారమార్గాలను అన్వేషించింది, రామ్‌సే మేక్డొనాల్డు అధ్యక్షతన 1930 నవంబర్ 12న జరిగిన మొదటి రౌండుటేబుల్ సమావేశాన్ని కాంగ్రెస్ బహిష్కరించింది.

1931లో గాంధీ-ఇర్విన్ ఒడంబడికతో రాజకీయ ఖైదీలను విడుదల చేశారు. కేసులు ఉపసంహరించుకొన్నారు. శాంతి యుతంగా పికెటింగులకు అంగీకరించారు. 1931 సెప్టెంబరు 2వ తేదీన జరిగిన రౌండుటేబుల్ సభకు కాంగ్రెస్ తరపున గాంధీజీ ఒక్కరే వెళ్ళారు. గాంధీజీ సూచనలను వారు అంగీకరించలేదు. 1932 నవంబర్ 17న మూడవ సభను కాంగ్రెస్ బహిష్కరించింది.

## తిరిగి శాసనోల్లంఘనం

గాంధీ – ఇర్విన్ ఒడంబడికను లెక్కచేయకుండా ప్రభుత్వం నిర్బంధ చర్యలను కొనసాగించింది. సరిహద్దుగాంధీని (ఖాన్‌అబ్దుల్ గప్ఫార్‌ఖాన్) వారి అనుచరులను అరెస్టు చేసింది. గాంధీజీ ఈ పరిస్థితులను గురించి వైస్రాయికి ఉత్తరం వ్రాశారు. తుదకు ఏమీ ఫలితం లేక కాంగ్రెస్ తిరిగి ఉద్యమాన్ని ప్రారంభించింది. గాంధీని అరెస్టు చేశారు. కాంగ్రెస్ జండా పట్టుకొంటే, ఖద్దరు ధరిస్తే అరెస్టు చేశారు, లాఠీచార్జిలు చేశారు. ప్రజలు శాసనోల్లంఘాన్ని చేపట్టారు. శిస్తులు, పన్నులను చెల్లించకుండా నిరాకరించారు. 1933లో కలకత్తాకాంగ్రెస్ సేన్‌గుప్తా అధ్యక్షతన జరిగింది. సభికులపై అమానుషంగా లాఠీలు ప్రయోగించారు. కాంగ్రెస్‌ను నిషేధించారు సేన్‌గుప్తాను అరెస్టు చేశారు. సత్యాగ్రహులపై, ఖైదీలుగా వున్న వారిపై దారుణ హింసాకాండను జరిపారు. బ్రిటన్‌లోని ఇండియాలీగ్ సంస్థ సభ్యులు వచ్చిచూచి రిపోర్టు చేశారు. హిందువులనుండి అంటరానివారనే వర్గాన్ని నిరసిస్తూ గాంధీజీ నిరాహారదీక్ష ప్రారంభించారు. గాంధీ ఆరోగ్యం క్షీణించుటతో ఆందోళన ఎక్కువ అయింది. మదన్ మోహన్ మాలవ్యా, అంబేద్కర్ పూనాలో సమావేశమై ఒప్పందాన్ని చేసుకొన్నారు. గాంధీజీ నిరాహారదీక్ష విరమించారు. గాంధీని విడుదల చేశారు. శాసనోల్లంఘనోద్యమాన్ని విరమిస్తున్నట్లు గాంధీ ప్రకటించారు. గాంధీ ప్రతిపాదనలను కాంగ్రెసు ఆమోదించింది.

## రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు

1935 భారత ప్రభుత్వ చట్టంప్రకారము 1937లో ఎన్నికలు జరిగాయి. కాంగ్రెసుపార్టీ పోటీచేసి అనేక రాష్ట్రాలలో మంత్రివర్గాలను ఏర్పాటు చేసింది. మద్రాసు రాష్ట్రంలో రాజాజీ నాయకత్వంలో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పడింది. గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని దృష్టిలో పెట్టుకొని గ్రామీణ పరిశ్రమలు, ఖద్దరు ఉత్పత్తికి ఖాదీబోర్డులు ఏర్పాటుచేశారు. మద్యపాన నిషేధాన్ని అమలు జరిపారు ప్రజల అవసరాలను తీర్చడానికి అనేక ప్రజాహిత కార్యక్రమాలను చేపట్టారు. 1939 ఏప్రిల్ 29వ తేదీన కాంగ్రెస్ అధ్యక్షుడు సుబాస్ చంద్రబోస్ రాజీనామా చేసి ఫార్వర్డు బ్లాకును స్థాపించారు. రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. బ్రిటిష్ సామ్రాజ్యవాద ధోరణిలో మార్పులేక పోవడాన్ని కాంగ్రెస్ నిరసించింది. 1939 అక్టోబర్‌లో కాంగ్రెస్ మంత్రి వర్గాలు రాజీనామా చేశాయి. వామపక్షాలు రెండు ప్రపంచ యుద్ధాలలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని బలపరచాయి. పీపుల్స్‌వార్ అని పేర్కొన్నాయి.

### వ్యక్తిగత సత్యాగ్రహం

కాంగ్రెస్ మంత్రి వర్గాలు రాజీనామా చేసిన తరువాత ప్రభుత్వ దమననీతి పెరిగిపోయింది. కాంగ్రెస్‌వాదులపై మరల నిర్బంధ కార్యక్రమాలు ప్రారంభించారు. 1940 అక్టోబర్ 17వ తేదీన గాంధీ వ్యక్తిగత సత్యాగ్రహాన్ని ప్రారంభించారు. ఆచార్య వినోబాభావేని ప్రథమ సత్యాగ్రహిగా గాంధీ ఎంపిక చేశారు. సత్యాగ్రహుల లిస్టులు తయారుచేసినారు. కాంగ్రెస్ ఆదేశానుసారం ప్రభుత్వానికి నోటీసులు యిచ్చి సత్యాగ్రహం చేశారు. రాష్ట్రాలలోనే కాక కేంద్రంలో ప్రజా ప్రభుత్వం ఏర్పాటు కావాలని కోరారు. వేలాదిమంది సత్యాగ్రహులు జైళ్ళకు వెళ్ళారు. జైళ్ళు నిండిపోయాయి. సత్యాగ్రహాలు చేసేటప్పుడు ప్రజలు సత్యాగ్రహులకు దండలు వేసి కాంగ్రెస్‌కు, గాంధీకి జయ జయ నినాదాలు చేస్తూ గుమిగూడటం, ప్రజలపై లాఠిచార్జి చేయడం, బాష్పవాయువు ప్రయోగించడం, అనేక నిర్బంధాలను విధించడంతోబాటు, కొన్నిచోట్ల కాల్పులు కూడ జరిగాయి.

### క్రిప్స్ రాయబారం

భారత ప్రజల సహకారాన్ని యుద్ధసమయంలో పొందటానికి కాంగ్రెస్‌తోపాటు యితర రాజకీయ పక్షాలతో సంప్రదించడానికి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ నాయకత్వాన ఒక ప్రతినిధి వర్గం మార్చి 22న భారతదేశం వచ్చింది. వారి ప్రతిపాదనలకు యుద్ధానంతరం భారతదేశానికి డొమినియన్ ప్రతిపత్తి ఆధారంగా రాజ్యాంగాన్ని రూపొందించుకొనే అవకాశం కలుగజేయడం, దానితోపాటు ఏ రాష్ట్రమైనా స్వతంత్రంగా ఉండగోరితే అందుకు అంగీకరించడం ముఖ్యాంశాలు. దేశవిభజనను కాంగ్రెస్ పూర్తిగా వ్యతిరేకించింది. యుద్ధసమయంలో బాధ్యత కలిగిన జాతీయప్రభుత్వం ఉండాలని కాంగ్రెస్ చేసిన ప్రతిపాదనను ప్రథమంగా అంగీకరించి తరువాత నిరాకరించారు. దానితో క్రిప్స్ రాయబారం విఫలమైంది. ఏప్రియల్ 6న విశాఖపట్నం, కాకినాడ పట్నాలపై జపాను బాంబులు వేసింది. జపానుదాడిని ఎదుర్కోడానికి భారతీయులకు స్వేచ్ఛ లేకుండా పోయింది. జపాన్ దండయాత్రను బ్రిటన్ ఎదుర్కోవటం సాధ్యంకాదని కాంగ్రెస్ అభిప్రాయపడింది. కనుక బ్రిటిష్‌వారు ఇండియా నుండి వెళ్ళిపోవాలని గాంధీ కోరారు.

### ఆగస్టు విప్లవం

1942 ఆగస్టు 9వ తేదీ భారతదేశ చరిత్రలోనే మరపురాని దినం. బొంబాయిలో జాతీయ కాంగ్రెసు కార్యవర్గం సమావేశమయి భారతదేశంనుండి బ్రిటిషువారు

వెళ్లిపోవాలని చరిత్రాత్మకమయిన 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని చేసిన పవిత్రమయిన రోజు.

ఆరాత్రి దేశమంతటా నిద్రలోవున్న కాంగ్రెసువారినందర్నీ బంధించి జైళ్ళలో నిర్బంధించారు. ఎచ్చటకు తీసుకువెళ్లింది తెలియదు. ఆగస్టు 10 తెల్లవారింది. కాంగ్రెసు నాయకులను నిర్బంధించినవార్తలు తెలిసాయి. ఎక్కడున్నారో తెలియదు. దేశమంతా నిరసన ప్రదర్శనలు, ఊరేగింపులు, బంద్‌లు జరిగాయి. కాంగ్రెసు సంస్థను నిషేధించారు. కాంగ్రెసు ఆఫీసులలో పోలీసులు ఖాదీషాపులలో పోలీసులు, ఎటుచూసినా పోలీసులు, సైనికులపహారా, ప్రదర్శకులపై లాఠీచార్జీలు, విద్యార్థులు కాలేజీలు వదలి ఉద్యమంలో ప్రవేశించారు. వేలాదిమంది అజ్ఞాతవాసంలోకి వెళ్ళారు. టెలిగ్రాం, టెలిఫోనుతీగెలు తెంచారు. రైలుపట్టాలు పీకారు, రాత్రిపూట ప్రభుత్వ కార్యాలయాలపై, విద్యాలయాలపై కాంగ్రెసు జెండాలను ఎగురవేశారు. దేవాలయాలలో గోపురాలకు, ఎత్తయినప్రదేశాలలో జెండాలనుకట్టారు. మూడు సంవత్సరాలపాటు ఉద్యమం సాగింది. విద్యార్థి, యువజన సంస్థలనుకూడ నిషేధించారు విప్లవకారులు విధ్వంసకచర్యలు చేపట్టారు. ఆగస్టు విప్లవం బ్రిటిషు ప్రభుత్వాన్ని గడగడలాడించింది.

## ప్రజాభిప్రాయసేకరణ

1945 లో బ్రిటిషుపార్లమెంటు ఎన్నికలలో లేబర్‌పార్టీ విజయం సాధించింది. సామ్రాజ్యవాదానికి ప్రతీక అయిన కన్సర్వేటివ్‌పార్టి ఓడిపోయింది. వలసదేశాల సమస్యల యెడల సానుభూతి కలిగిన లేబరుపార్టి స్నేహపూర్వకంగా భారతదేశ సమస్యలను పరిష్కరించాలని కాంగ్రెసువాదులందరినీ జైళ్లనుండి విడుదలచేసింది.

రాజకీయసమస్యల విషయంలో భారత ప్రజల అభిప్రాయాన్ని తెలుకొనడానికి 1945 ఆఖరులో కేంద్రశాసనసభ, 1946 ప్రారంభంలో రాష్ట్రశాసనసభలకు ఎన్నికలు జరపటానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయానికి కాంగ్రెసు హర్షంప్రకటించి ఎన్నికలలో పాల్గొనడానికి నిశ్చయించింది. క్విట్‌ఇండియా తీర్మానం ప్రాతిపదికగా కాంగ్రెసు ఎన్నికలలోపాల్గొని ప్రచారంచేసింది, దేశంలోని 91.3 శాతం ఓటర్లు కాంగ్రెసుకు ఓటుచేసి క్విట్ ఇండియా తీర్మానంపట్ల సంపూర్ణ స్వరాజ్యంపట్ల సుముఖతను తెలియజేశారు.

ముస్లిం ప్రత్యేక నియోజక వర్గాలలో 86.5 శాతం ముస్లింలీగ్‌కు ఓట్లువేసి లీగ్‌విధానాలకు సుముఖతను స్పష్టంచేశారు.

కాంగ్రెసువారు సంప్రదింపులను వదలిన తరువాత కొన్నిచోట్ల ముస్లింలీగ్ ప్రాబల్యాన్ని సంపాదించి జిన్నా నాయకత్వాన్ని బలపరచింది. ముస్లింలీగ్ పాకిస్తాన్‌కోర్కెకు బలంచేకూరింది

లేబరుప్రభుత్వం కాంగ్రెసు, ముస్లింలీగ్ రెండింటిని సంప్రదింపులకు ఆహ్వానించింది, చివరకు ఇష్టంలేకపోయినా కాంగ్రెసు పాకిస్తాను ఏర్పాటుకు, దేశవిభజనకు అంగీకరించవలసివచ్చింది. చివరి గవర్నర్ జనరలు మౌంటుబాటెన్ ప్రముఖపాత్ర వహించారు.

**స్వతంత్ర భారతదేశ అవతరణ**

1947 ఆగస్టు, 15వ తేదీన రాజగోపాలచారి గవర్నర్ జనరలుగా, జవహర్‌లాలునెహ్రూ ప్రధానిగా స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పడింది. స్వతంత్ర భారతజాతీయ త్రివర్ణపతాకం సగర్వంగా ఎగిరింది. దేశమంతటా జాతీయజెండాలను ఎగురవేసి స్వాతంత్ర్యదినోత్సవ పండుగచేసుకొన్నారు. ఊరేగింపులుచేశారు. బాణాసంచాలుకాల్చారు విందులు వినోదాలు చేసుకొన్నారు. సభలు జరిపారు. స్వాతంత్ర్య సమరయోధులకు నివాళులు అర్పించారు. దేశవిభజనవలన లక్షలాది ప్రజలు పాకిస్తాన్‌నుండి ఇండియాకు వచ్చారు. ఒకప్రక్క పాకిస్తానునుండి వచ్చే శరణార్థులు, మతకల్లోలాలు, రెండోప్రక్క స్వతంత్రంగా వ్యవహరించాలని కొన్ని సంస్థానాలు చేస్తున్న ప్రయత్నాలు, సంస్థానప్రజల ఆందోళనలు భారతప్రభుత్వానికి సమస్యలుగా తయారయినాయి.

హిందూ ముస్లిం సమైక్యతకు నవాఖాళిలో గాంధీజీ పాదయాత్రచేశారు. చివరకు 1948 జనవరి 30వ తేదీన ఒక హిందూమతోన్మాది-ప్రార్థనాసమావేశానికి వెళ్తున్నగాంధీజీని నమస్కరించి పిస్టలుతో కాల్చివేశాడు. స్వాతంత్ర్య సమరసేనాని, జాతిపిత, అహింసాజ్యోతి, మహాత్మాగాంధీ నేలకొరిగినారు. ప్రపంచమంతా గాంధీకి జోహార్లు అర్పించింది, ప్రపంచ అధిపతులు గాంధీకి శ్రద్ధాంజలి ఘటించారు. స్వాతంత్ర్యఫలితాన్ని చూడకమునుపే స్వాతంత్ర్యప్రదాతను కోల్పోవడం దురదృష్టకరం.

భారత ప్రభుత్వం నెహ్రూ నాయకత్వంలో శరణార్థుల సమస్యలను పరిష్కరించి జాతిసమైక్యాన్ని రక్షించింది. సంస్థానాలను భారతయూనియనులో విలీనంచేసి సర్దార్ పటేలు తన రాజనీతిజ్ఞతను ప్రదర్శించారు.

**నవభారత నిర్మాణం**

భారతరాజ్యాంగ పరిషత్తును రాజేంద్రప్రసాదు అధ్యక్షతన ప్రజాస్వామిక సామ్యవాదరాజ్యాంగాన్ని ఏర్పాటుచేసి 1950 జనవరి 26 నుండి అమలు జరిపినారు.

జవహర్‌లాలునెహ్రూ నాయకత్వంలో పంచవర్ష ప్రణాళికల ద్వారా నవభారతనిర్మాణానికి కృషిచేశారు. లాల్‌బహదూర్ శాస్త్రి ప్రధానిగావుండి 1965లో పాకిస్తానుపై విజయంసాధించారు.

శ్రీమతి ఇందిరాగాంధీ 20 సూత్రాల పథకంతో దేశంలో పేదరికనిర్మూలనకు, అలీనోద్యమంద్వారా ప్రపంచశాంతికి కృషిచేశారు. దేశసమైక్యతకు కృషిచేసిన ఆమె తన రక్షకులచేతిలోనే 1984 అక్టోబర్ 31న ప్రాణత్యాగం చేసింది.

రాజీవ్‌గాంధీ ప్రధానిగా జటిలమయిన పంజాబ్, అస్సాం సమస్యలను పరిష్కరించి ఎన్నికలు జరిపి ప్రజాస్వామిక విలువలకు ప్రాధాన్యత యిస్తున్నారు, ధైర్యసాహసాలతో రాజ్యపాలన చేస్తున్నారు.

(స్నేహలత)

## 2. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ పూర్వాపరాలు

**ఆం**ధ్రుల రాజ్య చరిత్రకు మూడువేల సంవత్సరాల పూర్వం నుండి ఆధారాలున్నవి. క్రీ. పూ మూడవ శతాబ్దం నుండి నేటి ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణానికి మించి ఆంధ్రసామ్రాజ్యం వర్ధిల్లినట్లు చరిత్ర నిరూపిస్తున్నది.

ఆంధ్ర శాతవాహన చక్రవర్తులు అత్యున్నత స్థాయిలో పరిపాలన చేశారనడానికి కౌటిల్యుని వాక్యాలే ప్రబల నిదర్శనాలు. ఇక్ష్వాకుల ముఖ్య పట్టణంగా ఆనాడు వర్ధిల్లిన విజయపురి వద్దనే నేడు నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మింపబడుతున్నది. ఈ కేంద్రం నుండే ఆచార్య నాగార్జునుడు మహాయాన బౌద్ధ మతం దశదిశల వ్యాపింప చేశాడు. ఓరుగల్లు రాజధానిగా పన్నెండవ శతాబ్దంలో కాకతీయులు నెల్లూరు, కడప జిల్లావరకు రాజ్యాన్ని పరిపాలించారు. ఢిల్లీ సుల్తానుకు కాకతీయ రాజులు లొంగిపోయిన తరువాత బహమనీ, విజయనగర రాజ్యాలుగా చీలిపోయింది. గుల్బర్గాలోని బహమనీ, రాజ్యం పతనం చెందటంతో గోల్కొండ కుతుబ్‌షాహి సుల్తానుల అధికారంలోనికి వచ్చి శ్రీకాకుళం మొదలుకొని గోల్కొండ వరకు గల తెలుగు భాష మాట్లాడే ప్రాంతాన్ని సమైక్య పరిచారు. తరువాత అసిఫ్‌జాహి పాలనలో కూడా తెలుగు ప్రాంతం ఏకంగానే వున్నది. పరదేశీయులు అధికారంలోకి వచ్చిన తరువాతనే తెలుగు ప్రాంతం ముక్కచెక్కలై పోయినది. 17 వ శతాబ్దంలో ఉత్తర సర్కారులను సలాబత్‌జంగ్ ఫ్రెంచివారికి ఇచ్చివేశాడు. హైదరాబాద్ నవాబు రాయలసీమను 1800 వ సంవత్సరంలో బ్రిటిష్ ప్రభుత్వానికి దత్తం చేశాడు. అనేక సామ్రాజ్యాలు, విదేశ ప్రభుత్వాల క్రింద తెలుగు ప్రాంతం చీలిపోయి ఉండింది.

### ఆంధ్రోద్యమం

ఛిన్నాభిన్నంగా ఉన్న తెలుగు ప్రజల ప్రాంతం తిరిగి ఏకం కావాలనే కాంక్ష ప్రజలలో ప్రబలుతూ వచ్చింది. ప్రథమంగా 1907 లో మచిలీపట్నంలోను, 1910 లో గుంటూరులోను కొంతమంది పెద్దలు సమావేశమై ఆంధ్రరాష్ట్ర ఆవశ్యకతను గుర్తించారు. 1910 లో నిడదవోలులో జరిగిన కృష్ణా జిల్లా రాజకీయ సభలలోను,

1913 లో బాపట్లలో జరిగిన ప్రథమ ఆంధ్ర మహాసభలలోను ప్రత్యేక రాష్ట్ర వాంఛను వెల్లడించారు. 1914 లో విజయవాడలో జరిగిన ఆంధ్రమహాసభలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలనితీర్మానించారు. 1915లో విశాఖపట్టణంలో, 1916లో కాకినాడలో, 1917 నెల్లూరులో ఆంధ్ర మహాసభలు జరిపి ఆందోళన చేశారు.

**ఆంధ్ర కాంగ్రెసు అవతరణ**

ఈ ఆందోళన ఫలితంగా 1917 లో కలకత్తా కాంగ్రెసు మహాసభలు ఆంధ్ర ప్రాంతానికి ప్రత్యేక కాంగ్రెసు సంఘాన్ని ఏర్పాటు చేయటానికి అంగీకరించి, తెలుగు ప్రజల ప్రాంతాన్ని ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయటానికి పునాది వేశాయి. విజయవాడ కేంద్రంగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ఏర్పాటు చేయటంతో ఆంధ్రరాష్ట్రసాధనకు కాంగ్రెస్ నాయకత్వం వహించింది. 1920 లో మహాత్మాగాంధి అధ్యక్షతన జరిగిన నాగపూర్ కాంగ్రెసు మహాసభలో బాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేయాలన్న వాదాన్ని సూత్ర ప్రాయంగా ఆమోదించటం జరిగింది.

**స్వాతంత్ర్యోద్యమం**

జాతీయ కాంగ్రెసు పిలుపునందుకొని గాంధీజీ నాయకత్వంలో స్వాతంత్ర్య పోరాటాలలో ఆంధ్ర కాంగ్రెసు వీరోచితంగా నిలబడింది. 1928 లో శ్రీ ప్రకాశంగారి నాయకత్వాన సైమన్ కమిషన్‌ను ధిక్కరించిన సంఘటన చరిత్రలో ప్రసిద్ధి కెక్కింది. 1930 ఉప్పు సత్యాగ్రహంలోను, 1947 వ్యక్తిగత సత్యాగ్రహంలోను, 1942 ఆగస్టు విప్లవంలోను ఆంధ్ర కాంగ్రెసు ముందంజ వేసి నాయకత్వం వహించింది. 1948లో డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు జయపూర్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికైనారు. శ్రీ కళా వెంకట్రావుగారు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా ఎన్నికైనారు.

**జె. వి. పి. రిపోర్టు**

ఆంధ్ర రాష్ట్రం కావాలని ఆందోళన తిరిగి ప్రారంభమైనది. 1948 లో భాషా ప్రయుక్త రాష్ట్రాల విభజనపై ధార్ కమిషన్ నివేదికను పరిశీలించటానికి శ్రీ జవహర్ లాల్ నెహ్రూ, శ్రీ వల్లభాయి పటేల్, శ్రీ పట్టాభి సీతారామయ్య గార్లతో ఒక సంఘాన్ని కాంగ్రెసు ఏర్పాటు చేసినది. జె.వి.పి. రిపోర్టు ఆధారంగా మద్రాసు మినహాయించి ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయటానికి కేంద్రప్రభుత్వం అంగీకరించి తదనుగుణంగా

చర్యలు తీసుకొనవలసిందిగా మద్రాసు ప్రభుత్వాన్ని కోరింది. రాష్ట్ర విభజన సంఘ సభ్యులైన శ్రీ ప్రకాశంగారు మద్రాసుతో సహా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడాలని పట్టుదల చూపటంతో విభజన వాయిదా పడింది.

## కాంగ్రెసులో చీలికలు

ఆంధ్రదేశంలో తీవ్ర సంచలనం కలుగజేసే విధంగా 1951 ఏప్రిల్‌లో విజయవాడలో శ్రీ రంగా, శ్రీసంజీవరెడ్డిగార్ల మధ్య ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి తీవ్ర పోటీ జరిగింది. ఈ పోటీలో శ్రీ సంజీవరెడ్డిగారు అయిదు చోట్ల మెజారిటీతో ఎన్నికైనారు.

ఎన్నికలలో ఓడిపోయిన వెంటనే శ్రీప్రకాశం, శ్రీరంగాగార్లు కాంగ్రెసునుంచి వైదొలగి కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీని స్థాపించారు. మరల ఆ పెద్దలిరువురును కలవక పోవుటచే శ్రీ ప్రకాశంగారు ప్రజాపార్టీని, శ్రీ రంగాగారు కృషిక్‌లోక్ పార్టీని ఏర్పాటు చేసుకున్నారు. కాంగ్రెసులో వచ్చిన ఈ చీలకల వలన 1952 సాధారణ ఎన్నికలలో కాంగ్రెసు తీవ్రఅపజయం పొందింది. 140 అసెంబ్లీ స్థానాలలో 39 మాత్రమే కాంగ్రెసుకు లభించాయి. అయితే కృషిక్ లోక్‌పార్టీ మద్దతులో శ్రీ రాజగోపాలచారి కాంగ్రెసు మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశారు.

## ఆత్మాహుతి

ఆంధ్రరాష్ట్ర స్థాపనకు 59 రోజులు కఠోర నిరాహారదీక్షచేసి శ్రీ పొట్టి శ్రీరాములు 1952 డిసెంబర్‌లో ఆత్మాహుతి అయినారు. ఆంధ్రదేశంలో ఆబాలగోపాలము ఆంధ్రరాష్ట్రం కొరకు ఆందోళన చేశారు. 1952 డిసెంబర్ 19వ తేదీన లోక్‌సభలో, ప్రధాని నెహ్రూ ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుకు అంగీకరిస్తూ ప్రకటన చేశారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుగా నున్న శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఆంధ్రరాష్ట్ర శాసనసభా కాంగ్రెసు పార్టీ నాయకుడుగా ఎన్నికైనారు.

## ఆంధ్ర రాష్ట్రావతరణ

1953 అక్టోబరు 1 వ తేదీన కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగాను, శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఉప ముఖ్యమంత్రిగాను పదవీ స్వీకారంచేశారు. శ్రీ సంజీవరెడ్డిగారి స్థానే ఆంధ్రరాష్ట్ర

కాంగ్రెసు అధ్యక్షుడుగా శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఎన్నికైనారు. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం వసతులు లేని క్రొత్త రాజధానిలో కష్టపడి పనిచేసి ప్రజా సమస్యల సత్వర పరిష్కారానికి ఘనంగా కృషిచేసింది. ఒక్క ఓటు తేడాతో ప్రభుత్వం అసెంబ్లీలో ఓడిపోవటంతో మంత్రివర్గం రాజీనామా చేసింది. 1955 మధ్యంతర ఎన్నికలలో ప్రజాస్వామ్య శక్తులన్నీ ఏకమై కృషిచేయగా 140 సీట్లలో 104 స్థానాలు వాటి కైవసమైనవి. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రి పదవిని, శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఉపముఖ్యమంత్రి పదవిని స్వీకరించారు. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి స్థానే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు ఎన్నికైనారు.

### రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ

పరిపాలనా సౌలభ్యంకొరకు భాషాప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటుచేసే ఉద్దేశ్యంతో కేంద్రం నియమించిన ఫజేల్ అలీ కమిషను 1955 సెప్టెంబరులో కేంద్ర ప్రభుత్వానికి నివేదికను సమర్పించింది. ప్రధాని నెహ్రూ సూచన ప్రకారం, ఆంధ్ర తెలంగాణా నాయకులు తెలంగాణా అభివృద్ధికి అవకాశమిచ్చే విధంగా ఒక అంగీకారానికి వచ్చి ఆంధ్రప్రదేశ్ అవతరణకు తోడ్పడ్డారు. 1956 నవంబర్ 1 వతేదీన ఆంధ్రప్రదేశ్ అవతరించింది. శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి పదవిని స్వీకరించారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉన్న శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, హైద్రాబాద్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్న శ్రీ జె. వి. నరసింగరావుగార్ల కృషిఫలితంగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘం అవతరించింది. 1957 జులైలో జరిగిన ప్రదేశ్ కాంగ్రెస్ సర్వసభ్య సమావేశంలో శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు అధ్యక్షుడుగా ఎన్నికైనారు. ప్రదేశ్ కాంగ్రెస్ ఉపాధ్యక్షుడైన శ్రీ జె. వి. నరసింగరావుగారు తెలంగాణా ప్రాంతీయ సంఘానికి అధ్యక్షులైనారు.

### 1957 ఎన్నికలు

1957 సాధారణ ఎన్నికలలో తెలంగాణాలోని 15 లోక్‌సభ స్థానాలలో పదమూడు, 105 అసెంబ్లీ స్థానాలలో 68, ఆంధ్రప్రాంతంలోని 28 లోక్‌సభ స్థానాలలో 24 స్థానాలు కైవసం చేసుకొని కాంగ్రెసు అఖండ విజయం సాధించింది. 1955 మధ్యంతర ఎన్నికలవలన ఆంధ్రప్రాంతం అసెంబ్లీ సభ్యుల పదవీకాలాన్ని 1962

వరకు పొడిగించడమైనది. 1958 జనవరిలో ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు అఖిల భారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా నియమింపబడడంవల్ల ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సర్వసభ్య సమావేశంలో శ్రీ పిడతల రంగారెడ్డిగారు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికైనారు. 1958 అక్టోబరులో హైదరాబాదులో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశాలు అతివైభవంగా జరుపబడినవి. శ్రీ సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా వున్నకాలంలో లెజిస్లేటివ్ కౌన్సిల్ ఏర్పడినది. బల్వంతరాయ్ మెహతా సిఫార్సుల ననుసరించి పంచాయితీరాజ్ వ్యవస్థకు పునాదులు వేయబడినవి. బస్సులు, పాఠ్యపుస్తకాల ప్రచురణ జాతీయం చేయబడినది.

శ్రీ నీలం సంజీవరెడ్డిగారు 1960 జనవరిలో అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికైనందున ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. వీరిస్థానే శ్రీ దామోదరం సంజీవయ్యగారు ముఖ్యమంత్రి పదవిని స్వీకరించారు. శ్రీ పిడతల రంగారెడ్డి గారు శ్రీ సంజీవయ్య మంత్రివర్గంలో చేరటం వల్ల ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. 1960 ఫిబ్రవరి 17 న ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారు ఎన్నికైనారు. అయితే కొద్దికాలంలోనే ప్రదేశ్ కాంగ్రెసులో తలఎత్తిన భేదాభిప్రాయాల దృష్ట్యా శ్రీ నరోత్తమరెడ్డిగారు రాజీనామా చేశారు. 1960 డిసెంబర్‌లో శ్రీ మల్లిపూడి పల్లంరాజు గారు ఏకగ్రీవంగా ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికైనారు.

### 1962 ఎన్నికలు

1962 జనరల్ ఎన్నికలకు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ పల్లంరాజు, శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగార్లు త్రిసభ్య కమిటీగా ఏర్పడి అభ్యర్థులను ఎన్నిక చేశారు. 1962 ఎన్నికలలో కూడా కాంగ్రెసు విజయాన్ని సాధించింది. శ్రీ నీలం సంజీవరెడ్డిగారు మళ్ళీ ముఖ్యమంత్రి పదవిని స్వీకరించారు. శ్రీ సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉన్న రెండు సంవత్సరాలలో అనేక అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరిపారు. శ్రీ సంజీవ రెడ్డిగారి స్థానే శ్రీ సంజీవయ్య కాంగ్రెస్ అధ్యక్షుడుగా నియమింప బడ్డారు. శ్రీ పల్లం రాజుగారు శ్రీ సంజీవరెడ్డిగారి మంత్రివర్గంలో చేరటం వల్ల ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. 1962 ఏప్రిల్ లో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులుగా

ఎన్నికైనారు. శ్రీ బ్రహ్మయ్యగారు ఆంధ్ర ప్రదేశ్ శాసనమండలి అధ్యక్షులుగా ఎన్నుకోబడడం వల్ల 1964 మార్చిలో శ్రీ పి. తిమ్మారెడ్డిగారు పి. సి. సి. అధ్యక్షులుగా ఎన్నికైనారు.

బస్సుల జాతీయకరణ విషయంలో సుప్రీంకోర్టు తీర్పు ననుసరించి శ్రీ సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. 1964 సెప్టెంబరులో శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారు ముఖ్యమంత్రి పదవిని స్వీకరించారు. 1966 నవంబరులో గుంటూరులో అఖిల భారత కాంగ్రెసు సమావేశాలు వైభవంగా జరిగాయి. ప్రధాని శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి ఇందులో పాల్గొన్నారు.

## 1967 ఎన్నికలు

1967 ఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయం సాధించినది. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ స్థానాలలో 164 స్థానాలను, లోక్‌సభ స్థానాలలో 24 స్థానాలను కాంగ్రెసు గెలుచుకుంది. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు తిరిగి ముఖ్యమంత్రి పదవిని స్వీకరించారు. తరువాత చాలా మంది ప్రతిపక్ష కాంగ్రెసు సభ్యులు, స్వతంత్రులు కాంగ్రెసులో చేరారు. శ్రీ పి. తిమ్మారెడ్డిగారు మంత్రివర్గంలో చేరటం వల్ల ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. 1967 ఏప్రిల్‌లో శ్రీ కాకాని వెంకటరత్నంగారు ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికైనారు. 1968 జనవరి 7 వ తేదీనుండి 11 వ తేదీవరకు హైద్రాబాద్‌లో కాంగ్రెసు మహాసభలు అతివైభవంగా జరిగాయి. కోయినా భూకంపం వలన మహారాష్ట్రలో జరగవలసిన మహాసభలు హైద్రాబాదుకు మార్చబడ్డాయి. 15 రోజులలో శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు తగిన ఏర్పాట్లుచేసి జాతీయనాయకుల ప్రశంసల నందుకొన్నారు.

గన్నవరం ఉప ఎన్నికలలో శాసనసభకు ఎన్నికైన శ్రీ కాకాని వెంకటరత్నంగారు శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి మంత్రి వర్గంలో చేరడం వల్ల ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. 1969 డిసెంబరులో శ్రీ బి. వి. గురుమూర్తి గారు ప్రదేశ్ కాంగ్రెస్ సందేశాన్ని ప్రజలకు అందజేయటానికి శ్రీ గురుమూర్తిగారు నిర్విరామంగా పర్యటించారు. నెల్లూరు, గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, చిత్తూరు జిల్లాలలో రాజకీయ మహాసభలలోను, కార్యవర్గ సమావేశములలోను పాల్గొన్నారు. దురదృష్టవశాత్తు 1970 ఫిబ్రవరిలో హృద్రోగం వలన శ్రీ గురుమూర్తిగారు మరణించారు.

1970 మార్చిలో జరిగిన ప్రదేశ్ కాంగ్రెస్ సర్వసభ్య సమావేశంలో శ్రీ పి. నరసారెడ్డిగారు ఏకగ్రీవంగా ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నిక అయినారు.

అఖిల భారత స్థాయిలో శ్రీమతి ఇందిరాగాంధి వర్గానికి, సిండికేటు నాయకులకు మధ్య ఏర్పడిన వివాదంలో ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘం అభ్యుదయ పక్షమైన ఇందిరాగాంధీ వర్గాన్నే బలపరిచారు. బ్యాంకుల జాతీయకరణ వంటి విధానాలద్వారా శ్రీమతి ఇందిరాగాంధీ దేశంలో బ్రహ్మాండమైన చైతన్యాన్ని రేకెత్తించి ప్రజల ఆరాధ్య దేవత అయినారు. అభ్యుదయ విధానాలు కిట్టని సిండికేటు వర్గం కాంగ్రెసు నుండి చీలిపోయింది. ఈ చీలిక అనంతరం మన రాష్ట్రంలో రెండు మినహా తక్కిన ఉపఎన్నికలన్నిటిలోను శ్రీమతి ఇందిరాగాంధి నాయకత్వాన ఉన్న కాంగ్రెస్ విజయం సాధించింది.

## మధ్యంతర ఎన్నికలు

రాజ్య సభలో ఒక్క వోటుతో రాజభరణాలు రద్దు బిల్లు ఓడిపోవడం, బ్యాంకుల జాతీయకరణ బిల్లును సుప్రీంకోర్టు కొట్టివేయడం లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలు పెట్టవలసిన అవసరాన్ని కల్గించాయి. ప్రధాని ఇందిరాగాంధి లోక్‌సభను రద్దుచేసి ప్రజాభిప్రాయానికి అవకాశాలు కల్గించారు. ఎన్నికలలో ప్రజలు ఇందిరాగాంధి విధానాలను బలపరచారు. 518 స్థానాలలో 350 స్థానాలు కాంగ్రెసు గెలుచుకుంది. రాజ్యాంగ సవరణలకు అవసరమగు మెజారిటి వచ్చింది. ఆంధ్రప్రదేశ్‌లో 41 స్థానములకు 28 స్థానములు కాంగ్రెసుకు, 10 స్థానాలు తెలంగాణా ప్రజాసమితికి, అతివాద, మితవాద కమ్యూనిస్టులకు, స్వతంత్రులకు ఒక్కొక్కటి వచ్చినాయి. కాంగ్రెసు అభ్యర్థులు లక్షలలో అత్యధిక మెజారిటీతో గెలుపొందారు. కాంగ్రెసు విజయ దుందుభి మ్రోగించింది.

## బ్రహ్మానందరెడ్డి రాజీనామా

ఆంధ్రప్రదేశ్ సమైక్యత కొరకు ప్రధాని సలహాపై శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రి పదవికి 11-9-71 తేదీన రాజీనామా చేశారు. వారు చేసిన త్యాగమును ప్రధాని ఎంతగానో ప్రస్తుతించారు. ఎంతోకాలంగా అందర్నీ వేధిస్తున్న తెలంగాణా సమస్యను పరిష్కరించడానికి ఇది దోహదం చేసింది.

25-9-71 వ తేదీన శ్రీ పి. వి. నరసింహారావుగారు లెజిస్లేచరు కాంగ్రెసు పార్టీకి నాయకుడుగ ఏకగ్రీవంగా ఎన్నుకోబడినారు.

## ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ రద్దు

ఆంధ్రప్రదేశ్‌లో వచ్చిన రాజకీయ పరిణామాల దృష్ట్యా కాంగ్రెసు వాదులలో సమన్వయము నెలకొల్పుటకు ప్రదేశ్ కాంగ్రెసు కమిటీని రద్దుచేసి, మైనారిటీ వర్గమునకు చెందిన శ్రీ మహమ్మద్‌ఇస్మాయిల్ అధ్యక్షులుగా ప్రదేశ్ కాంగ్రెసు అడ్‌హాక్ కమిటీని 28-12-71 వ తేదీన ఆలిండియా కాంగ్రెసు కమిటీ వేసింది.

*(విప్లవాత్మక సంవత్సరం - 1971*
*ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ప్రత్యేక సంచిక)*

# 3. స్వాతంత్ర్య పోరాటంలో ఆంధ్రప్రదేశ్

1707లో ఔరంగజేబు మరణంతో మొగలాయి సామ్రాజ్యం ముక్కచెక్కలవటం ప్రారంభించింది. హైదరాబాద్ రాజధానిగా నిజాం ప్రభువులు 1724 నుండి పరిపాలన చేశారు. పూర్తిగా తెలంగాణ, మహారాష్ట్రలోని కొన్ని ప్రాంతాలు, ఇంచుమించు ఆంధ్రప్రాంతాలు వారి పాలనలో ఉన్నాయి. 1748లో నిజాం నవాబ్ చనిపోయిన తర్వాత రాజ్యానికి అర్హులు ఎవరనే వారసుల తగాదాలో ఫ్రెంచివారు ఒకవైపు, ఇంగ్లీషువారు మరొకవైపు బలపరచి యుద్ధాలను సృష్టించారు.

రెండవ కర్నాటక యుద్ధం తర్వాత చందాసాహెబ్‌ను ఫ్రెంచి గవర్నర్ డూప్లే గుర్తించినందుకు మచిలీపట్టణం, దివిసీమలు; దక్కను సుబేదారుగా ముజఫర్‌జంగ్‌ను గుర్తించినందుకు నిజాంపట్టణం యిచ్చి, కోస్తాలో మచిలీపట్నం నుండి నిజాం పట్నం వరకు డూప్లేను గవర్నరుగా అంగీకరించడం వల్ల ఫ్రెంచివారి వశమైంది. 1753లో కొండవీడు, 1758లో గంజాం నుంచి గుంటూరు వరకు 1757లో బొబ్బిలి యుద్ధంలో బొబ్బిలి సంస్థానాన్ని ఫ్రెంచివారు మచిలీపట్నాన్ని స్వాధీనం చేసుకొన్నారు. 1788 నాటికి సర్కారు జిల్లాలు 1800లో రాయల సీమ బ్రిటిషు గవర్నరుకు దత్తత అయ్యాయి. 1802 నాటికి ఆంధ్ర ప్రాంతం అంతా ఆంగ్లేయుల అధీనంలోకి వచ్చింది.

ఒక్కొక్క ప్రాంతాన్ని కబళిస్తున్న ఆంగ్లేయ సామ్రాజ్యవాదులపై స్థానిక జమీందార్లు, రాజులు అప్పుడప్పుడు ఎదురుతీరుగుతూనే వున్నారు. పర్లాకిమిడి, విజయనగరం రాజులు పోరాటాలు చేశారు. జమీందార్లు కప్పం చెల్లించనప్పుడు, అంతఃకలహాలవల్ల తిరుగుబాట్లు అణచివేస్తూ, విభజించి పాలించు సూత్రంతో ఆంగ్లేయులు అందరినీ లొంగదీసుకున్నారు.

రాజులు, జమీందార్లు బ్రిటిషువారిపై అసంతృప్తిగానే ఉన్నారు. 1857లో ఝాన్సీలక్ష్మిబాయి, ఉత్తరాది వీరోచితంగా పోరాటం జరుగుతుండగా, ఆంధ్ర ప్రాంతంలో చిన్న చిన్న తిరుగుబాట్లు జరిగాయి. సాయుధ పోరాటాలలో ఆధునిక ఆయుధాలు కలిగిన బ్రిటిషు పటాలాన్ని ఎదుర్కోలేకపోయారు. వ్యాపారానికి వచ్చిన ఈస్టిండియా కంపెనీ మచిలీపట్నం కేంద్రంగా వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకుంది.

కలహాలలో కలిగించుకొని ఆంధ్ర ప్రాంతంలో ఆధిపత్యం వహించింది. 1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటం అనంతరం బ్రిటిషు ప్రభుత్వం ప్రత్యక్షపాలన చేపట్టింది.

ఆంగ్లేయులకు, భారతీయులకు ఉద్యోగాలలో, చదువులలో, ప్రతి విషయంలో తేడా కనబడేది. భారతీయులను అస్పృశ్యులుగా చూచేవారు. భారతీయులలో అసంతృప్తి పెరుగుతూ వచ్చింది. క్రైస్తవ మిషనరీల ప్రాబల్యం హిందువులకు బాధ కలిగించింది. 1847లో గోదావరి, 1853లో కృష్ణా ఆనకట్టలను కట్టారు. సేద్యానికి అవకాశాలు పెరిగాయి. ఇంగ్లీషు భాష వలన సంబంధాలు కల్గినాయి. చిన్న చిన్న పత్రికలు ప్రచురణ కావడం, ప్రజలలో వార్తలు తెలుసుకోవడం చైతన్యానికి దారితీసింది. బ్రిటిషు ప్రభుత్వ దోపిడీ విధానాన్ని ప్రజలు అర్థంచేసుకోవడం ప్రారంభించారు.

1884లో మద్రాసు మహాజనసభ శ్రీ సి.రంగయ్య నాయుడు అధ్యక్షులుగా, శ్రీ ఆనందాచార్యులు కార్యదర్శిగా ఏర్పడి ప్రజల అభిప్రాయాలను ప్రభుత్వానికి తెలియజేయడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. కాకినాడలో లిటరరీ అసోసియేషన్ ఏర్పడింది.

**కాంగ్రెసు స్థాపన**

దేశంలో వివిధ ప్రాంతాలలో ఏర్పడిన స్థానిక సంఘాల ప్రతినిధులను అహ్వానించి హ్యూందొర 1885లో బొంబాయిలో సమావేశపరచి భారత రాజకీయ కాంగ్రెసును స్థాపన చేయించారు. భారతీయుల సమస్యలను ప్రభుత్వానికి తెలియపరచడమే లక్ష్యం. ఈ సమావేశానికి బరంపురం, మచిలీపట్నం, కడప, బళ్ళారి నుండి ఆంధ్ర నాయకులు హాజరయ్యారు. డబ్ల్యు. సి. బెనర్జీ అధ్యక్షత వహించారు.

1886 కాంగ్రెసు సభకు ఆనందాచార్యులు, సి.రంగయ్యనాయుడు, పార్థసారధి నాయుడు, న్యాపతి సుబ్బారావు, కేశనపల్లి మొదలైన పెద్దలు హాజరై తిరిగివచ్చి కాంగ్రెసు తీర్మానాలను ప్రజలకు తెలియజేశారు. 1891లో ఆనందాచార్యులు నాగపూర్ కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహించి అనేక సమస్యలపై ఉపన్యసించారు. మొదటి నుండి కాంగ్రెసు మహాసభలలో ఆంధ్ర ప్రతినిధులు పాల్గొంటున్నారు. 1904 వరకు ప్రజల సమస్యలను కాంగ్రెసు తీర్మానాలద్వారా ప్రజల దృష్టికి తీసుకొని వచ్చింది.

**వందేమాతరం ఉద్యమం**

బంకించంద్రుడు వ్రాసిన వందేమాతరం గేయాన్ని కౌతా శ్రీరామశాస్త్రి పాడుతుంటే ప్రేక్షకులు ఆవేశపూరితలయ్యేవారు. బెంగాలు విభజన వ్యతిరేక ఉద్యమాన్ని

వందేమాతరం ఉద్యమమన్నారు. వందేమాతరం పాడినా, వందేమాతరం బ్యాడ్జిలు ధరించినా దండించేవారు. 1907లో శ్రీ బిపిన్ చంద్రపాల్, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి ఆధ్వర్యంలో ఆంధ్రలో పర్యటించారు. విజయనగరం, విశాఖపట్టణం, కాకినాడ పర్యటించారు. రాజమండ్రిరాగానే శ్రీ ప్రకాశంగారు సభలు ఏర్పాటుచేశారు. బెజవాడలో మునగాల రాజా అతిథిగా శ్రీపాల్ ఉన్నారు. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఆధ్వర్యంలో సభ జరిగింది. మచిలీపట్నంలో డా॥పట్టాభి సభలు ఏర్పాటు చేశారు.

మచిలీపట్నంలో జాతీయకళాశాలకు శంకుస్థాపనచేశారు. శ్రీ పాల్ సభలలో పాల్గొన్న విద్యార్థులను కళాశాలలనుండి తొలగించారు. శ్రీ కోపల్లి హనుమంత రావు జాతీయోద్యమంలో పాల్గొంటూ ఇట్లా ప్రకటించారు. పాల్ పర్యటన ఆంధ్రలో నూతన ఉత్తేజాన్ని కల్గించింది. రాజమండ్రిలో జాతీయ కళాశాల న్యాపతి సుబ్బారావు స్థాపించారు. 1907 సూరత్ కాంగ్రెసు సమావేశానికి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కోపల్లె హనుమంతరావు, పేరి నారాయణమూర్తి, పెద్దిబొట్ల వీరయ్య హాజరయ్యారు. అతివాద, మితవాద తగాదాలు వచ్చాయి. తరువాత మద్రాసు కాంగ్రెసు సభకు రసబీహారీ ఘోష్ అధ్యక్షతన జరిగింది. ఆంధ్రనుండి 118 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. డా॥ పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు, వరాహగిరి వెంకట జోగయ్య రాజీకి ప్రయత్నించారు.

1909లో కోటప్పకొండ శివరాత్రి ఉత్సవంలో పోలీసులకు, ప్రజలకు, మధ్యన పోరాటం జరిగింది. తెనాలి వద్ద గ్రామంలో బాంబు పేలింది. "దేశాభిమాని" పత్రిక ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలని 1910లో ప్రచారం ప్రారంభించింది. 1911లో బెంగాల్ రాష్ట్ర విభజన రద్దుకు ప్రభుత్వం అంగీకరించడంతో ప్రజలు విజయాన్ని సాధించారు. భారతదేశానికి స్వయంపరిపాలన అసాధ్యమని క్ర్యూ ప్రభువు ప్రకటనకి ప్రజలు నిరసన వ్యక్తంచేశారు. దేశాభిమాని, కృష్ణా పత్రిక, ఆంధ్రపత్రిక, స్వర్ణరేఖ, దేశమాత పత్రికలు ఉద్యమాలకు ప్రచారం చేశాయి. వందేమాతరం ఉద్యమం ఆంధ్రలో రాజకీయ ఆలస్యానికి దోహదంచేసింది.

**ఆంధ్రోద్యమం**

వందేమాతరం ఉద్యమంతో రాజకీయ చైతన్యం పొందిన ఆంధ్రులు స్వరాష్ట్రం కావాలనే వాంఛను ప్రకటించడం ప్రారంభించారు. 1912లో మేవరపు రామదాసు పంతులుగారి అధ్యక్షతన నిడదవోలులో జరిగిన సమావేశంలో ఆంధ్ర మహాసభ

జరపాలని నిర్ణయించారు. 1913 బాపట్లలో సభ జరిపి ఆంధ్ర రాష్ట్ర తీర్మానాన్ని చేశారు. కొండా వెంకటప్పయ్య, డా॥పట్టాభి సీతారామయ్య, మట్నూరి కృష్ణారావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, కేశవపిళ్ళై, చల్లా శేషగిరిరావు, ఆంధ్రరాష్ట్ర వాంఛను ప్రజలలో ప్రచారం చేశారు. 1917లో ఆంధ్రరాజకీయ సమితి ఏర్పడింది. శ్రీ బి.ఎన్.శర్మ అధ్యక్షతన మద్రాసులో ఆంధ్రసభ జరిగింది. ఆంధ్రోద్యమాన్ని ప్రచారం చేస్తూ జాతీయ పోరాటాలలో ఆంధ్ర నాయకులు పాల్గొన్నారు.

## హోమ్‌రూల్ ఉద్యమం

అనీబిసెంట్ నాయకత్వంలో హోంరూల్ ఉద్యమం దేశవ్యాప్తమైంది. మదనపల్లి విద్యాకేంద్రంగా పెంపొందింది. హరిసర్వోత్తమరావు నాయకత్వం వహించి ప్రచారం చేశారు. కలకత్తా కాంగ్రెసు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఏర్పాటుకు అంగీకరించింది. బొంబాయి కాంగ్రెసు సభలో హోంరూల్‌ను గురించి తిలక్ ప్రతిపాదనను కొండా వెంకటప్పయ్య, ఓరుగంటి వెంకట సుబ్బయ్య, కాళేశ్వరరావు సమర్థించారు. దర్శిచెంచయ్యను అరెస్టుచేస్తే ఆంధ్రులు నిరసన తెలియజేశారు. మాంటేగు సంస్కరణల ప్రకటనతో హోంరూల్ ఉద్యమం ఆగిపోయింది.

## సహాయ నిరాకరణోద్యమం

తిలక్ మరణంతో గాంధీజీ నాయకత్వం వచ్చింది. స్వరాజ్యసాధనకు సహాయ నిరాకరణోద్యమాన్ని గాంధీజీ ప్రారంభించారు. గాంధీజీ పిలుపును అందుకొని తిరిగి సత్యాగ్రహం చేసిన వారు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, మహమ్మద్ గులాం మొహిద్దీన్, కొండా వెంకటప్పయ్య శాసనసభకు రాజీనామా చేశారు. చాలా మంది బిరుదులను వదులుకున్నారు. ఎన్నికలను బహిష్కరించారు. తర్వాత జరిగిన కాంగ్రెసు సభ గాంధీ విధానాన్ని బలపరిచింది. 1921 మార్చి 31వ తేదీన అఖిల భారత కాంగ్రెసు సంఘం బెజవాడలో జరిగింది. గాంధీజీ ఆ సమావేశాలకు వచ్చి ఆంధ్రప్రాంతమంతా తిరిగారు. కోర్టులను బహిష్కరించాలని కాంగ్రెసు చేసిన తీర్మానాన్ని అనుసరించి కొండా వెంకటప్పయ్య, టంగుటూరి ప్రకాశం, అయ్యదేవర కాళేశ్వరరావు మరి 103 మంది న్యాయవాదులు ప్రాక్టీసుకు స్వస్తిచెప్పారు. ఆంధ్రులు గాంధీజీ పర్యటనతో రాజకీయ చైతన్యపూరితులయ్యారు. ఖాదీ ఉద్యమం, మద్యనిషేధ ప్రచారం విరివిగా జరిగాయి. గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు పరచడానికి జాతీయ సేవాదళాలు, ఆంధ్రలో

అనేక ఆశ్రమాలు ఏర్పడ్డాయి. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వంలో చీరాల పేరాల ఉద్యమం, రామదండు కార్యక్రమాలు పేరొందాయి.

పల్నాడులో పుల్లరి ఉద్యమం, పెదనందిపాడు రైతు ఉద్యమం, రాయచూర్‌లో సత్యాగ్రహోద్యమం, చరిత్రాత్మకమైనవి. వన్య ప్రాంతాలలో అల్లూరి సీతారామరాజు విప్లవం చరిత్రాత్మకమైనది. బ్రిటీషువారిని గడగడలాడించిన సీతారామరాజు దేశ ప్రసిద్ధికెక్కాడు.

## సైమన్ కమీషన్

బ్రిటీషు ప్రభుత్వం భారత రాజకీయ పరిస్థితులను పరిశీలించడానికి పంపిన సైమన్ కమీషన్‌ను బహిష్కరించాలని, నల్లజెండాల ప్రదర్శనలు చేయాలని కాంగ్రెసు నిర్ణయించింది. చెన్నైలో టంగుటూరి ప్రకాశం తన రొమ్మును చూపి తుపాకీ గుండ్లతో కాల్చమని పోలీసుకు చూపించి మహాత్యాగశీలి అయి ఆంధ్రకేసరి బిరుదును పొందారు. ఆంధ్రదేశంలో సైమన్ కమీషన్‌కు నిరసనగా ప్రదర్శనలు జరిగాయి. బులుసు సాంబమూర్తి, కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, పున్నయశాస్త్రి, కళా వెంకట్రావు లాంటి పెద్దలను అరెస్టు చేశారు. మద్దాలి అన్నపూర్ణయ్యను నిర్బంధించారు.

## ఉప్పుసత్యాగ్రహం

ఉప్పుమీద పన్నును వ్యతిరేకిస్తూ గాంధీజీ సబర్మతీ ఆశ్రమం నుండి 240 మైళ్ళు నడచి దండి వద్ద సత్యాగ్రహం చేశారు. ఏకైక ఆంధ్రప్రతినిధిగా ఏర్నేని సుబ్రహ్మణ్యం గారు దండయాత్రలో పాల్గొన్నారు. కృష్ణాజిల్లాలో చిన్నార్షం, నెల్లూరువద్ద మైపాడు, పశ్చిమగోదావరిలో మట్లపాలెం, తూర్పుగోదావరిలో చల్లంగి, విశాఖపట్నం, గుంటూరులలో ఉప్పుసత్యాగ్రహ కేంద్రాలుగా ఏర్పాటుచేసి దళాలవారి వందలాది కార్యకర్తలు సత్యాగ్రహాలు చేసి జైలుశిక్ష అనుభవించారు. బాలచెర్వు, నౌపడా, కనపర్తి, ఉప్పుకొఠారులపై దాడిచేసి ధ్వంసం చేశారు. గాంధీ టోపీ, కాంగ్రెసు జెండా పట్టుకుంటే నేరంగా పరిగణించారు. గాంధీ ఇర్విన్ ఒడంబడికతో ఉప్పుసత్యాగ్రహం చల్లబడింది. నెల్లూరులో 38, గుంటూరులో 190, కృష్ణాలో 112, పశ్చిమగోదావరిలో 92, తూర్పుగోదావరిలో 35, విశాఖపట్నంలో 19, గుంటూరులో 14, అనంతపురంలో 14 మంది జైళ్ళకు వెళ్ళారు.

## గాంధీ పర్యటన

గాంధీజీ రెండవసారి అంటరానితనానికి వ్యతిరేకంగా 15 రోజులు ఆంధ్రప్రర్యటనలో 1024 మైళ్ళు ప్రయాణం చేశారు. రైలు మీద 665 మైళ్ళు, కారులో 20 మైళ్ళు, 15 మైళ్ళు లాంచిలో సుమారు వంద గ్రామాలు పర్యటించి రూ॥60వేలు రొక్కం, అనేక నగలు, విరాళాలుగా వచ్చాయి. ఖాదీ ఉద్యమవ్యాప్తికి గాంధీజీ పర్యటన ఎంతో తోడ్పడింది.

## ఎన్నికలు

1935లో భారత ప్రభుత్వ చట్టం ప్రకారం 1937లో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయం సాధించింది. జూలై 14వ తేదీన మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా రాజగోపాలాచారి నాయకత్వంలో మంత్రివర్గం ఏర్పడింది. ప్రకాశం, వి.వి.గిరి, బెజవాడ గోపాలరెడ్డి, మంత్రివర్గంలో చేరారు. బులుసు సాంబమూర్తి స్పీకర్ అయ్యాడు. తెన్నేటి విశ్వనాథం, అయ్యదేవర కాళేశ్వరరావు, బి.ఎస్.మూర్తి, మాగంటి బాపినీడు, వరదాచారి పార్లమెంట్ కార్యదర్శులుగా నియమితులైనారు.

రెండవ ప్రపంచయుద్ధ సందర్భంగా రాజకీయ పరిస్థితి సమీక్షించి మంత్రి వర్గాలు రాజీనామా చేయాలని కాంగ్రెసు తీర్మానించింది. 1939 అక్టోబర్ 29వ తేదీన రాజీనామాలు చేశారు. కాంగ్రెసు ప్రభుత్వాలు గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరుపుటకు ప్రయత్నించాయి.

## వ్యక్తిగత సత్యాగ్రహం

సంపూర్ణ స్వాతంత్ర్యాలు కావాలని గాంధీజీ శంఖారావాన్ని పూరించారు. వినోబాజీని ప్రథమ సత్యాగ్రహిగా ప్రకటించారు. 1940 అక్టోబర్ 17 నుండి ప్రారంభమైన వ్యక్తిగత సత్యాగ్రహంలో ప్రకాశం, కాళేశ్వరరావు, పట్టాభి, కొల్లూరి సుబ్బారావు, మాగంటి బాపినీడు, బులుసు సాంబమూర్తి, గోవిందాచారి, మొదలయిన పెద్దలతో సహా 882 మంది అరెస్టు అయ్యారు.

## క్విట్ ఇండియా ఉద్యమం

1941 చివరలో జపాన్ భారతదేశంపై దండయాత్రచేసి విశాఖపట్టణం, కాకినాడలపై బాంబులు వేసింది. మా దేశాన్ని మేము రక్షించుకోవాలంటే సంపూర్ణ స్వేచ్ఛకావాలని కాంగ్రెసు కోరింది. క్రిప్సు రాయబారం విఫలమైంది.

1942 ఆగష్టు 9వ తేదీన ముంబైలో కాంగ్రెసు సమావేశమై క్విట్ ఇండియా తీర్మానం చేసింది. కాంగ్రెసు నాయకులను ప్రభుత్వం అరెస్టుచేసింది. ఆంధ్రాసర్క్యులర్ పేరుపొందింది. ఆంధ్ర ప్రాంతమంతా ఉద్యమంలో దుమికింది. అనేకచోట్ల ఉద్రేకాలతో ప్రజలు విధ్వంసక చర్యలు చేశారు. వెయ్యిమందిదాకా అరస్టు అయ్యారు. బ్రిటన్‌లో లేబర్‌పార్టీ అధికారానికి రావడం, భారతదేశానికి స్వాతంత్ర్యం యివ్వడానికి నిర్ణయించడంతో ఉద్యమము నిలబడిపోయింది. 1944లో నాయకులంతా విడుదల అయ్యారు.

1947 ఆగష్టు 15వ తేదీన దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆంధ్రరాష్ట్రం సాధించాలని ఆందోళన సాగింది. పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ ఫలితంగా 1953 అక్టోబరు 1వ తేదీన ఆంధ్ర కర్నూలు రాజధానిగా ఏర్పడింది. ఆంధ్రకేసరి ప్రకాశంగారి నాయకత్వంలో ప్రభుత్వం ఏర్పడింది. నిజాం సంస్థానానికి వ్యతిరేకంగా మరలా ఉద్యమం జరిగింది. శ్రీరామానందతీర్థ, మాడపాటి హనుమంతరావు, అధ్వర్యంలో పోరాటాలు జరిగాయి. సర్దార్ వల్లభాయ్ పటేల్ నాయకత్వంలో సంస్థానాలవిలీనాన్ని చేశారు. శ్రీ బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ప్రజాప్రభుత్వం ఏర్పడింది.

భాషా ప్రయుక్తరాష్ట్రాలుగా విభజించడంతో 1956 నవంబర్ 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరించింది. శ్రీ నీలం సంజీవరెడ్డి నాయకత్వంలో మంత్రి వర్గం ఏర్పడింది.

*(గాంధీక్షేత్రం మాసపత్రిక)*

# 4. బందరు విద్యార్థుల 1946 చారిత్రక పోరాటం

డిటెన్షన్ విధానమురద్దు చేయాలని ఏండ్లతరబడి విద్యార్థులుఆందోళన చేస్తున్నారు. ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ దీనికొరకు తీవ్రతరపోరాటాలను జరిపింది.

1946 అక్టోబరు 18వ తేదీ ఆంధ్ర విద్యార్థులంతా డిటెన్షన్ వ్యతిరేక దినం జరుపగలమని నిర్ణయించింది.

విద్యార్థి కాంగ్రెస్ పిలుపునందుకొని కార్యరంగంలో దుమికింది, మొదటగా బందరు విద్యార్థులు.

సమ్మెలో పాల్గొన్నవారు రెండురూపాయలు జరిమానాకుపాత్రులౌతారని ప్రిన్సిపలుగారు నోటీసు పంపుటచే విద్యార్థి ప్రతినిధులు వెళ్ళి రద్దుచేయ వలసిందిగా కోరారు. ప్రిన్సిపలుగారు నిరాకరించుటచే 20వ తేదీ విద్యార్థులంతా సమావేశమై సమ్మెచేయ నిర్ణయించారు. 21వ తేదీ సమ్మెప్రారంభించారు. కలెక్టరుగారువచ్చి విద్యాలయాధికారులకు, విద్యార్థీ ప్రతినిధులను సమావేశపరచి జరిమానాలను రద్దు చేయమని ప్రిన్సిపలుకు సమ్మె ఆపుదల చేయమని విద్యార్థులకు రాజీమార్గం సూచించారు. ప్రిన్సిపల్, ఆంధ్రవిద్యార్థి సమ్మతించక పోవుటచే 22వ తేదీ కూడా సమ్మె చేయాల్సి వచ్చింది. పోలీసులు పికెటింగు చేస్తూన్న విద్యార్థులను లాగివేయడంచూచి విద్యార్థినులు కూడ పికెటింగులో పాల్గొన్నఘట్టం యిదే ప్రథమం. విద్యార్థులెవ్వరు విద్యాలయాలకు పోకుండుటచే కాలనిర్ణయము లేకుండా విద్యాలయాలను మూసివేశారు. అనేక రాయబారాలకు విద్యార్థులు ప్రయత్నించినా ప్రిన్సిపలు సమ్మతింపకపోవుటచే నవంబరు 4వ తేదీ కాలేజీలను తెరచినప్పటికీ సమ్మెచేయవలసి వచ్చింది. వర్షం కురుస్తున్నప్పటికి విద్యార్థులు సమ్మెను కొనసాగించారు. 19 మంది విద్యార్థినులు గేటులో పికెటింగు చేస్తూ కూర్చున్నారు. తలవనితలంపుగా నిష్కారణంగా పోలీసులు లాఠీచార్జిచేశారు. విద్యార్థినులకు విద్యార్థులకు బలమైన గాయాలు తగిలాయి. రిజర్వు దళంతో వచ్చి తుపాకులతో నాట్యంచేసి తరువాత 75 మంది విద్యార్థులను అరెస్టుచేసి జైలుకు తీసుకొనివెళ్ళారు.

జైలులో ఉన్నంతసేపు ఆలీపూర్ జైలుమరపించింది. సుంకర సత్యనారాయణ, కనకమేడల వెంకట్రామయ్య, త్రిపురనేని వెంకటేశ్వరరావు, కలపాల సుబ్బారావుగార్ల ను తప్ప మిగిలిన వారిని విడుదలచేశారు. తర్వాత వారినికూడా విడుదల చేశారు. 6వ తేదీ కాళేశ్వరరావుగారు జిల్లాఅధికార్ల జోక్యంతో రాజీకుదురుటచే 7 వ తేదీనుండి కాలేజీకి విద్యార్థులు వెళ్ళారు.

సెలక్షన్ పరీక్షలలో 21 మందిని డిటైన్‌చేసి 200 మందికి వార్నింగు ఇచ్చి మరల పరీక్షలు పెట్టుతామన్నారు. డిటైన్ చేసిన వారిని పంపవలసిందిగా రాయబారాలు పంపారు. ప్రిన్సిపలువైఖరి మారకపోవుటచే జనవరి 22వ తేదీ నుండి మరల సమ్మె ప్రారంభమైనది.

26వ తేదీ –1 మంది విద్యార్థులు నిరశనవ్రతం చేశారు. నిరశనవ్రతం చేస్తున్న విద్యార్థి శంకరరావుకు ప్రమాదపరిస్థితి ఏర్పడింది.

నిరశనవ్రతం చేస్తున్న విద్యార్థులకు ప్రమాద మేర్పడుటచే కలెక్టరుగారు జోక్యం కలిగించుకొని రాజీచేయుటచే వారిమాట నమ్మి విద్యార్థులు నిరశన వ్రతం మానివేశారు.

*(ఆంధ్ర విద్యార్థి 1948)*

# 5. భారత రాజ్యాంగం - పూర్వాపరాలు

**1946**లో డాక్టర్ రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన భారత రాజ్యాంగపరిషత్ రూపొందించిన భారత సర్వసత్తాక, ప్రజాస్వామిక, రిపబ్లిక్ రాజ్యాంగాన్ని 1950 జనవరి 26వ తేదీన అమలు జరుపుకొన్నాం. 350 సంవత్సరాలలో వివిధ చట్టాలు రూపాలుపొంది చివరకు ఈ రాజ్యాంగము ఏర్పడినది.

1600లో ఎలిజబెత్ రాణి చార్టర్ అనుమతితో తూర్పు ఇండియా కంపెనీ వ్యాపారం నిమిత్తం భారతదేశంలో అడుగుపెట్టారు. కంపెనీ వ్యవహారాలను అదుపుచేయడానికి 1773 రెగ్యులేటింగ్ చట్టాన్ని బ్రిటిష్ పార్లమెంటు ఆమోదించినది. హిందువులు- మహమ్మదీయులు మతపరంగా చేసిన చర్యలు క్రిమినల్ నేరంగా పరిగణించకుండా, వారి హక్కులను గౌరవించడానికి 1781లో గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్ సలహా మేరకు బ్రిటిష్ పార్లమెంటు మరొక శాసనాన్ని చేసినది.

### 1784 పిట్ ఇండియా చట్టం.

రెగ్యులేటింగ్ చట్టాలలోని లోపాలను సవరిస్తూ 1784లో పిట్ ఇండియా చట్టాన్ని చేశారు. ఆరుగురు కమీషనర్లతో కంట్రోలుబోర్డు ఏర్పడింది. ప్రత్యేకంగా ఇండియా వ్యవహారాలకు బ్రిటిషు ప్రభుత్వంతో ఒక రాజ్యకార్యదర్శి, కోశాధ్యక్షుడు నియమించబడినారు. 1793, 1813, 1833, 1853 ఇరువది సంవత్సరాల కొకసారి కంపెనీ వ్యవహారాలను పరిశీలిస్తూ బ్రిటిష్ పార్లమెంటు చార్టరు చట్టాలను సవరిస్తూ, కంపెనీని కంట్రోలుచేస్తూ వచ్చింది.

### ప్రథమ స్వాంతంత్ర్య సంగ్రామం

1774 నుంచి 1857 వరకు ఆంగ్లేయులు భారతదేశమంతా అధీనం చేసుకొన్నారు. వారి రాజ్యాంగకాంక్ష, ఆక్రమణతీరు ప్రజలలో, సంస్థానాధీశులలో, సైనికులలో అసంతృప్తి పెరిగినది. తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి. 1857లో సిపాయీల తిరుగుబాటు తీవ్రస్థాయిలో జరిగింది. అధునిక ఆయుధాలు కలిగిన

బ్రిటిషు సైన్యం తిరుగుబాటు అణచివేసినది. ఇదే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా పేర్కొంటున్నాం.

1857 భారత ప్రభుత్వ చట్టం ఈ సంగ్రామం ఫలితంగా బ్రిటిష్ పార్లమెంటు 1857లో భారత ప్రభుత్వ చట్టాన్ని చేసినది. కంపెనీ పరిపాలన అంతమొంది భారతదేశంలో బ్రిటిషు ప్రభుత్వ ప్రత్యక్షపాలన ప్రారంభం అయినది. గవర్నర్ జనరల్ (వైస్రాయి) భారతరాజ్య కార్యదర్శి, పార్లమెంటు ద్వారా చక్రవర్తి ఒకరిపై ఒకరు పెత్తనం చలాయించడానికి అధికారం స్వీకరించారు. భారతదేశంలో కేంద్ర, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వాలు వుంటాయి. వైస్రాయి సర్వాధికారి అయ్యారు.

## విక్టోరియా రాణి ప్రకటన

1858 నవంబరు 1వ తేదీన బ్రిటిష్ మహారాణి విక్టోరియా ప్రకటన చేస్తూ, కంపెనీ పరిపాలనను స్వాధీనం చేసుకొన్నట్లు ప్రకటించి, లార్డ్‌కానింగ్‌ను, ప్రథమ వైస్రాయిగా నియమించారు. స్వదేశ సంస్థానాలతో కంపెనీ చేసుకొన్న ఒప్పందాలను అమలుపరచడానికి, మతపరమైన వ్యవహారాలలో జోక్యం చేసుకోకుండా వుండడానికి, ఉద్యోగవ్యవహారాలలో తేడాలేకుండా మేధావంతులందరికీ సమాన అవకాశాలు కల్పించడానికి, భారతదేశాన్ని అన్ని విధాలా అభివృద్ధిపరచడానికి రాణి హామీ ఇస్తూ ప్రకటనచేశారు. ఈ హామీ కాగితాలపైనే వుండిపోయింది. అయితే భారతీయ రాజ్యాంగ పరిణామానికి నాందిపలికింది. జాతీయ కాంగ్రెస్ స్థాపించడం జరిగింది.

దేశంలో వివిధ పట్టణాలలో చేస్తున్న స్థానిక సంఘాల ప్రతినిధులు, పెద్దలు 1885 డిశంబర్28,29 తేదీలలో ముంబైలో సమావేశమయ్యారు. ప్రజల సమస్యలను ప్రభుత్వం దృష్టికి తీసికురావడానికి భారత జాతీయ కాంగ్రెస్‌ను స్థాపించారు. ప్రజలలో వచ్చిన అసంతృప్తి పెరిగింది. రైలు, పోస్టల్, టెలిగ్రాఫ్ సౌకర్యాలు రావడంతో వివిధ ప్రాంతాలవారు కలుసుకోవడానికి, జాతీయ భావం పెరగడానికి అవకాశం కలిగింది.

## 1861 శాసనాల చట్టం

ప్రజలలో వచ్చిన చైతన్యం, పెరుగుతున్న అసంతృప్తిని గమనించి 1861 శాసన సభల చట్టాన్ని పార్లమెంట్ ఆమోదించింది. గవర్నర్ జనరల్ కార్యాలయంలో నిర్వాహక వర్గంలో 12 మంది సభ్యులకు పెంచి అనధికారులను వేసుకొనుటకు అధికారమిచ్చింది. బెంగాల్, పంజాబ్, మద్రాసు, నార్తు వెస్ట్ రాష్ట్రాలలో శాసనమండలులను సలహాలు ఇవ్వడానికి ఏర్పాటుచేశారు. ఇది సంతృప్తి కలిగించలేదు.

ఎక్కువమంది భారతీయుకు ప్రాతినిధ్యం కావాలని భారత జాతీయ కాంగ్రెస్ విజ్ఞప్తి చేసినది. వైస్రాయి ఎగ్జిక్యూటివ్ సభ్యుల సంఖ్యను పెంచడానికి, అనధికారులను 2/5 వంతు వేయడానికి, రాష్ట్ర కౌన్సిల్ సంఖ్యను పెంచి, కేంద్ర కౌన్సిల్‌కు ఒక్కొక్కసభ్యుని ఎన్నికచేసుకోవడానికి, బడ్జెట్‌పై చర్యకు, ప్రశ్నలు వేయడానికి అవకాశం కలిగిస్తూ 1892లో భారతీయ కౌన్సిల్ చట్టాన్ని సవరించారు.

**1909 శాసన సభల చట్టం**

"స్వరాజ్యం నా జన్మహక్కు" అని బాలగంగాధరతిలక్ గర్జించడం, లాలా లజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్ (లాల్, బాల్ పాల్) ముగ్గురూ దేశమంతా తిరిగి ప్రజలలో చైతన్యం కలిగించడం, కర్జన్ ప్రభువు బెంగాల్‌ను విభజించాలనే ప్రతిపాదనలకు వ్యతిరేకంగా ప్రజలలో ఆందోళన, వందేమాతర ఉద్యమం వలన స్వదేశీ అభిమానం పెరగడం, దేశంలో కరువు వలన ప్లేగు, మలేరియా, ఇన్‌ఫ్లూయంజా వ్యాధులవలన లక్షలాది ప్రజలు చనిపోవడం వలన ప్రజలలో తీవ్ర అసంతృప్తి పెరగడం గమనించి భారత రాజ్య కార్యదర్శి మోర్లే, గవర్నర్ జనరల్ మింటో సంప్రదించి మోర్లే, మింటో సంస్కరణల పేరుతో 1909 శాసనసభల చట్టం తీసుకురావడం జరిగింది.

కేంద్ర శాసన సభలో సంఖ్యను 60 మందికి పెంచి 28 మంది అధికారులు, 32 మంది అనధికారుల్లో, 5 నామినేషన్లు, 27 ఎన్నికలలో జనరల్ నియోజక వర్గాల నుంచి 13, ఇరువురు ప్రత్యేకంగా, 6 గురు భూస్వాముల, 6 గురు ముస్లిం నియోజక వర్గాలనుండి ఎన్నుకోవాలి. గవర్నర్ జనరల్, 7గురు ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ మొత్తం కేంద్ర శాసనసభ 68 మంది అయ్యారు. బడ్జెట్ మీద ఓటింగుకు అవకాశం ఇవ్వడం జరిగింది. అలాగే రాష్ట్ర శాసన సభల సభ్యులను పంజాబ్, బర్మాకు 30 మందినీ, బెంగాల్, తూర్పు బెంగాల్, అస్సాం, యు.పి.లకు 50 మంది వంతున పెంచారు. బెంగాల్, మద్రాస్, బొంబాయి రాష్ట్రాలకు 4గురు వంతున ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌కు పెంచారు.

**1919 భారత ప్రభుత్వ చట్టం**

1909 చట్టం ప్రజలను సంతృప్తి పరచలేదు. రాజకీయ ఆందోళన అణచుటకు సాధ్యం కాలేదు. తీవ్రవాదుల కార్యకలాపాలు పెరిగాయి. అనీబిసెంట్ ఆధ్వర్యంలో హోంరూల్ ఉద్యమం సాగుతోంది. 1916లో కాంగ్రెస్ ముస్లిం ప్రతినిధులు సమావేశమై

రాజకీయ సంస్కరణలకు 19 సూచనలు చేసి ప్రజల అసంతృప్తిని తెలియజేశారు. కాంగ్రెస్, ముస్లింలీగ్ పొత్తు ఒడంబడిక చేసుకొన్నాయి. గవర్నర్ జనరల్ ఛేమ్సుఫర్డు నివేదిక ఆధారంగా భారతరాజ్య కార్యదర్శి మాంటేంగు క్రమక్రమంగా బాధ్యతాయుత ప్రభుత్వానికి అవకాశం ఇస్తానని ప్రకటించారు. మాంటేగు- ఛేమ్సుఫర్డ్ సంస్కరణల పేరుతో 1919 భారత ప్రభుత్వ చట్టం తెచ్చారు. గవర్నర్ జనరల్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో భారతీయుల సంఖ్యను 8 మందిలో 3కి ఇవ్వడం, గవర్నర్ జనరల్ అధికారం, జీతాల పెంపు చేశారు.

కేంద్ర శాసన సభను, రాజ్యసభ, శాసనసభ అని రెండుగా చేశారు. రాజ్యసభ 60 మందిలో 26 నామినేటెడ్, ఎన్నిక 34; 20 జనరల్, 10 ముస్లిం, యూరోపియన్స్ 3, సిక్కు 1 వుంటారు. శాసన సభ 145లో నామినేటెడ్ 41; 104 మంది ఎన్నికలలో జనరల్ 52, ముస్లిమ్‌లు 30, సిక్కులు2, భూస్వాములు 7, యూరోపియన్లు 6, వాణిజ్యసంస్థలు 4గురు ఎన్నికవుతారు. కౌన్సిల్ 5 సంవత్సరాలు, అసెంబ్లీ 3 సంవత్సరాలు కాలపరిమితి. శాసన సభ అధికారాలు పెంచారు.

రాష్ట్రాలలో ఎక్జిక్యూటివ్ కౌన్సిల్‌తో ప్రజా ప్రతినిధుల మంత్రులు ఉంటారు. రెండింటికీ గవర్నర్ అధ్యక్షులు. శాసన సభకు మంత్రులే బాధ్యులు. రాష్ట్ర వ్యవహారాలను విభజన చేశారు. శాసన సభ్యుల సంఖ్య పెంచబడినది. ఈ ద్వంద్వపరిపాలన 1921 నుంచి 1937 వరకు సాగింది.

కాంగ్రెస్ గాంధీ నాయకత్వంలో సహాయనిరాకరణోద్యమం ప్రారంభించింది. కోర్టులు, విద్యాసంస్థలు, విదేశీ వస్తువులను బహిష్కరించుట, ఎన్నికలలో పాల్గొనకూడదని కాంగ్రెస్ నిర్ణయించింది. స్వదేశీ ఉద్యమం ప్రారంభం అయింది. 20వేల చరఖాలు తయారుచేశారు. కోటి రూపాయల నిధిని వసూలు చేశారు. సి.ఆర్.దాసు అధ్యక్షతన జరిగిన గయ కాంగ్రెస్ సభలో ఎన్నికలలో పాల్గొనాలనే తీర్మానానికి వ్యతిరేకంగా 1740, అనుకూలంగా 290 ఓట్లు వచ్చాయి. శ్రీ సి.ఆర్.దాసు రాజీనామా ఇచ్చారు.

## ఎన్నికలు- స్వరాజ్యపార్టీ- 1924

శ్రీ సి.ఆర్.దాసు, శ్రీ మోతీలాల్ నెహ్రూ, శ్రీ హకీం హజ్మల్‌ఖాన్ స్వరాజ్య పార్టీని ఏర్పాటుచేసి ఎన్నికలలో పాల్గొన్నారు. 145 మంది గల కేంద్రశాసన సభలో స్వరాజ్యపార్టీ 40 మంది, జిన్నా నాయకత్వంలో 24 మంది కలిసి నేషనలిస్టుపార్టీగా

ఏర్పడ్డారు. 8-2-1924న జాతీయ పార్టీ నాయకుడు శ్రీ మోతాలీల్ నెహ్రూ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయాలని కోరుతూ తీర్మానించే ప్రతిపాదన ఆమోదించబడింది. దీనిమీద కూడా బ్రిటిష్ ప్రభుత్వం చర్యలు తీసుకోలేదు. 1925-26, 1926-27 బడ్జెట్లను కేంద్రశాసన సభ తిరస్కరించింది. అయినా గవర్నర్ జనరల్ ఆమోదించారు. 1919 చట్టాన్ని సవరించడానికి హోం మెంబరు అధ్యక్షతన కమిటీ వేశారు. జాతీయవాదులు తేజ్ బహదూర్ సప్రూ నాయకత్వంలో మైనారిటీ రిపోర్టు యిచ్చారు. బ్రిటన్‌లో లేబర్‌పార్టీ సభ జాతీయ వాదుల రిపోర్టును బలపరిచింది.

స్వరాజ్య పార్టీ తరఫున అలహాబాద్ కార్పొరేషన్‌కు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, అహ్మదాబాదుకు శ్రీ వల్లభాయిపటేల్, కలకత్తాకు శ్రీ సి.ఆర్.దాసు మేయర్లుగా ఎన్నికయ్యారు. పరిస్థితులను పరిశీలించడానికి సైమన్ కమీషన్ వస్తే కాంగ్రెస్ నల్లజండాలు చూపి వారిరాకను బహిష్కరించింది.

## పూర్ణ స్వరాజ్ తీర్మానం -1930

లాహోర్‌లో శ్రీ జవహర్‌లాల్ అధ్యక్షతన తేది 21.12.1929న కాంగ్రెస్ సమావేశమై పూర్ణస్వరాజ్యం కావాలని తీర్మానించినది. 1930 జనవరి 1వ తేదీన స్వతంత్ర భారత కాంగ్రెస్ జెండాను ఎగురవేసి "వందేమాతరం- మనదే రాజ్యం", "ఇంక్విలాబ్ జిందాబాద్" అనే నినాదాలతో మహాసభ మారుమ్రోగింది. తేది. 6.04.1930న గాంధీజీ దండిలో ఉప్పు సత్యాగ్రహాన్ని ప్రారంభించారు. దేశమంతా సత్యాగ్రహం ఉద్ధృతంగా సాగింది. వేలాదిమంది అరెస్టులు అయ్యారు. ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా ఉద్యమాన్ని అణచివేయడానికి చర్యలు తీసుకొన్నది. మదన మోహన మాలవ్యా, కాంగ్రెసు సభ్యులు శాసన సభలకు రాజీనామా చేశారు. విఠలబాయిపటేల్ శాసన సభాధ్యక్షపదవికి రాజీనామా చేశారు. 1931 మార్చి 5వ తేదీన గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ప్రకారం సహాయనిరాకరణోద్యమం నిలుపుదలచేయడం, రౌండు టేబుల్ సమావేశానికి హాజరు కావడం, రాజకీయ ఖైదీలను విడుదలచేయడం, విధించిన జరిమానాలను తిరిగి ఇవ్వడం, కొన్ని ప్రాంతాలలోని ప్రజలు ఉప్పు తయారు చేసుకోడానికి, అమ్ముకోడానికి వాడుకోడానికి అనుమతి ఇవ్వడం జరిగింది. గాంధీజీ రౌండ్ టేబుల్ సమావేశానికి వెళ్ళారు. ఫలితం లేకపోయింది. 1932 జనవరిలో కాంగ్రెస్ వర్కింగు కమిటీ సమావేశమై సహాయనిరాకరణోద్యమాన్ని తిరిగి ప్రారంభించడానికి తీర్మానించారు. 1,20,000 మంది అరెస్టు అయ్యారు. మహోద్ధృతంగా సత్యాగ్రహం జరిగింది.

## కమ్యునల్ అవార్డు - 1932

సైమన్ కమీషన్ రిపోర్టును పరిశీలించి బ్రిటిషు ప్రధాని మాక్డొనాల్డ్ 1932లో ప్రకటించిన కమ్యునల్ అవార్డు ప్రకారం నిమ్నజాతులకు, క్రిష్టియన్లకు, యూరోపియన్లకు, ఇంతకు ముందు ముస్లింలకు ఇచ్చిన ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేశారు. మహిళలకు ప్రత్యేక ప్రాతినిధ్యం లభించింది.

ఎవరికి వారిని విడిదీసి భారతజాతి సమైక్యాన్ని దెబ్బతీయడానికి ఉద్దేశించిన కమ్యునల్ అవార్డును వ్యతిరేకిస్తూ ఎరవాడ జైలులోనిర్బంధంలోవున్న గాంధీజీ ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు. ప్రభుత్వం కదలలేదు. గాంధీజీ ఆరోగ్యం క్షీణిస్తూంది. ప్రజలు అందోళన చెందుతున్నారు. మదన మోహన మాలవ్యా, డా॥ బి.ఆర్. అంబేద్కర్ పూనాలో సమావేశమై గాంధీజీతో చర్చించి నిమ్నజాతులకు ప్రత్యేక నియోజక వర్గాలు లేకుండా జనరల్ నియోజక వర్గాలలో కొన్నింటిని రిజర్వుచేసే విధానానికి అంగీకరించారు. గాంధీజీ నిరాహార దీక్షను విరమించారు. 1934లో విడుదలయ్యారు. కాంగ్రెస్పై నిషేదాజ్ఞలను తొలగించారు.

## ఇండియా పరిపాలన చట్టం- 1935

భారత జాతీయకాంగ్రెస్ ఉద్యమాలను, తీర్మానాలను, మూడో రౌండు టేబుల్ సమావేశాల సూచనలను, దృష్టిలోపెట్టుకొని రాజ్యాంగసూత్రాలను పరిశీలించడానికి బ్రిటిష్ పార్లమెంటు 16 మంది సభ్యులతో జాతీయ సెలెక్టు కమిటీని లార్డ్ లిక్‌లిత్‌గో అధ్యక్షతన నియమించినది. ఆ కమిటీ చర్చలు జరిపి 1934 నవంబర్ 22వ తేదీన పార్లమెంటుకు సమర్పించినది. ఆ నివేదిక ఆధారంగా బ్రిటిష్ పార్లమెంట్ "ఇండియా పరిపాలన చట్టం-1935" పేరుతో చట్టాన్ని చేసింది. దాని ప్రకారం స్వదేశీ సంస్థానాలు, బ్రిటిషు ఇండియా రాష్ట్రాలు ఒక రాజకీయ ప్రతిపత్తి కిందకు రావడం, రాష్ట్రాలలో విధంగా ప్రజాస్వామ్యపద్ధతులను స్వదేశ సంస్థానాలలో ప్రవేశపెట్టడం, కేంద్రప్రభుత్వ అధికారాలను కొన్నింటిని రాష్ట్రాలకు ఇవ్వడం, కేంద్రంలో, రాష్ట్రాలలో కొంతవరకు బాధ్యతాయుత ప్రజా ప్రభుత్వాలను ఏర్పాటుచేయడం, ఫెడరల్ రాజ్యాంగ విధానం, ఫెడరల్ కోర్టులను ఏర్పాటు చేయడానికి చట్టం చేశారు. భారత జాతీయ కాంగ్రెస్ ఆశయాలను కొంతవరకు అంగీకరించాలని చెప్పవచ్చు.

## కాంగ్రెస్ ప్రభుత్వాలు- 1937

1935 ఇండియా చట్టం ప్రకారం 1937లో తొలిసారిగా దేశవ్యాప్తంగా జరిగిన ఎన్నికలలో ఏడురాష్ట్రాలు కాంగ్రెస్ పరిపాలనకు, పంజాబ్, బెంగాల్‌లో ముస్లిం లీగుకు, అస్సాం, సింధులో సంకీర్ణ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. రైతులకు రుణవిముక్తి, కుటీర పరిశ్రమల అభివృద్ధి, మధ్యనిషేధం వంటి ప్రజా సంక్షేమ కార్యక్రమాలను కాంగ్రెస్ ప్రభుత్వాలు చేపట్టాయి.

1939లో జర్మనీలో రెండవ ప్రపంచ యుద్ధంలో భారతదేశ సైన్యాన్ని కూడా బ్రిటన్ దించింది. భారత సైనికులు, డబ్బును వినియోగించినది. భారత ప్రజలను సంప్రదించకుండా కష్టనష్టాలకు గురిచేసినందుకు నిరసనగా కాంగ్రెసు మంత్రి వర్గాలు రాజీనామా చేశాయి. 1940 మార్చిలో ముస్లిం లీగు లాహోర్‌లో సమావేశమై పాకిస్తాన్ కావాలని తీర్మానించినది. యుద్ధానికి భారతీయుల సహాయం పొందడానికి బ్రిటను అనేక రకాలుగా చేసిన ప్రతిపాదనలను జాతీయ కాంగ్రెస్ తిరస్కరించింది. జపాన్ యుద్ధంలో దిగింది. కాకినాడ, విశాఖపట్టణాలలో బాంబులు వేసింది. స్వాతంత్ర్యం తప్ప మరొక మార్గంలేదని కాంగ్రెస్ తీర్మానించింది. క్రిప్పురాయభారం విఫలమయింది. బ్రిటిషువారు ఇండియాను వదిలి వెళ్ళిపోవాలని 1942 ఆగష్టు 9వ తేదీన ముంబైలో కాంగ్రెస్ తీర్మానం చేయడం, కాంగ్రెస్ సంస్థ నిషేధించి, కాంగ్రెస్ వాదులందరిని నిర్బంధించడంతో దేశమంతా అందోళన సాగింది. శ్రీ సి.రాజగోపాలా చార్యులు, శ్రీ వేరేల్ చేసిన ప్రతిపాదనలు తిరస్కరించబడ్డాయి. దేశాయి-లియా పాక్టనుకూడా అంగీకరించలేదు.

1945 జూలైలో చర్చిల్ ప్రభుత్వం ఓడిపోయి, అట్లే ప్రధానిగా లేబరుపార్టీ అధికారంలోకి వచ్చింది. ప్రజాభిప్రాయ సేకరణకు ఎన్నికలు జరిపారు. 8 రాష్ట్రాలలో కాంగ్రెసు, రెండు రాష్ట్రాలలో ముస్లీంలీగు, పంజాబులో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడ్డాయి. 1946లో బ్రిటిషు పార్లమెంటు ప్రతినిధివర్గం భారతదేశ పరిస్థితులను పరిశీలించి వెంటనే స్వాతంత్ర్యం ఇవ్వాలని సిఫార్సు చేసింది. బ్రిటిష్ ప్రభుత్వ మంత్రులు పెథిక్ లారెన్స్, క్రిప్పు, అలగ్జాండర్ కాబినెట్ మిషన్‌గా ఇండియాకువచ్చి పరిస్థితులను తెలుసుకొని భారతసమైక్యత ఏర్పడాలని, పాకిస్తాన్ ఇవ్వరాదని, రాజ్యాంగం రచించడానికి రాజ్యాంగపరిషత్తు ఏర్పడాలని, స్వాతంత్ర్యం ఇవ్వాలని కాబినెట్ మిషన్ రికమెండ్ చేసింది. ముస్లీంలీగ్ కాబినెట్ మిషన్ ప్లాను తిరస్కరించింది. తరువాత మౌంట్ బాటన్ ప్లాను ప్రకారం రాజ్యాంగపరిషత్తుపని కొనసాగాలి. పంజాబ్, బెంగాల్,

సింధు, బెలుచిస్థాన్ వాయువ్యరాష్ట్రం, సిల్హెట్ జిల్లా ఇండియన్ యూనియన్‌లో ఉండటమా, లేదా ఓటింగ్ ద్వారా నిర్ణయించుకోవాలి. దీనికి కాంగ్రెసు, లీగు అంగీకరించాయి.

**భారత స్వాతంత్ర్య చట్టం- 1947**

1947 భారత స్వాతంత్ర్య చట్టం ప్రకారం ఇండియా, పాకిస్తాన్ రెండు దేశాల ఏర్పాటుకు, స్వదేశ సంస్థానాలపై అధికారం వదులుకోవడం, వేర్వేరు రాజ్యాంగ పరిషత్తుల ఏర్పాటు జరిగాయి. 1946 డిశంబర్‌లో భారత రాజ్యాంగ పరిషత్తు డాక్టర్ రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన ఏర్పడి, పండిట్ నెహ్రూ, డాక్టర్ అంబేద్కర్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, కె.యం.మున్షీ, బి.ఎస్.రావు మొదలయిన ప్రముఖులు రెండు సంవత్సరాలు చర్చించి భారతరాజ్యంగాన్ని రూపొందించారు. భారతదేశ ప్రధానమంత్రి, మంత్రులు వారి సలహాలతో రాష్ట్రపతి నడచేటట్లు, చట్టాలు చేయడానికి లోక్‌సభ, రాజ్యసభల ఏర్పాటు, రాష్ట్రాలలో గరవ్నర్లు, ముఖ్యమంత్రి, మంత్రులు, శాసనసభ, కొన్నిచోట్ల శాసన మండలి ఏర్పాటవుతున్నాయి. 21 సంవత్సరాలు నిండితే వయోజన ఓటింగు హక్కు, 25 సంవత్సరాలు నిండితే ప్రతినిధులుగా ఎన్నికకు అవకాశం వచ్చింది. ప్రాథమిక హక్కులలో సమానత్వపుహక్కు, స్వాతంత్ర్యపుహక్కు, మత స్వాతంత్ర్యం, ఆస్తిహక్కు, సాంస్కృతిక, విద్యావిషయక హక్కు, రాజ్యాంగ పరిహారపు హక్కులు ఇవ్వబడ్డాయి. కేంద్ర, రాష్ట్రాలలో కార్యనిర్వాహకశాఖ, శాసననిర్మాణ శాఖ, న్యాయశాఖ అనే మూడు అంగాలు ఉంటాయి. కేంద్ర, రాష్ట్ర అధికారాలు విభజించబడ్డాయి. అత్యుత్తమమైన ప్రజాస్వామిక, సామ్యవాద రాజ్యాన్ని ఏర్పాటు చేసుకొన్నాం. భారతరాజ్యంగ చరిత్ర ఎక్కువగా భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రతో ముడిపడి ఉంది.

*(గాంధీక్షేత్రం మాసపత్రిక)*

# 6. భారతదేశ భవిష్యత్తును తీర్చిదిద్దే మధ్యంతర ఎన్నికలు కాంగ్రెసు సంఘముల బాధ్యతలు! కార్యకర్తల కర్తవ్యం!

లోకోత్తర, మహత్తర సత్యాగ్రహ పోరాటముల నడిపించి, స్వరాజ్యాన్ని సాధించి, వచ్చిన రాజ్యాన్ని ప్రజలపరం చేసిన జాతిపిత మహాత్మాగాంధీజీ యిలా అన్నారు "రాజ్యంకాని, స్వర్గముకాని, మోక్షముకాని నాకు అక్కర్లేదు, నేను కోరునది "ఆర్తి నాశనం". ప్రజల బాధలను తొలగించి, సుఖశాంతులను చేకూర్చుట స్వరాజ్య సాధన లక్ష్యమని, ప్రతివారికి తినటానికి తిండి, కట్టుకోవడానికి గుడ్డ, ఉండటానికి యిల్లు, విద్య, ఆరోగ్యం మొదలగు కనీస వసతులను కలుగచేయుట మన విధి అని గాంధీజీ హెచ్చరించారు. స్వాతంత్ర్య పోరాటములతోపాటు పేద ప్రజల జీవనోపాధిని పెంపొందించుటకు, దేశ ఆర్థిక అభ్యున్నతికి నిర్మాణ కార్యక్రమములను గాంధీజీ నిర్వహించారు.

**కరాచీ తీర్మానములు**

స్వరాజ్యము వచ్చిన తరువాత దేశంలో రాజకీయ ఆర్థిక ప్రగతికి తీసుకొనవలసిన చర్యలను గురించి 1931లో కరాచీలో జరిగిన కాంగ్రెసు మహాసభలో చర్చించి తీర్మానములు చేసి యున్నారు. ఏవిధమైన ప్రాథమిక పౌరసత్వ హక్కులుండాలో, ఆర్థిక అసమానత్వములు తొలగించుటకు ఏ కార్యక్రమాలు అమలు జరపాలో వివరిస్తూ సుదీర్ఘమైన తీర్మానములను మహాసభలో ప్రతిపాదిస్తూ శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ సామ్యవాదస్థాపనకు పునాదులు వేశారు. కరాచీ తీర్మానం ఆధారంగానే 1955లో ఆవడి కాంగ్రెసు మహాసభలో సోషలిస్టు తరహా సమాజ స్థాపనకు, 1959 నాగపూర్ మహాసభలో సహకార వ్యవసాయ కార్యక్రమాలకు, 1964 భువనేశ్వర్ కాంగ్రెసులో సోషలిస్టు పద్ధతిని విపులీకరిస్తూ తీర్మానములు ఆమోదించబడినాయి.

ప్రధానిగా శ్రీ నెహ్రూ పంచవర్ష ప్రణాళికలను రూపొందించి అమలు పరచి, దేశంలో ప్రజాస్వామిక సోషలిజం లక్ష్యంగా ఆర్థిక ప్రగతికి కృషి చేశారు. తరువాత శ్రీ లాల్ బహద్దూర్ శాస్త్రి ప్రధానిగావున్న కొద్దికాలంలో అతి ధైర్య సాహసములతో క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొని భారత కీర్తిని యినుమడింప చేశారు.

శ్రీమతి ఇందిరాగాంధి ప్రధాని అయిన నాటి నుండి దేశంలో పేదరికమును తొలగించుటకు, నిరుద్యోగ నిర్మూలనకు, సమసమాజ నిర్మాణమునకు, అనేక అభ్యుదయ, అభివృద్ధికర సంస్కరణలను అమలు జరుపుటకు తీవ్రమైన ప్రయత్నం ప్రారంభించారు. కాంగ్రెసులోని మితవాద, అభివృద్ధి నిరోధక శక్తులకు చెందిన కొంతమంది ఆటంకములు కల్పించ ప్రారంభించారు.

**దశసూత్ర ప్రణాళిక**

దేశంలో పెరుగుతున్న అసంతృప్తిని తొలగించుటకు శ్రీమతి ఇందిరాగాంధి ఆలోచనల ఆధారంగా 1966 జూన్‌లో న్యూఢిల్లీలో జరిగిన ఎ.ఐ.సి.సి. దశసూత్ర ప్రణాళికను రూపొందించి, ఆమోదించింది.

1. సమాజము అవసరాలను తీర్చేవిధంగా బ్యాంకులపై సోషల్ కంట్రోలు విధించుట.
2. జనరల్ ఇన్సూరెన్సును పబ్లిక్ రంగంగా మార్చుట.
3. ఎగుమతులు, దిగుమతులను ప్రభుత్వ సంస్థలు నిర్వహించుట.
4. ఆహార పదార్థములను సరఫరా చేయుటకు ప్రభుత్వ సంస్థలు సహకార సంస్థలను వినియోగించుట.
5. నిత్యావసర వస్తువులను సరసమైన ధరలకు సరఫరా చేయుట.
6. గుత్తాధిపత్యమును తొలగించుటకు చర్యలు తీసికొనుట.
7. 1975 నాటికి ప్రజలకు కనీస అవసరములను చేకూర్చుట.
8. పట్టణ ఆస్తులపై పరిమితులను విధించుట.
9. జీవనోపాధిని పెంపొందించు పథకములను రూపొందించి గ్రామాలలో అమలు జరుపుట. నిరుద్యోగ నిర్మూలనకు చర్యలు తీసుకొనుట.
10. మాజీ సంస్థానాధీశుల భరణములను, హక్కులను తొలగించుట.

ఈ దశసూత్ర ప్రణాళికను అమలు జరుపవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ కాంగ్రెసు తీర్మానించింది. శ్రీ నిజలింగప్ప అధ్యక్షతన జరిగిన కాంగ్రెసు సభలో చేయబడిన ఈ తీర్మానమును కేంద్ర ప్రభుత్వములోనున్న శ్రీ నిజలింగప్ప అనుయాయులు అమలు పరచుటలో అవరోధములను కల్గించారు. కాంగ్రెసు చేసిన తీర్మానములు అమలు చేయలేక పోవుటచే ప్రజలలో కాంగ్రెసుపై విశ్వాసము సడలింది. కాంగ్రెసు సంస్థ ప్రజలకు దూరమై

పోతున్నది. 1967 జనరల్ ఎన్నికలలో కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసు ఓటమికి గురి అయింది. పార్లమెంట్‌లో బలము తగ్గింది. ప్రజాస్వామిక సోషలిజం స్థాపించాలనే మహోన్నత ఆశయం పెట్టుకొన్నా, దేశ ఆర్థిక ప్రగతికి మూడు ప్రణాళికలు అమలు జరిపి పారిశ్రామిక అభివృద్ధికి కృషి చేసినా, ప్రజలకు కావలసిన కనీస అవసరములను తీర్చలేక పోవడము, నిరుద్యోగము, పెచ్చు పెరుగుతున్న ఆర్థిక అసమానత్వములతో దేశంలో అసంతృప్తి పెరిగింది.

**కాంగ్రెసులో చీలికలు**

ప్రజల అసంతృప్తిని తొలగించి, సుఖశాంతులను చేకూర్చుటకు అభ్యుదయకర సంస్కరణలను అమలు పరచవలయునని ప్రధాని ఇందిరాగాంధి సూచించగా, శ్రీ నిజలింగప్ప అనుయాయులు నిరోధించుట ప్రారంభించారు. కాంగ్రెసు ఆమోదించిన దశసూత్ర పథకము అమలుకు ఆటంకం కల్గించుటయే గాక, బ్యాంకుల జాతీయాకరణ, మాజీ సంస్థానాధీశుల భరణముల రద్దు చేయుటకు శ్రీ మురార్జీ, శ్రీ పాటిల్ బహిరంగంగా వ్యతిరేకించారు.

ఫరీదాబాద్ కాంగ్రెసు సభలో కాంగ్రెసు అధ్యక్షులుగనున్న శ్రీ నిజలింగప్ప పబ్లిక్ రంగానికి వ్యతిరేకంగా మాట్లాడి కాంగ్రెస్ ఆశయములకు, తీర్మానములకు తిలోదకములు యివ్వ ప్రారంభించారు.

వీటినన్నిటిని దృష్టిలో పెట్టుకొని ప్రధాని ఇందిరాగాంధి నిర్దుష్టమైన ఆర్థిక పథకమును రూపొందించి 1969 జూలైలో బెంగుళూరు కాంగ్రెసుకు నివేదించారు. కార్యవర్గ సమావేశములో ఈ పథకముపై తీవ్రమైన వాదోపవాదములు జరిగాయి. చివరకు గత్యంతరములేక ఆమోదించారు.

బ్యాంకుల జాతీయాకరణకు వ్యతిరేకంగానున్న శ్రీ మురార్జీ నుండి ఆర్థిక శాఖను తీసుకొని, ప్రధాని ఇందిరాగాంధి బెంగుళూరు కాంగ్రెసు తీర్మానానుసారం బ్యాంకులను జాతీయం చేసింది. నిరసనగా శ్రీ మురార్జీ రాజీనామా చేశారు.

ప్రధానిని కించపరచే విధంగా సంప్రదాయ విరుద్ధంగా బెంగుళూరులో జరిగిన పార్లమెంటరీ బోర్డు సమావేశములో రాష్ట్రపతి పదవికి కాంగ్రెసు అభ్యర్థిని నియమించారు. రాష్ట్రపతి ఎన్నికలలో శ్రీ నిజలింగప్ప స్వతంత్ర పార్టీ, జన సంఘం మద్ధతును కోరటము జరిగింది. శ్రీ నిజలింగప్ప మితవాద ఉపన్యాసములు, స్వతంత్ర, జనసంఘములతో

నిత్యసంబంధాలు కాంగ్రెసు వాదులలో అపోహలకు, అభిప్రాయ భేదాలకు అవకాశము కల్గించి రాష్ట్రపతి ఎన్నికలో శ్రీ వి.వి. గిరికి విజయము చేకూర్చినవి.

స్వప్రయోజన, మితవాద, అభివృద్ధి నిరోధకశక్తులకు అండగా తయారయిన శ్రీ నిజలింగప్పవర్గము కక్షతో ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీని కాంగ్రెసు ప్రాథమిక సభ్యత్వమునుండి తొలగించింది. భారత స్వాతంత్ర్య సంగ్రామ సమరమునకు నాయకత్వము వహించి, నవభారత నిర్మాణమునకు పునాదులు వేసిన నెహ్రూల వారసురాలైన శ్రీమతి ఇందిరాగాంధీని కాంగ్రెసునుండి తొలగించి, శ్రీ నిజలింగప్ప నాయకత్వాన సిండికేటు చివరకు జాతీయ కాంగ్రెసును రెండుగా చీల్చుటకు దోహదం చేశారు.

ఈ విషయమును చర్చించుటకు అఖిల భారత కాంగ్రెసు సమావేశమును ఏర్పాటు చేయవలసిందిగా సభ్యులు రిక్విజిషన్ నోటీసును యివ్వగా, కాంగ్రెసు కార్యవర్గము మెజారిటీలోను ముగ్గురు సభ్యులను తొలగించి, రిక్విజిషన్ నోటీసును నియంతగా శ్రీ నిజలింగప్ప త్రోసివేశారు.

న్యూఢిల్లీలో ఎ.ఐ.సి.సి., బొంబాయిలో కాంగ్రెసు మహాసభలకు ఉమ్మడి కాంగ్రెసులోని 2/3 వంతుల మంది సభ్యులు హాజరై శ్రీమతి ఇందిరా గాంధీకి పూర్తి మద్దతును యిస్తూ తీర్మానాలు చేశారు. శ్రీ నిజలింగప్ప వర్గము అహ్మదాబాదులో వేరుగ సభలు జరుపుకొన్నారు.

శ్రీ నిజలింగప్ప సిండికేటు కోరిక యీడేరింది. కాంగ్రెసు నుండి చీలిపోయిన సిండికేటు స్వతంత్ర, జనసంఘములతో కలిసి మితవాద స్వప్రయోజనవాద, అభివృద్ధి నిరోధక "మహాకూటమి" అవతరించింది.

కాంగ్రెసులో చీలికలు కొత్తవి కావు. అప్పుడప్పుడు ఆశయములు, లేక కార్యక్రమములపై కాంగ్రెసులో అభిప్రాయభేదాలు వచ్చి, కొత్త పార్టీలు, వర్గాలు అవతరించడం, కొంత కాలము తరువాత అంతరించడం పరిపాటిగ జరుగుతున్న విషయమే!

1. ప్రప్రథమముగా 1908లో కాంగ్రెసు ఆశయముపై "స్వరాజ్యమే జన్మహక్కు" అని శ్రీ బాలగంగాధర్ తిలక్ నాయకత్వాన అతివాదులకు, అభ్యర్థింపులతో నడవాలనీ

శ్రీ గోఖలే నాయకత్వాన మితవాదులకు అభిప్రాయభేదాలు రావడం, అనిబిసెంటు "హోమ్‌రూలు" పథకముతో సర్దుబాటు కావడం జరిగింది.

2. 1924లో కౌన్సిల్‌లో ప్రవేశించాలని శ్రీ మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన ఒక వర్గము భావించగ, శ్రీ మహాత్మాగాంధీ వ్యతిరేకించారు. దాని ఫలితంగా స్వరాజ్యపార్టీ అవతరించింది.

3. 1939 త్రిపుర కాంగ్రెసులో శ్రీ సుభాష్ చంద్రబోసుకు మహాత్మాగాంధీకి వచ్చిన అభిప్రాయభేదమువలన, ఫార్వర్డుబ్లాక్ ఏర్పడింది.

4. 1946లో కాంగ్రెసు నుండి శ్రీ ఆచార్య నరేంద్రదేవ్, శ్రీజయప్రకాష్ నారాయణ, శ్రీ రామమనోహర్ లోహియా చీలి సోషలిస్టు పార్టీని స్థాపించారు.

5. 1950లో కాంగ్రెసు నుండి శ్రీ కృపలానీ తొలగి, కిసాన్ మజ్దూర్ పార్టీ పెట్టారు.

చరిత్రాత్మకంగా సిద్ధాంత భేదముతో ఆరవసారి 1969లో కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నిజలింగప్ప నాయకత్వమున సిండికేటు జాతీయ కాంగ్రెసునుండి విడిపోయి మితవాద, మతవాద పార్టీలతో కలసి "మహాకూటమి"గ ఏర్పడింది. లోగడ కాంగ్రెసు నుండి చీలిపోయిన స్వరాజ్యపార్టీ, ఫార్వర్డుబ్లాక్, సోషలిస్టు పార్టీ, కిసాన్ మజ్దూర్ పార్టీల స్థాయిలోనికి త్వరలోనే శ్రీ నిజలింగప్ప సిండికేటు కాంగ్రెసు చేరుకొనగలదు. సందేహము లేదు.

**బొంబాయి కాంగ్రెసు తీర్మానములు**

అశేష సామాన్య ప్రజాశ్రేయస్సుకు, కులమత వర్గాతీత ప్రజాస్వామ్య సోషలిస్టు రాజ్యస్థాపనకు నిర్దుష్టమైన కార్యక్రమాలు అమలు జరుపుటకు – 1969 డిశంబరులో శ్రీ జగజీవనరాం అధ్యక్షతన జరిపిన బొంబాయి కాంగ్రెసు మహాసభలో తీర్మానములు ఆమోదించబడినాయి.

1. జనరల్ ఇన్సూరెన్సును జాతీయం చేయుట. 2. మాజీ సంస్థానాధీశుల భరణములు, హక్కులను రద్దుచేయుట. 3. పట్టణ ఆస్తులపై గరిష్ఠ పరిమితి విధించుట. 4. పేదరికము, నిరుద్యోగము పరిష్కరించుటకు సత్వర చర్యలు తీసుకొనుట. 5. గుత్త ఆధిపత్యమును అదుపులో పెట్టుట. 6. మెట్ట వ్యవసాయ అభివృద్ధికి ప్రాధాన్యత యిచ్చుట. 7. భూసంస్కరణలు అమలు పరచుట. 8. ప్రస్తుత పరిస్థితులకు అనువైన పారిశ్రామిక విధానమును రూపొందించుట. 9. ప్రజలకు కనీస అవసరములను సమకూర్చుట.

10. దుబారా ఖర్చులపై ఆంక్షలు విధించుట. 11. మురికి పేటలను తొలగించి గృహ వసతి కల్పించుట. 12. చీకటి డబ్బును బయలు పరచుట, పెరుగకుండ చర్యలు తీసుకొనుట. 13. ఉత్పత్తిదారునకు గిట్టుబాటు ధరను వచ్చునటుల చేయుట. 14. ఎగుమతి, దిగుమతి వాణిజ్యములను పబ్లిక్ రంగం స్వీకరించుట. 15. మానవశక్తిని పూర్తిగ వినియోగించి, నిరుద్యోగమును తొలగించుట. 16. బలహీనులను బలవంతులు పీడించు విధానమును రూపుమాపుట. 17. సరసమైన ధరలకు మందుల సరఫరా చేయుట. 18. శిశు సంక్షేమమునకు పథకములను అమలు జరుపుట. 19. సోషలిజమునకు బలమునిచ్చు, కొన్ని ఆర్థిక, సాంఘిక సంస్థలను నెలకొల్పి ప్రోత్సహించుట. 20. స్వదేశ వస్తువులను వాడుట మొదలగు అనేక నిర్దుష్టమైన కార్యక్రమాలను అమలు పరచుటకు మహాసభ సూచించింది.

**ఆచరణ**

బొంబాయి కాంగ్రెసు తీర్మానములను ప్రభుత్వము అమలు పరచుటకు కొన్ని చర్యలు తీసుకొన్నది.

1. మాజీ సంస్థానాధిపతుల భరణములు, హక్కులు రద్దు విషయమై రాజ్యాంగ సవరణ లోక్ సభలో ఆమోదం పొందగా, రాజ్యసభలో ఒక్కవోటు తక్కువయి వోడిపోయింది. అయినా రాష్ట్రపతి ఉత్తర్వు ద్వారా సంస్థానాధిపతుల గుర్తింపు రద్దు చేశారు. సుప్రీంకోర్టు సంస్థానాధిపతులకు అనుకూలంగా తీర్పు నిచ్చింది.
2. పట్టణ ఆస్తులపై పరిమితి విధింపు నమూనా చట్టమూ కేంద్రంలో తయారు చేసి రాష్ట్రాల పరిశీలనలో వుంది.
3. గుత్తాధిపత్యాల నిర్మూలనకు పరిశీలక సంఘమును నియమించారు.
4. ప్రత్తి కార్పొరేషన్ వేయబడింది.
5. మందుల ధరలు కంట్రోలు చేయబడినాయి.
6. నిరుద్యోగ నిర్మూలనకు పథకములు తయారు చేయబడినాయి.
7. మెట్ట వ్యవసాయ అభివృద్ధికి చర్యలు తీసుకొనబడినవి.
8. పేదలకు బంజరు భూములు పంచబడినవి.
9. ఆర్థికంగా వెనుకబడిన వారికి ప్రత్యేక సదుపాయములు చేయబడుతున్నాయి. ఇంకా అనేక చర్యలు ప్రభుత్వము ప్రారంభిస్తున్నది.

### పాట్నా తీర్మానములు

1970 అక్టోబర్ పాట్నాలో జరిగిన ఎ.ఐ.సి.సి. సమావేశములో దేశాన్ని ఎదుర్కొంటున్న తక్షణ సమస్యలైన దారిద్రం, పెచ్చు పెరుగుతున్న వ్యత్యాసాలు, అధికమౌతున్న నిరుద్యోగములను గురించి చర్చించి నిర్మాణాత్మకమైన కొన్ని సూచనలు చేయడం జరిగింది. ఆ సూచనల ఆధారంగా 1971 ఏప్రిల్ నుండి 5 లక్షల మందికి ఉద్యోగ అవకాశములు కల్పించుటకు, క్రెడిట్ గ్యారంటీ పథకము క్రింద సన్నకారు రైతులకు, చిన్న వృత్తులవారికి, చిన్న వర్తకులకు తక్కువ వడ్డీ రేటుతో అప్పులు యిచ్చి వారి వృత్తులకు సహాయం చేస్తున్నారు.

### ఉప ఎన్నికలు

కాంగ్రెసు నుండి సిండికేటు చీలిన తరువాత దేశంలో అనేక రాష్ట్రాలలో అసెంబ్లీకి, లోక్‌సభకు జరిగిన ఉపఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయము సాధించింది. 44 అసెంబ్లీ స్థానములలో 34 స్థానములకు కాంగ్రెసు పోటీ చేసి 24 స్థానాలు గెలుచుకొన్నది. సిండికేటు 21 సీట్లకు పోటీచేసి 5 సీట్లు గెల్చుకొని 11 స్థానాలలో డిపాజిట్లు కోల్పోయినారు. జనసంఘము 10 స్థానాలకు పోటీచేసి ఒక స్థానం నిల్పుకొంది. 1967లో గెలుచుకొన్న మూడు స్థానాలకు పోటీచేసి స్వతంత్ర పార్టీ మొత్తము కోల్పోయింది.

లోక్‌సభకు జరిగిన ఉప ఎన్నికలలో కాంగ్రెసు 5 స్థానాలు సంపాదించగా బి.కె.డి. బంగ్లా కాంగ్రెసు, హెచ్.ఎం.ఎస్. ఒక్కొక్క స్థానము గెలుచుకొన్నాయి. సిండికేటుకు స్థానము లేకుండపోయింది. కేరళ అసెంబ్లీకి జరిగిన మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెసు 56 స్థానాలకు పోటీచేసి 32 స్థానాలు గెలుచు కొనగ, సిండికేటు 39, జనసంఘము 8, స్వతంత్ర పార్టీ ఒక్క స్థానమునకు పోటీచేసి అన్నింటిలోను ఓడిపోయారు.

శ్రీ నిజలింగప్ప స్వస్థానమైన బెంగుళూరు కార్పొరేషన్ ఎన్నికలలో సిండికేటు చిత్తుచిత్తుగ ఓడిపోయింది.

### ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి ఓటమి

మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెసుతో పోటీ చేయడానికి మరోకూటమి ఏర్పడిన తరువాత, కూటమి అభ్యర్థిగ ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ టి.ఎన్.సింగ్ "మునిరామ్" నియోజకవర్గములో (24-1-71) పోటీచేసి ఓడిపోయారు. 16 వేల మెజారిటీతో కాంగ్రెసు అభ్యర్థి శ్రీరామకృష్ణద్వివేది ఎన్నికయినారు. ఈ ఎన్నిక దిక్సూచిలాగా మధ్యంతర

ఎన్నికలలో కాంగ్రెసు విజయాన్ని సూచిస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన 7 అసెంబ్లీ ఉపఎన్నికలలో కాంగ్రెసు 5 ప్రజాసమితి 2 గెల్చుకొన్నాయి. తూర్పుగోదావరి జిల్లా అసెంబ్లీ స్థానమునకు పోటీ లేకుండెను. కృష్ణాజిల్లా తిరువూరులో 23 వేలు, పశ్చిమ గోదావరి జిల్లా ఉండిలో 31 వేలు, చిత్తూరు జిల్లా పుంగనూరులో 34 వేలు మెజారిటీతో అసెంబ్లీకి కాంగ్రెసు అభ్యర్థులు అఖండ విజయంతో గెలుపొందారు.

శ్రీమతి ఇందిరాగాంధి యెడల ప్రజల విశ్వాసము ఎంత ప్రగాఢముగ ఉందో ఈ ఉపఎన్నికల ఫలితాలు తెలియజేస్తున్నవి.

## మధ్యంతర ఎన్నికలు

దేశంలో దారిద్ర్యమును పోగొట్టుటకు, నిరుద్యోగ నిర్మూలనకు, పెచ్చు పెరుగుతున్న అసమానతలను తొలగించుటకు అభ్యుదయకర సంస్కరణలను అమలు జరుపుటకు కేంద్రంలో సుస్థిరమైన ఏకపార్టీ ప్రభుత్వము ఏర్పడాలి. బ్యాంకుల జాతీయాకరణ, మాజీ సంస్థానాధీశుల భరణములరద్దు విషయములలో ప్రభుత్వము ఎదుర్కొన్న చిక్కులు ఎల్లరకు విదితమే. అభ్యుదయ సంస్కరణలను నిరోధించుటకు దేశంలోని మితవాద, అభివృద్ధి నిరోధక, స్వప్రయోజనకర శక్తులన్నీ ఒక్కటిగా ఏకమై పోరాటము ప్రారంభించినాయి. ఈ పరిస్థితులలో ప్రజల అభిప్రాయము తెలుసుకోవడం అవసరమని శ్రీమతి ఇందిరాగాంధీ భావించింది. 14 నెలలు పరిపాలన చేయుటకు అవకాశమున్నప్పటికీ లోక్‌సభను రద్దుచేసి మధ్యంతర ఎన్నికలకు ఎందులకు సిద్ధముకావలసి వచ్చినదో వివరిస్తూ శ్రీమతి గాంధీ యిలా విజ్ఞప్తి చేశారు :

"మన పట్టణాలలో, గ్రామాలలో లక్షలాది ప్రజలు దారిద్ర్యంతో బాధపడుచున్నారు. సాంఘిక, రాజకీయ, ఆర్థికన్యాయం, సమానత్వం సమకూర్చడం మన రాజ్యాంగ ప్రథమ ఆశయం, ఆ ఆశయం యింకా ఈడేరలేదు. ఆశయ సాధనకు అడ్డగించే అనేక వ్యతిరేక శక్తులతో పోరాడవలసి వున్నది. ఈ లక్ష్యం త్వరితంగా ఎక్కువదీక్షతో సాధించాలని మన ప్రజానీకం ఆతురత పడుచున్నది. అది సమంజసమే. ఈ మధ్య మనం తీసుకొన్న రాజకీయ చర్యలు ప్రజల ఆతురతకి నిదర్శనాలు.

బ్యాంకులను జాతీయం చేయడం, సంస్థానాధీశుల భరణాలు రద్దు చేయడానికి ప్రయత్నం, గుత్తదారీ కమీషను ఏర్పాటు మొదలైన ప్రభుత్వ చర్యలు యావద్భారతదేశంలోనూ ప్రజలు ఎంతో ఆనందంతో ఆమోదించారు.

ప్రజల అశ్రుత, ఆర్థికంగా వారి ఇక్కట్లు రాజకీయవాదులు కొందరు అవకాశంగా తీసుకొని దుర్వినియోగం చేస్తున్నారు. అతివాదులు దౌర్జన్యచర్యలు ప్రేరేపిస్తున్నారు. అభివృద్ధి నిరోధక వర్గాలు మతకక్షలు రేపి ప్రజల్ని విడదీయాలని చూస్తున్నారు. దీనివల్ల తరచు శాంతిభద్రతలు భంగమై, సామాన్య ప్రజ నిత్యజీవితం తారుమారై నానాబాధలు పడుచున్నారు. ఈ గడ్డు పరిస్థితి వల్ల ఏర్పడ్డ సవాళ్ళు మనం ఎదుర్కొనాలి. దానికిగాను ప్రజాస్వామిక పద్ధతులలో మతాతీతంగా సోషలిస్టు విధానాలు, కార్యక్రమాలు అమలు జరపడం తప్ప గత్యంతరం లేదు.

"కాలం మనకోసం కనిపెట్టుకొని కూచోదు. తినడానికి తిండి, నిలవడానికి నీడ లేక, బహుజనానికి బ్రతుకుతెరువులేక అలమటిస్తున్న కోట్లాది భారతీయ ప్రజానీకం సత్వర విమోచన చర్యల కోసం వొత్తిడి చేస్తున్నారు. ప్రజాస్వామ్యంలో అధికారం ప్రజలది. అందుకనే ప్రజలదగ్గిరికి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాం. మళ్ళీ కొత్త అధికారం అందించమని అడుగుతున్నాం" అన్నారు ప్రధాని.

సర్వజనులకు సుఖశాంతులను సమకూర్చుటకు శ్రీమతి ఇందిరాగాంధీ ఎంత ఆవేదనతో, ఆతురతతో వున్నారో పై మాటలవలన విదితమగుచున్నది. భారతదేశంలో దారిద్ర్యమును రూపుమాపుటకు, సోషలిజం స్థాపనకు తన శరీరంలో చివరి రక్తబిందువు వరకు, ఎన్ని అభివృద్ధి నిరోధక శక్తులు అడ్డగించినా పోరాడి తీరుతానని లక్షలాది ప్రజల హర్షధ్వానాల మధ్య సూరత్ బహిరంగ సభలో ప్రతిజ్ఞ చేశారు.

**కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక**

లోక్‌సభ మధ్యంతర ఎన్నికల సందర్భంగా భారత జాతీయ కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికను ప్రకటించింది.

1. ప్రజాస్వామ్య పద్ధతులలో సోషలిజంను స్థాపించుటకును, ఆ ఆశయము నెరవేర్చుటకు అవసరమగు కార్యక్రమములను, పథకములను రూపొందించి అమలు జరుపుటకు వీలుగ పరిపాలన పద్ధతులలో మార్పులు చేయాలి.

2. దేశ ప్రజలందరు శాంతియుతంగా పరస్పర స్నేహ సహకార భావములతో జీవించడానికి వీలుగా దౌర్జన్య శక్తులను అణచివేయాలి.

3. దేశ ప్రజలందరికి సమానావకాశాలు, సమాన ప్రతిపత్తి వుండడానికి వీలుగ, అల్ప సంఖ్యాక వర్గాలవారిని, సమాజంలో బలహీన వర్గాల వారిని, సమాజంలో

బలహీన వర్గాల వారిని ముఖ్యంగా షెడ్యూలు తెగలు, కులాలు తదితర వెనుకబడిన వర్గాల వారిని పరిరక్షించడం, సెక్యులరిజం అమలు పరచడం.

4. రాజ భరణముల వంటి ప్రత్యేక సౌకర్యాలు రద్దుపరచి, ఆదాయంలోను, అవకాశాల విషయంలోను ప్రస్తుతమున్న అసమానతలను తగ్గించడం.

5. శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానాన్ని వినియోగించి వ్యవసాయాభివృద్ధికై ఒక బృహత్తర ప్రణాళికను చేపట్టడం ద్వారా ప్రజల ప్రాథమిక అవసరాలను సమకూర్చడానికి కృషి చేయడం. సన్నకారు రైతులు మెట్ట ప్రాంతాలలోని రైతులు, భూమిలోని నిరుపేదల పరిస్థితిని మెరుగుపరచే విధంగా గ్రామీణాభివృద్ధికి తీవ్రంగా కృషి చేయడం.

6. ఉద్యోగావకాశాలను విస్తృతంగా సమకూర్చడం ద్వారా, జాతీయ నిర్మాణ కార్యకలాపంలో మన పౌరులకు ఇతోధిక భాగస్వామ్యం కల్పించడం.

7. పబ్లిక్‌రంగం పాత్రను విస్తృతం గావించి పబ్లిక్‌రంగ సంస్థలను సమర్థవంతంగా పనిచేయించడానికి కృషి చేయడం.

8. ఆర్థికాధికారం, సంపద కొద్దిమంది వ్యక్తుల చేతులలో కేంద్రీకృతం కాకుండ ఒకవైపు అరికట్టుతూనే, మరొకవైపు ఆర్థిక వ్యవస్థలో ప్రైవేటురంగానికి సముచిత స్థానాన్ని సమకూర్చడం.

9. ధరలను కంట్రోలుచేసి, ప్రజలకు నిత్యావసర వస్తువులను సహేతుకమైన ధరలకు లభ్యం చేయడం.

10. పిల్లలకు బలవర్ధకమైన ఆహారాన్ని సమకూర్చడానికై శిశుసంక్షేమ కార్యక్రమాలను చేపట్టడం.

11. దేశ అవసరాలకు అనుగుణంగా విద్యావిధానాన్ని పునర్వ్యవస్థీకరించడం.

12. పై లక్ష్యాల సాధనకై అవసరమైతే రాజ్యాంగాన్ని సవరించడం.

కాంగ్రెసు ఆశయమైన సోషలిస్టు రాజ్యస్థాపనకు నిర్మాణాత్మకమైన సూచనలతో కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలను రూపొందించి, ఆస్తిహక్కును రద్దుచేసే ప్రశ్న లేదని ప్రకటించింది. దేశం నిర్మాణాత్మకమైన మార్గంలో పురోగమించాలంటే ప్రగతి శీలక విధానాలను అమలు జరపాలంటే శ్రీమతి ఇందిరాగాంధి నాయకత్వమును బలపరచి

పటిష్ఠకరమైన, అభ్యుదయకరమైన సుస్థిర ప్రభుత్వం కేంద్రంలో ఏర్పడుటకు తీవ్రమైన కృషి జరగాలి.

## మహాకూటమి

భారతప్రజలు శ్రీమతి ఇందిర నాయకత్వమును ప్రగాఢ విశ్వాసముతో బలపరచుట గమనించిన ప్రతిపక్షాలు కలవరపడిపోతున్నాయి. ఆశయాలను, కార్యక్రమాలను మంటగలిపి, మార్గాలు తప్పి, ఏకమైపోతున్నారు. అభివృద్ధి నిరోధక శక్తులకు గుండెకాయ అయిన స్వతంత్రపార్టీ, మతతత్వ వాదులకు నిలయమైన జనసంఘం, అసలు సిసలైన సోషలిస్టులమంటూ పెట్టుబడిదార్లకు లొంగిపోయిన సంయుక్త సోషలిస్టు పార్టీ, మితవాద, బూర్జువా తత్వములతో నడుస్తున్న సిండికేటు కలసి "మహాకూటమి"గ ఏర్పడినాయి. నిన్నటివరకు బద్ధ విరోధులుగ వ్యవహరించిన ఈ శక్తులు ఎందులకు ఏకం కావలసివచ్చింది. వారి ప్రణాళిక ఏమిటి. వారందరకు ఒకే ఒక భయం. శ్రీమతి ఇందిరా గాంధీ తిరిగి ప్రభుత్వానికి వస్తే వారి ఆటలు సాగవని. అందుచే వారందరకు ఒకే ప్రణాళిక. శ్రీమతి ఇందిరాగాంధీని అధికారములోనికి రాకుండ చేయడమే! అంతే గాని ప్రజా శ్రేయస్సునుకోరి కాదు. దేశంలోని గుత్తపెట్టుబడిదార్లకు, బూర్జువాలకు మాజీ సంస్థానధీశులకు, మితవాద వర్గాలకు స్వప్రయోజన వాదులకు, అభివృద్ధి నిరోధక శక్తులకు, కులమత వాదులకు అండగ నిలబడిన ఈ అభివృద్ధి నిరోధక మహాకూటమి ఎత్తుగడలకు ప్రజలు మోసపోరాదు, మోసపోరు. ప్రజలు పూర్తిగా గ్రహించారు. అభ్యుదయ మార్గాన, సామాన్య ప్రజల శ్రేయస్సుకు అవిరళ కృషి చేస్తున్న శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వాన్న ఉన్న జాతీయ కాంగ్రెసుకు విజయం తథ్యం. అదే ప్రజా నినాదం. శ్రీమతి ఇందిరాగాంధీ దేశంలో ఎచటకు వెళ్ళినా ఆబాలగోపాలం అఖండస్వాగతం యిచ్చి లక్షలాది ప్రజలు సభలకు హాజరై వారి సందేశమును విని జయజయ ధ్వానములు చేస్తున్నారు.

## సిండికేటు నుండి రాజీనామాలు

అభివృద్ధి నిరోధక శక్తులైన స్వతంత్ర పార్టీ, జనసంఘంలతో సిండికేటు కలసి మహాకూటమి ఏర్పర్చుట వలన, శ్రీ నిజలింగప్ప నాయకత్వాన ఉన్న ప్రతిపక్ష కాంగ్రెసు నుండి అనేక మంది ప్రముఖులు, తండోపతండాలుగ కార్యకర్తలు రాజీనామా చేస్తున్నారు. ప్రతిరోజూ రాజీనామా వార్తలు వస్తూనే వున్నాయి. శ్రీ నిజలింగప్ప అధ్యక్షతన ఉన్న అఖిల భారత కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శి, ఆంధ్ర రాష్ట్ర ప్రతిపక్ష కాంగ్రెసు అధ్యక్షులు

శ్రీ పెండెకంటి వెంకట సుబ్బయ్యగారు రాజీనామా చేశారు. రాష్ట్ర కార్యవర్గ సభ్యులు శ్రీ సలాం ప్రతిపక్ష కాంగ్రెసును వదలి వేశారు.

శ్రీ మురార్జీ స్వరాష్ట్రమైన గుజరాత్‌లో ముగ్గురు రాష్ట్ర మంత్రులు, కేంద్ర మాజీమంత్రి ప్రతిపక్ష కాంగ్రెసు నుండి రాజీనామా చేసి శ్రీమతి ఇందిరాగాంధి నాయకత్వాన్ని బలపరుస్తున్నారు. స్వతంత్ర పార్టీ, జనసంఘంలతో కలసి కూటమిగ ఏర్పడిన సిండికేటు కాంగ్రెసు పూర్తిగ బ్రద్దలయిపోతున్నది. త్వరలో తుడిచిపెట్టుకొని పోగలదు.

## కార్యకర్తల కర్తవ్యం

దేశ భవిష్యత్తును నిర్ణయించగల ఈ మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెసు సంఘాలు, కార్యకర్తలు దీక్షతో అవిరళ కృషి చేయవలసి వున్నది. ప్రజలతో సన్నిహిత సంబంధాలు పెంపొందించుకొని, కాంగ్రెసు ఆశయాలు, కార్యక్రమాలు వివరించటానికి ఇది మహదవకాశం. ఈ పరిస్థితులను సద్వినియోగపరచుకొనడానికి ఈ దిగువ సూచనలు చేస్తున్నాము.

1. జిల్లా స్థాయిలోను, లోక్‌సభ, అసెంబ్లీ నియోజకవర్గ స్థాయిలలోను, ఫిర్కా గ్రామాల వారీగను ఎన్నికల ప్రచార సంఘాలు ఏర్పాటుచేసి కార్యాలయములు నెలకొల్పాలి. శ్రద్ధగను, బాధ్యతగను పనిచేసే కార్యకర్తలను యీ కార్యాలయముల నిర్వహణకు వినియోగించాలి.

2. సరియైన వోటర్ల జాబితాలు తయారు చేయాలి. చనిపోయిన వారి పేర్లు తొలగించడం, కొత్తగా చేర్చవలసిన వారి పేర్లు చేర్పించడం, అడ్రసులు మారిన వారి పేర్లు తెలుసుకొని, సరియైన చిరునామాలు సేకరించాలి. వీధివారి జాబితాలు తయారు చేసి కార్యకర్తలకు యివ్వాలి. ప్రతి వోటరును కలుసుకొని మన ఆశయాలూ, కార్యక్రమాలు తెలియజెప్పగలందులకు వీలుగ ఐదువందల మందికి ఒక కార్యకర్త వంతున నియమించాలి.

3. ప్రజలను ఆకర్షించే విధంగా, గ్రామ, విద్యా కేంద్రాలలో కాంగ్రెసు జెండాలు ఎన్నికల గుర్తు పోస్టర్లు, బ్యానర్లు కట్టించాలి. కరపత్రములను కార్యకర్తలు, చదివి ప్రజలకు చెప్పాలి. అందరికీ అందునట్లు పంచిపెట్టాలి.

4. గ్రామాలలో ప్రచారమునకు వెళ్ళునప్పుడు గ్రామ పెద్దలతోపాటు, హరిజనవాడలు, పేదల పేటలకు విధిగవెళ్ళి ప్రజలను కలుసుకొనాలి. పేద ప్రజలు శ్రీమతి ఇందిరాగాంధిని బలపరచుటకు చాలా ఉత్సాహంగా ఉన్నారు.

5. స్లైడ్లు, నాయకుల సందేశాల ఫిల్ములు సినిమాహాలులలో వేయించాలి. ఎన్నికల కొరకు రికార్డులు తయారయినాయి. మైకులు పెట్టి రికార్డులు వేయడం, మన కార్యక్రమాలను గురించి వివరించడం అవసరం.

6. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు దినపత్రిక "ఆంధ్రజనత"కు ఎప్పటికప్పుడు వార్తలను పంపాలి. పత్రికను విరివిగా ప్రచారములోనికి తీసుకొని రావడానికి దోహదం చేయాలి.

7. ప్రతిపక్షాల విమర్శలకు వెంటనే కార్యకర్తలు జవాబుచెప్పుటకు కరపత్రాలు, దినపత్రికలు చదువుతూ వుండాలి.

8. పోలింగు రోజుకు గ్రామములలో లేని వోటర్లను వచ్చునట్లు ఏర్పాట్లు చేయటము అవసరం.

9. పోలింగు వద్ద ఆకర్షణీయంగా కాంగ్రెసు జెండాలతో కార్యాలయము ఏర్పాటు చేయాలి. వోటర్లను తీసుకొని రావడానికి, చీట్లు యివ్వడానికి, మన ఎన్నికల గుర్తు చెప్పడానికి కార్యకర్తలు ఎక్కువమందిని ఏర్పాటు చేయాలి. ప్రశాంతంగా పోలింగు జరుగునట్లు తోడ్పడాలి.

10. ప్రతిపోలింగు బూతులోను కాంగ్రెసు అభ్యర్థికి ఎన్నివోట్లు వచ్చింది. మొత్తం ఎన్ని వోట్లు పోలయింది. వివరములతో నివేదికలను తయారు చేసి లోక్‌సభ, అసెంబ్లీ నియోజకవర్గ కాంగ్రెసు కార్యాలయములకు అందజేయాలి.

ఈ సూచనలను అమలుపరచి కాంగ్రెసుకు అఖండ విజయము చేకూర్చి, సర్వజనులకు సుఖశాంతులను చేకూర్చే, అభ్యుదయ సంస్కరణలను అమలుపర్చే సుస్థిర ప్రభుత్వము ఏర్పాటు జరుగునట్లు తోడ్పడ కోరుచున్నాము.

"సర్వేజనాః సుఖినోభవంతు"

జై హింద్

# 7. కాంగ్రెస్ కార్యకర్తలు : నిర్మాణ కార్యక్రమం

"మన జాతీయ జీవనములోని వివిధ రంగాలలో నిర్మాణ కార్యక్రమము అమలు జరుపనిదే రాజకీయ స్వాతంత్ర్యము వచ్చినంత మాత్రాన ఉపయోగం లేదని" స్వాతంత్ర్య ప్రదాత మహాత్మాగాంధి మనకు పదే పదే హెచ్చరించుచూ వచ్చారు. అందుచేతనే వారు దాస్యబంధాలు త్రెంచుటకు ఒకవైపు స్వాతంత్ర్య పోరాటాలను నడుపుచూ, దేశ పురోభివృద్ధికి మరొకవైపు నిర్మాణ కార్యక్రమమును అమలు జరుపుతూ వచ్చారు. అందుచేతనే స్వాతంత్ర్యము రాగానే మన కాళ్ల మీద మనము నిలుచుని దేశ పురోభివృద్ధికి కృషి చేయగల శక్తి కల్గింది. గాంధీజీ కలలుకన్న నవభారతాన్ని నిర్మించుటలో ప్రతి భారతీయుడు తన యావచ్ఛక్తిని వినియోగించి, నిర్మాణయుతంగా కృషి చేయాల్సి యున్నది.

భారత దేశ పరిపాలనా బాధ్యత కాంగ్రెసు స్వీకరించిన పిదప, పార్లమెంటరీ కార్యక్రమములో కాంగ్రెసు వాదులు హెచ్చుగా మునిగిపోయారు. నిర్మాణ కార్యక్రమ ఆవశ్యకతను ఎప్పటికప్పుడు కాంగ్రెసు చెప్పుతూనే యున్నది. నిర్మాణయుతమైన కార్యక్రమములద్వారా ప్రజలకు సేవచేయుటవలన ప్రజలలో కాంగ్రెసు బలపడగలదు. నవ భారత నిర్మాణములో అనేక అభివృద్ధి కార్యక్రమాలు ప్రభుత్వము నిర్వహించుచున్నది. పార్లమెంటు, అసెంబ్లీ కాంగ్రెసు పార్టీ సభ్యులు వారి నియోజక వర్గాలతో సన్నిహిత సంబంధం ఏర్పాటు చేసికొని నిర్మాణ, అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొంటూ వుండాలి.

కాంగ్రెసు కార్యకర్తలు ఈ క్రింది నిర్మాణ కార్యక్రమములో విధిగా పాల్గొనాలని అఖిల భారత కాంగ్రెసు ఆదేశించింది. 1. భూదానయజ్ఞం, 2. గ్రామఖాదీ పరిశ్రమలు, 3. రైతులను సంఘటితపరచుట, 4. పంచవర్ష ప్రణాళికలను అమలు పర్చుట, 5. మద్యనిషేధము, 6. హరిజన – ఆదిమవాసుల అభ్యుదయము, 7. బేసిక్ విద్య, 8. వయోజనవిద్య, 9. పారిశుద్ధ్యము, 10. రాష్ట్ర భాష, ప్రాంతీయ భాషల ప్రచారం, 11. విద్యార్థులను సంఘటిత పరచుట, 12. స్త్రీ జనాభ్యుదయము. 13. స్థానిక ప్రాజెక్టులు, 14. స్వదేశీ ఉద్యమం, 15. కులతత్త్వ నిర్మూలనం, 16. కార్మికులను సంఘటిత పరచుట,

17. లంచగొండితనము నిర్మూలించుట. 18. ఆహార పదార్థముల యందలి కలితీ నిరోధించుట. 19. సేవింగ్సు ఉద్యమము, 20. అధికాహారోత్పత్తి, 21. నిరుద్యోగ నిర్మూలన, ఆర్థిక సమానత్వము, 23. సహాయ కార్యక్రమములు. 24. పార్లమెంటరీ కార్యక్రమము, 25. కాంగ్రెసు ఆర్గనైజేషన్, 26. సహకారోద్యమము.

ఈ విషయాలపై కాంగ్రెసు కార్యకర్తలు నిర్మాణ కార్యక్రమములో పాల్గొనాలని అఖిల భారత కాంగ్రెసు కమిటీ ఆదేశించింది. వీనిలో వేటినైనా ఒకటి రెండు సూత్రాలు అమలు జరిపితే చాలు. ఏ విధంగా అమలు జరుపుతున్నదీ మూడు నెలల కొక పర్యాయము జిల్లా కాంగ్రెసు కమిటీకి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీకి రిపోర్టులు పంపుతుండాలి. నిర్మాణ కార్యక్రమములో విధిగా కార్యకర్తలు పాల్గొనాలని అజ్మీరులో 26-7-1954 వ తేదీన అఖిల భారత కాంగ్రెసు కమిటీ తీర్మానించింది. 25-9-1954వ తేదీన కాంగ్రెసు కార్యవర్గము వారు ఆజ్మీరు తీర్మానాన్ని అమలు జరుపుటకు తగు సూచనలు చేయటానికి డా॥ కె.ఎస్. కట్జూ, శ్రీ లాల్ బహుదూర్ శాస్త్రి, శ్రీ గుల్జారీ లాల్ నందా, శ్రీ ఖండూ భాయి దేశాయి, శ్రీ కె.పి. మాధవనాయర్, శ్రీ మాణిక్యలాల్‌వర్మ, శ్రీ దేవకీ నారాయణ్, శ్రీ ఎస్.ఎన్. అగర్వాలా (కన్వీనరు) గార్లతో ఒక ఉపసంఘమును నియమించగా, ఈ ఉపసంఘము అనేక మార్లు సమావేశమై 15-9-1955వ తేదీన దిగువ సూచనలు చేస్తూ ఒక నివేదిక ఇచ్చారు.

1. కాంగ్రెసు నాయకులు, మంత్రులు, శాసనసభ్యులు, పార్లమెంటు సభ్యులు నిరాడంబర జీవితాన్ని గడపాలి. మామూలు కాంగ్రెసు కార్యకర్తలకు, పార్లమెంటు వ్యవహర్తలకు, నిత్యజీవిత వ్యవహారాలలో ఎక్కువ తారతమ్యాలుండరాదు.

2. రెండవ పంచవర్ష ప్రణాళిక అమలు జరపటములో ఆర్థిక విధానము ఉత్సాహవంతముగాను, అభ్యుదయ మైనదిగను ఉండాలి. సోషలిస్టు ఆర్థిక విధానాన్ని అమలు జరిపి చూపాలి.

3. నిర్మాణ కార్యకర్తలకు కాంగ్రెసు ఆర్గనైజేషన్‌లో తగు స్థానమివ్వాలి.

4. ఎన్నికలలో అభ్యర్థులను నిర్ణయించేటప్పుడు వారు నిర్మాణ కార్యక్రమములో ఎంతవరకు పనిచేశారో తెలుసుకొని దానికే ఎక్కువ అవకాశమివ్వవలసి వుంటుంది. కాంగ్రెస్ సంస్థలో ముఖ్య పదవులను కూడ నిర్మాణ కార్యక్రమము అమలు జరిపిన వారికే ఇవ్వవలెను.

5. త్యాగనిరతి, సేవాసక్తి, కలవారికే కమ్యూనిటీ ప్రాజెక్టులలో, జాతీయ వికాస కేంద్రాలలో అవకాశమివ్వాలి.

6. కమ్యూనిటీ ప్రాజెక్టు సంఘాలకు ఎక్కువ అధికారాలు ఉండాలి. ఏకగ్రీవ నిర్ణయాలకు తగు విలువ ఇవ్వాలి.

7. నిర్మాణ కార్యక్రమ సూత్రాలలో ఒకటి, లేక, రెండింటిని ప్రత్యేక శ్రద్ధతో అమలు జరుపుతూ ఉండాలి.

8. సహకారోద్యమ వ్యాప్తికి కృషి చెయ్యాలి. ప్రతి గ్రామములోను సకలార్థ సహకారసంఘాలను స్థాపించాలి.

9. నిర్మాణ కార్యక్రమములో శిక్షణ ఇచ్చుటకు యువకుల శిక్షణా కేంద్రాలను ఏర్పాటు చేయాలి.

10. కాంగ్రెసు కార్యకర్త సభ్యులను జన సమూహం నుంచి చేర్పించడం తగ్గించాలి. నిజమైన వర్కర్లు చేరేటట్లు చూడాలి. లోగడ చేసిన కార్యక్రమాన్ని దృష్టిలో పెట్టుకొని కార్యకర్తలు చేరేటట్లు చూడాలి.

బరంపురంలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సమావేశములో దేశాన్ని ఆరు మండలాలుగా భాగించి, జోనల్ ఆర్గనైజర్లను నియమించారు. తిరువాన్కూరు, కొచ్చిన్, మళయాళ, మైసూర్, తమిళనాడు, ఆంధ్రదేశాలను దక్షిణ మండలంగా ఏర్పాటు చేసి శ్రీ ఎన్. రామకృష్ణన్ (మద్రాసు) గారిని ఆర్గనైజరుగా వేశారు. నిర్మాణ కార్యక్రమము గూర్చి సలహా లివ్వడానికి శ్రీ ధేబర్ (అధ్యక్షులు), శ్రీ గోవింద వల్లభ పంత్, శ్రీ గుల్జారి లాల్ నందా, శ్రీ లాల్ బహుదూర్ శాస్త్రి, శ్రీ ఎ.ఎల్. మెహతా, శ్రీ కాకాసాహెబ్ కలేల్కర్, శ్రీ శ్రీమన్నారాయణ్ (కన్వీనరు) గార్లను సలహా సంఘంగా నియమించారు.

ప్రతి జిల్లాలోని కాంగ్రెసు కార్యకర్తలు 10 మంది వంతున బృందాలను ఏర్పాటు చేసి, నిర్మాణ కార్యక్రమము అమలు జరిపించాలని నిర్ణయించారు. ఇటీవల కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు వారు సమావేశమై, వచ్చే జనరల్ ఎన్నికలలో అభ్యర్థులను నిర్ణయించుటలో నిర్మాణ కార్యక్రమములో అభ్యర్థి కాగలవారు ఎంతవరకు కృషి చేశారో యోచించటానికి నిర్ణయించారు.

నిర్మాణ కార్యక్రమము అమలు జరిపించటానికి, నిర్మాణ కార్యక్రమ కార్యకర్తలకు ఉత్సాహ మివ్వడానికి అఖిల భారత కాంగ్రెసు కమిటీ నిర్ణయించుకొన్నది.

ఈ విషయాలను దృష్టిలో పెట్టుకొని కాంగ్రెసు కార్యకర్తలు తమ విధులను నెరవేర్చి నిర్మాణ కార్యక్రమమును అమలు జరుపవలసి వుంటుంది.

*(ఆంధ్రపత్రిక, 11.12.1955, ఆదివారం)*

# 8. లోక్‌సభ మధ్యంతర ఎన్నికలు - కాంగ్రెసు అఖండ విజయం : కాంగ్రెసు సంఘాల అభ్యర్థుల కార్యకర్తల కర్తవ్యం

లోక్‌సభ మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెసుకు అఖండ విజయం చేకూర్చుటకు కృషి చేసిన తమకు, కాంగ్రెసు కార్యకర్తలు అత్యంత ఉత్సాహంతో ఓటు వేసిన ప్రజలకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలను, గెలిచిన కాంగ్రెసు అభ్యర్థులకు హృదయపూర్వక అభినందనలు తెలియజేసుకొంటున్నది. కాంగ్రెసు సంస్థ పట్ల, ప్రధాని ఇంధిరాగాంధి నాయకత్వం పట్ల ప్రజల సంపూర్ణ విశ్వాసాన్ని వెల్లడించారు. "ఇందిర విజయం, ఇండియా విజయం" అని ప్రపంచమంతా జయనాదాలతో ప్రతిధ్వనించింది. ఈ ఎన్నికలు జాతీయంగా సుస్థిర ప్రభుత్వాన్ని నెలకొల్పుటకుగాక అంతర్జాతీయంగా భారతదేశ ప్రతిష్ఠను ఇనుమడింపచేసినాయి. లోక్‌సభలో మొత్తం 518 స్థానాలలో 515 స్థానాలకు ఎన్నికలు జరుగగా, కాంగ్రెసు 350 స్థానాలను గెలుచుకొని రాజ్యాంగాన్ని సవరించుటకు అవసరమైన మెజారిటీని సంపాదించుకొంది.

ఆంధ్రప్రదేశ్‌లో లోక్‌సభకు గల 41 స్థానాలలో 37 స్థానాలు పోటీచేసి, కాంగ్రెసు 28 స్థానాలు గెలుచుకుంది. లక్షలాది వోట్ల మెజారిటీతో కాంగ్రెసు అభ్యర్థులకు అఖండ విజయం చేకూర్చిన ఘనత, ముఖ్యంగా పేదవర్గాలకు దక్కుతుంది. ఈ ఎన్నికలలో హరిజనులు, గిరిజనులు, వెనుకబడిన జాతులు.. మొదలయిన పేదవర్గాలు, మైనారిటీలవారు, మధ్యతరగతి ప్రజలు కాంగ్రెసుకు అండగ నిలబడి, చరిత్రాత్మకమైన ఘనవిజయాన్ని సాధించిపెట్టాయి. ఈ విషయాన్ని కాంగ్రెసు సంఘాలు, అభ్యర్థులు, కార్యకర్తలు పూర్తిగ గమనించి వారితో సన్నిహిత సంబంధాలను పెంపొందించుకోవాలి. ఎంత ఉత్సాహంగా వారు మనల్ని బలపరచినారో అంతకంటే ఉత్సాహంగా మన కార్యకర్తలు వారితో నిత్య సంబంధాన్ని పెట్టుకొని వారికి అవసరమయిన సహాయ, సహకారాలను అందజేయాలి. సర్వజనులకు సుఖశాంతులను, సుఖజీవనాన్ని కలుగజేయుటకు మన కార్యక్రమాలు. ఈ పవిత్ర ఘన కార్యక్రమాలను అమలు జరుపుటకు నిర్విరామ కృషికి ప్రతిజ్ఞ తీసుకోవాలి.

**సూచనలు:**

1. ఆయా పేద వర్గాల వాడలకు తరచు వెళ్లుతూ వారి సమస్యలను ఆకళింపు చేసుకొని, వారి బాధలను తెలుసుకొంటూ, వాటి పరిష్కారానికి సహాయ, సహకారాలను అందిస్తూ ప్రజలతో సన్నిహిత సంబంధాన్ని పెంపొందించు కోవాలి.

2. పేదల జీవనోపాధిని పెంపొందించే పథకాలను రూపొందించి, అమలు జరుపుటకు కృషి జరగాలి.

   అ) ప్రభుత్వ బంజరు భూములను, వ్యవసాయ యోగ్యమైన ఫారెస్టు భూములను పేదలకు పంపిణీ చేస్తున్నారు. వాటిని సక్రమంగా పంపిణీ జరిగేట్లు చూడాలి.

   ఆ) సహకార వ్యవసాయ సంఘాలను నెలకొల్పి బంజరు భూములను సేద్యం చేయుటకు ఆర్థిక సహాయం వచ్చేట్లు చూడాలి.

   ఇ) చిన్న చిన్న వృత్తుల వారికి, వారి వృత్తులను అభివృద్ధి పరచుకొని జీనవోపాధిని పెంపొందించుకొనుటకు బ్యాంకులలో, సహకార సంఘాలలో అప్పులు యిప్పించుటకు కృషిచేయాలి.

   ఈ) కొండ ప్రాంతాలలో గిరిజనులకు వ్యవసాయం, తోటల అభివృద్ధి పరచుటకు సముద్రతీర ప్రాంతాలలో మత్స్యపారిశ్రామికులకు చేపలు పట్టు అభివృద్ధి పథకాలను రూపొందించి వారికి సహాయం జరిగేట్లు చూడాలి.

   ఉ) వివిధ ప్రాంతాలలో స్థానిక పరిస్థితులను బట్టి పథకాలను పెంపొందించాలి.

3. పేద ప్రజలు నివసించు ప్రాంతాలలో మంచినీటి సదుపాయం, రహదారి సౌకర్యాలు, ఇండ్ల స్థలాలు మొదలయిన కనీస సౌకర్యాలను చేకూర్చుటకు పథకాలను రూపొందించి, పంచాయితీ, పంచాయితీ సమితి జిల్లా పరిషత్, లేక ప్రభుత్వ సహాయాలతో అమలు జరిపించుటకు కృషిచేయాలి.

4. ప్రజలకు సంబంధించిన స్థానిక సమస్యలను గురించి కాంగ్రెసు కార్యకర్తలు తెలుసుకొని మహజర్లు, పిటిషన్లు వ్రాయించి, కాంగ్రెసు పార్లమెంటు సభ్యులకు, శాసన సభ్యులకుగాని పంపిన వాటిని ఆయా అధికారులకు డి.ఓ. లేఖలు రాసి సత్వర చర్యలు తీసుకొనుటకు తోడ్పడగలరు.

5. పార్లమెంటు సభ్యులు కనీసం సంవత్సరంలో ఒక్కసారి అయినా, శాసన సభ్యులు ఆరు నెలలకు ఒక్కసారి అయినా, నియోజక వర్గంలోని ప్రతి గ్రామం సందర్శించుటకు, ప్రజల కష్టసుఖాలను తెలుసుకొనుటకు ప్రయత్నించాలి. ఆయా బ్లాక్ జిలా కాంగ్రెసు కార్యకర్తల సమావేశాలకు హాజరవుతూ కార్యకర్తలను ఉత్సాహపరచాలి. వచ్చు మహజర్లూ, పిటిషన్లనుచూచి ఆయా అధికారులకు డి.ఓ. లేఖలు వ్రాసి పంపి, ఏమి చర్య తీసుకొన్నది వాటిని పంపిన వారికి తెలియజేయాలి.

6. భారత ప్రజానీకానికి కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాలను నెఱవేర్చుటకు కేంద్ర ప్రభుత్వం పథకాలను రూపొందిస్తున్నదనీ, త్వరలోనే కార్యరూపేణా నెఱవేర్చగలమని 15.03.1971వ తేదీన భారత జాతీయ కాంగ్రెసు కార్యవర్గం శ్రీ జగజ్జీవనరాంగారి అధ్యక్షతన సమావేశమై తీర్మానించింది.

   కాంగ్రెసు ప్రభుత్వం ఎప్పటికప్పుడు సామాన్య ప్రజల శ్రేయస్సుకు, వారికి సుఖశాంతులను చేకూర్చుటకు అమలు చేయనున్న చర్యలను గమనిస్తూ కరపత్రాల ద్వారా, సభల ద్వారా, విరివిగ ప్రచారాలు జరుగునట్లు చర్యలు తీసుకోవాలి.

7. చరిత్రాత్మకమైన ఈ ఎన్నికలలో బాగా పనిచేసిన కార్యకర్తల లిస్టును తయారు చేసుకొని, వారిని కార్యకర్తల సమావేశాలకు, సభలకు, ఆహ్వానిస్తూ సన్నిహిత సంబంధాన్ని పెట్టుకొనుట కాంగ్రెసు సంఘాలు కృషిచేయాలి. పేదవర్గాల కార్యకర్తలను ఉత్సాహపరచాలి.

8. కొన్ని ప్రాంతాలలో కాంగ్రెసుకు ఓటు వేసిన పేదవర్గాలపై ఫ్రంటువారు, మార్క్సిస్టు కమ్యూనిస్టులు దౌర్జన్యాలను జరుపుతున్నట్లు రిపోర్టులు వస్తున్నాయి. వారికి రక్షణ కల్పించుటకు అధికారులకు తెలియజేసి, వారికి అండగ మన కాంగ్రెసు కార్యకర్తలు నిలబడాలి.

9. సామాన్య ప్రజానీకం ఈ ఎన్నికలలో ఎంతో ఆశాభావంతో, అత్యంత ఉత్సాహంతో వారు చూపిన అపూర్వ ఆదరాభిమానాలకు మనం సర్వదా కృతజ్ఞులమై, వారి కనీస అవసరాలను తీర్చుట వారికి అండదండగ మెలగాలి.

ఈ సూచనలను అమలు జరుపుటలో కాంగ్రెసు పార్లమెంటు, శాసన సభ్యులు, కాంగ్రెసు సంఘాలు, కార్యకర్తలు తోడ్పడగలందులకు కోరుతున్నాం.

*(16-03-1971)*

# 9. బాలారిష్టాలు అధిగమించిన ఆంధ్రప్రదేశ్ ప్రగతి పథగమనం

**1956** నవంబరు 1వ తేదీన సమగ్ర ఆంధ్రప్రదేశ్ ఆవిర్భవించడంతో తెలుగు మాట్లాడే నాలుగు కోట్ల ప్రజల చిరకాల స్వప్నం ఫలించింది. భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగి, తద్వారా సువిశాలమైన ఈ దేశ పాలన ఉత్తమంగా సాగాలని జాతిపిత మహాత్మాగాంధీ వాంఛించారు. ఈ వాంఛాసిద్ధికి తెలుగువారు మార్గగాములయ్యారని చెప్పవచ్చు. అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు నిరుపమాన సేవాతత్పరత వల్ల, ఆత్మాహుతి వలన దేశంలో మొట్టమొదటి భాషాధార రాష్ట్రం రూపుదాల్చింది. ఆంధ్రరాష్ట్ర అవతరణ ఫలితంగా దేశంలో భాషాప్రాతిపదికపై రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కార్యక్రమం త్వరితగతిని అమలు జరిగింది.

1956లో తెలుగు మాట్లాడే ప్రజలందరు ఏకైక పాలనా విభాగం కిందికి రావడం అత్యంత ముదావహమైన విషయం. వెనుకటి హైదరాబాదు రాష్ట్రంలోని తెలుగు ప్రాంతాలు, ఆంధ్రరాష్ట్రమూ సంలీనమై సమగ్ర ఆంధ్రప్రదేశ్‌గా ఏర్పడడం జరిగింది. ఉభయ ప్రాంతాల సంలీనం వల్ల పెక్కు సమస్యలు- ముఖ్యంగా రాజకీయపరమైన సమస్యలు తలెత్తాయి. అప్పట్లో తెలంగాణా ప్రాంతం అంతగా అభివృద్ధి చెందలేదు. ఆంధ్రప్రాంతం ప్రజలల్లో అప్పటికే సంపన్నత ఉన్నది. అందుచేత ఆంధ్రప్రాంత ప్రజలకు రాజకీయ, ఆర్థిక రంగాలలో పై చేయిగా వుంటుందని తెలంగాణా ప్రాంతం వారిలో కొన్ని భయ సందేహాలు పొడసూపాయి.

రాష్ట్ర అవతరణ ప్రారంభంలోనే మానసికమైన ఇట్టి దృక్పథం గత రెండు దశాబ్దాలలో రాష్ట్రంలో ఏర్పడిన కొన్ని అనర్థాలకు మూలకారణమయింది. కొందరిలో దాగివున్న రాజకీయ స్వలాభాపేక్ష, తమ శ్రేయస్సుకు భంగం వాటిల్లుతున్నదని కొందరిలో ఏర్పడిన భయాందోళనలు, ఉభయ ప్రాంతాల నాయకులలో సర్దుబాటు ధోరణి లోపించడం, తత్ఫలితంగా ప్రజాజీవనంలో అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడడం- వీటి మూలంగా రాష్ట్రంలో అస్థిర వాతావరణం చోటుచేసుకొన్నది. సత్వర ఆర్థికాభివృద్ధి దీనివల్ల కుంటుపడింది. విస్తృత ఆర్థికాభ్యుదయానికి దోహదపరచే సహజ సంపదలకు

రాష్ట్రం ఆటపట్టుగా ఉన్నప్పటికి పారిశ్రామిక, వాణిజ్యరంగాలలో అభివృద్ధి సాధించేందుకు అవసరమైన వాతావరణం ఇక్కడ అప్పటిలో ఏర్పడలేదు.

పరిస్థితులు ఆనాడు ఈ విధంగా వున్నప్పటికి తెలంగాణా ప్రాంతం అభివృద్ధి పట్ల మనరాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహిస్తూ వచ్చింది. ప్రస్తుత ఈ ప్రాంతం వెనుకబడింది కావడం చేత ఆదిలో కొన్ని సమస్యలు ఎదురవడం సహజం. తెలంగాణా ప్రాంతాన్ని శీఘ్రతరంగా అభివృద్ధిపరిచే నిమిత్తం తెలంగాణా ప్రాంతీయ సంఘాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. ఈ ప్రాంతం ఆర్థికాభ్యుదయానికి ఈ సంఘం ఎంతో తోడ్పడింది. అయితే ఇదే సందర్భంలో కొన్ని సమస్యలు కూడా ఏర్పడకపోలేదు. ఈ ప్రాంతాన్ని ఉపేక్షిస్తున్నారనీ, దాని అభివృద్ధి కోసం ప్రజల నుండి ఒత్తిడి అవసరమయిందనీ ఒక భావం ఏర్పడింది. రెండు ప్రాంతాలలో నివసించే సోదరుల మధ్య ఏర్పడిన పరస్పర అవిశ్వాసంవల్ల 1969లో తెలంగాణ ప్రాంతంలో తీవ్రమైన ఆందోళన చెలరేగింది. ఉద్యోగ వర్గాలలో తమ శ్రేయస్సు దెబ్బతింటున్నదనే అపోహ కూడా దీనికి కొంతవరకు దోహదం చేసిందని చెప్పవచ్చు. సుయోచితమైనది కాని ఈ ఆందోళన వల్ల ఆర్థిక పరంగా ఎంతటి భారీ నష్టం వాటిల్లిందో అందరికి విదితమే. ఒక వర్గం వారి పట్ల ద్వేషం భావం శిఖరస్థాయినందుకొని ప్రజాభద్రతకే ముప్పువాటిల్లింది. అదృష్టవశాత్తు రాష్ట్ర ప్రజలలో చివరకు వివేకోదయమయింది. రాష్ట్ర సమైక్యత విచ్ఛిన్నం కాకుండా కాపాడుకోగలిగాం. అయితే అటు తర్వాత ఆంధ్రప్రాంత ప్రజలలో తాము రెండవ తరగతి పౌరులుగా పరిగణించబడుతున్నామనే ఒక అభిప్రాయం ఏర్పడింది. స్వార్థపర రాజకీయవాదులు, సంఘవిద్రోహ శక్తులు ఆర్థిక, రాజకీయ పరిపాలనాది సమస్యలపట్ల జటిల వైఖరి అవలంబించేటట్లు చేయగలిగాయి. రాష్ట్రంలో ఉద్యోగాలకు నియామకం చేయడంలో ముల్కీ నిబంధనల వర్తింపు గురించి సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చినప్పుడు 1971లో ఆంధ్రప్రాంతంలో ప్రచండమైన ఆందోళన ప్రారంభమయింది. ఇది 1969లో తెలంగాణా ప్రాంతంలో జరిగిన ఆందోళన వంటిదే. ఈ రెండు ఆందోళనలు కూడా బాగా ఆలోచించి చేసినవి కావు. రాష్ట్ర సమైక్యాన్ని ప్రమాదం తెచ్చేవిగా వుండడమే కాకుండా, రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఇవి అపారమైన నష్టం వాటిల్లచేశాయి. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆనాడు నినాదం లేవతీశారు. ఈ రెండు ఆందోళనల విషయంలో కేంద్ర ప్రభుత్వం గట్టిగా వ్యవహరించడమే కాకుండా, ఎంతో నేర్పును కూడా ప్రదర్శించింది. ఇది కేంద్ర ప్రభుత్వ రాజకీయ దక్షతకు నిదర్శనం. ఆంధ్రప్రదేశ్ సమగ్రతను పరిరక్షించడంలోనూ, రాష్ట్రాన్ని ఆర్థిక అభ్యుదయపథంలో ముందుకు

నడిపించడంలోనూ ఇది ఎంతగానో తోడ్పడింది. తత్ఫలితంగా రాష్ట్రంలో జీవన ప్రమాణాలు ఇనుమడించి, వీటి ప్రయోజనాలను ప్రతి ఒక్కరూ అనుభవించేందుకు సమాన అవకాశాలు చేకూరాయి.

ఆందోళనలు, అస్థిర పరిస్థితులు, ఉభయ ప్రాంతాలలో నివసించే ప్రజల మధ్య పరస్పర అవిశ్వాసం అడ్డు తగిలినప్పటికీ రాష్ట్రం ఆర్థిక రంగంలో అద్భుత ప్రగతిని సాధించడం అన్నది రాష్ట్ర పరిపాలనా సౌష్ఠవానికి ప్రబల తార్కాణం. బృహత్తరమైన నాగార్జునసాగరు ప్రాజెక్టు, అనేక విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు పూర్తికావడం వల్ల రాష్ట్రం శీఘ్రగతిని ఆర్థిక వికాసం సాధించేందుకు అవసరమైన పరిస్థితులు ఒనగూరాయి. కొన్ని వెనుకబడిన ప్రాంతాలు, మెట్టప్రాంతాలు కృష్ణ, గోదావరి డెల్టా భూముల వలె సస్యశ్యామలమయ్యాయి. నల్గొండ జిల్లాలోని హుజూర్‌నగర్, మిర్యాలగూడ, ప్రాంతాల స్వరూపం పూర్తిగా మారిపోయింది. ఈనాడు అవి వ్యవసాయ కార్యకలాపాలతో కళకళలాడుతున్నాయి. ఒకనాడు బీటలు వారి వుండే ఆ ప్రాంతాలు హరిత సీమలుగా మారినాయంటే ఆశ్చర్యం కలుగకమానదు. కరీంనగర్ జిల్లాలో పోచంపాడు ప్రాజెక్టు వల్ల గణనీయమైన ఆర్థిక పరివర్తన చేకూరుతుంది. ఈ ప్రాంతం కూడా కృష్ణా, గోదావరి డెల్టా భూముల మాదిరి సుసంపన్నమై శోభిల్లగలదు. తెలంగాణా ప్రాంతంలో విద్యారంగంలో సహితం గణనీయమైన పురోగతి కనిపిస్తున్నది. వరంగల్లులో మరొక విశ్వవిద్యాలయ స్థాపన, ప్రాంతీయ ఇంజనీరింగు కళాశాల ఏర్పాటు, హైదరాబాదులో కేంద్ర విశ్వవిద్యాలయం, నాగార్జున ఇంజనీరింగు కళాశాల ప్రారంభం వీటి అన్నింటి వల్ల ఈ ప్రాంతంలోని విద్యార్థులకు ఉన్నత విద్యా సౌకర్యాలు సమకూరాయి. అదే విధంగా ఆంధ్రప్రాంతంలో కూడా విద్యా ప్రగతి గణనీయంగా వున్నది. రాష్ట్ర పురోగతి మూలభూతమైన వ్యవసాయాభివృద్ధి, విద్యా ప్రగతి ఇతోధికంగా సాగుతున్నాయి. రాష్ట్రం శీఘ్రతర అభ్యుదయం సాధించేందుకు సమాయత్తమయింది. ఈనాడు మన రాష్ట్రంలో 10 లక్షల టన్నులకు పైగా మిగులు బియ్యం వుండడం వ్యవసాయరంగంలో మనం సాధించిన అభివృద్ధికి మంచి ఉదాహరణ.

ముఖ్యంగా ఆందోళన అనంతర కాలంలో ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారి చైతన్యవంతమైన నాయకత్వం కింద రాష్ట్రం ఆర్థిక రంగంలో మున్నెన్నడూ లేనంత అభివృద్ధిని సాధించింది. రాజకీయ దక్షత, పరిపాలనా సామర్థ్యం, చైతన్య స్ఫూర్తి వెల్లివిరిసే నాయకత్వం మూర్తీభవించిన శ్రీ జలగం వెంగళరావుగారు రాష్ట్రంలోని నాలుగుకోట్ల ప్రజలకు శాంతి సౌభాగ్యాలు సంతరింపచేశారు. పరిపాలనా పరమైన

నిర్ణయాలు సత్వరమే తీసుకోవడంలో ప్రథమగణ్యులైన ముఖ్యమంత్రి సారథ్యంలో దాదాపు అన్ని రంగాలలోను ఆర్థిక కార్యకలాపాలు ఇనుమడించాయి. విశాలమైన ఖాళీ స్థలాలు, నీటి సదుపాయం మొదలైనవి ఉన్న జంట నగరాలు పారిశ్రామిక కార్యకలాపాలకు ఆటపట్టుగా మారాయి. తద్వారా ఉద్యోగ అవకాశాలు పెంపొందాయి. ఆర్థికాభివృద్ధి సాధ్యపడింది. భవిష్యత్తులో శ్రీ వెంగళరావుగారు రాష్ట్రానికి మరింత ఆర్థికాభ్యున్నతి చేకూర్చగలరనడంలో ఎట్టి సందేహం లేదు. రాష్ట్రంలో నేడు రాజకీయ సమస్యలేవి లేవు. అందుచేత మనం మన సమయాన్ని శక్తి సామర్థ్యాలను సత్వర ఆర్థిక వికాసానికి వినియోగించగలుగుతున్నాం. దీనికి తోడు రాష్ట్రానికి ఎదురయ్యే కొన్ని సమస్యలను పరిష్కరించుకొనేందుకు మనకు కేంద్ర ప్రభుత్వ సహాయ సహకారాలు లభించడం హర్షదాయకం. అంతర్ రాష్ట్ర నదీజలాల వివాద పరిష్కారం గురించి ఈ సందర్భంలో ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉన్నది. రాష్ట్రంలో సుస్థిర పరిస్థితులు ఏర్పడినందువల్ల కొత్త పరిశ్రమలను నెలకొల్పేందుకు పారిశ్రామికవేత్తలు ముందుకు వస్తున్నారు. దీనివల్ల రాష్ట్రం సత్వరంగా పారిశ్రామికవంతమయ్యేందుకు వీలు ఏర్పడింది. పారిశ్రామిక అభివృద్ధి సంస్థ, లఘు పరిశ్రమల అభివృద్ధి సంస్థ, రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ, గనుల వ్యవహారాల సంస్థ, పారిశ్రామిక వసతుల సంస్థ మొదలైన వాటిని ఏర్పాటు చేయడం వల్ల రాష్ట్రంలో ఎన్నో పరిశ్రమల స్థాపనకు అవసరమైన ప్రాథమిక సదుపాయాలు సమకూరాయి. తద్వారా ఆర్థికాభివృద్ధితోపాటు వివిధమైన పరిశ్రమల స్థాపనకు వీలుచేకూరింది. మిగులు ఉత్పత్తి సాధించే విధంగా వ్యవసాయ రంగం అభివృద్ధి చెందడంతో పాటు రాష్ట్రంలో పారిశ్రామిక అభ్యున్నతి కూడ ఈనాడు నెలకొనడం హర్షదాయకం.

భాష బలీయమైన ఐక్యతా బంధమనీ, దానిని భావ సమైక్యాన్ని పెంపొందించే సాధనంగా వినియోగించుకోవడం అవసరమనీ మన ముఖ్యమంత్రి దృఢ విశ్వాసం. ప్రపంచ తెలుగు మహాసభలు జరపడానికి ఇదే ముఖ్యప్రాతిపదిక. ఈ మహాసభలు హైదరాబాదు నగర చరిత్రలో చిరస్మరణీయమైన ఘట్టంగా నిలిచాయి. ఈ మహాసభల వల్ల ఎన్నో ఉత్తమ ఫలితాలు లభించాయి. కేవలం రాష్ట్రంలో నివసించే వారిలోనే కాకుండా, ప్రపంచం నలుమూలలా నివసించే తెలుగు వారందరిలోను తామందరం ఒకే కుటుంబానికి చెందిన వారమన్న ఏకతా భావం ఏర్పడింది. అంతేకాదు, తమ అభ్యున్నతికి పరస్పరం సహకరించుకోవడంతోబాటు తాము నివసిస్తున్న రాష్ట్ర దేశ జీవన స్రవంతిలో మిళితమై ముందుకు సాగిపోవాలన్న భావం వారిలో దృఢపడింది.

ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి ప్రతిపాదించిన ఇరవై సూత్రాల ఆర్థిక కార్యక్రమం అమలు కొనసాగిస్తున్న బహుముఖ కార్యక్రమాల వల్ల రాష్ట్ర ప్రజలలో కొత్త ఆశలు చిగురించాయి. దళిత వర్గాల ప్రజలకు బలహీన వర్గాల ప్రజలకు అభ్యున్నతి చేకూర్చే శ్రేయో రాజ్యంగా ఆంధ్రప్రదేశ్ రూపొందిందన్న విశ్వాసం ప్రజలలో ఏర్పడింది.

జంటనగరాలలోని వివిధ ప్రాంతాలను పట్టణ సీమలుగా తీర్చిదిద్దేందుకు ప్రభుత్వం తీసుకొంటున్న చర్యల వల్ల మన రాజధాని అనతి కాలంలోనే మద్రాసు, బొంబాయి వంటి నగరాలతో సరితూగే స్థాయికి చేరుకోగలదు. మన రాష్ట్రానికి విశాలమైన భూ సంపద ఉన్నది. జీవ నదులు మన రాష్ట్రం గుండా ప్రవహిస్తున్నాయి. ఖనిజ సంపద మనకు సమృద్ధిగా లభిస్తున్నది. ప్రజలలో పరిశ్రమల స్థాపన వల్ల ఉత్సాహం పెల్లుబుకుతున్నది. ప్రజలు కష్టించి పనిచేసే స్వభావం కలవారు. ఇవన్నీ రాష్ట్రాభ్యుదయానికి దోహదం చేస్తాయి. మన రాష్ట్రం ప్రగతి పథగమనంలో బాలారిష్టాలనూ ఎన్నో సమస్యలనూ ఎదుర్కొన్న మాట నిజమే. వాటన్నిటిని అధిగమించి ప్రజలకు సుఖశాంతులు చేకూర్చ గల ఆదర్శసీమగా పరిఢవిల్లేందుకు రాష్ట్రం పురోగమిస్తుంది.

# 10. నూరేళ్ల పండుగ

"భరతఖండంబు చక్కని పాడియావు" అన్నారు మహాకవి చిలకమర్తి. చిరకాలంగా "రత్నగర్భ"గా మన దేశం విదేశాలలో పేరు పొందింది. మనదేశంలోని రత్నాల కోసం విదేశీయులు ఆశపడ్డారు. ఈ దేశం వచ్చారు. వీరిలో కొంతమంది వ్యాపారం కోసం వచ్చారు. మరికొందరు యాత్రికులుగా వచ్చారు. ఇంకొందరు ఏకంగా దండయాత్రలే చేశారు. ఇలా వచ్చినవారు ఏదో ఒక ప్రాంతానికో, దేశానికో చెందిన వారు కాదు. గ్రీకులు వచ్చారు. రోమనులు వచ్చారు. అరబ్బులు వచ్చారు. వాణిజ్యపరంగానూ, యుద్ధాలపరంగానూ మనదేశ సంపదను కొల్లగొట్టుకుపోయారు.

రెండవదశలో వ్యాపారం కోసమనీ, మతప్రచారంకోసమనీ ఐరోపా వాసులు రావడం ప్రారంభించారు. ఇలా వచ్చినవారిలో ప్రథములు పోర్చుగీసువారు. ఆ తరువాత డచ్చి దేశీయులు, వారినిచూచి ఫ్రెంచి వారూ, వారి తరువాత ఇంగ్లీషువారూ వచ్చారు.

వ్యాపారంకోసమంటూ వచ్చిన ఇంగ్లీషువారు 1600లో ఈస్టిండియా కంపెనీని స్థాపించారు. వీరు ఫ్యాక్టరీలు స్థాపించి వస్తువులను తయారు చేసేవారు. ఈ ఉత్పత్తుల్ని దాచడం కోసం గోదాములను నిర్మించారు. ఈ గోదాముల చుట్టూ కోటల్లాంటి గోడలను కట్టారు. ఈ కోటల రక్షణ కోసం చిన్నచిన్న సంఖ్యలలో సైనికులను ఏర్పాటు చేసుకొన్నారు.

అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ వ్యాపారరంగంలో పోటీ ఉంది, ఉంటుంది. ఈ పోటీ ముడిసరకులు, మానవశ్రమ, అమ్మకాలకు సంబంధించినదయి వుంటుంది. వ్యాపారం కోసం మనదేశం వచ్చిన వివిధ విదేశీ వాణిజ్యవర్గాల మధ్య వ్యాపారానికి సంబంధించి వచ్చిన పోటీలు ఆ మేరకే పరిమితయివుండలేదు. అవి వాగ్వాదాలు గానూ, తగాదాలు గానూ, కయ్యాలుగానూ, అప్పుడప్పుడూ సాయుధ సంఘర్షణలు గానూ రూపాంతరం చెందుతూ వుండేవి.

అప్పుడే - అనగా- 1707 సంవత్సరంలో ఔరంగజేబు మరణించాడు. బలమయిన కేంద్రప్రభుత్వం ఔరంగజేబు మరణంతో బలహీనపడి పోయింది. అప్పటిదాకా ఔరంగజేబుకు లొంగివున్న చిన్న చిన్న రాజులూ, ఓ మాదిరి ప్రభువులూ,

తాము స్వతంత్రులమంటూ ప్రకటించుకొన్నారు. రాజకీయంగానూ, పాలనాపరంగానూ దేశం అల్లకల్లోలంగా తయారయింది. ఈ కల్లోల వాతావరణాన్ని పాలకుల మధ్యగల అనైక్యతనూ ఇంగ్లీషువారు వినియోగించుకొన్నారు. వ్యాపారం కోసమంటూ వచ్చిన ఆంగ్లేయులు ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం చేసుకోవడం ప్రారంభించారు. ఇలాగ జోక్యం చేసుకోవడంలో కూడా ఈ విదేశీయుల మధ్య పోటీలు ఏర్పడినాయి. దేశీయ పాలకుల్లో చాలామంది ఇంకో పాలకుడిని ఓడించటంకోసం విదేశీయుల సహాయాన్ని కోరడం ప్రారంభించారు.

1757లో ప్లాసీయుద్ధం జరిగింది. ఈస్టిండియా కంపెనీవారు తమ శక్తులన్నింటినీ కేంద్రీకరించి సిరాజ్ ఉద్దౌలాను ఓడించారు. వంగ ప్రాంతమంతా వారి స్వాధీనమయింది. పరస్పర కయ్యాలలో బలహీనులయిన దేశీయ రాజులను వోడించటంలో ఇంగ్లీషువారు కుటిల యత్నాలు చాలా చేశారు. ఎదుటివారి పరాజయాన్ని మాత్రమే కోరుకున్న దేశీయపాలకులు తాము దేశానికి చేస్తున్న ద్రోహాన్ని గురించి ఆలోచించడమే మానివేశారు. ఒక టిప్పు సుల్తాను, మహారాష్ట్ర వీరులు - ఇంగ్లీషు వారితో యుద్ధాలు చేసినమాట నిజమేగాని అపారమయిన ఆంగ్లేయుల సైనిక బలం ముందు నిలువలేకపోయారు. క్రమక్రమంగా దేశం ఇంగ్లీషువారి వశమయింది. వారన్ హేస్టింగ్స్‌ను గవర్నర్ జనరల్‌గా వారు నియమించారు. డల్‌హౌసి అన్న గవర్నర్ జనరల్ ఒక కొత్త విధానాన్ని ప్రకటించాడు. సంతానం లేకుండా చనిపోయిన స్వదేశ సంస్థానాధీశుని రాజ్యం బ్రిటీష్ రాజ్యంలో కలుస్తుందన్నాడు. ఈ ప్రకటన దేశములో అలజడిని రేపింది. వారసులు లేని చిన్న చిన్న సంస్థానాలను బ్రిటీష్ వారు కలుపుకొనడంతో ఈ అలజడి అగ్నిరూపం దాల్చింది. ఈ అగ్నిజ్వాలలు ఉత్తర భారత దేశాన్ని అలముకున్నాయి. నానా సాహెబ్. తాంతియాతోపే, ఝాన్సీలక్ష్మీబాయి వంటి వారు ఈ తిరుగుబాటుకు నాయకత్వం వహించారు.

ఆంగ్ల ప్రభుత్వం ఈ స్వాతంత్ర్య పోరాటాన్ని పరమ క్రూరంగా అణచి వేసింది. వేలాదిమందిని నిర్దయగా సంహరించారు. ఝాన్సీ లక్ష్మీబాయి యుద్ధం చేస్తూనే, యుద్ధభూమిలోనే మరణించింది. తాంతియా తోపేను బంధించి ఉరికంబ మెక్కించారు. నానాసాహెబ్ అదృశ్యమయ్యాడు. ఈ స్వాతంత్ర్యపోరాటాన్ని "సిపాయిల తిరుగుబాటు" అని ఆంగ్ల చరిత్రకారులు వర్ణించారు.

ఇప్పటిదాకా పరిపాలన ఈస్టిండియా కంపెనీ ఆధ్వర్యంలోనే వుండేది. ఆ తరువాతనే బ్రిటీషుమహా సామ్రాజ్యంలో మనదేశం కూడా ఒక భాగమయిపోయింది.

1857-58 సంవత్సరం నాటికి దేశ స్వరూపంలో కొన్ని మార్పులు కూడా వచ్చాయి. రహదారులు ఏర్పడినాయి. రైలు మార్గాలు వచ్చాయి. తపాలా సదుపాయాలు, తంతి సౌకర్యాలూ వొనగూడాయి. అచ్చుయంత్రాలు, వార్తాపత్రికలూ, సైకిళ్ళు, కార్లు వాడుకలోకొచ్చాయి. వీటన్నిటినీ మించి ఆంగ్ల భాష పాఠశాలల్లో చోటు చేసుకున్నది. అదే ప్రభుత్వ భాషగా కూర్చున్నది. ఆ భాష వచ్చిన వారికి ప్రభుత్వం ఉద్యోగాలు లభిస్తున్నాయి. అందుచేత సంపన్నులయిన వారు తమ పిల్లలకు ఇంగ్లీషు చెప్పించడం ప్రారంభించారు. ఈ ఆంగ్ల విద్యాభ్యాసం అనేక రకాలుగా భారతీయులకు లాభించింది.

దేశ స్వరూపంలో కొట్టవచ్చినట్లుగా కనిపిస్తున్న ఈ మార్పుల వెనుక దోపిడీ విధానం దాగివున్న సంగతి సామాన్యులకు తెలియక పోయినా విద్యావంతులకు తెలుసు. ఈ విధానాన్ని మార్చాలన్న ఆలోచనలు వారు చేశారు.

ఇంగ్లీషువారి పరిపాలనా విధానంలో సంస్కరణలు రావాలనీ మార్పులు జరగాలనీ వివిధ ప్రాంతాలలోని మేధావులు ఆలోచించారు. తమ ఆలోచనల కొక రూపంగా చిన్నచిన్న సంస్థలు, సంఘాలు ఏర్పాటు చేసుకొన్నారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి సుమారు 20 సంవత్సరాల ముందుగా అంటే 1838 సంవత్సరంలోనే కలకత్తాలో "లాండ్‌హోల్డర్సు సొసైటీ" ఏర్పడినది. భారత స్వాతంత్ర్య మహా ఉద్యమానికి ఈ సంస్థ శ్రీకారం చుట్టిందని రాజనీతి శాస్త్రవేత్తల అభిప్రాయము. 1851వ సంవత్సరములో "బ్రిటీష్ ఇండియన్ అసోసియేషన్" అన్న సంస్థ ప్రభుత్వ యంత్రాంగంలో దేశీయులకు సముచిత స్థానం ఇవ్వాలంటూ బ్రిటీష్ పార్లమెంటుకు విజ్ఞప్తి చేసింది. 1857లో "ఈస్టిండియా అసోసియేషన్" రూపొందింది. శిశిరకుమార్ ఘోష్ ఆధ్వర్యాన "బెంగాల్ నేషనల్ లీగ్', ఆనందమోహన బోస్, సురేంద్రనాథ్ బెనర్జీల ఆధ్వర్యాన "ఇండియన్ అసోసియేషన్", వీరరాఘవాచార్లు, సుబ్రహ్మణ్య అయ్యర్, ఆనందాచార్లు మొదలైన వారి నాయకత్వాన "మద్రాసు మహా జనసభ", ఫిరోజ్‌షా మెహతీ, కె.టి. తెలోంగ్, బదరుద్దీన్‌త్యాబ్జి వంటి మేధావుల నాయకత్వాన "బాంబే ప్రెసిడెన్సీ అసోసియేషన్" వంటి సంస్థలు ప్రజల అభిప్రాయాలను, ఆలోచనలను ప్రభుత్వానికి తెలియజేస్తుండేవి.

దేశంలోని వివిధ ప్రాంతాలలోని విద్యావంతులలో చెలరేగుతున్న అసంతృప్తి జ్వాలలను ప్రభుత్వం గమనించింది. వీటి ఫలితాలను అది చూచాయగా ఊహించింది కూడా.

ఇంతకుముందే మనం చెప్పుకున్నట్లుగా, దేశంలోని వివిధ ప్రాంతాలలో అనేక సంస్థలు ఉన్నాయి కానీ వాటి మధ్య సరైన సానుకూల్యం కొరవడింది.

1883లో సురేంద్రనాథ్ బెనర్జీ గారు "ఇండియన్ అసోసియేషన్" అన్న తమ రాజకీయ సంస్థ ఆధ్వర్యాన మొట్టమొదటిసారిగా జాతీయ మహాసభను నిర్వహించారు. ఆనంద మోహన్ బసుగారు ఆ మహాసభకు అధ్యక్షత వహించారు. బ్రిటీష్ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలను విమర్శిస్తూ, సూచనల రూపంలో అనేక తీర్మానాలను ఆ మహాసభ ఆమోదించింది. ఈ తీర్మానాలను, అందులో వ్యక్తమైన అభిప్రాయాలను ప్రభుత్వం చేత ఆమోదింపజేయడానికి జాతీయ స్థాయిలో ఒక సంస్థ ఉండటం అవసరమనికూడా సభా నిర్వాహకులు నిర్ణయించారు. ఈ నిర్ణయం కార్యరూపం దాల్చడానికి రెండు సంవత్సరాలు పట్టింది.

అల్లాన్ అక్టేవియన్ హ్యూమ్ 1882వ సంవత్సరంలో ఉద్యోగ విరమణ చేశారు. దేశ రాజకీయ రంగంలో ప్రవేశించాడు. దేశాభిమానం ఉండి, తన జాతికి సేవ చేద్దామన్న ఉత్సాహంతో ఉరకలు వేస్తున్న భారతీయ యువకులను ఆయన చేరదీశారు. వారికి తగిన సూచనలూ, సలహాలూ ఇచ్చారు. 1884 డిసెంబర్ మాసంలో ఈ యువకులనూ, మరికొందరనూ సమావేశపరిచాడు. ఆ సమావేశాలనే "ఇండియన్ నేషనల్ యూనియన్" అన్న వ్యవస్థ తన రూపురేఖలను సంతరించుకొన్నది. 1885 మార్చిల ఈ సంస్థ పక్షాన కలకత్తాలోని నాయకులతో సంప్రదింపులు జరిపాడు. అదే సంవత్సరం డిసెంబర్‌లో పూనా నగరంలో "ఇండియన్ నేషనల్ యూనియన్" తొలి సమావేశము జరపడానికి నిర్ణయించాడు. అందుకవసరమయిన ఏర్పాట్లన్నీ చేశాడు.

1885 డిసెంబర్‌లో పూనాలో అంటువ్యాధి వ్యాపించింది. అందుకని సమావేశ స్థలాన్ని బొంబాయికి మార్చవలసి వచ్చింది. బొంబాయి ప్రెసిడెన్సీ అసోసియేషన్ వారూ, గోకుల్‌దాస్, తేజ్‌పాల్ సంస్కృత కళాశాల కార్యనిర్వాహక వర్గం వారూ ఈ మహాసభలు జయప్రదం కావడానికి చాలా సహాయం చేశారు.

దాదాభాయినౌరోజీ, కాశీనాథ త్రియంబక్‌తేలంగ్, ఫిరోజ్‌షామెహతా, దిన్షీఏదుల్జీబావా, రహంతుల్లా, నయాని, బెహ్రాంజీమలబారీ, గణేష్‌నారాయణ్ చందావర్కార్, పి. రంగయ్యనాయుడు, సుబ్రహ్మణ్య అయ్యర్, పి. ఆనందాచార్లు, యం. వీరరాఘవాచారియార్, సింగరాజు వెంకట సుబ్బారాయుడు, పి. కేశవపిళ్లై మొదలయిన వారు హాజరయ్యారు.

చారిత్రాత్మకమయిన ఆ మహాసభలకు డబ్ల్యు.సి. బెనర్జీ అధ్యక్షత వహించారు. 1885 డిసెంబర్ 28, 29 తేదీలలో జరిగిన ఆ సభలు భారత చరిత్రను కొత్తమలుపును తిప్పాయి. ఆ మహాసభలలోనే "ఇండియన్ నేషనల్ యూనియన్" తన పేరును "భారత జాతీయ కాంగ్రెస్సు"గా మార్చుకున్నది. జార్జియూక్, ఆల్‌ఫ్రెడ్‌విబ్, సర్‌హెన్రీకాటన్, సర్‌విలియం వెన్జర్ బరన్ కాంగ్రెస్ సంస్థకు అధ్యక్షులుగా వున్నారు.

బొంబాయిలో జరిగిన ఈ తొలి మహాసభకు హాజరయిన సభ్యులలో ఇద్దరు ముస్లింలున్నారు. ఇవాన్‌పాష్లివిచ్‌మిన్‌యేఖ్ అన్న రష్యను కూడా ప్రేక్షకుడిగా వచ్చారు.

ఆనాటి నుంచీ భారత జాతీయ కాంగ్రెస్ దేశ రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించింది. నిద్రాణమైన జాతిని జాగృతం చేసింది. రవి అస్తమించని ఆంగ్ల సామ్రాజ్యంలో సూర్యుడు అస్తమించేలా చేసింది. ఈ మహోద్యమంలో తమ సర్వస్వాన్ని త్యాగం చేసిన ఆమహనీయులందర్నీ ఈ శతవార్షికోత్సవాల సందర్భంగా మరొకసారి స్మరించుకొందాం. పవిత్రమయిన వారి జీవిత చరిత్రల నుంచి నూతన స్ఫూర్తిని పొందుదాం.

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | అంతర్జాతీయ తెలుగు సంస్థ | 241 |
| 2. | ఇతర రాష్ట్రాలలో తెలుగువారు : విద్యా సాంస్కృతిక సమస్యలు | 245 |
| 3. | ప్రపంచ తెలుగు మహాసభలు - వాటి ప్రత్యేకత | 250 |
| 4. | ద్రవిడ భాషాశాస్త్రవేత్తల 6వ అఖిలభారత మహాసభ అధ్యక్షోపన్యాసం | 254 |
| 5. | తిరువాయూరులో 130 వార్షిక శ్రీత్యాగరాజస్వామి వారి ఆరాధనోత్సవాలు | 258 |

# 1. అంతర్జాతీయ తెలుగు సంస్థ

పూజ్యులు భారత రాష్ట్రపతిగారూ, ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఎస్ ఓబుల్‌రెడ్డి గారూ, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారూ, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారూ డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారూ !!

మిత్రులారా!

అందరికీ సుస్వాగతం. తెలుగుజాతి మహత్తరచరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయదగిన శుభదినం ఈ రోజు ప్రపంచ తెలుగు మహాసభల చివరి రోజున విచ్చేసి, తమ స్నాతకోపన్యాసంతో ఆరుకోట్ల తెలుగు ప్రజల నుత్తేజపరచిన పూజ్య రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌గారు, ఆ మహాసభల సర్వవసానంగా ఏర్పడిన "అంతర్జాతీయ తెలుగు సంస్థ" కు ప్రారంభోత్సవం జరపటానికి దయతో అంగీకరించటం, అందు నిమిత్తం ఈ రోజున ఇక్కడికి దయచేయటం మహాభాగ్యంగా భావిస్తున్నాను.

ఈ అంతర్జాతీయ తెలుగు సంస్థ స్వతంత్రప్రతిపత్తి గల సంస్థగా రూపొందించబడింది. దీనికి ప్రత్యేక పాలకవర్గం ఉంది ఇందువల్ల కార్యకలాపాలు వేగంగా జరగటానికి ఈవకాశం లభిస్తుంది.

మళ్లీ ఇంకో క్రొత్త సంస్థను ఎందుకు ప్రారంభించవలసి వచ్చిందో వివరిస్తాను. ఇప్పుడు సాంస్కృతికరంగంలో పనిచేస్తున్న సంస్థలు వేళ్ళ మీద లెక్కింపదగినవి మాత్రమే–అవి తమ తమ కార్యకలాపాలను ఇంచుమించుగా ఆంధ్రప్రదేశ్‌కు మాత్రమే పరిమితం చేసి పనిచేస్తున్నవి. తెలుగువారు ఆంధ్రప్రదేశ్‌కు వెలుపల, భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోను నివసిస్తున్నారు. అంతే కాదు, బౌద్ధ పూర్వయుగం నుంచి తెలుగువారు పెద్ద ఎత్తున ప్రపంచం నలుమూలలకూ ముఖ్యంగా ఆగ్నేయాసియా దేశాలకు వలస వెళ్లటం జరిగింది. ఇట్లా ఇతరరాష్ట్రాలలో, ఇతరదేశాలలో స్థిరపడిన తెలుగువారి ప్రతినిధులందరూ ప్రప్రథమంగా ఒక వేదిక మీద కలుసుకోనే సదవకాశం ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా లభించింది. ఆ మహాసభలలో ఆ విధంగా కలుసుకోవటం వల్ల ప్రపంచమంతా వ్యాపించి ఉన్న తెలుగువారిలో ఒక

నూతనోత్సాహం వెల్లివిరిసింది. వారంతా సాంస్కృతికంగా ఆంధ్రప్రదేశ్‌తో సత్సంబంధాలు ఏర్పరచుకోవాలని తహతహ చెందటం జరిగింది. దాని పర్యవసానమే ఈ అంతర్జాతీయ తెలుగు సంస్థ ఆవిర్భావం.

ఇతరరాష్ట్రాలలో, ఇతరదేశాలలో స్థిరపడిన తెలుగువారికి, ముఖ్యంగా తెలుగు బోధించే ఉపాధ్యాయులు కావాలి. చదువుకోవటానికి తెలుగులో ప్రచురితమవుతున్న సాహిత్యం, పత్రికలు, పాఠ్యగ్రంథాలు కావాలి. చూచి ఆనందించటానికి తెలుగు సినిమాలు కావాలి. విని తన్మయం చెందటానికి తెలుగు సంగీతం కావాలి. సాంస్కృతికమైన సంబంధాలు సుస్థిరంగా ఉండటానికి సాంస్కృతికబృందాల వినిమయం జరుగుతూ ఉండాలి. సాంస్కృతికమైన ఈ సౌకర్యాలను కలుగజేయటానికి ప్రభుత్వ విద్యాశాఖలో ఒక ప్రత్యేకవిభాగం ఏర్పాటు అయింది. ఈ ప్రత్యేకవిభాగానికి అంతర్జాతీయ తెలుగు సంస్థ సహాయసహకారాలు అందిస్తుంది. ప్రభుత్వకార్యక్రమాల విజయానికి తోడ్పడుతుంది.

తెలుగు మాట్లాడే ప్రజలు దాదాపు ఆరుకోట్ల వరకు ఉన్నారు. భారతదేశంలో హిందీ మాట్లాడేవారి తరువాతి స్థానం తెలుగువారిదే అయినప్పటికీ, తెలుగును గూర్చి, తెలుగువారిని గూర్చి, వారి సంస్కృతిని గూర్చి ఇతరదేశాలలోనే కాక ఇతరరాష్ట్రాలలో కూడా అంతగా తెలియదు. ఇట్టి పరిస్థితికి మన ప్రయత్నలోపం కూడా ఒక కారణం కావచ్చు. మాకు రెండు వేల అయిదు వందల సంవత్సరాల చరిత్ర, సంస్కృతిక ఉన్నాయి. వెయ్యి సంవత్సరాల ప్రౌఢసాహిత్యం వగైరాలకు సంబంధించిన గ్రంథాలు ప్రపంచభాష అయిన ఇంగ్లీషులోకి, జాతీయభాష అయిన హిందీలోకి ముందుగా అనువాదం చేయించి, ప్రచురించవలసిన అవసరం ఎంతో ఉంది. ఇందుకు ఎంత త్వరగా పూనుకుంటే అంత మంచిది. ఈ కార్యక్రమాన్ని అంతర్జాతీయ తెలుగు సంస్థ చేపడుతుంది. మాతృభాషలో ఉన్నత విద్యాబోధన జరుగుతున్న ఈ కాలంలో చక్కని అనువాదాలకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఉభయభాషలలో ప్రవీణులైనవారికి తెలుగు బోధించి, వారిని మంచి అనువాదకులుగా తీర్చిదిద్దవలసి ఉంటుంది. అందుచేత అనువాదశాఖకు ఈ సంస్థలో ప్రముఖమైన స్థానం ఉంటుంది.

అనువాదాలు చేయించి, గ్రంథాలు ప్రకటించటానికి చాలా కాలం పడుతుంది. అందుచేత ఒక పత్రిక ప్రచురణ ద్వారా తెలుగును గూర్చి ఇతరులకు చెప్పటానికి ముందుగా ఈ సంస్థ పూనుకొంటుంది.

తెలుగువారి భాషాసాహిత్యాలను గూర్చి, చరిత్రను గూర్చి, సంస్కృతిని గూర్చి వివిధరంగాలలో అధ్యయనం, పరిశోధనలు కొంత వరకు సాగుతున్నవి. కాని జరుగవలసినది ఇంకా ఎంతో ఉన్నది. ఈ విషయాలపై కృషిచేసే పరిశోధకులకు, సంస్థలకు, విద్వాంసులకు, విద్యార్థులకు సౌకర్యాలు సమకూర్చే విధంగా ఈ సంస్థను రూపొందించటానికి ప్రయత్నం జరుగుతుంది. ఇందు నిమిత్తం ఈ సంస్థలో ఒక పెద్ద రిఫరెన్స్ లైబ్రరీ ఏర్పాటు కావలసి ఉన్నది. మన రాష్ట్రంలో మాజీ జమీందారుల వద్ద రాజుల వద్ద మంచి గ్రంథాలయాలున్నవి. అట్లాగే కొందరు వ్యక్తుల వద్ద, మూతబడిన కొన్ని సంస్థల వద్ద ఉత్తమగ్రంథాలున్నవి. వీటిని ఈ అంతర్జాతీయ సంస్థకు బహూకరించవలసినదిగా ఈ సందర్భంలో విజ్ఞప్తి చేస్తున్నాను. ఇందు వల్ల బహుళ ప్రయోజనకారి అయిన ఒక ఉత్తమ కృషికి దోహదం చేసినవారు అవుతారు.

తెలుగు తెలియనివారు తెలుగు నేర్చుకోవటానికి ఇప్పుడున్న అవకాశాలు చాలా తక్కువఉన్న అవకాశాలలో కూడా ఆధునికసౌకర్యాలు అసలే లేవని చెప్పవచ్చు. దేశం నుంచీ విదేశాల నుంచీ, వచ్చే పరిశోధకులకు, విద్వాంసులకు, విద్యార్థులకు ఆధునికపద్ధతులలో తెలుగు నేర్పడానికి ఈ అంతర్జాతీయసంస్థలో ఒక లాంగ్వేజి లాబొరేటరీని నెలకొల్పడం జరుగుతుంది. తెలుగు భాషాధ్యయనం సులభం అయినప్పుడు ఈ భాషను నేర్చుకోవటానికి ఇతరభాషలవారు చాలామంది ముందుకు వస్తారు. ఇందు వల్ల వివిధభాషలవారి మధ్య సదవగాహన పెంపొందుతుంది. వివిధ భాషాసాహిత్యాలను గూర్చి, సంస్కృతులను గూర్చి తులనాత్మకమైన అధ్యయనం, పరిశోధన సాధ్యపడుతాయి.

అంతర్జాతీయ తెలుగు సంస్థను క్రొత్తగా ఎందుకు ప్రారంభించవలసి వచ్చిందో వివరించటంలో, ఆ సంస్థ ఆశయాలను కార్యకలాపాలను కొంత వరకు తెలియపర్చాను. వీటినే కాక ఈ సంస్థ ఇంకా ఎన్నో కార్యక్రమాలను ప్రణాళికలను చేపట్టవలసి ఉన్నది. ఈ ప్రయత్నంలో సాహితీవేత్తలు, కళాకారులు, సహృదయులందరూ సంపూర్ణమైన సహాయసహకారాలు అందించగలరని విశ్వసిస్తున్నాను. అంతేకాదు అంతర్జాతీయ తెలుగు సంస్థ కృషి విజయవంతం కావలెనంటే రాష్ట్రప్రభుత్వం చేస్తున్న సహాయం మాత్రమే చాలదు. కేంద్ర ప్రభుత్వం, యునెస్కో వంటి అంతర్జాతీయ సమితులు ఈ సంస్థను గుర్తించి, బాగా ఆర్థికసహాయం చేయవలసి ఉంటుంది. పూజ్య రాష్ట్రపతి ఆశీస్సుల వల్ల ఇవి లభ్యం కాగలవని విశ్వసిస్తున్నాను.

ప్రపంచ తెలుగు మహాసభల ఆశయాలకు అనుగుణంగా రూపొందిన ఈ అంతర్జాతీయ సంస్థ చిహ్నానికి మహాసభల చిహ్నంలోని అంశాలనే గ్రహించటం జరిగింది. ఈ చిహ్నాన్ని ఆవిష్కరించటం ద్వారా రాష్ట్రపతి ఈ అంతర్జాతీయ తెలుగు సంస్థకు ఈ రోజు ప్రారంభోత్సవం చేస్తారు.

ఈ ప్రారంభోత్సవానికి సహృదయంతో విచ్చేసిన మీ అందరికి మరల స్వాగతం పలుకుతూ సెలవు తీసుకొంటున్నాను.

*(8-3-1975)*

## 2. ఇతర రాష్ట్రాలలో తెలుగువారు : విద్యా సాంస్కృతిక సమస్యలు

గడిచిన సంవత్సరం ఉగాదికి మనం చారిత్రక సంఘటన అని ప్రశంస లందుకొన్న, ప్రపంచ తెలుగు మహాసభలను ఎంతో విజయవంతంగా జరుపుకొన్నాం. ఆ సందర్భంలో తెలుగువారు ప్రపంచంలో ఏ ప్రాంతంలో ఉన్నా, ఏ మూల ఉన్నా అంతా ఒకటే అన్న ఆత్మీయత వెల్లివిరిసింది. ఇరవై అయిదు శతాబ్దాల చరిత్రలో రూపుదిద్దుకొన్న తెలుగుజాతి సంస్కృతీ ప్రాభవ వైభవాల గూర్చి, తీయదనాల బోవులైన భాషా సాహిత్యాల సౌష్ఠవ పరిపుష్టుల గూర్చి ఆనంద గర్వాలతో మననం చేసుకుని మనకు అబ్బిన తరతరాల పెన్నిధిని పరిరక్షించుకొని, అభ్యుదయపథంలో అడుగు ముందుకు వేయడానికి మనము కృతనిశ్చయులమైనాము.

ఈ ఉత్సాహం, ఈ దీక్ష జాతీయతాభావస్ఫూర్తికి, సర్వమానవ సౌహార్దదీప్తికి వ్యతిరేకమైనవి ఎంతమాత్రం కావు. ఓ ప్రక్క వ్యక్తి బాగుపడేటప్పుడే సమాజం యావత్తు శ్రేయో సమాజం అయినట్లే, భిన్న భాషా సంస్కృతుల వాహినులు పుష్టిచెందినప్పుడే జాతీయతా మహానది అవిచ్ఛిన్నంగా సుసంపన్నమౌతుంది.

ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకొని వెల్లివిరిసిన చైతన్యాన్ని క్రమబద్ధం చేసిన ఘనతకు ఉన్ముఖంగా మళ్ళించుకోవటానికి మనరాష్ట్ర ప్రభుత్వం అవసరమైన చర్యలన్నింటిని తీసుకొంటున్నది. ఆనాటి ఉత్సాహం, దీక్ష పునాదిగా విశిష్టమైన ప్రాముఖ్యంగల మూడు నిర్మాణాత్మక వ్యవస్థలను నెలకొల్పడం జరిగింది. అవి. 1.అంతర్జాతీయ తెలుగు సంస్థ, 2.తరతరాల తెలుగు వైభవాన్ని ప్రదర్శించే సంగ్రహాలయం, 3.ఆంధ్రప్రదేశ్ సచివాలయంలో విద్యాశాఖలో ఇతర రాష్ట్రాలలోను, ఇతర దేశాలలోను నివసిస్తున్న తెలుగువారి విద్యాసాంస్కృతిక సమస్యలను పరిశీలించి సహాయపడగలందుకు ఒక ప్రత్యేకమైన విభాగం.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత నాటక లలిత కళాది వివిధ రంగాలలో ప్రత్యేక కృషిచేసే అకాడమీలు బహుకాలంగా పనిచేస్తూనే ఉన్నాయి. అయినా ఈ కృషి ఫలితం ఆంధ్రప్రదేశ్ వెలుపల ఉంటున్న తెలుగు వాళ్ల సమస్యలను గురించి తెలుసుకుని, విశ్లేషించి, ప్రత్యేకమైన నిపుణ సహాయం అందజేయాలన్నా, వాళ్లకు అందాలన్నా

అదే పనిగా అంకితమైన సంస్థ ఒకటి ఉండటంలోని ఆవశ్యకతను విజ్ఞులు గుర్తించకపోరు. అంతర్జాతీయ తెలుగు సంస్థను స్థాపించటంలోని ముఖ్యమైన ఆంతర్యం అదే. ఒక ప్రక్కన తెలుగు చరిత్ర, సంస్కృతి, భాష సాహిత్యాల పుష్టికోసం మరోప్రక్కన, ఆర్థిక, సామాజికాది కారణాలచేత తెలుగు దేశానికి దూరంగా ఉండిపోవలసి వచ్చిన సోదరుల తుష్టి కోసం ఈ సంస్థ పరిశ్రమ చేస్తుంది. కార్యాచరణ రంగంలో రాష్ట్ర ప్రభుత్వం అనుసరించదగిన విధానాలకు, తీసుకోదగిన చర్యలకు ఈ సంస్థ సేకరించే సమాచారం, జరిపే విశ్లేషణ, ఇచ్చే నిపుణుల సూచనలు ఎంతో ఉపయోగకరంగా ఉండగలవు. రాష్ట్ర సచివాలయంలో విద్యాశాఖలోని ప్రత్యేక విభాగం అంతర్జాతీయ తెలుగు సంస్థ చేసే కృషి ప్రాతిపదికగా చర్యలు తీసుకొంటుంది.

1964వ సంవత్సరంలో రాష్ట్ర ప్రభుత్వంలో సాంస్కృతిక వ్యవహారాల విభాగం ఏర్పాటుచేయబడింది. ఎం.ఆర్.అప్పారావుగారు తొలి సాంస్కృతిక వ్యవహారాల మంత్రి. అప్పుడే రాష్ట్రస్థాయిలో సాంస్కృతిక వ్యవహారాలు చూసే నిమిత్తం ఒక ప్రత్యేకాధికారి నియామకం కూడా జరిగింది. డా॥పి.ఎస్.ఆర్. అప్పారావుకు ఈ బాధ్యత అప్పగించబడింది. ఎం.ఆర్.అప్పారావుగారు సాంస్కృతిక కార్యక్రమాలకు ప్రోత్సాహం ఇచ్చే నిమిత్తం అనేక పథకాలు తలపెట్టినారు. ఈ సాంస్కృతిక వ్యవహారాల విభాగం అకాడమీలనే కాక స్వచ్ఛందంగా పనిచేసే సాంస్కృతిక సంస్థలను కూడా అనేక విధాలుగా ప్రోత్సహించసాగింది. సాంస్కృతిక కార్యక్రమాలకు, ఉత్సవాలకు, బహిరంగ నాటకశాలల నిర్మాణాలకు, కళలకు సంబంధించిన పుస్తకాల ప్రచురణకు, ప్రచురించబడిన పుస్తకాల కొనుగోలుకు ధన సహాయం చేయసాగింది. దయనీయమైన స్థితిలో ఉన్న వృద్ధ కళాకారులకు, రచయితలకు, క్రీడాకారులకు ఉపకార వేతనాలు ఇవ్వసాగింది. ఇందువల్ల జిల్లాలలో ఉన్నవారికి కూడా కొంత సహాయం జరుగుతూ వచ్చింది.

అయితే జిల్లాలలో కూడా బాగా సంచలనం రావాలని, సాంస్కృతిక కార్యకలాపాలు బాగా జరగాలని పెద్దలు అనుకోవటం జరిగింది. ఈ విషయాన్ని బాగా ఆలోచించి సూచనలు చేసే నిమిత్తం రాష్ట్రప్రభుత్వం 1972లో అకాడమీల పరిశీలక సంఘాన్ని నియమించింది. ఈ సంఘంవారు విస్తృతంగా పర్యటించి, విజ్ఞుల అభిప్రాయాలను సేకరించి, ఒక నివేదిక సమర్పించారు. ఆ నివేదికలోని సప్తమాధ్యాయంలో రాష్ట్రవ్యాప్తంగా సాంస్కృతిక కార్యకలాపాలు జరిగే విధానం విస్పష్టంగా సూచించబడింది. ఈ పరిశీలక సంఘంవారి నివేదికలోని ప్రధానమైన

సూచనలలో మూడు నాలుగింటిని ఆమోదించి రాష్ట్రప్రభుత్వం 1974-75లో అమలు జరిపింది. ఇందులో మొదటిది- రాష్ట్రంలోని మూడు అకాడమీల గ్రాంటులను ఇంచుమించుగా రెట్టింపు చేయడం. ఐదు కోట్ల వరకు జనాభా ఉన్న రాష్ట్రానికి ప్రాతినిధ్యం వహించే అకాడమీలు సమర్థవంతంగా, ప్రయోజనాత్మకంగా పనిచేయాలంటే వాటి ఆర్థిక స్తోమత బాగా ఉండాలి. ఇంత వరకు సంవత్సరానికి రూ. 1-50 లక్షల గ్రాంటు మాత్రమే వచ్చే సాహిత్య అకాడమీకి ఇప్పుడు సంవత్సరానికి మూడు లక్షల గ్రాంటు వస్తున్నది. అట్లాగే రెండు లక్షల పాతికవేలు గ్రాంటువస్తున్న సంగీత నాటక అకాడమీకి నాలుగు లక్షలు, ఒక లక్ష రూపాయలు మాత్రమే వస్తున్న లలిత కళా అకాడమీకి రెండు లక్షల రూపాయలు గ్రాంటుగా లభిస్తున్నది. దీనితో మూడు అకాడమీలు తమ తమ కార్యకలాపాలను మరింత విస్తృతం చేసుకొనటానికి అవకాశం లభించింది.

అకాడమీల పరిశీలక సంఘం చేసిన రెండో సూచన అసహాయులైన వృద్ధ రచయితలకు, కవులకూ, కళాకారులకూ ఇంత వరకు వస్తున్న గౌరవ భృతిని పెంచటం. ఇంకా ఎక్కువ మందికి గౌరవ భృతి సౌకర్యం కలిగించటం. కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం కలిసి పూర్వం సుమారు 200 మందికి ఈ గౌరవ భృతిని ఇచ్చేవి. ఇందులో ఎక్కువ మందికి నెలకు రూ॥50/-లేదా రూ॥75/- మాత్రమే ఇచ్చేవారు. ఇప్పుడు వీరందరికి నెలకు రూ॥100/- ఇస్తున్నాం. మూడు నాలుగు సంవత్సరాలుగా కేంద్ర ప్రభుత్వం ఈ ప్రణాళికకు స్వస్తిచెప్పి కొత్తవారికి ఇవ్వటం మానేసింది. ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం ఇందుకు తానే పూనుకొని కిందటి సంవత్సరం 30 మందికి కొత్తగా గౌరవ భృతిని మంజూరు చేసింది. ఈ సంవత్సరం ఇంకా కొంత మందికి ఇవ్వటం జరుగుతుంది. ఈ ప్రణాళికను తిరిగి అమలు పరచటానికి ఈ సంవత్సరం కేంద్రప్రభుత్వం పూనుకొనటం శుభసూచకం. లలితకళలకు సంబంధించిన గ్రంథాల ప్రచురణకు, ప్రచురించిన గ్రంథాల కాపీలను ప్రోత్సాహాత్మక దృష్టితో కొనుగోలు చేయడానికి ప్రభుత్వం కేటాయించిన సొమ్ము ఈ సంవత్సరం సుమారు లక్ష రూపాయల దాకా పెరిగింది.

పరిశీలక సంఘం వారు చేసిన మరో ముఖ్యమైన సూచన జిల్లా స్థాయిలో సాంస్కృతిక సంఘాలను నియమించడం. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా రాష్ట్ర ప్రభుత్వం 1975వ సంవత్సరాన్ని సాంస్కృతిక సంవత్సరంగా ప్రకటించిన విషయం అందరికి తెలిసిందే. ప్రధానంగా జిల్లాలలో సాంస్కృతిక కార్యక్రమాలను

పెంపొందించటం కోసమూ, అనుషంగికంగా ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణలో తోడ్పడటం కోసమూ జిల్లా, పురపాలక సంఘం, తాలూకా స్థాయిలలో సాంస్కృతిక సంఘాలను నియమించటం జరిగింది. జిల్లాస్థాయి సంఘానికి జిల్లా కలెక్టర్, పురపాలక స్థాయి సంఘానికి డి.ఆర్.ఓ., తాలూకా స్థాయి సంఘానికి తహసీల్‌దార్ అధ్యక్షుడు. అధికారులతో, అనధికారులతో, కళాకారులతో, రచయితలతో కూడిన ఈ మూడు స్థాయిల సాంస్కృతిక సంఘాలు సాంస్కృతిక కార్యకలాపాలు నిరంతరంగా సాగటానికి పథకాలు వేసి, సాధించగలవని ఆశిస్తున్నాను. వీటికి తోడ్పాటు తప్పకుండా ఉంటుంది.

1974వ సంవత్సరం ఉగాది నుంచి వారం రోజులపాటు జరిగిన అఖిల భారత తెలుగు సాంస్కృతికోత్సవాలు జయప్రదం కావటంతో ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలన్న కోర్కె బలపడింది. ఇందుకు సహృదయులు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు ఆమోదం తెలిపి పెద్ద ఎత్తున్న 1975 ఉగాది నుండి వారం రోజుల పాటు ప్రపంచ తెలుగు మహాసభలు వైభవోపేతంగా జరిపించారు. రాష్ట్రంలోని నాలుగు చెరగల నుంచే కాక ప్రపంచంలోని నాలుగు దిక్కుల నుంచి తెలుగువారి ప్రతి నిధులు మహాసభలకు విచ్చేసి వారం పదిరోజుల పాటు అరమరికలు లేకుండా కలిసి తిరిగి, మహాసభలను జయప్రదం చేసి, తెలుగువారు ఎక్కడ ఉన్నా అంతా ఒక్కటే అని నిరూపించారు. ఈ మహాసభల వల్ల చేకూరిన సత్ఫలితాలలో అగ్రగణ్యమైన సత్ఫలితమిది. మహాసభల నిర్వాహకులుగా మేమంతా ఆశించినది కూడా ఇదే. విదేశాల నుంచీ, ఇతర రాష్ట్రాల నుంచి ప్రతినిధులు రావటం వల్ల వారి, వీరి మధ్య ఒక సదవగాహన ఏర్పడింది. తమ సంస్కృతిని భద్రపరచుకోవాలనీ వారూ, వారికి సాంస్కృతికంగా, చేయూత నివ్వాలనీ మనవారూ నిర్ణయించుకోవటం జరిగింది.

మహాసభలలో ముఖ్యమంత్రి చేసిన వాగ్దానం ప్రకారం ఇతర రాష్ట్రాలలో, ఇతర దేశాలలో ఉన్న తెలుగువారికి సాంస్కృతికంగా, విద్యా విషయకంగా తోడ్పడటానికి ప్రభుత్వ స్థాయిలో, విద్యాశాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పడింది. ఈ కార్యక్రమానికి ప్రత్యేకంగా కొంత నిధిని కేటాయించటం కూడా జరిగింది. ఈ కార్యక్రమ నిర్వహణలో రాష్ట్రప్రభుత్వానికి తోడ్పడటం కోసం, ఇతర రాష్ట్రాలలో, ఇతర దేశాలలో ఉన్న తెలుగువారితో సాంస్కృతిక పరమైన సంబంధాలను పెంపొందించటంకోసం, తెలుగు భాషా సాహిత్య సంస్కృతులపై పరిశోధనలకు జాతీయ అంతర్జాతీయ విద్వాంసులకు అవకాశం కల్పించటం కోసం అంతర్జాతీయ సంస్థ నొకదానికి నెలకొల్పవలెనని మహాసభల సదస్సులో ఏకగ్రీవంగా తీర్మానించటం జరిగింది. ఈ

తీర్మానాన్ని అంగీకరించి రాష్ట్ర ప్రభుత్వం అంతర్జాతీయ తెలుగు సంస్థను నెలకొల్పింది. ఈ సంస్థకు రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ గారు సెప్టెంబర్ 8వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

మహాసభల సందర్భంగా శాతవాహన నగరంలో అంటే ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో "తరతరాల తెలుగుజాతి" అనే సాంస్కృతిక ప్రదర్శనం 40 రోజులపాటు జరిగింది. దీనిని చిరస్థాయిగా చేయటం కోసం జంటనగరాల పౌరులు రూ။5 లక్షలు వసూలు చేసి ఇవ్వడానికి అంగీకరించారు. ప్రభుత్వం ఇంకో రూ။15లక్షలు ఖర్చు పెట్టడానికి అంగీకరించింది. ఈ సాంస్కృతిక సంగ్రహాలయ నిర్మాణానికి పబ్లిక్ గార్డెన్స్‌లోని సరూబాగ్‌లో సెప్టెంబరు 13వ తేదీన రాష్ట్రపతి శంకుస్థాపన చేశారు. ఇది నిర్మాణం అయిన తరువాత హైదరాబాదు వచ్చి యాత్రికులెవరైనా 2500 సంవత్సరాల తెలుగు జాతి చరిత్రను, సమగ్ర స్వరూపాన్ని ఒక్క చోట చూడగలుగుతారు. భారతదేశంలో ఇటువంటిది అపూర్వం అని చెప్పవచ్చు.

*(1976)*

## 3. ప్రపంచ తెలుగు మహాసభలు - వాటి ప్రత్యేకత

హైదరాబాదులో 1975 ఏప్రిల్ 12 నుండి ప్రపంచ తెలుగు మహాసభలు జరుగుతున్నాయి.

భారతదేశంలో అనేక భాషలు, సంస్కృతులు ఉన్నాయి. భిన్న భిన్న భాషలు, విభిన్న సంస్కృతులు ఉన్నప్పటికీ, వాటన్నిటిలో అంతర్లీనంగా సమైక్యతా అంశాలుకూడా ఉన్నాయి. భిన్నత్వంలో ఏకత్వం ఉండడం భారతీయ సంస్కృతి ప్రత్యేకత. దేశంలో మాట్లాడే వివిధ భాషలలో తెలుగు భాష రెండవ స్థానం ఆక్రమించింది. దేశంలోని యితర రాష్ట్రాలలోకూడా అధిక సంఖ్యలో తెలుగువారు ఉన్నారు. భారతజాతి జీవన స్రవంతిలో వారు అంతర్లీనంగా ఒదిగి తమ వంతు పాత్ర నిర్వహిస్తున్నారు. తమ మేధాశక్తి, త్యాగనిరతి, నిర్విరామ కృషి ద్వారా దేశ ఆర్థిక, సాంస్కృతిక జీవనాన్ని పెంపొందిస్తున్నారు.

క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందిన శాతవాహనుల కాలం నుండి తెలుగు వారికి గర్వించదగిన చరిత్ర ఉంది. ఆచార్య నాగార్జునుని విద్యాపీఠానికి, ప్రముఖ స్తూపాలకు, అమరావతి శిల్ప సంపదలకు నిలయం యీ ప్రదేశం. దక్షిణ భారత కర్ణాటక సంగీత కళాకోవిదులు త్యాగరాజు, క్షేత్రయ్య తెలుగువారు. ఎనలేని సాహిత్య సంపదగల మధురమైన భాష తెలుగు భాష. తేనెలొలుకు తెలుగు భాషను ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ గా అభివర్ణించారు.

"ఈ మహాసభలు ఎందుకు జరుపుతున్నారని" చాలా మంది అడిగారు. అనేక మంది తెలుసుకోగోరుతున్నారు. సంకుచితత్వంతో యీ మహాసభలను ఏర్పాటు చేయడం మా లక్ష్యంకాదు. ఇప్పటితరం వారు, భావి తరాలవారు తెలుగువారి సాంస్కృతిక సంపదను అవగాహన చేసుకోవడమే మా ప్రధాన ఆశయం. తెలుగు వారి ఉజ్జ్వల ఘట్టాలకు వారి సాంస్కృతిక వారసత్వానికి అప్పుడప్పుడు అక్షరరూపం యివ్వడం జరిగిందనడంలో సందేహం లేదు. అయితే మన సాంస్కృతిక సంపదను

గూర్చి తెలుసుకొనే విధంగా నేటి యువతరాన్ని ప్రోత్సహించడానికీ, యీ విషయం గూర్చి ఆలోచించడానికీ యిందువల్ల అవకాశం ఏర్పడింది. మనం చేసిన పనలను గూర్చి ఆత్మావలోకనం చేసుకొని, ప్రత్యేకతను సంతరించుకున్న మన సంస్కృతిని అభివృద్ధిపరచి, పరిరక్షించుకోవడంలో మనం నిర్వహించాల్సిన పాత్ర ప్రాముఖ్యాన్ని ప్రజాదరణ పొందిన యీ మహాసభల వల్ల తెలుసుకోవడానికి అవకాశం కలుగుతుంది. ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో నివసించే తెలుగువారు తమ భాషా సంస్కృతుల బంధాన్ని మరింత పటిష్ఠవంతం చేసుకోడానికి కూడా యీ మహాసభలవల్ల వీలు కలుగుతుంది. తెలుగుభాషను అభివృద్ధిపచి, ఆసక్తిగల వారిలో యీ భాషను పరివ్యాప్తం చేయడానికి గల మార్గాలను పరిశీలించాలని మేము భావిస్తున్నాం.

తమ జీవిత కాలంలో ఎటువంటి గుర్తింపు లేకుండా ఉన్న ప్రముఖులు చాలా మంది ఉన్నారు. కళలకు, భాషలకు, సంస్కృతికి వారు చేసిన అమూల్యమైన సేవలను వెలుగులోకి తెచ్చి, ప్రచారంచేసి మనం వారిని గౌరవించడానికి యిటువంటి సందర్భాలలో అవకాశం కలుగుతుంది.

ఆధునిక జీవితపు ఆకర్షణలు చాలామంది తెలుగువారు విదేశాలకు వెళ్ళే విధంగా చేశాయి. అయితే మాతృభూమితో సంబంధాలు ఉంచుకోవాలనే వారి తపనను అర్థం చేసుకోవచ్చు. వారు తమ సంస్కృతిని పరిరక్షించుకోవడానికి ప్రస్తుతం తగిన ఏర్పాట్లు లేవు. కొంతమంది స్వదేశానికి రావాలనుకుంటున్నారు. మరికొంతమంది యితర దేశాలలో స్థిరపడాలనుకుంటున్నారు. అయితే యీ రెండు వర్గాలవారు సాధ్యమైనంతవరకు తమ అస్తిత్వాన్ని పరిరక్షించుకోవాలని కోరుతున్నారు. వారికి ఎంతవరకు సహాయపడగలమనే విషయాన్ని గూర్చి పరిశీలించడానికి యీ మహాసభలు అవకాశం కల్పిస్తున్నాయి.

దేశంలో ముఖ్యంగా యితర భాషా రాష్ట్రాలలో నివసిస్తున్న తెలుగు మాట్లాడేవారికి తమ భాషను నేర్చుకోవడానికి గల అవకాశాలు క్రమంగా తగ్గిపోతున్నాయి. ఆయా రాష్ట్రాలలో గల పరిస్థితుల ప్రభావంవల్ల ఆ విధంగా జరగడం సహజమనడంలో సందేహంలేదు. అందువల్ల తెలుగుభాష పరిరక్షణకు దేశంలోని యితర ప్రాంతాలలో ఎంతవరకు అవకాశాలు కల్పించగలమనే విషయాన్ని పరిశీలించడం చాలా అవసరం.

ఇటువంటి మహాసభల ఏర్పాటుద్వారానే యీ పనులన్నీ జరగడానికి ప్రాముఖ్యాన్ని సంతరించుకోడానికి దోహదం కలుగుతుంది. దీనివల్ల ప్రస్తుత పరిస్థితుల పరిష్కారానికి నిర్దిష్టమైన మార్గాలు ఏర్పడతాయి.

పరస్పరం భావాలను తెలియపర్చుకోవడానికేగాక, భావసమైక్యతకు కూడా భాష తోడ్పడుతుంది. తెలుగు ప్రజల భావసమైక్యతకు కార్యాచరణకు సాంస్కృతిక, భాషా సంబంధాలను పటిష్ఠం చేయాలి. తెలుగు ప్రజల సాంస్కృతిక ఆశయాలు ఒకటే అయినప్పటికీ, గతంలోని భావసమైక్యతకు కృషి జరగకపోవడంవల్ల తెలుగు ప్రజలలో అపోహలకు, సందేహాలకు దారితీసింది. సందేహాలను నివృత్తిచేసి తెలుగు ప్రజలంతా ఒక్కటేననే భావం కల్గించి, తమ సాంస్కృతిక సంపదను పరిరక్షించుకోవడంతోపాటు తమ ప్రాంతం అభివృద్ధిలో భాగస్వామ్యులు కావాలనే భావం వారిలో కల్పించడానికి సహాయపడాలని యీ మహాసభ ప్రతిపాదిస్తున్నది.

తెలుగు మాతృభాషకాని ప్రజలలోకూడ చాలామంది తెలుగు పండితులు ఉన్నారు. తెలుగు భాషాభివృద్ధికి అనేకమంది విదేశీయులు ఎంతగానో కృషిచేసి యీ భాషలో ఎంతో ఆసక్తి చూపారు. తెలుగుభాషాభివృద్ధికి తమ జీవితాలను అంకితం చేసినవారందరినీ ఒకేచోట చేర్చడానికి యీ మహాసభలవల్ల అవకాశం ఏర్పడుతుంది. తెలుగు భాషాభివృద్ధికి తీసుకునే చర్యలలో వారి అమూల్యమైన సూచనలు ఎంతగానో ఉపకరిస్తాయి.

ఈ మహత్తర మహాసభల సందర్భంగా అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థను ఏర్పాటు చేయాలని ఆలోచిస్తున్నారు. ఈ సంస్థలో యితరులు తెలుగుభాష నేర్చుకోవడానికి సౌకర్యాలు కల్పించడంతోపాటు యీ భాషాభివృద్ధికి సంస్థ కృషి చేస్తుంది. ఆధునిక పరిస్థితులకు అనుగుణంగా తెలుగు భాషాభివృద్ధికి జరిగే పరిశోధనలను తీవ్రతరం ఇంకా చేయాల్సిన అవసరం చాలా ఉన్నది. ఈ విషయంలో కూడా యీ సంస్థ బాధ్యత వహిస్తుంది. యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థల ప్రతినిధులు ఇతర అంతర్జాతీయ ప్రతినిధులు ఈ మహాసభలలో పాల్గొంటున్నారు.

1975 సంవత్సరానికి తెలుగు సాంస్కృతిక సంవత్సరంగా పరిగణిస్తున్నారు. ఈ సందర్భంగా రాష్ట్రమంతటా గ్రామం, బ్లాకు, తాలూకా, జిల్లా, రాష్ట్రస్థాయిలలో ఉత్సవాలు జరుగుతాయి. యువతరంవారు తమ సృజనాత్మక శక్తియుక్తులను

సంఘవ్యతిరేక జాతి వ్యతిరేక కార్యక్రమాలకు వినియోగించుకోకుండా వారిని సరైన మార్గంలో పయనింపచేయడానికి కృషిచేయాలి. మన సాంస్కృతిక కార్యక్రమాలను పునరుద్ధరించి, ప్రజల సాంస్కృతిక జీవనాన్ని పునరుజ్జీవం చేయడం ద్వారా ఈ కృషిని నిర్వహించవచ్చు. ప్రతి తెలుగు వ్యక్తి ఈ కృషిలో పాల్గొని ఈ మహాసభలను విజయవంతం చేయాలనే భావం వారిలో కల్పించాలి.

సర్వతోముఖమైన భారతజాతీయ అభ్యుదయానికీ, సాత్వికమైన సాంఘిక విప్లవానికీ భావ సమైక్యతకూ ఈ మహా సభలు ప్రాతిపదికలై భారతజాతిని సమైక్యం చేయగలవని నా ఆకాంక్ష.

*(తెలుగు ప్రామాణిక వైజ్ఞానిక పత్రిక*
*ఏప్రియల్ - జూన్ - 1975)*

# 4. ద్రవిడ భాషాశాస్త్రవేత్తల 6వ అఖిలభారత మహాసభ అధ్యక్షోపన్యాసం

ద్రవిడ భాషా శాస్త్ర వేత్తల సంఘం అధ్యక్షుడు మరియు కర్ణాటక విశ్వవిద్యాలయం వైస్ -ఛాన్సలర్ ప్రొఫెసర్ హరేమత్, ఆహ్వాన సంఘం అధ్యక్షుడు మరియు ఆంధ్రయూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ ఎం.ఆర్.అప్పారావు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అధికారభాషా సంఘం అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, ద్రవిడ భాషా శాస్త్రవేత్తల సంఘం కరస్పాండెంట్ ప్రొఫెసర్ జి.జె.సోమయాజి, ప్రొఫెసర్ వి.ఐ. సుబ్రహ్మణ్యం. ద్రవిడ భాషా శాస్త్రవేత్తల సమావేశానికి విచ్చేసిన ప్రతినిధులు, సోదర, సోదరీమణులారా:

ఈ రోజు ఉదయం ఇక్కడ హైదరాబాద్‌లో జరుగుతున్న ద్రవిడ భాషా శాస్త్రవేత్తల 6వ అఖిలభారత మహాసభల ప్రారంభ సమావేశంలో పాల్గొంటున్నందుకు నాకెంతో సంతోషంగా వుంది. భాషాశాస్త్రం గురించి ఏమీ తెలియని నన్ను ఈ మహాసభలకు ఆహ్వానించడాన్ని గొప్ప గౌరవంగా భావిస్తున్నాను.

ప్రారంభ సమావేశానికి అధ్యక్షత వహించాలని ప్రొఫెసర్ తూమాటి దొణప్ప అందించిన ఆహ్వానాన్ని అంగీకరించేందుకు తొలుత నేను సందేహించాను. భాషాశాస్త్రం గురించి నాకు ఏమీ తెలియకపోవడమే అందుకు కారణం. నిజానికి భాషలకు ఈ కొత్త శాస్త్రమేమిటో ఏమిటా అని నేను ఒకింత ఆశ్చర్యపోయాను. భాషాశాస్త్రాన్ని నేను అధ్యయనం చేయవలసి వుంది. భాషా శాస్త్రాన్ని గురించి తెలుసుకునే క్రమంలో ఇది భాషల సాంకేతిక నైపుణ్యమని, నాకు చెప్పారు. ఆ విధంగా భాషా శాస్త్రం గురించి కొంత తెలుసుకున్నాను. ఆ విధంగా భాషా శాస్త్రం పై నాకు ఆసక్తి కలిగింది. భాషల రంగంలో ఈ కొత్త శాస్త్రం గురించి మరిన్ని విషయాలు తెలుసుకోవడం కోసమే నేను ఈ ప్రారంభసమావేశానికి రావడంలోని ప్రధానోద్దేశ్యం. ద్రవిడ భాషా

సంఘం ఏర్పడిన ఐదేళ్ళ స్వల్ప కాలంలోనే ఎన్నో ఉపయోగకరమైన కార్యక్రమాలు చేసినట్లు నాకు తెలిసింది. ఈ సంఘం మునుపు నిర్వహించిన మహాసభలు – జరిపిన చర్చలు భారత భాషాశాస్త్ర విజ్ఞానాన్ని పెంపొందించిన విషయాల గురించి చదివాను.

స్వాతంత్ర్యానంతరం దేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటు కావడంలో ప్రాంతీయ భాషలు మరింత క్రియాశీలమైనాయి. ((Dynamism) ప్రతి భాషా రాష్ట్రమూ తమ ప్రాంతీయ భాషను ప్రోత్సహించి, అభివృద్ధి చేయడానికి చేయవలసిందంతా చేశాయి. అయినప్పటికీ దక్షిణాదిలో వివిధ భాషల మధ్య అంతర్నిహితంగా వున్న సారూప్యతలున్న సంగతి మనం గమనించవచ్చు. ద్రవిడ భాషలుగా పిలవబడుతున్న వివిధ భాషలను, వాటి భాషాధోరణులను లోతుగా పరిశీలిస్తే, ఆ భాషల వైవిధ్యం లేదా భిన్నత్వంలోనే కొంత 'ఏకత్వం' ఉన్న విషయాన్ని మనం సులువుగా గమనించవచ్చు. ఇటీవల నేను పొరుగు రాష్ట్రమైన కర్ణాటకను పలుమార్లు సందర్శించినప్పుడు, తెలుగు – కన్నడ భాషల లిపిలో ఎన్నోసారూప్యతలున్నందున, ఆ రెండు భాషలకు ఒకే లిపి రూపొందించాలనే పరస్పర కోర్కెను రెండు రాష్ట్రాలు గుర్తించాయి. తెలుగు – కన్నడ భాషలకు ఏకలిపిని రూపొందించడానికి కొంత శ్రమిస్తే కన్నడ – తెలుగు మధ్య భాషాపరమైన అవరోధాలు తగ్గిపోతాయి. అంతిమంగా ఇది పొరుగు రాష్ట్రాలలో నివసిస్తున్న కన్నడిగులు – తెలుగు ప్రజల మధ్య గరిష్ఠంగా పరస్పర సదవగాహనకు తోడ్పడి ఎంతో మేలు జరుగుతుంది.

ద్రవిడ భాషా శాస్త్రవేత్తలసంఘం అన్ని ద్రవిడ భాషలకు ఒకే లిపిని రూపొందించడంపై ఆసక్తితో ఉన్న విషయాన్ని నేను గమనించాను. కన్నడ – తెలుగు భాషలకు ఏక లిపి రూపొందించాలనే విషయమై తక్షణ ఆసక్తితో వున్నప్పటికీ, అన్ని ద్రవిడ భాషలకు ఒకే లిపి రూపొందించే ప్రయత్నాలను ఆహ్వానిస్తున్నాను. అన్ని ద్రవిడ భాషలకు ఒకే లిపి తయారుచేయడానికి గల అవకాశాలపట్ల నేను ఎంతో హర్షం వ్యక్తం చేస్తున్నాను. తెలుగు – కన్నడ భాషలకు ఒకే లిపి రూపొందించడంపై అంతర్ రాష్ట్ర కమిటీని నియమించే విషయాన్ని ప్రభుత్వం తీవ్రంగా పరిశీలిస్తున్నది. ద్రవిడ భాషా శాస్త్రవేత్తల సంఘం ఈ విషయంలో మాకు తోడ్పడుతుందని ఆశిస్తున్నాను.

భాషా దురభిమానాలు పెచ్చు పెరుగుతున్న సమయంలో, రెండు లేక అంతకంటే ఎక్కువ భాషలకు ఉమ్మడి లిపిని రూపొందించడం ద్వారా భాషా పరమైన ఈ

అవరోధాలను తొలగించి, వివిధ భాషా వర్గాలమధ్య మరింత సదవగాహనకు తోడ్పడవచ్చు. అన్ని ద్రవిడ భాషలకు 'ఉమ్మడిలిపి' తయారుచేయాలనే అంతిమ లక్ష్యసాధనకు ద్రవిడ భాషా శాస్త్రవేత్తల సంఘం మరియు ఈ మహాసభ అనువైన వ్యూహాన్ని రూపొందించాలని కోరుతున్నాను. ఒకటి లేదా అంతకంటే ఎక్కువ ద్రవిడ భాషలు నేర్చుకోవాలనే ఆసక్తి గల ఉత్సాహవంతులకు తోడ్పడేందుకై ఈ దిశగా భాషా నిఘంటువులను రూపొందించాలని సూచిస్తున్నాను. ఈ నిఘంటువులు ఆయా భాషలను అవగాహన చేసుకోవడంలో ఔత్సాహికులకు తోడ్పడతాయి.

ఒకసాధారణ పౌరుడిగా 'ప్రత్యేక నిపుణులపై' నేను కూడా ఉమ్మడి ఫిర్యాదు చేయదలచుకున్నాను. ఎంతోమంది ప్రజల స్పందనలు, అభిప్రాయాలకు వ్యతిరేకంగా తమను తాము సుభద్రంగా వున్న విద్యావేత్తలకూ ఆ ఫిర్యాదు వర్తిస్తుంది. వారు ఎలాంటి విద్యావేత్తలంటే వారు ప్రజల వాడుకభాషను పట్టించుకోరు. వారు భాషను మరింత సంక్లిష్టం చేస్తున్నందున ఇతర భాషలు నేర్చుకోవాలని ఆసక్తతో వున్న వారి ఉత్సాహంపై నీరుజల్లి, ఆ ప్రయత్నాలనుండి విరమించేలా చేస్తున్నారు. ప్రాంతీయ భాషను బోధనా భాషగా ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నించినపుడూ ఇలాగే జరిగింది. ప్రాంతీయ భాషను అధికార భాషగా చేసినప్పుడు సైతం ప్రభుత్వం ఇలాంటి పరిస్థితినే ఎదుర్కోవలసి వచ్చింది. ప్రాంతీయ భాషను బోధనా భాషగా, అధికార భాషగా మార్పుచేసినపుడల్లా ఆ ప్రయత్నం ప్రస్తుత ఇబ్బందులను తొలగించవలసింది పోయి భాషను సంక్లిష్టం చేయడం వల్ల ప్రజలకు మరిన్ని కష్టాలను తెచ్చిపెట్టిన అనుభవం చూశాం. అందువల్ల భాషాశాస్త్రవేత్తల, ఛాందస, సనాతన భాషాపద్ధతులను తగ్గించి ప్రజలను ఆకట్టుకునే వాడుక భాషను ప్రవేశపెట్టడం ద్వారా, భాషలను ప్రజలు మెచ్చుకునేలా రూపొందించాలనే అంతిమ లక్ష్యసాధనకు అనువైన పద్ధతులు పాటించాలని కోరుతున్నాను. ఒక భాషను నేర్చుకునే ప్రక్రియను, ముఖ్యంగా ఒకే కుటుంబానికి చెందిన మరోభాషను, ఉదాహరణకు ద్రవిడ భాషా కుటుంబానికి చెందిన భాషను ప్రస్తుత స్థాయి కంటే మరింత సులభమూ, సరళతరమూ చేయడంవల్ల సత్ఫలితాలు ఒనగూడుతాయి. ఇందుకోసం, భాషను సరళతరం చేయడానికి వ్యాకరణాన్ని వదులుకోవడానికీ నేను సిద్ధమే. వ్యాకరణంకోసం పట్టుపట్టడం ద్వారా, ప్రజలకు ఇతర భాషలు తెలియకుండా చేయడం కంటే, ఇప్పటికే మాట్లాడుతున్న భాషకు దగ్గరగాఉండే భాషను నేర్చుకోవడానికి ప్రజలకు సరళతర ప్రక్రియ

అందుబాటులోకి రావాలి. ఇది ప్రత్యేక నిపుణుల సమావేశం. భాషాశాస్త్రం ఎదుర్కొంటున్న సమస్యలకు వారివద్ద ఎన్నో పరిష్కారాలు ఉన్నాయని భావిస్తున్నాను. పరిశోధన నిర్లక్ష్యం చేయడానికి వీలులేనిదనే విషయం వాస్తవమే అయినప్పటికీ, ఆ పరిశోధనలు సత్ఫలితాల సాధనకు తోడ్పడేవికావాలి. సమాజంలో ఎవరికీ ఉపయోగపడని విషయమై ఈ పాండిత్య సిద్ధాంతాన్ని తయారుచేయడం గురించి మాట్లాడం తగదు. పరిశోధనలు మరింత విస్తృతంగా వర్తింపజేసేవిగా, ఎంచుకున్న రంగంలో మరింత అభ్యున్నతిని, పురోగతిని సాధించేందుకు తోడ్పడేవిగా వుండాలి. అత్యంత ప్రముఖమేధావులు పాల్గొంటున్న ఈ అరుదైన సమావేశం విజయవంతంకావాలని కోరుకుంటున్నాను. ద్రవిడ భాషల 6వ అఖిల భారత మహాసభ ప్రారంభసమావేశానికి అధ్యక్షత వహించే అవకాశం కల్పించిన మహాసభ కార్యనిర్వాహకులకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఈ సంఘం ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగు అకాడమీ, మరియు అంతర్జాతీయ తెలుగు సంఘం వంటి సంస్థలతో అనుసంధానమై, ఆ సంస్థలలో జరిగే కార్యకలాపాలు మరింత ఫలప్రదంకావడానికి తోడ్పడాలని కోరుతున్నాను. ఈ సంస్థలతో అనుసంధానం పరస్పర ప్రయోజనం కాగలదు. మిమ్మల్ని ఇలా కలుసుకోవడానికి, మరియు మహాసభలో పాల్గొనేందుకు అవకాశం కల్పించిన ఆహ్వాన సంఘం స్థానిక కార్యదర్శికీ, ఆహ్వాన కమిటీ అధ్యక్షుడూ మరియు ఆంధ్ర యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌కూ మరోసారి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ధన్యవాదాలు.

# 5. తిరువాయూరులో 130 వార్షిక శ్రీత్యాగరాజస్వామి వారి ఆరాధనోత్సవాలు

గౌరవనీయులైన గవర్నర్ గారు,

మాన్యశ్రీ కరుప్పయ్య మూపనార్, డాక్టర్ బాలమురళీకృష్ణ, సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు, సోదర సోదరీమణులారా!

తిరువాయూరులో జరిగే శ్రీ త్యాగరాజస్వామి వారి 130 వ ఆరాధనోత్సవాలకు హాజరు కావలసిందిగా ఆహ్వానం అందినపుడు నాకు కొంత గగుర్పాటు కలిగిన విషయాన్ని నిర్మొహమాటంగా తెలియజేస్తున్నాను. అందువల్ల వెంటనే నేను ఆ ఆహ్వానాన్ని అంగీకరించాను. సంగీత విద్వాంసులకు, సంగీత ప్రేమికులందరికీ ఇది 'పవిత్ర పుణ్యస్థలి'. ప్రముఖ వాగ్గేయకారుడు శ్రీ త్యాగరాజస్వామి వారు తన అమూల్య 'సంగీతనిధి'ని అమూల్య కృతులను మనకందించి 130 సంవత్సరాల క్రితం పుణ్యలోకాలకు వెళ్లారు. గొప్ప వాగ్గేయకారుడైన శ్రీ త్యాగరాజస్వామి తెలుగు వాడైనందుకు తెలుగువారందరూ ఎంతో గర్విస్తున్నారు. దక్షిణ భారతదేశంలో వివిధ భాషా వర్గాలవారి మధ్య ఐకమత్యాన్ని సాధించడంలో శ్రీ త్యాగరాజస్వామి కృషి అనన్యం. శ్రీ త్యాగరాజస్వామి కృతులంటే ప్రస్తుతం తెలుగు తమిళ భాషల వారేగాక, మళయాళీలు, కన్నడిగులు కూడా అమితంగా ఇష్టపడుతున్నారు. సంగీతానికి సరిహద్దులు లేవు. శ్రీ త్యాగరాజస్వామి తెలుగువాడైనప్పటికీ ఆయన ఎదిగిందీ, సంగీతపరంగా విశేష ఖ్యాతి సాధించిందీ తమళనాడులోనే. ఇంకా చెప్పాలంటే తెలుగువారికంటే కూడా తమిళులే శ్రీ త్యాగరాజ స్వామివారి కృతులు, సంగీతం అమిత ప్రాచుర్యంలోకి రావడానికి ఎనలేని కృషి చేశారు. శ్రీ త్యాగరాజ స్వామి తన సంగీతం ద్వారా దక్షిణ భారతదేశంలో సాంస్కృతిక సమైక్యాన్ని సాధించారని చెప్పక తప్పదు.

ఇది సాధారణంగా గొప్ప సంగీత విద్వాంసులు, వాద్యకారులు తిరువాయూరులో సమావేశమై తమ సంగీత గురువైన శ్రీ త్యాగరాజస్వామికి తమ గౌరవాన్ని, నివాళు

లను అర్పించే సందర్భం. అలాంటి మహామహులు, విశిష్ట వ్యక్తులు హాజరైన ఇలాంటి ఉత్సవంలో నావంటివారు పాల్గొనటం నాకు గొప్ప గౌరవంగా భావిస్తున్నాను. ఇంతటి ప్రముఖ సంగీత విద్వాంసులు, నాద నిధులు పాల్గొంటున్నారుగనుకనే ఆరాధనోత్సవాలు జరుగుతున్న ప్రాంతం పరమ పవిత్రమైనది. లోకులు తపస్సు లేదా ఆచార విధులు, కర్మకాండల ద్వారా గాక భక్తి ద్వారా భగవంతుని చేరుకోగలరని లోకానికి చాటింది శ్రీ త్యాగరాజస్వామి వారే. వ్యక్తిలో భక్తితత్వాన్ని ప్రేరేపించి పెంపొందించడానికి సంగీత మొకసాధనమని త్యాగరాజ స్వామి ఋజువు చేశారు. లౌకిక సంపదలపై ఏమాత్రం వ్యామోహం లేని శ్రీస్వామి వారు అతి సాధారణ అలవాట్లతో సామాన్య జీవితం గడిపారు. రాజులు, సంస్థానాధీశులు అందించే 'నిధి' కంటే రాముని 'సన్నిధి' గొప్పదని ఆయన భావించారు. అందుకే ఆయన నిధి చాలా సుఖమా! రాముని సన్నిధి చాలా సుఖమా అని పాడగలిగారు. శ్రీ త్యాగరాజస్వామి అత్యున్నత ప్రమాణాలు గల సంగీత వేత్త. ధనకనక వస్తువాహనాల కోసం తన సంగీతాన్ని వాడుకునేవాడు కాదు. సంగీతం ద్వారా భక్తితత్వాన్ని చాటిన మహనీయుడు. ఆయన సంగీతం సులభగ్రాహ్యం. అందుకే త్యాగరాజ కీర్తనలు విన్నవారెవరైనా మైమరచిపోతారు.

భారతదేశం శ్రీ త్యాగరాజస్వామితో బాటు తులసీదాసు, సూరదాసు, తుకారాం, మీరాబాయి వంటి భక్తి కవులను వాగ్గేయకారులను, కన్న పుణ్యభూమి. ఈ మహాదేశపు సాంస్కృతిక వారసత్వాన్ని ఈ పుణ్యమూర్తులు మరింత సుసంపన్నం చేశారు. వారిలో శ్రీ త్యాగరాజ స్వామి శిఖర సమానుడు. తమిళనాడులో శ్రీ త్యాగరాజ స్వామి సంగీతాన్ని, కృతులను ఇంటింటా పాడుకుంటూ వుంటారు. ప్రతి ఒక్కరూ ఏదో రూపంలో శ్రీ త్యాగరాజ కృతులను మననం చేసుకుంటూనే వుంటారు. కానీ శ్రీ త్యాగరాజస్వామి స్వతహాగా తెలుగువాడైనప్పటికీ ఆంధ్రప్రదేశ్‌లో అలాంటి పరిస్థితి కన్పించదు. కేరళ, కర్ణాటకలలో కూడా అదే పరిస్థితి ఉందనుకుంటాను. అందువల్ల దక్షిణాదిలోని ఇతర ప్రాంతాలలో కూడా శ్రీ త్యాగరాజస్వామి వారి కృతులను, సంగీతాన్ని వ్యాప్తి చేయడానికి ఆయా ప్రాంతాలలో కూడా ఇలాంటి ఆరాధనోత్సవాలను జరపవలసిందిగా ఈ కార్యక్రమ నిర్వాహకులను కోరుతున్నాను. ఇందుకు ఎంతో శ్రమించవలసి వుంది. ఏటేటా శ్రీత్యాగరాజ స్వామివారి ఆరాధనోత్సవాలను సాంప్రదాయరీతిలో నిర్వహిస్తున్న ఆరాధన ఉత్సవకమిటీ కంటే అంకితభావంతో కృషి చేసే మరొకటి నాకు కన్పించలేదు. సంగీతం పాడే వారికేగాక వినే శ్రోతలకు

సైతం మానసిక స్వాంతన కలిగించి, వారిని గొప్పవారిగా తీర్చిదిద్దుతుంది. ఆధ్యాత్మిక ఉన్నతికి సంగీతమొక కచ్చితమార్గం. అందుకే ఆలయాలు, ఇతర ప్రార్థనాస్థలాలలో సంగీతం విన్పిస్తుంటారు. సంగీతం వల్ల ఎన్నో మేళ్లున్నా, ఆధ్మాత్మికతను పెంపొందించేందుకు అదొక ఉత్తమ సాధనం. అందువల్ల కేవలం దక్షిణాదిలోనే కాక, సాంస్కృతిక ఐక్యాన్ని పెంపొందించడానికి సంగీత పరిజ్ఞానాన్ని వ్యాప్తి చేయవలసిన అవసరముంది. అంతేగాక, కల్లోలభరిత వర్తమాన ప్రపంచంలో ఉద్రిక్తతలను, జీవితంలో భరించలేని విధంగా పెరిగిన ఒత్తిడులు, ప్రయాసల నుండి జనావళికి ఊరట కల్గించేందుకు ఆధ్యాత్మిక భావలను పెంపొందించాలి. అందుకు సంగీతాన్ని వినియోగించాలి. మానవాళి రుగ్మతలను పరిహరించేదీ, సాంత్వన చేకూర్చేదీ సంగీతమే... ముఖ్యంగా భక్తి సంగీతమే.

త్యాగరాజస్వామి ఆరాధనోత్సవాలు జరుగుతున్న తిరువాయూరులో పవిత్రత నెలకొంది. ఇక్కడ మీతోబాటు ఈ ఉత్సవంలో పాల్గొంటున్నందుకు నేనెంతో అదృష్టవంతుడిని. ఎందరో మహామహులు, సంగీత విద్మన్మణులు, నాదస్వర విద్వాంసులు హాజరైన ఈ పవిత్ర ఉత్సవంలో పాల్గొనేందుకు అవకాశం కల్పించిన కార్యనిర్వాహకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. మహా సంగీత విద్వాంసుడు శ్రీ త్యాగరాజ స్వామి పవిత్రకృతులను, మహత్తర సంగీత సంప్రదాయాలను పరిరక్షించే మీ కృషి అభినందనీయం. ఈ ఉత్సవాలు విజయవంతం కావాలని నేను ప్రత్యేకించి కోరాను. ఎందుకంటే అవెప్పుడు ఘనవిజయంగా సాగుతున్నాయి. దక్షిణాదిలోని ఇతర ప్రాంతాలలో కూడా ఇలాంటి ఆరాధనోత్సవాలను నిర్వహించి, శ్రీ త్యాగరాజస్వామి సందేశాన్ని అందరికీ అందించాలని వినతి. శ్రీ త్యాగరాజ ఆరాధనోత్సవాలకు తిరవాయూరు ప్రత్యేక ప్రాముఖ్యతను, పవిత్రతను సంతరించుకుంది. ఈ ఉత్సవాలను దక్షిణాది అంతటా జరపాలని, అలా అది దక్షిణాది ఉమ్మడి ఉత్సవాలు కావాలని ఆకాంక్షిస్తున్నాను. గొప్ప భారతీయ వాగ్గేయకారుడు, సంగీతవిద్మన్మణి శ్రీ త్యాగరాజస్వామి వారి ఉత్సవాలలో పాల్గొని నివాళులర్పించే అవకాశం కల్గించినందుకు మరోసారి కృతజ్ఞతలు.

★ ★ ★

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | విద్యావ్యాప్తి | 263 |
| 2 | నాగార్జున విశ్వవిద్యాలయ అవతరణ | 274 |
| 3. | కాకతీయ విశ్వవిద్యాలయ ప్రారంభం | 279 |
| 4. | ఆరోగ్య జనాభా విద్యాసదస్సు | 283 |
| 5. | రాజస్థానీ శిక్షాసమితి, నిజామాబాదు ఆధ్వర్యాన నడుస్తున్న శిక్షాసంస్థల వారికోత్సవ సందేశం | 288 |
| 6. | సామాజిక పరివర్తన సాధనం – 'విద్య' | 292 |
| 7. | విద్యామంత్రిగా నా భావాలు – అనుభవాలు | 298 |
| 8. | దండలు – విందులు ఊరేగింపులు – బాణసంచాలు | 304 |
| 9. | భారత రాజనీతి శాస్త్ర మహాసభ – 35వ సమావేశం | 309 |
| 10. | విద్య లక్ష్యాలు | 318 |
| 11. | మైసూరులోని దక్షిణాది ప్రాంతీయ భాషా కేంద్రం, భారతీయ భాషల కేంద్ర సంస్థ – ప్రాముఖ్యత | 324 |
| 12. | విద్యారంగంలో ఆంధ్రప్రదేశ్ సాధించిన గణనీయ ప్రగతి | 330 |
| 13. | పన్నెండు సూత్రాల కార్యక్రమము | 335 |
| 14. | ప్రాథమిక విద్య బోధనాంశాల పునర్నిర్మాణం – సామాజిక విద్య మరియు భాగస్వామ్యం కార్యకలాపాల అభివృద్ధి | 338 |

# 1. విద్యావ్యాప్తి

ప్రాచీన నాగరికతలు వర్ధిల్లిన ఇతర దేశాలలో మాదిరే భారతదేశంలో కూడ సుదీర్ఘమైన విద్యా సంప్రదాయ సంపద వెలుగొందింది. ప్రపంచంలో విశ్వ విద్యాలయాల సంస్థాపనకు శ్రీకారం చుట్టిన వారు హైందవులే. మనదేశానికి వచ్చిన ముస్లిములు అరబిక్, పర్షియన్ భాషా జన్యమైన ప్రాచీన విద్యా సంప్రదాయం వెంటతెచ్చారు. హిందూయుగంలోనూ, అటు పిమ్మట మొగలు సామ్రాజ్యకాలంలోను విద్యావ్యాప్తి ప్రభుత్వ పరంగా జరగాలన్న నిబంధనలేదు. చక్రవర్తులు, ప్రభువులు, మాత్రం విద్యపట్ల సమాదర భావం వహించివుండేవారు. అయినప్పటికి ప్రజానీకాన్ని ప్రభుత్వంగాని ప్రభుత్వవ్యయంతోగాని విద్యావంతులను చేయాలన్న జిజ్ఞాస ఆనాడు కానవచ్చేదికాదు. స్వాతంత్ర్య సముపార్జనానంతరం విద్యావ్యాప్తి అన్నది ప్రభుత్వం నిర్వహించవలసిన ప్రధాన కర్తవ్యాలలో ఒకటిగా స్వీకరించాం.

## ప్రాచీన విద్యా సంప్రదాయం

ఆంధ్రప్రదేశ్‌లో కూడ అతి ప్రాచీన విద్యా సంప్రదాయం ప్రవర్తిల్లింది. నాగార్జునసాగరులోయ త్రవ్వకాలలో మహాపండితుడు, పరిపాలనోత్తముడు ఆచార్య నాగార్జునుడు దాదాపు 1700 సంవత్సరాలకు పూర్వం స్థాపించిన ప్రసిద్ధ విశ్వవిద్యాలయ శిథిలావశేషాలు బయలుపడ్డాయి. ఈ ప్రాచీన విజ్ఞాన పీఠమే కాకుండా, ఇక్కడ ప్రాచ్య విద్యాసంస్థలనేకం వర్ధిల్లాయి. ఈ సంస్థలలో సంస్కృతాంధ్ర భాషలందు ఎందరో పండితులు, పర్షియన్, అరబిక్ భాషలందు ఎందరో మౌల్వీలు సుశిక్షితులయ్యారు. ఈ ప్రాచీన సంప్రదాయంలో విజ్ఞానతృష్ణ, ఆధ్యాత్మిక ధర్మప్రచార నిరతి ప్రస్ఫుటమవుతాయి. ఈ కోవకు చెందిన సంస్థలు కొన్నింటిని నేటికి విజయనగరం, తిరుపతి, కర్నూలు, హైదరాబాదు తదితర చోట్ల చూడవచ్చు. వీటిలో శాస్త్రీయంగా శిక్షణ పొందిన అధ్యాపకులు, ఆధునిక పరికరాలు మొదలైనవి లేనిమాట వాస్తవమే. అయినప్పటకి ఈ సంస్థలు ప్రాచీన సంస్కృతీ పరిరక్షణకు, వ్యాప్తికి ఎంతగానో దోహదంచేస్తున్నాయి.

ప్రాచీన కాలంలో రాజులు, సామంతులు, విద్యాసంస్థలను అధ్యాపకులను ఆదరించి పోషించేవారు. కాని విద్యా విధానంలో మాత్రం ఎన్నడూ జోక్యం కలిగించుకునేవారు కాదు. విద్యాబోధన కార్యక్రమాన్ని రూపొందించేందుకు గురువు అన్ని విధాలా సమర్థుడని వారి విశ్వాసం. ఇట్టి గురుకుల విధానంలో గురువును మహాత్మునిగా భావించి సామాన్య పౌరుడు మొదలు చక్రవర్తి వరకు యావన్మంది గౌరవించేవారు. శిష్యులు నేర్చుకునే విద్యను వారు సులభంగా కంఠస్థం చేసేందుకు వీలుగా శాస్త్రాలను సంగ్రహపరచి కవితా రూపంలో పొందుపరిచేవారు. ఈ శ్లోకాల అర్థం, అన్వయం, వ్యాఖ్య శిష్యులకు బాగా తెలిసివుండేది. ఈ పద్ధతిలో వైయక్తిక బోధన, ఎప్పటికప్పుడు మౌలిక పరీక్షలు జరిగేవి. ఇట్టి విద్యావ్యవస్థలో మేధావులైన శిష్యులు తమ సహాధ్యాయుల కంటే సత్వరంగా తమ అధ్యయనాన్ని పూర్తిచేసుకొనేందుకు అవకాశముంటుంది. అంతేకాదు మేధావులైన శిష్యులూ, అధ్యయనం చాలా వరకు పూర్తి చేసిన శిష్యులూ, ఇతర శిష్యులకు తామింకా విద్యార్థులుగానే ఉన్నప్పటికీ బోధన చేసేవారు.

**బౌద్ధకాలపు విద్యాపీఠాలు**

దేశంలో బౌద్ధమతం వ్యాప్తిలోకి రావటంతో "బౌద్ధ విహారాలు" ఉన్నత విద్యాకేంద్రాలుగా విలసిల్లదొడగాయి. ధాన్యకటకం, నాగార్జునలోయలో గల బౌద్ధ విహారాలు ఇట్టి ఉన్నత విద్యాపీఠాలకు చక్కటి తార్కాణాలు. బౌద్ధమతం ప్రభావం సన్నగిల్లడంతో వైదిక మతం జైనమతం తెలుగు సీమలో ఆధిక్యాన్ని సంతరించుకున్నాయి. తత్ఫలితంగా ప్రాకృతం కంటె సంస్కృత భాషాధ్యయనం పట్ల ప్రజలలో ఆసక్తి ఇనుమడించింది. అదే విధంగా జైనమత ప్రభావం క్షీణించడంతో విద్యావ్యస్థలో శైవ సంప్రదాయం ప్రముఖస్థానాన్ని ఆక్రమించింది. శైవమఠాలు విజ్ఞానకేంద్రాలుగా పెంపొందాయి. ప్రాచీన కాలంలో శైవమత విద్యాకేంద్రాలుగా భాసిల్లిన వాటిలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి శ్రీశైలం, అలంపురం, మదదం, ఓరుగల్లు, అయితే రెడ్డి రాజుల కాలంలో వైష్ణవ సంప్రదాయం ప్రాబల్యంలోకి వచ్చింది. వీరి కాలంలో ఆయుర్వేదం, జ్యోతిషశాస్త్రం, సంగీతం, నృత్యం ప్రాధాన్యం వహించాయి. వైష్ణవాచార్యులు తమ శిష్యులకు సంస్కృతాంధ్ర భాషలు బోధించారు. విజయనగర సామ్రాజ్యకాలంలో శైవ, వైష్ణవ, జైనాది వివిధ మతాలకు చెందిన విద్యార్థులకు సమాన ఆదరప్రోత్సాహాలు చేకూరాయి. ఈ కాలంలోనే తిరుపతి మత విజ్ఞాన వ్యాప్తి, ఆగమశాస్త్ర బోధనగావించే ప్రసిద్ధ వైష్ణవ విద్యాపీఠంగా పరిఢవిల్లింది. విజయనగర

సామ్రాజ్య పతనానంతరం తెలుగు ప్రాంతంలో పెక్కు సంస్థానాధీశ్వరులు తెలుగు కవులకు, పండితులకు సహాయసత్కారాలు అందిస్తూ వుండేవారు.

ఆంగ్లేయుల కాలంలోను అంతకు పూర్వం కూడా దేశంలో వీథి బడులు అసంఖ్యాకంగా వెలిశాయి. విద్యార్థి పెరిగి పెద్దవాడై సమాజంలో ఒకడుగా మనుగడ సాగించేందుకు అవసరమైన లోకజ్ఞానం ఇచ్చే ప్రాథమిక విద్యను, ఈ వీథి బడిలో నేర్చుకుంటాడు. ఈ బడిలో 4 తరగతులుండేవి. పిల్లలకు భాష, గణితం, కొంత లోకజ్ఞానం నేర్పేవారు. "పెద్దబాలశిక్ష" పుస్తకం పిల్లలందరిచేత చదివించేవారు. పై తరగతులలో బాలరామాయణం, ప్రహ్లాదచరిత్ర, గజేంద్రమోక్షం, దాశరథీ శతకం మొదలైన వాటిని టీకాతాత్పర్యాలతో సహా కంఠస్థంచేయించేవారు. ఆడపిల్లలకు తల్లిదండ్రులే ఇంటివద్ద చదువునేర్పేవారు.

## క్రైస్తవ మిషనరీలు

ఆంధ్రప్రాంతంలో 19వ శతాబ్ది ఆరంభంలో క్రైస్తవ మిషనరీలు ఆధునిక విద్యావ్యాప్తికి నాందివాక్యం పలికాయి. 1855లో మదరాసు విద్యాశాఖ ఏర్పాటైంది. విద్యావ్యాప్తికి ప్రభుత్వం బాధ్యత వహించటం దీనితో మొదలయింది. 1921 వరకు ప్రభుత్వం సెకండరీ, హైయర్ సెకండరీ విద్యకు ప్రాధాన్యం ఇస్తూ ఉండేది. ప్రాథమిక విద్య ఒక విధంగా ఉపేక్షించబడిందని చెప్పవచ్చు. కాని 1921 తరువాత సామూహిక విద్యపై ఎక్కువ శ్రద్ధచూపుతూ వచ్చారు. ప్రాథమిక విద్యకు సౌకర్యాలు ఇనుమడించాయి.

ఆంధ్రప్రదేశ్‌లో ఆంధ్ర, తెలంగాణ అనే రెండు ప్రాంతాలు ఉన్నాయి. ఈ రెండింటి మధ్య వ్యత్యాసమున్నది. విద్యారంగంలో కూడా ఈ వ్యత్యాసం కానవస్తుంది. ఆయా జిల్లాలలోని కొన్ని వెనుకబడిన తావులు మినహా ఆంధ్రప్రాంతంలో విద్యాభివృద్ధి చాలా సంతృప్తికంగా జరిగింది. ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు చేసిన కృషి ఇందుకు కారణమని చెప్పవచ్చు. తెలంగాణ ప్రాంతంలో విద్యాపరిస్థితి ఎక్కువ ప్రోత్సాహకరంగా వుండేదికాదు. హైదరాబాదు సికిందరాబాదు జంటనగరాలకు వెలుపల గ్రామీణ ప్రాంతాలలో విద్యా సౌకర్యాలు చాలా తక్కువగా ఉండేవి. 1948లో హైదరాబాద్ రాష్ట్రంలో ప్రజాస్వామిక పరిపాలన వచ్చిన మీదట 1948-56 మధ్య విద్యాసంబంధంగా ఎంతో పురోగతి కనిపించింది. అయినప్పటికీ ఆంధ్రప్రాంతంతో పోల్చినప్పుడు ఈ విషయంతో తెలంగాణ ప్రాంతం వెనుకబడిందని చెప్పవలసి ఉంటుంది. ఈ రెండు ప్రాంతాలలోను విద్యాభివృద్ధిని సమతుల్యం చెయ్యడానికి ప్రభుత్వం కృషిసాగించి గణనీయమైన ప్రగతిని సాధిస్తున్నది.

## ప్రాథమిక విద్య

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ప్రతి ప్రణాళిక చివరినాటికి ప్రాథమిక విద్యారంగంలోను, అప్పర్ ప్రయిమరీ విద్యారంగంలోను సాధించిన అభివృద్ధిని దిగువ తెల్పిన వివరాలను బట్టి తెలుసుకోవచ్చు.

### ప్రాథమిక విద్యా సంస్థలు

| వరుస సంఖ్య | సంవత్సరం | ప్రాథమిక విద్యాసంస్థలు | ప్రాథమిక తరగతులలో చేరిన మొ॥ విద్యార్థులు | ప్రాథమిక పాఠశాలలో పని చేస్తున్న ఉపాధ్యాయులు |
|---|---|---|---|---|
| 1. | 1956-57 | 29,076 | 24,54,054 | 77,065 |
| 2. | 1960-61 | 34,523 | 29,76,055 | 78,521 |
| 3. | 1965-66 | 37,320 | 37,69,174 | 79,923 |
| 4. | 1973-74 | 36,984 | 43,00,000 | 79,321 |

### అప్పర్ ప్రయిమరీ విద్య

| వరుస సంఖ్య | సంవత్సరం | అప్పర్ ప్రైమరీ విద్యాసంస్థలు | అప్పర్ ప్రైమరీ తరగతులలో చేరిన మొ॥ విద్యార్థులు | అప్పర్ ప్రైమరీ పాఠశాలలో పని చేస్తున్న ఉపాధ్యాయులు |
|---|---|---|---|---|
| 1 | 1956-57 | 329 | 2,33,286 | 4,421 |
| 2. | 1960-61 | 983 | 3,00,917 | 8,717 |
| 3. | 1965-66 | 2,578 | 4,77,421 | 20,209 |
| 4. | 1973-74 | 3,662 | 6,70,000 | 28,208 |

1965-66లో కంటే 1973-74వ సంవత్సరంలో ప్రాథమిక పాఠశాలల సంఖ్య, వాటిలో పనిచేస్తున్న ఉపాధ్యాయుల సంఖ్య తగ్గింది. ప్రాథమిక పాఠశాలల స్థాయిని అప్పర్ ప్రైమరీ పాఠశాల స్థాయికి పెంచడమే ఇందుకు కారణం. 1961 నిర్బంధ ప్రాథమిక పాఠశాల విద్యాచట్టం 1961-62 నుంచి అమలులోకి వచ్చింది. ఈ చట్టం ప్రకారం 6-11 సంవత్సరాల వయస్సు గల పిల్లల తల్లిదండ్రులు తమ పిల్లలను తప్పకుండా పాఠశాలలకు పంపవలసి వున్నది. ఈ చట్టం అమలులోకి రాకముందు

1 నుంచి 5వ తరగతి వరకు 29.76 లక్షల మంది పిల్లలు చదువుతుండేవారు. మూడవ ప్రణాళిక చివరి నాటికి ఈ తరగతులు చదివే పిల్లల సంఖ్య 37.69 లక్షలు పెరిగింది. అంటే 6-11 సంవత్సరాలు వయస్సు గల పిల్లలలో బడికి వెళ్లేవారు 76.5%. అయితే అటుతరువాత బడికి వెళ్ళే పిల్లల సంఖ్య జనాభా పెరుగుదలకు తగినట్లుగా పెరగలేదు. నాలుగవ ప్రణాళిక చివరినాటికి 1 నుంచి 5వ తరగతుల వరకు చదువుతున్న పిల్లల సంఖ్య 43 లక్షలు. అంటే 6-11 సంవత్సరాల వయస్సుగల పిల్లలలో బడికి వెళ్ళేవారు 75%. దీనిని బట్టి పిల్లల సంఖ్యలో వచ్చిన పెరుగుదలకు తగినట్లు బడికివెళ్ళేవారి శాతం పెరగలేదని విదితమవుతుంది. అయిదవ ప్రణాళిక చివరినాటికి వీరి సంఖ్యను 55.50లక్షలకు పెంచాలని సంకల్పించబడింది. ఈ లక్ష్యాన్ని సాధించినట్లయితే 1978-79 సంవత్సరం చివరినాటికి 6-11 సంవత్సరాల వయస్సు వున్న పిల్లలలో 90% (బాలురు 100%, బాలికలు 80%) బడికి వెళ్తుంటారు. ఇందుకు అయిదవ ప్రణాళిక కాలంలో 1 నుంచి 5వ తరగతి వరకు మొత్తం 31,000 మంది ఉపాధ్యాయులను అదనంగా నియమించాలని ఉద్దేశించబడింది. నాలుగవ ప్రణాళికా, చివరినాటికి 11-18 సంవత్సరాల వయస్సు వున్న పిల్లలు 6-7 తరగతులలో 6.7 లక్షల మంది పిల్లలు వున్నారు. ఈ వయస్సు పిల్లలలో వీరు 31%. అయిదవ ప్రణాళిక చివరినాటికి 11-13 సంవత్సరాల వయస్సుగల పిల్లలలో 50% (బాలురు 60%, బాలికలు 40%) బడిలో చదువుతుంటారు. ఇందుకోసం అప్పర్ ప్రైమరీ దశలో ప్రణాళిక చివరినాటికి 18,270 మంది ఉపాధ్యాయులను నియమించాలనే సంకల్పం ఉన్నది. కేవలం విద్యాసౌకర్యాలను కలిగించినంత మాత్రాన, ముఖ్యంగా రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాలలో ఎక్కువ మంది పిల్లలు బడిలో చేరతారని అనుకోవడం సరికాదని- అనుభవం దృష్ట్యా వెల్లడవుతున్నది. కాబట్టి సమాజంలో బలహీన వర్గాల వారి పిల్లలకు, గ్రామీణ ప్రాంతాలలో బాలికలకు పుస్తకాలు, బడికి సక్రమంగా హాజరవుతున్నందుకు స్కాలర్‌షిప్పులు, యూనిఫారం దుస్తుల రూపంలో వారికి ప్రోత్సాహం సమకూర్చడం అవసరమని తోస్తున్నది. ఇటువంటి ప్రోత్సాహాలను సమకూర్చే పథకం వివరాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

1. 6-11 సంవత్సరాల వయస్సుగల 12 లక్షల మంది పిల్లలకు ఒక్కొక్కరికి రూ॥5/-ల చొప్పున 5 సంవత్సరాలపాటు పుస్తకాలు. గ్రాంట్లు రూ॥60.00లు (లక్షలలో)

2. 11-13 సంవత్సరాల వయస్సుగల 4 లక్షల మంది పిల్లలకు ఒక్కొక్కరికి రూ॥10/-ల చొప్పున 5 సంవత్సరాలపాటు పుస్తకాలు. గ్రాంట్లు రూ॥40.00లు (లక్షలలో)

3. 6-11 సంవత్సరాల వయస్సుగల 2.37లక్షల మంది బాలికలకు ఒక్కొక్కరికి రూ॥40/-ల చొప్పున 5 సంవత్సరాలపాటు సక్రమంగా హాజరైనందుకు ఇచ్చే స్కాలరు షిప్పులు, యూనిఫారం దుస్తుల గ్రాంట్లు రూ॥95.00లు (లక్షలలో)

4. 11-13 సంవత్సరాల వయస్సుగల 2.37లక్షల మంది బాలికలకు ఒక్కొక్కరికి రూ॥40/-ల చొప్పున 5 సంవత్సరాలపాటు సక్రమంగా హాజరైనందుకు ఇచ్చే స్కాలరు షిప్పులు, యూనిఫారం దుస్తుల గ్రాంట్లు రూ॥95.00లు (లక్షలలో)

### కేర్ సంస్థ సహాయం

కొన్ని సంవత్సరాలుగా "కేర్" సంస్థవారి సహకారంతో ఆంధ్రప్రదేశ్‌లో మధ్యాహ్న భోజన కార్యక్రమం అమలు జరుగుతున్నది. ఈ కార్యక్రమం పోషకాహారం దృష్ట్యానే కాకుండా విద్యాసంబంధమైన ఆశయాల సాధన దృష్ట్యా కూడా ప్రాధాన్యం వహిస్తున్నది. దీనిని అమలు పరచడం వల్ల పిల్లలు పాఠశాలలకు సక్రమంగా హాజరవుతున్నారు. వారి ఆరోగ్యం పైన కూడ ఈ కార్యక్రమం సత్ప్రభావం చూపుతున్నది. 1973-74లో ఈ కార్యక్రమం ద్వారా ప్రాథమిక పాఠశాలలో చదివే 8,56,797 మంది పిల్లలు ప్రయోజనం పొందారు. "కేర్", "యూనిసెఫ్" సంస్థల సహకారంతో నాచారం వద్ద సిద్ధాహారం తయారు చేసే కర్మాగారం ఏర్పాటవుతున్నది. ఈ కర్మాగారం రోజుకు 4 టన్నుల ఆహార పదార్థాలు తయారుచేయగలదు. మెదక్, నల్గొండ, మహబూబ్‌నగర్, హైదరాబాదు జిల్లాలలో ప్రాథమిక పాఠశాలల్లో చదివే 4 లక్షల మంది పిల్లలకు ఆహార పదార్థాలు సమకూరుస్తుంది.

### వయోజన విద్య

1961లో ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యుల శాతం 21.19. ఇదే 1971 నాటికి వున్న శాతం 24.79. ఆ విధంగా 3.6 శాతం పెరుగుదల కనిపిస్తున్నది. ఈ పెరుగుదల జనాభా అధికంగా గల ఇతర రాష్ట్రాలందలి పెరుగుదలకు దాదాపు సమానంగా వున్నది. ముఖ్యంగా ఆదివాసీ ప్రజలు, వెనుకబడిన ప్రాంతాలు ఎక్కువగా వున్న అధిక జనాభా గల రాష్ట్రాలలో అక్షరాస్యతా సమస్య ఎంత ప్రాధాన్యం వహిస్తుందో

దీనిని బట్టి విదితమవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో అక్షరాస్యత శాతం అఖిల భారతస్థాయి కంటే 1961 నాటికి 2.84 శాతం, 1971 నాటికి 4.56 శాతం తక్కువగా ఉన్నది. దీనిని బట్టి జాతీయస్థాయి చేరుకునేందుకు ఎంతో కృషి అవసరమని స్పష్టమవుతుంది.

అక్షరాస్యత పెంపొందించేందుకు సామాన్యంగా రెండు విధాలైన కార్యక్రమం అమలు జరుగుతుంది. మొదటిది 6-11 సంవత్సరాల వయస్సుగల పిల్లలకు బడి చదువు సమకూర్చడం, రెండవది 14-45 సంవత్సరాల వయస్సుగల స్త్రీలకు, పురుషులకు వయోజన విద్యాపద్ధతిలో చదువునేర్పటం. వీరికి చదవటం, వ్రాయటం రావాలన్నది ఇందలి ఆశయం. ప్రాథమిక విద్యాదశలో ఎక్కువ మంది పిల్లలను చేర్చుకొని, చేరిన పిల్లలు మధ్యలో చదువు మానుకోకుండా తగిన చర్యలు తీసుకోవాలి. చదువురాని వయోజనుల కోసం విద్యా కార్యక్రమాన్ని కట్టుదిట్టంగా అమలు పరచవలసి వుంటుంది. ఈ చర్యల మూలంగా అక్షరాస్యత శాతాన్ని పెంచేందుకు వీలుంటుంది. అయిదవ ప్రణాళికలో కనీస అవసరాల కార్యక్రమం క్రింద ప్రాథమిక విద్యావ్యాప్తి కోసం తగిన నిధులు సమకూర్చబడినాయి. ఈ ప్రణాళికా కాలంలో అదనంగా 12.05 లక్షల మంది పిల్లలను పాఠశాలల్లో చేర్చుకోవడానికి సంకల్పించింది. పుస్తకాల గ్రాంట్లు, హాజరు, స్కాలర్‌షిప్పులు, మధ్యాహ్న భోజనాలు మొదలైన ప్రోత్సాహక చర్యల ద్వారా పిల్లలు మధ్యలో చదువు మానుకోకుండా చర్యలు తీసుకోవడం జరిగింది. అక్షరాస్యతను 1శాతం పెంచడం కోసం అంటే 18-25 సంవత్సరాల వయస్సుగల వారిలో అదనంగా 10 లక్షల మందికి అక్షరాస్యత కలిగించటం కోసం సామూహిక అక్షరాస్యత కార్యక్రమాన్ని నిర్వహించేందుకు కూడా సంకల్పించింది. ఇందుకోసం అయిదవ ప్రణాళికలో రూ॥50.00లక్షలు కేటాయించడం జరిగింది.

## సెకండరీ విద్య

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటికి అంటే 1956-57 నాటికి రాష్ట్రంలోవున్న ఉన్నత పాఠశాలల సంఖ్య 733 మాత్రమే. వీటిలో వున్న విద్యార్థులు 2.01 లక్షల మంది. 1973-74కి ఈ పాఠశాలల సంఖ్య 3,259కి పెరిగింది. దీనిని బట్టి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత సెకండరీ విద్యాసౌకర్యాలు బాగా పెరిగాయని వాటిలో చదివే విద్యార్థుల సంఖ్య కూడా ఇనుమడించిందని విదితమవుతుంది. నాలుగవ ప్రణాళిక చివరి నాటికి 6.02 లక్షల మంది పిల్లలు సెకండరీ విద్యా సౌకర్యాలను వినియోగించుకున్నారు. అంటే 13-16 సంవత్సరాల వయస్సుగల పిల్లలలో 20% (బాలురు 30, బాలికలు 10%) ఈ సౌకర్యాలను వినియోగించుకున్నట్లు

స్పష్టమవుతుంది. అయిదవ ప్రణాళికాంతం నాటికి సెకండరీ పాఠశాలల్లో ఈ వయస్సు గల పిల్లలను అదనంగా 1.87 లక్షల మందిని చేర్చుకోవాలని లక్ష్యంగా నిర్ణయించడం జరిగింది. ఈ లక్ష్యాన్ని సాధించినట్లయితే అయిదవ ప్రణాళిక అంతం నాటికి ఈ వయస్సు పిల్లలు 24% (బాలురు 34%, బాలికలు 14%) సెకండరీ పాఠశాలల్లో చదువుతుంటారు. వీరికోసం కొత్తగా 200 పాఠశాలలు ఏర్పాటవుతాయి. ఇప్పుడున్న ఉన్నత పాఠశాలలను పటిష్ఠవంతం చేయడం కూడా జరుగుతుంది. ఈ ప్రణాళికా కాలంలో అదనంగా 3,950 మంది ఉపాధ్యాయులు నియమితులవుతారు. మేధావులైన విద్యార్థులకోసం సర్వేల్, తాడికొండ, కోడిగెనహళ్లిలో మూడు నివాస పాఠశాలలు ఏర్పాటయ్యాయి. ఈ పాఠశాలలు ఆంధ్రప్రదేశ్ నివాస పాఠశాలల సంఘం ఆధ్వర్యాన పనిచేస్తున్నవి.

ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలలో వేర్వేరు విద్యా విధానాలు అమలులో వుండటం చేత రాష్ట్రమంతటికి ఒకే విద్యావిధానం అమలు పరచటం ఆవశ్యకమైనది. 1959-60 సంవత్సరాలలో 1వ తరగతికి రాష్ట్రమంతటికి విస్తరించే ఉమ్మడి పాఠ్యప్రణాళిక ప్రవేశపెట్టబడింది. ఈ పద్ధతి ఒక్కొక్క తరగతికి విస్తరింపచేస్తూ రావటం జరిగింది. 1964లో రాష్ట్ర ప్రభుత్వం ఉన్నతస్థాయి సమావేశం ఒకటి జరిపింది. ఈ సమావేశం 15 సంవత్సరాల విద్యా క్రమాన్ని రూపొందించింది. దానిని 5 సంవత్సరాలు ప్రాథమిక దశ, 2 సంవత్సరాల అప్పర్ ప్రయిమరీ దశ, 4 సంవత్సరాల ఉన్నతపాఠశాల దశ, 2 సంవత్సరాల సెకండరీ దశ, 3 సంవత్సరాలు ప్రథమ డిగ్రీ దశగా ఉంటాయి. 10 తరగతి, 12వ తరగతి చివర పబ్లిక్ పరీక్షలు జరుగుతాయి. ఇవి రాష్ట్రమంతటికి ఒకేరీతిగా వర్తిస్తాయి. రాష్ట్ర ప్రభుత్వం సిఫారసులను అంగీకరించి, ఈ నూతన విధానాన్ని స్వీకరించింది. 10వ తరగతి చదివే విద్యార్థుల మొదటి జట్టుకు 1969 ఏప్రిల్‌లో పబ్లిక్ పరీక్షలు జరిగాయి. కొత్త విధానం కింద రెండు సంవత్సరాల ఉన్నత సెకండరీ విద్యకు ఇంటర్మీడియట్ కోర్సు అనే పేరు పెట్టడం జరిగింది. ఈ కోర్సు ఇప్పుడున్న డిగ్రీ కళాశాలల్లోను, జూనియర్ కళాశాలల స్థాయికి పెంచిన ఉన్నత సెకండరీ/ బహుళార్థసాధక సెకండరీ పాఠశాలల్లోను ప్రవేశపెట్టబడింది. ప్రభుత్వం ఇంటర్మీడియట్ విద్యాబోర్డును ఏర్పాటు చేసింది. దీనిలో ప్రభుత్వానికి విశ్వ విద్యాలయాలకు ప్రాతినిధ్యం ఉంటుంది. ఇంటర్మీడియట్ తరగతులన్నీ ఈ బోర్డుకు అనుబంధించబడ్డాయి. 1969-70 నాటికి 86 జూనియర్ కళాశాలలు మాత్రమే ఉండేవి. 1974-75 నాటికి ఈ కళాశాలల సంఖ్య 264కు పెరిగింది. అయిదవ

ప్రణాళికా కాలంలో కొత్తగా 29 జూనియర్ కళాశాలలు నెలకొల్పాలనే సంకల్పం ఉన్నది. అప్పుడు రాష్ట్రంలో ప్రతి తాలూకాకు కనీసం ఒక జూనియర్ కళాశాలైనా ఉంటుంది. 160 జూనియర్ కళాశాలల్లో సిబ్బంది, లేబరేటరీ పరికరాలు మొదలైన వాటికి సంబంధించివున్న కొరతను ఈ ప్రణాళికా కాలంలో తీర్చాలని ఉద్దేశించబడింది. ఈ ప్రణాళికా కాలంలో వివిధ కళాశాలల్లో సెక్రటేరియట్‌లో తదితర కోర్సులు ప్రవేశ పెట్టాలనే సంకల్పం కూడా ఉన్నది.

**ఉన్నత విద్య**

రాష్ట్రంలో 1956–57 నాటికి డిగ్రీ కళాశాలలు 50 మాత్రమే ఉండేవి. 1974–75 నాటికి వీటి సంఖ్య 198కి పెరిగింది. మేధావులైన విద్యార్థుల కోసం కర్నూలులో రజతోత్సవ (సిల్వర్ జూబ్లీ) కళాశాల ఏర్పాటుచేయబడింది. రాష్ట్రంలో ప్రతి జిల్లాకు కనీసం ఒక మహిళా కళాశాలైనా ఉండేటట్టు చూడటం కోసం అయిదవ ప్రణాళికా కాలంలో 6 డిగ్రీ మహిళా కళాశాలలు ఏర్పాటు చేయటం జరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో మూడు విశ్వవిద్యాలయాలు ఆంధ్ర, శ్రీ వేంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలు ఉండేవి. రాష్ట్రంలో పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులకు ఉన్న గిరాకీని తీర్చే నిమిత్తం 1976–78లో వరంగల్లు, గుంటూరు, అనంతపురంలలో పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. వరంగల్లు, గుంటూరులలో ఒక ప్రోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రాలను విశ్వవిద్యాలయాల స్థాయికి పెంచే ప్రతిపాదన ఉన్నది. హైదరాబాదులో కేంద్రీయ విశ్వవిద్యాలం ఏర్పాటయింది. ఇది 1975–76నుంచి పనిచేయటం ప్రారంభిస్తుంది.

రాష్ట్ర విద్యాసంస్థ, రాష్ట్ర వైజ్ఞానిక విద్యాసంస్థ, విద్య, వృత్తి దర్శక శాఖ, ప్రగతి నిర్ధారణ విభాగం– ఈ నాలుగింటిని కలిపి రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణ సంస్థ (ఎస్.సి.ఇ.ఆర్.టి) అనే పేరుతో ఒకే సంస్థగా ఏర్పరచటం జరిగింది. ఇది జాతీయ స్థాయిలో వున్న జాతీయ విద్యా విషయక పరిపాలనాధికారులకు శిక్షణ ఇస్తుంది. పునశ్చరణ కోర్సులు, వర్కుషాపులు, సదస్సులు మొదలైనవి నిర్వహిస్తుంది. ఇది పరిశోధన వ్యవహారాలు చూసే సంస్థ. విద్యాశాఖ కెదురయ్యే ఆచరణాత్మక సమస్యల పరిష్కారానికి ఇది ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంది. ఈ సంస్థలో కళాశాల అధ్యాపకుల కోసం కళాశాల విభాగమొకటి ఏర్పాటయింది. కళాశాలల్లో బోధనకు సంబంధించిన సరియైన పద్ధతుల గురించి వివరించటం కోసం డిగ్రీ, జూనియర్ కళాశాలలోని యువ అధ్యాపకులకు మూడు వారాల పాటు ప్రత్యేక కోర్సు నిర్వహించబడుతుంది.

**తెలుగు బోధన భాష**

1969-70 నుంచి ఇంటర్మీడియట్ స్థాయిలోను, ఆ తరువాతి సంవత్సరాలలో మొదటి డిగ్రీ స్థాయి నుంచి తెలుగును బోధనభాషగా ప్రవేశపెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. అయితే కొంతకాలం వరకు, వృత్తివిద్య నేర్పే డిగ్రీ కళాశాలలోను, పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులలోను బోధన భాషగా తెలుగును ప్రవేశ పెట్టేందుకు రాష్ట్ర ప్రభుత్వం తగిన సన్నాహక చర్యలు తీసుకున్నది. తెలుగు అకాడమీ తెలుగులో పాఠ్య పుస్తకాలను తయారుచేస్తుంది. తెలుగు అకాడమీ రాష్ట్రంలోని విశ్వ విద్యాలయాల సన్నిహిత సహకారంతో బృహత్తరమైన కార్యక్రమాన్ని నిర్వహిస్తుంది. అవసరమైన తావులలో ఇంగ్లీషు బోధనా భాషగాగల తరగతులు కూడా కొనసాగించేందుకు అనుమతించటం జరిగింది.

1974 మార్చి 15,16,17 తేదీలలో హైదరాబాదులో రాష్ట్రస్థాయి విద్యాసదస్సు జరిగింది. ప్రముఖ విద్యావేత్తలు, రాష్ట్రంలోని విశ్వ విద్యాలయాల ఉపాధ్యక్షులు, శాసన సభ్యులు, కొన్ని కళాశాలల ప్రిన్సిపాళ్ళు, పాఠశాలల ప్రధానోపాధ్యాయులు, జిల్లా పరిషత్తు చైర్మనులు, పంచాయితీ సమితి అధ్యక్షులు, విద్యాశాఖ అధికార్లతో సహా దాదాపు 400 మంది ఈ సదస్సులో పాల్గొన్నారు. వీరందరూ 13 బృందాల కింద విడిపోయి విద్యకు సంబంధించిన ఆయా విషయాలను గురించి చర్చించి, సిఫారసులు చేశారు. ఈ సిఫారసులను పరిశీలించటంకోసం విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు, విద్యార్థి ప్రతినిధులు, విద్యాశాఖ పరిపాలనాధికారులు, ప్రముఖ విద్యావేత్తలతో కూడిన ఒక ప్రత్యేక సంఘాన్ని ప్రభుత్వం నియమించింది. వివిధ బృందాల సూచనలను, ఈ ఉపసంఘం సాకల్యంగా చర్చించి, సదస్సు చేసిన సూచనలపై ప్రభుత్వం వారికి కొన్ని సిఫారసులు పంపింది. అమలు పరచడం కోసం ఈ సిఫారసులను ఇప్పుడు శ్రద్ధగా పరిశీలించడం జరగుతున్నది.

సమగ్రమైన విద్యాబిల్లు ముసాయిదా తయారయింది. ఇందుకోసం ఏర్పాటుచేసిన ప్రత్యేక సంఘం దీనికి తుదిరూపమిచ్చింది. దీనికి సంబంధించిన నియమాలు మొదలైన వాటిని తయారుచేసేందుకు చర్యతీసుకోబడుతున్నది. ప్రయివేటు విద్యాసంస్థలలో పనిచేస్తున్న ఉపాధ్యాయుల సర్వీసులలో రక్షణ కల్పించటం కోసం ఆర్డినెన్సు ఒకటి జారీ అయింది.

## విద్యా ప్రమాణాలకు కృషి

ఆంధ్రప్రదేశ్‌లో విద్యారంగంలో అన్ని స్థాయిలలోను జరిగిన విద్యావ్యాప్తి పట్ల హర్షం వ్యక్తమవుతున్నది. అయితే ఈ వ్యాప్తి సత్ఫలితాలు చేకూరేటట్లు ఈ కృషిని సంఘటిత పరచవలసి ఉన్నది. విద్యారంగంలో ప్రమాణాల విషయంలో ఇప్పుడు ఎక్కువ కృషి జరుగవలసిఉన్నది. ఈ సంగతి సర్వత్రా గుర్తించబడింది. విద్యాప్రమాణాలను పెంపొందించేందుకు విద్యాశాఖ తగు చర్యలు ప్రారంభించింది. కార్యదీక్షతో ఉపాధ్యాయులు, విద్యార్థులు, తల్లిదండ్రులు పాలనాధికారుల పరస్పర సంపూర్ణ సహకారంతో కృషిచేసినట్లయితే అన్ని స్థాయిలలోను తగిన విద్యా ప్రమాణాలను సాధించడానికి వీలున్నది.

ఈనాడు తెలుగు భాష మాట్లాడేవారు 5 కోట్లమందికి పైగా ఉన్నారు. దేశంలో హిందీ తరువాత వీరి సంఖ్యే ఎక్కువ. తెలుగు వారికి క్రీ.పూ. 3వ శతాబ్దినాటి శాతవాహనుల కాలం నుంచి సుదీర్ఘమైన చరిత్ర వున్నది. అందుకే పాశ్చాత్యులు దీనిని ప్రాచ్య ఖండపు ఇటాలియన్ అని అభివర్ణించారు. బౌద్ధయుగానికి ముందు కాలంలోను, ఇటీవల 18వ శతాబ్దిలోను కూడా తెలుగువారు అనేక మంది ప్రపంచంలోని పెక్కు దేశాలకు తరలివెళ్లారు. 1975 ఏప్రిల్ 12వ తేది నుండి జరిగిన ప్రపంచ తెలుగు మహా సభలు ఒకే సంస్కృతీ సంపదకు వారసులై ప్రపంచ మందలి వివిధ దేశాలలో నివసిస్తున్న తెలుగువారి మధ్య స్నేహసంబంధాలను, సమైక్యాన్ని వర్ధిల్లచేయగలవు.

తల్లిపాలకన్న, తల్లి పిలుపుల కన్న, తల్లి దీవన కన్న, తల్లి కన్న, మాతృభాష కన్న, మాతృదేశముకన్న, ఘనమగునది వేరు కనగలేం.

*(తెలుగువాణి - ప్రపంచ తెలుగు*
*మహాసభల ప్రత్యేక సంచిక - 1975)*

# 2. నాగార్జున విశ్వవిద్యాలయ అవతరణ

గుంటూరు-విజయవాడ ప్రాంతాల ప్రజలు తమ ప్రాంతంలో విశ్వవిద్యాలయ స్థాపన గురించి చిరకాలంగా కంటున్న కలలు ఈనాడు ఫలించాయి. ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటు చేసే సందర్భంలో ఆంధ్రప్రాంతానికి నడిబొడ్డున విజయవాడలో దానిని స్థాపించాలని మొదట అనుకున్నారు. అయితే కారణాలంతరాల వల్ల ఈ విశ్వవిద్యాలయాన్ని విజయవాడలో కాకుండా విశాఖపట్నంలో 1926లో నెలకొల్పడం జరిగింది. ఇది విజయవాడ ప్రాంత ప్రజానీకానికి కొంత బాధ కలిగించిన మాట వాస్తవమే వారు నిరాశ చెందారు కూడా. విశాఖపట్నంలో ఆంధ్రవిశ్వవిద్యాలయం స్థాపించిన నాటి నుంచి గుంటూరు- విజయవాడ ప్రాంతంలో మరొక విశ్వవిద్యాలయం ఏర్పాటు కావాలని ప్రజలు కోరుతూ వచ్చారు. 1953లో ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఆంధ్రరాష్ట్రం హైకోర్టు గుంటూరులో ఏర్పాటు చేశారు. ఈ హైకోర్టు హైదరాబాదు నగరానికి తరలింది. అప్పుడు ఈ ప్రాంతంలో ఒక విశ్వవిద్యాలయం ఏర్పాటు కావాలనే అభ్యర్థనను ప్రజలు పునఃప్రారంభించారు. విశ్వవిద్యాలయ స్థాపనకై ఈ ప్రాంత ప్రజల ప్రగాఢ వాంఛ అర్ధ శతాబ్ది తరువాత నేడు నెరవేరుతున్నది. విజయవాడ-గుంటూరు మధ్య కాజ- నంబూరు ప్రాంతంలో నాగార్జున విశ్వవిద్యాలయం అవతరణలో ఈ ప్రజల సుందర స్వప్నాలు ఫలోన్ముఖమయ్యాయి. మన ముఖ్యమంత్రి గౌరవనీయులైన శ్రీ జలగం వెంగళరావు గారు చూపిన శ్రద్ధాసక్తులు, వారి కార్యోత్సాహం, విశ్వవిద్యాలయాల గ్రాంటు సంఘం, కేంద్ర విద్యా మంత్రి ప్రజల అభీష్టం పట్ల చూపిన సదవగాహన, ఆదరభావం ఈ విశ్వవిద్యాలయ స్థాపనకు దోహదం చేశాయి.

నాల్గవ ప్రణాళికా కాలంలో కొత్తగా విశ్వవిద్యాలయాలు వేటిని నెలకొల్పేందుకు వీలులేదని ప్రణాళికా సంఘం సూచించింది. అయితే పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రాలను మాత్రం నెలకొల్పవచ్చునని అటు తరువాత వాటిని సమగ్రమైన విశ్వవిద్యాలయాలుగా రూపొందించుకోవచ్చునని ప్రణాళికాసంఘం సిఫార్సు చేసింది. కృష్ణా-గుంటూరు జిల్లాలలోని ప్రజలకు 200 మైళ్ల పరధిలో పోస్టుగ్రాడ్యుయేట్ విద్యాసౌకర్యాలు లేవు. అందుచేత ప్రణాళికాసంఘం చేసిన సిఫార్సు దృష్ట్యా గుంటూరు సమీపాన

పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రం ఒకటి 1967 జూలైలో స్థాపించబడింది. దీనితో బాటు వరంగల్లు, అనంతపురం లలో కూడా రెండు పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రాలు ఏర్పాటయ్యాయి. గుంటూరు పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రం గుంటూరుజిల్లా నల్లపాడులో గల ప్రభుత్వపాలిటెక్నిక్ భవనాలలో తాత్కాలికంగా ఏర్పాటయింది. గణితశాస్త్రం, తెలుగు, ఇంగ్లీష్, అర్థశాస్త్రం, వాణిజ్యశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, మొదట ఈ శాఖలో బోధన సౌకర్యాలు ఏర్పాటయ్యాయి. అటు తరువాత చరిత్ర, పురావస్తు శాఖాలను కూడా చేర్చారు. వాంచూసంఘం 1951లో ఆంధ్రరాష్ట్ర రాజధానికి సూచించిన ప్రాంతాన్నే పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రస్థాపనకు నిర్ణయించడం జరిగింది. 300 ఎకరాల విస్తీరం గల ప్రాంతం ఇది వరకే సేకరించబడింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం మరో 200 ఎకరాల ప్రాంతం కావాలని కోరింది. విద్యాభివృద్ధి దృష్ట్యా చూసినట్లయితే కృష్ణా-గుంటూరు ప్రాంతంలో ఎప్పుడూ అగ్రగామిగానే వున్నది. సెకండరీ స్థాయిలోనూ, కళాశాల స్థాయిలోనూ కూడ ఈ ప్రాంతంలో విద్యాసంస్థలు అధికసంఖ్యలో వున్నాయి. ఈ ప్రాంతంలోని ప్రజల కృషి ద్వారా ఇక్కడ విద్యాభివృద్ధి సత్వరంగా జరిగే ఉత్తమసంప్రదాయం మనకు కనిపిస్తుంది. అంతేకాదు, ప్రాచీన కాలం నుంచి కూడా ఇది విజ్ఞానవికాసానికి నిలయంగా వర్ధిల్లింది. ఆచార్యనాగార్జునుడు ప్రపంచఖ్యాతి వహించిన తన విద్యాపీఠాన్ని క్రీస్తుశకం మొదటి శతాబ్ది ప్రాంతంలో కృష్ణాతీరాన నాగార్జున కొండవద్ద నెలకొల్పిన సంగతి అందరికీ విదితమే. ఇది గుంటూరుకు దాదాపు 150 కి.మీ.ల దూరంలో వున్నది. ఈ ఆచార్యసత్తముడు పల్నాటి ప్రాంతంవాడు. బౌద్ధనాగార్జునుని జగద్విఖ్యాత విద్యాకేంద్రానికి చైనా, టిబెట్, సిలోన్ మున్నగు తావుల నుంచి విద్యార్థులు, ఆచార్యులు వచ్చేవారు. ఈ విద్యాకేంద్రం మూలంగానే ఆంధ్రదేశానికి ప్రపంచమంతటా కీర్తిప్రతిష్ఠలు పెంపొందాయి. నాగార్జునుని విద్యాపీఠానికి ఆంధ్రశాతవాహన ప్రభువైన యజ్ఞశ్రీ శాతకర్ణి అదరణ లభించింది. అందుచేత నూతన విశ్వవిద్యాలయాన్ని ఈ ప్రాంతంలోనే నెలకొల్పడం, దీనికి విశ్వవిఖ్యాత విద్యానిధి అయిన నాగార్జునుని పేరు పెట్టడం ఎంతైనా సముచితంగా వున్నది.

1956 నాటికి రాష్ట్రంలో 55 డిగ్రీ కళాశాలలు మాత్రమే వుండేవి. వాటిలో 46,000 మంది విద్యార్థులు చదువుతుండేవారు. ఈ నాడు ఈ కళాశాలల సంఖ్య 225 వరకు పెరిగింది. అదే విధంగా విద్యార్థుల సంఖ్య 1,75,000 వరకు పెరిగింది.

ఈ నాడు మన రాష్ట్రంలోని డిగ్రీ కళాశాలల్లో దాదాపు 9,000 అధ్యాపకులు పనిచేస్తున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రాంతంలో ఉన్నతవిద్య చాలా పెరిగినందు వల్ల విద్యా సంబంధమైన పర్యవేక్షణ, ఉన్నతవిద్యకు తగిన సౌకర్యాల ఏర్పాటు చేయడం అవసరమయ్యాయి. కోస్తా, ఆంధ్రప్రాంతంలో రెండవ విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పేందుకు గుంటూరు కంటే ఎక్కువ అర్హమైన తావు మరొకటి లేదు. మొదటి భారత ప్రభుత్వం అనుబంధాల ఏర్పాటు లేని పద్ధతిలో పనిచేసే విశ్వవిద్యాలయం నెలకొల్పేందుకు కేంద్రం సమ్మతించింది. ఆంధ్రప్రాంతంలో వున్న కళాశాలలు 136, భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన కమీషన్ వారు పరిపాలనసౌలభ్యానికి, విద్యాసంబంధమైన నియంత్రణకు అనువుగా వుండాలంటే 30 కళాశాలలకు ఒక విశ్వవిద్యాలయం వుండాలని సూచించారు. విశ్వవిద్యాలయం స్థాపించడం అన్నది అధికవ్యయంతో కూడుకున్న విషయమే. కాని విద్యాప్రమాణాల పరిపోషణకు అవసరమైన మార్గదర్శనానికి, నియంత్రణకూ వీలుగా విశ్వవిద్యాలయ స్థాపన అవసరమైంది.

విశ్వవిద్యాలయానికి అనుబంధించిన కళాశాలల సంఖ్య మరీ ఎక్కువగా ఉన్నట్లయితే, విశ్వవిద్యాలయ నిర్వహణపై భారం అధికంగా పడుతుంది. తత్ఫలితంగా పర్యవేక్షణ పటిష్ఠంగా సాగదు. తుదకు ఉన్నత విద్యాప్రమాణం తగ్గిపోతుంది. అలా జరగకుండా చూడడం భారతీయసమాజాన్ని చైతన్యవంతమైన సమాజంగా తీర్చిదిద్దడానికి ఎంతైనా అవసరం. వివిధ ఉత్పత్తి, పంపిణీ రంగాలలో సాంకేతిక విధానాల ఆధునీకరణ ద్వారా జీవనప్రమాణాలను మెరుగుపరచుకోగలుగుతాం. దేశంలో ఇట్టి సాంకేతికవిప్లవాన్ని సాధించేందుకు ఉన్నతవిద్యావశ్యకత ఎంతైనా ఉన్నది. కనుక ఈ సందర్భంలో ఉన్నత విద్యాస్థాయి మెరుగుపరచడం తప్పనిసరి కాగలదు. పొందికగా వుండే విశ్వవిద్యాలయాల ద్వారా మాత్రమే ఇది సాధ్యమవుతుంది.

నాగార్జున విశ్వవిద్యాలయ కార్యక్షేత్రం ప్రస్తుతానికి-నంబూరు ప్రాంతానికి 20కిలో మీటర్ల పరిధిలో గల ప్రాంతానికి పరిమితం చేయబడింది. విజయవాడ, తెనాలి, గుంటూరు, తాడికొండ ప్రాంతాలు ఇందులో చేరివుంటాయి. మరో విధంగా చెప్పాలంటే, ప్రస్తుతం విశ్వవిద్యాలయం క్రింద 18 డిగ్రీ కళాశాలలు, 6 ప్రాచ్య విద్యాకళాశాలలు, ఒక వైద్యకళాశాల (అలోపతి), ఒక ఆయుర్వేద కళాశాల, 2 ఉపాధ్యాయశిక్షణ కళాశాలలు ఉంటాయి. ఈ కళాశాలలు ఆంధ్ర విశ్వవిద్యాలయ

ప్రాంతాన్ని ప్రస్తుతానికి 20 కిలో మీటర్ల పరిధికి మాత్రమే పరిమితం చేయడం వల్ల, ఒక ముఖ్యమైన ప్రయోజనం చేకూరుతుంది. దాని వల్ల తొలిదశలలో అనుబంధ కళాశాలల పరిపాలన సమర్థంగా జరగడానికి అనువైన పరిస్థితి ఏర్పడుతుంది. అనుబంధకళాశాలల్లో విద్యాప్రమాణాలు పెరిగి, విశ్వవిద్యాలయంలో పోస్టుగ్రాడ్యుయేట్ విద్యకు, పరిశోధన, ఉన్నత విద్యాభివృద్ధికి ఇతోధిక సదుపాయాలు కల్పించడానికి అవకాశం కలుగుతుంది. ముఖ్యంగా ఈ ప్రాంతంలో ఉన్నతవిద్య పట్ల ఆసక్తి కనపరిచే వారిసంఖ్య అధికంగా ఉన్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పోస్టుగ్రాడ్యుయేట్ విద్యకు గల అవకాశాలు చాలా పరిమితం. ఈ ప్రాంతాలకు చెందిన విద్యార్థులు యితర విశ్వవిద్యాలయాలలో ప్రవేశించాలంటే, ఆయా విశ్వవిద్యాలయాలు కొన్ని నిర్బంధాలు విధించాయి. తత్కారణంగా విద్యార్థులు ఉన్నత విద్యావకాశాల కోసం దేశం నలుమూలలకు పోవలసివస్తున్నది. విద్యార్థులు, తల్లిదండ్రులు దానివల్ల ఎన్ని యిబ్బందులకు గురి అవుతున్నారో చెప్పనవసరం లేదు. ఎన్ని యిబ్బందులను ఎదుర్కొన్నప్పటికి వారికి లభించేది సవతి తల్లి ఆదరణ మాత్రమే. ఎందువల్లనంటే స్వరాష్ట్రంలో చదువుకున్నవారు ఉద్యోగావకాశాల విషయంలో ప్రాధాన్యాన్ని కోరడం సహజం. నాగార్జున విశ్వవిద్యాలయం ఉన్నతవిద్య విషయంలో విద్యార్థులకు అవసరమైన సదుపాయాలు సమకూర్చగలదని, ముఖ్యంగా ఆర్థికకారణాల వల్ల ఉన్నత విద్యార్జన కోసం దేశంలోని యితర ప్రాంతాలకు పోలేని సమాజంలోని బడుగువర్గాల విద్యార్థులకు ప్రయోజనకరంగా ఉండగలదని, నా విశ్వాసం. అయిదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఈ కేంద్రం అభివృద్ధి కోసం షట్సూత్రపథక నిధులనుండి 62.50 లక్షల రూపాయల మొత్తం కేటాయించబడింది.

ఈ విశ్వవిద్యాలయానికి ప్రస్తుతం చైతన్యస్ఫూర్తి గల ఉపాధ్యక్షులు శ్రీ బాలయ్యగారు అధిపతిగా ఉన్నారు. ఆయన ఈ విశ్వవిద్యాలయాన్ని అభివృద్ధి పరచడంలో తమ కాలాన్ని, తమ శక్తిని వినియోగించగలరని నేను విశ్వసిస్తున్నాను. ఒక సంస్థను వృద్ధిలోకి తేవడమన్నది ముఖ్యంగా తొలిదశలో పలు యిబ్బందులతో కూడుకున్న బృహత్తరకార్యమని నాకు తెలుసు. మొదట్లో ఈ విశ్వవిద్యాలయం కొన్ని కష్టాలను ఎదుర్కొనక తప్పదు. కాని సమర్థుడైన ఉపాధ్యక్షుని ఆధ్వర్యంలో ఉత్సాహం వెల్లివిరిసే ఈ ప్రాంత ప్రజల సహకారంతో ఈ విశ్వవిద్యాలయం అనతికాలంలోనే దేశంలోని ప్రముఖ విశ్వవిద్యాలయాలలో ఒకటిగా రూపొందగలదని నా నమ్మకం.

ప్రజలు ఈ విశ్వవిద్యాలయప్రాముఖ్యాన్ని గుర్తించి ఆర్థికంగా దీని అభివృద్ధికి తమచేయూత నిచ్చినప్పుడే అది సాధ్యమవుతుంది. దేశంలో పలు విశ్వవిద్యాలయాలు ఆర్థిక పుష్టిలేకపోవడం వల్ల దుర్బలంగా ఉంటున్నాయి. నిధులకొరత వల్ల వృద్ధిచెందలేకపోతున్న సంస్థలలో ఈ విశ్వవిద్యాలయం కూడా ఒకటి కాకూడదని నా ఆకాంక్ష. ఈ ప్రాంతం సుసంపన్నమైనట్టిది. ప్రజలు ఉదారస్వభావులు. విద్యావశ్యకత ఎంతైనా ఉన్నది. కనుక ఈ విశ్వవిద్యాలయాభివృద్ధికి ప్రైవేటు రంగం నుండి అవసరమైన ఆర్థికసహాయం పుష్కలంగా లభించగలదని నేను భావిస్తున్నాను. ఈ విశ్వవిద్యాలయం కూడా నాగార్జునాచార్యుని పీఠంవలెనే కీర్తిశిఖరాలనందుకుని ఉన్నత విద్యార్జనకై దేశంలోని యితరప్రాంతాల నుండి మాత్రమే కాక ప్రపంచం నలుమూలల నుండి విద్యార్థులను ఆకర్షించాలని నా ప్రగాఢవాంఛ. మన ప్రియతమ రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేస్తుండడం వల్ల ఈ విశ్వవిద్యాలయానికి ఒక వైశిష్ట్యం చేకూరుతుంది. వారి శుభాశీస్సులతో ఈ విశ్వవిద్యాలయానికి సముజ్జ్వలభవిష్యత్తు, పరిపూర్ణవికాసం సిద్ధించగలదని నా విశ్వాసం. ఈ విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవ శుభతరుణాన ఈ ప్రాంతం ప్రజలకు విశ్వవిద్యాలయ అధ్యాపకవర్గానికి, విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్న విద్యర్థులకు నా హృదయపూర్వక అభినందనలను, శుభాకాంక్షలను అందజేస్తున్నాను.

# 3. కాకతీయ విశ్వవిద్యాలయ ప్రారంభం

ఒక ప్రాంతంలో జరిగిన అభివృద్ధిని తెలుసుకోవడానికి అక్కడ కనిపించే విద్యారంగ ప్రగతి కొంతవరకు తోడ్పడుతుంది. ఈ దృష్ట్యా చూసినట్లయితే తెలంగాణ ప్రాంతం ఇంతవరకు విద్యావిషయకంగా కొంత వెనుకబడి వున్నదని చెప్పవలసివుంటుంది. ఇక్కడ అవకాశాలు తక్కువ వుండడమే ఇందుకు ముఖ్యకారణం అయితే, ప్రాంతంలో విద్యావకాశాలను ఇనుమడింపజేసేందుకు గత రెండు దశాబ్దాలుగా ప్రత్యేకకృషి జరుగుతున్నది. తత్ఫలితంగా విద్యార్థులకు ఉన్నతవిద్యాసౌకర్యాలు గణనీయంగా పెరిగాయి. ఇదివరకటి రోజుల్లో ఉన్నతవిద్య, ముఖ్యంగా పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్య చదువుకోవాలంటే, హైదరాబాదు నగరానికి రావలసి వచ్చేది. అప్పట్లో ఇతర చోట్ల ఈ సదుపాయాలు లేవు. హైదరాబాదు నగరానికి వచ్చి చదువుకునేందుకు తగిన ఆర్థికస్తోమత లేని వారికి ఎంతో ఇబ్బందిగా వుండేది. 1967-68లో వరంగల్లు పోస్ట్‌గ్రాడ్యుయేట్ కేంద్రం ఏర్పడింది. ఈ కేంద్రం ఉస్మానియా విశ్వవిద్యాలయం క్రింద వుండేది. ఈ కేంద్రం వల్ల వరంగల్లు ప్రాంతంలోని వారికి పోస్ట్‌గ్రాడ్యుయేట్ విద్యాసౌకర్యాలు సమకూరాయి. ఈ కేంద్రం మొదట తెలుగు, ఇంగ్లీష్, గణితశాస్త్రం, రసాయనికశాస్త్రం- ఈ నాలుగు పాఠ్యాంశాలతో ప్రారంభమయింది. తరువాత మరో ఐదు పాఠ్యాంశాలు అంటే భౌతికశాస్త్రం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, పౌరపాలనశాస్త్రం, వాణిజ్యశాస్త్రం కూడా చేర్చారు. 1974లో ఆర్థికశాస్త్రం ప్రవేశపెట్టారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రారంభించిన 'బి-ఫార్మా' కోర్సును 1975లో ఈ కేంద్రానికి తరలించడం జరిగింది.

ఉస్మానియా విశ్వవిద్యాలయం క్రింద 93 అనుబంధకళాశాలలు వుండడం చేత పరిపాలనపరంగా ఇబ్బందిగా వున్నదని, వరంగల్లులో వేరే ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పడం అవసరమని, రాష్ట్రప్రభుత్వం కొంతకాలం విశ్వవిద్యాలయం గ్రాంట్ల సంఘాన్ని, కేంద్రప్రభుత్వాన్ని కోరుతున్నది. తెలంగాణ ప్రాంతంలో కొత్త విశ్వవిద్యాలయం నెలకొల్పే విషయంలో సర్వత్రా శ్రద్ధాసక్తులు కనిపించాయి. మన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు విశ్వవిద్యాలయస్థాపన ఆవశ్యకతను విశ్వవిద్యాలయం గ్రాంట్ల సంఘం వారికి నచ్చచెప్పగలిగారు. తత్ఫలితంగా తెలంగాణ

ప్రాంతంలో రెండు విశ్వవిద్యాలయాలు సమకూరాయి. ఒకటి హైదరాబాదులోను, మరొకటి చరిత్ర ప్రసిద్ధిగాంచిన వరంగల్‌లోను ఉంటాయి. క్రొత్త విశ్వవిద్యాలయం ఏర్పాటవడం వల్ల ఈ ప్రాంతంలో ఉన్నతవిద్యావకాశాలు ఇనుమడిస్తాయి.

వరంగల్లు పట్నపుహద్దులలో వున్న అన్ని కళాశాలలు ఈ విశ్వవిద్యాలయం క్రిందికి వస్తాయి. ప్రాంతీయ ఇంజినీరింగ్ కళాశాలకు సహప్రతిపత్తి వుంటుంది. ఈ కళాశాలల సంఖ్య 15 వీటిలో ఇంజినీరింగ్ కళాశాల, ఉపాధ్యాయశిక్షణ కళాశాల, న్యాయశాస్త్ర కళాశాల, ప్రాచ్య విద్యాకళాశాలలు, ఎనిమిది డిగ్రీ కళాశాలలు వున్నాయి. ఈ ఎనిమిది డిగ్రీ కళాశాలల్లో రెండు మహిళా కళాశాలలు. వెనుకబడిన ప్రాంతాల సత్వర అభివృద్ధి నిమిత్తం ఉద్దేశించిన షట్సూత్ర ప్రణాళికలో ఒక భాగంగా, ప్రభుత్వం ఇంతవరకు ఈ విశ్వవిద్యాలయం అభివృద్ధి నిమిత్తం 50 లక్షల రూపాయలు కేటాయించింది. ఈ కళాశాల 650 ఎకరాల విస్తీర్ణం గల ఆదర్శప్రాయమైన ప్రదేశంలో ఏర్పాటయింది. కళాశాలలు, పరిపాలన విభాగ భవనాలు, వసతి గృహాలు మొదలైన వాటి నిర్మాణం ఇది వరకే ప్రారంభమయింది.

ఈ విశ్వవిద్యాలయానికి, 'కాకతీయ విశ్వవిద్యాలయ'మని నామకరణం చేయడం ఎంతో సముచితంగా వున్నది. క్రీ.శ.12వ శతాబ్దిలో, కాకతీయసామ్రాజ్యాన్ని వైభవోపేతంగా పరిపాలించినప్పటి కాకతీయ చక్రవర్తుల రాజధాని అయిన వరంగల్‌లో ఇది ఏర్పాటవుతున్నది. తెలుగు ప్రజలందరను ఏకఛత్రాధిపత్యం క్రిందికి తెచ్చిన ఘనత కాకతీయ మహాసామ్రాజ్యానికి దక్కుతుంది. 'కాకతీయ' అనే నామకరణం చేయడం వల్ల ఈ విశ్వవిద్యాలయం బాధ్యతలు మరింతగా పెరుగుతాయి. చరిత్ర ప్రసిద్ధిగాంచిన కాకతీయుల మహోదాత్త ఆశయాల సమున్నతశిఖరాలను ఈ విశ్వవిద్యాలయం అందుకోవలసి వుంటుంది. ఈ బాధ్యత నిర్వహణ కేవలం విశ్వవిద్యాలయ నిర్వహణవ్యవహారాలు చూసేవారిపై మాత్రమేగాక, విశ్వవిద్యాలయంలో పనిచేసే అధ్యాపక సిబ్బంది, అధ్యాపకేతర సిబ్బంది ప్రతి ఒక్కరిపైనా వుంటుంది. అంతేకాదు, పేరుకు తగిన ఉత్తమప్రమాణాలను సముపార్జించుకునేందుకు, ఉన్నతసంప్రదాయాలను నెలకొల్పేందుకు విశ్వవిద్యాలయం సాగించే దీక్షాయుత కృషిలో విద్యార్థులందరూ భాగస్వాములు కావాలి. తదనుగుణంగా వారు వ్యవహరించాలి. విశ్వవిద్యాలయవిద్యను కోరే వారికి ఉన్నతప్రమాణాలు గల విద్య సమకూర్చడంలో విద్యార్థులు, ప్రజలు ప్రభుత్వం సంఘటితంగా కృషిచేయవలసి వుంటుంది.

విశ్వవిద్యాలయవిద్య సమకూర్చేందుకు అయ్యే పెట్టుబడివల్ల దీర్ఘకాలికమైన ప్రయోజనాలు లభించే మాట వాస్తవమే. ఈ పెట్టుబడి చాలా అవసరమైనట్టిది కూడ. అయితే ఈ వ్యయం అంతటికి రాష్ట్రప్రభుత్వమే భరించడం కొంత కష్టసాధ్యమైనట్టిది. ఉన్నత విద్యాసౌకర్యాల వల్ల ప్రయోజనం పొందే సమాజం కూడా ఈ విశ్వవిద్యాలయ వ్యయభారాన్ని కొంత వరకు భరించేందుకు సంసిద్ధం కావడం ఆవశ్యకం. వదాన్యుల సహకారంతో మన దేశంలో విశ్వవిద్యాలయ విద్యాసౌకర్యాలు ఏర్పడిన సందర్భాలు, అవి అభివృద్ధి చెందిన సందర్భాలు పెక్కు మనకు కనిపిస్తాయి. ఈ నూతన విశ్వవిద్యాలయం దినదిన ప్రవర్ధమానమై పరిపూర్ణవికాసం చెందడంలో ప్రభుత్వనికి, విశ్వవిద్యాలయానికి వదాన్యులు చేయూతనివ్వగలరని విశ్వసిస్తున్నాను. ఇది సముజ్జ్వలభవిష్యత్తు గల విశ్వవిద్యాలయం. విశ్వవిద్యాలయం ఎంతో అభివృద్ధి చెందడానికి అవకాశాలు బహుళంగా వున్నాయి. అయితే ఈ భావిపథగమనంలో విశ్వవిద్యాలయం, తక్కిన విశ్వవిద్యాలయాలు అనుసరించిన వాటి కంటే విశిష్టమైన స్వయంశక్తిని ఆత్మస్థైర్యాన్ని ఉద్దీపింప చేయాలి. విశ్వవిద్యాలయం విద్యార్థులకు విజ్ఞానాన్ని అందించే మాట వాస్తవమే. దీనితో బాటు వారిలో కార్యనైపుణ్యాన్ని కూడా పెంపొందించవలసి వుంటుంది. ఈ నైపుణ్యం అన్నది సమాజంలోని అవసరాల కనుగుణంగా వుండాలి. దానివల్ల విశ్వవిద్యాలయం విద్య పూర్తిచేసుకొన్న తరువాత విద్యార్థి జాతీయసంపదకు, జాతీయ శ్రేయోవృద్ధులకు దోహదం చేయగల పౌరుడుగా రూపొందగలడు. ఈ నాడు విజ్ఞానానికి, కార్యనైపుణికి మధ్య చాలా అంతరం మనకు కానవస్తుంది. విజ్ఞానం ఎంత అవసరమో కార్యనైపుణ్యం కూడా అంత అవసరం కాబట్టి విజ్ఞానబోధనలో భాగంగా కార్యనైపుణ్యాన్ని కూడా అలవరచవలసి వుంటుంది. అదే కార్యానుభవం అవుతుంది. ఇప్పుడు ఇదే లఘుస్థాయిలో అమలు జరుగుతున్న మాట వాస్తవమే. క్రొత్తగా ఏర్పాటయ్యే ఈ విశ్వవిద్యాలయం విజ్ఞానంతోపాటు కార్యనైపుణిని కూడా సమకూర్చేందుకు తగు విధానాలను అవలంబించడానికి అనేక అవకాశాలున్నాయి. దీని మూలంగా విద్యార్థి విద్యానంతరం సమాజానికి ఒక భారంగా తోచడంగాని, నిరాశకు గురి అవడం గాని జరుగదు. నిరాశవల్ల అనేక సాంఘిక అరిష్టాలు తలెత్తుతాయి. అలాగాక విద్యార్థిలో కార్యనైపుణి వర్ధిల్లితే అతడు స్వయం శక్తిపై ఆధారపడగలుగుతాడు. పాత విశ్వవిద్యాలయాలలో వెనుకటి పద్ధతులు మార్చుకోవడం అంత సులభతరం కాదు. రాజకీయశాస్త్రం, జంతుశాస్త్రం, వాణిజ్యశాస్త్రం మొదలయిన అధ్యయన అంశాలను సంప్రదాయపద్ధతిలో చదివి ఉత్తీర్ణులైన పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థులు విద్యానంతరం సంపాదనకు సరైన అవకాశాలు

లభించడం లేదని, సమాజ అభ్యున్నతికి ఇతోధికసేవ చేయలేకపోతున్నామని, ఆత్మస్థైర్యం కోల్పోయి బాధపడేవారు కొందరు కనపడుతున్నారు. అభివృద్ధి చెందడానికి అవకాశాలున్నాయి. కాబట్టి ఈ విశ్వవిద్యాలయాధికారులు ఈ అంశంపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలని వారిని కోరుతున్నాను. ఎందరో విద్యార్థులు ఈ విశ్వవిద్యాలయం ద్వారా తమ ఆశయాలు, ఆకాంక్షలు నెరవేర్చుకోగలమని నమ్ముతున్నారు.

ఈ విశ్వవిద్యాలయం అభివృద్ధి చెందిన కొలది దాని అధికారపరిధి కూడా విస్తృతమవుతుంది.దేశంలోని మేటి విశ్వవిద్యాలయాలలో ఒకటిగా ఇది పరిఢవిల్లగలదు. వెనుకబడినంతలో కూడా ఒక ప్రత్యేకత లేకపోలేదు. అదేమంటే వెనుకబడిన ప్రాంతాల్లో అభివృద్ధి సాధించడానికి, అభివృద్ధి చెందిన ప్రాంతాలకంటే అవకాశాలు ఎక్కువగా వుంటాయి. అంతేకాదు, ఇక్కడ ఉన్నత విద్యపట్ల ఆసక్తి అధికంగా వుంటుంది. అభివృద్ధి చెందిన ప్రాంతాలతో సరిసమానంగా అభివృద్ధి చెందాలన్న ఆకాంక్ష మిక్కుటంగా వుంటుంది. అందుకు తగిన స్థిరసంకల్పం కూడా కానవస్తుంది.

ఈ విశ్వవిద్యాలయానికి కేంద్ర విద్యామంత్రి ప్రొఫెసర్ నూరుల్‌హసన్ ప్రారంభోత్సవం జరుపుతున్నారు. ఇది సంతోషకరమైన విషయం. ఈ విశ్వవిద్యాలయానికి వారి ఆశీస్సులు, సానుభూతి, సహకారం, ప్రోత్సాహం లభిస్తాయి. కేంద్రమంత్రి ఈ విశ్వవిద్యాలయానికి అన్నివిధాల సహాయసహకారాలు అందివ్వగలరని విశ్వసిస్తున్నాను. ఈ విశ్వవిద్యాలయానికి రూపకల్పన చేసింది కేంద్ర విద్యామంత్రే అనవచ్చు.

ఈ ప్రాంతప్రజలకూ, అధ్యాపకబృందానికీ, విశ్వవిద్యాలయ నిర్వాహకులకూ ఈ శుభసందర్భంలో నా హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను. ఈ విశ్వవిద్యాలయం దేశంలోని ముఖ్యవిశ్వవిద్యాలయాలలో ఒకటిగా వర్ధిల్లగలదని, దేశంలోని అన్ని ప్రాంతాల వారికి ఉన్నతవిద్య అందించే విజ్ఞాననిలయంగా భాసిల్లగలదని నా ప్రగాఢవిశ్వాసం.

*(27-11-1976)*

# 4. ఆరోగ్య జనాభా విద్యాసదస్సు

మిత్రులారా!

ఆరోగ్య జనాభా విద్యపై జరిగే ఈ సదస్సులో వీడ్కోలు ప్రసంగం చేసే అవకాశం నాకు లభించినందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. నాకీ అవకాశం కలుగజేసిన కేంద్ర ఆరోగ్య విద్యాసంస్థ వారికి, రాష్ట్ర వైద్యశాఖ వారికి, ప్రత్యేకించి వైద్యశాఖ అడిషనల్ డైరెక్టరుగారికి నా కృతజ్ఞులు తెలియజేస్తున్నాను.

అభివృద్ధి చెందుతున్న దేశాలన్నింటికీ జనాభా పెరుగుదల ఒక సమస్యగా పరిణమించింది. ఈనాడు జనాభా పెరుగుతున్న రేటు ప్రతి ఒక్కరినీ కలవరపరుస్తున్నది. పరిపాలన బాధ్యత వహించిన వారు, రాజనీతిజ్ఞులు, ప్రజలు-యావన్మందికి ఈ సమస్య ఆందోళన కలిగిస్తున్నది. ఎందుచేతనంటే అభివృద్ధి కోసం జరుగుతున్న వివిధ కార్యక్రమాలు, నానాటికీ పెరుగుతున్న జనాభా కారణంగా అనుకున్న ఫలితాలను ఇవ్వలేకపోతున్నాయి. జనాభా పెరుగుదల రేటును తగ్గించకపోయినట్లయితే ఆర్థిక, సాంఘిక అభివృద్ధి నిమిత్తం సాగుతున్న ప్రయత్నాలు వమ్ముకాగలవనే సత్యాన్ని మనం ఇంకా ముందు గుర్తించి ఉండాల్సింది. కుటుంబ నియంత్రణ కార్యక్రమం నిర్వహించే అధికారులు, జనాభా పెరుగుదల రేటు తగ్గించేందుకు తాము సాగిసున్న కృషి కొంత వరకు జయప్రదం అయిందని అంటున్నారు. అయితే చేయవలసిన కృషి ఇంకా ఎంతో ఉందనికూడ వారు అంగీకరిస్తున్నారు. పరిమిత కుటుంబం, వాసక్టమీ, ట్యూబెక్టమీ పద్ధతుల ద్వారా మూక ఉమ్మడిగా సంతాన నిరోధకచర్యలు తీసుకోవటం, కుటుంబ నియంత్రణ విద్య-వీటి మూలంగా జనాభా పెరుగుదలను తగ్గించడమే కాకుండా, జనాభా పెరుగుదలను అరికట్టవలసిన ఆవశ్యకతను గురించి ప్రజలకు తెలియజేసేందుకు కూడా వీలుపడుతుంది. ఒక విధంగా చూస్తే జనాభాలో కనిపిస్తున్న విపరీతమైన ఈ పెరుగుదల దేశం అభివృద్ధి చెందలేదని చెప్పడానికి ఒక నిదర్శనంగా ఉంటుంది. నా మటుకు నాకు ఈ పరిస్థితి ఒక విషవలయం మాదిరిగా తోస్తుంది. ఎందుచేతనంటే జనాభా పెరుగుదలను అరికట్టితేనే తప్ప, దేశంలో ఆర్థికాభ్యున్నతిని

సాధించడానికి వీలుండదు. అయితే ఆర్థికంగా అభివృద్ధి చెందితేనే తప్ప కుటుంబ నియంత్రణ కార్యక్రమం జయప్రదం కావటం కొంత వరకు కష్టసాధ్యం. అందుచేత ఈ నాడు మనం క్లిష్టపరిస్థితిలో ఉన్నాం. కాబట్టి జనాభా పెరుగుదల తగ్గింపును ఒక ఉత్తమసాధనంగా స్వీకరించి మనం ఆర్థికాభివృద్ధిని సాధించవలసి ఉన్నది.

కుటుంబనియంత్రణకు సంబంధించి ఇంత వరకు మనం సాగిస్తున్న కృషి క్రింద, ముఖ్యంగా సంతానోత్పత్తి వయస్సులో వున్న దంపతులు కుటుంబ నియంత్రణ పద్ధతులు సాధించేటట్లు చేస్తున్నాం. కాన్పుకూ కాన్పుకూ మధ్య తగినంత ఎడం వుండేటట్లు చూడటం, ఇద్దరో, ముగ్గురో పిల్లల తర్వాత సంతానం కలుగకుండా చూడటం వీటిని గురించి ప్రచారం జరిపాం. మన జీవనప్రమాణాలను మెరుగు పరచుకోవాలంటే, కుటుంబ నియంత్రణ ఆవశ్యకతను గురించి ప్రజలు తమ జీవితాల్లో చాలా ముందుగానే తెలుసుకోవటం ఎంతో అవసరం. సమాజంలోని అన్ని వర్గాల వారిలోను కుటుంబ నియంత్రణ, జనాభా సంబంధమైన విజ్ఞానం పరివ్యాప్తం కావాలి. జనాభా విషయాల నిపుణులు, కుటుంబ నియంత్రణ అధికారులు ఈ విషయాన్నే ఉద్ఘాటిస్తున్నారు. జనాభా విద్య అందరికీ సంబంధించినట్టిది. అయితే దేశంలోని విద్యావ్యవస్థలో ఈ విజ్ఞానాన్ని ప్రవేశపెట్టే విషయం పట్ల విద్యామంత్రిగా నాకు ప్రత్యేక ఆసక్తివున్నది. ఇక్కడ సమావేశమైన మీరందరూ నిపుణులైనట్టి వారు. విద్యార్థులకు జనాభా విద్యను గురించి బోధించడం ఎలాగో ఇదమిత్థంగా నేను సూచనలు ఇవ్వగలనని భావించటం లేదు. విద్యార్థులకు అన్నప్పుడు ప్రాథమిక దశనుంచి విశ్వవిద్యాలయదశ వరకు వున్న విద్యార్థులని నా ఉద్దేశ్యం.

ఈ నాడు భారతీయసమాజంలో చైతన్యరాహిత్యమే ఎక్కువగా కానవస్తున్నది. ఈ సమాజంలోని నేటి సంస్కృతీసంప్రదాయాల దృష్ట్యా పరిశీలించినపుడు, ప్రాథమిక విద్యాదశలో జనాభా విద్య గరపటమన్నది, సామాన్యులకు వింతగా తోచవచ్చును. ప్రాథమికదశలోను, సెకండరీ దశలోను కుటుంబ నియంత్రణ గురించి కాని, జనాభా విద్య గురించిగాని విద్యార్థులకు బోధించడానికి విద్యావేత్తలు ప్రయత్నిస్తున్నారని, విన్నప్పుడు పూర్వాచారపరాయణులైన తల్లిదండ్రులు ఆశ్చర్యచకితులు కాగలరు. ప్రపంచంలోని పురోగామి దేశాల్లో కూడా ఇటువంటి విద్యపట్ల కొంత వైముఖ్యం వున్నది. అందుచేత ఇంకా అభివృద్ధి చెందని మనదేశంలో ఇటువంటి దృక్పథం వున్నప్పుడు మనం ఆశ్చర్యపడనవసరం లేదు. కాని అన్ని వయస్సుల విద్యార్థులకు

ఈ విద్యాబోధన అవసరం. వివిధదశలలోని విద్యార్థులకు ఏ రకమైన జనాభా విద్య ఏ విధంగా బోధించాలన్నదే ముఖ్యసమస్య. దేశ విద్యావ్యవస్థను నిర్వహించే వారు ఈ విషయంలో ప్రధానపాత్ర వహించవలసి ఉంటుంది.

ఈ నాడు అన్ని దశలలోను పిల్లలకు బోధించే పాఠ్యాంశాలు చాలా ఎక్కువగా వుంటున్నాయని, తత్ఫలితంగా వారు తమకు బోధించిన విషయాలను సరిగా బోధించడానికి వారికి తగినంత సామర్థ్యం వుండటం లేదని, తత్కారణంగా విద్యార్థులలో అసంతృప్తి పెరిగి, దేశమందలి విద్యార్థి లోకం క్రమశిక్షణరాహిత్యానికి దారితీస్తున్నదని విస్తృతమైన విమర్శ ఒకటుంది. ఈ విమర్శతో కొంతవరకు ఏకీభవించే వారిలో నేనొకణ్ణి. ఎందుచేతనంటే ఈ నాడు ఒక విద్యార్థి తాను ప్రయోజనకరంగా నేర్చుకోగలగడాని కంటే ఎక్కువ విద్య నేర్చుకోవలసి వస్తున్నది. అయితే విద్యార్థి పెద్ద అయిన తర్వాత ఉపయోగకరమూ, ఆవశ్యకమూ అయిన విద్యను చిన్నతనం నుంచి నేర్చుకునే విధంగా విద్యావిధానంలో సంస్కరణలు తీసుకు రాకూడదని గాని, అదనపు పాఠ్యాంశాలను చేర్పకూడదని గాని నేను చెప్పటం లేదు. ఉదాహరణకు, జనాభా విద్య బోధించాలంటే తప్పనిసరిగా బోధించాలని నా అభిప్రాయం- విద్యార్థులపై అధికభారం మోపకుండా, ఇపుడున్న పాఠ్యప్రణాళికలోనే ఈ విషయాన్ని ఒక అంతర్భాగంగా చేర్చవచ్చును. గణితశాస్త్రం తీసుకోండి. జనాభా పెరుగుదల ప్రమాణాన్ని స్పష్టం చేసే విధంగా ఒక లెక్కను లేదా సమస్యను రూపొందించవచ్చును. జనాభా పెరుగుదల, ఆర్థికాభివృద్ధిపై దాని ప్రభావం అన్న అంశాన్ని సాంఘికవిద్యలో ఒక భాగంగా ప్రవేశపెట్టవచ్చును. దేశ విద్యావిధానంలో జనాభా విద్య అన్నది ఒక అంతర్భాగంగా వుండేటట్లు విద్యార్థుల పఠనాంశాలను ఏర్పాటు చేయవచ్చును. ఇక్కడ సమావేశమై వున్న మీరంతా ఈ విషయాన్ని కూలంకషంగా పరిశీలించి పెక్కు సిఫార్సులు చేశారు. విద్యార్థులపై ప్రస్తుతమున్న భారాన్ని అధికం చేయకుండా, వారి పాఠ్యప్రణాళికలో జనాభా విద్యను ఒక భాగంగా చేరుస్తూ, విద్యావిధానాన్ని సంస్కరించాలన్న సిఫార్సులను, విద్యామంత్రిగా నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. మన మనుగడకు, మన ప్రజలకు ఉన్నత జీవనప్రమాణాలను సాధించేందుకు మనం జరుపుతున్న కృషి ఫలించడానికి ఈ సంస్కరణ అత్యంతావశ్యకమని నేను భావిస్తున్నాను. కనుక అందుకు నా నుండి, ప్రభుత్వం నుండి అవసరమైన సహకారం లభించగలదని హామీ ఇస్తున్నాను.

జనాభా విద్యావివరాలను ఇక్కడ సమావేశమైన మీవంటి నిపుణులకు వదలి వేస్తున్నాను. కాగా నేను చెప్పదలచుకున్నది. ఒక్కటే-మనం ఈ కార్యక్రమాన్ని చేపట్టేటప్పుడు పాఠ్యప్రణాళికలో ఈ విషయాన్ని చేర్చడానికి సమర్థులైన వ్యక్తులు కావాలి. అందుకుగాను నూతన విధానబోధన లేక పునశ్చరణ తరగతుల రూపంలో ఉపాధ్యాయులకు తగిన శిక్షణను ఇవ్వాలి. పాఠశాలలలోని సాధారణ విద్యావిధానంలో అంతర్భాగంగా, జనాభా విద్యను బోధించగలిగేటట్లు వారికి తర్ఫీదు ఇవ్వాలి. మన ఉపాధ్యాయులకు ఈ శిక్షణ ఏర్పాటు చేయడానికి అవసరమైన అదనపు సదుపాయాలను కల్పించే విషయాన్ని, ఆర్థికపరిస్థితులను బట్టి పరిశీలించడానికి నేను సిద్ధంగా వున్నాను. కుటుంబ నియంత్రణ అధికారులు కుటుంబ నియంత్రణ కార్యక్రమాలపై కోట్ల రూపాయలు వెచ్చిస్తున్నారు. వారి కృషి పూర్తిగా ఫలించాలంటే, వారి కార్యక్రమంలో జనాభా విద్యను కూడా ఒక భాగంగా పరిగణించవలసి వుంటుందని వారికి మనవి చేస్తున్నాను. పాఠశాలలలో అవసరమైన ఆరోగ్యవిద్య గరపడానికి ఉపాధ్యాయులకు శిక్షణ ఇవ్వడంలో, మరికొంత మొత్తం పెట్టుబడి పెట్టడానికి వారు వెనుకాడనవసరం లేదు. ఈ పెట్టుబడి ఫలప్రదం కావడానికి కొంచెం ఎక్కువ కాలం పట్టవచ్చును. కాని వయోజనుల స్థాయిలో ఈ సమస్యను ఎదుర్కోవడం కంటే పై పెట్టుబడి ఉత్తమోత్తమ ఫలితాల నివ్వగలదనడంలో సందేహం లేదు. జనాభా పెరుగుదల స్థాయిని తగ్గించాలన్న అంతిమలక్ష్యాన్ని సాధించడానికి శక్తిసామర్థ్యాలు, అభివృద్ధిపై పెడుతున్న పెట్టుబడిగా దీనిని కుటుంబ నియంత్రణాధికారులు పరిగణించాలి. కనుక తమ వ్యయంలో కొంత భాగాన్ని మన రాష్ట్రంలోని పాఠశాలలలోను, కళాశాలలలోను జనాభా విద్య గరపడానికి ప్రత్యేకించవలసిందని, ఆరోగ్య వైద్యశాఖలోని కుటుంబ నియంత్రణపై పెట్టే పెట్టుబడి కన్నా ఈ పెట్టుబడి మరింత ఉపయోగకరమైనదిగా పరిగణించాలి. మీ సదస్సు నా ఈ ప్రతిపాదనను శ్రద్ధగా పరిశీలించి, కుటుంబ నియంత్రణాధికారులు జనాభా విద్యను తమ కార్యక్రమంలో ఒక అంతర్భాగంగా స్వీకరించి, జనాభా విద్యపై పెట్టుబడిని కూడ కుటుంబ నియంత్రణ కొరకు పెట్టే పెట్టుబడిలో ఒక భాగంగా పరిగణించేటట్లు చూడగలరని ఆశిస్తున్నాను. నా సహచరులైన ఆరోగ్య శాఖామంత్రి సహేతుకమైన ఈ ప్రతిపాదనకు అంగీకరించగలరని నా విశ్వాసం. ప్రస్తుతం రాష్ట్రంలో విద్యాశాఖ బడ్జెట్లపై గల ఒత్తిడి దృష్ట్యా, పాఠశాలలలో గాని కళాశాలలలోనిగాని జనాభా విద్యపై పెట్టుబడికి అవసరమైన వనరులను

సమకూర్చడం దాదాపు అసాధ్యమేనని చెప్పాలి. ఉపాధ్యాయుల ద్వారాను, పాఠశాలలు మొదలైన వాటి ద్వారాను జనాభా ఆరోగ్య విద్యపట్ల ఆసక్తి కలిగించడానికి నా శాయశక్తులా తోడ్పడగలనని హామీ ఇస్తున్నాను. అయితే ఈ ప్రత్యేక కార్యక్రమాన్ని కావలసిన ఆర్థికవనరులన్నీ కుటుంబ నియంత్రణ కార్యక్రమాల కొరకు కేటాయించిన పెట్టుబడుల నుండి సమకూర్చవలసి వుంటుంది.

మీ సదస్సు జనాభా, ఆరోగ్యవిద్యకు సంబంధించిన వివిధ అంశాలను క్షుణ్ణంగా పరిశీలించి విద్యార్థులకు జనాభా విద్య బోధించేందుకు అచరణాత్మమైన పద్ధతులను రూపొందించి వుంటుందని నేను విశ్వసిస్తున్నాను. జనాభా విద్యను విద్యార్థుల పాఠ్యాంశాలలో చేర్చడానికి సంబంధించిన అన్ని సిఫారసులను ప్రభుత్వం, రెండు షరతులకు లోబడి మనఃపూర్వకంగా పరిశీలిస్తుందని నేను మరొక్కసారి వాగ్దానం చేస్తున్నాను. ఈ రెండు షరతులు చాలా ప్రధానమైనవి కావటం చేత వాటిని మరొకసారి పేర్కొనవలసి వస్తున్నది. మొదటి విషయం ఏమిటంటే జనాభా విద్య విద్యావిధానంలో ఒక అంతర్భాగంగా ఉండాలి. వివిధస్థాయిలలో ఇప్పటికే అధికంగా వున్న పాఠ్య ప్రణాళిక భారాన్ని అది అధికం చేయకూడదు. రెండవది-అది విద్యాశాఖ ఆర్థిక వనరులకు భారం కాకూడదు. పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ పాఠ్యప్రణాళికలో జనాభా విద్యను చేర్చడానికి అవసరమైన నిధులన్నిటిని కుటుంబనియంత్రణ అధికారులే భరించాలి. వారు ఇందుకయే వ్యయాన్ని తమ పెట్టుబడిలో ఒక భాగంగా పరిగణించాలి. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు ఉత్తమఫలితాలనిస్తూ జయప్రదం కావాలంటే, ఈ పెట్టుబడి తప్పనిసరి అని కూడా వారు భావించాలి. మీరీ సదస్సును నిర్వహించినందుకు, నాకీ అవకాశం కల్పించినందుకు మీకు మరొక్కమారు నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. మీకు నా ధన్యవాదాలు.

# 5. రాజస్థానీ శిక్షాసమితి, నిజామాబాదు ఆధ్వర్యాన నడుస్తున్న శిక్షాసంస్థల వారికోత్సవ సందేశం

పూజ్యులు, ఆంధ్రప్రదేశ్ రాజ్యపాల్ గౌ॥ బి.సి. దివాన్‌జీ,
ఆంధ్రప్రదేశ్ విద్యుత్ శాఖామాత్యులు గౌ. రాజారాం గారు,

సోదర సోదరీమణులారా!

రాజస్థానీ శిక్షాసమితి నిజామాబాదు ఆధ్యర్యమున నడుస్తున్న విద్యాసంస్థల వార్షికోత్సవ సందర్భములో మిమ్ము కలుసుకునే అవకాశము కల్పించడమే గాక, మీ సంస్థ ఆధ్వర్యాన నిర్మించబడే బాలమందిర్ మాంటిస్సోరీ భవనానికి శంకుస్థాపన చేసే అవకాశం కూడా నాకు కల్పించిన పెద్దలకు ధన్యవాదములు. రాజస్థానీ శిక్షాసమితి ఆధ్వర్యమున నడుస్తున్న విద్యాసంస్థలలో పని చేస్తున్న ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు నా అభినందనలు.

మన భారతదేశం చాలా విశాలమైనది. వివిధభాషలు, వివిధమతాలు, వివిధ ఆచారాలు గల దేశం మనది. అయినా భిన్నత్వంలో ఏకత్వం మన దేశవిశిష్టత. అందు వల్లనే భారతదేశ సమైక్యం చెక్కుచెదరకుండా యీ నాటికి సంరక్షింపబడుతూ ఉన్నది. ఈ సమైక్యాన్ని కాపాడడం మనందరి కర్తవ్యం.

దేశసమైక్యానికి సహకరించే ప్రధానసాధనాలలో భాష కూడా ఒకటి. స్వాతంత్ర్యం రాక పూర్వమే యీ దేశానికి ఒక జాతీయభాష అవసరమని గుర్తించి, అందుకు హిందీయే తగిన భాష అని మహాత్మా గాంధీ వంటి మన దేశనాయకులు నిర్ణయించారు. అప్పటి నుండి హిందీ భాషాప్రచారం మన దేశంలో జరుగుతూ ఉన్నది. మహాత్మా గాంధీ తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, తుళుభాషలు మాట్లాడే విశాలమైన దక్షిణ భారతదేశంలో జాతీయభాషాప్రచారం కావించేందుకు అరవై సంవత్సరాల క్రితం దక్షిణ భారత హిందీ ప్రచార సభను స్థాపించారు. తన కుమారుడు దేవదాసు గాంధీని ప్రథమ హిందీ ప్రచారకుడుగా మద్రాసుకు పంపించారు. మన ఆంధ్రప్రదేశ్‌లో దక్షిణ భారత హిందీ ప్రచారసభ, హైదరాబాదు హిందీ ప్రచారసభ, హిందీప్రచార రంగంలో కృషిచేస్తున్నాయి.

దక్షిణ భారతదేశంలో హిందీ ప్రచారం స్వాతంత్ర్యసమరంలో ఒక భాగంగా జరిగింది. ఆ నాడు ఖాదీ ఉద్యమం, హరిజనోద్ధరణ, గ్రామపరిశ్రమలు మొదలుగా గల కార్యక్రమములతో పాటు హిందీ ప్రచారకులు దీక్షతో జాతీయ భాషాప్రచారం చేస్తూ ఉండేవారు. కనుకనే దక్షిణాది ప్రజలు యీ ఉద్యమానికి అండగా నిలబడ్డారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత పరిస్థితులు మారిపోయాయి. వాతావరణంలో మార్పు వచ్చింది. స్కూళ్లలోనూ, కాలేజీలలోనూ హిందీ ఉద్యోగాలు ఏర్పాటు అయ్యాయి. దానితో మెల్లమెల్లగా త్యాగభావంతో హిందీ ప్రచారం చేసే హిందీ ప్రచారకులు హిందీ పండితులుగా మారిపోయారు. ఉద్యోగాలకు ప్రాధాన్యం హెచ్చిపోయింది. త్యాగభావం తగ్గిపోయింది. ఇది మంచిది కాదని, హిందీ భాషా ప్రచారం ఉద్యోగుల కోసమేనన్న ప్రవృత్తి మారడం చాలా అవసరమని, యీ సందర్భములో మనవి చేస్తున్నాను. త్యాగదీక్ష, సేవాతత్పరత, దేశభక్తి మొదలైనవి యీ నాటి హిందీ ప్రచారకులు కూడా అలవరుచుకోవడం అవసరం అని మరోమారు మనవి చేస్తున్నాను. లేకపోతే అంతా పండితులుగానూ, సాహిత్యరత్నలుగానూ మారిపోయి, కేవలం అలంకారప్రియులుగానే ఉండిపోయే పరిస్థితులు సంప్రాప్తించే ప్రమాదం ఏర్పడవచ్చునని, అది జాతీయభాషా ప్రచారోద్యమానికి అపకారం చేయడమే గాక హిందీ వ్యతిరేకోద్యమానికి బలం చేకూరుస్తుందని కూడా, మనవి చేస్తున్నాను.

మన ఆంధ్రప్రదేశ్ మొదటి నుండి హిందీ ప్రచారానికి దోహదం చేస్తున్నది. త్రిభాషాసూత్రాన్ని ఇక్కడ అమలు చేస్తున్నాము. ప్రాంతీయభాషగా తెలుగును, జాతీయభాషగా హిందీని, అంతర్జాతీయభాషగా ఇంగ్లీషును మన ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ప్రతి విద్యార్థికి నేర్పుతున్నాము. ఇంతేగాక ఉర్దూ, కన్నడం, మరాఠీ, తమిళం మొదలుగా గల భాషలవారిని కూడా మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉదారంగా ప్రోత్సహిస్తున్నది. వారికి గ్రాంట్లు అందజేసి వారి పాఠశాలలు నడుపుకునేందుకు మన ప్రభుత్వం సహకరిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హిందీ భాషాబోధనకు అవసరమైన ఏర్పాటు చేస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో గల మూడువేల ఒక వంద హైస్కూళ్లలోనూ, పన్నెండు వందల అప్పర్ ప్రైమరీ స్కూళ్లలోనూ హిందీ ప్రచారకులు పని చేస్తున్నారు. వీరందరికి జీతాల క్రింద ఒక కోటి ఏభై-వేలు వరకు మన ప్రభుత్వం ఖర్చు చేస్తున్నది. ఇంకా కొన్ని స్కూళ్లల్లో హిందీ పండితుల అవసరం ఉంది. ఆర్థిక పరిస్థితులను బట్టి కేంద్ర ప్రభుత్వ సహాయంతో హిందీ పండితులను నియమించేందుకు ప్రయత్నం చేస్తున్నాము.

ఆంధ్రప్రదేశ్‌లో గల కాలేజీలన్నింటిలోను హిందీ భాషాబోధన జరుగుతూ ఉన్నది. ఇదికాక ఆంధ్రప్రదేశ్‌లో స్వతంత్రంగా పనిచేస్తున్న హిందీ విద్యాలయాలకు అరవై వేల రూపాయలు గ్రాంటుగా ఇస్తున్నాము. మరో అరవైమూడు వేలు ఇందుకోసం కేటాయించాము.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమే గాక దక్షిణ భారత హిందీ ప్రచార సభ, హైదరాబాద్ హిందీ ప్రాచరసభ ప్రచారం చేస్తున్నాయి. వాటికి కూడా చేతనైనంత వరకు ఆర్థికసహాయం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో హిందీ ప్రచారాన్ని సువ్యవస్థితంగా నడిపించాలనే ఉద్దేశ్యంతో హిందీ సమన్వయ సమితిని, హిందీ కో-ఆర్డినేషన్ కమిటీ ప్రభుత్వపక్షాన ఏర్పాటు చేశాము. ఆ కమిటీ మూడు నాలుగు సార్లు సమావేశమై హిందీ స్వచ్ఛంద సంస్థల పరీక్షలకు సంబంధించిన సిలబసు, హిందీ పరీక్షలు నడిపించే విధానం, హిందీ ట్రైనింగ్ విద్యాలయాల వ్యవస్థలో అవసరమైన మార్పులు చేసింది. హిందీలో మార్కులు పెంచడం, పిరియడ్లు పెంచడం మొదలుగా గల సమస్యలపై చర్చలు జరిగాయి. ఈ విషయములో అవసరమైన చర్యలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము గైకొనగలదని మనవి చేస్తున్నాం.

ప్రథమ ప్రపంచ హిందీ మహాసభలు నాగపూరులో జరిగినప్పుడు మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపక్షాన ఏభై వేల రూపాయలు వారికి అందజేశాము. 'ఆంధ్రప్రదేశ్' అనే హిందీ పత్రికను ప్రత్యేక సంచికగా ప్రచురించి, అక్కడకు వచ్చిన మూడు వేలమంది ప్రతినిధులకు అందజేశాము. ద్వితీయ ప్రపంచ హిందీ మహాసభలు ఆగష్టు 28, 29, 30 తేదీలలో మారిషస్‌లో జరిగాయి. ఆ సందర్భంలో భారత ప్రభుత్వపక్షాన మారిషస్ వెళ్లిన ప్రతినిధివర్గంలో ఒక సభ్యుడుగా వెళ్లే అవకాశం నాకు కూడా కల్పించి, తద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేస్తున్న హిందీ కృషిని భారతదేశమే గాక ప్రపంచమందలి ఇతర దేశాలు కూడా గుర్తించాయని మనవి చేస్తున్నాను. దానితో బాటు యీ రంగంలో చేయవలసిన కార్యక్రమం ఇంకా చాలా ఉన్నదని, దానిని పూర్తిచేసేందుకు ఇటు ప్రభుత్వం, అటు ప్రజలందరి సహకారం అవసరమని మనవి చేస్తున్నాను.

ఈ సందర్భంలో ఒక విషయం పేర్కొనడం అవసరమని భావిస్తున్నాను. ఆంధ్రప్రదేశ్‌లో రెండు ప్రమాదకరమైన ఉద్యమాలు వచ్చి ప్రజలు, విద్యార్థులు ఎన్నో ఇబ్బందులకు గురైన విషయం మీకందరకు తెలుసు. విద్యారంగం పూర్తిగా దెబ్బతినిపోయింది. దృఢమైన దీక్షతో విద్యారంగాన్ని సక్రమంగా నడిపించేందుకు

పని చేస్తున్నాము. హిందీ ప్రచారరంగంలో కూడా కొంత అవినీతి ప్రవేశించినది. హిందీ భాషను నేర్చుకోకుండానే దొంగ సర్టిఫికేట్లు సంపాదించుకుని హిందీ ఉపాధ్యాయులుగా కొందరు ఉద్యోగాలు తెచ్చుకుంటున్నారు. హిందీలో ఓనమాలు సైతం రాకుండానే హిందీ పండితులుగా పని చేస్తున్న ఉపాధ్యాయుల దగ్గర హిందీ నేర్చుకునే మన బిడ్డల పరిస్థితి ఏమౌతుందో మీరే ఊహించుకోవచ్చు. ఈ అరాచకాన్ని అరికట్టేందుకు అవసరమైన చర్యలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసుకున్నది.

మన ఆంధ్రప్రదేశ్‌లో కోట్లాది రూపాయలు విద్యారంగానికై ఖర్చు చేస్తున్నాము. ఇంత సొమ్ము ఖర్చు పెడుతున్నామే గాని, అందుకు తగిన సత్ఫలితాలు సాధించ గలుగుతున్నామా అనే విషయం ఒక పర్యాయం ఆలోచించండి. ఆ సొమ్ము సద్వినియోగం కావాలని మనందరి ఆకాంక్ష. అందుకై మనందరం కలిసి పనిచేద్దాం. దేశభవిష్యత్తును తీర్చిదిద్దే విద్యార్థులకు మంచి శిక్షణ ఇచ్చేందుకు అంతా కలసి సమైక్యంగా కృషి చేద్దాం. తద్వారా ఉజ్జ్వలమైన ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి పునాదులు వేద్దాం.

నేను స్కూల్లోను, కాలేజీలోనూ చదువుకున్నప్పుడు హిందీ భాషాపరిచయం కొద్దిగా ఉండేది. రాజకీయాల్లోకి వచ్చాక భాషను నేర్చుకునేందుకు ప్రయత్నం చేయలేకపోయినాను. హిందీ నేర్చుకోనందున కలిగే లోటేమిటో ఇప్పుడు బోధపడుతున్నది. మీరందరూ హిందీ నేర్చుకుని ప్రయోజనం పొందవలసిందని మనవి చేస్తున్నాను.

ఈ రోజున మీ అందరి మధ్య నిలబడి నా అభిప్రాయాలు తెలిపేందుకు నాకు అవకాశం కల్పించిన పెద్దలకు, నాచేత బాలమందిర్ భవనానికి శంకుస్థాపన చేయించిన పెద్దలకు మరోమారు ధన్యవాదాలు. ఓపికతో నేను చెప్పిన నాలుగు మాటలు విన్నందుకు మీ కందరికీ కృతజ్ఞుణ్ణి.

జైహింద్!

*(25-03-1977)*

# 6. సామాజిక పరివర్తన సాధనం -'విద్య'

సహచరులారా ! స్నేహితులారా !

రాష్ట్ర ఉపాధ్యాయసంఘం రజతోత్సవాల సందర్భంగా ఏర్పాటు చేసిన విద్యామహాసభలను ప్రారంభించే సదవకాశం కల్పించిన రాష్ట్ర ఉపాధ్యాయసంఘం ఆహ్వానసంఘ నిర్వాహకులకు మా ధన్యవాదాలు.

మహాసభలలో "సామాజిక పరివర్తన సాధనంగా విద్య" ప్రధాన చర్చనీయాంశంగా నిర్ణయించబడటం ముదావహం.

ఐక్యరాజ్య సమితి విద్యావైజ్ఞానిక వ్యవహారాల సంఘంవారిచే నియమింపబడిన అంతర్జాతీయ విద్యాభివృద్ధి కమీషన్ "జీవితాంతం విద్య" అనే సమస్యపై సమర్పించిన నివేదికపై కూడా, ఈ సభలలో చర్చలు జరుప నిశ్చయించుట హర్షదాయకం. ఇది చాలా ముఖ్యమైన నివేదిక. సర్వతోముఖంగా జీవితాంతం సాగే విద్య మాత్రమే మానవుని పూర్ణత్వాన్ని చేకూర్చగలుగుతుంది. అందులకు జీవితపర్యంతం నిరంతర వికాసశీలంగా విజ్ఞానాన్ని పెంపొందించుకొనే మార్గం అన్వేషించాలని నివేదిక ఉద్ఘాటిస్తున్నది. విద్య యావజ్జీవితం కొనసాగాలి. విద్య అందరికి అందుబాటులో వున్నంతమాత్రాన సరిపోదు. విద్య ప్రతివ్యక్తి జీవితంలో అంతర్భాగంగా ఏర్పడాలి. సమాజ అభ్యున్నతికి, వ్యక్తి శక్తిసామర్థ్యాల ఆవిష్కరణకు ఉభయత్రా దోహదం చేయడమే విద్య ఆశయంగా వుండాలి అని కూడా ఈ నివేదిక నొక్కి వక్కాణిస్తున్నది. ఈ నివేదికలోని వివిధ సిఫార్సులను పరిశీలించి ప్రభుత్వానికి సూచనలు అందజేయ వలసినదిగా కోరుతున్నాను.

రాజకీయ, ఆర్థిక, సాంఘిక అవసరాలకు అనుగుణంగా విద్యావిధానం రూపొందింపబడుతూ వస్తున్నది. సామాజికపరివర్తనతో పాటు విద్యావిధానం మారుతూవస్తూంది. విద్యాభివృద్ధి మీదనే సామాజికపరివర్తన ఆధారపడి వుంది. అందుచే సామాజికశ్రేయస్సుకు తోడ్పడేదిగా విద్య వుండాలి. విద్య, సామాజికపరివర్తన, రెండూ అవినాభావసంబంధంతో నడుస్తున్నాయి.

పూర్వం సరిహద్దుల రక్షణ పరమావధిగా వున్న కాలంలో సైనికశిక్షణ, ఆజ్ఞాపాలనే విద్యగ వుండేది. తరువాత "స్టేట్" అనేది అంతిమ అధికారంగల వ్యవస్థ అని, దానికంటే ఉన్నతాధికారంగల వ్యవస్థలేదని ప్రజల మనస్సులలో నాటేటట్లు చేసే సాధనంగా విద్య ఉపయోగించబడింది. తరువాత సాంఘికసేవకు, పౌరసత్వానికి ప్రాధ్యానం యివ్వడానికి విద్య ఉపయోగపడింది. సమాజశ్రేయస్సు కోసం విద్య అవసరమని నిరూపణ జరిగింది. సమాజ ఆర్థికజీవనమునకు, శ్రేయస్సునకు, సమాజంలో ఆర్థిక సంపద పెంపుదలకు, సుఖశాంతులను చేకూర్చుటకు త్యాగముతో కూడిన కృషిచేయడమే విద్య ఆశయం. సమాజం సాధించదలచిన విలువలకు ఆశయాలకు అనుగుణంగా, విద్యాలక్షణాలు రూపొందించబడుతున్నాయి. ఆయా కాలాలలో ఏర్పడిన అవసరాలు రాజ్యాంగపరమైన ఆవశ్యకతలు, ఆ నాటి ప్రజలు, ప్రభుత్వాలు బద్ధులై ఉన్న రాజకీయ, ఆర్థిక, సాంఘికవిధానాలను బట్టి విద్యాలక్షణాలు మారుతూ వస్తున్నాయి.

మన రాజ్యాంగం భారతదేశపౌరులకు కొన్ని ప్రాథమిక హక్కులను సమకూర్చింది. ప్రభుత్వవిధానానికి సంబంధించి కొన్ని ఆదేశసూత్రాలను వివరించింది. ముఖ్యంగా ప్రభుత్వం ప్రజల శ్రేయస్సును పెంపొందించేందుకు కృషిచేయాలనీ, జాతీయ జీవనంలోని అన్ని వర్గాల వారికి సాంఘిక ఆర్థిక రాజకీయ న్యాయం చేకూర్చే సామాజిక వ్యవస్థను ప్రభుత్వం ఏర్పరచి, దానిని కాపాడాలనీ, ఇతరమైన వాటితో పాటు ఈ క్రింది వాటిని చేకూర్చే విధంగా ప్రభుత్వం తన విధానాన్ని నిర్దేశించుకోవాలనీ రాజ్యాంగం తెలియజేస్తోంది.

ఎ. పౌరులైన స్త్రీపురుషులకు సమానంగా చాలినంత జీవనోపాధి పొందే హక్కు ఉండాలి.

బి. సార్వజనికశ్రేయస్సుకు అత్యుత్తమంగా తోడ్పడేటట్లు సామాజిక వస్తుసంపదపై స్వామ్యం, నియంత్రణ విభజితం కావాలి.

సి. సార్వజనికశ్రేయస్సుకు భంగకరంగా సంపద, ఉత్పాదనసాధనాలు కేంద్రీకృతం కాని విధంగా ఆర్థికవ్యవస్థ పనిచేయాలి.

పైన తెల్పిన పద్ధతిలో సాంఘికవ్యవస్థను రూపొందించడానికి నిర్వహణ పరంగాను, సంస్థాగతంగాను, దృక్పథంలోనూ మార్పులు రావలసి ఉంది. సంప్రదాయాలకు కట్టుబడిపోయి చలనరహితంగా ఉన్న నేటి సమాజం చైతన్య విలసితమైన నవసమాజంగా పరిఢవిల్లాలి. మన రాజ్యాంగంలో తలపోసిన సాంఘిక

వ్యవస్థానిర్మాణంలో జరగవలసి వున్న మార్పులన్నింటిని సాధించడానికి తగిన ఏకైక సాధనం విద్య. ప్రజలు ఉన్నత జీవనప్రమాణాలను చేకూర్చుకునేందుకు అనువుగా వివిధ ఆర్థిక కార్యకలాపాలలో సాంకేతిక పరిజ్ఞానాన్ని వర్తింపచేయటం ఆధునిక సమాజలక్షణాలలో ముఖ్యమైనదని మనకందరకు తెలిసినదే. నూతన సాంకేతిక ప్రక్రియలను స్వీకరించటం అనేది నిరంతరంగా సాగుతూనే ఉంటుంది. ఎందుచేతనంటే సాంకేతికరంగంలో జరిగే ప్రగతికి అంతమనేది ఉండదు. అందుచేత ప్రజలు విస్తృతశ్రేయస్సు దృష్ట్యా ఈ నూతనప్రక్రియలన్నింటిని స్వీకరించడానికి తగిన స్తోమతను సమాజం సంతరింప చేసుకోవాలి. అంతేకాదు, సమాజప్రగతికి దోహదం చేసే నిమిత్తం నూతన సాంకేతికప్రక్రియల అన్వేషణకై ఉత్తమకృషి అవసరం. సమాజం ఈ ప్రక్రియలను ఎలా కనుగొనగల్గుతుంది? ఈ ప్రక్రియలను ఎలా స్వీకరించగల్గుతుంది? విద్యావిధానం ద్వారానే ఇది సాధ్యమవుతుంది. నూతన సాంకేతికపరిజ్ఞానం నిమిత్తం నిరంతర అన్వేషణ జరపడానికి, ఇప్పుడు లభ్యమవుతున్న సాంకేతికపరిజ్ఞానాన్ని విస్తృతంగా వినియోగించడానికి తగుప్రోత్సాహం విద్యావిధానం ద్వారా లభించాలి. ఆ విధంగా సమాజపరివర్తనలో విద్య ప్రధానసాధన మవుతున్నది. సమాజానికి ఎంతో ఆవశ్యకమైన కార్యనైపుణ్యం విద్య ద్వారానే చేకూరుతుంది.

మానవ శక్తిస్తోమతల అభివృద్ధికై తగిన పెట్టుబడి పెట్టనిదే దేశ ఆర్థికపురోగతి సాధ్యం కాదు. విద్యకుఆర్థికాభివృద్ధికి మధ్యగల సంబంధస్వభావాన్ని, పరిమితిని నిర్ణయించేందుకు చాలా ఆసక్తికరమైన పరిశీలనలు జరిగాయి. ఎక్కడ ఉన్నతస్థాయిలో విద్య అభివృద్ధి చెందిందో, అక్కడే ఆర్థికవ్యవస్థ కూడ అభివృద్ధి చెందింది. విద్యారంగంలో ప్రభుత్వం తగినంత పెట్టుబడి పెట్టలేకపోయిందని మీరు శాసనమండలిలో మీ ప్రతినిధుల ద్వారా నిరంతరం విమర్శిస్తూంటారు. అలాంటి మీ ముందు ఈ విషయం చెపుతున్నానంటే – అభివృద్ధి చెందుతున్న అన్ని దేశాల ప్రభుత్వాలు ఎదుర్కొనే పరిణామాలను నేను గుర్తించలేక పోలేదు. అయినప్పటికీ, మానవశక్తి స్తోమతలు కొరవడడంగాని, ఈ అవసరాన్ని అవగాహన చేసుకోకపోవడానికి లేదని మీకు హామీఇస్తున్నాను. అదే సమయంలో, నేనొక ముఖ్యవిషయాన్ని నొక్కి చెప్పదలచు కొన్నాను. ఆధునిక ఆర్థికవ్యవస్థలో అవసరమైన కర్తవ్యనిర్వహణకు వ్యక్తులను అర్హులుగా చేయడం అన్నది విద్యలో ఒకభాగం మాత్రమే. అంతకంటే ముఖ్యమైన అంశం మరొకటి వున్నది. అది సమాజదృక్పథంలో పరిణామం లేదా నూతనత్వం రూపుదిద్దుకోవడానికి అనువైన వాతావరణం సృష్టించడం.

ఇక్కడొక ఉదాహరణ చెప్పదలుస్తున్నాను. మనం చేపట్టిన భూసంస్కరణలను తీసుకొందాం. వ్యక్తులకు అపరిమితంగా భూములుండడం సమాజశ్రేయస్సు దృష్ట్యా మంచిది కాదని, కనుక భూములను పంచడమన్నది సంఘపరంగా వాంఛనీయమైన చర్య అని పిల్లలు గ్రహించేటట్లు చేయాలంటే విద్య ఒక్కటే అందుకు సాధనం. కాబట్టి ఈ తరుణంలో ఈ పరిణామాన్ని అంగీకరించేందుకు వారి మనస్సులను ఆయత్తం చేయాలి. ఆస్తులు, సిరిసంపదలు కలిగి వుండడం పట్ల ఆడంబరాల పట్ల-గతంలో-కొంత మేరకు, ఈ నాడు కూడా - పిల్లల దృష్టిలో కొన్ని విలువలు స్థానం ఏర్పరచు కున్నాయి. మారుతున్న విలువలను ఆమోదించి, సామాజికంగా అవాంఛనీయమైన వాటిని త్యజించేందుకు పిల్లలను సంసిద్ధం చేయాలి. వాస్తవానికి వారు క్రొత్త విలువలను సక్రమంగా అవగాహన చేసుకొని వాటిని స్వీకరించగలిగేటట్లు చేయాలి.

సమాజ ఆధునీకరణ ద్వారా ప్రగతి సాధించడానికి ప్రజలు అన్ని రంగాలలోను పాల్గొనే సమాజం సృష్టించడం ఒక్కటే మార్గం. మరో విధంగా చెప్పాలంటే, సమాజంలో ప్రతి ఒక్కరూ విద్యనభ్యసించాలి. వార్తాపత్రికల విషయంలో అభిప్రాయాలను మార్చుకోవాలి. ఇలాంటి సమాజాన్ని సృష్టించడం విద్య ద్వారా సాధ్యమవుతుంది. ఇదే అత్యంత బలవత్తరసాధనం. తమ తమ కోరికలను అవసరాలను, తీర్చుకోవడమే కాకుండా, సమాజానికి కూడ ఇతోధికంగా తోడ్పడే నిమిత్తం సమాజ ఆర్థిక, సాంఘిక, రాజకీయజీవనములో పాల్గొనేటట్లు పిల్లలకు, వయోజనులకు పాఠశాలల ద్వారాను,కళాశాలల ద్వారను శిక్షణ ఇవ్వాలి. రాజకీయ, సాంఘికచైతన్యం వెల్లివిరిసిన ఈ రోజుల్లో కూడ ప్రజాసమస్యలకు సంబంధించిన వ్యవహారాల్లో పాల్గొనడం పట్ల మనదేశపౌరులలో ఒక విధమైన వైముఖ్యం కనిపిస్తున్నది. ఓటుహక్కును వినియోగించుకొనే ప్రజల శాతం తక్కువగా జరుగుతున్నది. ప్రభుత్వవిధానాలను తీర్చిదిద్దడంలో పాలుపంచుకోవాలన్న ఆసక్తి లేకపోవడానికి ఇవి నిదర్శనాలు, బాల్యం నుండి మనం అలవాటు చేసుకునే దృక్పథమే ఇందుకు కారణం. మన మనుగడకు, మన సంక్షేమానికి, మన కుటుంబసంక్షేమానికి అవసరమైన విషయాల్లో తప్ప మిగతా కార్యకలాపాల్లో పాల్గొనరాదనే దృక్పథంతో ఈ నాడు మనం వున్నాం. ప్రధాన జీవనవాహినికి దూరంగా వుండే మనస్తత్వమే ఈ నాడు దేశంలోని పెక్కు అనర్థాలకు మూలకారణం. ఈ దృక్పథం క్రమేపీ ఆర్థికరంగంలోకి, సాంఘిక రంగంలోకి, రాజకీయ రంగంలోకి చొచ్చుకొనిపోయింది. కొద్దిమంది వివేకులు సమాజంలోని అధికసంఖ్యాకులకు ప్రాతినిధ్యం వహింపజాలరు. పరిస్థితులు పెడమార్గం పట్టినప్పుడు

ప్రజలు ఇతరులను నిందించిడం తరచు జరుగుతున్నది. నిజానికి అందుకు వారే బాధ్యులని చెప్పాలి. ఏ విధంగానైనాసరే, దేశంలోని ప్రతి వయోజనుడు ప్రతి ప్రజాహిత కార్యక్రమంలోను పాల్గొనేటట్లు చేయగలిగితే, ఈ నాడు మనం ఎదుర్కొంటున్న పెక్కు అనర్థాలు తొలగిపోగలవు. నా ప్రజాజీవితంలో నాకేర్పడిన నిశ్చితాభిప్రాయమిది. ఇది సాధించాలంటే విద్యకంటే ఉత్తమమైన సాధనం ఏముంది? విద్య అంటే పాఠశాలలోను, పాఠశాల వెలుపల, జీవితపర్యంతం నేర్చుకునే విద్య.

ఏ దృష్టితో చూసినా, విద్య ఒక్కటే ఏ సమస్యకైనా తుది పరిష్కారంగా నాకు కనిపిస్తున్నది. మనం ఒక క్రొత్త సామాజికవ్యవస్థను సృష్టించుకోవాలంటే మనకు కొన్ని క్రొత్త విలువలు అవసరమవుతాయి. క్రొత్త విలువలు కావాలంటే వాటిని సాధించడానికి విద్య ఒక్కటే ప్రధానసాధనం. మీరూ నేను విద్యలో ఒక భాగానికి మాత్రమే బాధ్యత వహిస్తున్నాం. ఎందుచేతనంటే మన బాధ్యత ప్రాథమికస్థాయి నుండి విశ్వవిద్యాలయస్థాయి వరకు మాత్రమే పరిమితమై వుంటుంది. కాగా విద్య అన్నది యావజ్జీవితవ్యవహారం అయితే, మనం వహించవలసిన పాత్ర అతిక్లిష్టమైనది. ఎందువల్లనంటే విద్య ఒక నిరంతరప్రక్రియ, జీవితపు తొలిదశలోనే పునాదులను వేస్తూ, మన ఆధ్వర్యంలో గల విద్యార్థులు ఈ కొత్త విలువలను గ్రహించేటట్లు చేయడంలో మనం కృతకృత్యులమైననాడు దేశాభివృద్ధి, సామ్యవాద సమాజసిద్ధి సులభతరం కాగలవు.

నేనొక ప్రముఖవిద్యావేత్తననిగాని, ప్రామాణికవిద్యావేత్తననిగాని చెప్పుకోవడం లేదు. పెక్కు విద్యాసమస్యల అవగాహన విషయంలో మీలో కొందరి కంటె నాకెక్కువ తెలుసునని చెప్పుకొనే హక్కు కూడా లేదు. ఆయా రంగాలలో సుదీర్ఘానుభవం గల మీతో ఇలాంటి విషయంపై మాట్లాడడానికి నాకు ధైర్యం చాలడం లేదు. ఈ విషయంపై మీ ముందు నిటబడి మాట్లాడడానికి నాకున్న అర్హతల్లా నేను వహిస్తున్న పదవి. ఈ దేశ పౌరులలో ఒకణ్ణిగా ప్రజాజీవితంలో నేను సంపాదించిన అనుభవమునే మన పురోభివృద్ధికి విద్య ప్రముఖసాధనం అన్నది నా దృఢాభిప్రాయం. నవసమాజసృష్టికి విద్య ఒక్కటే ఏకైకసాధనం అన్న ప్రాథమిక సత్యంపై భిన్నాభిప్రాయాలకు తావులేదు. అదృష్టమో, దురదృష్టమో సముచితమైన విద్యావిధానం సమకూర్చి, దానిని సాంఘిక ప్రయోజనాలకు తోడ్పడే సాధనంగా మలచుకొనే బాధ్యత సమష్టిగా మనపైన వున్నది. ఈ సమష్టి కృషిలో మీ సలహా సహకారాలు లభించగలవని నేను ఆశిస్తున్నాను. విద్యాప్రమాణాలను పెంపొందించే ఏ ప్రక్రియలోనైనా, సరే నేను హృదయపూర్వకంగా పాల్గొనగలనని మీకు హామీయిస్తున్నాను.

ఈ మహాసభలు జరిగే రెండు రోజులు మీరు వివిధ అంశాలపై ప్రయోజనకరమైన చర్చలు జరుపగలరని, వివిధ విధానాలలో ప్రభుత్వానికి తోడ్పడేందుకు మీరు కొన్ని నిర్దిష్టమైన సూచనలు చేయగలరనీ నేను విశ్వసిస్తున్నాను. ఉపాధ్యాయసంఘం ఏర్పాటు చేసినప్పటికి, ఇది విద్యామహాసభ కనుక మీరు పరిశీలించవలసివున్న విషయానికి అధికప్రాధాన్యం ఇవ్వగలరని నా విశ్వాసము. అయితే ఈ సందర్భంగా ఉపాధ్యాయుల ప్రతిపత్తిని మెరుగుపరచడం వంటి సమస్యలు కూడ చర్చకు రావచ్చును. నా యీ ప్రసంగాన్ని ముగించే ముందు, ఉపాధ్యాయుల పట్ల నాకు సంపూర్ణమైన సానుభూతి కలదని, వారి ప్రతిపత్తిని, జీవనపరిస్థితులు మొదలైన వాటిని మెరుగుపరచడంలో వారిని సంతృప్తి పరచేందుకు ప్రభుత్వ విధానపరిధి లోపల వనరులు అనుమతించినంత మేరకు నా శాయశక్తుల కృషిచేయగలనని హామీ ఇస్తున్నాను. ఎందువల్లనంటే, విద్యను ఒక మహత్తర పరిణామసాధనంగా మలచడంలో ఉపాధ్యాయులు అత్యంత ముఖ్యప్రాత వహించవలసి ఉన్నదని నా అభిప్రాయం. ఈ మహాసభను ప్రారంభించడం నాకెంతో సంతోషంగా ఉన్నది. ఈ సభలు జయప్రదం కావాలి. నా ఆకాంక్ష నేనీనాడు దీనిలో పాల్గొని ఈ మహాసభకు జరిపే ప్రారంభోత్సవం అవకాశం కలిగించినందుకు మరొక్కసారి మీకు నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

*(15-2-1974 ఖమ్మం)*

# 7. విద్యామంత్రిగా నా భావాలు- అనుభవాలు

శ్రీ జలగం వెంగళరావు గారి నాయకత్వాన ఏర్పడిన మంత్రివర్గంలో 1974 జనవరి 12వ తేదీన మంత్రిగా ప్రమాణస్వీకారం చేసి అరగంటయినా గడవక ముందే నాకు విద్యాశాఖ అప్పగిస్తున్నామని చెప్పారు. మొదట ఈ శాఖను నిర్వహించడానికి తగిన స్తోమత నాకు లేదేమోనన్న సందేహం కలిగింది. కారణమేమంటే నేను గొప్ప మేధావిని కానని నాకు తెలుసు. పెద్ద పెద్ద చదువులు చదివినవాడిని కూడా కాదు. శ్రీ పి.వి.నరసింహారావుగారు తమ మంత్రివర్గంలో చేర్చుకున్నప్పుడు నాకు సాంఘిక సంక్షేమశాఖ ఇవ్వవలసిందిగా కోరాను. అది విని ఆయన అడిగారు. అయితే నా రాజకీయ జీవితం అంతటా సమాజంలోని బలహీన వర్గాలవారి సంక్షేమం కోసం కృషిచేస్తూ వచ్చానని, వీరి సముద్ధరణ పట్ల మిక్కిలి అభిలాష వున్నదని వివరించాను. ఈ పేదప్రజల ఆర్థిక, సాంఘిక జీవనాన్ని మెరుగు పరిచేందుకు సేవ చేయదలుస్తున్నానని కూడా చెప్పాను. సంతోషంతో సాంఘిక సంక్షేమశాఖను శ్రీ పి.వి.నరసింహారావు అప్పచెప్పారు. ఈ నిర్ణయం నా అభిమానులకు కొంత ఆశాభంగం కలిగించింది.

సాంఘిక సంక్షేమం, మత్స్యపరిశ్రమల శాఖల మంత్రిగావున్నప్పుడు బలహీన వర్గాల ప్రజల శ్రేయస్సు కోసం శాయశక్తులా కృషిచేశాను. వీరి అభ్యున్నతి నిమిత్తం సంస్థాగతంగాను, పరిపాలనాపరంగాను, కొన్ని మార్పులు ప్రవేశపెట్టేందుకు ప్రయత్నించాను. సాంఘిక సంక్షేమం పట్ల నాకు గల అనురక్తి దృష్ట్యా, అనుభవందృష్ట్యా, తిరిగి ఇదేశాఖ నాకు అప్పగిస్తారని అనుకున్నాను. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారితో ఈ సంగతి చెప్పడం కూడా జరిగింది. విద్యాశాఖ నిర్వహణ క్లిష్టమైనదని, పెదపెద్ద విద్యావేత్తలు, మేధావులు మున్నగు వారితో పని అని సందేహాన్ని వెలిబుచ్చాను. ముఖ్యమంత్రి చిరునవ్వునవ్వి ఈ శాఖను నేనే నిర్వహించాలని అన్నారు. వారి ఆదేశాన్ని పాటించక తప్పదు. ఆదర్శ ఉపాధ్యాయులైన మాతండ్రిగారి చిత్రపటానికి నమస్కరించి, వారి ఆశీస్సులు పొంది, ఈ గురుతర బాధ్యతను స్వీకరించాను, దివి తాలూకా భావదేవరపల్లి గ్రామంలో ఉపాధ్యాయులుగా పనిచేసిన మా తండ్రిగారి ఆదర్శాలు నాకు తగిన స్ఫూర్తి నివ్వగలవని విశ్వసించాను. గ్రామీణ ప్రజల

శ్రేయోభివృద్ధుల పట్ల ఆయనకు గల ఆకాంక్ష నా ఆలోచనా వైఖరిని ప్రభావితం చేశాయి.

నేను విద్యాశాఖను స్వీకరించినప్పటి పరిస్థితి ఏమంటే ఉపాధ్యాయ వర్గాలలో తీర్చవలసిన కోర్కెలు అనేకం వున్నాయి. కొన్నిటిని తేర్చే ప్రయత్నం చేస్తుంటే, కొత్తగా మరి కొన్ని వస్తున్నాయి. విద్యార్థులు చదువుపట్ల తెలిక భావం చూపుతున్నారు. మూకుమ్మడిగా పరీక్షలలోచూసి వ్రాసే అలవాటు ప్రబలింది. రాష్ట్రంలోని ఉభయప్రాంతాలలోను పెద్ద ఎత్తున జరిగిన ఆందోళనల వల్ల విద్యా సంస్థలలో క్రమశిక్షణారాహిత్యం తాండవించసాగింది. పాలనాధికారులు నిస్సహాయులై వుండిపోయారు. రాజకీయవేత్తగా విద్యా రంగంలో వున్న ఈ పరిస్థితి ఆకళింపు చేసుకున్నాను. మొదట్లో విద్యామంత్రిగా సమర్థవంతంగా నా బాధ్యతలు నిర్వహించగలనా అనే సంశయం కొంత ఏర్పడకపోలేదు.

కష్టతరమైన ఈ శాఖను రెండు సంవత్సరాల నుంచి నిర్వహిస్తున్నాను. ఈ బాధ్యతా నిర్వహణలో సదా ముఖ్యమంత్రిగారి మార్గదర్శకత్వం,సహాయ సహకారాలు లభిస్తున్నాయి. ఈశాఖలోని ఉద్యోగులు, అధికారులు తోడ్పాటునందిస్తున్నారు.

దేశ అభ్యుదయం పట్ల మనందరకు ఎంతో ఆసక్తి వున్న సంగతి వేరుగా చెప్పనవసరం లేదు. ఉజ్జ్వలమైన జాతిని నిర్మించుకోవాలంటే భావి భారత పౌరులుగా ఈనాటి విద్యార్థులు, తమ పాత్రను ఉత్తమంగా నిర్వహించాలని కూడా అందరం అంగీకరిస్తున్నాం. ఆదర్శ పౌరులుగా విద్యార్థులు వర్ధిల్లడానికి ఉత్తమ విద్యావిధానం ఒక్కటే మార్గం. క్రమశిక్షణను పెంపొందించి,చదువు పట్ల వారిలో శ్రద్ధాసక్తులు కలిగించేందుకుగాను మొట్టమొదట మూకుమ్మడిగా పరీక్షలలో చూసివ్రాసే దురభ్యాసం అంతమొందించటానికి తగుచర్యలు తీసుకున్నాను. నా ప్రయత్నం జయప్రదమయింది. గత రెండు సంవత్సరాలలో సాధించిన వాటిలో ఇది ఒక ఘనవిజయమని మనవి చేస్తున్నాను.

కష్టపడి చదవకపోతే పరీక్షలలో ఉత్తీర్ణులం కాలేమని విద్యార్థులు గుర్తించారు. చదువల పట్ల తిరిగి శ్రద్ధవహిస్తున్నారు. దీంతో విద్యార్థులపై నాకు గల విశ్వాసం ఇనుమడించింది. ఈ విద్యార్థులను సక్రమంగా తీర్చిదిద్దినట్లయితే వీరు అత్యుత్తమ పౌరులుగా వికాసం చెందగలరన్న నమ్మకం నాలో బలపడింది. ఉపాధ్యాయులలో కూడా ఆత్మవిశ్వాసం ఏర్పడింది. దౌర్జన్య ప్రవృత్తి గల విద్యార్థులు పరీక్షా కేంద్రాలలో బెదిరిస్తారన్న భయం వారిలో ఇప్పుడు లేదు. పరీక్షలలో ఉత్తీర్ణత పొందాలంటే తమ

తెలివితేటలే ఆధారమని విద్యార్థులు తెలుసుకున్నారు. అందుచేత ఉపాధ్యాయులు సమర్థవంతంగా తమ విధులు నిర్వహించాలని వారు కోరుతున్నారు. పాఠాలు బాగా చెప్పాలని గట్టిగా అడుగుతున్నారు. అంటే ఉపాధ్యాయులు మునపటి కంటే ఎక్కువ శ్రద్ధాశక్తులతో తమ బాధ్యతలు నిర్వహించేందుకు పరోక్షంగా తోడ్పడుతున్నారు. ఇది ముదావహమైన విషయం.

విద్యామంత్రిగా వున్న ఈ రెండు సంవత్సరాల స్వల్పకాలంలో తదితర ఉద్యోగుల కంటె ఉపాధ్యాయులకు సంబంధించిన సమస్యలే ఎక్కువగా వున్నాయని నేను గ్రహించాను, విద్యారంగ నిర్వహణలో పాఠశాలల ద్వారా ప్రభుత్వం,పంచాయతీరాజ్ సంస్థలు, పురపాలక సంఘాలు, ప్రయివేటు యాజమాన్యాలు భాగస్వాములై ఉన్నాయి. ఈ ప్రైవేటు యాజమాన్యాలు కొన్నింటికి ప్రభుత్వం ద్వారా ఆర్థిక సహాయం లభిస్తుంది. మరికొన్ని పూర్తిగా స్వతంత్రమైనట్టివి. ఉపాధ్యాయులందరికి సమాన ప్రతిపత్తి వుండాలనే అభ్యర్థన మొదటి నుంచి వున్నది. విద్యారంగం పలువురి నిర్వహణలో వుండడం వల్ల ఇది కష్టసాధ్యమవుతున్నది. అయినప్పటికీ ఉపాధ్యాయులకు సంబంధించిన ఎక్కువ సమస్యలు పరిష్కారమయ్యాయి. 1974 నాటి కరువుభత్యం చేర్చిన వేతనపు స్కేళ్లు ఉపాధ్యాయులందరికి మంజూరు చేయడం జరిగింది. అదే విధంగా తాత్కాలిక కరువు భత్యం కూడ అన్ని రకాల యాజమాన్యాల కింద గల ఉపాధ్యాయులకు వర్తింపచేశారు. 1975 ఏప్రిల్ 1వ తేదీ నుంచి వివిధ తరగతులకు చెందిన ప్రభుత్వేతర సంస్థలలోని పింఛను పొందే ఉపాధ్యాయులకు పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు సరళం చేసిన పింఛన్ నియమావళిని 1974 ఏప్రిల్ 1వ తేదీ నుంచి వర్తింపచేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఇంతకు పూర్వం తెలియజేసినట్లు ఉపాధ్యాయులకు సంబంధించిన ఉద్యోగ నిబంధనలు ఎక్కువ విధాలుగా వుండడం వల్ల వారి సమస్యలు కొన్ని యింకా పరిష్కారం కావలసి వున్నాయి. వీటి పరిష్కారం పూర్తి సానుభూతి, ఆసక్తి వున్నప్పటికీ ముఖ్యంగా ఆర్థికపరమైన యిబ్బందుల కారణంగా వీటి పరిష్కారం ఆలస్యమవుతున్నది. ఇప్పటికే రాష్ట్రబడ్జెట్టులో అయిదవ వంతు విద్యారంగం పై వినియోగమవుతున్నది. ఇప్పుడు తీసుకున్న వివిధ చర్యల వల్ల సాలీన దాదాపు ఒకటిన్నర కోటి రూపాయలు వ్యయమవుతుంది. ఉపాధ్యాయవృత్తిలో కేవలం ఆర్థిక ప్రయోజనాలు,ఉద్యోగవున్నతి అవకాశాలు, అధిక వేతనం ప్రధాన అంశాలుగా పరిగణించడానికి వీలులేదని ఉపాధ్యాయులుగా వున్న సోదరసోదరీమణులకు విన్నవిస్తున్నాను. ఉపాధ్యాయవృత్తి పవిత్రమైనది. వృత్తి

స్వీకరించినవారు ఆర్థికంగా కొంత అననుకూల స్థితిలో వున్నా, ప్రభుత్వంతో సహకరించాలని కోరుతున్నాను. అయితే ఈనాటి స్థితిగతులను పరిశీలించినట్లయితే వారు ఆందోళన చెందవలసిన అగత్యం లేదు. యువతరాన్ని తీర్చిదిద్ది,ఉత్తమ పౌరులుగా వర్ధిల్లచేయడంలో అధ్యాపకలోకం నిర్వహించే పాత్రను గుర్తించి, విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం వీరికి ప్రత్యేక సదుపాయాలు మంజూరు చేసింది.

ముఖ్యంగా ప్రయివేటు విద్యాసంస్థలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులు తమకు భద్రత లేదని,ఆయా యాజమాన్యవర్గాలవారి దయాదాక్షిణ్యాలపై తమ ఉద్యోగాలు ఆధారపడివున్నాయని అనేవారు. ఈ చిక్కును తొలిగించడం కోసం 1975లో ప్రయివేటు విద్యాసంస్థల క్రమనిర్వహణకై ఒక చట్టం చేయబడింది. ఇది 1974 అక్టోబరు 9వ తేదీ నుంచి అమలు పొందింది. ప్రయివేటు విద్యాసంస్థలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు వర్తించే ఉద్యోగనియమ నిబంధనలు ఇది వివరిస్తున్నది. రాష్ట్రంలోని గుర్తింపు పొందిన విద్యా సంస్థలపై నియంత్రణ వహించేందుకు కూడ ఈ చట్టం నిబంధిస్తున్నది.

పనిచేస్తున్న ఉపాధ్యాయులు,పదవీ విరమణ చేసిన ఉపాధ్యాయులు, మరణించిన ఉపాధ్యాయులపై ఆధారపడివున్నవారు నిరుపేద స్థితిలో వున్నట్లయితే వారికి జాతీయ ఉపాధ్యాయ సంక్షేమనిధి (ఆంధ్రప్రదేశ్) నుంచి ఆర్థిక సహాయం సమకూరుతుంది. 1973-75 సంవత్సరాలలో 15,000 మందికి రూ 5.4 లక్షల మొత్తం అందజేయడం జరిగింది.

యువతరం భవిష్యత్తును తీర్చిదిద్దడంలో విద్యా సంస్థలు ప్రముఖపాత్ర వహిస్తాయి. అంతేకాదు. సామాజిక పరివర్తన తీసుకురావడంలో వీరికి ముఖ్యస్థానం వున్నది. అందుచేత భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ప్రతిపాదించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని దృష్టిలో వుంచుకుని అన్ని విద్యాసంస్థలలోను, అన్ని పరిపాలనా స్థాయిలలోను అమలు పరచడం కోసం 12 సూత్రాలు కనీస కార్యక్రమం రూపందించబడింది. ఇందులోని ప్రధానాంశాలు-విద్యార్థులు,ఉపాధ్యాయులు ఉద్యోగులు ప్రతిరోజు వేళకు హాజరుకావడం, సమయనియమాన్ని పాటించడం, చిత్తశుద్ధితో, క్రమశిక్షణ,కార్యనిరతితో కష్టించిపనిచేయడం,ఉపాధ్యాయుల విద్యా బోధనకు సంబంధించిన సంవత్సరానికి, నెలనెలకూ, వారం వారానికి వర్తించే ప్రణాళికను రూపొందించడం, విద్యార్థులు చదువవలసిన,చేయవలసిన వాటిని ఉపాధ్యాయాలు ఎప్పటికప్పుడు వారికి తెలియజేయడం, విద్యకు అనుబంధంగా వుండే కార్యకలాపాలను

విస్తృతపరచి కట్టుదిట్టంగా అమలు పరచడం, పబ్లిక్ పరీక్షలు జరగడానికి ముందుగా పాఠాలను పూర్తిచేయడం,నియమకారికంగా పరీక్షలు జరపడం,అక్రమ పద్ధతులకు పాల్పడకుండా చూడటం ఉపాధ్యాయులతోనూ విద్యార్థుల తల్లిదండ్రులతోను కూడిన సంఘాలను తరచు సమావేశపరచడం,విద్యార్థులు తమ విరామ సమయాన్ని గ్రంథాలయంలోనో, ఉత్పత్తి దోహదకరమైన కార్యక్రమంలోనో గడిపేటట్లు చూడడం, తనిఖీ అధికారులు విద్యా సంస్థలపై కట్టుదిట్టమైన పర్యవేక్షణ జరపటం, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ప్రజలకు సంబంధించిన అంశాలపట్ల సానుభూతితో, అవగాహనతో వ్యవహరించడం ఒక్కొక్కరు ఒక్కొక్కరిని తేవాలి అనే నినాదం ప్రజల ఆదరాభిమానాలు చూరగొనేటట్లు చేసి ప్రాథమిక పాఠశాలలకు హాజరయ్యే విద్యార్థుల సంఖ్యను పెంచడం అన్న ఈ 12 సూత్రాల విద్యాకార్యక్రమం రాష్ట్రమంతటా అమలు జరుగుతున్నది. దీని ఫలితంగా విద్యాసంస్థల నిర్వహణ మెరుగుపడుతుంది. విద్యా స్థాయికూడ ఇనుమడించగలదు.

ఈనాడు విద్యసంస్థలు చాలా ఏర్పడుతున్నాయి. ముఖ్యంగా తగిన సన్నాహాలు లేకుండా పెక్కు ఉన్నత విద్యా సంస్థలను నెలకొల్పడం జరుగుతున్నది. అయితే ప్రాథమిక స్థాయిలోనే మనం ఎక్కువ ఫలితాలు సాధించలేకపోయాం. సార్వత్రికంగా నిర్బంధ ఉచిత విద్యావిధానం అమలులో వున్నప్పటికి మనం పూర్తి విజయం పొందలేక పోయామని తెలియజేయడానికి చింతిస్తున్నాను. 1974-75లో 1 నుంచి 5వ తరగతి వరకు చేరిన విద్యార్థులలో వచ్చిన పెరుగుదల 50,0000. ఉన్నత ప్రాథమిక తరగతులలో ఈ పెరుగుదల 6,000 మాత్రమే. కాగా డిగ్రీ కళాశాలల్లో చేరిన విద్యార్థుల సంఖ్యలో ఎంతో పెరుగుదల ఉంది. 1974లో కంటే 1975 లో 35,000 మంది విద్యార్థులు ఎక్కువగా చేరారు. ఉన్నత విద్య ఎంతో అవసరమనడంలో సందేహం లేదు. అయితే ప్రాథమిక విద్యారంగంలో చాలా కృషి జరుగవలసి వున్నదిని మనవిచేస్తున్నాను. ప్రాథమిక పాఠశాలల్లో చేరిన విద్యార్థుల సంఖ్య అనుకున్న స్థాయికి రానందు వల్ల పాఠశాలల్లో చేరనవసరం లేకుండా వుండే విద్యా పద్ధతి ప్రవేశపెట్టాం. 6-14 సంవత్సరాల వయస్సు గల బాలురకు ఈ సంవత్సరం కృష్ణా,ఖమ్మం జిల్లాలలో ఈ పథకం ప్రవేశపెట్టడం జరిగింది. ఒక్కొక్కజిల్లాలోనూ 15-25 సంవత్సరాల వయస్సు వారికి 130, 6-14 సంవత్సరాల వయస్సువారికి 20 మొత్తం 150 కేంద్రాలలో ఈ పథకం ప్రారంభించబడింది. వీటి వల్ల ఒక్కొక్క జిల్లాలోనూ 3,000 మందికి ప్రయోజనం చేకూరుతుంది.

ఉపగ్రహ సహాయంతో టెలివిజను ద్వారా విద్యాప్రమాణాలను పెంపొందించేందుకు మనం తగిన ప్రయత్నాలు జరిపాం. హైదరాబాదు, మెదక్, మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లాలలోని 400 గ్రామాలకు ఈ టెలివిజన్ ప్రసారాల సౌకర్యం లభించింది.

రాష్ట్రంలో గల 3 నివాస పాఠశాలల్లో వుండే గ్రామీణ విద్యార్థులు వ్యవహరిస్తున్న తీరుతెన్నులు ప్రశంసనీయంగా వున్నాయి. అందుచేత ప్రత్యేకంగా ఆదివాసుల పిల్లల నిమిత్తం ఖమ్మం జిల్లా కిన్నెరసాని డ్యామ్ వద్ద ఒక నివాస పాఠశాల ప్రారంభించాం. గ్రామీణ ప్రాంతాల పిల్లలకు మున్ముందు కూడ తగిన సౌకర్యాలు కలుగజేయడానికి ఈ సంవత్సరం నాగార్జునసాగర్ వద్ద బాలుర కోసం నివాస పద్ధతిలో వుండే జూనియర్ కళాశాల ప్రారంభించడం జరిగింది.

వృత్తివిద్య నేర్చుకోగల సామర్థ్యం గల విద్యార్థులు తగిన నైపుణ్యం సంపాదించి, ఏదో ఒక ఉద్యోగం కోసం తాపత్రయపడనవసరం లేకుండా స్వతంత్రంగా జీవనోపాధి సమకూర్చుకోగలుగుతారు.

గత రెండు సంవత్సరాల కోసం విద్యారంగంలో గణనీయమైన ప్రగతి సాధించగలిగాం. అయితే ఈ రంగంలో ఇంకా జరగవలసిన కృషి ఎంతో వున్న మాట నిజం. మన దేశంలోను, ఇతర దేశాలలోను సాంకేతిక విజ్ఞానపరంగా శీఘ్రగతిని మార్పులు వస్తున్నాయి. అందుచేత విద్యార్థులు ఈ మార్పులకు అనుగుణంగా తగిన నైపుణ్యాన్ని సముపార్జించుకోవడం ఎంతైనా అవసరం. మారుతున్న పరిస్థితులకు అనువైన రీతిలో బోధన సమకూరడం కోసం,విద్యా విధానాన్ని ఎప్పటికప్పుడు సమీక్షించుకోవలసివున్నది. ఇది జరగనట్లయితే విద్యారంగం తన ప్రాథమిక కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహింపజాలదు. దీని వల్ల భావి పౌరులైన నేటి విద్యార్థులకు చాల నష్టం వాటిల్లుతుంది. కాబట్టి నేటి విద్యార్థులకు తగిన విజ్ఞానాన్ని అందిస్తూ, వారు మున్ముందు కూడ విజ్ఞానాన్ని పొందుతూ వుండగల నూతన విద్యా విధానం గురించి పరిశీలించవలసిందిగా విద్యావేత్తలను కోరుతున్నాను. ఇట్టి విద్యా విధానంలో విజ్ఞాన సముపార్జన విద్యాశాల విడిచిపెట్టిన తర్వాత కూడ కొనసాగుతుంది. అప్పుడు సాంకేతిక రంగంలో మున్ముందు వచ్చే పరిణామాలను వారు తెలుసుకోగలుగుతారు. సామాజిక శాస్త్రజ్ఞులు, విద్యావేత్తలు ఈ అంశం గురించి కూడ పరిశీలించగలరని విశ్వసిస్తున్నాను.

*(1-2-1976, స్నేహలత)*

# 8. దండలు - విందులు ఊరేగింపులు- బాణసంచాలు

వీరపూజ, విగ్రహారాధన వంటి అలవాట్లు మనదేశంలో అనాదిగా వున్నాయి. రాజకీయాలలో కొంతమంది వ్యక్తులు సమాజంలో కొంత మంది స్వాములు, ఆర్థికంగా కొద్ది మంది కోటీశ్వరులు, ఈ దేశంలో అనాదిగా వస్తున్న ఆచారాలు కల్గిన అమాయికులను "ఎఫెక్టు" చేస్తున్నారు. నిరక్షరాస్యత ఎక్కువగా ఉన్న ఈ దేశంలో ఎక్స్ప్లాయిటేషనుకు అవకాశాలున్నాయి. పంచాయతీ మెంబరు దగ్గర నుండి ప్రధాన మంత్రి వరకు ఏ పదవికి ఎవ్వరు ఎన్నిక అయినా ముందుగా ప్రత్యక్షమయ్యేవి దండలు.

పెద్దలను గౌరవించాల్సిందే! దీని పేరుతో మితిమీరిన వ్యక్తిగత ఆరాధన దేశానికి చెరుపు తెస్తుంది. ఈ ఆరాధనకు దండలు-పూజలు-స్తోత్రాలు- విందులు-ఊరేగింపులు-బాణసంచాలు-ఆరాధన ప్రాధాన్యాన్ని, శ్రేయస్సును తగ్గించి వ్యక్తిగత ప్రాబల్యానికి, క్షామానికి తావిస్తుంది.

మనది ప్రజాస్వామ్యదేశం. ప్రజల కొరకు ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రజా ప్రభుత్వాలు. ప్రజలు చెల్లించే పన్నులు, అప్పుల ద్వారా ధనం సక్రమంగా ఖర్చుపెట్టించి, ప్రజల అవసరాలను తీర్చి, ప్రజాక్షేమం కొరకు ప్రభుత్వం నిర్వహించే బాధ్యతలను ప్రజా ప్రతినిధులు వహించవలసివుంది. ప్రజల చేత ఎన్నుకోబడగానే బాధితులను మరచి అహంభావాన్ని పెంచే ఆడంబరకార్యక్రమాలకు తావివ్వడం ప్రజాప్రతినిధులకు ఎంత వరకు న్యాయం? తమ ఓట్లతో ఎన్నిక అయిన ప్రతినిధిని ఊరేగించడం, దండలు వేయడం, పంచాయతీ మెంబరు అయితే తర్వాత పంచాయతీ ప్రెసిడెంటు కావాలని, పంచాయతీ ప్రసిడెంటు అయితే సమితి ప్రసిడెంటు కావాలని, సమితి ప్రెసిడెంటు అయితే జిల్లా పరిషత్ చైర్మన్ కావాలని, జిల్లా పరిషత్ చైర్మన్ అయితే మంత్రి కావాలని, మంత్రి అయితే ముఖ్యమంత్రి కావాలని, ముఖ్యమంత్రి అయితే ప్రధానమంత్రి కావాలని ప్రశంసాపత్రాలు చదవడం అలవాటు అయిపోయింది. వీటి వలన బాధ్యతలు విస్మరింపచేయడం, అహంభావం పెరగడం, దేశానికి, సమాజానికి నష్టం కలుగుతుందనే భావనలు అమాయికప్రజలకు తెలియడం లేదు.

## ఊరేగింపులు

1957 పార్లమెంటు ఎన్నికలలో నా వయస్సు 29 సంవత్సరాలు. జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా వున్నాను. ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణగారు మచిలీపట్నం పార్లమెంటు నియోజక వర్గానికి నన్ను కాంగ్రెసు అభ్యర్థిగా నియమించారు. పేపర్లో చూచేదాక నాకు తెలియదు. నేను వారిని అడుగలేదు. నన్ను వారు అడుగలేదు. ఆశ్చర్యం కలిగింది. ఆర్థికస్తోమత లేని సామాన్య కార్యకర్తను పార్లమెంటుకు పోటీ చేయాలంటే ఎలా? తేలికయిన విషయం కాదు. హేమాహేమీలతో పోటీకి నిలబడ్డాను. ప్రజల మన్ననలతో, పెద్దల ఆశీర్వచనాలతో గెలిచాను. గ్రామగ్రామాన ఊరేగింపులు, శ్రీకాకుళం దగ్గర చింతల్లంక అనే గ్రామం ఉంది. వాళ్లంతా కమ్యూనిస్టులు, కాపులు, కులతత్త్వం ఆ ఎన్నికలలో బాగా పనిచేసింది. నా మీద పోటీచేసిన శ్రీ యలమంచిలి నాగభూషణం గారు దిట్ట. ఆయన న్యాయవాది. కమ్మవారు. కమ్మవారిలో ఎక్కువ మంది శ్రీ నాగభూషణం గారికి ఓటు చేశారు. కాపులలో ఎక్కువమంది నాకు ఓటు వేశారు. నన్ను ఎరగక పోయినా కాపు కులస్థుడని వారంతా నాకే ఓటువేశారు. ఆ గ్రామంలో దేవతకు మొక్కుకున్నారు. ఎన్నికలు కాగానే నాల్గు పర్యాయాలు ఆ గ్రామం పెద్దలు నా దగ్గరకు వచ్చారు. ఆ గ్రామం రావాలన్నారు. వారి ఒత్తిడికి తట్టుకోలేక సరేనన్నాను. ఆట గుర్రాన్ని, మేళాలను తెచ్చారు. గుర్రాన్ని ఎక్కమన్నారు. ఎక్కాను. ఊరంతా చిందులు త్రొక్కుతూ ఊరేగించారు. గ్రామదేవత గుడి దగ్గరకు తీసుకొని వెళ్ళారు. వేపమండలు కట్టి రెండు మేకలను కట్టి వేశారు బలి ఇవ్వడానికి. గుర్రాన్ని దిగాను. గుడిచుట్టూ మేకలతో తిరగాలన్నారు. ఎవరిని బలి యిస్తారు, నన్నా? మేకలనా? అని అడిగాను. మీరు గెలిస్తే మేకలను బలి యిస్తామని దేవతకు మ్రొక్కామని అన్నారు. అలా చేయకూడదని వారికి నచ్చచెప్పి కొబ్బరి కాయలు కొట్టించి వాటిని విడిపించాను. ఎంత అమాయికత్వం? ఆలోచించండి.

బందరులో నన్ను మిత్రులంతా బ్రహ్మాండంగా ఊరేగించారు. లారీలు, కారులు, ట్రాక్టర్లు, భజన దళాలు, ఇంకా ఎన్నో పెద్ద ఊరేగింపులు– కోలాహలం– కృష్ణారావు జిందాబాద్, కాంగ్రెసుకు జై అనడం సహజం. నామీద పోటీ చేసిన యలమంచిలి డౌన్ డౌన్ అనే కేకలు మారుమ్రోగాయి. ప్రజాస్వామ్యంలో జయాపజయాలు సమానంగానే చూచుకోవాలి. గెలిచినవాడు గొప్ప, ఓడినవారు చిన్నా అనే భావం ఉండకూడదు. గెల్చిన వారికి బాధ్యతలు పెరిగాయి. ఓడిన వారికి ఆ బాధ్యతలు లేవు. అంతే తేడా. అందుచేత ఓడిన వారికంటే గెలిచిన వారు ఎక్కువ అనుకోకుండా బాధ్యతాయుతంగా వ్యవహరించాలి.

శ్రీ నాగభూషణం గారు మేధావి. నేను సామాన్యకార్యకర్తను. గెల్చినంత మాత్రాన నాలో గొప్ప పెరగలేదు. ఓడిపోయినంత మాత్రాన వారిలో గొప్పతనం తరగలేదు. ఊరేగింపుల వల్ల ఈర్ష్య, ఏవగింపులు పెరుగుతాయని గ్రహించాను. ఊరేగింపుల కంటే సమస్యలపై ప్రజాప్రదర్శనలను నిర్వహించడం సముచితంగా ఉంటుందని భావించాను. ఊరేగింపులంటే ప్రజలు నాయకుల మాట వినరు. ప్రదర్శనలలో ప్రజలు ముందుంటారు. నాయకులు వెనుకవుంటారు. ప్రజలను ముందుండి నడిపించడం నాయకత్వలక్షణం.

**దండలు**

విజయవాడ రైల్వే స్టేషన్‌కి వచ్చిన మంత్రికల్లా జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా దండలు వేయడం అలవాటయింది. దండ వేయడం, తీయడం, వాటిని మరల మరొకరికి వేయడం జరుగుతుంది. సిరీస్ రాజుగారు విజయవాడ పట్టణ కాంగ్రెస్ అధ్యక్షులు. మొదటి దండ వారిది. కొంత కాలానికి శ్రీ రాజుగారు మంత్రులు వచ్చేటప్పుడే కాకుండా వెళ్లేటప్పుడు కూడా వేయడం ప్రారంభించారు. మంత్రులు వచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడు రెండు దండలు నాల్గు రూపాయలు. జిల్లా కాంగ్రెసు ప్రెసిడెంటు, నేను రెండేసి దండలు - ఎనిమిది రూపాయలు. వారానికి కనీసం నల్గురు మంత్రులన్నా వచ్చేవారు. నెలకు 128 నుండి 150 రూపాయలు దండలకు ఖర్చు అయ్యేది. మంత్రి తిమ్మారెడ్డి గారు పూలదండలు తగ్గించి నూలు దండలు వేయమన్నారు. నూలు దండలు వేయడం ప్రారంభించారు. గొప్ప సంఘసంస్కర్త శ్రీ గోరా ఈ పూల దండలు, ఆడంబరాన్ని చూచి పూల బదులు కాయగూర మొక్కలు పెంచాలని, పూలదండల బదులు కాయగూరల దండలు వేయాలని ఉద్యమం లేపారు.

నేను 1972లో శ్రీ పి.వి. మంత్రివర్గంలో మంత్రి అయ్యాను. కాంగ్రెసు కార్యదర్శిగా ఉండటంచేత గాంధీ భవనంలోనే కొద్ది రోజులు వున్నాను. మంత్రి కాగానే చాలా మంది దండలు పట్టుకొచ్చారు, వేశారు. ఒక మిత్రుడు పెద్ద గులాబీ దండ తీసుకువచ్చారు. దండ ఖరీదు ఎంత అన్నాను. 30 రూపాయలు అన్నారు. 30 రూపాయల దండ 30 సెకండ్లు కూడా ఉండదుకదా? ఎందుకు అంత ఖర్చు పెట్టావన్నాను. దండలు బదులు దీనజనులకు సహాయము చేయండి అనికోరాను.

హైదరాబాద్‌లో అడవిమెట్టలో 350 మంది పేదలకు యిండ్ల స్థలాలు, గుడిసె వేసుకోవడానికి వంద రూపాయలు యివ్వటానికి ఒక సంస్థ ఏర్పాటు చేశారు. సాంఘిక సంక్షేమ శాఖామంత్రిగా నేను యివ్వవలసి ఉంది. ముందుగా అక్కడకు వెళ్ళాను.

హైదరాబాదుకు చెందిన మంత్రులు రావాలి. వచ్చిన వారితో ముచ్చటిస్తూ తిరుగుతున్నాను. ఆ రోజు 330 దండలు పట్టుకొచ్చారు. ఎంత దండ అని అడిగాను. 3 రూపాయలు అని చెప్పారు. రోజూ కూలి ఎంత అన్నాను. మూడు రూపాయలు అన్నారు. ఒక్కరోజు కష్టపడి సంపాదించిన డబ్బుతో తెచ్చిన దండ ఒక్క నిముషంకూడా మెడలో ఉండదుకదా? ఎంత డబ్బు దండుగ చేస్తున్నారు అని అన్నాను. మొత్తము దండలన్నీ బల్లమీద పెట్టి పేదలందరికి పంచిపెట్టాము. ఎప్పుడూ దండలు తీసుకొని రావద్దని చెప్పాను. మధ్యవర్తులు ఈ దండలు తెప్పించారని, వంద రూపాయలలో దాదాపు 20 రూపాయలు యిలాగే ఖర్చులకు తీసుకొన్నారని వారు చెప్పారు. అప్పటి నుండి పూల దండలు వేసుకోవడం మానివేశాను. సంక్షేమ మంత్రిగా విజయవాడ నాస్తికకేంద్రంలో శ్రీ గోరా గారిని కలుసుకోవడానికి వెళ్లాను. అక్కడ జరుగుతున్న ఒక కార్యక్రమంలో కాయగూరల దండలు వేస్తున్నారు. పూల దండలు మానివేయడం బాగుగావుంది. వాటిని మాని కాయగూరల దండలు వేయటం ఏమి సబబు? అన్నాను. కాయగూరలు మరల వాడుకొనవచ్చునన్నారు. ఇనుప దబ్బనంతో గ్రుచ్చడం, దండగా వాడడం వలన మలినం కావచ్చు. వాటిని మరల కూరలకు వాడడం మంచిది కాదేమోనన్నాను.

పూలదండ, కాయగూరల దండ, నూలు దండ ఏ దండ అయినా ఆరాధనకు సూచన. అహంభావానికి మూలం. అసూయ, ఈర్ష్యలకు అవకాశం కల్గిస్తుంది. బాధ్యతలను విస్మరింపచేస్తుంది. అనవసరపు ఖర్చు. అందుచేత వట్టి దండగ!

కడప మహిళా కళాశాల భవన శంకుస్థాపనకు ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు గారు వచ్చారు. ప్రొద్దుటూరులో వారికి పెద్ద పెద్ద దండలు వేశారు. మండు వేసవికాలం. అక్కడ నుంచి కడప వచ్చారు. దండలు వరుసగా వేస్తున్నారు. నన్ను చూచి కృష్ణారావు నీపని హాయిగా ఉంది. మెడంతా నొప్పిపుట్టుతోంది. ఒళ్లంతా చెమటపట్టుతోంది. అని బాధపడుతూ అన్నారు. ఇక దండలు ఆపడం మంచిది అన్నారు. వారు హైదరాబాద్ వచ్చి క్యాబినేటు మీటింగులో దండలు ఎవరూ వేయించుకోరాదని, పర్యటనలలో మంత్రులకు దండలు వేయవద్దని ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ నిర్ణయం తీసుకున్నారు.

**బాణసంచాలు**

ఊరేగింపుల్లో బాణసంచాలు బాగా కాలవడం అలవాటు. చెవులు దద్దరిల్లడం, ఇళ్లు, గడ్డివాములు కాలిపోవడం, మనుష్యులకు దెబ్బలు తగలడం, చిన్నపిల్లలు భయపడడం, పశువులు బెదిరి ప్రజల మధ్యలోపడి కంగారు పడడం, ఎందుకొచ్చిన ఖర్చు, శ్రమ, బీభత్సం!

గుడివాడ మునిసిపాలిటీ రజతోత్సవాలు, ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి గారికి ఘనస్వాగతం. బస్సు స్టాండు వద్ద అవుట్లు పేల్చడం, ఇద్దరు చనిపోవడం, నల్గురికి తీవ్రగాయాలు కావడం జరిగింది. ఉత్సాహం, నిరుత్సాహంగా మారింది. ఉత్సవాలు రద్దుచేయబడినాయి.

1962 ఎన్నికలు– నిడుమోలు అభ్యర్థి శ్రీ కనుమూరు సోమేశ్వర రావు గెల్చారు. ఊరేగింపు అవ్వాయి చువ్వాయిలు ప్రేల్చారు. గడ్డివాముమీద పడ్డాయి. పూరియిండ్లు తగులబడ్డాయి. ఓట్లుపోయి ఓదార్చడం మొదలుపెట్టాము. బాణసంచాలు బాగా తగ్గించబడ్డాయి. పూర్తిగా తగ్గించడం అవసరం.

**విందులు**

మంత్రులు వచ్చినప్పుడు విందులు చేయడం, 100, 200 మందికి భోజనం పెట్టడం, విస్తర్ల నుండి పెట్టడం, వృథాగా వదిలి పెట్టడం, ఎందరు, ఎవ్వరు చేస్తున్నారు. ఎందుకు చేస్తున్నారు. సహాయం కావాలనే చేస్తున్నారు. డబ్బు వసూలు చేసి చేస్తున్నారు. కొద్దిచోట్ల మిత్రులు చేస్తున్నారు. విద్యామంత్రిగా తిరుపతి వెళ్ళాను. పద్మావతి కాటేజ్ హాస్టలులో భోజనం ఏర్పాటు చేశారు. భోజనానికి ముందు ఎవ్వరూ వదలి పెట్టకూడదని కావలసినంత మాత్రమే వడ్డించి, వదలిపెట్టకుండా తినమని చెప్పాను. అలాగే శుభ్రంగా తిన్నారు. పొదుపుచేయాలి. శుభ్రంగా తినాలి. మాజీ మంత్రి శ్రీ చల్లపల్లి రాజా, శ్రీ చెంచు రామానాయుడు భోజనం ఎంతో శుభ్రంగా తినేవారు. సంపన్నులయినా రాజాగారి విస్తరి మొదటిలో ఎలా ఉండేదో భోజనానంతరం కూడా అలాగునే ఉండేది.

భోజనం శుభ్రంగా తినడం పిల్లలు అలవాటు చేసుకొంటే వారి జీవిత విధానానికే మార్గదర్శకం అవుతుంది. హాస్టల్లో విద్యార్థులు వృథాగా వడ్డించుకొని పారవేస్తూ ఉంటారు. అది మంచి అలవాటు కాదు. కావలసినంత పెట్టుకొని పూర్తిగా తినడం నేర్చుకోవాలి. విందులలో చాలా ఎక్కువ వృథా అవుతుంది. బఫేలో పరవాలేదు. బంతులలో, హోటలులో కూడా వృథా బాగా చేస్తుంటారు. ఆహారపదార్థాలు పొదుపుగా వాడడం అవసరం. దేశంలో సగం మంది అర్ధ ఆకలితో వుంటుంటే వృథాచేయడం ధర్మం కాదు.

*(గాంధీక్షేత్రం మాసపత్రిక)*

## 9. భారత రాజనీతి శాస్త్ర మహాసభ - 35వ సమావేశం

సోమవారం, జనవరి 5, 1976

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం - తిరుపతి.

అధ్యక్షా, వైస్ ఛాన్సలర్, విశిష్ట అతిథులు, సోదర, సోదరీమణులారా!

తిరుపతిలో జరుగుతున్న భారత రాజనీతి శాస్త్ర మహాసభ 35వ సమావేశంలో ఈరోజు పాల్గొనడం గొప్ప గౌరవంగా భావిస్తున్నాను. ఈ సమావేశాన్ని ప్రారంభించడానికి భారత రాజనీతి శాస్త్ర మహాసభ సంఘం నన్ను ఆహ్వానించడాన్ని గొప్ప అరుదైన గౌరవంగా భావిస్తున్నాను. గతంలో ఈ మహాసభ సమావేశాలు ప్రారంభించిన వ్యక్తుల ప్రాముఖ్యత మరియు ఈ సమావేశంలో పాల్గొంటున్న ఎందరో ప్రముఖులు, మేధావులు ప్రజ్ఞావంతుల నైపుణ్యాన్ని పరిగణనలోకి తీసుకుని తొలుత ఈ ఆహ్వానాన్ని అంగీకరించడానికి తటపటాయించాను. అయితే 30 ఏళ్ళకు పైగా సామాన్య జనజీవితంతో మమేకమైన రాజకీయవేత్తగా, వారి సమస్యలు, కష్టసుఖాలు తెలిసినవాడిగా, ఇక్కడ సమావేశమైన రాజనీతిశాస్త్రజ్ఞులు, మేధావుల ఆలోచనలకు నా ఆచరణాత్మక అనుభవాన్ని జోడించేందుకు తోడ్పడుతుందని భావించి ఆ తర్వాత వీరి ఆహ్వానాన్ని అంగీకరించాను. ఇక్కడ సమావేశమైన ఉన్నత విద్యావంతులైన రాజనీతిశాస్త్ర కోవిదులు, మరియు ఇతర సామాజిక శాస్త్రవేత్తలు వారివారి రంగాలలో నిష్ణాతులు. అయితే భారత రాజకీయ రంగంలో ఎదురవుతున్న మరియు రాజనీతి శాస్త్రంలో ఎదురవుతున్న సమస్యలు తెలిసిన, ఆచరణాత్మక అనుభవాలను, విశ్లేషించి భారత రాజకీయరంగంలో ఎదురవుతున్న సమస్యలను, వివిధ అంశాలను, రాజకీయ మేధకు, ఆలోచనలకు జోడించడంద్వారా వాటిని మరింత అర్థవంతంగావించవచ్చునని భావిస్తున్నాను.

సోదర సోదరీమణులారా! భారత రాజకీయ చరిత్రలో ఎంతో మహత్త్వపూర్ణ దశలో జరుగుతున్న ఈ సమావేశాలు ఎంతో ప్రాముఖ్యం గలిగినవనే సంగతి మీకు తెలిసిందే. భారత రాజకీయచరిత్రలో సంభవించిన ఎన్నో సంఘటనాత్మక సంవత్సరాల

తుది సంవత్సరం ఆఖరులో ఈ సమావేశం జరుగుతున్నది. ప్రజాస్వామ్య భావం మరియు పరిధి గురించి చర్చించేందుకు ఎన్నో అంశాలు ఈ సభ ముందున్నాయి. దేశంలోని ఏ ప్రజాస్వామ్య రూపమైనా (Form) ఆ దేశ సమాజపు రాజకీయ లేదా ఆర్థిక అనివార్యతలను (Compulsions) - తప్పనిసరిగా ప్రతిబింబించవలసి వుంటుంది. ఈ దేశంలో అత్యవసర పరిస్థితి (Emergency) ని ప్రకటించడానికి దారితీసిన ఘటనలు, పరిణామాల నేపథ్యంలో భారత ప్రజాస్వామ్యానికి సంబంధించి రాజకీయ చింతన, ఆలోచనలలో పునశ్చరణ లేదా మార్పులు అవసరమా అనే ప్రశ్న ప్రస్తుతతరుణంలో ఉత్పన్నమైంది. దేశంలో ప్రజాస్వామ్య మనుగడకే ముప్పుగా పరిణమించిన దుశ్చర్యలు మనలను ఆవరించిన తరుణంలో మనం ఏ మూలనో ఏకాకిగా వుండలేమనే విషయం అందరికీ తెలిసిందే. దేశంలో క్రమశిక్షణారాహిత్యం, అసాంఘికచర్యలు, విధులను నిర్వహించకుండా అడ్డుపడుతూ, ఇతర శక్తులకు విధేయులుగా వుండే ధోరణులు ప్రబలుతున్న వేళ... జాతికి 'గరళవైద్యం'/విద్యుత్ చికిత్స (Shock therapy) చేయడంలో 'ఎమర్జెన్సీ' (అత్యవసర పరిస్థితి) విజయవంతమైంది. ఈ పూర్వరంగంలో చిరకాల మనుగడ సాగించేలా ప్రజాస్వామ్యాన్ని మళ్లీ పట్టాల కెక్కించేందుకు తీసుకోవలసిన నిర్దిష్ట చర్యలను సూచించే బాధ్యత ఇక్కడ సమావేశమైన మనందరిపైనా వుంది. ఇది జాతికి మాత్రమే సవాలు కాదు. రాజకీయ శాస్త్రజ్ఞులకు కూడా సవాలు వంటిది. రాజనీతి శాస్త్రజ్ఞులు ప్రస్తుత ప్రజాస్వామ్య భావనను నిర్వహించడమేగాక, దేశ ప్రజల హితాన్ని విశాల ప్రయోజనాలను పరిరక్షించే విధంగా ప్రజాస్వామ్యాన్ని పరిపుష్టం చేయడమెలా అనే అంశాన్ని కూడా నిర్వహించవలసి వుంది. హద్దులుమించి పెట్రేగిన రాజకీయ అరాజకం (political permissiveness) ఆర్థికమాంద్యం, మరియు సామాజిక అణచివేతలు పెచ్చు పెరిగిన తరుణంలో, ప్రపంచంలో అతిపెద్ద ప్రజాస్వామ్య దేశాన్ని కాపాడేందుకు, పరిస్థితిని అదుపులోకి తెచ్చేందుకు ప్రధానమంత్రి సాహసోపేతంగా జోక్యం చేసుకుని ఎమర్జెన్సీ విధించవలసి వచ్చింది. క్రమశిక్షణా రాహిత్యం, బాధ్యత లేకుండా వ్యవహరించడం, మరియు సాంఘిక దురభిమానం పెచ్చు పెరిగి, ప్రమాదకరస్థాయికి పెరిగాయి. గాంధీయుగం అంశీకృత విలువలను తుంగలో తొక్కి, రాజకీయ ఆధిపత్యం కోసం తెగబడే ప్రమాదకర స్థాయికి ఈ ధోరణులు పెరిగాయి. ప్రగతి సాధనకు మార్పు అవసరమే. పాత విలువల స్థానంలో కొత్తవాటికి తావివ్వాలి. అయితే ఆ కొత్త విలువలు ప్రజలస్థితిగతులను మెరుగుపరిచేవిగా వుండాలి. అంతేగానీ అవి మితవాదాన్ని, అభివృద్ధి నిరోధకత్వాన్ని,

మతతత్వాన్ని మరియు తీవ్రవాదాన్ని విభిన్న రూపాల్లో సృష్టించి, పెంచి పోషించేవి కారాదు. ఈ పూర్వ రంగంలోనే నేను నా ఆలోచనలను ఇక్కడ సమావేశమైన విశిష్ట అతిథులతో పంచుకోవాలనుకుంటున్నాను. భారతదేశంలో ప్రజాస్వామ్యం పటిష్ఠంగా మనుగడ సాగించడానికి అనువైన కొత్త ప్రజాస్వామ్యభావనలు, రాజ్యాంగ అంశాలను మీ దృష్టికి తెస్తున్నాను. ఈ మహాసభ ఈ రెండు అంశాల గురించి క్షుణ్ణంగా చర్చిస్తుందనీ ఆశిస్తున్నాను. దేశంలో ప్రబలుతున్న అరాచక, గందరగోళ శక్తులను నిరోధించి, ప్రజాస్వామ్యాన్ని మరింత పరిపుష్టం చేయడానికి తీసుకోవలసిన చర్యల గురించి, మన అంగీకృత లక్ష్యం సోషలిజం, సాధన దిశగా దేశాన్ని నడిపించేందుకు చేపట్టవలసిన చర్యలను సభ చర్చించాలని కోరుతున్నాను.

'ప్రజాస్వామ్యానికి' 'అర్థవంతమైన భావన' చేకూర్చే ఏ ప్రయత్నమైనా ప్రజల ఆర్థిక, సాంఘిక పరిస్థితులను అది ఎక్కడ ఏ రంగంలో/ఏ ప్రాంతంలో అమలు చేయాలనే అంశాలను పరిగణనలోకి తీసుకోవలసి వుంటుంది. ప్రజల సామాజిక, ఆర్థిక అభ్యున్నతికి, సంక్షేమానికి తోడ్పడడమే ప్రజాస్వామ్య ప్రాథమిక లక్ష్యం. గత రెండు దశాబ్దాల కాలంలో కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు ప్రణాళికా బద్ధంగా చేపట్టిన చర్యల కారణంగా భారత ప్రజల ఆర్థిక మరియు సాంఘిక పరిస్థితులలో గణనీయమైన పురోగతి కన్పించింది. కొన్ని సామాజిక, ఆర్థిక ధోరణులు కలగలిశాయి. పేదలు మరియు ధనికుల మధ్య పెరుగుతున్న వ్యత్యాసాలు, కోట్లాదిమంది ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన దుర్భరజీవితం గడుపుతూ ఉండటం, కొద్దిమంది ధనికులో చేతిలో ఆర్థికశక్తి కేంద్రీకృతం కావడం, జనాభాలో అత్యంత దుర్బల, బలహీన వర్గాలకు సామాజిక న్యాయం లభించకపోవడం వంటి వాస్తవాల కారణంగా మొత్తం భారతసమాజం సాంఘిక-ఆర్థిక స్వరూపంలో అభ్యుదయకరమైన మార్పులు తేవలసిన అవసరం ఎంతో పెరిగింది. భారతదేశంలోని ఈ సాంఘిక-ఆర్థిక పరిస్థితుల నేపథ్యంలో ప్రజాస్వామ్యానికి అర్థవంతమైన భావనను రూపొందించడం ఎంతో అవసరం. ప్రస్తుతం జడంగా, స్తబ్ధంగా ఉన్న భారతీయ సమాజాన్ని ఉత్సాహపూరిత, చైతన్యశీల సమాజంగా మార్చాలంటే అందుకు తగిన సాధనాలను ఎంపిక చేసుకోవాలి. అదనపు సాధనాలు సమకూర్చుకోవాలన్నా, ప్రస్తుతం అందుబాటులో వున్న సాధనాలలో ఆ దిశగా మార్పులు తేవాలన్నా అందుకు వెనుకాడకుండా ముందుకు సాగాల్సి వుంటుంది. దానిని తప్పించుకునే వీలులేదు.

మొత్తంగా చెప్పాలంటే భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యం విజయవంతమైంది. ప్రజలే సార్వభౌమాధికారులనే గుర్తింపు, పార్లమెంటు సర్వోన్నత మైందనే అభిప్రాయం, ప్రజల ఆకాంక్షలను ఉత్తమ ప్రభుత్వంగా మార్పు చేయడంలో రాజ్యాంగం సహకారిగా ఉండటం, మరియు ప్రజల ఆర్థిక-సాంఘిక మార్పులకు దోహదం చేయడానికి మొత్తం జాతి నిబద్ధమైంది. ఇవన్నీ ప్రజాస్వామ్య మౌలిక భావనలలో అంతర్భాగం. ఏ ప్రజాస్వామ్యంలోనైనా 'ప్రజలదే సార్వభౌమాధికారం' అనే భావనను నేను నొక్కి వక్కాణిస్తున్నాను. ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తుంది కనుకనే, పార్లమెంటు సర్వోన్నతమైందనే భావన అంకురించింది. అందువల్ల ప్రజలు మరియు పార్లమెంటు 'మహత్తర ప్రాధాన్యత' (Greatest Importance) సంతరించుకున్నాయి. రాజ్యాంగం ఒక ఉపకరణం (Instrument) మాత్రమే. అందువల్ల సహజంగా రాజ్యాంగం ద్వితీయ ప్రాధాన్య పాత్ర పోషిస్తుంది. అయితే ప్రజల ఆకాంక్షలను నెరవేర్చడానికి అడ్డుపడేవి, పార్లమెంటు సర్వోన్నతాధికారాన్ని నిరోధించే ధోరణులు, అంశాలేవైనా రాజ్యాంగంలో వుంటే సహజంగానే రాజ్యాంగాన్ని సవరించవలసి వుంటుంది. ప్రజల స్థితిగతులను మెరుగుపరచడానికి ఉపకరణం సమర్థవంతపాత్ర పోషించాలంటే ఆ ఉపకరణాన్ని (రాజ్యాంగం) మార్చాల్సి వుంటుంది. అయితే విచ్ఛిన్నకరశక్తులు కొన్ని రాజ్యాంగ నిబంధనల మాటున తగు చర్యలు సాగించడం సరికాదు. ప్రజాస్వామ్యంలో కార్యనిర్వాహకవర్గం (ప్రభుత్వం), చట్టసభ, మరియు న్యాయవ్యవస్థలు ఇతరుల సార్వభౌమాధికారం పరిధిలో జోక్యం చేసుకోకుండా సజావుగా సవ్యంగా సామరస్యంగా, ప్రజలు కోరుకున్న జీవితాన్ని, జీవన విధానాన్ని అందించేందుకు సామరస్యంగా పనిచేయాలి.

ఈ నేపథ్యంలోనే మన దేశంలో రాజ్యాంగం పాత్రను అర్థం చేసుకోవలసి వుంటుంది. రాజ్యాంగం పవిత్రమైందని భావించే వారిలో నేనూ ఒకరిని. అయితే అది మార్పులకు అతీతమైందేమీ కాదు. మారుతున్న ఆయా కాలాలకు అనుగుణంగా, మారుతున్న పరిస్థితులు, మారుతున్న ప్రజాజీవితాలకు అనుగుణంగా మార్పులు చేసేందుకు రాజ్యాంగం అనువైందిగా సమర్థవంతమైందిగా వుండాలి. అమెరికా అధ్యక్షులు ఉడ్రో విల్సన్ చెప్పినట్లుగా, "రాజ్యాంగం ఏ రకమైన మార్పులు చేయడానికి వీలులేనిదిగా, స్థిరమైందిగా వుండరాదు. అభివృద్ధితోపాటు ఎదుగుతూ, మరియు మారుతున్న జాతి అవసరాలకు అనుగుణంగా మారేదిగా, అర్థవంతమైందిగా" ఉండాలి.

రాజ్యాంగంలో పొందుపరచిన 'ప్రాథమిక హక్కు', 'తిరుగులేనివి'. అని కొందరు చెబుతున్నారు. అయితే 'హక్కు' అనే భావన పరిస్థితులను బట్టి మారుతుంది. వందేళ్లక్రితం సరైందని భావించిన అంశం ప్రస్తుతం 'సరైంది' గా భావించలేరు. ఏ హక్కునైనా 'శాశ్వతమైంది' గా భావించడం అర్థరహితం. మారుతున్న పరిస్థితులలో ఈ హక్కులు కూడా మార్పుకు లోనవుతాయి. ముఖ్యమైన అంశమేమంటే ఈ హక్కులలో మార్పులనేవి అంతిమంగా సార్వభౌమాధికారులుగా భావిస్తున్న ప్రజల ఆమోదం పొందుతున్నాయా లేదా అనేది. ఒక హక్కు కొనసాగాలా, వుండాలా వద్దా అనే అంశం ప్రజలు ఆ హక్కును అవసరమైందిగా భావిస్తున్నారా, లేక ఆ హక్కును తగ్గించడమా లేక మరింత పెంచాలని భావిస్తున్నారా అనేదే పరీక్షల్లో తేలేది. పార్లమెంటు ఏకాభిప్రాయాన్ని ప్రతిబింబిస్తున్నందున ప్రజాభిప్రాయాన్ని నీరుగార్చే ప్రయత్నం ఆ ప్రజాస్వామ్యవ్యవస్థను అర్థరహితం చేస్తుంది. ఏది సరైందో, ఏది హక్కో అనే జనాభిప్రాయాన్ని అంతిమంగా నిర్ధారించేది పార్లమెంటే.

ప్రస్తుత సందర్భంలో ప్రజల ఆర్థిక, సామాజిక పరిస్థితులను బట్టి కార్యనిర్వాహక వర్గం, చట్టసభలు మరియు న్యాయవ్యవస్థలు నిర్వహించవలసిన పాత్రలను సమావేశానికి విచ్చేసిన రాజనీతిశాస్త్రజ్ఞులు పరిశీలిస్తారని భావిస్తున్నాను. ప్రభుత్వంలోని ఈ 3 విభాగాలు తమ అధికారాలను రాజ్యాంగం నుండి పొందాయనడంలో సందేహంలేదు. అయితే రాజ్యాంగం సైతం ప్రజాభీష్టం మేరకే రూపొందిందనే విషయం గుర్తించాలి. అందువల్ల ప్రజాభీష్టం మేరకు, వారి అవసరాలకు అనుగుణంగా రాజ్యాంగం కూడా మారవలసి వుంటుంది. ఫలితంగా ప్రభుత్వంలోని ఈ 3 విభాగాలు కూడా తదనుగుణంగా తమతమ పాత్రలను మార్చుకోవలసి వుంటుంది. న్యాయవ్యవస్థ ఈ దేశంలో రాజ్యాంగ నిబంధనలు, వివిధ చట్టాలకు చట్టబద్ధమైన రీతిలో సవ్యంగా భాష్యం చెబుతున్న మాట నిజమే. రాజ్యాంగం ప్రస్తుత నిబంధనలు కొంతమేరకు ప్రతిబంధకంగా వున్నాయి. న్యాయవ్యవస్థ ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా తన పాత్రను నిర్వర్తించాలంటే అందుకు రాజ్యాంగం సహకరించవలసి వుంది. అందువల్ల భారత సమాజ సత్వర పురోగతికి, మార్పుకోసం రాజ్యాంగాన్ని పరిశీలించి, ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగా మార్పు చేయటం నేటి తక్షణావసరం. దీని అర్థం రాజ్యాంగంలోని నిబంధనలన్నింటినీ మార్పు చేయాలనికాదు. భారత రాజ్యాంగ నిర్మాతలు రాజ్యాంగాన్ని రూపొందించేటపుడు ఆనాడు దేశంలోని ఆర్థిక, రాజకీయ

పరిస్థితులను పరిగణనలోకి తీసుకుని విజ్ఞతతో పకడ్బందీగా నిర్దిష్టంగా తయారుచేశారు. ఎన్నో రాజ్యాంగ నిబంధనలను ఈనాటికీ మార్పు చేయవలసిన అవసరంలేదు. అయితే సమాజ పురోగతికి అవరోధంగా వున్న కొన్ని నిబంధలనలను మార్చడం అవసరం.

సర్వోన్నతమైంది పార్లమెంటా లేక న్యాయవ్యవస్థా అనే విషయమై వివాదం జోలికి వెళ్లకుండా ప్రజాభీష్టం మేరకు, వారి సంక్షేమానికి అత్యంత ప్రాధాన్యమిచ్చి, నిర్ణయాలు తీసుకోవాలని ఇన్నేళ్ళ ప్రజాజీవితంలో, నా మౌలిక అవగాహనను బట్టి తెలుసుకున్న అంశాన్ని నొక్కి చెప్పదలచాను. పార్లమెంటు, న్యాయవ్యవస్థ రెండూ కూడా ప్రాథమికంగా ప్రజాసంక్షేమానికే అత్యంత ప్రాధాన్యమివ్వాలి.

ఈ సభకు హాజరైన వారిలో కొందరు లేదా అనేకమంది ప్రతినిధులు ఉపాధ్యాయవృత్తిలో వున్నవారే. (Political thought) రాజకీయచింతనలో ప్రస్తుత ధోరణులకు సంబంధించిన రోజువారీ పాఠ్యాంశాలను రాజనీతిశాస్త్ర విద్యార్థులకు బోధించడంలో వారు కృతకృత్యులయ్యారు. కాలం మారుతున్న కొద్దీ రాజకీయ వ్యవస్థలలో వస్తున్న మార్పులను అధ్యయనం చేయడానికి వారికి సదవకాశం లభిస్తోంది. అయినప్పటికీ మన విద్యాసంస్థలో రాజకీయచింతన, ఆలోచనాధోరణులను గూర్చి విద్యార్థులు కొంతకాలం వరకు మాత్రమే అధ్యయనం చేస్తున్నారనే అభిప్రాయం నాకుంది. ప్రస్తుత రాజకీయ పరిస్థితి, మరియు వారిపై ప్రభావం తాత్విక ఆలోచనాధోరణులకు సంబంధించిన అంశాలను విద్యార్థుల అధ్యయన పరిధి నుండి తొలగిస్తున్నారు. అందువల్ల ఈ సమావేశానికి హాజరైన అధ్యాపకులకు సూచించేదేమంటే, నేటి రాజనీతి శాస్త్ర విద్యార్థి ప్రస్తుతం ఏం జరుగుతుందో తెలుసుకునేలా, దేశంలోని ప్రస్తుత రాజకీయ పరిస్థితుల పర్యవసానాలను బోధించి, వారిని ఈ దేశ పౌరులుగా చురుకైన పాత్ర నిర్వహించేందుకు సన్నద్ధం చేయాలి. ఇంకా నిర్దిష్టంగా చెప్పాలంటే ఇతర శాస్త్రాల వలెనే రాజనీతిశాస్త్రం కూడా మారుతున్న శాస్త్రమనే అంశాన్ని నేను ప్రత్యేకంగా ప్రస్తావిస్తున్నాను. వందేళ్ళనాటి రాజకీయ ఆలోచనా ధోరణి, మారుతున్న ఆయా కాలాలకు అనుగుణంగా లేక సమాజ పురోగతికి ఉపయోగకరం కాకపోవచ్చు. రాజకీయచింతన ఆయాకాలాలలో మార్పులకు గురవుతున్నది. రాజనీతిశాస్త్ర పరిధి ఈ మార్పులను అవగాహన చేసుకుని, ప్రస్తుత సమాజంలో మరింత బాధ్యతాయుతంగా తన పాత్రను నిర్వర్తించాలి. పాఠ్యప్రణాళికను కాలానుగుణంగా మార్చాలనేదే నేను చెప్పదలచుకున్న ప్రధానాంశం.

ప్రతిపక్షం లేని పార్లమెంటరీ ప్రజాస్వామ్యం 'అర్థరహిత'మని నాకు చెప్పారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఇది విడదీయరాని అంతర్భాగమనే అభిప్రాయంతో నేను ఏకీభవిస్తాను. అయితే ప్రతిపక్షం బాధ్యతాయుతంంగా వ్యవహరించాలి. ప్రతిపక్షానికి తన బలం పెంచుకునే అవకాశం ఉండదు గనుక, లేదా ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటు చేసే బలం లేదు గనుక, సహజంగానే నిస్పృహకు గురై బాధ్యతారహితంగా వ్యవహరిస్తాయని కొందరు చెబుతుంటారు. ప్రజలకు ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఇవ్వడంలో 'నిస్సహాయత' చూపే ప్రతిపక్షాల పట్ల, ప్రజలకు తమ విధానాల గురించి సరిగా చెప్పుకోలేని వారి నిస్సహాయత పట్ల ప్రతిపక్షాలపై సానుభూతి చూపగలం. అయితే ఇలాంటి ప్రతిపక్షం ప్రజాస్వామ్యం పేరిట ప్రజాస్వామ్యాన్నే విధ్వంసం చేయడం సరైంది కాదని నేను గట్టిగా భావిస్తున్నాను.

స్వాతంత్ర్యానంతరం ప్రారంభమైన మహా ప్రయత్నం కొన్ని దశాబ్దాలుగా ఏడాదికేడాది ప్రజలకు విముక్తి కల్పించే ఏకైక లక్ష్యంతో కొనసాగుతూనే వుంది. రాజకీయ ప్రజాస్వామ్యం సుస్థిరమై ప్రజలకు ఆర్థిక ప్రజాస్వామ్యం కూడా ఒనగూడాలనేది జాతి లక్ష్యం. ఈ దేశ ప్రజలు కల్లోలాలు, అలజడులు లేని జీవితాన్ని, ఆర్థిక, సామాజిక, న్యాయాన్ని కోరుకుంటున్నారు.

ప్రజలు తమకుతామే సమర్పించుకున్న రాజ్యాంగం, దృఢమైన ప్రజాస్వామ్య భావనను, ప్రజాభీష్టపు సర్వోన్నతిని వ్యక్తం చేస్తున్నదనే విశ్వాసం వుంది. అయితే పవిత్రమైందిగా భావించే రాజ్యాంగం తమ ఆకాంక్షలను నెరవేర్చడంలో నిస్సహాయంగా వుండిపోయిందని గుర్తించిన జనం రాజ్యాంగాన్ని మార్చాలని కోరుకుంటున్నారు. ప్రజల కోరికను అమలుచేయడం తప్ప మరో మార్గాంతరం నాకు కన్పించడం లేదు. మన సమాజంలోని దుర్బల వర్గాలు మరియు ప్రజల కష్టాలను కడతేర్చడం నేటి తక్షణావసరం. ఈ లక్ష్యం సాధించాలంటే మన సామాజిక, ఆర్థిక స్వరూపంలో (Structure) ఎన్నో వినూత్న మార్పులు తేవలసిన అవసరముంది. మన రాజ్యాంగం కేవలం అవరోధశక్తి అని భావించకుంటే ఈ మార్పులు చేయవచ్చు. కాలానుగుణంగా మారుతున్న ప్రజల ఆకాంక్షలను నెరవేర్చేలా మారని జడ రాజ్యాంగాలు అనూహ్య ఘటనల భారానికి కుప్పకూలిన దృష్టాంతాలెన్నో, గుణపాఠాలెన్నో చరిత్రలో మనకు లభిస్తున్నాయి. కాలానుగుణంగా మార్పులు చేయని, ప్రజల కోరెలు తీర్చలేని రాజ్యాంగాలు మనుగడ సాగించలేవనేది సుస్పష్టం. రాజ్యాంగం అనేది కాలానుగుణంగా

అవసరమైన మార్పులు చేసుకోవడానికి వీలైందిగానే గాక, బాధ్యతాయుతమైందిగా కూడా వుండాలి. అందువల్ల ఇక్కడ సమావేశమైన అధ్యయనశీలురు, మేధావి మిత్రుల దృష్టికి తెచ్చేదేమంటే, ప్రస్తుత కాల పరిస్థితులలో ఆ ప్రజల అవసరాలకు అనుగుణంగా రాజ్యాంగంలో మార్పులు చేయవలసిన తప్పని పరిస్థితులను గమనించి రాజ్యాంగంలో ఏ మేరకు మార్పులు చేయాలో సూచించాలని కోరుతున్నాను. ఆ మార్పులు ప్రజాస్వామ్య భావనలను, సమసమాజం ఏర్పడాలనే ప్రజల ఆకాంక్షలను వ్యక్తీకరించేందుకు, నెరవేర్చేందుకు అనువైనవిగా వుండాలి. మన రాజ్యాంగం మార్పులు చేయడానికి వీలులేని నిశ్చల జడపత్రమేమీ కాదని, అవసరమైన మార్పులను పొందుపరచడానికి వీలులేనంత పరమ పవిత్రమైందేమీ కాదని నేను మరోసారి వక్కాణిస్తున్నాను. అందువల్ల రాజ్యాంగంలో ప్రస్తుత అవసరాల మేరకు తగిన మార్పులు చేయడం ద్వారా, ప్రజల ఆకాంక్షలను సమర్థవంతంగా నెరవేర్చే 'సజీవపత్రం'గా రాజ్యాంగంలో మార్పులు చేయడం అవసరం. ఈ ప్రక్రియను అమలుచేసే సందర్భంలో ప్రభుత్వ వివిధ విభాగాల మధ్య వివాదాలు లేకుండా చూడాలి. ప్రభుత్వ వివిధ విభాగాల మధ్య సామరస్య పూర్వక సంబంధాలు నెలకొనేలా, ప్రతి విభాగమూ ప్రజాసేవలో సమర్థవంతంగా పనిచేస్తూ, పూర్తిస్థాయిలో ఎదిగేలా రాజ్యాంగం జాగరూకత వహించాలి. ప్రపంచంలో అతిపెద్ద ప్రజాస్వామ్య దేశాలలో ఒకటిగా భారతదేశానికి బాధ్యత కూడా వుంది. చైతన్యవంతమైన క్రియాశీల రాజ్యాంగం స్ఫూర్తితో, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ద్వారా దోపిడీలేని సమాజాన్ని, బలవంతులు దుర్బలులను అణచివేయడానికి ఆస్కారం లేని ఒక వర్గం మరో వర్గంపై ఆధిపత్యం చలాయించడానికి వీలులేని సమసమాజాన్ని నిర్మించడం సాధ్యమేనని ఋజువు చేయాలి. ప్రజాస్వామ్య భావనను, దానిపరిధిని, పరిమితులను, అందులోని విషయాలను ప్రజలకు స్పష్టంగా తెలియడానికి అత్యంత ప్రాధాన్యమివ్వాలని నేను పునరుద్ఘాటిస్తున్నాను. మనం రూపొందించుకునే ఏ ప్రజాస్వామ్యంలో అయినా సార్వభౌమాధికారం ప్రజలదే. వారే సర్వోన్నతులు. ప్రజలు తమకు తాము అర్పించుకునే ప్రజాస్వామ్యం వారి ఆశలు, ఆకాంక్షలను నెరవేర్చేదిగా వుండాలి. అట్టి రాజ్యాంగం ప్రభుత్వ వివిధ విభాగాలు (LIMBS) సవ్యంగా పనిచేయడానికి దోహదం చేయాలి. ప్రభుత్వ వివిధ విభాగాలు సామరస్య పూర్వకంగా పనిచేసేందుకు సహకారిగా వుండాలి. ప్రజాస్వామ్యంలో చైతన్యవంతమైన ప్రతిపక్షం అంతర్భాగం. అయితే ప్రతిపక్షం ప్రజలకు, రాజ్యాంగానికి అంతే జవాబు దారీగా వుంటూ బాధ్యతాయుతంగా వ్యవహరించాలి. ఈ మేరకు రాజనీతి శాస్త్రజ్ఞుడు

ప్రతిపక్షపాత్రను నిర్వచించాలి. ప్రజల విశాల ప్రయోజనాలు, ప్రజాస్వామ్య మనుగడకై ఏపరిధి చట్రంలో ప్రతిపక్షం పనిచేయాలో కూడా నిర్ధారించాలి. ప్రస్తుత రాజకీయ చింతనకు మేధావులైన రాజనీతి శాస్త్రజ్ఞులు ఏ మేరకు దోహదం చేయాలో నేను చెప్పడం సాహసమే అవుతుంది. అయితే వర్తమాన భారతరాజకీయ పరిస్థితుల నేపథ్యంలో, సద్భావనతో ఈ అంశాలపై ఈ సమావేశంలో వివరంగా చర్చిస్తారనే ఆశాభావంతో మీముందు నా అభిప్రాయాలను వెల్లడించాను. ఈ సమావేశాన్ని ప్రారంభిస్తున్నందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. మీ చర్చలు ఫలప్రదంకావాలని కోరుకుంటున్నాను. పవిత్ర పుణ్య క్షేత్రమైన తిరుపతిలో బసచేయడం పట్ల మీరు ఆనందిస్తారని ఆశిస్తున్నాను. మీ ప్రయత్నాలకు దేవదేవుడైన శ్రీ వేంకటేశ్వరుని ఆశీస్సులు లభిస్తాయి.

ధన్యవాదాలు

జైహింద్

# 10. విద్య లక్ష్యాలు

రాష్ట్ర వ్యాప్తంగా 1976 సెప్టెంబర్ 2వ తేదీ నుండి మనం ఆంధ్రప్రదేశ్ రెండో విద్యావారోత్సవాలను జరుపుకుంటున్నాము. రాష్ట్రంలో విద్య అవసరాలను దృష్టిలో వుంచుకుని విద్యపరమార్థం గురించి లక్ష్యాల గురించి నా ఆలోచనలు కొన్నింటిని మీ దృష్టికి తేదలచుకున్నాను. భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత గత 3 దశాబ్దాల కాలంలో దేశం విద్యారంగంలో గణనీయమైన పురోగతి సాధించింది. విద్యావకాశాలను పల్లెప్రాంతాలకు, సమాజంలోని బడుగు బలహీన వర్గాలకు ప్రత్యేకించి దుర్బలవర్గాల వారికి అందుబాటులోకి తేవడానికి విజయవంతమైన ప్రయత్నం జరిగింది. రాష్ట్రంలోని వివిధ విద్యాసంస్థల నుండి, యూనివర్సిటీలనుండి మెట్రిక్యులేట్లు, పట్టభద్రులు, సాంకేతిక శిక్షణ పొందినవారు అధికాధికంగా ఉత్తీర్ణులుకావడం రాష్ట్రంలో విద్యావకాశాలు పెరిగాయనడానికి సరైన సూచిక. 1956 నుండి 1976 వరకు రెండు దశాబ్దాలకాలంలో ప్రాథమిక పాఠశాలల్లో చేరిన విద్యార్థుల సంఖ్య 24 లక్షల నుండి 41 లక్షలకు పెరిగింది. అదే విధంగా మాధ్యమిక పాఠశాలల్లో చేరిన విద్యార్థుల సంఖ్య ఇదే కాలంలో మూడింతలైంది. విద్యనాణ్యతను పెంపొందించడానికై ఎన్నో వినూత్న ప్రయోగాలు జరిగాయి. దేశం త్వరితగతిన పారిశ్రామికాభివృద్ధి చెందుతున్నందున పరిశ్రమల అవసరాలకు దీటుగా వివిధ రీతుల్లో విద్యను విస్తరించడానికి అదేపనిగా ప్రయత్నం జరిగింది. బాలికల విద్యను ప్రోత్సహించాలని కోరుతున్న వారు గర్వపడేలా ఈ కాలంలో ఎక్కువమంది బాలికలు పాఠశాలల్లో చేరి విద్యావంతులైనారు. విద్యకు సంబంధించిన అన్ని రంగాలలో బాలికలు కూడా ముందంజవేసి బాలురకంటే తమేమీ తీసిపోమని తమ ప్రతిభను చాటడంతో బాలురు గట్టి పోటీని ఎదుర్కొంటున్నారు. వయోజన విద్యలో సైతం, గణనీయమైన విజయం సాధించామని చెప్పలేకపోయినప్పటికీ సత్ఫలితాల సాధనకు కొంత ప్రయత్నం జరిగింది. విద్యారంగంతో సాధనకు కొంత ప్రయత్నం జరిగింది. విద్యా రంగంలో సాధించిన విజయాలను ఎవరైనా క్రోడీకరించవచ్చు. విద్యావకాశాల విస్తరణ, విద్యారంగంలో సాధించిన అభివృద్ధి విద్య మౌలికలక్ష్యాలను సాధించగలిగాయా అనేదే మన ముందున్న ప్రశ్న.

విద్యారంగంలో సాధించినట్లు కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు చెబుతున్న పురోగతి అంతా నిజానికి, ఒక సువ్యవస్థిత కర్మాగారంలో వినియోగదార్ల వస్తువుల ఉత్పత్తి జరిగినట్లుగా, వివిధ కళాశాలలు, విశ్వవిద్యాలయాలల్లో పట్టభద్రులను, పోస్టు గ్రాడ్యుయేట్లను తయారుచేసి సమాజంలోకి పంపినట్లు వుందని ప్రస్తుత విద్యావ్యవస్థ పై కొందరు విమర్శకులు ఫిర్యాదు చేస్తున్నారు. ఉద్యోగాల మార్కెట్‌లో విద్యాధిక నిరుద్యోగులు అసంఖ్యాకంగా పెరిగిపోవడానికి మాత్రమే ప్రస్తుత విద్యావ్యవస్థ ఉపయోగపడుతున్నదని, నిరుద్యోగాన్ని పెంచే కృషిలో ఈ వ్యవస్థ సఫలమైందని వారి విమర్శ. ఉద్యోగాలు రాక, జీవితం గడపటమెలాగో తెలియక, కొన్ని రాజకీయ వర్గాలు మరియు సంఘ వ్యతిరేక శక్తులు, జాతివ్యతిరేక శక్తుల ప్రోత్సాహంతో నిస్పృహతో ఉన్న విద్యాధిక నిరుద్యోగులు కొందరు సంఘ వ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడుతున్నారు. ఇలా నిరాశానిస్పృహలకు గురై ఆందోళనతో వున్న విద్యాధికులు సహజంగానే అలజడులు సృష్టించేవారి చేతిలో ఆయుధాలుగా మారుతున్నారు. దేశంలో ఎన్నో వినూత్న పథకాలు ప్రవేశపెట్టిన మన ప్రధాని (ఇందిరాగాంధీ) అత్యవసరపరిస్థితిని ప్రకటించడానికి ముందు నెలకొన్న అరాజకానికి ఈ పరిస్థితులే కారణం. కొన్ని రాజకీయ, దేశవ్యతిరేక, అరాజక శక్తులు ఏకమై విద్యాధిక నిరుద్యోగులలో అసంతృప్తిని రెచ్చగొట్టి ఆందోళనలకు పురికొల్పిన ఫలితంగానే ఈ పరిస్థితి ఏర్పడిందనే విషయం గమనార్హం. ఈ అలజడులు, ఆందోళనల వల్ల మన జాతి భద్రతకే 'తీవ్రముప్పు' ఏర్పడింది. పూర్తిగా కాకపోయిన కొంతమేరకైనా అందరూ ఈ అభిప్రాయాన్ని అంగీకరించకతప్పదు.

విద్య 'లక్ష్యాల' గురించి ప్రధానాంశంగా లేదా వక్కాణించి చెప్పకపోవడమే బహుశా ఈ పరిస్థితికి కారణం కావచ్చు. మూడు భాషలు నేర్చుకోవడం, ఉన్నత విజ్ఞానార్జన, నైపుణ్యాలను సంతరించుకోవడం అనేవి విద్యావ్యవస్థలో అంతర్భాగమవడంలో సందేహం లేదు. అయితే ఈ ప్రతి లక్ష్యం వెనుక ఒక ఆదర్శం వుండాలి. ఒక విద్యార్థి వ్యక్తిత్వాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేయడం విద్య మౌలిక లక్ష్యాలలో ప్రధానాంశంగా వుండాలని నేను అభిప్రాయ పడుతున్నాను. విద్య వ్యక్తిత్వ వికాసానికి మెరుగులద్దాలి. ఒక వ్యక్తిలో సృజనాత్మక సామర్థ్యాలేమైనప్పటికీ, అతనిలో ఉత్తమ లక్షణాలను స్వీకరించి, అతని వ్యక్తిత్వాన్ని అభివృద్ధిచేసేదిగా విద్యావ్యవస్థ ఉండాలనేదే నా తాత్పర్యం. విద్యాసంస్థలనేవి, తమ వద్దకు శిక్షణకోసం, విద్యకోసం వచ్చిన వ్యక్తులను, పట్టభద్రులు, పోస్టుగ్రాడ్యుయేట్లు, ఎలక్ట్రికల్ ఇంజనీర్లు బయోకెమిస్ట్... ఇలా ఏదో ఒక లేబుల్ వేసి బయటకు పంపే "ఆత్మలేని యంత్రాలు"

కారాదు. అత్యంత పోటీ ప్రపంచంలో నిలదొక్కుకునే స్థైర్యాన్ని, నిబ్బరాన్ని విద్యార్థిలో కలిగించాలి. పోటీకి దీటుగా నిలిచేలా సామర్థ్యాన్ని అలవరచాలి. విద్యార్థి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాలనే లక్ష్యసాధనలో విఫలమైనామనే నేను భావిస్తున్నాను. లేదా పాక్షికంగానే సఫలమైనాము.

విద్యరెండో లక్ష్యం విద్యార్థి లేదా వ్యక్తి స్వాలంబన సాధించేదిగా వుండాలని నేను అభిప్రాయపడుతున్నాను. విద్యార్జన తరువాత యూనివర్సిటీల నుండి బయట అడుగిడిన వ్యక్తి ఉన్నతోద్యోగాలకోసం అర్రులుచాచకుండా, అలాంటి ఉద్యోగంపై ఆధారపడకుండా జీవితం సాగించడానికి తనకు అనువైన పనిచేసుకుంటూ, తన శక్తి యుక్తులను జాతీయోత్పత్తికి వినియోగించే తోడ్పడే విధంగా వుండాలి. ఈ రోజు జరుగుతున్నదేమంటే, అత్యంత ప్రత్యేకత నైపుణ్యాలు కలిగి, సముచిత సామర్థ్యం గల విద్యార్థులు తమ నైపుణ్యాల వినియోగానికి కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వాలవైపు ఆశతో చూస్తున్నారు. భారీ సంఖ్యలో డాక్టర్లు నిరుద్యోగులుగా వుండటాన్ని చూసి నేను వినియోగానికి అపరిమితమైన అవకాశాలుండగా, డాక్టర్లు ఆ అవకాశాలను ఉపయోగించుకోవడంలేదు. ప్రభుత్వోద్యోగాలకోసం ఎదురుచూస్తున్నారు. సామర్థ్యశక్తి వినియోగానికి ఎన్నో అవకాశాలున్నా, డాక్టర్లకు నిరుద్యోగ దారిద్ర్యం తీరడం లేదు. ఈ రుగ్మత మన విద్యా వ్యవస్థ వల్ల నేరుగా ఉత్పన్నమైంది కాదా అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. ఇలా వ్యక్తి స్వావలంబన సాధించేలా తీర్చిదిద్దడంలో విద్యావ్యవస్థ విఫలమైంది. అత్యున్నత సాంకేతిక నైపుణ్యం గల వ్యక్తులు మరియు ఓ మేరకు సాంకేతిక నైపుణ్యం గల వారు కూడా తమంతకు తాము సొంతంగా జీవించడానికి, స్వాలంబనకు ఎలాంటి ప్రయత్నం చేయడంలేదు. ప్రభుత్వోద్యోగాల పైనే అధికంగా ఆధారపడుతున్నారు. మన విద్యావిధానం దృక్పథంలో తగు మార్పులు చేయడం ద్వారా ఈ పరిస్థితిని సరిదిద్దాలి. లేదంటే ఈ దేశ పురోగతికి గణనీయమైన అవరోధం కలిగే పరిస్థితి ఏర్పడుతుంది. జీవనోపాధికి వినూత్న, సొంత ప్రయత్నాల ద్వారా మరింత ఉన్నతమైనవి, మహత్తరమైనవి సాధించే అవకాశాలుండగా మన యువతలో అవగాహనకందని, చిన్న ఉద్యోగాలతో సరిపెట్టుకునే ధోరణి కన్పిస్తుంది. అందువల్ల మన విద్యావ్యవస్థ మన విద్యార్థులకు స్వావలంబన సాధించే లేదా సొంత కాళ్ళపై నిలబడి జీవించే మౌలికలక్షణాన్ని అలవరచేయత్నం చేయాలి.

మన విద్యావ్యవస్థ మూడో లక్ష్యం వ్యక్తి గౌరవాన్ని, మరియు కొన్ని జాతి విలువలను నేర్పేదిగా వుండాలి. ఒక జాతిగా మనం రాజ్యాంగానికి కట్టుబడి వున్నాము.

ఆ రాజ్యాంగం మనకు కొన్ని ఆశయాలు, లక్ష్యాలను నిర్దేశించింది. మనది మతాతీత లౌకిక దేశం. మనం ప్రజాస్వామ్యవాదులం. విద్యార్థులకు లౌకిక విధానం, సెక్యులర్ విలువలను అలవరచాలి. అలాంటి ఆలోచనలు కల్గించాలి. అప్పుడే ఆ విలువలను అలవరచుకుని, వాటి అభివృద్ధికి తమవంతు కృషి చేస్తారు. ఈ విషయంలో మన విద్యావ్యవస్థ విఫలమైందని మనం అంగీకరించకతప్పదు. విద్యాసంస్థల నుండి పట్టాలు పుచ్చుకోవడానికే ఈ ప్రజాస్వామం పరిమితమైంది. విద్యార్హతలు లేదా వృత్తిపర నైపుణ్యాలు గడించినా లేకపోయినా పాసయ్యే వారి హక్కులకు మాత్రమే ఇది పరిమితమైంది. జాతిపిత మనకు నేర్పిన ఉన్నత విలువలుగానీ, ఇతరుల మనోభావాలను గౌరవించడం వంటి వాటిని ఎవరూ పట్టించుకోవడం లేదు. విద్యార్థులకు ప్రజాస్వామ్యం, సెక్యులరిజం విలువల గురించి ఎంత త్వరగా శిక్షణ ఇస్తే అంత మెరుగైన మేలే దేశానికి జరుగుతుంది.

మన విద్యావ్యవస్థ ద్వారా విద్యార్థులకు మనం నేర్పుతున్న నైపుణ్యాల విషయానికొస్తే, మనం అలవరచే నైపుణ్యాలు దేశం, సమాజం అవసరాలు తీర్చడానికి పనికొచ్చేవిగా ఉండాలి. అదే మన విద్య లక్షం కావాలి. అంతేకాదు ఆ నైపుణ్యాలు విద్యార్థులు తమ జీవనోపాధి తామే చేకూర్చుకునేందుకు తోడ్పడేవిగా వుండాలి. విద్యావ్యవస్థ ద్వారా మనం నేర్పుతున్న నైపుణ్యాలు ఎక్కువగా సిద్ధాంతపరమైనవిగా వున్నాయని, అవి నిజజీవితంలో పని ఆధారితమైనవికావనే బలమైన విమర్శ వుంది. ఫలితంగా విద్యార్థి ఏదో వృత్తి విద్యాకోర్సులో చేరి, విలువైన జీవితంలో అధికభాగాన్ని, ఆ కోర్సులో నైపుణ్యాలను నేర్చుకునేందుకు వెచ్చిస్తున్నప్పటికీ, విద్యాభ్యాసం పూర్తి చేసి ఉద్యోగమో, ఉపాధిలో చేరినప్పుడు ఆ నైపుణ్యాలను నేరుగా ఉపయోగించే స్థితిలో లేదు. ఫలితంగా ఒక వంక ఒక ప్రత్యేక నైపుణ్యాల అవసరాలకు (డిమాండ్), వాస్తవ సరఫరాకు 'సమతుల్యత' లోపించింది. ఒక విద్యా సంస్థ నుండి లేదా ప్రత్యేక శిక్షణా సంస్థ నుండి శిక్షణ పూర్తి చేసుకుని విద్యార్థి బయటికి వచ్చిన వెంటనే ఆ వ్యక్తి నేరుగా ఉద్యోగం లేదా ఉపాధి పొందడానికి అనువుగా అలాంటి శిక్షణానైపుణ్యాలలో మార్పులుచేయాలి. ఒక ఎలక్ట్రానిక్ ఇంజనీర్, ఒక కెమికల్ ఇంజనీర్ లేదా ఒక సివిల్ ఇంజనీర్ వంటి వాళ్ళు ఒక సాంకేతిక విద్యాసంస్థలో ఏడేళ్ళపాటు పాఠ్యాంశాల (థియోరాటికల్) తో బాటు, ఆయాపరికరాల వినియోగంపై శిక్షణ పొందినప్పటికీ వాళ్ళు ఎలక్ట్రానిక్, కెమికల్, సివిల్ ఇంజనీర్ ఉద్యోగాలలో నిర్దేశిత నైపుణ్యాలను చూపలేకపోతున్నారని, వారి శిక్షణకు – వాస్తవంగా పరిశ్రమలలో

పనులకు పొంతనే లేకుండా పోతున్నదని పారిశ్రామిక వేత్తలు తరచుగా ఫిర్యాదు చేస్తున్నారు. ఉద్యోగాలలో చేరినవారికి ఏడాదో, రెండేళ్ళో మళ్ళీ ఎలా పనిచేయాలో, వారు నేర్చుకున్న పాఠ్యాంశాలను, నైపుణ్యాలను వాస్తవ రీతిలో పరిశ్రమలో తమకు అప్పగించిన విధులను నిర్వహించడానికి ఎలా ఉపయోగించాలో నేర్పవలసి వస్తోందని పారిశ్రామిక వేత్తలు ఫిర్యాదు చేస్తున్నారు. మన విద్యావ్యవస్థలోని ఈ లొసుగులను సరిచేయడానికి మనం తగు చర్యలు చేపట్టడం అవసరమని భావిస్తున్నాను.

మన ఘనమైన సామాజిక మరియు సాంస్కృతిక వారసత్వ పరిరక్షణ గురించి మన విద్యార్థులకు ఎలాంటి అవగాహన కల్పించలేకపోవడం మన విద్యావిధానంలోని మరో లోపం. పరిరక్షణమాట ఎలా వున్నా దేశ సాంఘిక - సాంస్కృతిక విలువలు - వారసత్వం గురించి విద్యార్థులకు ఏమీ నేర్పలేని స్థితిలో మన విద్యావిధానం వుంది. సాంఘిక శాస్త్రం, చరిత్ర తదితరఅంశాలు మన పాఠ్యప్రణాళికలో వున్నప్పటికీ, మన దేశ మహత్తర సాంస్కృతిక వారసత్వాన్ని విద్యార్థులు ఆకళింపు చేసుకునేలా చూసే ఎలాంటి ప్రయత్నాలు జరగడం లేదు. ప్రస్తుత విద్యావిధానంలో మనం మరింత శ్రద్ధ తీసుకోవలసిన మరో అంశమిది.

జాతీయ, రాష్ట్ర స్థాయిలో ఎన్నో విద్యా కమిషన్లు మరియు కమిటీలెన్నో, విద్యకు సంబంధించిన దాదాపు అన్ని అంశాలను, దేశ అవసరాలు తీర్చే విధంగా విద్యను తీర్చేదెలా, విద్య లక్ష్యం ఏమిటనే విషయాలను క్షుణ్ణంగా పరిశీలించాయి. దేశంలోని ప్రముఖ విద్యావేత్తల ఆధ్వర్యంలో ఏర్పడిన ఈ కమిటీలు విద్యారంగం మెరుగుకు ఎన్నో విలువైన సూచనలు చేశాయి. ఈ సిఫార్సులను రాజనీతిజ్ఞులు, విద్యారంగ అధికారులు, పాలకులు సవివరంగా పరిశీలించారు. అయితే ఆ సిఫార్సులు కార్యరూపం దాల్చేటప్పటికీ వాటిలో కీలకాంశం లోపించిన ఫలితంగా, కమిటీలు పనిచేయడానికి ముందు ఎలాంటి పరిస్థితి ఎలా వుండేదో ఇప్పటికీ అదే స్థితి కొనసాగుతూనే వుంది. విద్యారంగంలో గొప్పగా చెబుతున్న వినూత్న ప్రక్రియలను, మార్పులను ప్రవేశపెట్టినప్పటికీ విద్యారంగంలో మనం ఆశించిన ప్రధాన లక్ష్యాలు సాధించడంలో, మనం కట్టుబడిన ఆశయాలను పాక్షికంగానైనా సాధించలేక పోయాము. ఇందుకు కారణాలేమిటో, మనం ఎందుకు ఈ రంగంలో ప్రగతిసాధించలేకపోయామో గుర్తించి, తగిన దిద్దుబాటు చర్యలను సూచించడానికి నేను ప్రత్యేక నిపుణుడిని కాను. నేను మన అంగీకృత జాతీయ లక్ష్యాలను సాకారం చేయాలని, ఆ లక్ష్యాలకు అనుగుణంగా మన సమాజాన్ని నిర్మించాలని కోరుకునే సాధారణ రాజనీతిజ్ఞుడిని మాత్రమే.

నేను ఉజ్జాయింపుగా ప్రస్తావించిన ఈ అంశాలను విద్యారంగపాలనలో నిష్ణాతులు, విద్యారంగ నిపుణులు సవివరంగా పరిశీలించి, ఆలోటుపాట్లను సరిదిద్దడానికి తగిన సూచనలు చేయవలసిందిగా కోరుతున్నాను. విద్యార్థి స్వావలంబన సాధించేలా, తన జీవనోపాధిని తానే కలిగించుకునే సామర్థ్యం గల జాతీయ సంక్షేమానికి తోడ్పడేలా విద్యావిధానం, శిక్షణ ఉండాలనేదే నా అభిప్రాయం అదే నా ఆసక్తి. ఒక వ్యక్తి ఇతరులపై ఆధారపడేవాడిగా, లేదా సమాజంపై ఆధారపడే పరాన్న జీవిగా వుండరాదు. ఒక విద్యార్థిని భారతదేశ మహోన్నత సాంస్కృతిక వారసత్వాన్ని పరిరక్షించడానికి ప్రయత్నించే వ్యక్తిగా, తన దేశం మరింత సాధించేందుకు తోడ్పడే విధంగా తీర్చిదిద్దాలనేదే నా ఆకాంక్ష. ప్రస్తుత విద్యావిధానం విద్యార్థి ఈ లక్ష్యాలు సాధించడానికి దోహదం చేసేదిగా లేదనే సంగతి నాకు తెలుసు. ఎవరైనా ప్రముఖులు, నిష్ణాతులు ముందుకు వచ్చి ప్రస్తుత విద్యావ్యవస్థ చట్రాన్ని పూర్తిగా తొలగించకుండా విద్యావ్యవస్థను మెరుగుపరచడానికి సానుకూల చర్యలను సూచించాలని కోరుతున్నాను. ప్రస్తుత విద్యా స్వరూపాన్ని మార్చడం అత్యంత క్లిష్టతర కర్తవ్యం గనుక, మనం ఆశించిన లక్ష్యాలు, ఆశయాలు సమీప భవిష్యత్తులో నెరవేరడానికి విద్యారంగ నిపుణులు – పాలకులు ఆదిశగా ప్రయత్నాలు సాగించాలనికోరుతున్నాను.

# 11. మైసూరులోని దక్షిణాది ప్రాంతీయ భాషా కేంద్రం, భారతీయ భాషల కేంద్ర సంస్థ - ప్రాముఖ్యత

దక్షిణాది ప్రాంతీయ భాషా కేంద్రం ఆరవ వార్షికోత్సవంలో నేను పాల్గొనడం చాలా సంతోషంగా ఉంది. భారతదేశం లాంటి అతి పెద్ద దేశం, విద్యా సాంస్కృతిక విషయాలలో పురోభివృద్ధి సాధించాలంటే హిందీతో సహా, దేశంలో 14 ప్రధాన భాషల పూర్తిస్థాయి అభివృద్ధికి నిర్దిష్టమైన చర్యలు చేపట్టాలనే ఉద్దేశ్యంతో, 1968 సంవత్సరానికి పూర్వమే భారత ప్రభుత్వం భాషా విధానాన్ని ఆమోదించినది. ఇలా ఆమోదించిన భాషా విధానం ప్రకారం, 1969వ సంవత్సరంలో భారతీయ భాషల కేంద్ర సంస్థ (సెంట్రల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ లాంగ్వేజెస్)ను భారత ప్రభుత్వం స్థాపించినది. అల్ప సంఖ్యాక భాషా వర్గాలను దృష్టిలో ఉంచుకొని, త్రిభాషా సూత్రాన్ని అమలు చేయుటకు సుశిక్షితులైన ఉపాధ్యాయుల కోరికలను తీర్చడానికి, ఈ కేంద్ర సంస్థ, మన దేశంలో ఐదు ప్రాంతీయ భాషా కేంద్రాలను మైసూర్, భువనేశ్వర్, పూణె, పాటియాలా మరియు సోలన్‌లలో ప్రారంభించింది. మైసూర్‌లో గల దక్షిణాది ప్రాంతీయ భాషా కేంద్రములో, మిగతా ప్రాంతీయ భాషా కేంద్రాలలో కన్నా, ఎక్కువగా నాలుగు భారతీయ భాషల్లో బోధన జరుగుతున్నది. దేశంలోని మిగతా ప్రాంతీయ భాషా కేంద్రాలలో కేవలం మూడు భాషల్లోనే బోధన జరుగుతున్నది.

హిందీ మాట్లాడే రాష్ట్రంలోని ఉపాధ్యాయులకు హిందీ భాష కాకుండా, ఇంకా ఏదైనా ఒక భారతీయ భాషలో మరియు హిందీ భాష రాని రాష్ట్రాలలోని ఉపాధ్యాయులకు వారి మాతృభాష కాకుండా, భారతీయ భాషల్లో ఏదైనా ఇంకొక భారతీయ భాషలో నైపుణ్యం సాధించేటట్లు చేయడం ఈ ప్రాంతీయ భాషా కేంద్రాల ముఖ్య ఉద్దేశ్యం. ఈ ఉద్దేశ్యాల కనుగుణంగా, ఈ ప్రాంతీయ భాషా కేంద్రాలు సర్వీసులో ఉన్న ఉపాధ్యాయులకు శిక్షణ నిస్తాయి. ఈ శిక్షణలో భాగంగా భాషపై అవగాహన కల్గించి రెండవ భాషను బోధించే పద్ధతులు, పాఠశాల విద్యార్థులతో పాటుగా ఇతరులకు మిగతా భారతీయ భాషలు నేర్చుకోవడానికి అవసరమైన పాఠ్య సామగ్రిని తయారుచేయడం మరియు ఆయా రాష్ట్రాలలో ఉండే ప్రభుత్వానికి ద్వితీయ భాష

పాఠ్య ప్రణాళిక, పాఠ్య పుస్తకాలు వంటివి తయారుచేయడంవంటివి నేర్పుతారు. మిగతా ప్రాంతీయ కేంద్రాలలో 60 మంది ఉపాధ్యాయులకే శిక్షణ ఇప్పించే సౌకర్యం ఉంటే, మైసూర్‌లోని ప్రాంతీయ కేంద్రంలోని 80 మంది ఉపాధ్యాయులకు శిక్షణ ఇప్పించే ఏర్పాటు కలదు. విద్యా రంగాభివృద్ధిని ప్రోత్సహించడంలో మరియు వివిధ రాష్ట్రాలలో అల్ప సంఖ్యాక భాషా వర్గాల వారికి విద్యా సౌకర్యాలు కల్పించడంలో ఈ భాషా కేంద్రాల ప్రాముఖ్యత అంతగా నొక్కి చెప్పాల్సిన పనిలేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు త్రిభాషా సూత్రంగా ఆమోదించిన ప్రధాన విద్యావిధానం వలన, మూడు భాషల్లో శిక్షణ ఇప్పించుటకు సరిపడా సౌకర్యాలను కల్పించే బాధ్యత ప్రభుత్వాల మీద ఉంది. ఈ త్రిభాషా సూత్రం అమలులో విచారించదగ్గ విషయం ఏమిటంటే అయా రాష్ట్రాలలో గల విద్యార్థులకు మాతృభాషతో పాటు ఇతర భారతీయ భాష అదనంగా బోధించే ఉపాధ్యాయులు స్థానికంగా అందుబాటులో లేకపోవడమే. ఈ దేశంలో చెప్పుకోదగ్గ ప్రగతి సాధించుకున్నామంటే అది, కాల స్థల అడ్డంకులను తొలగించుకుంటూ, భాషా పరమైన అడ్డంకులను అధిగమించాం. అప్పట్లో ఇంగ్లీషు భాషను వాడుకుంటూ ఓ సంపన్న వర్గానికి చెందిన భారతీయ వ్యక్తి చాలా సులభంగా మన దేశమంతా చుట్టుముట్టే అవకాశముంది. హిందీ జాతీయ భాషగా గుర్తించిన పిదప, ఇంగ్లీషు స్థానంలో హిందీ భాషను నేర్చుకోవలసిన అవసరం ఏర్పడింది. భారత దేశ జనాభాలో ఎక్కువమంది నిరక్షరాస్యులు కావడం వల్ల, ఒక ప్రాంతం నుండి ఇంకో ప్రాంతానికి త్వరగా చేరుకొనే సౌలభ్యం కారణంగా సామాజిక మరియు ఆర్థిక నిర్బంధాలను తెంచుకొని సమాచారాన్ని చేరవేసుకోవడానికి హిందీ లాంటి భారతీయ భాష ముఖ్య భూమిక వహిస్తుంది. ప్రజలు దేశంలో స్వేచ్ఛగా, సులభంగా ఒక ప్రాంతం నుండి వేరే ప్రాంతానికి వెళ్లాలంటే, వారికి ఇతర ప్రాంతీయ భాషలలో కనీస పరిజ్ఞానం అవసరం. అంతేకాదు, దక్షిణాది భాషల్లో ఒక దానినైనా నేర్చుకోవాలనే జిజ్ఞాస ఉత్తరాది రాష్ట్రాల నుండి స్వచ్ఛందంగా వచ్చినట్లయితే, దక్షిణాది రాష్ట్రాలలో హిందీని జాతీయ భాషగా ఒప్పుకొని, ఉన్న చిన్నపాటి వ్యతిరేకతలను కూడా అధిగమించవచ్చు. ఉత్తరాది రాష్ట్రాలలోని సోదరులు కూడా దక్షిణాది భాషల్లో ఒక భాషనైనా నేర్చుకుంటున్నారనే అవగాహన కల్పించిన నాడు, దక్షిణాది రాష్ట్రాలలో హిందీ భాషను అమలుచేయడంలో తలెత్తుతున్న తప్పుడు ఆలోచనలు లేదా సందేహాలు పటాపంచలు కాగలవు. దక్షిణాది రాష్ట్రాలలోని కొందరు రాజకీయ నాయకులు హిందీ భాషను నేర్చుకోవడంపై ఓ వాదనను ముందుకు తెచ్చారు. అదేమిటంటే ఉత్తరాది

రాష్ట్రాల వారు వారి మాతృభాషగా నున్న హిందీతోపాటుగా, ఇంగ్లీషుభాషను అదనంగా నేర్చుకుంటే సరిపోతుంది. కాని దక్షిణాది రాష్ట్రాలలోని ప్రజలు మూడు భాషలు తప్పని సరిగా నేర్చుకోవడమే కాక, కొంతమంది ప్రజలు అత్యవసర సేవలందించుటకు వేరే చోటికి వెళ్లిన సందర్భంలో వారు నాలుగు భాషలను నేర్చుకోవలసిన అవసరమేర్పడుతున్నది. వారి వాదన ప్రకారం, ఉదాహరణకు, ఆంధ్రప్రదేశ్‌లో పనిచేస్తుండే ఒక మలయాళీకి, సాంకేతిక విద్యలో ఉన్నత చదువు సాగించడానికి తప్పనిసరిగా ఇంగ్లీషు నేర్చుకోవాలి. హిందీ జాతీయ భాష కాబట్టి దానిని నేర్చుకోవాలి. ఆయన ఉంటున్న ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు ప్రాంతీయ భాష కాబట్టి దానిని, మరియు అతని మాతృభాష మలయాళం కాబట్టి దానిని కూడా అతను నేర్చుకోవాలి. అందువల్ల, జాతీయ సమైక్యతను సాధించుటకు, భారత ప్రభుత్వం ఆమోదించిన త్రిభాషా సూత్రాన్ని అంకిత భావంతో అమలు చేయాల్సిన అవసరం ఇప్పుడేర్పడింది. ఒక వ్యక్తి తన మాతృభాష కాకుండా ఇతర భాష నేర్చుకోవడం వల్ల, మిగతా ప్రాంతాలలోని వారితో ఒక రకమైన అనుబంధం ఏర్పడి, జాతీయ సమైక్యతను పెంపొందించుటకు వీలు కల్గుతుంది.

జాతీయ సమైక్యత పెంపొందించే విషయం అటుంచి, ఒక ప్రాంతంలోని విద్యార్థి వేరే ప్రాంతానికి చెందిన ఇంకో భాష నేర్చుకొంటే అల్ప సంఖ్యాక భాషా వర్గాల సమస్య తలెత్తే అవకాశముంది,

ఉద్యోగ రీత్యానో, లేదా వ్యాపార వాణిజ్య అవసరాల రీత్యానో దక్షిణాదిలో ఓ మారుమూలలకు చెందిన ప్రజలు, దేశంలోని ఉత్తరాదిలో కొన్ని ప్రాంతాలలోను, అలాగే ఉత్తరాదిలోని మారుమూలలకు చెందిన ప్రజలు, దక్షిణాదిలోని కొన్ని ప్రాంతాలలో నివసించడం సర్వసాధారణ విషయమేమీ కాదు. ఇలాంటి అల్ప సంఖ్యాకభాషా వర్గానికి చెందిన వారు, వారి మాతృభాషను నేర్చుకోవడానికి తగిన సౌకర్యాలు పొందాలని ఆశిస్తారు. పంజాబ్ రాష్ట్రంలో నివసించే ఆంధ్రప్రదేశ్‌కు చెందిన అబ్బాయికి హిందీ, పంజాబీ భాషలు నేర్చుకోవడానికి అవకాశాలు ఉంటాయి. కానీ అతని తల్లిదండ్రులు అతని మాతృభాషను నేర్పించడానికి గల అవకాశాలను గురించి తరచూ ఆందోళనకు గురౌతుంటారు. తల్లిదండ్రులకు వారి మాతృభాషలపై పట్టుకోల్పోవడం లేదా వారి మాతృభాషలు బోధించుటకు తగు సమయం లేకపోవడం వంటి కారణాల వల్ల, మాతృభాషను నేర్పించడానికి గల అవకాశాలు దాదాపు కనుమరుగైపోతాయి. తమ పిల్లలకు మాతృభాషలో విద్య నందించాలనే ప్రాథమిక అవసరం ప్రాతిపదికగా ఇతర

రాష్ట్రాలలోని అల్ప సంఖ్యాక భాషా సమూహాలన్ని ఓ సంఘంగా ఏర్పడతాయి. ఇలాంటి సంఘాలు ఏర్పడడానికి అవకాశం కల్పిస్తే, వారు ఆయా రాష్ట్రాలలోని జన జీవన స్రవంతిలో కలవడానికి బదులు వారి అల్ప సంఖ్యాక భాషా కార్యకలాపాలను ముమ్మరం చేస్తారు. ప్రస్తుత పరిస్థితులలో అలాంటి చర్యల్ని అరికట్టడానికి ఎవరి వద్దా సహేతుకమైన వాదన కన్పించడం లేదు. ఇతర రాష్ట్రాలలో ఇలాంటి అల్ప సంఖ్యాక భాషా వర్గాల వారికి తమ మాతృభాషను నేర్పే అవకాశాలను ఎప్పుడైతే కల్పిస్తామో, అప్పుడు వారు ఆయా ప్రాంతాలలోని ప్రజల జన జీవన స్రవంతిలో కలసిపోతారని నమ్ముతున్న వాళ్లల్లో నేనూ ఒకడిని.

మనది సంకుచిత ఆర్థిక విధానం కాదు. వృత్తి, వ్యాపారం వగైరా పనుల రీత్యా ప్రజలు దేశంలోని ఒక ప్రాంతం నుండి వేరే ప్రాంతానికి తరలి వెళ్తుంటారు. అలాంటి వారికి మాతృభాషతోపాటు, వారు తరలి వెళ్లిన ప్రాంతంలో మాట్లాడేభాషపై కనీస పరిజ్ఞానం కల్గి ఉంటే, వారికి చాలా సులువవుతుంది. ఉదాహరణకు, ఓ పంజాబీ వృత్తిరీత్యానో, లేదా వ్యాపార రీత్యానో ఆంధ్రప్రదేశ్‌కు వస్తే, అతనికి తెలుగులో కనీస పరిజ్ఞానం ఉంటే, అతని పనులు చక్కబెట్టుకోవడం చాలా తేలికవుతుంది. అలాగే ఆంధ్రప్రదేశ్ నుండి వ్యవసాయం చేయడానికి కర్ణాటకకు వెళ్లిన వానికి, కన్నడ భాషలో కనీస పరిజ్ఞానం ఉంటే అతనికి వ్యవసాయం చేయడం సులభమవుతుంది. అందువల్ల, మాతృభాష కాకుండా, ఇతర భాషలు నేర్చుకోవడంవల్ల జీవనం మరింత సుఖప్రదమవుతుంది. త్రిభాషా సూత్రం విజయవంతంగా అమలు చేయాలంటే దీనిని పరిగణలోకి తీసుకోవలిసి ఉంది.

ఈ కేంద్రంలో శిక్షణ పొందుతున్న ఉపాధ్యాయుల విషయానికొస్తే, ఈ కేంద్రంలో ఇప్పటికే 390 మంది ఉపాధ్యాయులు శిక్షణ పొందారని మరియు అలా శిక్షణ పొందిన ఉపాధ్యాయులే, ఈ కేంద్రంలోకి వచ్చే ఉపాధ్యాయులకు శిక్షణ ఇస్తున్నారన్న విషయం తెలుసుకొని చాలా సంతోషించాను. వివిధ ప్రభుత్వాలు ఉన్నత విద్య అభ్యసించుటకు దేశంలోని మరియు ఇతర దేశాలకు పంపిస్తాయి. తీరా ఉన్నత విద్యను అభ్యసించి తిరిగొచ్చిన పిదప, వారిని వారు నేర్చుకున్న విషయాలకు సంబంధంలేని పోస్టులలో నియమిస్తుంటారు. ఈ సంస్థలో శిక్షణ పొందిన ఉపాధ్యాయుల సేవలను, శిక్షణ పొందుటకు వచ్చే ఉపాధ్యాయులకు, సంబంధిత భాషల్లో శిక్షణ ఇప్పించుటకు ఉపయోగించుకుంటే మంచిదని నేను భావిస్తున్నాను. లేకపోతే మొత్తం శిక్షణా కార్యక్రమం వృథా అవుతుంది. విదేశాలలో శిక్షణ పొందిన

మనవాళ్ల సమాచారాన్ని అనగా వారు ఏఏ భాషల్లో ప్రావీణ్యత సంపాదించారో, వారి సేవలు ఏ విధంగా ఉపయోగపడగలవో అనే అంశాల్ని ఐక్యరాజ్యసమితికి తెలియజేస్తున్నారని తెలిసింది. ఈ దక్షిణాది ప్రాంత భాషాకేంద్రంలో శిక్షణ పొందిన ప్రతి వారి సమాచారాన్ని ఎప్పటికప్పుడు పొందుపరచే ఏర్పాట్లు చేస్తే, ఈ శిక్షణా కేంద్రం నుండి గరిష్ఠ ప్రయోజనాన్ని ఎప్పటికప్పుడు పొందుపరచే ఏర్పాట్లు చేస్తే, ఈ శిక్షణా కేంద్రం నుండి గరిష్ఠ ప్రయోజనాన్ని పొందవచ్చు. సంస్థాగతంగా చూస్తే, చదవడం ద్వారా ఒక భాషను మాట్లాడడం కష్టం, అదే రాయడం సులభం. మాట్లాడే భాషకు, మనం రాసే భాషకు కొద్దిగా తేడా ఉంటుందన్నది నా అభిప్రాయం. ఒక భాషను రాసినది ఉన్నది ఉన్నట్లుగా మనం మాట్లాడలేం. తెలుగులో గాని లేదా కన్నడంలో గాని రాసిన ఒక వ్యాసాన్ని మనం ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడితే అది పూర్తిగా అర్థం కాదు. మాట్లాడే భాష అందుకు కొంచెం భిన్నంగా ఉంటుంది. నేనేం చెప్పదలచుకున్నానంటే, ఇక్కడ శిక్షణ పొందిన ఉపాధ్యాయులు, ఆ తర్వాత ఈ సంస్థలోని విద్యార్థినీ విద్యార్థులకు శిక్షణ ఇచ్చేటప్పుడు, వారు ఆయా భాషల్లో చదవడంలో, వ్రాయడంలో, మాట్లాడంలో నిష్ణాతులై యుండాలి. ఈ శిక్షణా కార్యక్రమాల్లో వారికి అవసరమైన మాట్లాడే నైపుణ్యం సంపాదించడంలో ఏమైనా ప్రత్యేక శిక్షణా పద్ధతులున్నాయో లేదో నాకు తెలియదు కాని, వాస్తవంగా అలాంటి పద్ధతులు ఆచరణలో లేకపోతే ఇబ్బంది కలుగుతుంది. అందువల్ల, మాట్లాడే భాషపై మనం ఎక్కువ దృష్టి సారించాలని నేను సూచిస్తున్నాను. ఈ కేంద్ర సంస్థలోని భాషా నిపుణులకు ఇక్కడ భాషా సమస్యలపై అవగాహన ఉందని నేనీ కేంద్ర సంస్థను సందర్శించడం వల్లనే తెలిసింది.

ప్రస్తుతం ఇక్కడ శిక్షణ పొందుతున్న బ్యాచ్‌లోని 96 మందిలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన వారు 41 మంది ఉన్నారని తెలిసి చాలా ఆనందం కలిగింది. ఈ కేంద్రంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నుండి చాలా ఎక్కువ మంది ఈ కేంద్రంలోని అవకాశాలను వినియోగించుకుంటున్నారని తెలిసి చాలా సంతోషిస్తున్నాను. అంతేకాకుండా, ఇక్కడకు విచ్చేసిన శిక్షణార్థులలో మూడోవంతు తెలుగు భాష నేర్చుకుంటున్నారని తెలిసి ఇంకా ఆనందిస్తున్నాను. కన్నడ, తెలుగు భాషల మధ్య చాలా దగ్గర పోలికలుంటాయి. కన్నడ భాషను నేర్చుకోవాలనే కుతూహలం చాలామంది తెలుగువారిలో ఉంటే, కన్నడ భాష నేర్చుకోవడం పెద్ద కష్టమేమీ కాదు. మన తెలుగు విద్యార్థులు ఉత్తరాది రాష్ట్రాల భాషలను కూడా నేర్చుకుంటే మంచిదని నా వ్యక్తిగత అభిప్రాయం. తెలుగు ఉపాధ్యాయులు, సోదర రాష్ట్రాల భాషలైన తమిళం, కన్నడ భాషలను నేర్చుకోవడానికి

ప్రత్యేక ఆసక్తిని కనబరచాలి. ఎందుకంటే, మరాఠీ, కాశ్మీర్, పంజాబీ మొదలైన భాషల్లో నైపుణ్యం సాధించడం కన్నా, తమిళ, కన్నడ భాషల్లో నైపుణ్యం సాధించడం చాలా సులభం.

ఈ భాషల్లో ప్రావీణ్యం సంపాదించుటకు మన అబ్బాయిలు ఇతర ప్రాంతీయ కేంద్రాలకు వెళ్లాల్సిన అవసరమున్నదని నేను నమ్ముతున్నాను. ఈ విషయంలో నా దగ్గర సమాచారమేదీ లేదు కాని, వారు వారంతట వారే ఈ అవకాశాలను సద్వినియోగం చేసుకోగలరని భావిస్తున్నాను. నా దగ్గరున్న శిక్షణార్థుల వివరాలను చూస్తే, మిగతా ప్రాంతాల నుండి వచ్చిన వారు చాలా తక్కువమంది ఉన్నారు. నిజానికి ఈ దక్షిణ ప్రాంతీయ భాషా కేంద్రం మిగతా ప్రాంతాల నుండి పెద్ద సంఖ్యలో శిక్షణార్థులను ఆకర్షించగలిగి ఉంటే, వారికి దక్షిణాది భాషలపై పట్టు సాధించే అవకాశం కలిగేది. మనం ప్రారంభ దశలో ఉన్నాం కాబట్టి, రాబోయే సంవత్సరాలలో దక్షిణ ప్రాంతీయ భాషా కేంద్రం ఇతర ప్రాంతాలలోని శిక్షణార్థులను పెద్ద సంఖ్యలో ఆకర్షించే అవకాశం కలదని నేను భావిస్తున్నాను.

విజయవంతంగా ఇక్కడ శిక్షణ పూర్తి చేసిన వారికి, మరలా వారు శిక్షణ పొందిన భాషల్లో తదుపరి శిక్షణా కార్యక్రమాలు విస్తరించాలని నా విజ్ఞప్తి. భాషాపరమైన ఇబ్బందులను మొదట తొలగించుకుంటే భిన్నత్వంలో ఏకత్వం సాధించడం సాధ్యం కనుక, చాలామంది మన స్నేహితులకు ఇలాంటి అవకాశాలను వినియోగించుకునేలా మనం ప్రోత్సహించాలి. విజయవంతంగా శిక్షణ పూర్తి చేసుకున్న వారికి, వారు చేపట్టిన రంగాలలో, ఉజ్జ్వల భవిష్యత్తు ఉండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. ముఖ్యంగా ఇలాంటి ఆహ్లాదకరమైన వేడుకలలో మీ అందరి మధ్యలో ఉండే అవకాశాన్ని నాకిచ్చిన డాక్టర్ పట్నాయక్ గారికి నా ధన్యవాదాలు.

# 12. విద్యారంగంలో ఆంధ్రప్రదేశ్ సాధించిన గణనీయ ప్రగతి

విద్యారంగంపై చేసే వ్యయం వల్ల అధిక ప్రయోజనం చేకూరుతుంది. అయితే ఈ ఫలితాలు వెంటనే మనకు ప్రత్యక్షంగా కనుపించకపోవచ్చును. రాజ్యాంగం పొందుపరచుకున్న మహత్తర ఆశయాలకు అనుగుణంగా మన సమాజాన్ని తీర్చిదిద్దడంలో విద్య ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. వాస్తవానికి మానవాభ్యుదయం విద్యారంగం పురోగతి మీదనే ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. కాబట్టి విద్య అనేది నవ సమాజ నిర్మాణానికి పునాది వంటిది. ఈ సత్యాన్ని అందరూ గుర్తించారు. మన రాజ్యాంగంలోని ఆదేశ సూత్రాలలో నిర్బంధ-ఉచిత ప్రాథమిక విద్య ఒక ముఖ్య అంశంగా పొందుపరచుకున్నాం.

విద్యారంగంలో అభివృద్ధి జరుగుతున్నప్పుడు విద్యావ్యాప్తితో పాటు విద్యా ప్రమాణాలు కూడా ఇతోధికం కావడం అవసరం. విద్యావ్యాప్తి జరగటం వల్ల ప్రతివారు చదువుకోడానికి అవకాశాలు పెరుగుతాయి. విద్యాప్రమాణాలు ఇనుమడించినప్పుడు సమాజం పట్ల వ్యక్తికి ఉండే బాధ్యతలు నిర్వహించడానికి వీలు కలుగుతుంది.

విద్యారంగంలో ఆంధ్రప్రదేశ్ గణనీయమైన ప్రగతి సాధించింది. ఈనాడు విద్యారంగంపై మనం దాదాపు రు. 120 కోట్లు వ్యయం చేస్తున్నాం. అంటే రాష్ట్ర ప్రభుత్వ వనరులలో చాలా భాగం ప్రజల విద్యావసరాలు తీర్చేందుకు వినియోగిస్తున్నామన్నమాట. అయితే నానాటికి పెరుగుతున్న ఈ అవసరాలకు ఇంత పెద్ద మొత్తము కూడా సరిపోవడం లేదు. మనలో అక్షరాస్యుల శాతం చాలా తక్కువ. ఈ శాతం పెంచాలంటే విద్యారంగంపై ఎక్కువపెట్టుబడి కావలసి ఉంటుంది. కాని, అభివృద్ధి అన్ని రంగాలలోనూ జరగవలసి ఉన్నది. అందుచేత విద్యారంగంలో అభివృద్ధి కొంత నెమ్మదిగా జరిగేందుకు అంగీకరించక తప్పడం లేదు.

**ప్రాథమిక విద్య**

1 నుంచి 5 వరకు - అంటే ప్రాథమిక తరగతులందు - నాల్గవ ప్రణాళిక చివరినాటికి 6-11 సంవత్సరాల వయస్సుగల పిల్లలను 75 శాతం చేర్చడం జరిగింది. ఐదవ ప్రణాళిక చివరినాటికి దీనిని 90 శాతానికి పెంచాలని మన సంకల్పం. అంటే

మగ పిల్లలు 100 శాతం, ఆడపిల్లలు 80 శాతం. ఈ లక్ష్యాన్ని సాధించేందుకు ఈ ప్రణాళికా కాలంలో అదనంగా మనకు 30 వేల మంది ఉపాధ్యాయులు కావలసి ఉంది. ఇందుకు ఎంతో వ్యయం అవుతుందని వేరుగా చెప్పనవసరం లేదు. అయినప్పటికీ దీనిని అమలు పరచాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. 11-13 సంవత్సరాల వయస్సు పిల్లలో అప్పర్ ప్రైమరీ పాఠశాలలందు చేరే వారి శాతం 31 మాత్రమే. ఈ ప్రణాళిక చివరినాటికి ఈ శాతం 40 వరకు పెంచాలని మన ఉద్దేశ్యం. ఇందుకు అదనంగా 18 వేలకు పైగా ఉపాధ్యాయులను నియమించవలసి ఉంటుంది. ఆదివాసుల పిల్లలు చదువుకొనేందుకు ప్రత్యేక సదుపాయాలు కలుగచేసే ఆవశ్యకతను రాష్ట్ర ప్రభుత్వం గుర్తించింది. వీరికి ఆశ్రమ పద్ధతి పాఠశాలలు అనుకూలంగా ఉంటాయని భావించడం చేత అటువంటి పాఠశాలలు 261 ప్రారంభించాం. వెనుకబడిన తరగతులవారి పిల్లలకు - ముఖ్యంగా కోస్తా జిల్లాల్లో బెస్తవారి పిల్లలకు కూడా ఇటువంటి సౌకర్యం కలుగజేసే నిమిత్తం వారి కోసం ఈ మాదిరి ఆశ్రమ పాఠశాలలు నెలకొల్పే ప్రతిపాదన ఒకటి ఉన్నది.

మన దేశంలో పేద ప్రజలు అధికంగా ఉన్న సంగతి అందరికీ తెలిసినదే. తమ పిల్లలకు చదువు చెప్పించే స్తోమత వీరికి లేదు. కుటుంబం గడవటం కోసం వీరి పిల్లలు ఎంతో కొంత సంపాదించవలసి ఉంటుంది. అందుచేత ఈ పిల్లలకు పుస్తకాలు, దుస్తులు, హాజరు స్కాలర్‌షిప్‌లు రూపంలో ప్రోత్సాహకాలు సమకూరుస్తున్నాం. ఈ ప్రణాళికా కాలంలో రు. 2.09 కోట్లు ఇందుకోసం వినియోగించేందుకు తలపెట్టాం. ఈ పథకం మూలంగా దాదాపు 16 లక్షల మంది మగపిల్లలకు 5 లక్షల మంది ఆడపిల్లలకు ప్రయోజనం సమకూరుతుంది. 'కేర్' సంస్థ సహాయంతో రాష్ట్రంలో మధ్యాహ్న భోజన కార్యక్రమం కూడా అమలు జరుగుతున్నది. ఈ కార్యక్రమం చాలా ఉపయోగకరంగా ఉన్నది. పిల్లల పోషక ఆహార ప్రమాణాలు పెరగడమే కాకుండా, వారు సరిగా బడులకు హాజరు అయ్యేటట్లు చేయడంలో కూడా ఇది తోడ్పడుతున్నది. వెంటనే తినడానికి వీలున్న ఆహార పదార్థాలను తయారుచేసే కర్మాగారాన్ని హైద్రాబాదు సమీపంలో నాచారం వద్ద నెలకొల్పేందుకు మనం ఒక కార్యక్రమం రూపొందించుకున్నాం. కేర్, యునిసెఫ్ సంస్థలు ఇందుకు తోడ్పాటు అందిస్తున్నాయి.

రోజుకు ఇక్కడ 40 టన్నుల ఆహార పదార్థాలు ఉత్పత్తి అవుతాయి. వీటిని ప్రాథమిక పాఠశాలలో చదువుకొంటున్న 4 లక్షల మంది పిల్లలకు అందజేయడానికి వీలుంటుంది.

మన రాష్ట్రంలో క్రిందటి ఏప్రిల్ 1వ తేదీ నుంచి మరొక ఆధునిక సదుపాయం కూడా ఏర్పడిన సంగతి శ్రోతలకు తెలిసిందే. ఉపగ్రహం సహాయంతో టెలివిజన్ ద్వారా విద్యా బోధన చేసే ఏర్పాట్ల వల్ల హైదరాబాదు, మెదక్, మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లాలలో 40 గ్రామాలకు ప్రయోజనం కలుగుతుంది. ప్రాథమిక తరగతులకు ప్రతిరోజు 20 నిమిషాలపాటు టెలివిజన్ ద్వారా పాఠాలు బోధిస్తారు. ఇంతేకాకుండా సాయంత్రంపూట గ్రామస్థుల కోసం 40 నిమిషాలపాటు ఇతర కార్యక్రమాలు ప్రసారమవుతాయి. ఈ ఏర్పాట్ల వల్ల మామూలు విద్యా సౌకర్యాలు ఇనుమడింప చేయడమేకాకుండా బడులలో చేరని 6-14 సంవత్సరాల వయస్సు గల పిల్లలకూ బడులలో చదువుకొనే అవకాశం లేని 16-25 సంవత్సరాల యువకులకు కూడా ప్రయోజనం ఉంటుంది. ప్రస్తుత సంవత్సరంలో ప్రభుత్వం ఇందుకోసం రు. 3.25 లక్షలు కేటాయించింది. విద్యాపరిశోధనా శిక్షణ వ్యవహారాల రాష్ట్ర మండలికి ఈ కొత్త విద్యాసౌకర్యాలు అందచేసే బాధ్యత అప్పగించబడింది.

ప్రతి సంవత్సరం ఎన్నో విద్యాలయాలు నెలకొల్పుతున్నాం. అందుకు తగినట్లు ఉపాధ్యాయుల శిక్షణ కోసం 12 ఉపాధ్యాయ శిక్షణ సంస్థలు కూడా ప్రారంభించాం.

## సెకండరీ విద్య

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఉన్నత పాఠశాల విద్యారంగంలో కూడా మనం గణనీయమైన ప్రగతిని సాధించాం. 1956-57 నాటికి మనరాష్ట్రంలో 733 ఉన్నత పాఠశాలలు మాత్రమే ఉండేవి. ఇందులో చదివే విద్యార్థుల సంఖ్య 2.01 లక్షలు 4వ ప్రణాళిక చివరి నాటికి ఈ పాఠశాలల సంఖ్య 3259కి పెరిగింది. వాటిలో 4.76 లక్షల మంది విద్యార్థులు చదువుతుండేవారు. 13-16 వయస్సుగల మగ పిల్లలో 30 శాతం ఆడపిల్లలలో 10 శాతం ఈ పాఠశాలలకు వెళ్ళేవారు. బడికి వెళ్ళే ఈ పిల్లల శాతాన్ని 24 శాతం పెంచాలని ఉద్దేశిస్తున్నాం. దీనికి గాను కొత్తగా 200 ఉన్నత పాఠశాలలు అవసరమవుతాయి. దీనికి తోడు ఇప్పుడున్న పాఠశాలలలో ఉపాధ్యాయుల సంఖ్యను పెంచవలసి ఉంటుంది. కాబట్టి అదనంగా దాదాపు 4 వేల మంది ఉపాధ్యాయులను నియమించవలసి వస్తుంది. గ్రామీణ ప్రాంతాలలో మంచి తెలివి తేటలున్న పిల్లలకు ప్రత్యేక సదుపాయాలు సమకూర్చవలసిన అవసరాన్ని కూడా రాష్ట్ర ప్రభుత్వం గుర్తించింది. తగిన సదుపాయాలు లేనందువల్ల ఈ పిల్లలు చాలా కాలంగా ఉపేక్షకు గురికావలసి వచ్చింది. నల్గొండ జిల్లా సర్వేపల్లి, గుంటూరు జిల్లా, తాడికొండ, అనంతపురం జిల్లా కొడిగినహళ్ళిలలో నివాస పాఠశాలలను

నెలకొల్పాం. ఇందుకోసం ప్రత్యేకంగా ఏర్పరచిన ఒక సంఘం వీటిని నిర్వహిస్తున్నది. ఈ పాఠశాలలు ఎంతో బాగా పనిచేస్తున్నాయి. సెకండరీ విద్యామండలి ప్రకటించిన ఎస్.ఎస్.సి. పరీక్షా ఫలితాలను పరిశీలించినట్లయితే తగు అవకాశాలు కల్పించినప్పుడు గ్రామీణ ప్రాంతాలకు చెందిన పిల్లలు కూడా ఎంతో పైకి రాగలరని రుజువైంది. ఈ పాఠశాలలు సాధించిన సత్ఫలితాలను పురస్కరించుకొని మరికొన్ని నివాస పాఠశాలలను ప్రారంభించేందుకు సంకల్పించాం. ఆదివాసి పిల్లలకోసం ఈ సంవత్సరం ఖమ్మం జిల్లా కిన్నెరసాని డాము ప్రాంతంలో ఒక నివాస పాఠశాల ప్రారంభిస్తున్నాం. హరిజనుల పిల్లల నిమిత్తం వేరొక నివాస పాఠశాలను నెలకొల్పుటకు ఆలోచిస్తున్నాం.

**జూనియర్ కళాశాలలు**

15 సంవత్సరాల విద్యాపద్ధతికి సంబంధించి కొఠారి సంఘం చేసిన సూచనలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆమోదించింది. దీని ప్రకారం 1969-70లో మనం ఇంటర్మీడియెటు కోర్సును ప్రవేశపెట్టాం. 1974-75 చివరినాటికి మన రాష్ట్రంలో పనిచేస్తున్న జూనియరు కళాశాలలు 264. ఈ సంవత్సరం మరో 32 కళాశాలలను నెలకొల్పాం. ప్రతి తాలూకాకు కనీసం జూనియరు కళాశాల ఒకటైనా ఉండాలన్నది ప్రభుత్వ ఉద్దేశ్యం. 13 తాలూకాలలో తప్ప తక్కినవాటి అన్నింటిలోనూ జూనియర్ కళాశాలలు ఉన్నాయి. రాబోయే 2-3 సంవత్సరాలలో మన ఆశయం పూర్తిగా నెరవేరగలదు. నాగార్జున సాగర్ వద్ద నివాస పద్ధతిలో పనిచేసే జూనియర్ కళాశాలను ఏర్పాటు చేయటం జరిగింది. లోగడ నివాస పాఠశాలలలో చదివిన విద్యార్థులకు, ఇతరులకు ఇది ఉపయోగపడుతుంది.

ఇంటర్మీడియట్ స్థాయిలో ఉద్యోగ దోహదమైన కోర్సులను ప్రవేశపెట్టే విషయం ఆలోచనలో ఉన్నది. దీనివల్ల వివిధ కోర్సులు చదివేవారు వీలైన వృత్తులను స్వీకరించడానికి అవకాశం ఉంటుంది. ఈ సంవత్సరం హైదరాబాదులోని ప్రభుత్వ ఆలియా జూనియర్ కళాశాలలోనూ, చిత్తూరు, రాజమండ్రిలలోని ప్రభుత్వ జూనియరు కళాశాలలలోనూ ఈ కోర్సు ప్రవేశపెట్టడం జరిగింది. నాంపల్లిలోని బాలికల ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ఉపాధ్యాయ శిక్షణ కోర్సును ప్రవేశపెట్టాలని సంకల్పిస్తున్నాం.

విశ్వవిద్యాలయ విద్యకు సంబంధించి కూడా మనం మంచి అభివృద్ధి సాధించగలిగాం. 1956-57 నాటికి రాష్ట్రంలో ఉన్న డిగ్రీ కళాశాలలు 50 మాత్రమే. 1974-75 నాటికి వీటి సంఖ్య 214కు పెరిగింది. ఈ సంవత్సరం ఒక ప్రభుత్వ కళాశాలను ప్రారంభించాం. ప్రైవేటు రంగంలో 161 కళాశాలలు ఏర్పాటు అయ్యాయి.

కర్నూలులో ప్రభుత్వ రజతోత్సవ కళాశాల స్థాపించాం. ఇది ప్రతిభావంతులైన విద్యార్థుల కోసం ఉద్దేశించినట్టిది. ఇప్పుడున్న 3 విశ్వవిద్యాలయాలు కాక- వరంగల్లులో ఒకటి, గుంటూరులో మరొకటి - రెండు విశ్వవిద్యాలయాలు నెలకొల్పాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఇందుకు సంబంధించిన చర్యలు పూర్తి అయ్యాయి. త్వరలోనే భారత ప్రభుత్వం నుంచి అనుమతి లభించి ఈ విశ్వవిద్యాలయాల నిర్వహణకు కావలసిన నిధుల ఏర్పాటు కూడా జరిగింది. హైదరాబాదులో కేంద్ర విశ్వవిద్యాలయం స్థాపించబడింది. దీనివల్ల రాజధాని నగరంలో విశ్వవిద్యాలయ స్థాయిలో విద్యా సౌకర్యాలు ఇతోధికం కాగలవు.

విద్యార్థులకు కలుగజేసిన ఈ సౌకర్యాలను వారు సద్వినియోగం చేసుకోవడం ఎంతైనా అవసరం. ఇందుకు విద్యార్థులలో మంచి క్రమశిక్షణ, విద్యపట్ల శ్రద్ధాసక్తులు అలవడాలి. ఉపాధ్యాయులలో సేవానిరతి మిక్కిలి ఆవశ్యకం. కొంత కాలంగా విద్యార్థులలో తమ చదువుల పట్ల శ్రద్ధాసక్తులు లోపిస్తున్నట్లు, ఉపాధ్యాయులు తమ విధ్యుక్త ధర్మాన్ని ఉపేక్షిస్తున్నట్లు గమనిస్తున్నాం. తత్ఫలితంగా విద్యార్థులు అక్రమ పద్ధతులకు పాల్పడుతున్నారు. ఉపాధ్యాయులలో ఉదాసీన భావం పెరిగింది. ఉపాధ్యాయుల పట్ల ఉండవలసిన గౌరవ ప్రపత్తులు సన్నగిల్లాయి. కాబట్టి వీటిని తిరిగి వర్ధిల్లజేసి ఈ దేశభవిష్యత్తును తీర్చిదిద్ద వలసిన బాధ్యత ఉపాధ్యాయులపై ఉన్నది. ఈనాడు వారు గురుతర బాధ్యత వహించాలి. మనం కలుగజేసుకున్న సౌకర్యాలను పూర్తిగా వినియోగించుకొని విద్యార్థులకు ఉత్తమ విద్య అందించక పోయినట్లయితే వారు విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దలేరు.

ఉపాధ్యాయుల కోసం ప్రభుత్వం పెక్కు సంక్షేమ చర్యలు ప్రవేశపెట్టింది. అయితే చేయవలసింది ఇంకా చాలా ఉన్నదని నేను ఎరుగుదును. కాని ప్రజల శ్రేయస్సుపైననే తమ శ్రేయస్సు ఆధారపడి ఉన్నదని ఉపాధ్యాయులు గుర్తించవలసి ఉంటుంది. ఈ సందర్భంలో విద్యార్థులను కోరేదేమిటంటే వారు తమ చదువుల పట్ల ఎక్కువ శ్రద్ధాసక్తులు చూపాలి. విజ్ఞాన సముపార్జనకు అత్యుత్తమమయిన సమయం విద్యార్థిదశ కాబట్టి సమాజ శ్రేయస్సుకు వారు మున్ముందు తోడ్పడాలంటే ఇప్పుడు ఉత్తమ విజ్ఞానం ఆర్జించుకోవాలి. ప్రభుత్వం సౌకర్యాలు సమకూరుస్తున్నది. వీటిని సద్వినియోగం చేసుకొనే వంతు విద్యార్థులది, ఉపాధ్యాయులది. వాటిని విద్యార్థులు, ఉపాధ్యాయులు, సద్వినియోగపరచుకొని సమాజ శ్రేయస్సుకు దేశాభ్యుదయానికి తోడ్పడగలరని విశ్వసిస్తున్నాను.

# 13. పన్నెండు సూత్రాల కార్యక్రమము

**ప్రస్తావన :**

యువతరం భవిష్యత్తును తీర్చిదిద్దడంలో విద్యాసంస్థలకు చాలా ప్రాధాన్యత వుంటుంది. అంతేకాదు. సాంఘికమైన మార్పును తీసుకురావడంలో కూడా ఇవి ముఖ్యపాత్ర వహిస్తాయి. విద్యార్థులకు శిక్షణ ఇచ్చేటప్పుడు వారిలో క్రమశిక్షణను, సద్వర్తనను వర్ధిల్లచేసేందుకు ప్రత్యేక కృషి జరుగవలసి వున్నది. ఉపాధ్యాయులు, అధ్యాపకులు, విద్యాసంస్థల అధిపతులు, పాలనాధికార్లు ఇతరులకు మార్గదర్శకంగా వుండాలి. అందుకోసం తమలో కూడా క్రమశిక్షణను, సద్వర్తనను ఇనుమడింప చేసుకోవలసిన ఆవశ్యకత గురించి వారు తీవ్రంగా ఆలోచించాలి. ఒక కార్యక్రమాన్ని నిర్ణయించుకుని, దానిని దీక్షతో సక్రమంగా అమలు పరచడం ప్రస్తుత దేశ పరిస్థితుల దృష్ట్యా ఎంతైనా ముఖ్యం.

అన్ని విద్యాసంస్థలలోనూ, అన్ని పరిపాలనా స్థాయిలందును అమలు పరచవలసిన కనీస కార్యక్రమం ఈ దిగువ ఇవ్వబడింది :

**హాజరు ప్రవర్తనా నియమావళి**

(1) విద్యార్థులు, ఉపాధ్యాయులు, అధికార్లు ప్రతిరోజూ సకాలంలో హాజరు కావాలి. ఆ విధంగా హాజరు కాని వారి విషయంలో తగు చర్య తీసుకోవడం అవసరం.

(2) వారంతా ఒక ప్రవర్తనా నియమావళిని పాటించాలి. ఈ నియమావళికి అనుగుణంగా తమ తమ కార్యరంగాలలోనూ, వెలుపల కూడా చిత్తశుద్ధితో, క్రమశిక్షణతో, కార్యనిరతితో కష్టించి పనిచేయాలి.

**బోధనా కార్యక్రమాలు**

(3) ఉపాధ్యాయులు బోధనకు సంబంధించి సంవత్సరానికి, నెలకు, వారానికి వర్తించే ప్రణాళికలను సిద్ధం చేసుకుని, గడువు నిర్ణయించిన కార్యక్రమం ప్రకారం వాటిని పూర్తి చేయాలి.

(4) విద్యార్థులకు వివిధ పాఠ్యాంశాలలో నిత్యం చదువవలసిన వాటిని ఇంటి వద్ద చేయవలసిన వాటిని చెప్పి వాటిని ఎప్పటికప్పుడు సరిచూసి దిద్దుబాటు చేయాలి. వెనుకబడివున్న విద్యార్థులకు ఉపాధ్యాయులు తోడ్పాటునందివ్వాలి. చురుకైన విద్యార్థులకు విద్యా సంబంధంగా తగిన పనులు అప్పగించాలి.

**విద్యా కార్యకలాపాలు**

(5) విద్యాసంబంధమైన అనుబంధ కార్యక్రమాలలోను, బోధనేతరమైన కార్యకలాపాలలోను ఉపాధ్యాయులు ఎక్కువ శ్రద్ధ వహించాలి. విద్యార్థులు శ్రమ గౌరవం, సహకార దృక్పథం, సంఘీభావం, సమిష్టి చైతన్యస్ఫూర్తి పెంపొందించుకునేందుకు దోహదం చేసే కార్యక్రమాలు నిర్వహించడంలో వారికి ప్రోత్సాహమివ్వాలి. చర్చా సమావేశాలు జరపడం, 'నేటి సూక్తి' గురించి ఆలోచింపచేయడం, దినసరి వార్తలు వ్రాయించడం మొదలైనవి చేపట్టవచ్చును. పాఠశాల ప్రచురించే పత్రికకు విద్యార్థులు రచనలు అందజేసేటట్లు చూడటం కూడ ప్రయోజనకరమే. విద్యార్థి జీవితం అంతటా బాలబాలికలు సూత్రప్రాయంగానూ, ఆచరణ గతంగానూ జీవితపు ప్రజాస్వామ్య విలువలను గుర్తించేటట్లు చేయాలి.

**పరీక్షలు**

(6) పబ్లికు పరీక్షలకు వెళ్లే విద్యార్థులకు పాఠాలను కనీసం ఫిబ్రవరి చివరినాటికైనా పూర్తి చేయాలి. దీని వల్ల మార్చి-ఏప్రిలు మాసాలలో ఈ పరీక్షలన్నీ జరిపేందుకు వీలుపడుతుంది. రాష్ట్రంలో ఎట్టి అంతరాయం లేకుండా విద్యాసంవత్సరాలను సక్రమంగా కొనసాగించడంకోసం ఈ గడువు పాటించేందుకు శాయశక్తులా కృషి చేయాలి.

(7) తరగతి పరీక్షలకు త్రైమాసిక, అర్ధసంవత్సర, సంవత్సర పరీక్షలకు సంబంధించి ముందుగానే కార్యక్రమం నిర్ణయించుకొని ఆ ప్రకారం జరిపేందుకు అవసరమైన అన్ని చర్యలు తీసుకోవాలి. పాఠశాల స్థాయిలో జరిగే పరీక్షలలో కూడా విద్యార్థులు అక్రమ పద్ధతులకు పాల్పడే ధోరణిని అరికట్టేందుకు కట్టుదిట్టమైన చర్యలు గైకొనాలి. పబ్లికు పరీక్షలలో అక్రమ పద్ధతులేవీ లేకుండా చేయడం కోసం విద్యా సంస్థల బోధనా సిబ్బంది అప్రమత్తతతో వ్యవహరించడం, సకాలంలో తగు చర్య గైకొనడం అవసరం.

(8) విద్యా సంస్థలకు, ప్రజలకు మధ్యవుండే సంబంధాలు పటిష్ఠం చేసే నిమిత్తం తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు వుండే సంఘాల సమావేశాలు తరచు జరపాలి.

(9) విద్యార్థులు తమ విరామ సమయాన్ని గ్రంథాలయంలోనో, ఉత్పత్తి దోహదకరమైన పనులలోనో, సృజనాత్మక కార్యకాలాపాలలోనో ప్రయోజన కరంగా గడపేటట్లు ఉపాధ్యాయులు శ్రద్ధ వహించాలి.

**పరిపాలన**

(10) ఒక వార్షిక ప్రణాళిక ప్రకారం తనిఖీ అధికార్లు విద్యాసంస్థలను ఖచ్చితంగాను, నియమకాలికంగాను, కట్టుదిట్టంగానూ, పర్యవేక్షణ జరపాలి. ఏ పరిస్థితులలోనూ బకాయి పనిని పెరగనివ్వకూడదు. మిగిలి పోయివున్న పనులను గడువు నిర్ణయించుకున్న కార్యక్రమం ప్రకారం పూర్తి చేయాలి. మూడు మాసాలకు పైబడి మిగిలిపోయివున్న వాటికి ప్రాధాన్యత ఇవ్వాలి.

(11) విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ప్రజలకు సంబంధించిన అంశాలను పరిపాలనా సిబ్బంది, పర్యవేక్షక సిబ్బంది సానుభూతితోను, సదవగాహనతోనూ, త్వరగాను పరిశీలించాలి.

(12) ప్రాథమిక పాఠశాలకు వచ్చే విద్యార్థుల సంఖ్య పెంచే నిమిత్తం బ్లాకు స్థాయిలో వుండే పర్యవేక్షక సిబ్బంది ఒక్కొక్కరిని తేవాలి అనే నినాదారానికి ప్రజాదరణ లభింపచేయాలి.

పైన తెలిపిన కనీస కార్యక్రమాన్ని విద్యారంగానికి సంబంధించిన యావన్మందీ పట్టుదలతో, ఉత్సాహంతో, విశ్వాసంతో అమలు పరచాలి. మౌలికమైన జీవితపు విలువలను పెంపొందించేందుకు, నైతిక ప్రమాణాలను ఇనుమడింపచేసేందుకు ఇటువంటి ఇతర కార్యక్రమాలు రూపొందించి, అమలు జరపడం కూడా ఎంతైనా అవసరం.

**విద్యార్థుల ప్రతిజ్ఞ**

జాతీయ సమైక్యత, భావ సమైక్యత, సాంఘిక న్యాయం, ఆర్థిక సమానతల సంపాదనకు విద్యార్థులమగు మేము చిత్తశుద్ధితో కృషి చేయడానికి, విద్యాభ్యాసంలో శ్రద్ధాభిరుచులను చూపించి, ఉన్నత ప్రమాణాలందుకోవటానికి మనఃపూర్వకంగా ప్రయత్నిస్తామని ప్రతిజ్ఞ చేస్తున్నాం.

# 14. ప్రాథమిక విద్య బోధనాంశాల పునర్నిర్మాణం - సామాజిక విద్య మరియు భాగస్వామ్యం కార్యకలాపాల అభివృద్ధి

సోదర సోదరీ మణులారా!

'ప్రాథమిక విద్య బోధనాంశాల పునర్నిర్మాణం సామాజిక విద్య మరియు భాగస్వామ్యం కార్యకలాపాల అభివృద్ధి' పై జరుగుతున్న ఈ ప్రాంతీయ సదస్సులో పాల్గొనడం నాకు చాలా సంతోషంగా ఉంది. ఈ సదస్సును ప్రారంభించడానికి నన్ను ఆహ్వానించినందుకు సదస్సు నిర్వాహకులకు నా కృతజ్ఞతలు. విద్యాత్మక సమస్యలకు పరిష్కారాలు కనుగొనడంలో, విద్యావ్యవస్థను మరింత బలోపేతం చేయడంలోను గాఢంగా నిమగ్నమైన, దేశవ్యాప్తంగా ఉన్న ప్రముఖ విద్యావేత్తలంతా సమావేశమైన ఈ సదస్సులో నా అభిప్రాయాలుపంచుకోవడమన్నది నిజానికి ఒక అరుదైన అవకాశం.

భారతదేశం జాతి పరిపాలనా విధానంలో ప్రజాస్వామిక పద్ధతిని ఎంచుకొన్నది. పూర్వకాలం కఠినమైన నియమాలతో కూడిన సామాజిక వ్యవస్థలో అంతులేని ఆర్థిక అసమానతలు శతాబ్దాలుగా పాతుకొనిపోయాయి. ఈ వ్యత్యాసాలను నిర్మూలించి సమసమాజాన్ని స్థాపించడమన్నది ఒక భగీరథ ప్రయత్నం. ఈనాడు దేశ సామాజిక - ఆర్థిక వ్యవస్థ ఆధునికీకరణ ప్రక్రియకు నియత - అనియత విద్య - అందరికీ, ప్రత్యేకించి బలహీన వర్గాలు సామాజికంగా ఎదగడానికి దోహదపడుతుందన్నది అందరూ ఏకగ్రీవంగా గుర్తించినదే. అందువల్ల స్వాతంత్ర్యం సముపార్జించిన నాటి నుంచి అట్టడుగు వర్గాలలో విద్యావ్యాప్తి అన్నది జాతీయ లక్ష్యమైనది. 1960 నాటికి 14 ఏళ్ళ వయస్సు వచ్చేదాకా పిల్లలందరికీ ఉచిత నిర్బంధ విద్యావిధానం అమలు పరచాలని భారత రాజ్యాంగంలోని 45వ అధికరణం నిర్దేశిస్తోంది.

రాజ్యాంగ నిర్దేశాన్ని అనుసరించి విద్యావ్యాప్తి కోసం అనేక చర్యలను చేపట్టింది. అత్యధిక సంఖ్యలో పాఠశాలలను నెలకొల్పడం, అధ్యాపకులను నియమించడం, పాఠశాలలకు పిల్లలను ఆకర్షించడానికి అనేక రాయితీలను కల్పించడం, మధ్యాహ్న

భోజన పథకాన్ని ప్రవేశపెట్టడం జరిగింది. ఇంకా నిర్బంధ విద్యా చట్టాన్ని అమలు పరచడం, పాఠశాలలకు వెళ్ళే పిల్లల వయస్సు వారీగా పట్టిక తయారుచేయడం, హాజరు శాతం నిర్వహించే అధికారులను నియమించడం, తల్లి దండ్రుల సహకారాన్ని కోరడం వంటి ఇతర ప్రక్రియలున్న చట్టాన్ని అమలులోకి తెచ్చారు.

ఈ ప్రయత్నాలవల్ల స్వాతంత్ర్యానంతర కాలంలో మునుపెన్నడు లేని విధంగా ప్రగతి లక్ష్యాన్ని సంపూర్ణంగా చేరుకోవడం సాధ్యపడలేదు. ప్రస్తుతం విద్యపై సంవత్సరానికి సుమారు 1,35 కోట్ల రూపాయలను ఖర్చుపెడుతున్నాం. ఇంకా ఈ విధానం ఎక్కువగా ఉన్నత వర్గాల వారికే లాభదాయకమవుతోంది. మొత్తం జనాభాలో 70 శాతం మంది ఇంకా నిరక్షరాస్యులుగానే ఉన్నారన్న నిజం దీనిని స్పష్టం చేస్తుంది. 6-11 ఏళ్ళ పిల్లల నమోదు 84 శాతం ఉంటే, 11-14 ఏళ్ళ పిల్లల నమోదు కేవలం 36 శాతం మాత్రమే. 6-14 ఏళ్ళ వయస్సు పిల్లలు 25 శాతం మాత్రమే వాళ్ళ ప్రథమిక విద్యను పూర్తి చేస్తున్నారు. 15-25 ఏళ్ళ వయస్సులోని యువత 7 శాతం మాత్రమే మాధ్యమిక, కళాశాల విద్యను పూర్తి చేస్తున్నారు.

1 పాఠశాలల కొరత; 2 పాఠశాలలలో స్వల్ప సంఖ్యలో పిల్లల నమోదు; 3 దుబారా, ప్రతిష్టంభన వంటిది.

ప్రాథమిక విద్య సార్వత్రిక ప్రగతికి ప్రధాన ఆటంకాలు -

అయితే, ప్రస్తుతం పాఠశాలల కొరత అన్నది అంత ప్రధానమైన ఆటంకం కాదు. గత నాల్గవ, ఐదవ పంచవర్ష ప్రణాళికల కాలంలో ప్రతి పిల్లవానికి అందుబాటులో ఉండే విధంగా పాఠశాలల ఏర్పాటు కోసం ప్రయత్నం జరిగింది. దాని వల్ల ఏ రాష్ట్రంలోనైనా పాఠశాలలేని గ్రామాలు చాలా తక్కువ.

కానీ పాఠశాలలో పిల్లల నమోదు సంతృప్తిగా లేకపోవడమే ప్రస్తుత సమస్య. విద్యావ్యాప్తి అంటే ఒక చోట పాఠశాలను ఏర్పాటు చేసినంత మాత్రాన సరిపోదు. పాఠశాలకు తమ పిల్లలను పంపించే అవకాశాన్ని తల్లిదండ్రులకు కల్పించాలి. అయితే ఈ అవకాశాన్ని వారు వినియోగించుకోవడమన్నది వారి సామాజిక ఆర్థిక స్థితిగతులు, పాఠశాల, విద్య - వీటి ప్రాముఖ్యం పట్ల వారికున్న అవగాహనను బట్టి ఉంటుంది.

గ్రామీణ, గిరిజన ప్రాంతాలలోని పాఠశాలలలో పిల్లల నమోదు సంఖ్య తక్కువగా ఉండడానికి ఈ కింది అంశాలు కారణాలుగా చెప్పుకోవచ్చు-

1. పాఠశాల అంటే వారికి తెలియని కొత్త ప్రపంచం. వాళ్ళలో చాలా మంది నిరక్షరాస్యులు.

2. పాఠశాల చదువు వారి నిత్యజీవితంలో ఎంతవరకు ఉపయోగపడగలదో వారు అర్థం చేసుకోరు.

3. ప్రతి పిల్లవాడు పొలంలోనో, ఇంట్లోనో ఏదో ఒక పని చేస్తూ ఎంతో కొంత సంపాదిస్తూ, తల్లిదండ్రులకు చేదోడు వాదోడుగా ఉంటాడు. అందువల్ల తల్లిదండ్రులు తమ పిల్లలను పాఠశాలకు పంపలేకపోతారు.

వెనుక బడిన ప్రాంతాలలోని పాఠశాల వల్ల జరిగే భారీ దుబారా, ప్రతిష్ఠంభన అన్నవి ప్రాథమిక విద్యను సార్వత్రికం చేసే ప్రక్రియలో కలిగే ఆటంకం మూడవ అంశం. పాఠశాల వ్యవస్థలోని లోపాలకు తల్లిదండ్రుల సామాజిక, ఆర్థిక పరిస్థితులతో పాటు ఇది కూడా ఒక ఆరోపణ. ప్రాథమిక విద్య పట్ల అధిక సంఖ్యలో పిల్లలను ఆకర్షింపచేయడంలో విఫలం కావడంతో పాటు, ఆ విద్యను చివరి దాకా పూర్తిచేసేటట్లు పిల్లలను అట్టి పెట్టడంలో కూడా మన పాఠశాలలు పరాజయం పాలవుతున్నాయన్న విమర్శ సర్వత్రా వినిపిస్తోంది. ఇందుకు గల కారణాలు ఇలా ఉన్నాయి –

1. పాఠశాల సమయాలు, సెలవులు స్థానిక పరిస్థితులకు అనువుగా లేవు;

2. పాఠశాలలలో చెప్పే బోధనాంశాలు స్థానిక పరిసర పరిస్థితులకు, అవసరాలకు, ప్రజల ఆకాంక్షలు, జాతీయ లక్ష్యాలకు సంబంధించినవిగా లేవు.

3. పాఠశాలను, సమాజాన్ని పరస్పరం సన్నిహితపరచడానికి బదులు, వీటి రెండింటి మధ్య దూరాన్ని పెంచుతున్నాయి.

ఆశించిన ఫలితాలు పొందడంలో పాఠశాల వ్యవస్థ వైఫల్యం దానిపై వస్తున్న విమర్శల నేపథ్యంలో దీనిని పునఃపరిశీలనతో, తగిన మార్పులతో ఇంకా ప్రయోజనాత్మకంగా, శక్తిమంతంగా తీర్చిదిద్దడం అత్యంత ఆవశ్యకమని భావించడమైనది. స్థానిక అవసరాలకు, పరిస్థితులకు తగిన విధంగా తయారు చేయాలి. వారు నివసించే సమాజాలలో సాంఘిక మార్పుకు, ఆధునికీకరణకు ఒక శక్తి వంతమైన సాధనంగా ఉండాలి.

ఇటువంటి పరిస్థితులలో ఎస్.సి.ఇ.ఆర్.టి. (నేషనల్ కౌన్సిల్ ఫర్ ఎడ్యుకేషనల్ రీసెర్చి అండ్ ట్రైనింగ్– వారు ఆర్థిక సహకారంతో 'ప్రాథమిక విద్య బోధనాంశాల

పునఃరచన', 'సామాజిక విద్య - భాగస్వామ్యం అభివృద్ధి కార్యకలాపాలు' అనే రెండు ప్రయోగాత్మకమైన ప్రాజెక్టులు ప్రారంభించడం సంతోషించ దగిన అంశం.

నాకు తెలిసినంతవరకు ప్రాథమిక విద్య బోధనాంశాల పునఃరచన అనే ఈ ప్రాజెక్టు బృహత్తర లక్ష్యం, ప్రజల అవసరాలు, ఆకాంక్షల మేరకు ప్రాథమిక బోధనాంశాలను రూపొందించాలి, స్థానిక స్థితిగతులకు సంబంధించినదై ఉండాలి. దీనిని సర్వత్రా అమలుపరిచే ముందు ప్రయోగాత్మక పాఠశాలలలో అమలు పరచాలి. ఇక రెండవ ప్రాజెక్టు లక్ష్యం, అనుకొన్న వివిధ రకాల వర్గాలకు అనియత విద్య బోధనాంశాల రూపకల్పనను అభివృద్ధి పరచాలి. వీరందరినీ వారివారి సామాజిక అభివృద్ధి కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనేటట్లు చేయాలి. ఈ రెండు ప్రాజెక్టుల అంతిమ లక్ష్యం పాఠశాలను సమాజాన్ని చేరువచేసి, సామూహికంగా పనిచేసేటట్లు చేయడమే. ఈ క్రమంలో పాఠశాల సామాజిక మార్పుకు ఒక మధ్యవర్తిగా పనిచేస్తుంది.

ఇది ఒక పెద్ద సవాలుతో కూడిన కర్తవ్యం. దీనిని వివిధ దశలుగా చేపట్టాలి. సామాజిక వర్గాలకు సంబంధించిన సాంఘిక, ఆర్థిక, విద్య అవసరాల సర్వేక్షణ, తగిన బోధనా విషయాల రూపకల్పన, బోధన, అధ్యయన సామగ్రి తయారీ, ఉపాధ్యాయుల శిక్షణ, సామాజిక కార్యకర్తలు, చివరగా కార్యక్రమాల సమర్థత మూల్యాంకనం.

ఈ ప్రాజెక్టులు వివిధ శాఖల సహాయ సహకారాలతో కూడినవి. వ్యవసాయం, పశు సంవర్ధకం, పరిశ్రమలు, వైద్య ఆరోగ్యసేవలు, ప్రసూతి, శిశు సంక్షేమం, సహకార సంఘం మొదలైనటువంటి అభివృద్ధి కార్యక్రమాల సిబ్బందికి చెందినవి.

ఈ సందర్భంగా నా అనుభవంలోని ఒక విషయాన్ని ఇక్కడ ప్రస్తావిస్తాను. ఆంధ్రప్రదేశ్ హైదారాబాద్ జిల్లాలోని చేవెళ్ళ బ్లాక్‌లో ఉన్న ఇరవై ప్రయోగాత్మక పాఠశాలలలో 1975-76లో శిశు సంక్షేమం కోసం 'ఇండో - డచ్ ప్రాజెక్టు' పేరిట ఈ రకమైన కార్యక్రమం ప్రారంభించబడింది. ఇది రాష్ట్ర విద్యాశాఖ, ఎస్.సి.ఇ.ఆర్.టి. (రాష్ట్ర విద్య, పరిశోధన, శిక్షణ మండలి) సౌజన్యంతో అమలు జరిగాయి.

పునఃరచింపబడిన, బోధనాంశాల అమలు కోసం ఇతర పరిశీలనతో పాటు ఎంపిక చేసిన కొన్ని సామాజిక వర్గాలలో ఒక తరగతికి చెందిన ప్రజల అభిప్రాయాలు పరిగణనలోకి తీసుకోవడమైంది. ఆ మేరకు ఈ ప్రాజెక్టులో ఒకటి నుంచి నాల్గవ

తరగతులకు బోధనాంశాలు ఒక నిపుణుల సంఘంతో మెరుగుపరచబడినాయి.

మార్చిన బోధనాంశాల ప్రకారం విద్యార్థులకు పాఠ్య పుస్తకాలు, ఉపాధ్యాయులకు కరదీపికలు నిపుణుల చేత రచింపబడినాయి. దీనిని 1976-77 నుంచి అమలు పరచడం జరుగుతుంది. ఇదే రకమైన ప్రయోగాలు దేశంలోని మిగతా ప్రాంతాలలో కూడా జరిగి ఉంటాయని నేను భావిస్తున్నాను. మన దేశంలో ఒక అర్థవంతమైన, అవసరార్థమైన, స్థానిక సంబంధమైన బోధనాంశాలు రూపొందించడానికి ఈ ప్రాజెక్టుల అనుభవాలు, ఫలితాలు ఉపయోగపడవచ్చు.

వెనుక బడిన వర్గాల కోసం మార్చిన ఈ బోధనాంశాలు ఆశించిన ప్రయోజనాలను నెరవేరుస్తాయని నాకు తెలుసు. ఇంకా ఆయా ప్రాంతాలలో నివసించే లబ్ధి పొందని వర్గాల ప్రజల సమస్యలను పరిష్కరించడానికి కూడా ఉపయోగపడగలవు.

ఈ రంగానికి సంబంధించిన నిపుణులతో కూడిన ఈ ప్రాంతీయ సదస్సు ప్రాథమిక విద్యలోని ప్రధాన సమస్యలపై తీవ్రంగా ఆలోచించగలరని నేను భావిస్తున్నాను. పరస్పరం వారి అనుభవాలను, పంచుకొంటూ ఈ ప్రాజెక్టులను అమలుపరచే దిశగా ఆచరణసాధ్యమైన వ్యూహాత్మకతను రూపొందించడానికి మేధోమథనం చేసుకోవాలి.

ప్రాథమిక విద్యను సార్వత్రికం చేయాలనే లక్ష్యాన్ని చేరుకోవడంలోనే గాక, విద్యను సామాజిక మార్పు కోసం ఒక సాధనంగా మలచడంలోను మీరు తీసుకొన్న నిర్ణయాలు, రూపొందించిన వ్యూహాత్మక పథకాలు కలకాలం నిలిచి ఉంటాయి.

ఈ కొద్ది పరిచయ వాక్యాలతో, ఈ సదస్సును ప్రారంభించడానికి నేను సంతోషిస్తున్నాను. ఈ సదస్సులోని చర్చలు ప్రయోజనకారిగా, ఫలవంతంగా ఉండాలని నేను ఆశిస్తున్నాను.

*(1977 మే 26 నుంచి 29 వరకు మద్రాసులో*
*జరిగిన ప్రాంతీయ సదస్సు ప్రారంభోపన్యాసం, మద్రాసు)*

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | 1977 నాటి జలప్రళయ జ్ఞాపకాలు | 345 |
| 2. | ప్రళయం – చేపట్టిన సేవా కార్యక్రమాలు | 359 |
| 2. | ఘోర విపత్తు – ఎదుర్కొన్న తీరు | 362 |
| 3. | నాటి వల్లకాడు గొల్లపాలెం – నేటి రమణీయ గ్రామం రామకృష్ణపురం ! | 367 |
| 4. | ఆనాటి చింతకోళ్ళ ఈనాటి ప్రభాకర్‌జీ పురం | 371 |
| 5. | విశ్వహిందూ పరిషత్ కృషి ఫలితమే – హంసలదీవి | 373 |
| 6. | తుఫాను, ఉప్పెన ప్రాంతాలలో రామకృష్ణమిషన్ విశిష్టసేవలు | 375 |
| 7. | కృష్ణాజిల్లాలో – పోలీసుల సేవ<br>సేవాభావంతో ఖాకీలు కారుణ్యమూర్తులైనవేళ... | 380 |
| 8. | బిల్లీ గ్రాహంనగర్ – దైవస్వరూపుని కానుక | 384 |
| 9. | దివిసీమ ఉప్పెనపై... | 387 |
| 11. | ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థలు, సామాజిక సేవా కార్యకర్తల<br>సంఘం మహాసభ – తిరుపతి – ప్రధానోపన్యాసం | 395 |

# 1. 1977 నాటి జలప్రళయ జ్ఞాపకాలు

తెల్లవారింది. సూర్యుడు కనిపించని ఉదయం! హోరుగాలి, కారుమబ్బుల్లో... జడివాన వాతావరణంలో ఎదో భయంకరమైన మార్పు కనబడుతోంది. అది మనస్సులో ఏదో గుబులుకు కారణం అవుతుంది. 1977 నవంబరు 19వ తేదీ మన దేశ చరిత్రలో దుర్దినం, ప్రపంచ మహా విపత్తులలో ఒక విపత్తు. ఈ శతాబ్దమున ఘోరమైన ముప్పు సంభవించిన రోజు.

మనిషికి అతీంద్రియ జ్ఞానం ఉంది అంటారు. ఈ అతీంద్రియ జ్ఞానము అంటే ఏమిటో నాకైతే స్పష్టంగా తెలియదు. మామూలుగా మనము ఊహించిన దానికంటే ఎక్కువగా రాబోయే ఉదంతాన్ని పసిగడుతుంది. నా విషయములో కూడా అంతేనేమో! ఆ అతీంద్రియం ఏదో అప్పుడు పనిచేసినట్లుంది. లేకపోతే గుంటూరు, బాపట్ల, భీమవరం, ఏలూరు, చూచి హైదరాబాద్ వెళ్ళవలసిన ప్రోగ్రాములు ఉండి, ఏలూరు నుండి సేవాశ్రమంలో ఉన్న పిల్లలను చూచి వెళదామని సరాసరి 18వ తేదీ అర్ధరాత్రి అవనిగడ్డ చేరాను. వారిని చూచి ఉదయంకు హైదరాబాదులో 19వ తేదీ సాయంత్రం వున్న అతి ముఖ్యమైన అధికార కార్యక్రమాలలో పాల్గొందామని అనుకున్నాను. కాని ఉదయం నుండే గాలి, వాన ప్రారంభమయ్యాయి. తుఫాను, పల్లపు ప్రాంతాలు ముంపుగా గల సముద్ర కెరటాలు రావచ్చునని ఆకాశవాణి తెలుగులో వార్తలు ప్రసారం చేసి హెచ్చరిక చేసింది. ఏదో ముప్పువుందని హైదరాబాద్ ప్రయాణం రద్దు చేసుకొని ఫోనులో శ్రీమతి ప్రభావతికి హైదరాబాద్ రావడం లేదని చెప్పినాను. గాలి, వానగా ఉన్నందున అనాథ పిల్లల క్షేమం చూస్తున్నానని అన్నాను. ఉదయం 10 గంటలకు గాలి వేగం పెరిగింది. వెంటనే మా సమీపములో వున్న ఒక క్రైస్తవ మిషనును నడుపుచున్న షాలెమ్ హరిజన బాలికల హాస్టలుకు వెళ్ళాను. దాదాపు 80 మంది బాలికలు ఒక పూరిపాకలో వుంటున్నారు. ఆ పాక కూలిపోతుందేమోనని భయం వేసింది. వాళ్ళను అక్కడనుండి ఖాళీ చేయించి సేవాశ్రమంలోనికి తీసుకువచ్చాను. చుట్టుప్రక్కల గుడిసెల వారిని కూడా అక్కడ నుంచి ఖాళీ చేయించి, గాంధీ క్షేత్రంలోనికి, జూనియర్ కాలేజీలోనికి వెళ్ళి తలదాచుకోమని చెప్పాను. నా భయం నిజమైంది. కొన్ని నిముషాలు తరువాత ఆ పాకలు కూలిపోయాయి.

సేవాశ్రమంలో హిందీ ప్రచారక శిక్షణ పొందుతున్న 40 మంది విద్యార్థినీ విద్యార్థులు, అనాథ శరణాలయానికి చెందిన 50 మంది బాలబాలికలు ఉన్నారు. ఉదయం 10 గంటలకే అందరికీ భోజనం పెట్టించి, వారి వారి గదులలో కదలకుండా ఉండమని చెప్పి హిందీ హాస్టల్ పిల్లల మధ్య ప్రిన్సిపాల్ సుభద్రమ్మను, జూనియర్ కాలేజి టైపిస్టుగార్లను వుంచి ఆశ్రమ పాఠశాల వద్ద పిల్లల దగ్గర శ్రీ లక్ష్మయ్య గారిని వుంచి, అనాథ శరణాలయం పిల్లల వద్ద శ్రీ చంద్రశేఖర్‌ని వుంచి నేను సేవాశ్రమంలో నిర్మలసదన్‌లో వున్నాను. సేవాశ్రమాన్ని 1977 అక్టోబరు 2వ తేదీన గాంధీజీ కోడలు శ్రీమతి నిర్మలాగాంధీ, మనుమడు శ్రీ కనూ గాంధీ ప్రారంభోత్సవం చేశారు. వారిరువురూ వుండడం కోసం సేవాశ్రమం 'నిర్మలా సదన్' అని కొత్తగా నిర్మించాము. అవి రెల్లుగడ్డి పాకలు.

మహాత్ముని దివ్యబోధనలు దివిసీమ నలుమూలలా అందచేసిన శ్రీమతి నిర్మలాగాంధీ, శ్రీ కనూగాంధీ, నాల్గురోజులుపాటు సేవాశ్రమంలో వుండి గాంధీక్షేత్రంలో జరిగిన నిర్మాణ కార్యకర్తల సమ్మేళనంలో పాల్గొన్నారు. అంతటి ఉన్నత వ్యక్తులు విడిదిచేసిన ఆ పాకలో నిలబడి కిటికీ గుండా పిల్లలు ఉన్న వివిధ భవనాలను చూస్తూ వాతావరణాన్ని గమనిస్తున్నాను.

నావద్ద శ్రీ మిక్కిలినేని సుబ్బారావు, శ్రీ జి.యం. కొండయ్య, శ్రీ వెంకటేశ్వరరావు, శ్రీ గోపాలు, కొంతమంది విద్యార్థులూ వున్నారు. మధ్యాహ్నం 2 గంటలు అయింది. వేరుశనగ కాయలు, అరటి పండ్లు తెప్పించి అందరికీ యిచ్చాను. గాలి గంటకు 150 కి.మీ. వేగంతో వీస్తుందంటే అతిశయోక్తి కాదు. సేవాశ్రమంలో నెల రోజుల క్రితం శ్రీ బండి శోభనాచలం, శ్రీ జాన్ డేవిడ్ గార్ల సహాయంతో బంగాళా పెంకులతో కట్టిన భవనాలపై పెంకులు పది పదిహేను అడుగుల ఎత్తున బిల్లంగోడుల్లా ఎగిరి పడుతున్నాయి. యాస్‌బెస్టాస్ రేకులైతే తాటి ఆకుల్లా ఎగిరిపోతున్నారు. ఇక తాటాకుల మాట వ్రాయనక్కర లేదనుకుంటాను, గాలి పటాలులాగా ఆకాశంలో తిరుగుతున్నాయి. మా ఇంటివద్ద ఉన్న కొబ్బరి చెట్లూ, వేపచెట్లూ విరిగిపోతూ ఉంటే చూడలేకపోయాను. 1962లో మా యిల్లు సేవాసదన్ కట్టుకున్నప్పుడు ఈ చెట్లను నాటి నారికేళ వనంలా తయారు చేశాను. ఎవరూ పుల్లకూడ విరువకుండా పెంచిన వేపచెట్లు అల్లాడిపోయి నేలకొరుగుతున్నాయి. ప్రాణానికి ప్రాణంగా పెంచిన చెట్లు ప్రచండ వాయుగమనానికి అటూఇటూ వూగిపోయి నేల కూలిపోతుంటూ నా హృదయం బాధతో విలవిలలాడిపోయింది.

అలాగే పేదపిల్లల కోసం ఇటీవలనే దగ్గర వుండి అజమాయిషీ చేస్తూ కట్టించిన భవనాలు కదలిపోతూంటే నా ఆశయాలూ, ఆశలూ సమూలంగా నాశనం అయిపోతున్నంత బాధ కలిగింది. అవును, ఆ పునాదులపైన నిలిచే భవనాలే నా ఆదర్శాలకు, ఆశయాలకూ ప్రతీకలు, అవే నా ఊపిరి, నా జీవం, నా సర్వస్వం. కాని అవి నిలుస్తాయా? నిలువనిస్తుందా ఈ పెను తుఫాను? నా మనస్సులో కోటి సందేహాలు, శతకోటి సముద్రాలై పొంగిపొరలుతున్నాయి.

**ప్రాణ రక్షణ**

సాయంత్రం 4 గంటలు అయింది. గాలి వేగం పెరిగిపోతోంది. మేము ఉన్న నిర్మలా సదన్ పైకప్పు గాలికి ఎగిరిపోతోంది. కప్పు క్రింద శుభ్రంగా ఉండడానికి వేసిన తాటాకు చాపలు మాత్రం మిగిలాయి. గాలికి చాటుగా ఉండడం వలన కిటికీగుండా బయటకు చూసే అవకాశం కలిగింది. పెంకుటింటి కప్పులు లేచిపోవుటచేత ఆశ్రమ పాఠశాలలోని పిల్లలు భయపడిపోయి పది పండ్రెండు మంది పిల్లలు బయటకు వచ్చారు. వారు గాలిలో కొట్టుకొనిపోతూ మేమున్న నిర్మలా సదన్ గోడను వచ్చి పట్టుకున్నారు. మాకు ఎదురుగా వున్న హాస్టలు భవనములోని ఆడపిల్లలు అది చూచి కేకలు వేశారు. వెంటనే ఏమిటని అడిగాను. గాలిహోరు ఉధృతంగా ఉండుట వల్ల ఒకరి మాట ఒకరికి వినుపించటం లేదు. యింతలో ఒక కుర్రవాడు గాలికి కొట్టుకొని పోతూ కనిపించాడు. కిటికీగుండా అది చూచి వెంటనే బయటికి వచ్చి ఆ కుర్రవానిని పట్టుకోబోయాను నేను. మరొక బాలుడు వచ్చి నామీద పడ్డాడు. ఆ కుర్రవాడితోపాటు నేనూ పడిపోయాను. నా వెనుక సుబ్బారావుగారు, యితరులూ వచ్చారు. చివరకు ఆ పండ్రెండు మంది పిల్లలను పట్టుకొని మేమున్న నిర్మలాసదన్‌లోకి చేర్చగలిగాము. అయితే మిగిలిన పిల్లలను గురించి ఆందోళన ప్రారంభమయింది. వెళ్ళాలా? ఉండాలా? ఏమైయుంటారు అని మనస్సులో పలుపలు విధాల ఆలోచనలు సాగాయి. వాళ్ళు ఉన్న ఆశ్రమ పాఠశాల భవనానికి వెళ్ళాలంటే గాలికి ఎదురు వెళ్ళాలి. అది మేమున్న భవనానికి వంద గజాల దూరములో వుంది. అయినా పోదామని మొండి ధైర్యముతో బయటకు నడిచాము. ఆ గాలి వేగానికి ముందుకు సాగేలక పోయాం. మానులను సహితం కుదిపివేస్తున్న ఆ గాలి ముందు మనుష్యులమైన మేం ఏపాటి? అది భీకరంగా ఘీపెట్టుతూ మమ్మల్ని వెనక్కి త్రోసేసింది. కాని సుబ్బారావు గారు మరొక విద్యార్థి పట్టువదలలేదు. ఎలాగైనా వెళ్ళాలని నిశ్చయించుకొని నేలమీద ప్రాకుతూ అక్కడికి చేరారు. అక్కడ వున్న పిల్లలతో వుండిపోయారు. నాకు కొంత స్థిమితం చిక్కినట్లయింది.

## బడబాగ్ని

సాయంత్రం 5 గంటలు అయింది. ఆకాశం అంతా ఎర్రగా రక్తం ఒలకపోసినట్లులా, ఎర్రటి కణకణలాడే నిప్పుకణాలు పరచినట్లుంది. అది చూస్తుంటే సముద్రంలో బడబాగ్ని బ్రద్దలైందా వున్నట్టుండి. ఉప్పెన వచ్చినప్పుడు సముద్రం ఎర్రబడుతుందని మా చిన్నప్పుడు పెద్దవాళ్ళు చెబుతుండగా విన్నాను. మరికాసేపటికి ఆకాశమంతా నేలమతాబుల కాంతిలా నిండిపోయి, పట్టపగలల్లే అయిపోయింది. అటుతరువాత మేఘామృతమయినట్లుంది. ఇలా రకరకాల కాంతులు మారుస్తున్నా ఆకాశం పలురకాల భయాలకు కారణం అయింది. ఏమిటీ విపరీతం అంతుపట్టలేదు. నాలో ఇన్ని భయాలు ఉన్నా ఇన్ని ఆలోచనలు ఉన్నా అవి మొహం మీద ప్రతిఫలించకుండా జాగ్రత్తపడ్డాను. సాధ్యమైనంత ఎక్కువ గాంభీర్యం కూడదీసుకున్నాను. లేకపోతే నా చుట్టూ ఉన్నవాళ్ళు నిరుత్సాహపడవచ్చు.

స్వతహాగా నేను కొంచెం మొండిమనిషిని. దేనికీ ఒక పట్టాన జడవను. అది నాకీ సమయంలో అక్కరకి వచ్చింది. యింతలో హిందీ ప్రచారక విద్యాలయం ఆడపిల్లలు బిల్డింగు మీద పెంకులమోతకు భయపడి బయటకు వచ్చారు. వారి వెర్రి కేకలు విని మరల బయటకు వచ్చాను. వారిని ఎలాగైతేనేం మేమున్నచోటికి చేరదీశాం. ఒక అమ్మాయికి ఛాతిలో నొప్పివచ్చింది. వంటిమీద స్పృహ లేదు. ఆ పాకలోనే వున్న ఒక బల్లమీద పడుకోబెట్టి ప్రథమ చికిత్స చేశారు. ప్రొద్దు కూకింది. కారు చీకట్లు కళ్ళు పొడుచుకున్నా కానరాని గాఢాంధకారం. అలాగే ఆ కటిక చీకటిలో ఒకరినొకరం పట్టుకొని అన్ని హాస్టల్సులో ఉన్న వారిని పలుకరించి కదలవద్దని చెప్పి నిర్మలాసదన్‌కు తిరిగివచ్చాం. అక్కడ నుండి తిరిగి మా సేవాసదన్‌కు వెళ్ళాం. విరిగిపోయిన చెట్టుకొమ్మలతో నిండిపోయిన దారివెంట మా ఇంటికి వెళ్ళడం అసాధ్యమైపోయింది. ఇంటి నిండా జనం నిండిపోయి ఉన్నారు. ఎక్కడా ఒక అంగుళంమేర కూడా ఖాళీ లేదు. వారందరినీ జాగ్రత్తగా ఉండమని చెప్పి తిరిగి ఎలాగో నిర్మలాసదన్‌కు చేరుకున్నాం. ఉదయం పదిగంటలకే బట్టలు తడిచిపోయాయి. ఆ తడిచిన బట్టలతోనే చలిలో చీకట్లో ప్రకృతి చేసే విలయతాండవానికి నిస్సహాయుడపై నిలబడిపోయాను. రాత్రి రెండు గంటలయింది. అప్పటికి గాలి వేగం కాస్తంత ఉపశమించింది. మళ్ళీ ఒకసారి అందరినీ పలుకరించడానికి వెళ్ళాను. అయినంపూడి ప్రకాశరావు బ్యాటరీ లైటు మాత్రం మాకు దారి చూపింది. ఆకులు, కొమ్మలూ, పెంకులతో దారి అంతా నిండిపోయి ఉంది. భయముతో పాములు జరజర పరుగులెడుతున్నాయి. ఆ దారిలో

అడుగడుక్కి కసుక్కుమని దిగే ముళ్ళు ఆ సమయంలో వాటిని లెక్కపెట్టలేదు నేను, అందరిని పలుకరించి ధైర్యము చెప్పి తెల్లవారే వరకు బయటకు రావద్దని చెప్పాను.

**తుఫాను భీభత్సం**

తెల్లవారుతోంది. 20వ తేదీ. తూర్పురేఖలు కనపడ్డాయి. మా ఇంటికి వచ్చాను. కొబ్బరి చెట్టూ, వేప చెట్టూ పడిపోయి వంట ఇంటి రేకులు ఎగిరిపోయి దారి అంతా చెత్తాచెదారంతో నిండి మరీ బీభత్సంగా వుంది. మా ఇంట్లో జూనియర్ కాలేజి ప్రిన్సిపాల్ గారు, శ్రీ ముగుళ్ళపు కృష్ణారావుగారు వున్నారు. ఆయనకు కిన్నెరసాని రెసిడెన్షియల్ స్కూలులో ప్రిన్సిపాల్‌గా బదిలీ అయితే అక్కడకు వెళ్ళారు. ఆ రోజు వారి అత్తగారు, భార్య, మాయింట్లోనే వుండి వెళ్ళడానికి అన్నీ సర్దుకుని ప్రిన్సిపాల్ గారి అత్తగారు సత్యవతమ్మగారు ఊరగాయలు పట్టడంలో సిద్ధహస్తులు. ఆమె అనేకరకాలైన పచ్చళ్ళు తయారుచేసి ఉంచారు. మాయిల్లంతా పోవడంతో ఆమె పచ్చడి జాడీలు పగిలిపోయి ఎందుకూ పనికిరాకుండా పోయాయి. మన ఇల్లే ఇంత బీభత్సంగా వుంటే యిక గ్రామ పరిస్థితి ఎలా వుందో అనుకుంటూ బయటకు వచ్చాను. కరెంటు స్తంభాలు నేలకొరిగిపోయి మెలికలు తిరిగిపోయి ఉన్నాయి. టెలిగ్రాఫ్ స్తంభాలు ముక్కలు చెక్కలైపోయినాయి. రోడ్డుకు అడ్డంగా చెట్లు పడిపోయినాయి. ఇండ్ల కప్పులతో దారులు కప్పబడినాయి. గాంధీపురం గిరిజనులు ఎలా వుందీ చూచుటకు వెళ్ళాను.

ఒక యింటి మీద కూడ కప్పులేదు. వారిని పలుకరించి తిరిగి వస్తూ ఉండగా రోడ్డు ప్రక్క ఒక పాకలో ముసలమ్మ మూలుగుతూ వుంది ఆయువు అంటే అదే కాబోలు. గోడ పడింది. దూలం పడింది. వాటికి రెంటికి మధ్య ఆ ముసలమ్మ ఇరుక్కుపోయింది. మూలుగుతూ చూస్తూ వుంది. ఆమెను నెమ్మదిగా బయటకు లాగాము. అచ్చటనుంచి గాంధీక్షేత్రమునకు వచ్చాము. ఆంధ్రప్రదేశ్ నాటకోత్సవాల కోసము కట్టబడిన ఆరుబయలు రంగస్థలము కొన్ని వేల మంది ప్రజలకు ఆకర్షించింది. అప్పట్లో మే 8వ తేదీన సినిమా నటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు గారు ప్రారంభోత్సవం చేశారు. దీని రేకులన్నీ ఎగిరిపోయాయి. ముక్కచెక్కలై చెల్లాచెదురై పోయాయి. పూరిపాకగా వేసిన మీటింగుహాలు నేలమట్టమయింది. అయితే గాంధీక్షేత్రం కట్టడాల మధ్య నిలబడి వున్న మహాత్మాగాంధీ విగ్రహం మాత్రం చెక్కుచెదరలేదు, ఆ కాళరాత్రి ఆ భయానకమైన రాత్రిలో ప్రకృతి విలయతాండవానికి తానూ గుర్తై లక్షలాది

బాధితులైన ప్రజల పరిస్థితి ఎలా అని పరితపిస్తూ ఆలోచిస్తూ ఉన్నట్లుగా వుంది ఆ విగ్రహం. ఆ శిల్పాన్ని ప్రముఖ శిల్పి శ్రీ పి.యస్. పట్నాయక్ బహూకరించారు. గాంధీజీకి అత్యంత సన్నిహితులు ప్రముఖ సర్వోదయ నాయకులు శ్రీ ప్రభాకర్జీ ఆ విగ్రహాన్ని ఆవిష్కరించారు. వేలాది ప్రజలు బాధపడుతున్నారు. వెళ్ళు సేవచెయ్యి అని గాంధీజీ ఆదేశించినట్లు అనిపించింది. సర్వీస్ ఈజ్ గాడ్ (సేవే దైవము) అదే నా కర్తవ్యము అని గాంధీజీ విగ్రహానికి నమస్కరించి బయలుదేరాను. గాంధీ క్షేత్రంలోనున్న హిందీ విద్యాలయాన్ని గ్రంథాలయాన్ని ఓరియంటల్ పాఠశాల, మహిళా మండలి పాఠశాలనీ అన్నింటిని ఏవిధంగా దెబ్బతిన్నది చూస్తున్నాను. ఎవరో వచ్చి వంతెన దగ్గర ఒక మనిషి చచిచ పడి వున్నాడని చెప్పారు. అప్పటికి ఉదయం 6.30 గంటలైంది. వెంటనే అచ్చటకు వెళ్ళాను. అతడు హరిజనుడు. గాలికి రేకు దెబ్బతగలడం వలన ఒక చెంప అంతా చీరుకుపోయింది. ఆ గాయం వలన అతను చనిపోయాడు. మనస్సులో అయ్యో అనిపించింది. అచ్చట నుంచి గ్రామములో జరిగిన బీభత్సాన్ని చూస్తూ గుర్రపు చెరువు సమీపానికి చేరుకున్నాను. ఇంతలో ఎవరో వచ్చి గోడ క్రింద మనిషి ఎవరో పడి చచ్చిపోయాడన్నారు. యాభైమందితో గుర్రపు చెర్వు గట్టుకు వెళ్ళాను. శవాన్ని బయటకు తీశారు. యువకుడు. పాపం ఆధారము లేనివాడు అతని భార్య పిల్లలు గగ్గోలుగా విలపిస్తున్నారు. నాలుగు మాటలు చెప్పి ఓదార్చాం. ఆదుర్దాగా వెళ్ళామన్నమాటే గానీ తిరిగి రావాలంటే దారేలేదు. చెత్తచెదారం ముళ్ళకంపలతో నడపడానికి వీలులేనంత భీభత్సంగ వుంది. అలాగే అక్కడ వున్న వాళ్ళనందర్నీ పలుకరించుకుంటూ శ్రీ అన్నపురెడ్డి సత్యనారాయణ గారితో హరిజనవాడ చేరుకున్నాము. ఇండ్లు వదలి ఏటిగట్టుపైన హాహాకారాలు చేస్తున్నారు. తాసిల్దారుగారు ట్రాన్సుఫర్ అయినారు. ఇన్చార్జి తహసీల్దారుగారు వచ్చారు. బాధితులందరికి బియ్యం యివ్వమని చెప్పాను. వారు అలాగే యిచ్చారు. గ్రామాలన్నీ తిరుగుతూ బాధితుల్ని పరామర్శ చేస్తూ యింటికి చేరాను. శ్రీ భోగాది మాణిక్యారావుగారు వచ్చారు. ఆశ్రమంలో పిల్లల అందరికి భోజనము ఏర్పాటు చేయించి వెంటనే బయలుదేరాము. కోటగిరిలంక శీతాయలంక హరిజవాడలు చూచుకుంటూ, రోడ్లమీద చెట్లను తొలగించుకొని పులిగడ్డ చేరాము. అక్కడ పరామర్శ చేసి అడ్డంగా పడివున్న టెలిగ్రాఫ్ స్తంభాలు తీగెలను తొలగించుకొని మోపిదేవి వరకు వెళ్ళాము. గోడక్రింద పడి చచ్చిపోయిన వారి కుటుంబాలను చూచి ఎటు వెళ్ళుటకు దారితోచక తిరిగి అవనిగడ్డ చేరాం.

## భయానక వార్తలు

పులిగడ్డ సెంటరులో అప్పుడే భావదేవరపల్లి నుండి వచ్చిన శ్రీ వెంకటేశ్వరరావు రోదిస్తూ నా వద్దకు చేరి భావదేవరపల్లి అంతా తాడిచెట్టు ఎత్తున ఉప్పెన వచ్చి ఊరంతా తుడిచిపెట్టుకుపోయిందని వందలాది మంది చనిపోయారని చెప్పారు. తాను ఒక తాడిచెట్టు మీద ఉండి బ్రతికి బయటపడ్డానని, పొలాలన్నీ కొట్టుకుపోయాయని, శవాలు, కళేబరాలు, చెట్లతో రోడ్లు నిండిపోయాయని, ప్రాణాలు అరిచేతుల్లో పెట్టుకు వచ్చానని చెప్పాడు. నా కళ్ళల్లో నీళ్ళు సుడులు తిరిగాయి. హృదయం ద్రవించుకు పోయింది. కాసేపటికి మాజీ సమితి అధ్యక్షులు శ్రీ కోట కేశవ పెరుమాళ్ళ గారు కోడూరు నుండి 13 కిలోమీటర్లు ఎంతో బాధపడి నడిచి వచ్చి దేశమంతా కొట్టుకుపోయిందని గద్గద స్వరముతో చెప్పారు. ఆయనను కూర్చోబెట్టి సేదదీర్చి, సముదాయించి జరిగిందంతా వివరంగా చెప్పమని అడిగాను. వారు యిస్మాయిల్ బేగ్‌పేట, కోడూరు సముద్ర కెరటాలకు సర్వనాశనము అయిపోయినాయనీ యిళ్ళ కప్పులు ఎక్కి ప్రాణాలు రక్షించుకున్నామని చెప్పారు. దివిసీమలో ప్రతి అణువు అభివృద్ధి చెందటానికి ఏళ్ళపాటు కృషిచేసిన నేను ఈ వినాశనాన్ని వింటూ స్థాణువులా అయిపోయాను. కోడూరు నుండి జయపురం వరకు దారి అంతా శవాలతోను, చెట్ల మోదులతోనూ నానాభీభత్సంగా వుందని, అయినా తెగించి వార్త అందించటానికి వచ్చానని చెప్పారు. నాగాయలంక నుండి డిప్యూటీ తహశీల్దారు శ్రీ నరశింహారావు రూరల్ బ్యాంకు ప్రెసిడెంటు శ్రీ వి. రాంప్రసాద్ గార్లు వచ్చి భీభత్స పరిస్థితులు గురించి రిపోర్టు చేశారు. అప్పటికే మధ్యాహ్నం 12 గంటలు అయింది. అవనిగడ్డ సబ్ ఇన్‌స్పెక్టరు శ్రీ రంజిత్‌ను ఈ ప్రమాద పరిస్థితులను గురించి ముఖ్యమంత్రి గారికి, జిల్లా కలెక్టరు గారికి కబురు చేయవలసిందిగా కోరాను.

చల్లపల్లి వైర్‌లెస్ చెడిపోయిందని బందరు మాజేరు రోడ్డు అంతా శవాలతోను, కళేబరాలతోను, చెత్త చెదారముతోను నిండిపోయి వెళ్ళటానికే అవకాశము లేదని చెప్పారు. నడిచి అయినాసరే ఏదో విధంగా వెళ్ళి ఆ కబురు అందజేయమని ఆదేశించాను.

## ఉప్పెన ప్రాంతాల పర్యటన

మధ్యాహ్నం 2 గంటలయింది. భావదేవరపల్లి వెళ్ళి మందపాకల మీదుగా కోడూరు తిరిగి వద్దామని బయలుదేరాము. వెంట శ్రీ భోగాది మాణిక్యాలరావు, శ్రీ కోట కేశవ పెరుమాళ్ళు, శ్రీ మండలి సుబ్బారావు, అర్థర్ పాల్, శ్రీ రంజిత్

ఫోటోగ్రాఫర్, శ్రీ ప్రసాద్ యింకా మిత్రులు వున్నారు. అవనిగడ్డ నాగాయలంక రోడ్డుకి అడ్డంగా పడి ఉన్న చెట్లను తొలగించుకుంటూ పక్కపట్ల వారి పాలెం చేరాం. శ్రీ మాణిక్యాలరావు గారు పర్రచివర ప్రాంతపు పరిస్థితులు తెలుసుకోవడానికి నాగాయలంక వైపుకు వెళ్ళారు. పక్కపట్లవారిపాలెం దాటిన దగ్గర నుండి భావదేవరపల్లి వరకు నానా బీభత్సంగా ఉంది. ఇది అని వర్ణించినా ఊహకందని దృశ్యాలు అవి. అంతటి భయంకర దృశ్యాలు ఎప్పుడూ ఎక్కడా చూసి వుండం.

అసలు గ్రామాలు అనేవే ఉన్నాయా? వుంటే బ్రతికి వున్న వారంతా వున్నారా? ప్రశ్నలు, సందేహాలు మనసునిండా ముసురుకున్న ఆలోచనలు చాలా ఆందోళనకు గురిచేయసాగాయి. గుండె నిబ్బరం చేసుకొని, ముక్కు మూసుకుని కాళ్ళు ఈడ్చుకుంటూ శవాల మీదుగా ప్రయాణం సాగించాం. బ్రతికి బయట పడిన ప్రజలు ఎదురు చూస్తున్నారు. గుండెలు అవిసేలా ఏడుస్తూ కౌగిలించుకొని ఏడ్చేవాళ్ళూ, కాళ్ళ మీద పడి రోదించేవాళ్ళూ, కన్నీటి గాధలు వింటూంటే మనసు కరిగిపోయింది. గుండె తరుక్కుపోయింది. ఓదారుస్తూ నాగాయలంక చేరవలసిందిగా చెప్పి భావదేవరపల్లి వైపు ప్రయాణం సాగించాం.

**శ్మశానంగా మారిన భావదేవరపల్లి**

శవాలు సంగతి సరే.... ప్రాణాలతో తిరుగుతున్న ఈ జీవచ్ఛవాలు ఆస్తులు పోగొట్టుకొని, అయ్యో అనిపించిందా ప్రజల్ని చూస్తుంటే.

ఊళ్ళోకి అడుగుపెట్టాక మా ఆత్మీయులు మునసబు ఆంజనేయులుగారు కనపడ్డారు. నోటమాట లేకుండా నిర్వీర్యులుగా నిలబడిపోయాం. కొన్ని యిళ్ళు నేలమట్టమయ్యాయి. కొన్ని కొట్టుకొని పోయాయి. దారులన్నీ కూలిన చెట్లతో కుళ్ళిన జీవాలతో నిండిపోయాయి. శ్రీ భావన్నారాయణ స్వామి వారి దేవాలయం, రామాలయం, బడి, ఏడెనిమిది పెంకుటిళ్ళూ, డాబాలు మిగిలాయి. చిన్న వూరు దాటగానే మా తమ్ముడు జనార్దనరావు ఎదురొచ్చాడు. బావురుమని ఏడ్చాడు. వాడావూరికి సర్పంచ్. ఊరంతి పిచ్చెక్కినట్లు తిరుగుతున్నాడు. పిద్దవూరు వెళ్ళాను. గవుడపాలెంలో ఒక యిల్లు కూలిపోయింది. 40 మంది చనిపోయారు. ఉన్నత పాఠశాల భవనం కూలిపోయింది. 80 మంది మరణించారు. మా ఇంటికి వెళ్ళాను. ఇల్లంతా నేలమట్టమయింది. పశువులన్నీ చనిపోయాయి. మా తమ్ముడి కుటుంబం ప్రక్కనే ఉన్న మా పెద్దన్నయ్య శ్రీ మండలి వెంకటప్పయ్య గారి కుటుంబం ఇంటి అటకమీద ఎక్కి ప్రాణాలు దక్కించుకున్నారు. నేను వెళ్ళిన పదినిముషాలకు మా యిల్లు

నేలమట్టమయింది. ఎత్తైన ప్రదేశములోనున్న మా అన్నయ్య గారి యింటికి అటక వరకు వరదలు వచ్చాయి. యింకా కొంచెము వరదవస్తే కప్పు కొట్టుకొని పోయేది. 18 నుండి 20 అడుగులు దాకా నీరు వచ్చింది. 150 కిలోమీటర్ల వేగముతో గాలులు సముద్రపు కెరటాలు రావడంతో ఆ ధాటికి కట్టడము నిలుస్తుంది. దార్లు అన్నీ చాలా ఘోరంగా ఉన్నాయి. అలాగే కొన్ని చోట్లకు మాత్రము వెళ్ళి కొద్దిమందిని మాత్రం పరామర్శించి బ్రతికి వున్న వారందరినీ నాగాయలంక, అవనిగడ్డ చేరమని చెప్పి నేను వెనుకకు తిరిగి వచ్చేసరికి చీకటి పడుతోంది.

బాధితులంతా నాగాయలంక చేరుతున్నారు. వారికి భోజన వసతి ఏర్పాట్లు చూడాలి. వెళ్ళటానికి దారులు సరిగా లేవు. అందరూ ఆందోళన పడుతున్నారు. ఏమీ ఫరవాలేదని మొండికేసి తిరిగి బయలుదేరాము. ఆ కటిక చీకటిలో కర్ర చేతితో పట్టుకుని గుండె నిబ్బరము చేసుకొని నడుస్తూ నాగాయలంక చేరుకున్నాము. రోడ్డు అన్నీ కిక్కిరిసిపోయి వున్నాయి. డిప్యూటీ తహసీల్‌దారు శ్రీ నరసింహారావును పిలిచి వారికి బియ్యం యిచ్చే ఏర్పాట్లు చేశాను. వైశ్యులు భోజనం వండిపెడుతున్నారు. అచ్చట నుండి అవనిగడ్డ చేరాను. కోడూరు ప్రాంతము నుండి వచ్చిన వారంతా గాంధీక్షేత్రములో ఉండుటవల్ల ఆ ప్రదేశం కిటకటలాడుతోంది.

**ముఖ్యమంత్రి రాక**

21వ తేదీ ఉదయం ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారు, రెవెన్యూ మంత్రి శ్రీ నరసా రెడ్డి గారు వస్తున్నట్లు రేడియో వార్తలు విన్నవారు వచ్చి చెప్పారు. ఇంతటి జలప్రళయం జరిగిందని బయట ప్రపంచానికి అప్పటికి ఎవరికీ తెలియదు. లైట్లు పెట్టుకొని ప్రజల సహకారముతో దారికి అడ్డంగా వున్న చెట్లను తొలగించుకుంటూ 8 గంటలకు గన్నవరం చేరాం. మేము వెళ్ళిన కొంతసేపటికి పత్రికా విలేఖరులు ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు గారు, రెవెన్యూ మంత్రి శ్రీ నరసారెడ్డి గారు వచ్చారు. శ్రీ నరసారెడ్డి గారు నేను సోదరులుగా ఉండేవారము. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులుగా ఆయన ఉన్నప్పుడు నేను ప్రధాన కార్యదర్శిగా వుండేవాణ్ణి. అప్పటి నుండి అత్యంత సన్నిహితులుగా ఉంటున్నాం. శ్రీ నరసారెడ్డి గారు దగ్గరకు వచ్చి ఏమిటి అలా అన్నావు అని అడిగారు. నాకు దుఃఖం ఆగలేదు. ముఖ్యమంత్రిని వారిని కౌగలించుకొని విలపించాను. ఎంతో ధైర్యంగా, మొండిగా, శవాలమీదనుంచి నడచివెళ్ళి బీభత్స దృశ్యాలను చూస్తూ ప్రజలను ఓదార్చిన నేను మన నాయకులను చూసి ఆగలేకపోయాను. గ్రామాలన్నీ కొట్టుకొనిపోయాయని, 20 సంవత్సరాలుగా

దివిసీమాభివృద్ధికి చేసిన కృషి అంతా సర్వనాశనం అయిపోయిందని, కనీసం పదివేలమంది అయినా చనిపోయి ఉంటారని చెప్పాను. 19వ తేదీ ఉదయం నుంచి 21వ తేదీ ఉదయం వరకు 28 గంటలపాటు దివిసీమతో బయట ప్రపంచానికి కమ్యూనికేషన్స్ లేక వార్తలు అందలేదు. ప్రథమంగా ఈ వార్తలు బయట ప్రపంచానికి తెలియజేశాను.

ముఖ్యమంత్రి నన్ను ఓదార్చి ఏది ఏమైనా మన ప్రజలను మనము రక్షించుకుందాం. హెలికాప్టరు ఎక్కు అన్నారు. ముఖ్యమంత్రిగారు, రెవెన్యూ మంత్రిగారు, మునిస్వామి గారు, నేను ఒక హెలికాప్టర్‌లోను, శ్రీ చనుమోలు వెంకట్రావుగారు, రెవెన్యూ బోర్డు వారు రెండవదానిలోను ఎక్కారు.

ముందుగా మచిలీపట్నం పెరేడు గ్రౌండులో దిగాము. బందరులో ఉప్పెనకు గురైన వార్ని జాతీయ కళాశాల, హిందూ కళాశాలలకు చేర్చారు. వారిని పరామర్శించి, దెబ్బతిన్న ప్రాంతాలను చూసేందుకు బయలుదేరాము. గిలకలదండి, చిన్నాపురం, కొనయాదర, వాడపాలెం లను చూచుకుంటూ దివితాలూకా ప్రవేశించాం. ఉల్లిపాలెం, హంసలదీవి, గొల్లలమోద, భావదేవరపల్లి చూచుకుంటూ అవనిగడ్డ ప్రాంతానికి వచ్చాము. చినుకులు పడుతున్నవి. దిగే చోట జనం విపరీతంగా చుట్టుముట్టి వున్నారు. వాతావరణం బాగుండలేదని హెలికాప్టరు దిగకుండానే గుంటూరు జిల్లాకు వెళ్ళాం. బాపట్ల, రేపల్లె చూసుకుంటూ, గుంటూరు వచ్చాం. గుంటూరు భారీ వర్షాల వల్ల జలమయం అయింది. గాలి వలన ఇళ్ళు భవనాలు కూలిపోయాయి.

మేము ఇందిరానగర్ పరిసర ప్రాంతాలకు వెళ్ళి చూశాం. పడిపోయిన పాకల నుండి శవాలను బయటకు తీస్తున్నారు. నానా బీభత్సంగా వుంది. ముఖ్యమంత్రిగారు జిల్లా అధికారులకు సత్వర సహాయ చర్యలకు ఆదేశాలు యిచ్చారు. అచ్చట నుండి మేము ఆ దృశ్యాలను చూచుకుంటూ విజయవాడ చేరాం. గుంటూరు జిల్లా అధికారులను, కృష్ణా జిల్లా అధికారులను సమావేశపరచి ఏది ఎలా అయినా, ఎంత ఖర్చు అయినా సహాయ కార్యక్రమాలు ముమ్మరంగా జరగాలని శ్రీ జలగం వెంగళరావుగారు ఆదేశాలిచ్చారు.

ముఖ్యమంత్రిగారి వద్ద సెలవు తీసుకొని మేము 21వ తేదీ సాయంత్రం అవనిగడ్డ చేరాం. అవనిగడ్డ అంతా కిటకిటలాడిపోతోంది. గాంధీక్షేత్రం మీద ఇసుక వేస్తే రాలని ప్రజా వాహిని హాహాకారాలు, ఆర్తనాదాలతో నిండి వుంది.

సేవాశ్రమంలో భోజనములు ఏర్పాట్లు, ఉండుటకు గాంధీక్షేత్రం, కాలేజీ భవనాలు ఏర్పాటు చేశాం. 15 రోజుల పాటు 10, 15 వేల మందికి భోజనాలు పెట్టాము. ప్రభుత్వం యిచటనే కాక, కోడూరు, నాగాయలంక, మచిలీపట్నం సెంటరులలో 50 వేల మందికి శిబిరాలు ఏర్పాటు చేసి భోజన వసతి కల్పించింది. కమీషనర్ శ్రీ సుబ్రహ్మణ్యం, కలెక్టర్ శ్రీ జి.ఎన్. రావు, ఇతర సిబ్బంది ప్రత్యేక శ్రద్ధతో సహాయ కార్యక్రమాలు పర్యవేక్షించారు.

ఇతర జిల్లాల నుండి కలెక్టర్లు, హైదరాబాదు సెక్రటేరియట్ నుండి సిబ్బందిని కూడా తీసుకు వచ్చి సహాయ కార్యక్రమాల్లో నియమించారు. అమెరికా సెటిలైట్ నుండి టి.వి. ప్రసారము వలన ప్రపంచ వార్తలు తెలిపే ఇతర దేశస్థులు కూడా రావడం ప్రారంభమైంది.

**రాష్ట్రపతి పర్యటన**

ఈ వార్త విని దిగ్భ్రాంతి చెందిన శ్రీ నీలం సంజీవరెడ్డి గారు హైదరాబాద్ వచ్చి 23వ తేదీ గన్నవరం వచ్చారు. అవనిగడ్డలో హెలికాప్టర్ దిగుటకు వీలు లేకపోవుటచే శ్రీ సంజీవరెడ్డి కారులో బయలుదేరి వెంట దారి చూచుకుంటూ వచ్చారు. వారి వెంట గవర్నరు శారదాముఖర్జీ, ముఖ్యమంత్రి జలగం వెంగళరావు, కేంద్ర వ్యవసాయ మంత్రి బర్నాలా ఉన్నారు. బాధితుల్ని పరామర్శించి ధైర్యంగా ఉండాలని చెప్పారు. విమానములో దెబ్బతిన్న ప్రాంతాలను చూచి మద్రాసు వెళ్ళి అచ్చట తుఫానుకు గురియైన ప్రాంతాలను పరిశీలించి ఢిల్లీ వెళ్ళారు. ఈ బీభత్సాన్ని గురించి ప్రధానికి వివరించారు. కేంద్ర సహాయం సత్వరంగా విచ్చేటట్టు చేశారు. 25వ తేదీ రక్షణ మంత్రి శ్రీ జగ్ జీవనరాం ఉప్పెన ప్రాంతాలను చూశారు. వారి వెంట పలువురు జనతా పార్లమెంటు సభ్యులు ఉన్నారు.

**శవసేన**

ఉప్పెన వచ్చి నాల్గు రోజులు అయినా శవాలను తీసివేసే సమస్య మిగిలిపోయింది. భీతావహం చెందిన ప్రజలు ధైర్యం చేయలేకపోయారు. సర్వోదయ నాయకులు శ్రీ ప్రభాకర్‌జీ సలహాతో శవసేన పేరుతో వాలంటీర్లను తయారుచేసి ఆ కార్యక్రమాన్ని ప్రారంభించాం. దీనితో సర్వోదయ కార్యకర్తలు, ఆర్.ఎస్.ఎస్., ఆనందమార్గ్, విద్యార్థులు, కాంగ్రెస్ కార్యకర్తలు చేరారు. ముమ్మరంగా కార్యక్రమం

సాగించారు. పోలీసులు, సింగరేణి కాలరీస్ సిబ్బంది, ఖైదీలు, స్వచ్ఛంద సేవా సంస్థలు పాల్గొని విజయవంతం చేశారు.

## మంత్రి పదవికి నా రాజీనామా

25వ తేదీ గ్రామాలన్నీ చూచి భావదేవరపల్లి చేరాను. బట్టలు పంచిపెట్టుతూంటే గ్రామస్తులంతా అతి దీనావ్యవస్థలో అచ్చట గుమిగూడారు. ఒక రాతిమీద కూర్చుని పరిస్థితులు అవలోకించాను. 20 సంవత్సరాల కృషి సర్వనాశనము అయ్యిందే అని బాధ కలిగింది. ప్రజల హీనస్థితిని చూడలేకపోయాను. పదవి బాధ్యతలకంటే ప్రజాసేవ ముఖ్యమని భావించాను. మా గన్‌మేన్‌ను పిలిచి కాగితం అడిగి పదవీ బాధ్యతలనుంచి విడుదల చేసి సేవా కార్యక్రమాలలో పాల్గొనేందుకు నన్ను విడుదల చేయమని కోరుతూ ముఖ్యమంత్రి గారికి రాజీనామా లేఖ వ్రాశాను. అది అవనిగడ్డ పంపి మెస్సేజి యివ్వమన్నాను. పోలీసు సూపరింటెండెంటు అది చూసి వెంటనే భావదేవరపల్లి వచ్చి ఇటువంటి కష్టసమయములో రాజీనామా ఇవ్వవద్దని కోరారు. పదవి ఉన్నా లేకపోయినా ప్రజాసేవ చేయగలనని పదవీ బాధ్యతలు లేకపోతే మరింత ఎక్కువగా సేవ చేయగలనని వారికి సర్ది చెప్పి పంపాను. ముఖ్యమంత్రి గారికి మెస్సేజి అందాక 26వ తేదీన అవనిగడ్డ వస్తున్నట్లు తెలియజేశారు.

26వ తేదీ ఉదయం ప్రభాకర్‌జీతో కలిసి శవాలు తీసివేసే నిమిత్తం గ్రామాలకు వెళ్ళాను. ఈ లోపుగా ముఖ్యమంత్రిగారు భావదేవరపల్లి, నాగాయలంక, కోడూరు ప్రాంతాలు చూచి అవనిగడ్డ మా ఇంటి దగ్గర వేచిచూస్తున్నట్లు యిస్మయిల్‌బేగ్‌పేటకు కబురువచ్చింది. మేము అవనిగడ్డ చేరేసరికి రాత్రి 8 గంటలు అయింది. 7 గంటలు వరకు చూచి ముఖ్యమంత్రిగారు విజయవాడ వెళ్ళిపోయారు.

పత్రికా విలేఖరులు నన్ను చుట్టుముట్టారు. రాజీనామా సంగతి ప్రశ్నించగా, రాజీనామా వార్త నిజమేనని, ఇటు ప్రజాసేవ, అటు పదవీ బాధ్యతలకు రెండింటికి న్యాయం చేకూర్చటం కష్టమని, అందువలన రాజకీయ కారణాల వలన కాదని చెప్పాను.

## బాధితుల సహాయ సమితి

నేను మంత్రి పదవికి రాజీనామా చేసి వెంటనే, అన్ని రాజకీయ పక్షాల వారిని ఆహ్వానించి, ఉప్పెన తుఫాను బాధితుల సహాయ సమితిని ఏర్పాటు చేశాను. ప్రభాకర్‌జీ గౌరవాధ్యక్షులుగ, శ్రీ ఘంటా కృష్ణమూర్తి కోశాధికారిగా, నేను అధ్యక్షులుగా, శ్రీ లవణం,

హేమలతాలవణం కార్యదర్శులుగా, వివిధ రాజకీయపక్ష నాయకులు ఉపాధ్యక్షులుగా కమిటీ చేయబడింది. శ్రీ రాజలింగం, శ్రీ రాజన్, శ్రీ జయసింహచారి మా కార్యక్రమాలకు ఎంతగానో తోడ్పడినారు. కార్యదర్శులుగా శ్రీ లవణం, హేమలతాలవణం గార్లు నిర్విరామంగా కృషిచేశారు. వచ్చిన సహాయాల్ని సత్వరంగా, సక్రమముగా అందజేయడం, సహాయ సంస్థలను సమన్వయపరిచాం. దేశ విదేశాల నుంచి వచ్చిన పరిశీలకులకు అవసరమగు సహకారం ఇవ్వడం, అధికారులతో మాట్లాడి, బాధితుల సమితి చేసిన ముఖ్యక్రమము.

**ఇందిరాగాంధీ సానుభూతి**

విపత్తులలో చిక్కుకున్న ప్రజలను పరామర్శించటానికి శ్రీమతి ఇందిరాగాంధీ 26వ తేదీ రాత్రి మద్రాసు మీదుగా నాగార్జునసాగరు వచ్చి, అచ్చట నుండి గుంటూరు పట్టణం చేరి, ఉపద్రవానికి గురియైన ప్రదేశాలను పరిశీలించి, బందరు మీదుగా మధ్యాహ్నం దివిసీమకు వచ్చారు.

భావదేవరపల్లి వరకు వెళ్ళి ఉప్పెన వల్ల జరిగిన విపత్తును తిలకించారు. ఆ రోజు వక్కపట్లవారిపాలెం నుండి భావదేవరపల్లి వరకు కాలువగట్టుల వెంటనున్న శవాలు మంటలతో శ్మశానంగా మారిపోయింది. ఆ పొగలకు శ్రీమతి గాంధీ కళ్ళు తుడుచుకుంటూ ప్రయాణము చేశారు. నాగాయలంక, అవనిగడ్డలోను వేలాది బాధితుల సభలో ధైర్యంగా ఉండాలని, విపత్తును రాజకీయంగా మార్చవద్దని చెప్పారు.

28వ తేదీ కేంద్ర ప్రభుత్వం వ్యవసాయ శాఖ కార్యదర్శి శ్రీ ఎస్.ఎ. ముఖర్జీ ఆధ్వర్యాన 7 గురు సభ్యులుగల అధికార బృందం, జరిగిన బీభత్సాన్ని అంచనా వేయటానికి వచ్చి పరిశీలించారు.

**ప్రధాని పర్యటన -**

30వ తేదీన మురార్జీ దేశాయి గన్నవరం వచ్చి హెలీకాప్టరు మీద దెబ్బతిన్న ప్రాంతాలన్నీ పరిశీలించి బాధితులను పరామర్శించారు. ఆ విపత్తును చూచి తీవ్రంగా చలించిపోయిన ప్రధాని కేంద్ర, రాష్ట్ర ఉన్నతాధికారుల సమావేశము ఏర్పాటు చేసి సత్వర సహాయ చర్యలు జరగాలని ఆదేశించారు.

ప్రపంచ ప్రఖ్యాత సంఘ సేవకులు మదర్ థెరిస్సా, బిల్లీగ్రాహం మరియు అనేక విదేశీ ప్రముఖులు వచ్చి చూచారు. భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ

కాసు బ్రహ్మానందరెడ్డి, జనతా పార్టీ అధ్యక్షులు శ్రీ చంద్రశేఖర్, సి.పి.ఐ. కార్యదర్శి శ్రీ చంద్ర రాజేశ్వరరావు, సి.పి.యం. నాయకులు శ్రీ నంబూద్రి పాద్, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసు, ఆర్.ఎస్.ఎస్. నాయకులు శ్రీ దేవరస్ మరియు వివిధ రాజకీయ పార్టీల నాయకులు వచ్చి చూసి వెళ్ళారు.

అంతర్జాతీయ సంఘాలు రెడ్‌క్రాస్, కేర్, ఎ.పి. కార్, రోటరీ, లైన్స్ క్లబ్బులు, రామకృష్ణా మిషన్, ఆర్.ఎస్.ఎస్. ఆనంద్ మార్గ్ విశ్వహిందూ పరిషత్, భారత్ సేవాశ్రమ సంఘం యింకా అనేక సంస్థలు వచ్చి సేవా కార్యక్రమాలలో పాల్గొన్నాయి.

ముఖ్యమంత్రి వెంగళరావు గారు నా రాజీనామా ఉపసంహరించుకోవలసిందిగా కోరారు. ఈ ఆపద సమయములో ప్రభుత్వమునకు క్లిష్టపరిస్థితులు ఏర్పడతాయని, సహాయ కార్యక్రమాలు సత్వరం జరగవని, రాజీనామా ఉపసంహరించుకోమని చెప్పారు. అవనిగడ్డ బహిరంగ సభలో రాజీనామా ఉపసంహరించుకోవలసిందిగా తీర్మానం చేశారు. ముఖ్యమంత్రి అభీష్టం ప్రకారం ప్రజల అభీష్టం ప్రకారం పదవిలో కొనసాగుతూ వారికి సేవ చేశాను.

నా జీవితంలో రెండు ముఖ్య సంఘటనలు జరిగాయి. 1975లో ప్రపంచములో నున్న తెలుగువారి ప్రతినిధులను, తెలుగు దేశ నాయకులను, ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆహ్వానించి తెలుగు వాణిని వినిపించి, తెలుగుదేశ సుస్థిర సమైక్యతకు, ప్రగతికి కృషిచేయడం.

ఈ శతాబ్దములో ఘోరవిపత్తుగ పరిగణింపబడిన 1977 నవంబరు ఉప్పెన తుఫాను భీభత్స సమయములో నా ప్రజల మధ్య ఉండి వారి బాధలలో భాగస్వామిని కావడం, వివిధ పార్టీల, వివిధ స్వచ్ఛంద సంస్థల సంఘ సేవకులతో కలిసి బాధితులకు సహాయం చేసే అవకాశం కలుగడం. నా జీవితంలో మరపురాని ముఖ్య సంఘటనలు.

ప్రపంచ వ్యాప్తి చెందిన ఈ రెండు కార్యక్రమాలలో ప్రముఖ పాత్ర వహించే అవకాశాల కంటే నాకు ఇంకేమి కావాలి? అదే నాకు తృప్తి. అదే నాకు సంతృప్తి. ఆపదలో ఉన్న వారిని ఆదుకున్నవారికందరకు హృదయపూర్వక అభినందనలు, నా నమోవాకములు. సేవే దైవము, సేవ చేయడమే మన కర్తవ్యము.

# 2. ప్రళయం - చేపట్టిన సేవా కార్యక్రమాలు

**1977** నవంబరు 19వ తేది- నాటికి రెండు సంవత్సరాల క్రితం కృష్ణా జిల్లా- దివిసీమలో జల ప్రళయం- బంగాళాఖాతం వాయుగుండంతో అల్లాడిపోయింది. రెండు వందల కిలోమీటర్ల వేగంతో తుఫాను వచ్చింది. చెట్లన్నీ పడిపోయాయి. పూరిండ్లన్నీ ఎగిరిపోయాయి. పరిశ్రమ భవనాలు పడిపోయాయి. సముద్రం పొంగింది. రెండు అడుగుల ఎత్తున కెరటాలు వందమైళ్ల వేగంతో కృష్ణానది ముఖద్వారంలో ఉన్న కొన్ని ప్రాంతాల్ని తుడిచిపెట్టింది. దివి బందరు తాలూకాలు మరుభూమిగా మారాయి. వేలాది మంది మరణించారు. లక్ష పశువులు చనిపోయాయి. వంద గ్రామాలు తుడిచిపెట్టుకొని పోయాయి. ఎక్కడ చూచినా మృతదేహాలు, పశు కళేబరాలు, భీభత్స దృశ్యాలు, భయానక పరిస్థితులు, ఒక వైపు శవాలు, మరొక వైపు జీవచ్ఛవాలు. బ్రతికినవారు ఎలా బ్రతికారో ఆశ్చర్యం. సముద్ర కెరటాల వెంట గిరాట్లు వేసుకొంటూ ఏది దొరికితే దానిని పట్టుకొని ప్రాణం దక్కించుకోవాలని ప్రయత్నించి బయట పడ్డారు. కర్రల్లాగా బిగిసిపోయిన పాములను పట్టుకొన్నవారూ లేకపోలేదు. ఒక గుడ్డి వాడు వాగు వెంట పైకి లేచిపోయి ఒక తాడిచెట్టు మొవ్వలో చిక్కుకొని బ్రతికి బయటపడ్డాడు. బ్రతికి బయట పడిన వారికి బట్టలు లేవు, తిండిలేదు, మాటలేదు, నిజంగా జీవచ్ఛవాలే.

వారిని ఆదుకోవడానికి కడలిని మించిన కరుణ మానవులలో ప్రవేశించింది. ఎవ్వరికి వారు వెంటనే ఆదుకొన్నారు. ఈ ప్రళయం అమెరికన్ సేటిలైట్ టి.వి. ద్వారా శరవేగంతో ప్రపంచం అంతా చూసింది. వార్తలు విన్నారు. మానవతావాదులు కదిలారు. అనేక దేశాల నుండి విమానాలలో వచ్చేశారు. అనేక స్వచ్ఛంద సంస్థలు- కేర్, కాస్రా, రెడ్‌క్రాస్, ఆక్స్, ఫోమ్, సాల్వేషన్ ఆర్మి, సేవ్ ది చిల్డ్రన్ ఫండ్, రోటరి, లయన్సు మొదలయిన అనేక అంతర్జాతీయ సంస్థలు, రామకృష్ణ మిషన్, ఆర్.ఎస్.ఎస్., డివైన్ లైఫ్ సొసైటి, గురునానక్ మిషన్, గుజరాతీ, మార్వాడి రిలీఫ్ కమిటీలు, జాతీయ సంస్థలు, ఎన్.ఎన్.ఎస్., ఎన్.సి.సి., సంఘ సేవకులు సహాయ కార్యక్రమాలలో దూకారు. వందలాది స్వచ్ఛంద సంస్థలు, వేలాది సంఘ సేవకులు వచ్చారు. ప్రభుత్వపు

వివిధ శాఖలు, సింగరేణి కాలరీస్ కార్మికులు, ఖైదీలు, మున్సిపల్ ఉద్యోగులు, పోలీసులు, డాక్టర్లు,- ఒక్కరేమిటి? ఉప్పెనకు మించిన మానవత ఉప్పొంగింది. బాధితులను ఓదార్చారు. తిండి, బట్టా ఇచ్చారు. శవాలను, కళేబరాలను తొలగించి ఖననం చేశారు. గ్రామాలకు దారులు ఏర్పాటు చేశారు. డాక్టర్లు, ఆరోగ్యశాఖ వ్యాధి నిరోధక మందులు ఇచ్చారు. బీభత్సంగా ఉన్న గ్రామాలను పరిశుభ్రం చేశారు.

అవనిగడ్డ గాంధీ క్షేత్రం, సేవాశ్రమం, నాగాయలంక, కోడూరు, బందరులలో బాధితులకు శిబిరాలు ఏర్పాటు చేశారు. ప్రభుత్వ అధికారులు సమాజ సేవకులుగా సేవకు అంకితమై పనిచేశారు. ఇళ్లు పోయిన వారికి రెండు వందలు, బంధువులు పోయిన వారికి వెయ్యి గెడలు, బాదులు, తాటాకు ఇచ్చారు. వీటితో తాత్కాలిక గ్రామాలు వేసుకొన్నారు. ఫారెస్టు డిపార్టుమెంట్ పెద్ద పెద్ద పాకలు వేశారు. స్విస్ ప్రభుత్వం వారు, రెడ్ క్రాస్ గుడారాలను ఇచ్చారు. గుడారాలతో కొన్ని గ్రామాలు తయారైనాయి.

## పెద్దల పరామర్శ

ప్రథమంగా రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి ఢిల్లీ నుండి హుటాహుటిని వచ్చి బాధితులను ఓదార్చారు. తరువాత శ్రీమతి ఇందిరాగాంధి, జగ్ జీవన్ రామ్ వచ్చారు. మొరార్జీదేశాయి వచ్చి శిబిరాలను చూచి కేంద్ర ప్రభుత్వం పునరావాస సహాయాన్ని అందజేస్తుందని చెప్పారు. కేంద్ర, రాష్ట్ర మంత్రులు వివిధ రాజకీయ పక్షనాయకులు వచ్చి ఆ భయానక పరిస్థితులను చూసి సానుభూతిని తెలియజేశారు.

కేల్, బెల్లిగ్రాహం, రాజరకిన్, డ్రగ్ మెన్ మొదలయిన విదేశాల వారు, మథర్ థెరీసా, జిల్లెళ్ళమూడి అమ్మ, స్వామి విశ్వేశ్వరయ్య, బాలా సాహెబ్ దేవరస్ మొదలయిన మహనీయులు వచ్చారు.

## పునర్నిర్మాణ కార్యక్రమాలు

ఉప్పెన వలన తుడిచి పెట్టుకొనిపోయిన గ్రామాలలో 20వేల ఇండ్లు కట్టాలని, ఇంటికి రూ॥2500/-ల గ్రాంటు ఇవ్వటానికి వెంగళరావు ప్రభుత్వం నిర్ణయించింది. ఈ స్కీమును హర్షించి ప్రథమంగా రామకృష్ణ మిషన్ వారు వెయ్యి ఇండ్లు కట్టడానికి నిర్ణయించి 1978 జనవరి 1వ తేదీన పాలకాయితిప్పలో ఈ పథకానికి శంకుస్థాపన చేశారు. శ్రీ చెన్నారెడ్డి గారి ప్రభుత్వం వచ్చి దీనిని సత్వరంగా పూర్తిచేయడానికి

కృషిచేస్తానన్నది. కృష్ణా, గోదావరులు, ప్రకాశం, విశాఖ జిల్లాల్లో కట్టాలని నిర్ణయించుకొన్న 20 వేల యిండ్లల్లో 12 వేల ఇండ్లు మాత్రం కట్టారు. 1980 జనవరిలోగా మిగిలిన ఇండ్లు పూర్తికావచ్చును. ఇంకా ఉప్పెన తుడిచిపెట్టిన గ్రామాలు కట్టవలసి వున్నాయి. వీటిని కూడ ప్రభుత్వం కట్టించగలదని ఆశిస్తున్నాం. తుఫాను తరచు రావడం వలన సముద్రతీర ప్రాంతాలలో ఉన్న గ్రామాలలో తలదాచుకోవడానికి తుఫాను రక్షిత నిలయాలను కట్టించాలని ప్రభుత్వం నిర్ణయించింది. లక్ష రూపాయలకు తక్కువ లేకుండా ఈ నిలయ నిర్మాణానికి ముఖ్యమంత్రి నిధి నుండి ఏబది వేలు ఇవ్వడానికి శ్రీ వెంగళరావు ప్రభుత్వం నిర్ణయించింది. మొదటి దఫాగా 200 తుఫాను రక్షిత నిలయాలు కట్టించడానికి స్వచ్ఛంద సంస్థలు ముందుకు వచ్చాయి. 60 రక్షిత నిలయాలు పూర్తయ్యాయి. 90 నిర్మాణంలో ఉన్నాయి. ఇంకా 50 ప్రారంభించవలసి ఉంది. షెల్టర్లు నిర్మాణ కార్యక్రమంలో 50 స్వచ్ఛంద సంస్థలు పనిచేస్తున్నాయి. స్వచ్ఛంద సంస్థలు, ప్రజలు, ప్రభుత్వాలు కలిసి పనిచేస్తే గ్రామాలను తీర్చిదిద్ది సహజ క్షేమాన్ని చేకూర్చవచ్చునని రుజువయింది. ఈ కార్యక్రమం మరింత ఉత్సాహంగా చేపట్టి గ్రామ అభ్యుదయానికి తోడ్పడదాం.

# 3. ఘోర విపత్తు - ఎదుర్కొన్న తీరు

ఈ శతాబ్దంలోనే 1977 నవంబరు 19వ తేదీన దివిసీమలో జరిగిన ఘోర విపత్తు సంభవించిన మహాదుర్దినం. ఆ కాళరాత్రి వందలాది గ్రామాలు, వేలాది మనుషులు, లక్షలాది పశువులు, కోట్లాది ఆస్తిపాస్తులకు నష్టం తెచ్చిపెట్టిన ఉప్పెన. తుఫానుల కారణంగా సర్వనాశనమయింది. భారతదేశానికి ధాన్యాగారాలయిన కోస్తా ప్రాంతం అనేక కష్టనష్టాలకు గురయింది. సముద్రంలో జడబాగ్నిని చూచి తల్లడిల్లిపోయిన తల్లులు, కెరటాలకు పైకి లేచిపోయిన పిల్లలు, ఇండ్లకప్పులపై తేలియాడుతున్న తల్లిదండ్రులు ఎవరి దారి వారిదే. ఒకరి చావు మరొకరు ఎదురుగా చూస్తూపోతున్న బీభత్సం. మైళ్ళ కొలది కొట్టుకొని పోయి తాటి చెట్లపైన వాలి ఏది దొరికితే అది-చివరకు పామును కర్ర అని పట్టుకొని బ్రతుకుజీవుడా అంటూ బయటపడిన వారు ఎందరో. కొందరికి ఏరకంగా బయటపడ్డారో వారికే తెలియదు. అటువంటి విపత్కర సమయం. ఎంతోమంది వీరోచిత పోరాటాలు సలిపి, వారు బ్రతకడమేగాక, తమ పక్కనవున్న మరెంతో మందిని బ్రతికించారు.

శరీరానికి చాలాచోట్ల బలమైన గాయాలయినవారు, ముళ్ళ పొదలలో చిక్కుకు పోయినవారు, ఉప్పునీటిని త్రాగి వికారం కలిగి బాధపడుతున్నవారు, గోచిగుడ్డలేక దిగంబరులైనవారు, అనేక విధాల బాధలతో దురపిల్లుతున్నవారిని ఆదుకోవడం ప్రప్రథమ కర్తవ్యమైంది.

20వ తేదీన ఉదయం ఉప్పెన వార్త వినగానే నేను గ్రామాలకు వెళ్ళాను. ఎక్కడ చూచినా శవాలు, జంతు కళేబరాలు, దారులన్నీ కొట్టుకొచ్చిన ముళ్ళపొదలు ఇళ్ళకప్పులతోనిండి వున్నాయి. అయినా ధైర్యంతో శవాలను కప్పివున్న చెత్త చెదారాలపైనే నడిచి గ్రామాలకు చేరాం. చచ్చిపోయినవారిలో జీవం లేకపోయినా, బ్రతికిన వారిలో జీవం వున్నా ఒక్కటిగానే కనపడుతున్నారు. జీవచ్ఛవాలంటే ఏమిటో అప్పుడు నాకర్థమయింది. శవాలదగ్గరే వున్నాను కాని ఏడ్వలేకపోతున్నాను. చూచేవారికి మతిపోయేటట్లుంది. పరిస్థితి అతిభయంకరంగా వుంది. బాధపడి లాభంలేదు. వారితోపాటు జీవచ్ఛవంలాగా వున్నా ఉపయోగంలేదు. మన కర్తవ్యాన్ని మనం

నెరవేర్చాలి. ధైర్యం తెచ్చుకొని తిరుగుతున్నాను. తాతముత్తాతలనాడు సంపాదించుకొన్న ఇల్లూవాకిలి, వస్తుసామగ్రి సర్వస్వం కోల్పోయినవారు, భార్యలను పోగొట్టుకొన్న భర్తలు, భర్తలను, పిల్లలను పోగొట్టుకొన్న స్త్రీలు, నిరాధారులైన పిల్లలు, నిర్వీర్యులైన ఉన్న ఆ ప్రజల మధ్య సేవ చేయాలంటే ఎంత ధైర్యం కావాలి. మొండితనం కావాలి. బట్టలులేని వారికి మొదట పాత బట్టలు అందజేయడం, దెబ్బలు తగిలినవారికి మందులు వేయడం ప్రారంభంలో రెండు రోజులు భోజనం లేదు. మంచినీరు లేదు. నాగాయలంక, అవనిగడ్డ, కొడాలి, బందరులలో భోజనవసతులు ఏర్పాటు చేశాం.

మూడవ రోజు ముఖ్యమంత్రిగారితో హెలికాప్టరులో కొట్టుకుపోయిన గ్రామాల పరిస్థితిని చూచాం. గ్రామాలలో బ్రతికి చిక్కుకొనిపోయిన వారిని వెదికి పట్టుకొని హెలికాప్టరుల ద్వారా రక్షించే ఏర్పాటు చేశారు. భోజనపు పొట్లాలు జార విడువ బడ్డాయి. బ్రతికిన వారికి భోజనవసతి ఏర్పాటు చేసిన తర్వాత, చచ్చిపోయినవారి సమస్య జటిలంగా తయారయింది. శవాలను, కళేబరాలను తీసివేయటానికి ఎవ్వరు ముందుకు రావటంలేదు. ప్రజలు భయభ్రాంతులతో వుండిపోయారు. వారికి ధైర్యం కల్గించడానికి ప్రభాకర్‌జీ ఆధ్వర్యంలో శవసేవనౌకదానిని ఏర్పాటు చేసి, విద్యార్థులు, యువకులు, సర్వోదయ ఆర్.ఎస్.ఎస్., కాంగ్రెస్ కార్యకర్తలు ముందుకు దూకి, పోలీసులు, సింగరేణి కాలరీస్ ఉద్యోగులు, ఖైదీలతో కలిసి శవాలఖననం, కళేబరాల తొలగింపు జయప్రదంగా చేశారు. దేశంలోని మెడికల్ విద్యార్థులు, డాక్టర్లు, ఆరోగ్యశాఖాధికార్లు, అంటువ్యాధులు సోకకుండా ముందు ఏర్పాటు చర్యలు తీసికొన్నారు. ఉప్పు నీటివలన దుర్గంధం అధికంగా వ్యాపించుటలేదు. అందుచేత అంటువ్యాధులు ప్రబలలేదు.

బందరు, దివితాలూకాలలో ఉప్పెన వచ్చిన ప్రాంతంలోని లక్షలాది ప్రజానీకానికి ప్రభుత్వం బట్టలిచ్చి భోజన వసతి సదుపాయాలు ఏర్పాటు చేశారు. రాష్ట్రపతి, ప్రధాని, మాజీ ప్రధాని అనేక మంది జాతీయ నాయకులు వచ్చి పరామర్శించారు. మదర్ థెరిసా, బిల్లీగ్రహం (ఎవెంజలిస్టు ఉద్యమనాయకుడు) వంటి సంఘ సేవకులు వచ్చి సానుభూతిని తెలిపారు. ప్రభవానందస్వామి, జిల్లేళ్ళమూడి అమ్మవచ్చి ఉప్పెన బాధితులను ఓదార్చారు. రెడ్ క్రాస్, రోటరీ, లయన్సు, కేర్, కాసా, ఎవేర్, ఇపికార్ వంటి అంతర్జాతీయ సేవా సంస్థలు, రామకృష్ణ మిషన్, రాష్ట్రీయ స్వయంసేవక సంఘం, భారత సేవాశ్రమం వంటి జాతీయ సేవా సంస్థలు, మిషనరీలు, మార్వాడి, గుజరాతీ రిలీఫ్ సొసైటీలు, అనేక స్వచ్ఛంద సేవా సంస్థలు, కార్యకర్తలు, విశ్వవిద్యాలయ

విద్యార్థులు, మెడికల్ విద్యార్థులు, ఎన్.సి.సి., ఎస్.ఎస్.సి. వారు అన్ని ప్రాంతాల సంఘ సేవకులు సహాయ కార్యక్రమాలలో ముందుకురికారు. చివరకు సైనిక పటాలాలు (మిలిటరీ) కూడా రంగంలోకి దుమికాయి. వివిధ వాణిజ్య సంస్థలు, సహకార సంఘాలు, ఎవరికి వారు తమకుతోచిన రీతిని సహాయ కార్యక్రమాలు చేశారు. బియ్యం, పప్పు, మసాలా, పాత్రలు, బట్టలు, దుప్పట్లు, కంబళ్ళు, జంబుఖానాలు - ఏ రకపు వస్తువులు అవసరమో వాటన్నింటిని సమకూర్చారు. ఉప్పెన ఎంత ఉవ్వెత్తున వచ్చిందో, సహాయ సానుభూతులు కూడా అంతకంటె మిక్కుటంగా వచ్చాయి. రహదారులలో అడ్డంకులు తొలగించడం, ఉప్పునీటిని తోడివేయడం, పంపులు వేయడం, కాల్వలు మరమ్మతులు చేయటం, మంచినీరు ఏర్పాటు చెయ్యటం ఎంతో త్వరగా అధికారులు పూర్తిచేశారు.

**పునరావాసం**

ప్రభుత్వం పోయిన ఇంటికి నూటఏబది రూపాయలు, పాత్రలకు ఏబది రూపాయలు ఇచ్చారు. అటవీ శాఖవారు 35 లక్షల గెడలు, లక్ష బల్లీలు పంపిణీచేశారు. లక్షలాది తాటాకు సరఫరా చేశారు. బాధితులు సహాయ కేంద్రాల నుండి తిరిగి గ్రామాలకు వెళ్ళి వాటితో గుడిసెలు వేసుకొన్నారు. కేర్ సంస్థ ఏడు వేలు, కాసా ఎనిమిది వేలు, లూథరడ్, మిషన్ పదిహేను వందలు, ఇతర సంస్థలు మొత్తం 17 వేలు తాత్కాలిక ఇండ్లు నిర్మాణం చేశారు. రోమన్, కాథలిక్ మిషనరీలు, యింకా ఇతర సంస్థలు ఇళ్ళుకట్టుకోవడానికి సహాయం చేశారు. రెండునెలల్లో -1978 జనవరి కల్లా పునరావాస కార్యక్రమాలు పూర్తయ్యాయి. ప్రజలంతా ఆయాగ్రామాలకు వెళ్ళిపోయారు. విభ్రాంతి నుండి సంక్రాంతికి చేరాం.

**పునర్నిర్మాణ కార్యక్రమాలు**

ఉప్పెన పూర్తిగా తుడిచిపెట్టిన గ్రామాలలో ఆర్.సి.సి. భవనాలు, తుఫాను షెల్టర్లు నిర్మించాలని ప్రభుత్వం నిర్ణయం తీసుకొంది. ప్రతి యింటికి రూ॥2,500/-లు, ప్రతి షెల్టరుకు రూ॥50,000/-లు ముఖ్యమంత్రి నిధి నుండి యివ్వడానికి యింటికి, 5000/-లకు తగ్గకుండా, షెల్టరుకు లక్షరూపాయలకు తగ్గకుండా స్వచ్ఛంద సేవా సంస్థలచే కట్టించడానికి ఏర్పాట్లుచేశారు.

1978 జనవరిలో రామకృష్ణ మిషన్ వారు పాలకాయతిప్ప, గొల్లపాలెం, ఆర్.ఎస్.ఎస్.వారు మూలపాలెం గ్రామాల నిర్మాణం, దివ్యజ్ఞాన సమాజంవారు

గొల్లలమోద షెల్టరు నిర్మాణం ప్రారంభించాం. మూలపాలెం దీనదయాళుపురంగా మారి భారత విదేశాంగమంత్రి అటల్ బిహారీ వాజ్‌పేయి గారితోనూ, శారదాపురం షెల్టరు, గొల్లపాలెం రామకృష్ణపురం పేరుతో ప్రధాని మొరార్జిదేశాయిగారితోను, గొల్లలమోద షెల్టరు ముఖ్యమంత్రి చెన్నారెడ్డి గారితోను ప్రారంభోత్సవం చేయబడినవి. ఉప్పెనవలన కొట్టుకొనిపోయిన ఇళ్ళు 25వేల దాకా వుంటాయి. వివిధ స్వచ్ఛంద సేవాసంస్థలు సహకారం వలన 13వేల యిండ్లు మాత్రం నిర్మించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

రామకృష్ణ మిషన్ 1000, తాతా రిలీఫ్ 600, రెడ్ క్రాస్ 2000, ఎవేర్ 1500, మహారాష్ట్ర రిలీఫ్ కమిటీ 1200, సోషియల్ వెల్ఫేర్ 3500, గుజరాతీ, మార్వాడీ రిలీఫ్ కమిటీలు 700, రోడ్డు రవాణా సంస్థ 400, పోలీస్ శాఖ 330, కర్నాటక రాష్ట్రం 450, గురునానక్ ట్రస్టు 200, లయన్స్ ఇంటర్నేషన్ 200ల దాకా ఇతర సంస్థలు మొత్తం 13000 ఇండ్లు నిర్మించడానికి ముందుకు వచ్చారు. అవిగాక కోస్తా ప్రాంతంలో గ్రామాలలో తుఫాను వచ్చినప్పుడు తలదాచుకోవడానికి రెడ్‌క్రాస్ 100, తిరుపతి దేవస్థానం వారు 30, తాతా రిలీఫ్ కమిటీ 17, మహారాష్ట్ర రిలీఫ్ కమిటీ 20, ఇతర సంస్థలు 200ల షెల్టర్లు నిర్మించడానికి ముందుకు వచ్చారు. కోస్తాకు 10 కిలోమీటర్ల వరకు ఉన్న గ్రామాలన్నింటి యందు ఈ షెల్టర్లు కట్టించాల్సివుంది. కొత్తగా కట్టుతున్న ప్రతి గ్రామానికి మెటల్ రోడ్డు, విద్యుచ్ఛక్తి, పోస్టాఫీస్, పబ్లిక్ కాల్ ఆఫీసులు ఏర్పాటు అవుతున్నాయి. తీర్చిదిద్దికట్టుకున్న ఈ గ్రామాలలో పంచాయితీరాజ్ వారు రబ్బిస్ రోడ్డు, మంచినీటి సదుపాయం ఏర్పాటు చేశారు. ప్రతి పెరటిలో కొబ్బరి చెట్లు వేస్తున్నారు. ఎస్.ఎఫ్.డి.ఏ. స్కీము కింద పాడి గేదెలు, ఆవులు, ఎడ్లు, గొఱ్ఱెలు ఇచ్చారు. తుఫాను తాకిడికి తుడిచి పెట్టుకొని పోయిన కాల్వలు తిరిగి త్రవ్వడం, నామరూపాలు లేకుండాపోయిన సముద్రపు కట్టను తిరిగివెయ్యడం, కొట్టుకొనిపోయిన రోడ్లను నిర్మించడం వంటి ఎంత అసాధ్యమైన పనులైనా అధికారులు, అహోరాత్రులు పనిచేసి పునర్నిర్మాణ కార్యక్రమాలు జయప్రదం చేశారు. ఉప్పునీరు పారిన భూములు, 2,3 సంవత్సరాల దాకా పంటలు పండించుటకు వీలుండదేమో అనుకున్నాం. శాస్త్రజ్ఞులు కూడ అదే అభిప్రాయపడ్డారు. మంచినీరు పెట్టి వదలిపెట్టి ఉప్పును పారద్రోలారు. రైతాంగం పట్టుదలతో కష్టపడి వ్యవసాయ యుద్ధరంగంలో సైనికులలాగా ఉప్పెన ఉప్పిన ప్రాంతంలో పరిశ్రమించారు. కృషితో నాస్తిదుర్భిక్షం అన్నారు పెద్దలు. స్వచ్ఛంద సేవా సంస్థలు, ప్రభుత్వ సహాయంతో పంటలు కూడా బాగా పండాయి. ఉప్పెన, తుఫాను వస్తాయని లోన భీతివున్నా

ప్రజలు ధైర్యం తెచ్చుకొని వుంటున్నారు. అనుకున్నప్పుడల్లా ఉప్పెన వస్తుందా, 113 సంవత్సరాల క్రితం బందరును పొట్టన పెట్టుకుంది. నిరుడు దివిసీమను మింగివేసింది.

సముద్రుడా! జాగ్రత్త సుమా అని చెప్పే విధంగా కార్యక్రమాలు జరుగుతున్నాయి. తీరవాసులు, సైనికుల లాగా తయారవుతున్నారు. అందరూ చేయూతనిస్తే ఎంతపనయినా సాధ్యమవుతుందని ఋజువు అయింది.

సంవత్సరంలో ఎంత మార్పు! ఎంత మార్పు!! గత సంవత్సరం వల్లకాడుగావున్న గ్రామాలు నేడు సర్వాంగ సుందరంగా విలసిల్లే గ్రామాలుగా నిర్మాణం కావడం. ఆనాటి ఘోర విపత్తు నుండి ఈనాటి ఘనవిజయానికి సాగిరావటం కాదా?

# 4. నాటి వల్లకాడు గొల్లపాలెం - నేటి రమణీయ గ్రామం రామకృష్ణపురం !

"ఏం బాబూ! నేను చచ్చిపోతే గాని
మా వూరుకు కంకర రోడ్డు వేయించవా?
బస్సు ఎక్కి మావూరు వెళ్ళేగతి లేదా?
బురదలో నడవలేక చచ్చి చెడి వచ్చాను"

ఆనాటి 65 సంవత్సరాల ముదుసలి అద్దంకి భూషయ్య మాటలు ఈనాటికి నా చెవుల్లో ఆ మాటలు గింగురుమంటున్నాయి. 1977 అక్టోబరులో అవనిగడ్డ గాంధీక్షేత్రంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల సమ్మేళనంలో పాల్గొంటానికి, సేవాశ్రమం ప్రారంబోత్సవానికి వచ్చిన గాంధీగారి కోడలు శ్రీమతి నిర్మలా గాంధీని, మనుమడు కనూగాంధీని చూడటానికి వచ్చి, వారిని దర్శించిన తరువాత నా దగ్గరకు వచ్చి గొల్లపాలెం సర్పంచ్ అద్దంకి భూషయ్య అన్న మాటలు అవి. భూషయ్య వెనుకబడిన జాతులకు చెందిన గౌడ కులస్థుడు. నిశానిదారు అయినా నిఖార్సు అయిన మనిషి. బక్కచిక్కి చాలా అమాయకుడుగ కనపడినా నిండు హృదయం కలిగిన నిర్మోహమాటి. ఎన్నో తగాదాలు తీర్చిన సిసలైన మనస్వి. చల్లపల్లి రాజాగారికి భూషయ్య అంటే ఎంతో ఇష్టం. నిజాయితీకి నిలబడే నిలకడ గల మనిషి. నన్ను కలిసిన నలభై రోజులకు నవంబరు 19వ తేదీన తుఫానులో ఇంటింటికి తిరిగి అందరినీ జాగ్రత్తగా ఉండమని చెప్పి ఇల్లు చేరాడు. ఉప్పెన వచ్చింది. మా కార్యకర్త కడలిలో కలిసిపోయాడు.

గొల్లపాలెం సముద్రతీరానికి మూడు కిలోమీటర్ల దూరం ఉంటుంది. పల్లె గ్రామాలకు రక్షణగా నీలం సంజీవరెడ్డి గారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు 1956లో నిర్మించిన సముద్రపు కట్ట పూర్తిగా కొట్టుకొనిపోయింది. గొల్లపాలానికి సూటిగా సముద్రం పెద్ద గుణ్ణం వేసింది. ఆ సూటిగా వున్న పాత ఉపకాలి, గొల్లపాలెం, చింతకోళ్ళ, మందపాకల పూర్తిగా తుడిచి పెట్టి, అద్దంకి వారి దిబ్బను పల్లం చేసి, మందపాకల సెంట్రల్ ఛానల్ నాగాయలంక రోడ్లను గుణ్ణాలు పెట్టి, గ్రామాలకు

గ్రామలే తుడిచిపెట్టి పదిమైళ్ళ దూరాన జయపురం దగ్గర కోడూరు, కోడూరు–అవనిగడ్డ రోడ్డుకు ఇండ్లను, శవాలను, కళేబరాలను చేరవేశాయి సముద్రపు కెరటాలు. ఎంత భయంకరమైన ఉప్పెనో! 20 అడుగుల ఎత్తున 100 మైళ్ల వేగంతో వచ్చిన వాగులకు ఏమి ఆగుతాయి? ఎవరు బ్రతుకుతారు? ఎవరితో త్రోవ వారిది? ఏది దొరికితే దానిని పట్టుకొని బ్రతకటానికి ప్రయత్నించారు. కఱ్ఱ అనుకొని పామును పట్టుకొన్నారు. ఉవ్వెత్తున కెరటాల మీద మైళ్ల కొలదీ పయనించి బ్రతుకు జీవుడా అని బయటపడ్డారు. కొందరు చెట్లను, కొందరు ఇండ్ల కప్పులను పట్టుకొని ప్రాణాలు నిలబెట్టుకొన్నారు. ఎక్కడ చూసినా శవాలే! సముద్రతీరంలో, చేల వెంట, గట్లవెంట ఎచట పడితే అచట శవాలతో, కళేబరాలతో మరుభూమిగా మారిపోయింది దివిసీమ! కడసారి భూషయ్య శవాన్ని అయినా చూద్దామని బ్రతికి బయటపడిన గ్రామస్థులు వేయి కండ్లతో వెదికారు. ఎక్కడ కనబడతాడు? ఎలా గుర్తుపడతారు? ఏ శివసేన కార్యకర్తల చేతుల మీదుగా, పోలీసుల చేతుల మీదుగా, సింగరేణి కాలరీస్ వారి చేతుల మీదుగా భూ గర్భంలో కలిసిపోయాడో? ధన్యోస్మి, మా భూషయ్య మంచి పేరుతో చివరిదాక ప్రజాసేవ చేస్తూ తన ప్రజలతో కలసి ఉప్పెనకు ఆహుతి అయ్యాడు. మూడు పర్యాయాలు పంచాయితీ ప్రసిడెంటుగా వున్న భూషయ్య ఆ పంచాయితీలో మెజారిటీ ప్రజల వెంట వెళ్లాడా అనిపించింది.

సముద్రతీరంలో పశువులను కాచుకుంటూ జీవించే గొల్లల (యాదవులు)కు నిలయం గొల్లపాలెం. వారితో పాటు గౌడులు, ముదిరాజులు, హరిజనులు ఉన్నారు. గొల్లపాలెం పంచాయితీలో ఇరాలి, ద్వారకా ఊటగుణ్ణం, బస్వానిపాలెం, శ్రీరామపురం శివార్లు ఉన్నాయి. 10 చదరపు కిలోమీటర్ల వైశాల్యం కలిగిన విశాల ప్రాంతం. పార్లమెంటు సభ్యుడుగా ఉన్నప్పుడు వ్యవసాయానికి కాలువలు త్రవ్వించి, సమితి ప్రసిడెంటుగా ఉన్నప్పుడు మట్టిరోడ్డు వేయించి, ఆ ప్రాంతం అభివృద్ధికి కృషిచేశాడు. సముద్రానికి కట్టవేసి, కట్ట వరకు వ్యవసాయం చేస్తున్నారు. పచ్చని పైర్లతో నందనవనంగా తయారయింది. సముద్రునికి కన్నెర అయిందా అన్నట్టు సముద్రపు పొంగులు వచ్చాయి. సర్వనాశనం అయింది.

21వ తేదీ హెలికాప్టరులో ముఖ్యమంత్రి వెంగళరావుతో ఆ ప్రాంతాన్ని పరిశీలించాం. సముద్రంలో తాడిచెట్లు కనబడుతున్నట్లు జలమయంగా ఉంది. గుర్తుపట్ట లేకపోయాం. నడిచి వెళ్లటానికి రహదార్లు లేవు. వారం రోజుల తరువాత హెలికాప్టరులో గొల్లపాలెంలో దిగాను. అప్పటికి ఇంకా శవాలను ఖననం చేస్తున్నారు. శ్రీరాముడు

వారధి కట్టినందుకు ఆ పూర్వపు కోపం సముద్రానికి ఉన్నట్లుగా, కొత్తగా కట్టిన ఆర్.సి.సి. రామాలయాన్ని సముద్రుడు నేలమట్టం చేశాడు. శ్లాబ్ ముక్కలు ముక్కలుగా అయిపోయింది. పాఠశాల భవనం మాత్రం మిగిలింది. భూషయ్య ఇల్లు పూర్తిగా కొట్టుకుపోయింది. ఆ స్థలం మీద నిలబడి శ్రద్ధాంజలి ఘటించాను.

గొల్లపాలెం పంచాయితీ జనాభా శివార్లతో కలిపి 4162 మంది. చనిపోయిన వారు 1901. మూడు నాలుగు వందల మంది ఇతర ప్రాంతాలకు కోతలకు వెళ్లటం చేత బతికి బయట పడ్డారు. ఆ రోజు ఊళ్లో ఉన్న జనాభాలో అధిక సంఖ్యాకులు మరణించారు. ఒక్క గొల్లపాలెం జనాభా 1181. చనిపోయిన వారు 432. బ్రతికి ఉన్నవారంతా కోడూరు, అవనిగడ్డ చేరారు. ప్రభుత్వం భోజన ఏర్పాట్లు చేసి ఆదుకుంది.

సేవకు ప్రతీకగా నిలబడ్డ రామకృష్ణ మిషన్ వారు రాజమండ్రి నుండి వచ్చి అవనిగడ్డలో నన్ను కలిసి కోడూరు వెళ్లారు. స్వామి బోధస్వరూపానంద ఆధ్వర్యం వహించారు. కోడూరులో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం వద్ద శిబిరం ఏర్పాటు చేశారు. ప్రభుత్వం బియ్యం ఇస్తుంటే రామకృష్ణ మిషన్ వారు పప్పు, నూనె, దినుసులు, కాయగూరలు పంపిణీ చేశారు. ప్రభుత్వం వెయ్యి బల్లీలు, 23వేల గేదెలు, లక్షా ముప్పై వేల తాటాకులు ఇచ్చారు. వాటితో తాత్కాలికంగా గుడిసెలు వేసుకున్నారు. రామకృష్ణ మిషన్ వారు ఎన్నో కష్టాలకు గురిఅయ్యి, ఆ గ్రామాల వెంట తిరిగి అనేక విధాలుగా వారికి సేవలు చేశారు. దుప్పట్లు, బట్టలు, వంట సామగ్రి పంచిపెట్టారు. ఆరోగ్యశాఖ వ్యాధి నిరోధక చర్యలు తీసుకొన్నది. ముఖ్యమంత్రి జలగం వెంగళరావు, ప్రపంచ ప్రఖ్యాత ఎవేంజలిస్ట్ శ్రీ బెల్లిగ్రహం, ప్రతిపక్ష నాయకులు శ్రీ వై.బి.చవాన్ ఆ గ్రామంలో హెలికాప్టరులో దిగి, ప్రజలను పరామర్శించారు. ప్రభుత్వం వారు చనిపోయిన వారికి రూ॥2,29,400లు ఇండ్లకు రూ॥34,350లు, వంట పాత్రలకు రూ॥11,450లు బియ్యం 115 క్వింటాళ్లు, గోధుమలు 37 క్వింటాళ్లు పంచిపెట్టారు. ఎడ్లు, ఆవులు, గేదెలు, దున్నలు, వ్యవసాయ పనిముట్లు ఇచ్చారు.

సహాయ కార్యక్రమాలలో నిర్విరామంగా పాల్గొన్న రామకృష్ణ మిషన్ వారు శాశ్వతమైన ఇండ్ల నిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టాలని నిర్ణయించుకొన్నారు. ఇండ్ల డిజైన్ తయారు చేయటంలో, ప్రభుత్వం వద్ద మాచింగ్ గ్రాంటు సంపాదించడంలో, వివిధ సంస్థల నుండి డబ్బు సేకరించడంలో స్వామి బోధస్వరూపానంద విశేష కృషి చేశారు. 1978 జనవరి 2న ఈ గ్రామానికి స్వామి రంగనాథానందజీ శంకుస్థాపన చేశారు. ఆ ఉత్సవానికి అధ్యక్షత వహించే భాగ్యం నాకు కలిగింది. గొల్లపాలెంను

బుల్‌డోజర్లతో సదాటు చేయించి, రోడ్లు, మురుగు పారుదల వసతులతో చక్కటి ప్లాను తయారు చేయించి 229 ఇండ్లు కట్టారు. సమశీతోష్ణత కలిగి ఉండేటట్లు, తుఫాను, ఉప్పెన తాకిడికి తట్టుకొనేటట్లు ఇళ్లు పటిష్ఠంగా నిర్మించబడినాయి.

ప్రతి ఇంట్లో రెండు గదులు, వైశాల్యం 200 చదరపు అడుగుల దాకా ఉంటుంది. కోడూరు నుండి గొల్లపాలెం దాకా కంకర రోడ్డు పంచాయితీ రాజ్ ఇంజనీర్లు చాలా కష్టపడి నిర్మాణం చేస్తున్నారు. గ్రామంలో రోడ్లు పూర్తయ్యాయి. హంసల దీవి-గుల్లల మోద కోస్తా రోడ్డు శాంక్షన్ అయింది.

మా భూషయ్య మాట నిజం అయింది. బ్రతికి సాధించాడు- చచ్చి సాధించాడు.

నాటి వల్లకాడు గొల్లపాలెం

నేటి రమణీయ గ్రామం రామకృష్ణపురం

భారత ప్రధాని వచ్చి నేడు ప్రారంభోత్సవం చేస్తున్నారు. భూషయ్య బ్రతికి ఉంటే ఎంత బ్రహ్మానందాన్ని పొందేవాడో.

*(ఆంధ్రపత్రిక 10-10-78)*

## 5. ఆనాటి చింతకోళ్ళ ఈనాటి ప్రభాకర్‌జీ పురం

పుట్టింది ఒక పేద హరిజన కుటుంబం. పెరిగింది గాంధీజీ అడుగు జాడలలో, గిట్టింది సమాజసేవలో, నాఅనే బంధువులు లేకుండా, నాది ఈ ఆస్తి అనేది లేకుండా ఎలా పుట్టారో అలాగునే గిట్టారు ప్రభాకర్‌జీ. అనంతపురంలో పుట్టిన ఈ ఆదర్శ మానవుని అసలు పేరు జోసెఫ్. గాంధీజీ ప్రభాకర్ అని పిలిచేవారు. సేవాగ్రాంలో వారిని భాయిజీ అనే వారు. వారు అందరికీ సోదరుడే. ఎక్కడ ఆపద వస్తుందో ఎవరికి బాధ ఉంటుందో అచ్చట మొదటిగా కనపడేవారు ప్రభాకర్‌జీ. ప్రభాకర్‌జీ ఒక వ్యక్తికాదు. వారొక మహా సంస్థ.

1977 నవంబరు 19 వ తేది కాళరాత్రి, ఉవ్వెత్తున వచ్చిన ఉప్పెన, పెనుతుషాను, వందలాది గ్రామాలు, వేలాది ప్రజలు, లక్షలాది పశువులు, కోట్లాది ఆస్తి నష్టం కలిగించిన జలప్రళయం. పిడుగులాంటి వార్త విన్నాడు. సేవాగ్రామంలో ఉన్న ప్రభాకర్‌జీ, పవనార్ ఆశ్రమంలోఉన్న వినోబాజీ దగ్గరకు వెళ్లారు. బీభత్సవార్త తెలియజేశారు. వినోబాజీ సానుభూతి తెలియజేసి, ప్రశాకర్‌జీకి ఒక రూపాయి, ఒక పంచె యిచ్చి సహాయ కార్యక్రమంలో తోడ్పడమన్నారు. ప్రభాకర్‌జీ అవనిగడ్డ గాంధీ క్షేత్రం చేరారు. బాధితులను ఓదార్చారు, గ్రామంలో ఉన్న శవాలను, మృత కళేబరాలను తీసివేయడానికి శవసేన ఏర్పాటు చేశారు. అనాధ పిల్లలను తీసుకుని వచ్చి సేవాశ్రమంలో పెట్టారు. గాంధీజీస్ ఫౌండేషన్, సూర్యోదయ సంఘం,నాస్తిక కేంద్రం, గాంధీ క్షేత్రం కమిటీ కార్యకర్తలు ప్రభాకర్‌జీ చింతకోళ్ల గ్రామంలో పునరావాస కార్యక్రమాలు ప్రారంభించారు. చింతకోళ్ల దిబ్బ మీద పూచికపుల్ల కూడ మిగలకుండా ఉప్పెన తుడిచిపెట్టి పోయింది. 40 మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. పశువులు మొత్తం పోయాయి.

సిమెంటు కాంక్రీటుతో కట్టిన రామాలయం నేలమట్టమయింది. చెట్ల మీద వేలాడుతున్న శవాలు, ఎచట చూసినా కళేబరాలు, బీభత్సదృశ్యం. వాటినన్నింటిని తొలగించి ఖననం చేయించారు. ముళ్లు, కంప, భయానక పరిస్థితులలో నడిచి

వెళ్లారు. ప్రజలకు ధైర్యం చెప్పి, వారిని ఆ గ్రామానికి తీసుకుని వెళ్లారు. పునరావాస కార్యక్రమాలు ప్రారంభించారు.

సహాయ కార్యక్రమంలో పాల్గొనటానికి వచ్చిన అనేక జాతీయ, అంతర్జాతీయ సహాయ సంస్థలు, అనేక మంది స్వచ్ఛంద సేవకులను సమీకరించి, సమన్వయపరచి సహాయ కార్యక్రమాలను సాగించారు.

రెడ్‌క్రాసు వారి సహాయంతో ప్రభుత్వం చింతకోళ్ల గ్రామాన్ని పక్కా ఇండ్లతో నిర్మాణం చేసింది. ఈ గ్రామం నేడు ప్రభాకర్‌జీ పురంగా పేరు పెట్టడానికి గ్రామస్థులు నిర్ణయించుకొన్నారు. ప్రభుత్వం ఆమోదించింది. గాంధీజీ కోడలు శ్రీమతి నిర్మలా గాంధీ ప్రభాకర్‌జీ పురానికి ప్రారంభోత్సవం చేస్తున్నారు. ప్రభాకర్‌జీ మన మధ్య లేరు. వారుచేసిన కృషి మన ముందు ఉంది. వారి మాటలు మారుమ్రోగుతున్నాయి. సేవాగ్రామం నుండి సేవాశ్రమం వరకు వారి జీవితయాత్ర ఆదర్శమైనది.

సమాజ సేవలో ప్రభాకర్‌జీ ఆదర్శాలు, నవసమాజ నిర్మాణానికి వారి ఆశయాలు శిరోధార్యాలు. ఆదర్శ గాంధేయవాది ప్రభాకర్‌జీ. వారి ఆశయ సిద్ధికి కృషిచేయడమే మన విధ్యుక్త ధర్మం.

## 6. విశ్వహిందూ పరిషత్ కృషి ఫలితమే - హంసలదీవి

పురాణ ప్రసిద్ధమైన హంసలదీవి 1977లో ఆంధ్రకోస్తా మీద విరుచుకుపడ్డ పెనుతుఫానుకు శ్మశానపు దిబ్బగా మారిపోయింది. ఇంచుమించు పడిపోవడానికి సిద్ధంగా వున్న వేణుగోపాలుని గుడి, చిన్న గర్భాలయం మాత్రమే గల విశ్వేశ్వరాలయాలు ఆ ప్రళయ భయంకరమైన ఉప్పెనలో గ్రామస్తులకు ప్రాణదానం చేసి ఇంటి కంటే గుడి పదిలమని మరొకసారి రుజువు చేశాయి. గుడిలోనికి చేరుకోలేని పన్నెండు మంది అభాగ్యులు తప్ప గ్రామప్రజలందరూ ప్రాణాలతో మిగలగలిగారు. అయితేనేమి బ్రతుకు ఒక శాపంగా మారింది. దివిసీమలో బ్రతికిన ప్రతి మనిషీ ఒక జీవచ్ఛవంగా మారిపోయాడు.

అట్టి అభాగ్య జీవులను ఆదుకోవడానికి ప్రపంచం అభయ హస్తం చాచింది. అనేక స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వం ఆర్తులకు వందచేతులతో వేయి రూపాలుగా సత్వర సహాయం అందించాయి.

హిందూ ధర్మం వట్టి పూజా పునస్కారాలకే పరిమితంకాదని, సమాజ పరమేశ్వరుని సేవించడమే నిజమైన దైవారాధనయని నిరూపించదలచిన విశ్వహిందూ పరిషత్ కార్యకర్తలను అభాగ్యుల ఆర్తనాదాలు కదిలించాయి. వెంటనే పరిషత్ కార్యకర్తలు రంగంలోకి దిగి ఆహార పదార్థాలు, బట్టలు, పాత్ర సామగ్రి, ఇతర నిత్యావసర వస్తువులు సేకరించి ఆర్తులకు అందించేపని ప్రారంభించారు.

ఇంతలో పరమకారుణికోత్తమమూర్తియైన శ్రీకృష్ణుని భక్తరత్నము, పరిషత్ ధర్మకర్తయైన ఉడిపి పెజావర్ మఠాధిపతి పూజ్యశ్రీ విశ్వేశతీర్థులు దివిసీమలో అనేక గ్రామాలు పర్యటించి బాధితుల కరుణామయగాథలు విని కరిగిపోయాయి. ఆర్తుల కన్నీరు తుడిచారు. వారి ఆవేదన చల్లారేలా సముదాయించారు. అందరినీ తల్లిలా పలకరించి, ఆర్తిని చల్లార్చారు. వారి అంతరంగాలలో శాంతిని నింపారు. ఆ సందర్భంలోనే పరిషత్తు ఒక గ్రామాన్ని పునర్నిర్మించుటకు దత్తత తీసుకుంటుందని, తమ యాజమాన్యంలో నున్న జనతాకళ్యాణ నిధి నుంచి తగిన ఆర్థిక సహాయాన్ని అందిస్తామని ప్రకటించారు.

పూజ్యస్వామీజీ ప్రకటనవిని కృతజ్ఞతాభావంతో, స్వామీ మీరు పరమహంసలు. హంసలదీవి పుణ్యక్షేత్రాన్ని పునర్నిర్మించండి. అంతేకాదు - ప్రతిసంవత్సరంలో కనీసం ఒక నెలరోజులైనా ఈ గ్రామంలో మీరు ఉండి గ్రామస్తులను సన్మార్గంలో పెట్టండి అని ప్రార్థించాను.

ఆ వెంటనే పరిషత్ ఆంధ్రప్రదేశ్ శాఖ తుఫాను, ఉప్పెన బాధితుల సహాయ సమితిని ఏర్పాటు చేసి, హంసలదీవికి పునర్జన్మ నిచ్చేపనికి పూనుకుంది. గ్రామంలో శిబిరం ఏర్పరచి గృహనిర్మాణకార్యాన్ని ప్రారంభించింది. 300 చదరపు గజాల స్థలంలో 235 చ. అడుగులుండే 150 ఇండ్లను నిర్మించడానికి 10 లక్షల రూపాయల పథకం తయారయింది. రామకృష్ణ మిషన్ స్వామి పూజ్య నందనారనంద స్వామి అధ్యక్షతలో 1978 జనవరి 24 న పూజ్యపెజావర్ స్వామి గృహసముదాయానికి శంకుస్థాపన చేశారు.

టౌన్ ప్లానింగ్ డైరెక్టర్ తయారుచేసిన లేఔట్‌ను తనుసరించి మద్రాసు వాస్తవ్యులు, ప్రముఖ గృహవాస్తు శిల్పి శ్రీ సి.ఆర్.నారాయణరావు రూపొందించిన ప్లానుకు అనుగుణంగా గృహసముదాయ నిర్మాణం సాగిపోయింది. పరిషత్ సేకరించిన విరాళాలకు తోడుగా పూజ్య పెజావర్ స్వామి 41/2 లక్షలు, రోటరీవారి లక్షరూపాయలు, పరిషదధ్యక్షులు గౌ. మహారాణా భగవత్ సింగుగారు రూ. 10,000/-, హైదరాబాదు బట్టల వర్తకుల సంఘంవారు రూ. 16,000/-, అమెరికాలోని హిందువులు సేకరించి పంపిన రూ. 15,000/- రాష్ట్ర ప్రభుత్వమిచ్చిన మ్యాచింగ్ గ్రాంటు రూ.3 లక్షల 75 వేలతో మొత్తం రూ.10 లక్షల ఖర్చుతో, నిర్మింపబడిన 150 ఇండ్లు, తీర్చి దిద్దబడిన బాటలు, వీధి దీపాలతో కళకళలాడుతూ హంసలదీవి మళ్లీ పుట్టింది. అమాయకులైన గ్రామప్రజల ముఖాలలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి.

# 7. తుఫాను, ఉప్పెన ప్రాంతాలలో రామకృష్ణమిషన్ విశిష్టసేవలు

మానవసేవే మాధవసేవ, బాధలలో ఉన్న తోటి మానవునికి సేవ చేయడం కన్న ఉత్తమమైన సేవ మరొకటి లేదని మానవతకు వన్నె పెట్టారు స్వామి వివేకానంద. ఈ ఆశయంతోనే ఎక్కడ ఆపద వస్తుందో, ఎక్కడ బాధ ఉంటుందో అక్కడ రామకృష్ణమిషన్ ప్రత్యక్షమవుతుంది. కరవులు, కాటకాలు, తుఫానులు, వరదలు వచ్చిన ప్రాంతాలలో సేవలో కనపడేది రామకృష్ణమిషన్.

ఐహికసుఖాలను వదలి త్యాగనిరతిలో సేవకు జీవితాలను అంకితం చేసిన సేవా మూర్తులు కాషాయబట్టలతో ప్రత్యక్షమౌతారు. వీరిని చూడగానే ఆపదలో ఉన్న వారికి కొంత శాంతి చేకూరుతుంది. కలకత్తాలో హుగ్లీనది తీరాన బేలూరు రామకృష్ణమిషన్ కేంద్రంగా వర్ధిల్లుతోంది. క్రమశిక్షణతో అహోరాత్రులు మానవసేవలో నిమగ్నమయి వందలాది సేవామూర్తులు ఉన్నారు.

1977 నవంబరు 19వ తేది ఆంధ్రప్రదేశ్‌కు దురదృష్టమైన రోజు, ఆ కాళరాత్రి వచ్చిన ఉప్పెన వలన కృష్ణానదీ ముఖద్వారంలో ఉన్న దివి, బందరు తీరప్రాంతాలలో గ్రామాలు మునిగి కొట్టుకొని పోయాయి. గంటకు రెండు వందల కిలోమీటర్ల వేగంతో వీచిన పెనుతుఫాను వలన చీరాల నుండి నర్సాపురం వరకు తీవ్రనష్టానికి గురి అయింది. 24 అడుగుల ఎత్తున ఉవ్వెతుగా వచ్చిన ఉప్పెన వలన వందలాది ఇండ్లు నేలమట్టమయినాయి. వేలాది మంది మరణించారు. లక్షలాది పశువులు బలి అయినాయి. కోట్ల రూపాయల ఆస్తి నష్టమయింది. 20వ తేది కొన్ని గ్రామాలలో తిరిగి, 21వ తేదీ ఏదో రకంగా దారి చేసుకొని గన్నవరం విమానాశ్రయంలో ముఖ్యమంత్రికి వార్త తెలిపే వరకు, ఈ ఘోరనష్టాన్ని గురించి బయటి ప్రపంచానికి వార్తలే అందలేదు. ఈ కమ్యూనికేషన్లు పూర్తిగా దెబ్బతిన్నాయి. వైర్ లెస్ కూడా పని చేయలేదు.

తుఫాను ఆగగానే రాజమండ్రి రామకృష్ణమిషన్ కేంద్రంలో ఉన్న స్వామి బోధ స్వరూపానంద, కార్యదర్శి స్వామి నందానందతో సంప్రదించి, ఇద్దరు ముగ్గురు బ్రహ్మచారులను తీసుకొని విజయవాడ చేరారు. అజిత్‌నగర్‌లో సహాయకార్యక్రమాలు ప్రారంభించారు. గుంటూరు వెళ్లి నల్వచెర్వు, చుట్టుగుంటలలో సేవాకార్యక్రమాలు కొనసాగించారు. బాపట్ల వెళ్ళి భీమవారిపాలెం, ఉప్పరపాలెం, రైలుపేట, చిల్లరగొల్లపాలెం, గోవిందనగర్ కాలనీలలో సహాయం చేశారు. మచిలీపట్టణం వెళ్లి రిలీఫ్ క్యాంపులలో వున్నవారికి చాపలు కొని యిచ్చారు. 26వ తేదీ ఉదయం శ్రీ కె.ఎల్. రావుగారితో కలిసి స్వామి బోధస్వరూపానంద అవనిగడ్డ వచ్చారు. శవాలను తొలగించటానికి శివసేన కార్యకర్తలను దళాలుగా ఏర్పాటు చేస్తున్న సమయంలో, నన్ను కలుసుకొన్నారు. కోడూరు ప్రాంతానికి వెళ్లవలసిందిగా చెప్పాను. కృష్ణాపురం నుండి కోడూరు వరకు రోడ్డు, కాలవగట్లు, ఇండ్ల కప్పులు శవాలతో కప్పబడి ఉన్నాయి. వాటిని ఆ రోజే తొలగిస్తున్నారు. ఆ బీభత్స దృశ్యాలను చూచి ఆయన చలించిపోయారు. నిరాధారులైన, ఆత్మీయులకు కోల్పోయిన వేలాది జనం క్రిక్కిరిసి ఉన్న కోడూరు బజారులో వారిని చూసి ఓదారుస్తూ, కోడూరు ప్రాథమిక ఆర్యోగ్య కేంద్రం చేరారు. అక్కడ ఇసుక దిబ్బల మీద స్థావరం ఏర్పాటు చేసుకొన్నారు. కోడూరు చుట్టుప్రక్కల పూర్తిగా ఊడ్చుకొని పోయిన పది గ్రామాల ప్రజలకు బియ్యం, పప్పు, పచారీ దినుసులు, కాయగూరలు పంచి పెట్టారు. దుప్పట్లు, బట్టలు, పాత్రలు, ఇచ్చారు. అయిదు లక్షల రూపాయల విలువగల తాత్కాలికసహాయాన్ని మూడు నెలలపాటు యిచ్చి ప్రజలను పోషించారు.

తీరప్రాంతాలలో తరచు తుఫానుల వలన ప్రజలు కష్టనష్టాలకు గురి అవుతున్నారు. ఇండ్లు పడిపోతున్నాయి. ఆర్.సి.సి. స్లాబ్‌తో ఇల్లు కట్టి 2500 రూపాయలు యింటికి ఇవ్వటానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయాలు బోధస్వరూపానందస్వామికి ఉత్సాహాన్ని యిచ్చాయి. వేయి ఇండ్లు కడతానని చెప్పారు. అడ్వాన్సుగా ముఖ్యమంత్రి నిధి నుంచి 10 లక్షల యిచ్చారు. మద్రాసు వెళ్లి స్వామి ఉద్ధవానంద సహకారంతో ఇంజినీర్లను సంప్రదించి, తుఫాన్లకు తట్టుకొనే విధంగా ఇంటి నమూనా తయారు చేయించి తీసుకొనివచ్చారు. అయిదు వేలతో ఒక యిల్లు అవుతుందని ఎస్టిమేటు వేశారు. మొట్టమొదటి పక్కా యిండ్ల నిర్మాణకార్యక్రమానికి 1978 జనవరి 1వ తేదిన పాలకాయతిప్పలో పునాదిరాయి వేసే అపూర్వ అవకాశం

నాకు కలిగింది. 2వ తేదీన గొల్లపాలెంలో స్వామి రంగనాథానంద శంకుస్థాపన చేశారు. పులిగడ్డ వద్ద సిమెంట్ రాళ్లు తయారు చేసే కర్మాగారాన్ని నెలకొల్పారు.

గ్రామాన్నంతా బుల్‌డోజర్లతో చదునుచేసి, ప్రతి యింటికి రోడ్డు సదుపాయం ఉండేటట్లు తీర్చిదిద్దిన గ్రామాల నిర్మాణం ప్రారంభించబడింది. సహాయ కార్యక్రమాలలోను, శాశ్వత నిర్మాణపథకాలను రూపొందించటంలోను నిర్విరామ కృషి సల్పిన స్వామి బోధస్వరూపానందకు అనారోగ్యం కలిగినందున, రాజమండ్రి రామకృష్ణమిషన్ కార్యదర్శి స్వామి నందానంద తాత్కాలికంగా నిర్మాణబాధ్యతలను స్వీకరించారు. తరువాత భవననిర్మాణంలో అనుభవజ్ఞులైన అరుణాచలప్రదేశ్‌లోని రామకృష్ణమిషన్‌లో పని చేస్తున్న స్వామి ప్రథమానంద శాశ్వత గృహనిర్మాణపథక బాధ్యతను స్వీకరించారు.

గ్రామాలకు సరియైన రోడ్లు లేవు. మట్టి రోడ్లన్నీ గండ్లు పూడ్చినా లారీలు వెళ్ళ లేక పోయేవి. మంచి నీరు లేదు. ఇండ్లు కట్టే సముద్రతీరగ్రామాలలో ఉండటానికి అవకాశాలు లేవు. అటువంటి క్లిష్టపరిస్థితులలో స్వామి ప్రథమానంద దీక్షవహించి అహోరాత్రులు రామకృష్ణమిషన్ కార్యకర్తలకు ఉత్సాహపరచి, 18 నెలలో 1105 యిండ్లు కట్టించారు. 229 ఇండ్లతో కట్టిన గొల్లపాలెం గ్రామానికి గత నవంబరులో ప్రధాని శ్రీ మురార్జీ దేశాయి ప్రారంభోత్సవం చేసి రామకృష్ణపురం అని పేరు పెట్టారు.

143 ఇండ్లతో కట్టబడిన వివేకనందపురానికి రామకృష్ణమిషన్ కార్యదర్శి శ్రీ స్వామి గంభీరానంద ఫిబ్రవరిలో ప్రారంభోత్సవం చేశారు. 137 ఇండ్లుగల శారదాపురానికి (ఊటగుండం) మార్చిలో రామకృష్ణమిషన్ అధ్యక్షులు స్వామి వీరేశ్వరానందజీ మహరాజ్ ప్రారంభోత్సవం చేశారు. 112 ఇండ్లతో పాలకాయతిప్ప పరమహంసపురంగా, 144 ఇండ్లతో ఉల్లిపాలెం నరేంద్రపురంగా రూపొందించ బడ్డాయి. స్వతంత్రపురంలో 112 ఇండ్లు, శ్రీరామపురంలో 41 ఇండ్లు, బస్వానిపాలెంలో 28 ఇండ్లు, కృష్ణాపురంలో 22 ఇండ్లు బాపట్ల యానాది కాలనీలో వంద ఇండ్లు మొత్తం 1105 యిండ్లు కట్టారు.

ఈ నిర్మాణపథకాన్ని రూపొందించిన స్వామి బోధస్వరూపానంద జ్ఞాపకంగా బస్వానిపాలెం పేరును బోధస్వరూపపురంగాను, ఈ పథకాన్ని జయప్రదంగా పూర్తిచేసిన స్వామి ప్రథమానంద (ప్రీతమ్ మహారాజ్) జ్ఞాపకార్థం పిండివారి దిబ్బను ప్రీతమ్

పురంగాను పిలవాలని స్థానికప్రజలు నిర్ణయించుకొన్నారు. గొల్లపాలెం, ఇరాలి, పాలకాయ తిప్పలలో తుఫాను రక్షణ కేంద్రాలను నిర్మించారు. ఇరాలి, శ్రీరామపురం, పాలకాయతిప్ప, కోడూరు, బాపట్ల యానాదికాలనీలలో దేవాలయాలను, ఒక చర్చిని నిర్మించారు. కోడూరు హైస్కూలులలో ఓపెన్ ఎయిర్ థియేటర్లు నిర్మించారు. అవనిగడ్డ సేవాశ్రమంలో మంచినీటి సరఫరా పథకం ఏర్పాటు చేశారు. అన్ని గ్రామాలలోను పంచాయతీ రాజ్ డిపార్టుమెంట్ రోడ్లు వేయించారు. ఎలక్ట్రిసిటి డిపార్టుమెంట్ వీథి దీపాలు వేశారు. నిర్మాణమయిన ప్రతి యింటికి ఎలక్ట్రిసిటీ ఇవ్వడానికి, రామకృష్ణమిషన్ వారు ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంట్‌వారికి దబ్బు కట్టారు. ఫారెస్టు డిపార్టుమెంట్ మొక్కలు యిస్తున్నారు. ఈ నిర్మాణకార్యక్రమాలనన్నింటినీ పూర్తి చేసిన తరువాత, జూలై 25వ తేదిన కృష్ణాజిల్లా కలక్టరు శ్రీ మోహన్ కందా అధ్యక్షతన స్వామి ప్రథమానందకు, స్వామి బోధస్వరూపానందగార్లకు కృతజ్ఞతలను తెలుయజేసి స్థానికప్రజలు వీడ్కోలు యిచ్చారు.

ఈ బృహత్తర నిర్మాణపథకానికి 70 లక్షలు ఖర్చు అయింది. ప్రభుత్వం 20 లక్షలు యిచ్చారు. ఆంధ్రప్రభ ఆరున్నర లక్షలు, ఈనాడు మూడు లక్షలు, ఎన్.టి.ఆర్. దాదాపు తొమ్మిది లక్షలు, దక్కన్ క్రానికల్ బెంగళూరు జిందాల్ పరిశ్రమ, సింధీ అసోసియేషన్ చెరొక రెండేసి లక్షలు, అమెరికా తెలుగు అసోసియేషన్, ఏలూరు జగత్ మిల్లు లక్ష వంతున ఇంకా చిన్న చిన్న మొత్తాలుగా విరాళాలు యిచ్చారు. వీరందరకీ మా కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాము.

రామకృష్ణమిషన్ అధ్యక్షులు స్వామి వీరేశ్వరానందజీ, ఉపాధ్యక్షులు స్వామి గంభీరానందజీ, కార్యదర్శి స్వామి వందనానందాజీ, సహాయకార్యదర్శి స్వామి గహనా నందాజీ, స్వామి ఆత్మస్థానందాజీ, హైదరాబాద్‌లో ఉన్న రామకృష్ణమిషన్ అధిపతులు స్వామి రంగనాథానందజీ, వివిధప్రాంతాలలోని రామకృష్ణమిషన్ స్వామీజీలు వచ్చి ఈ కార్యక్రమాలను చూసి ఆనందించారు. రామకృష్ణమిషన్ గురించి ప్రధాని, ముఖ్యమంత్రి ప్రశంసించారు.

సర్వాంగసుందరంగా నిర్మించిన ఈ గ్రామాలలో నివసించే ప్రజల ఆర్థిక స్తోమతలను పెంచేటందుకు కోడూరు పంచాయతీవారు యిచ్చిన ఐదు ఎకరాలలో శారదాశ్రమం ఏర్పాటు చేసి బొంబాయి వాణిజ్యవేత్త శ్రీ ష్రాఫ్ ఆధ్వర్యంలో గ్రామశ్రీ

సొసైటీని స్థాపించారు. శ్రీ కుప్పా వెంకట్రామశాస్త్రిగారు సహాయకార్యదర్శిగా ఉండి నిర్వహిస్తున్నారు. వ్యవసాయ, మత్స్యపరిశ్రమల అభివృద్ధికి పథకాలు తయారు చేస్తున్నారు.

వీరు నిర్మించిన గ్రామాలలో విద్యాభివృద్ధికి రామకృష్ణమిషన్ కేంద్రాన్ని కూడా ఏర్పాటు చేయమని అధ్యక్షులను కోరాము. వారు ఈ విషయం ఆలోచించగలమని అన్నారు. రామకృష్ణమిషన్ చరిత్రలోనే ఇది పెద్ద శాశ్వత నిర్మాణకార్యక్రమం, సమాజసేవ చరిత్రలో రామకృష్ణమిషన్ ఈ బృహత్తర మానవసేవ సువర్ణాక్షరాలలో లిఖించబడగలదు. వారు చేస్తున్న సేవను ఆదర్శంగా తీసుకొని స్థానికప్రజలు కష్టించి పనిచేసి ఆర్థికస్తోమతలను పెంచుకొని నవసమాజనిర్మాణానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాను. మహత్తరసేవ చేసిన రామకృష్ణమిషన్ వారికి ధన్యవాదాలు.

*(ఆకాశవాణి ప్రసంగం)*

# 8. కృష్ణాజిల్లాలో - పోలీసుల సేవ
## సేవాభావంతో ఖాకీలు కారుణ్యమూర్తులైనవేళ...

భారతదేశంలో 20వ శతాబ్దంలోనే అతిపెద్ద 'జలప్రళయం'గా పరిగణిస్తున్న మరణాంతక పెనుఉప్పెన 1977 నవంబర్‌లో సంభవించింది. ఈ భారీఉప్పెన ఉద్ధృతిలో డజన్లకొద్దీ గ్రామాలు నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకుపోయాయి. వేలాదిమంది మరణించారు. లక్షలాది పశువులు ప్రాణాలు కోల్పోయాయి. కోట్లాదిరూపాయల ఆస్తినష్టం సంభవించింది.

ఈ పెను ఉప్పెన జలప్రళయం సంభవించిన ప్రాంతాలు విస్తారమైన మరుభూమి (శ్మశానాలు) లుగా మారిపోయాయి. ఎక్కడ చూసినా మానవమృతదేహాలు, పశువుల కళేబరాలే... ఎక్కడ చూసినా పైకప్పులు కూలిపోయిన శిథిలగృహాలు, ముళ్ళకంపలతో నిండి కానరాని కాలిబాటలు, రహదారులు... ఎక్కడ చూసినా ఇలాంటి భీతావహదృశ్యాలే. ఎంతో గుండెధైర్యం గల వారికి సైతం ఈ దృశ్యాలు గగుర్పాటు కల్గించేవే. ఎలాగో ఉప్పెన ధాటినుండి బ్రతికి బయటపడ్డవారు దీనంగా, నిస్సహాయులై మిగిలిపోయారు.

ఈ జలప్రళయ విపత్తుకు గురైన ప్రజలను ఆదుకోవడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రంగంలోకి దిగింది. ప్రభుత్వ మరియు స్వచ్ఛంద సంస్థలకు చెందిన సహాయ సిబ్బంది వినాశనం జరిగిన ప్రాంతాలలో సహాయ కార్యకలాపాలలో నిమగ్నమైనారు. వారితోబాటు పోలీసులు, జైళ్ళలో శిక్షలు అనుభవిస్తున్న ఖైదీలు సైతం సహాయ కార్యక్రమాలలో పాల్గొన్నారు. మృతకళేబరాలను తొలగించి, సంస్కారాలు జరపడం రాష్ట్ర ప్రభుత్వం తక్షణ కర్తవ్యం. సేవాభావం గల కొందరు వ్యక్తులు, అంకిత భావం గల కొందరు కార్మిక బృందాలసహాయంతో మృతకళేబరాల తొలగింపును చేపట్టారు. అయితే ఈ తీవ్రతర బాధ్యతను ప్రభుత్వ సంస్థలు అధికంగా తీసుకోవలసి వచ్చింది. ఈ విషయంలో పోలీసులు, శిక్షలు అనుభవిస్తున్న ఖైదీలు చేసిన సేవలు, నిర్వహించిన బాధ్యత సువర్ణాక్షరాలతో లిఖించదగింది. వారెంతో బృహత్తర కార్యాన్ని నిర్వహించారు. వాటిని పరిశీలిస్తే వారు నిర్వహించిన అత్యుత్తమ సేవలను కొనియాడకుండా

వుండలేను. ఈ సేవాకార్యక్రమాలలో నిమగ్నమైన పోలీసులను చూసినపుడు, పోలీసులపై వున్న వ్యతిరేక భావం తొలగిపోయి వారు చేసిన సేవలను మెచ్చుకోకుండా వుండలేరు. పోలీసులు తమ విధినిర్వహణలో భాగంగా కఠినంగా వుంటారు గనుక సహజంగానే వారి పట్ల ప్రజలలో సదభిప్రాయం వుండదు. అలా కఠినంగా మాట్లాడేపోలీసులు అవసరంవస్తే రాత్రికిరాత్రే రంగంలోకి దిగి విపత్తులో చిక్కుకున్న ప్రజలను ఆదుకుని ప్రజలకు అక్కరకు పనికొచ్చే స్నేహితులైనారు. పోలీసులను అలా సేవాకార్యక్రమాలలో ముందుండి నడిపించిన వ్యక్తి, సేవా భావం, క్రియాశీలత గల ఎస్.పి. శ్రీవీరనారాయణరెడ్డి. నేను, ఆయన అందుబాటులోని కనీస సౌకర్యాలతో రాత్రింబవళ్లూ బాధిత ప్రజలను ఆదుకోవడానికి నిర్విరామంగా శ్రమించాము. జీవిత కాలం నేను సేవలందించిన ప్రాంతాలలో ఆప్తులు, సన్నిహితులు, మా ప్రజలు ఈ జలప్రళయంలో సర్వస్వం కోల్పోయి, నిరాశ్రయులుగా నిలవడం నన్నెంతో కలచివేసింది. అంకిత భావంతో ఎన్నో ఏళ్ళపాటు శ్రమించి నేను చేసిన అభివృద్ధి ఈ పెను విపత్తుకారణంగా, విధ్వంసానికి గురికావడం నన్నెంతో కలవరపరచింది. ఇలాంటి విపత్కర, వినాశకర పరిస్థితులు నెలకొన్న తరుణంలో ప్రజలను ఆదుకోలేకపోయిన మంత్రి పదవిలో కొనసాగడం సముచితంకాదని నేను మంత్రిపదవికి రాజీనామా చేశాను. మంత్రి పదవికి నేను చేసిన రాజీనామాను వైర్‌లెస్ ద్వారా రాజధాని హైదరాబాద్‌కు తెలియజేయమని నా భద్రతా సిబ్బందిని కోరాను. అంతలోనే ఎస్.పి.వీరనారాయణరెడ్డి భావదేవర పల్లికి వచ్చి మంత్రి పదవికి రాజీనామా యోచనను పునఃపరిశీలించాలని కోరారు. మంత్రి పదవిలో ఉన్న మీ అంతటి వ్యక్తే అలాంటి రాజీనామా చేస్తే, క్షేత్రస్థాయిలో పనిచేస్తున్న ఇతర కార్మికులు, సిబ్బందిని నిరుత్సాహానికి గురిచేసి, వారి మనోస్థైర్యాన్ని దెబ్బతీస్తుందని ఎస్.పి.నాతో చెప్పారు. అయితే ఈ విపత్కర పరిస్థితిలో మంత్రి పదవిలో కొనసాగడానికి 'నా అంతరాత్మ' అంగీకరించలేదని, అందువల్లనే రాజీనామా చేస్తూ సందేశం పంపమని కోరానని ఎస్‌పితో అన్నాను. అప్పుడు ఆయన సుదీర్ఘమైన నిట్టూర్పువిడచి, కన్నీళ్ళతో బాధిత హృదయంతో వెనుదిరిగారు. అప్పుడు నేను ఆయనలోని 'మనిషి'ని చూశాను. ఈ పోలీసు అధికారి ఎంతటి మానవీయ దృష్టికలవారో, కఠినంగా వ్యవహరించే ఈ పోలీసు అధికారిలో, యూనిఫాం వెనుక ఎంతటి ఔన్నత్యం, మానవీయత దాగి ఉన్నాయో నేను గ్రహించగలిగాను. ఆయనను ఇంకా గుర్తుచేసుకుంటూనే వున్నాను. ఆయనే ఎస్.పి.రెడ్డి. ఆ క్షణంలో ఆయన అంటే అమిత ప్రేమ కలిగింది.

ఉప్పెనలో కోస్తా గ్రామమైన సార్లగొంది సంపూర్ణంగా తుడిచిపెట్టుకుపోయింది. జాలర్ల గ్రామాలలో 2 వేల జనాభా గల ఆ గ్రామమే పెద్దది. చేపలు పట్టడమే అక్కడి ప్రజల ప్రధాన వృత్తి సాగరమే వారి జీవన దేవత. ఇన్నేళ్లూ... ఇన్నాళ్లూ జాలర్లకు అన్నంపెట్టి, ఆదరిస్తున్న సముద్రం హఠాత్తుగా ఉప్పెనరూపంలో పెనుభూతమై విరుచుకుపడి వారిలో సగంమందిని కబళించింది. రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుతోబాటు హెలికాప్టర్ నుండి నేను ఆ ప్రాంతాన్ని వీక్షించగా సార్లగొందిలో 3 ఇళ్లు, ఒక కుక్క మాత్రమే కన్పించాయి. అవి పాఠశాల భవనం, పంచాయితీ భవనం, మరియు నాగులమాలి భవనం మాత్రమే మిగిలాయి. అక్కడ ఒకగ్రామం ఉండేదేమోననిపిస్తుంది. ఈ దృశ్యాన్ని చూసిన కఠిన హృదయాలైనా కరగకమానవు. అమెరికాకు చెందిన క్రైస్తవ మత బోధకుడు బిల్లీ గ్రాహం కూడా ఉప్పెన వల్ల కలిగిన వినాశనాన్ని చూసి చలించి, ఒక బాధిత మృత కళేబరాన్ని అంతిమ సంస్కారాలు నిర్వహించారు. సిక్కిం మంత్రి శ్రీరామచంద్రకూడా ఈ విపత్తును చూసి చలించిపోయి తన వద్ద ఉన్నదంతా నిరాశ్రయులైన వారిని ఆదుకునేందుకు ఇచ్చేశారు. ఈ సార్లగొంది గ్రామాన్నే ఎస్.పి.వీరనారాయణరెడ్డి పునరావాసం కోసం దత్తత తీసుకున్నారు. వెళ్ళడానికి కూడా వీలులేని సార్లగొంది గ్రామంలో ఎస్.పి.రెడ్డి, అంకిత భావం గల సహాయకుల బృందంతో కలిసి అహోరాత్రాలు సహాయ పునరావాస కార్యక్రమాలు నిర్వహించారు. మొత్తం గ్రామమంతటా ఎక్కడ చూసినా నీళ్ళు, ముళ్ళ కంపల పొదలే. వేసవిలో ఈ గ్రామంలో దుమ్ము-ధూళీ. చలికాలంలో బురద, తేమ సహాయ, పునరావాస కార్యక్రమాలకోసం ఈ సార్లగొంది గ్రామాన్ని ఎస్.పి. దత్తత చేసుకోవడం సాహసోపేతమే. ఫలితం ఎస్.పి. తన సిబ్బందితో ఆ గ్రామాన్ని పునర్నిర్మించగలిగారు. ఉప్పెన కంటే ముందునాటి కంటే సార్లగొంది గ్రామం ప్రస్తుతం మెరుగ్గా వుంది. గతంలో భద్రతా చర్యలకే పరిమితమైన భద్రతా సిబ్బంది ప్రస్తుతం సేవా భావాన్ని పుణికిపుచ్చుకున్నారు. ప్రజలు పోలీసులంటే దూరంగా తొలగిపోయేవారు. అలాంటి పోలీసులు ప్రస్తుతం ప్రజలకు స్నేహితులైనారు. పునరావాసంలో పోలీసులు చేసిన కృషి, సాధించిన విజయాలే వారిని ప్రజలకు చేరువచేశాయి. పోలీసులిప్పుడు సార్లగొంది గ్రామస్థులకు స్నేహితులు, మార్గదర్శకులు. పోలీసులు జరిపిన పునరావాస కార్యక్రమాల్లో ప్రజలు పెద్దగా పాల్గొనకపోయినా ఈ ఫలితాన్ని సాధించగలిగారు. ఈ సందర్భంగా వారు సాధించిన విజయాలకు గాను, పునరావాస కార్యక్రమాన్ని స్వయంగా పర్యవేక్షించిన శ్రీనాయుడు బ్రహ్మారావును అభినందించకుండా వుండలేను. ఆయన బృహత్తర బాధ్యతను నిర్వహించారు. ఆయన అంకితభావం ప్రశంసనీయం.

అప్పటి ఐ.జి.పి. శ్రీరామచంద్రారెడ్డి ద్వారా జిల్లా పోలీసులకు సహాయం లభించిన మద్దతు వల్లనే ఈ పునరావాస కార్యక్రమాన్ని చేపట్టి విజయవంతం చేయగలిగారు. ప్రస్తుత ఐజిపి శ్రీనారాయణరావు కూడా సహాయ కార్యక్రమాలకు తమ మద్దతు కొనసాగించారు. సార్లగొంది గ్రామస్థులలో ఆత్మస్థైర్యం నింపి, వారిని తిరిగి గ్రామానికి తీసుకొచ్చి, మెరుగైన జీవితం గడపడానికి తోడ్పడిన ఈ ఇద్దరు పోలీసు అధికారులకు ఆ గ్రామస్థులెంతో ఋణపడివున్నారు. పోలీసు శాఖలో క్రమశిక్షణ చూసిన నేను, దివిసీమలో సంభవించిన పెను ఉప్పెన తర్వాత తొలుత సహాయం, ఆ తర్వాత పునరావాస కార్యక్రమాలు నిర్వహించడంలో క్రియాశీలంగా వ్యవహరించిన పోలీసులను అభినందించకుండా వుండలేను. వారికి దివిసీమ ఋణపడివుంది.

పోలీసులూ మనుషులేనని, వారిలోనూమానవత్వం నిండి వుందని ప్రజలకు తెలియజేయడానికే దేవుడు ఈ ఉప్పెన కల్పించాడా అని ఒకోసారి నేను ఆశ్చర్యపోతుంటాను. అవకాశమిస్తే ఇతర వర్గాల ప్రజలతోబాటే, అంతకంటే మెరుగ్గానే ప్రభుత్వ సంస్థల సిబ్బంది మెరుగైన సేవాకార్యక్రమాలు నిర్వహించగలరనడానికి సార్లగొంది పునరావాస కార్యక్రమం అమలే ఓ ప్రత్యక్ష ఉదాహరణ. ఈ సంక్షోభసమయంలో అలవరచుకున్న సహాయవైఖరిని, మునుముందుకూడా అవసరమైన సమయంలో ప్రదర్శించి, ప్రజలకు తమ సేవా కార్యక్రమాల ద్వారామరింత చేరువై ఆపత్కాలంలో ఆదుకోగలరని ఆశిస్తున్నాను.

# 9. బిల్లీ గ్రాహంనగర్ - దైవస్వరూపుని కానుక

క్రైస్తవ మతబోధకుడు డాక్టర్ బిల్లీ గ్రాహం గురించి, ఆయన మానవాళికి అంకితభావంతో చేసిన సేవల గురించి, మానవసేవలో ఆయన మహత్తర కృషి గురించి, గ్రాహం గొప్పతనం గురించి నాకు సన్నిహితులైన కొందరు క్రైస్తవ సోదరులద్వారా విన్నాను. 20వ శతాబ్దంలో అతిపెద్ద విపత్తుగా పరిగణించే పెను ఉప్పెన, తుఫాను 1977 నవంబర్ 19వ తేదీన దివిసీమ ప్రాంత జన జీవితాన్ని అత లాకుతలం చేసింది. ఈ విపత్తులో ఎందరో మరణించగా మరెందరో నిరాశ్రయులైనారు. అలాంటి బాధితులను ఆదుకోవడానికి, ఓదార్చడానికి డాక్టర్ బిల్లీగ్రాహం 1977 డిసెంబర్ 8వ తేదీన దయార్ద్ర హృదయులైన తన సేవాబృందంతో కలిసి అవనిగడ్డలో అడుగిడినారు. అలాంటి కారుణ్య మూర్తి సహాయ బృందాన్ని ఆహ్వానించే విశిష్ట గౌరవం నాకు దక్కింది. బిల్లీగ్రాహం కరుణామయుడైన ఏసుక్రీస్తు చేసిన బోధనలను, సువార్తను విన్పించడానికే భారత పర్యటన ఉద్దేశ్యం. ప్రకృతి వైపరీత్యాలలో సర్వస్వం కోల్పోయిన బాధితులలో మనోధైర్యం నింపి, వారిలో జీవనోత్సాహం కల్గించేందుకు దైవమే డాక్టర్ బిల్లీగ్రాహం పర్యటనను ముందుగానే నిర్ణయించాడని విశ్వాసులు చెబుతారు. విపత్తు సంభవించిన వెంటనే బాధితులను ఆదుకోవడానికి గ్రాహం బృందం సహాయ, పునరావాసం కోసం దివిసీమలో అడుగిడటమే అందుకు నిదర్శనమని విశ్వాసుల భావన. ఉప్పెన వచ్చిన వెంటనే బిల్లీగ్రాహం ఇండియారావడం యాధృచ్ఛికమేనని మరికొందరి అభిప్రాయం. ఏదిఏమైనా డాక్టర్ గ్రాహం పర్యటన ఆపత్తులో వున్నవారిలో మనోస్థైర్యం నింపడానికి ఉపకరించిందనేది నా అభిప్రాయం. డాక్టర్ గ్రాహంసేవలను, ఆయన వ్యక్తిత్వాన్ని ప్రపంచమంతా కొనియాడింది. అలాంటి సమున్నత వ్యక్తికి స్వాగతం చెప్పినపుడు నాకేమనిపించిందో నేను చెప్పలేను. కొన్నేళ్ళ తర్వాత బిల్లీ గ్రాహంపై జాన్ పొల్లాక్ రాసిన పుస్తకాన్ని చదివినపుడు, 1974 మేలో న్యూజెర్సీ వ్యాపారి ట్రెంటన్ రాసిన లేఖలో వ్యక్తం చేసిన అభిప్రాయమే నాకు కూడా కలిగిన విషయం గుర్తొచ్చింది. అలా ఎంతో ఆరాధించే అలాంటి గొప్పవ్యక్తి ఉప్పెన, తుపాను బాధితులను ఆదుకోవడానికి ఇక్కడికి రావడం, మనం నైరాశ్యంలో ఉన్నప్పుడు

మన మధ్యకు రావడాన్ని బట్టి చూస్తే దైవంపై ఆయనకు గల అకుంఠిత విశ్వాసం అతని సేవా కార్యక్రమాల ద్వారా వ్యక్తమైందనే భావన నాకు కలిగింది.

బిల్లీగ్రాహం సర్వస్వం కోల్పోయిన సొర్లగొంది, గొల్లపాలెం గ్రామాలను హెలికాప్టర్ ద్వారా సందర్శించారు. ప్రకృతి విపత్తుల బాధితులను ఆదుకోవాలనే ఆయన తహతహను నేను గమనించాను. ఇంతటి పెనువిపత్తును తానెన్నడూ చూడలేదని చెప్పిన బిల్లీగ్రాహం, వెంటనే స్పందించి టీవీలద్వారా కోట్లాదిమంది ప్రపంచ ప్రజలకు బాధితులను ఆదుకోవడానికి ముందుకు రావాలని విజ్ఞప్తి చేయడం, ఉప్పెన బాధితుల సహాయ, పునరావాసాల కోసం స్వయంగా ఉదారంగాసాయం చేయడం, బిల్లీ గ్రాహంను సజీవ మహోన్నత మూర్తిగా పరిగణించకుండా వుండలేము. బాధితులకు ఆయన దైవ స్వరూపుడే. సహాయం పొందిన లబ్ధిదార్లకు గ్రాహం 'దైవదూత'. మనందరికీ ఆయన మన జీవితకాలంలో కలుసుకున్న మహోన్నతవ్యక్తి.

ఉప్పెనలో పూర్తిగా తుడిచిపెట్టుకుపోయిన వాటిలో కనీసం ఒక గ్రామాన్ని అయినా పునర్నించాలని, అందుకు బిల్లీ గ్రాహం పేరు పెడతామని నేను సూచించగానే ఆయన అందుకు అంగీకరించారు. గణపవరం గ్రామ పునర్నిర్మాణానికి ఆర్థిక సాయం అందించడానికి గ్రాహం సమ్మతించారు. బిల్లీగ్రాహం మతబోధకుల సంఘం అందించిన విరాళం, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి సహాయ నిధినుండి అందిన అంతేమొత్తం గ్రాంటు కలిపి 285 ఇళ్ల నిర్మాణాన్ని పూర్తిచేయగలిగాము.

ఆ గ్రామాన్ని పూర్తిగా పునర్నిర్మించి 'బిల్లీగ్రాహం నగర్' అని పేరుపెట్టడం జరిగింది. సాటి మానవులకు సహాయపడాలనే మానవీయ దృష్టికి ఇది నిదర్శనం. ఈ ప్రాజెక్టు ద్వారా లబ్ధి పొందిన వారు తోటివారికి తోడ్పడాలనే ఉదాత్త ఆశయాన్ని అలవరచుకుని, ఇతర ప్రాంతాలలో కష్టాలుపడుతున్న స్త్రీ,పురుషులకు తమ శక్తిమేరకు సాయమందించడం ద్వారా కృతజ్ఞతా ఋణభారాన్ని తీర్చుకోగలరని ఆశిస్తున్నాను. భవిష్యత్తులో దేశంలో ఇలాంటి విపత్తులు సంభవించినపుడు బాధితులను ఆదుకోవడానికి తగు విధంగా స్పందిస్తారు.

దివిసీమప్రాంతంలో డాక్టర్ బిల్లీ గ్రాహం పర్యటనకు ముందు, ఆ తర్వాత జరిగిన సంఘటనలను మననం చేసుకుంటే, నా సన్నిహిత మిత్రుడు, సహచరుడు డాక్టర్ సి. హెచ్. దేవానందరావు అందించిన విలువైన సేవలను మరువలేము. డాక్టర్ బిల్లీగ్రాహం దివిసీమ పర్యటన ఏర్పాటులో సహాయపునరావాస పథకం

పొందించడంలో, అమెరికాలో పర్యటించి ఆ పథకం అమలుకు ఆర్థిక సహాయం రాబట్టడంలో, పథకాన్ని విజయవంతంగా పూర్తిచేయడంలో డాక్టర్ దేవానందరావు కృషి మరువలేనిది. ఈ ప్రాంత ప్రజలు ఆయన పాత్రను సదా గుర్తుంచుకుంటారు. ఆయన కోసం ప్రార్థనలు చేస్తారు.

ఈ తరహా సహాయ పునరావాస పథకాలు అమలుచేయాలంటే కేవలం ధనమొక్కటే చాలదు. ఆ పథకం అమలుకు సంపూర్ణంగా అంకితభావంతో సేవలందించే వారెంతో అవసరం. మన అదృష్టవశాత్తూ అలాంటి అంకితభావం గల వ్యక్తులు చీఫ్ ఇంజనీర్ శ్రీ ముర్రే, మరోసీనియర్ ఇంజనీర్ శ్రీ ముసలయ్య, క్రైస్తవ సహాయ పునరావాస కేంద్రానికి చెందిన శ్రీ శాంసన్ రామకృష్ణయ్య రూపంలో సేవలందించారు.

సేవలో సుప్రసిద్ధుడైన డాక్టర్ బిల్లీగ్రాహం కుమారుడు అంతే సుప్రసిద్ధుడైన శ్రీ ఫ్రాంక్లిన్ గ్రాహం బిల్లీగ్రాహం ఇంటర్నేషనల్ మిషన్ ఉపాధ్యక్షుడు డా. వ్లార్ వెజ్ స్మిత్‌లు 1980 జూన్ 29న బిల్లీగ్రాహం నగర్‌ను సందర్శించడం, అక్కడి నివాసులకు చిరస్మణీయదినం. కొత్తగా నిర్మించిన ఇళ్ళను, చర్చిని వారు దైవానికి అంకితం చేసారు. ఈ సుదినాన మానవాళి సేవకు పునరంకితం కావడమే మనందరూ ఈ పథకం అమలుకోసం శ్రమించిన వారికోసం అర్పించే అసలైన నివాళి. మానవసేవే మాధవసేవ అనే భావన భారతీయ సంస్కృతిలో అంతర్భాగం.

డాక్టర్ బిల్లీగ్రాహం కృషివల్ల ఇప్పుడు మనకు శుభ్రమైన, సుందరమైన గ్రామం లభించింది. మానవుడు స్వచ్ఛమైన జీవితం, అందరి సంక్షేమంకోసం అంకితమయ్యే జీవితం గడపాలి. స్థానిక నివాసులకు దైవంపై విశ్వాసం కలిగే మరో తాజా అవకాశం లభించింది. మానవాళికెలా సేవచేయాలో సమాజం మార్గం చూపింది. దేవుడు పురుషులు, స్త్రీలు, పిల్లలలో జీవిస్తాడనే భారతీయ విశ్వాసానికి అనుగుణంగా జీవించాలి. వారికి సేవ చేయడమంటే తనకు సేవచేసుకోవడమే.

దివిసీమ ప్రాంతంలో అమలుచేసిన బిల్లీగ్రాహం, తదితర ప్రాజెక్టులు, మత, ధార్మిక, సామాజిక తదితర సంఘాలకు ఇన్ని యుగాలుగా మానవుడు ఇలాంటి సేవలోనే జీవిస్తున్నాడనే సత్యాన్ని ప్రస్ఫుటంచేసింది. సేవాభావాన్ని విస్మరిస్తే మనిషినీ, దైవాన్ని కూడా మరచినట్లే.

దైవస్వరూపుడైన బిల్లీగ్రాహం ద్వారా, దైవమే సృష్టించిన ఈ గ్రామం ఐక్యతకు, సేవకు మరియు సౌభాగ్యానికి ఆదర్శమానంగా నిలవాలని ఆకాంక్షిస్తున్నాను.

# 10. దివిసీమ ఉప్పెనపై...

ప్రశ్న 1 : రావుగారు తుపాను సంభవించినపుడు మీరెక్కడున్నారు?

జవాబు : ఆంధ్రప్రదేశ్‌లో 1977 నవంబర్ 19వ తేదీన ప్రాణాంతక ఉప్పెన సంభవించినపుడు, నా మామూలు పర్యటనలో భాగంగా నా సొంత పట్టణం అవనిగడ్డలో వున్నాను.

ప్రశ్న 2 : ఉప్పెన, తుపాను వచ్చినపుడు, ఆ తర్వాత ఏం జరిగింది?

జవాబు : 1977 నవంబర్ 19 న, ఆ తర్వాత జరిగిన ఘటనలను మీకు వివరిస్తాను. నవంబర్ 19వ తేదీ ఉదయం వానజల్లులు మొదలైనాయి. మధ్యాహ్నానికి అది భారీవర్షంగా మారింది. గంటకు 120 నుండి 150కి.మీ. వేగంతో పెనుగాలులు వర్షానికి తోడైనాయి. సాయంత్రం 4–5 గంటల సమయానికి క్షణంలో ఇది జరిగిపోయింది. 18–20 అడుగుల ఎత్తున లేచిన ఉప్పెన ఉద్ధృతంగా 20 కిలోమీటర్ల దూరం లోపలికి వచ్చి ఎన్నో గ్రామాలను తుడిచిపెట్టింది. ఇందువల్ల ఒక్క దివి తాలూకాలోనే కుగ్రామాలతో కలిపి మొత్తం 73 గ్రామాలు తీవ్ర నష్టానికి గురైనాయి. వాటిలో 61 గ్రామాలు, కుగ్రామాలు ఉప్పెనలో పూర్తిగా తుడిచిపెట్టుకుపోయాయి. ప్రజలు ప్రాణభయంతో సురక్షితప్రాంతం కోసం అటూఇటూ పరుగులు తీశారు. అయితే ఈ ప్రాంతం వెనుకబడి ఉన్నందున, వారికి ఆశ్రయ మివ్వడానికి కేవలం కొన్ని భవనాలు మాత్రమే వున్నాయి. ఓ చోట పాఠశాల భవనం, మరోచోట ఓ దేవాలయం, ఇంకోచోట పంచాయతీ భవనం, అక్కడక్కడా వున్న సిమెంటు కాంక్రీటు ఇళ్లు వారికి ఆశ్రయం కల్పించాయి. ఆ క్షణంలో ఏది భద్రమనుకుంటే అక్కడికి జనం పరుగులు తీశారు. చెట్లపైన, ఇళ్ళపైన, మరేదైనా ఎత్తు కలిగినదుంటే వాటిపై చేరి ప్రాణాలు రక్షించుకున్నారు. ప్రజలు అధికసంఖ్యలో తలదాచుకున్న కొన్ని ఇళ్లు

పూర్తిగా కూలిపోవడంతో ఎందరో మరణించారు. నీటిలో కొట్టుకుపోయిన మరెందరో చెట్లను పట్టుకుని ప్రాణాలు కాపాడుకున్నారు. నీటిలో కొట్టుకుపోయిన మరెందరో, ముళ్లపొదలలో చిక్కుకుని, బయటకు రాలేక ప్రాణాలు కోల్పోయారు. తుఫాను, ఉప్పెన ఉద్ధృతికి, పెనుగాలుల తాకిడికి, ఆ వాతావరణ తీవ్రతకు తాళలేక మరణించిన వారిలో స్త్రీలు, పిల్లలే ఎక్కువగా వున్నారు.

ప్రశ్న 3 : తుపాను, ఉప్పెన వచ్చే ప్రమాదముందని వాతావరణ విభాగం రాష్ట్ర ప్రభుత్వానికి ముందుగానే హెచ్చరిక చేసినప్పటికీ, ప్రభుత్వం ముందు జాగ్రత్త చర్యలేవీ తీసుకోలేదని చెబుతున్నారు. దీనిపై మీరేమంటారు?

జవాబు : వాతావరణశాఖ హెచ్చరిక చేసినా ప్రభుత్వం ముందు జాగ్రత్త చర్యలు తీసుకోలేదనే విమర్శ నేనూ విన్నాను. మాకు కొన్ని హెచ్చరికలు అందినప్పటికీ అవి ఖచ్చితమైనవికావు. తుపాను ఎక్కడ ఏ ప్రాంతాన్ని తాకుతుందనే సమాచారం మాకు తెలియదు. అదీగాక తీరప్రాంతంలో వున్న ప్రజలందరినీ ఖాళీ చేయించడం ఆచరణ సాధ్యంకాదు. తుపాను తీవ్రత అధికంగా వుంటుందని ఖచ్చితమైన హెచ్చరిక వచ్చినప్పటికి మాకు 14 గంటల సమయం కూడా లేదు. అయినప్పటికీ రానున్న తుపాను తీవ్రత గురించి ప్రజలను అప్రమత్తం చేయడానికి ప్రయత్నించాము. ఆనాడు గ్రామాలలో పరిస్థితిని కూడా మనం పరిగణనలోకి తీసుకోవలసి వుంటుంది. తీరప్రాంత ప్రజలు తరచుగా తుపాను తాకిడికి గురవుతూనే వున్నందున, ఈసారి తీవ్రతపై వాతావరణ శాఖ చేసిన హెచ్చరికలను తీవ్రమైనవిగా పట్టించుకోలేదు. ఈ హెచ్చరికలపై ప్రజలు కొంతమేర అలసత్వాన్ని చూపినమాట నిజమే. గ్రామస్తులు తమ వస్తువులను ఇళ్లలోనే వదలి, గ్రామం నుండి బయటకు వెళ్లడానికి సిద్ధంగా లేరు. బియ్యం, వంటపాత్రలు, ఫర్నిచర్, పశువులు, జీవాలు... ఇలా తమకున్న కొద్దిపాటి వాటిని వదలి వెళితే వాటినెవరు కాపాడుతారనేవి సాధారణంగా ప్రజల్లో మెదిలే ప్రశ్నలు. గ్రామాలు వదలి ప్రాణాలు కాపాడుకోవాలని వారికి నచ్చచెప్పడానికి గానీ, వారిని సురక్షిత ప్రాంతాలకు తరలించడానికిగానీ ప్రభుత్వానికి తగినంత సమయం లేదు. తగిన ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయకుండా, వారి

ఆస్తిని కాపాడతామని హామీ ఇవ్వకుండా ప్రజలను గ్రామాలు వదలి వెళ్లాలని ప్రభుత్వం ఎలా అడుగుతుంది. అందువల్ల ప్రభుత్వం ఎలాంటి చర్యలు తీసుకోలేదని ఆరోపించడం, నిర్లక్ష్యంగా వ్యవహరించిందని నిందించడం సరికాదు.

ప్రశ్న 4 : ఈ పరిస్థితిని ఎదుర్కోవడానికి ప్రభుత్వం సైన్యాన్ని రప్పించి వుంటే, మరణాల సంఖ్య తక్కువగా ఉండేదంటున్నారు. దీనిపై మీరేం చెబుతారు?

జవాబు : ఈ విపత్తు సంభవించే సమయానికి అప్పటికే ఎంతో ఆలస్యమైంది. సైన్యం కూడా రంగంలోకి దిగేందుకు సిద్ధంగా వుంది. ఉప్పెనవచ్చిన తర్వాత పరిస్థితి, సైన్యం సహాయం కోరడానికి అనువైంది కాదని ప్రభుత్వం అభిప్రాయం. అప్పటి తక్షణ కర్తవ్యం శిథిలాలను, జంతువుల మృతకళేబరాలను, శవాలను తొలగించడం, ఇందుకు పోలీసులు, ఇతర శాఖలను వినియోగించవచ్చునని ప్రభుత్వం భావించింది. ఉప్పెన, తుపానులో మరణించిన వారి సంఖ్య అధికంగా వుందనే సంగతి, సమస్య తీవ్రత ప్రభుత్వానికి కూడా తెలియదు. అందువల్ల సైన్యాన్ని రప్పించి వుంటే బాగుండేదా లేదా అనే విషయం ఇప్పుడు చెప్పడం కష్టం. దీనిపై చర్చ అనవసరం.

ప్రశ్న 5 : ఉప్పెన, తుపాను సంభవించి ఇప్పటికి 22 రోజులైంది. ఆ ప్రాంతాలలో కనీసం శవాలను, జంతువుల మృతకళేబరాలనైనా పూర్తిగా తొలగించారని మీరు చెప్పగలరా?

జవాబు : ఈ ప్రశ్న చాలావరకు అవును అనీ, కొంతమేరకు లేదనీ నా సమాధానం. ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలు ప్రధాన గ్రామాలలో, రోడ్లు, కాలువగట్లపై గల శవాలను, జంతువుల మృతకళేబరాలన్నింటినీ దాదాపుగా తొలగించాయి. సహాయ కార్యక్రమాలలో పాల్గొంటున్న వారికి కన్పించిన మృతదేహాలన్నింటినీ తొలగించారు. అయితే ప్రజలు తమ ఇళ్లకు తిరిగివచ్చి శిథిలాలను తొలగిస్తున్నప్పుడు వాటికింద అక్కడో మృతదేహం, ఇక్కడో కళేబరం కన్పించాయి. పంట పొలాల్లో సైతం కొన్ని మృతదేహాలు కన్పించాయి. శిథిలాల తొలగింపు కార్యక్రమాలు మరింత ముమ్మరంగా చేపడితే మరిన్ని శవాలు, మృతకళేబరాలు

దొరకవచ్చు. వాటిని గుర్తించినపుడు వాటిని తొలగించే ఏర్పాట్లు చేశాం. అందువల్ల దాదాపు అన్ని మృతదేహాలు, కళేబరాలను తొలగించామనే చెబుతున్నాను.

ప్రశ్న 6 : రావుగారూ! మీరు రాష్ట్రమంత్రిగా వున్నారు కదా. ప్రభుత్వ తుఫాను సహాయపనులను గురించి చెబుతారా?

జవాబు : తుపాను బాధితులకు సహాయం అందించడానికి ప్రభుత్వం చేయగలిగిందంతా చేసింది. నిజాయితిగా ఈ సంగతి చెబుతున్నాను. నిష్పాక్షికులు కూడా దీనితో ఏకీభవిస్తారు. రాష్ట్రప్రభుత్వం చేపట్టిన తుపాను బాధితుల సహాయ, పునరావాస కార్యక్రమం భారత పరిపాలనా చరిత్రలో మునుపెన్నడూ కనీవినీ ఎరుగనిది. డబ్బు సమస్య కాదు. బాధితులందరికీ సహాయ శిబిరాలలో ఆశ్రయం కల్పించి, ఆహారం, వస్త్రాలు అందజేశాం. గ్రామస్తులను వారి ఇళ్లకు తిరిగి వెళ్లవలసిందిగా ప్రభుత్వం నచ్చజెబుతోంది. ఉప్పెన వల్ల పూడుకుపోయిన ప్రాంతాలకు వెంటనే వెళ్లలేని పరిస్థితి. ఆ ప్రాంతాలలో శిథిలాలను తొలగించి మార్గం సుగమం చేశాం. ఇప్పుడక్కడికి వెళ్లొచ్చు. కొన్ని ప్రాంతాలో నీటి మధ్య చిక్కుకుపోయినవారికి ఆహారపు పొట్లాలు అందినిచేందుకు సైన్యాన్ని వినియోగించాం. కొన్ని ప్రాంతాలకు ఇప్పుడు జీపుల్లో వెళ్లొచ్చు. కొన్నిచోట్ల భారీగా గుంటలు పడటం, కాలువలు తెగడం వల్ల ముందుకు సాగలేని స్థితి ఉంది. బాధితప్రాంతాలలో ప్రాధాన్యతా ప్రాతిపదికపై కమ్యూనికేషన్ల పునరుద్ధరణకు ప్రభుత్వం ప్రాధాన్యత ఇస్తోంది. ప్రభుత్వ సంస్థలతో బాటు స్వచ్ఛందసంస్థలు లక్షలాది రూపాయల విలువైన ఆహారం, వస్త్రాలు, వంటపాత్రలు, మందులు ఇతర వస్తువులను తెచ్చి ఉప్పెనలో నిరాశ్రయులైన బాధితులకు పంపిణీ చేశారు. ప్రభుత్వం కూడా ఇళ్లు పూర్తిగా, పాక్షికంగా కోల్పోయిన వారికి ఉదారంగా సహాయం చేస్తున్నది. కుటుంబ పెద్దలు చనిపోగా మిగిలిన వారికి సహాయం అందిస్తోంది. ఈ స్వల్పకాలిక సహాయ కార్యక్రమాలతో బాటు బాధిత ప్రజల సంపూర్ణ పునరావాసానికి ప్రభుత్వం తగు ప్రణాళిక రూపొందిస్తోంది. భవిష్యత్తులో ఇలాంటి విపత్తులు సంభవిస్తే ఆదుకోవడానికి శాశ్వత, దీర్ఘకాలిక చర్యలు చేపడుతోంది.

ప్రశ్న 7 : బాధితులు తమ ఇళ్లకు తిరిగి వెళ్లడానికి, వారి పునరావాసానికి ఎంతకాలం పడుతుందంటారు?

జవాబు : దాదాపు బాధిత ప్రజలందరూ తమ గ్రామాలకు తిరిగివెళ్లారు. కొందరు మాత్రం ఇంకా సహాయ శిబిరాలలోనే వున్నారు. మరో 2, 3 రోజుల్లో వారు కూడా తమ గ్రామాలకు తిరిగి వెళతారు.

ప్రశ్న 8 : ఈ దుర్ఘటనలో బాధితులను ఆదుకోవడానికి స్వచ్ఛంద సంస్థలు అందిస్తున్న సహాయం గురించి చెప్పగలరా?

జవాబు : ప్రస్తుతం సంభవించిన ఉప్పెన విపత్తు సందర్భంగా బాధితులను ఆదుకోవడానికి స్వచ్ఛందసంస్థలు వెనువెంటనే స్పందించి ఇంత పెద్దఎత్తున ముందుకు రావడం గతంలోనేనెన్నడూ చూడలేదు. వినలేదు. కుటుంబానికి అవసరమైన వస్తువులన్నింటినీ స్వచ్ఛందసంస్థలు బాధితులకు పంపిణీ చేశాయి. సికింద్రాబాద్ వ్యాపారుల సంఘం బాధితులకు పెట్టెలు, వంటపాత్రలు, లాంతర్లు ఇలా కుటుంబానికి అవసరమైనవన్నీ పంపిణీ చేసింది. స్వచ్ఛంద సంస్థలు ఈ తక్షణ సహాయకార్యక్రమాలు నిర్వహించడంతోబాటు శాశ్వత ప్రాతిపదికపై తుఫాను షెల్టర్లు, ఇళ్లు నిర్మించడానికి ముందుకొస్తున్నాయి. అనాథలను పోషిస్తామని ఎన్నో సంస్థలు లేఖలు రాశాయి. కొందరు అనాథ బాలలను దత్తత తీసుకోవడానికి కొందరు వ్యక్తులూ ముందుకొచ్చారు. స్వచ్ఛందసంస్థలు బాధిత ప్రాంతాలలో మామూలు పరిస్థితులు నెలకొల్పడంలో మాకు తోడ్పడతాయనే ఆశాభావం నాకు కలిగింది.

ప్రశ్న 9 : ఉప్పెన, తుఫాను తాకిడి ప్రాంతాలలో డాక్టర్ బిల్లీగ్రాహం పర్యటనను మీరు ఏర్పాటు చేసినట్లు పత్రికలలో చదివాము. గ్రాహం స్పందన ఏమిటో తెలియజేస్తారా?

జవాబు : డాక్టర్ బిల్లాగ్రాహం దివిసీమ ప్రాంతంలో పర్యటించేలా మిత్రుడు డా. సిహెచ్. దేవానందరావు కృషిచేయడం అభినందనీయం. బిల్లీగ్రాహం ఉప్పెనలో తీవ్రంగా నష్టపోయిన సొర్లగొంది, గొల్లపాలెం గ్రామాలను సందర్శించారు. సొర్లగొందిలో ఓ ఆలయం, పంచాయతీ భవనం, ఓ పాఠశాల భవనం, అక్కడ కుక్కలు మినహా మరేమీ మిగల్లేదు. పరిస్థితి తీవ్రతను చూసి తీవ్రంగా చలించిపోయిన డాక్టర్ బిల్లీగ్రాహం

వెంటనే అక్కడినుండే బాధితులకు సహాయం అందించేందుకు ముందుకు రావాలని ప్రపంచ దేశాలకు, ప్రజలకు టెలివిజన్‌లో విజ్ఞప్తి చేశారు. ఒక గుర్తించిన మృతదేహం వద్ద ఆయన ప్రార్థన కూడా చేశారు. డాక్టర్ గ్రాహం అప్పటికే లక్ష డాలర్ల విరాళం ప్రకటించారు. మరింత పెద్దమొత్తం సహాయంగా మునుముందు ఇస్తారని ఆశిస్తున్నాము. ఇంతటి పెనువిపత్తు ప్రపంచంలో తనెన్నడూ చూడలేదని ఆయన ప్రపంచ ప్రజలకు తెలిపారు.

ప్రశ్న 10 : తుఫానులో మరణించిన వారిసంఖ్య, సంభవించిన ఆస్తినష్టం, మరణించిన పశువుల గురించి వేర్వేరు అంచనాలు అందుతున్నాయి. గత 20 రోజులుగా మీరు పరిస్థితిని పర్యవేక్షిస్తున్నారు. ఎంత ఆస్తినష్టం, ప్రాణ నష్టం జరిగిందో కచ్చితంగా చెప్పగలరా?

జవాబు : ఇది సమాధానం చెప్పడానికి కష్టమైన ప్రశ్న. అధికారిక అంచనాలు ప్రధానంగా ఆయా ప్రాంతాలలో వున్న వారు మౌఖికంగా చెప్పినవీ, దొరికిన శవాలు, కళేబరాల ఆధారంగా చేసినవి. గ్రామస్తులు సొంత స్థలాలకు తిరిగివెళ్లాక స్థిరపడేదాక కానీ, జాగ్రత్తగా, సర్వే నిర్వహించాక గానీ, మరణించినవారి వివరాలు కచ్చితంగా చెప్పలేం. ఈ విపత్తులో 10 వేల మంది వరకు మరణించి వుంటారని నా అంచనా. గొర్రెలు, మేకలు, పందులు, బాతులు, పశువులు లక్ష మరణించి వుంటాయని అంచనా. ఆస్తినష్టమెంతో కచ్చితంగా చెప్పలేను. 25 గ్రామాలు సంపూర్ణంగా నష్టపోయాయి. ఇతర గ్రామాలు కూడా గణనీయంగా నష్టపోయాయి. ఈ సారి బాగా పండుతుందనుకున్న పంట పూర్తిగా మునిగిపోయింది. జరిగిన నష్టమంతా రూ. 400 కోట్ల మేర వుంటుందని భావిస్తున్నాను.

ప్రశ్న 11 : సహాయ కార్యక్రమాలలో వివిధ ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలు పాల్గొంటున్నాయి. వాటిలో విశిష్ట సేవలందించిన వాటి గురించి ప్రత్యేకించి ఏమైనా చెబుతారా?

జవాబు : సహాయ కార్యక్రమాలలో పాల్గొంటున్న రెవిన్యూ, పోలీసు, వైద్య, పిడబ్ల్యు తదితర ప్రభుత్వ సంస్థలు స్వచ్ఛంద సంస్థలు చేసిన కృషి ప్రశంసనీయం. ఎన్నో అవరోధాలు ఇబ్బందుల మధ్య ఈ సంస్థలు తమ సహాయ

కార్యక్రమాలను అద్భుతంగా సాగించాయి. రెడ్‌క్రాస్, ఆర్‌ఎస్‌ఎస్, ఇతర ప్రైవేటు ధార్మిక సంస్థలు, ప్రైవేటు సంస్థలు, గాంధీపీస్ ఫౌండేషన్ వంటి సంస్థల కార్యకర్తలు ప్రశంసనీయ సేవలందించారు. అయితే సర్వోదయ నాయకుడు శ్రీ ప్రభాకర్‌జీ, శ్రీ లవణం, శ్రీమతి హేమలతా లవణం వంటివారు నిస్వార్థంతో, అంకితభావంతో అందించిన సేవలు అమూల్యం. వారిని ప్రశంసించేందుకు మాటలు చాలవు.

ప్రశ్న 12 : సహాయం పంపిణీ సమానంగా జరగలేదని ఎన్నో వార్తలొచ్చాయి. దీని గురించి మీరేమంటారు?

జవాబు : ఈ ప్రశ్నకు కూడా సమాధానం చెప్పడం కష్టమే. స్వచ్ఛందసంస్థలు తమంతకు తామే సహాయ కార్యక్రమాలు చేస్తున్నాయి. ఆహారం, వంటపాత్రలు, బట్టలు వంటివి పంపిణీ చేస్తున్నాయి. అలాంటపుడు పంపిణీలో అసమానతలుండే అవకాశముంది. కొందరికి ఇతరులకంటే ఎక్కువ వచ్చివుండవచ్చు. అయితే వారు కోల్పోయిన దానితో పోలిస్తే ఇదెంత అనేదే నా ప్రశ్న. ఇలాంటి సంక్షోభ సమయాలలో నూటికి నూరుశాతం సమాన పంపిణీని ఆశించలేము. పరిస్థితిని మొత్తంగా చూడాలి. అందరికీ రావలసినవి వచ్చాయి. కొందరికి ఎక్కువ వచ్చాయనేదే ఫిర్యాదు అది అసంగతం.

ప్రశ్న 13 : ఏ స్వచ్ఛంద సంస్థ అయినా శాశ్వత సహాయంగా నిర్దిష్టంగా ఏమైనా చేసిందా? అలాంటి సంస్థలేవో, అవి తలపెట్టిన కార్యక్రమాలేవో చెబుతారా?

జవాబు : గ్రామాలను దత్తత చేసుకుని, అభివృద్ధి చేస్తామంటూ ఎన్నో సంస్థలు ముందుకొస్తున్నాయి. కొన్ని ఒకటి, మరికొన్ని సంస్థలు రెండు గ్రామాలను దత్తత చేసుకుంటామంటున్నాయి. అయితే 'దత్తత' అంటే ఏమిటో మేము తొలుత అవగాహనకు రావాల్సి వుంటుంది. స్వచ్ఛందసంస్థలు వాస్తవంగా ఏమి చేయదలచుకున్నాయో వాటితో చర్చిస్తాం. కేవలం కొన్ని సంస్థల వద్ద మాత్రమే నిర్దిష్ట ప్రతిపాదనలున్నాయి. ఇళ్లు, తుఫాను షెల్టర్ల నిర్మాణంపై టాటాలు ఆసక్తి చూపుతున్నారు. ఇలాంటి మరికొన్ని

సంస్థలు కూడా త్వరలో నిర్దిష్ట ప్రతిపాదనలతో ముందుకొచ్చే అవకాశం వుంది.

ప్రశ్న 14 : ప్రభుత్వం శిబిరాలలో సహాయమందించడం సరిగా సాగుతోందా? ప్రజల పునరావాసానికి వారి ప్రణాళిక ఏమిటి?

జవాబు : ప్రభుత్వమిప్పుడు తక్షణ సహాయకార్యక్రమాలను పూర్తిగా అమలు చేసిన స్థితికి వచ్చింది. ఇతర స్వచ్ఛంద సంస్థలతో కలసి సహాయ, పునరావాస ప్రణాళికలు సిద్ధం చేయాలని ప్రభుత్వం తీవ్రంగా పరిశీలిస్తోంది. వాటితో కలిసి పనిచేసే అవకాశముంది. శాశ్వత పునరావాసం, మరియు అందుకు సంస్థాగత ఏర్పాట్లకు సంబంధించిన వ్యూహాన్ని ఖరారు చేసి అమలుచేస్తాం.

ప్రశ్న 15 : కృష్ణారావుగారూ మీరు మంత్రి పదవికి రాజీనామా చేశారు కానీ తుఫాను పునరావాస బాధ్యతలను ప్రభుత్వపరంగా మీరు అదనపు బాధ్యతలు చేపట్టినట్లు వార్తలొచ్చాయి. దీనిపై వివరిస్తారా?

జవాబు : రాజీనామాకు గల కారణాలను నేను ఇప్పటికే వివరించాను. ఇది రాజకీయాలకు లేదా ప్రభుత్వంతో గల అసంతృప్తికి, లేదా ముఖ్యమంత్రితో విభేదాలకు సంబంధించినది ఎంతమాత్రం కాదు. ప్రస్తుత విపత్కర పరిస్థితుల పట్ల కలత చెంది, చిత్తశుద్ధితో, ఆత్మప్రలోభానుసారం రాజీనామా చేశాను. ఈ విషాదం మధ్య ఒక పెద్ద శాఖకు మంత్రిగా బాధ్యతలు నిర్వహించలేను. ఇంతకుమించి కారణాలు లేవు. ముఖ్యమంత్రి నా రాజీనామాను అంగీకరించలేదు. అందువల్ల ముఖ్యమంత్రి తుఫాను సహాయ, పునరావాస బాధ్యతలను నాకు అప్పగించినపుడు, విధేయుడైన సైనికుడుగా వాటిని పాటించి అమలుచేయడమే నా విధి. విపత్తు సంభవించిన ప్రాంతం నేను పుట్టి పెరిగిన, నాకిష్టమైన జన్మభూమి. అందువల్ల బాధ్యతలనుండి దూరంగా వెళ్లడం వివేకం కాదు. అందుకే బాధ్యతలు స్వీకరించాను.

★ ★ ★

*(అమెరికన్ చానల్‌కి ఇచ్చిన ఇంటర్వ్యూ తెలుగు అనువాదం)*

# 11. ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థలు, సామాజిక సేవా కార్యకర్తల సంఘం మహాసభ - తిరుపతి - ప్రధానోపన్యాసం

సోదర కార్యకర్తలారా! మరియు మిత్రులారా!

గత మహాసభలో మనం కలుసుకున్నప్పటికీ, నేటికీ ఎంతో సుదీర్ఘకాలం గడచింది. స్వచ్ఛంద సేవాసంఘాల పనితీరుకు సంబంధించి ఈ మధ్యకాలంలో ఎన్నో పరిణామాలు సంభవించాయి. ప్రధాన అనుబంధ సంఘానికి, సభ్యులకు మధ్య ఉండాల్సిన సంబంధాలకు అనుగుణంగా మనం ఉండాల్సినంత సన్నిహితంగా మెలగలేకపోయాం. అందువల్ల ఈనాడు ఇలా మిమ్మల్ని కలుసుకోవడం, నాకెంతో సంతోషంగా వుంది. నాకంటే ఎంతో అనుభవం, మరెంతో విషయ పరిజ్ఞానం గల సహచరులు ముందున్నారని తెలిసీ, ఈ సభలో ప్రధాన ప్రసంగం చేసే భారమైన కర్తవ్యాన్ని స్వీకరించాను. ఈ ప్రసంగంలో నేను కొన్ని అభిప్రాయాలు తెలియజేస్తాను. వాటిపై మీ ప్రతిస్పందనను కోరుతున్నాను. కొన్ని సమస్యలను మీ దృష్టికి తేవడమే నా ఉద్దేశ్యం. వాటిని మీరు పరిశీలిస్తే మహాసభ ముగిసే లోగా వాటిపై నిర్దిష్ట కార్యాచరణ కార్యక్రమాన్ని రూపొందించడానికి వీలుగా మీనుండి కొన్ని నిర్దిష్టమైన సూచనలను ఆహ్వానిస్తున్నాను:

1. ఆంధ్రప్రదేశ్ కోస్తాప్రాంతంలో 1977 నవంబర్‌లో, పెను ఉప్పెన, తుఫాను సంభవించాయి. ఇది 20వ శతాబ్దంలో సంభవించిన అతి పెద్ద విపత్తు. ఇలాంటి విపత్తు సందర్భంలో భారీగా నష్టపోయిన బాధితులకు తక్షణసహాయం, ఆ తర్వాత పునరావాస కార్యకలాపాలు సాగించడంలో స్వచ్ఛంద సంస్థలు సమర్థవంతమైన పాత్ర నిర్వహించడానికి ఆ విపత్తు ఒక సవాలుగా నిలిచింది. విపత్తు సంభవించిన ప్రాంతాలకు ఎన్నో జాతీయ, అంతర్జాతీయ సంస్థలు వెనువెంటనే స్పందించి తమ సిబ్బందితో బాధితులను ఆదుకోవడానికి రావడంతో ఆ సవాలును క్రీడాస్ఫూర్తితో స్వీకరించడం జరిగింది. బాధితులకు తక్షణ సహాయం, తర్వాత పునరావాస కార్యక్రమాలు అమలుచేయడం వంటి సవాలు

స్వీకరించిన స్వచ్ఛంద సంస్థలు భారత ప్రజలకే గాక, ప్రపంచ జనావళికి కూడా తమ సేవల ద్వారా, ఆశించిన లక్ష్యాలను సాధించి, సామాజిక ప్రగతికి, సంక్షేమానికి తమ వంతు కృషిని విజయవంతంగా నిర్వహించగలమని చాటాయి. స్వచ్ఛందసంస్థలు అలాంటి సవాలు స్వీకరించి విజయవంతంగా సహాయ, పునరావాస కార్యక్రమాలు నిర్వహించడం కృతజ్ఞతతో గుర్తుంచుకోదగిన విషయం. అత్యంత విపత్కర సమయంలో అక్కడికి చేరుకున్న స్వచ్ఛంద సంస్థలు అంకితభావంతో అందించిన సేవలు, గ్రామాలలో సేవాకార్యక్రమాల అమలులో అద్భుత సామర్థ్యాన్ని ప్రదర్శించాయి. అందుకే భారత అభివృద్ధి ప్రక్రియలో ఈ స్వచ్ఛంద సంస్థలు ప్రధాన సాధనాలుగా ఉపయోగపడతాయనే గుర్తింపు పొందగలిగాయి. కనీసం ఆంధ్రప్రదేశ్ విషయంలో ఈ మాట నిజమైందని నేను చెప్పగలను. బాధిత ప్రాంతాలలో ఈ స్వచ్ఛంద సంస్థలు పల్లెల్లో క్షేత్రస్థాయిలో తమ సేవా కార్యక్రమాలు నిర్వహిస్తుండినపుడు ఒక ప్రత్యేక ధోరణిని గమనించాము. అనేక స్వచ్ఛంద సంస్థలు పరస్పర సమన్వయం లేకుండా ఎవరికివారు తమంతకు తాము సేవా కార్యక్రమాలు నిర్వహిస్తూపోవడం ఒకవైపు జరగగా, ప్రభుత్వ సంస్థలతో కూడా సమన్వయం లేకుండా, స్వచ్ఛంద సంస్థలు క్షేత్రస్థాయి పనులు నిర్వహించడం మరోవైపు జరిగింది. అప్పుడే వివిధ స్వచ్ఛంద సంస్థల మధ్య ప్రభుత్వ సంస్థలు, స్వచ్ఛంద సంస్థల మధ్య మరింత మెరుగైన, మరింత సమర్థపూర్వక సమన్వయం ద్వారా సేవాకార్యక్రమాలు నిర్వహిస్తే మరిన్ని సత్ఫలితాలు కలుగుతాయని, అందుకు ఏమైనా చేయాలనే ఆలోచన నాకు కలిగింది. ఈ అంశాన్ని దృష్టిలో వుంచుకుని 1977 నవంబరులో పెను ఉప్పెన, తుఫాను సంభవించిన విపత్కర సమయంలో, అవనిగడ్డలోని గాంధీక్షేత్రంలో స్వచ్ఛంద సంస్థలు, సామాజిక సేవాకార్యకర్తలు, ముఖ్యంగా దివిసీమలో సహాయకార్యక్రమాలలో పాల్గొంటున్న సంస్థల ప్రతినిధులతో సమావేశాన్ని నిర్వహించాము. బాధిత గ్రామాలలో ప్రజలెదుర్కొంటున్న సమస్యలను, వాటిని పరిష్కరించేందుకు ప్రభుత్వం - స్వచ్ఛంద సంస్థల మధ్య వివిధ స్వచ్ఛందసంస్థల మధ్య మరింత సమన్వయానికీ మెరుగైన ఫలితాలు సాధించడమే అవనిగడ్డ సభ ప్రధానోద్దేశ్యం. అదృష్టవశాత్తు ప్రభుత్వానికి, స్వచ్ఛంద సంస్థలకు మధ్య, వివిధ స్వచ్ఛందసంస్థల మధ్య మరింత సమన్వయసాధన కోసం రాష్ట్రస్థాయిలో ఒక సంఘం ఉండాలనే ఏకాభిప్రాయం ఆ సభలో వ్యక్తమైంది. ఆ విధంగా 1978 అక్టోబర్ 10వ తేదీన ప్రముఖ

సంఘ సేవకుడు, యు.పి, ఒరిస్సా మాజీ గవర్నర్ శ్రీమీర్ అక్బర్ అలీఖాన్ అధ్యక్షతన స్వచ్ఛంద సంస్థలు, మరియు సామాజిక సేవా కార్యకర్తల రాష్ట్రస్థాయి సంఘం ఏర్పడింది. ఈ సంఘం ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంతం) పబ్లిక్ సొసైటీస్ రిజిస్ట్రేషన్ చట్టం - 1950 కింద 21-12-1978 నాడు నమోదైంది.

4. రాష్ట్రస్థాయి సంఘం ఏర్పడిన నాటినుండి నేటివరకు సంఘం 9 సార్లు సమావేశమైంది. అయితే ఈ కాలంలో ఎలాంటి విధాన నిర్ణయంగానీ, మరియు వివిధ స్వచ్ఛంద సంస్థలు, వ్యక్తుల మధ్య సామరస్యపూర్వక సంబంధాలను నెలకొల్పి, ప్రజలు ముఖ్యంగా సమాజంలోని అట్టడుగు వర్గాల వారి సామాజిక, నైతిక అభ్యున్నతికి కృషి చేయాలనే సంఘ నిర్దేశిత లక్ష్యాన్ని సాధించలేక పోయామని నిజాయితీగా అంగీకరిస్తున్నాను. అనుబంధ సంస్థలు మరియు ప్రభుత్వం మధ్య సంధానకర్తగా ఉంటూ, అనుబంధ సంస్థలకు అవసరమైన సమాచారం అందించే కర్తవ్యాన్ని కూడా నిర్వహించలేకపోయామని తెలియ జేస్తున్నాను.

5. అయితే 1977లో సంభవించిన పెను ఉప్పెన, తుఫానుకు ముందు, ఆ తర్వాత పరిస్థితిని, ఘటనలను క్రోడీకరించగలిగాము. అంతేగాక శ్రీవేంకటేశ్వర యూనివర్సిటీ ఎన్ఎస్ఎస్ వలంటీర్ల సహాయంతో దివిసీమలో బాధిత ప్రాంతాలలో జరిగిన నష్టాన్ని అంచనా వేసి, అమలు చేయవలసిన అభివృద్ధి పనుల గురించి నిష్పాక్షిక సర్వే నిర్వహించగలిగాము. ఈ ప్రాంతాల సమగ్రాభివృద్ధికి సమగ్ర ప్రణాళికను రూపొందించగలిగాము. అయితే వివిధ కారణాల వల్ల సంఘ సంస్థాపన లక్ష్యం నెరవేరలేదు. కొన్ని అవరోధాల కారణంగా ఆశించిన లక్ష్యాల సాధనకు వీలు కాలేదు.

6. బాధిత ప్రాంతాలలో పునరావాస కార్యక్రమాలలో పాల్గొంటున్న స్వచ్ఛంద సంఘాలను గౌరవించే నిమిత్తం ఒక సమావేశం నిర్వహించడానికి, మెమెంటోలు ప్రదానం చేయడానికి సంఘం చేసిన ప్రయత్నం ఫలించలేదు. ఇందువల్ల మన సంఘ సభ్యులకు మరింత బాధ్యత కల్పించినట్లవుతుందనే ఆలోచన చేశాము. ఈ పరిస్థితి పట్ల నాకు కొంత ఆందోళన వుంది. అయితే ఇటువంటి సంఘం లేకుండా ముఖ్యంగా ప్రస్తుత క్లిష్టపరిస్థితులో మనం విజయం సాధించలేము. అందుకోసం నా ప్రయత్నాలు కొనసాగిస్తాను.

7. ప్రజల ప్రత్యక్ష ప్రమేయం, పాత్ర, వారి మద్దతు లేకుండా ప్రభుత్వమొక్కటే గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను విజయవంతంగా అమలు చేయలేదని స్పష్టమైంది. చిత్తశుద్ధి, అంకితభావం, కృతనిశ్చయం గల స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వం చేస్తున్న అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనవలసిందిగా ప్రజలను ప్రోత్సహించి, వారిని భాగస్వాములను చేయగలిగినప్పుడే ఏ కార్యక్రమమైనా విజయవంతమవుతుందనేది సుస్పష్టం. గ్రామీణాభివృద్ధిలో పురోగతి సాధనకు, స్వచ్ఛంద సంస్థల పాత్ర ప్రధానమైందని ఒకసారి అంగీకరిస్తే, వాటి పాత్ర లేకుంటే వృద్ధిరేటు, అభివృద్ధిక్రమం మందగిస్తుందని తెలుసుకుంటే, ప్రభుత్వం ఈ కార్యక్రమాల అమలుకు స్వచ్ఛంద సంస్థలను ఉపయోగించుకోవడం అవసరమనే నిర్ధారణ అవుతుంది. అందువల్ల మన సొంత పాత్ర ఏమిటో, ఇతర సంస్థలతో కలిసి, క్షేత్రస్థాయిలో నిర్వహించవలసిన బాధ్యత లేమిటో, అన్ని సంస్థల మధ్య పంచుకోవలసిన బాధ్యతల గురించి తెలుసుకోవాలి. ఇలాంటి సందర్భాలలోనే వివిధ సంస్థల మధ్య సమన్వయం అత్యంత ప్రాముఖ్యం కలిగినది. ఒక ఉదాహరణ చెబుతాను. తీవ్ర పరిస్థితులలో స్వచ్ఛంద సంస్థలన్నీ కేవలం ఆరోగ్య, పారిశుద్ధ్య కార్యక్రమాలకు మాత్రమే పరిమితమైతే ఏమవుతుంది? అదేవిధంగా అమలవుతున్న సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను పరిగణనలోకి తీసుకోకుండా చేసే ఆర్థికాభివృద్ధి పనులు సామాజిక సమస్యలకు, అవి సామాజిక అసమానతలకు దారితీస్తాయి. అందువల్ల ఇలా జరగకుండా చూడాలి. బాధ్యతలను పంచుకోవడంలో స్వచ్ఛంద సంస్థల మధ్య 2 దిశలలో సమన్వయం ఉండాలనేదే నా అభిప్రాయం. వివిధ రంగాలకు సంబంధించిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను పంచుకోవడం ఒకటి కాగా, వివిధ ప్రాంతాలలో ఈ అభివృద్ధి కార్యక్రమాలను అమలుజేయడంలో బాధ్యతను పంచుకోవడం మరొకటి. స్వచ్ఛంద సంఘాలన్నీ ఒకచోట లేదా ఒకేప్రాంతంలో తమ అభివద్ధి కార్యక్రమాలను కేంద్రీకరించడం సముచితం కాదనేది నా అభిప్రాయం. ఈ విధమైన కార్యక్రమాల వల్ల సమతుల్యత లోపించే పరిస్థితి నెలకొంటుంది. అభివృద్ధి అనేది లేకపోవడం కంటే ఇది మరింత ప్రమాదకరం. అందువల్ల తాము కార్యకలాపాలు జరుపదలచిన నిర్దిష్ట ప్రాంతాల గురించి, తాము నిర్వహించే నిర్దిష్ట కార్యకలాపాల గురించి స్వచ్ఛంద సంస్థలకు తగిన అవగాహన వుండాలి. అది కార్యకలాపాల గురించి, పనిచేయవలసిన ప్రాంతంలో బాధ్యతల స్వీకరణే.

8. అన్ని అభివృద్ధి కార్యక్రమాలలో ప్రధానపాత్ర వహించేది అధికారంలో వున్న ప్రభుత్వం/ప్రభుత్వాలదే నన్న సంగతి మనందరికీ తెలిసిందే. అందువల్ల అధికారంలో వున్న ప్రభుత్వాలకు తెలియజేయకుండా స్వచ్ఛంద సంస్థలు తమంతకు తామే దేశంలో స్వతంత్రంగా ఆర్థిక, సామాజిక లేదా నైతిక మార్పులు తెచ్చి, గణనీయమైన పురోగతి సాధించగలమని భావించడం అవాస్తవికం. ప్రభుత్వం స్వచ్ఛంద సంస్థలు లేకుండా ఒంటరిగా విజయవంతంగా ఎలా పని చేయలేదో, స్వచ్ఛంద సంస్థలతో కలసి పని చేయాల్సి ఉంటుందో, స్వచ్ఛంద సంస్థలు కూడా ప్రభుత్వంతో కలసి సమన్వయంతో తమ ప్రయత్నాలు సాగిస్తేనే సఫలం కాగలుగుతారు. అదృష్టవశాత్తూ ఈనాడు మనం సంతోషకరస్థితిలో వున్నాం. గ్రామీణాభివృద్ధిలో స్వచ్ఛంద సంస్థల ప్రమేయంతో పని చేస్తేనే గరిష్ఠ ఫలితాలు సాధించగలుగుతామనే అవగాహన అధికాధికంగా ప్రభుత్వాలకు ఆలస్యంగానైనా కలుగుతున్నది. అధికారయంత్రాంగంలో సైతం గ్రామీణాభివృద్ధి పనులలో స్వచ్ఛంద సంస్థలకు సహకారం స్వీకరించే విషయమై సానుకూలధోరణి కన్పిస్తోంది. అభివృద్ధికి సంబంధించిన పనులను కనిష్ఠంగానైనా స్వచ్ఛంద సంఘాలకు అప్పగించేందుకు అంగీకరిస్తున్నారు. గతంలో ప్రశ్నించిన ఇలాంటి విషయాలపట్ల ప్రభుత్వం ప్రతికూల వైఖరితో వుండటంవల్ల స్వచ్ఛందసంస్థలు, సామాజిక కార్యకర్తలు విచారంగా వుండటానికి న్యాయమైన కారణాలుండేవి. ఇప్పుడు ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చినందున, గ్రామీణాభివృద్ధి కృషిలో మరిన్ని బాధ్యతలు స్వీకరించడానికి స్వచ్ఛందసంస్థలు వెనుకాడరాదు. అది సముచితం కాదు. గ్రామీణాభివృద్ధి విషయంలో స్వచ్ఛంద సంస్థలు ప్రభుత్వం నుండి మరిన్ని బాధ్యతలను డిమాండ్ చేసి, ఆ బాధ్యతల నిర్వహణలో మరింత క్రియాశీలపాత్ర వహించాలనేది నా రెండో సూచన. గుర్తించిన కొన్ని నిర్దిష్టప్రాంతాలలో నిర్దిష్టమైన రంగాల పనులను నిర్వహించే బాధ్యత తమకు అప్పగించాలని స్వచ్ఛంద సంస్థలు ప్రభుత్వాన్ని కోరి ఒప్పించాలి. ఇందువల్ల ఏకపక్ష వైఖరికంటే సమష్టిగా పనుల నిర్వహణకు వీలవుతుంది. సమష్టిగా పనులు చేయడానికి ఇలాంటి స్వచ్ఛంద సంఘాలే సరైనవి.

9. స్వచ్ఛందసంస్థలు ఈ సవాలును స్వీకరించడంలో సఫలం కావాలంటే, తాము కార్యకలాపాలు సాగిస్తున్న ప్రాంతాలలో ప్రభుత్వం అమలు చేయదలపెట్టిన వివిధ అభివృద్ధి కార్యక్రమాల గురించి, వాటికయ్యే వ్యయం గురించి సంపూర్ణ సమాచారం తెలుసుకొని, నిర్దిష్ట బాధ్యతల నిర్వహణకు అయ్యే ఖర్చు, అందులో

తాము ఎంతమేరకు భరించేది మొ॥గు విషయాలపై వాస్తవిక అంచనాలు సమర్పించాలి. పరిమిత సిబ్బంది, పరిమిత వనరులు గల ఏ స్వచ్ఛందసంస్థ అయినా, ఒంటరిగా ఇలాంటి కార్యక్రమాలు చేపట్టగలదా? అనేక సంస్థలు కనీసం అవసరమైన ఇలాంటి అభివృద్ధి సమాచారాన్ని సేకరించి క్రోడీకరించి, విశ్లేషించే పరిస్థితిలో లేవు. ఇలాంటి సందర్భాలలోనే స్వచ్ఛందసంస్థల సంఘం తన సభ్యులకు సహాయపడగలదు. వివిధ ప్రాంతాలలో వేర్వేరు రంగాలలో తాము నిర్వహించదలచిన కార్యక్రమాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించడంలో సంఘం సహకారం తీసుకోవాలని కోరుతున్నారు. సభ్యులు అధిక సమాచారం, సహకారం కోరితే సంఘం మరింత చురుగ్గా పని చేస్తుంది. అంతిమంగా అభివృద్ధికి సంబంధించిన సమాచారానికి సంబంధించి సంఘం తగిన విశ్వసనీయమైన సమాచారకేంద్రంగా పనిచేస్తుంది. సభ్యులు తమ సంఘాన్ని 'థింక్‌బ్యాంక్' (ఆలోచనాకేంద్రం)గా అభివృద్ధి చేయడంలో సహకరించాలి. **స్వచ్ఛంద సంస్థలు తమ పాత్రలను విజయవంతంగా నిర్వహించాలంటే ప్రభుత్వం అమలుచేయతలపెట్టిన వివిధ అభివృద్ధి కార్యక్రమాల సంపూర్ణ సమాచారాన్ని తమవద్ద వుంచుకోవాలి. అవసరమైన అలాంటి సమాచారాన్ని సేకరించడంలో సభ్యులు తమ సంఘం తోడ్పాటును వినియోగించుకోవాలి. ఇది మూడో సూచన.**

10. స్వచ్ఛంద సంస్థలు తమ సంస్థ ప్రతిష్ఠను మరింత మెరుగైన రీతిలో ప్రజలకు, ప్రభుత్వానికి తెలిసేలా వ్యవహరించాలి. ఈ విషయం చెబుతున్నానంటే అది నాకు వర్తిస్తుంది. ఎందుకంటే నేను కూడా కొన్ని స్వచ్ఛందసంస్థలను నిర్వహిస్తున్నాను. సరిగా పని చేయని స్వచ్ఛందసంస్థలు కొన్ని ఉండవచ్చు. అయితే అన్నింటినీ ఒకేగాట కట్టడం సరికాదు. కొన్ని సంస్థల వైఫల్యాలు, లోటుపాట్లు, మెరుగ్గా పనిచేస్తున్న సంస్థలకు ఎంతో హాని కల్గిస్తున్నాయి. ప్రస్తుత సామాజిక పరిస్థితులలో అన్ని స్వచ్ఛందసంస్థలు ఒకేరకమైన నిర్వహణ సామర్థ్యాన్ని, నైతిక స్థాయిలను, ఒకేస్థాయిలో వ్యవహరిస్తామనుకోవడం వాస్తవదృక్పథం కాదు. మొత్తంగా స్వచ్ఛందసంస్థల ప్రతిష్ఠను కాపాడాలంటే మనమేం చేయాలి. ఎన్నో స్వచ్ఛందసంస్థలను వేధిస్తున్న ప్రధాన సమస్య ఇది. అక్కడక్కడా దుర్వినియోగానికి సంబంధించిన ఒకటిరెండు సంస్థల వల్ల మొత్తం స్వచ్ఛందసంస్థలన్నింటికీ చెడ్డపేరు వస్తున్నది. సమాజానికి ఈ సంస్థల వల్ల కలిగే మేళ్ళ గురించి నిలదీస్తున్నారు. వాటి న్యాయమైన బాధ్యతలు క్షీణిస్తున్నాయి.

అందువల్ల స్వచ్ఛందసంస్థలన్నీ స్వీయప్రవర్తనా నియమావళిని రూపొందించుకోవాలనేది నా నాలుగో సూచన. సంస్థల ఆచరణ ఎంత మెరుగైతే వాటి ప్రతిష్ఠ అంత పెరుగుతుంది. మెరుగైన ప్రతిష్ఠతో స్వచ్ఛందసంస్థలు దేశ అభివృద్ధి ప్రయత్నాలలో గణనీయపాత్ర నిర్వహించగలుగుతాయి.

11. కొన్ని స్వచ్ఛందసంస్థలను 3 దశాబ్దాలపాటు నిర్వహించిన అనుభవజ్ఞుడిగా ప్రభుత్వంలో పాలనానుభవం గల వ్యక్తిగా గతానుభవాలనుండి వ్యక్తిగత అనుభవాన్ని ఈ సభదృష్టికి తెస్తున్నాను. పల్లెల్లో పరిస్థితి గురించి మనకు మెరుగైన అవగాహన వుందని, అభివృద్ధి కార్యక్రమాలకు ప్రజల మద్దతు కూడగట్టడంలో మెరుగైన నైపుణ్యముందని, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను మరింత విజయవంతంగా అమలు చేయగల గొప్ప అంకితభావం మనకుందని, ప్రభుత్వయంత్రాంగం కంటే తక్కువ ఖర్చుతో కార్యక్రమాలు నిర్వహిస్తామని మనం భావిస్తుంటాం. చాలా సందర్భాలలో అది నిజమే. అందుకే ఈ విషయంలో ఎవరూ స్వచ్ఛంద సంస్థలను తప్పు పట్టలేరు. అయితే మనం కార్యక్రమాల అంశం, వాటి అమలు విషయంలో మరింత పట్టు విడుపుల వైఖరిని ప్రదర్శించలేమా? ఇలా అంటున్నానంటే కొన్ని మౌలికసూత్రాల విషయంలో స్వచ్ఛంద సంస్థలు రాజీ పడమని సూచిస్తున్నట్లు కాదు. అభివృద్ధి కార్యక్రమాల అంశం మరియు వాటి అమలులో పట్టువిడుపుల వైఖరి ప్రదర్శించాలనేదే నా సూచన. ప్రస్తుతం మనం జీవిస్తున్న వ్యవస్థ, పనిచేస్తున్న పరిస్థితులను పరిగణనలోకి తీసుకుంటే సిద్ధాంత పరిపూర్ణత, మరియు విద్యాపరమైన ప్రతిభ సాకుతో మన అభిప్రాయానికే కట్టుబడితే, అధికారయంత్రాంగం అవసరాలకు అనుగుణమైన మార్పులు చేయకుండా మనం అనుకున్న రీతిలోనే ఒక కార్యక్రమాన్ని విజయవంతంగా అమలు చేయగలుగుతాము. గ్రామీణాభివృద్ధికి సంబంధించి కొన్ని అవసరమైన, ప్రాథమిక మరియు మౌలిక సూత్రాలతో రాజీ పడకుండానే వాటిని అమలు చేయగలుగుతాము. చాలా సందర్భాలలో వివరాలకు సంబంధించిన చిన్న సమస్యలపై స్వచ్ఛందసంఘాలు, ప్రభుత్వం విభేదిస్తుంటాయి. ఫలితంగా ఆ కార్యక్రమం అమలుకాదు. అంతిమంగా ప్రజలకు ఎలాంటి ప్రయోజనమూ కలుగదు. అందువల్ల అభివృద్ధి కార్యక్రమాల పరిధి మరియు అంశాలు, వాటిని అమలుచేసే తీరుపై స్వచ్ఛంద సంస్థలు మరింత పట్టువిడుపులతో కూడిన

వైఖరి ప్రదర్శించాలని కోరుతున్నాను. ఇలాంటి వైఖరిపట్ల ప్రభుత్వానికి స్వచ్ఛంద సంఘాలకు మధ్య, సామరస్యపూర్వక సంబంధాలు నెలకొంటాయి. స్వచ్ఛందసంస్థలు బాధ్యతాయుతమైన అభిప్రాయం వ్యక్తం చేస్తే అంతిమంగా ప్రభుత్వాలు అంగీకరిస్తాయి. మనం అంకితభావంతో వుంటూ ఇచ్చిపుచ్చుకునే స్ఫూర్తిని ప్రదర్శిస్తే గ్రామీణాభివృద్ధికి సంబంధించిన అన్ని విషయాలలో స్వచ్ఛందసంస్థలు చెప్పిందే అంతిమంగా అమలవుతుందని చెప్పగలను. కేబినెట్ మంత్రిగా నా అనుభవాన్నే చెబుతున్నాను. జనాభాలో బలహీనవర్గాల సంక్షేమానికి సంబంధించి స్వచ్ఛందసంస్థలు చేసిన సముచిత సూచనలను, సలహాలను, వాస్తవిక చర్యలను నేనేమీ నిరాకరించలేదు. అందువల్ల స్వచ్ఛందసంస్థలు అభివృద్ధి, కార్యక్రమాలకు సంబంధి 'పట్టువిడుపుల వైఖరి' ప్రదర్శించాలనేదే నా 5వ సూచన. మీరు విజయం సాధించాలంటే, మీ సామర్థ్యం కంటే మీ సర్దుబాటు వైఖరే ముఖ్యమనేది అసలుసిసలైన సత్యం. అందువల్ల మిత్రులారా! పట్టువిడుపులతో వ్యవహరించండి. ప్రస్తుత పరిస్థితులలో విజయసాధన వైఖరితో ముందుకుసాగండి.

12. స్వచ్ఛందసంస్థల భవితవ్యానికి ముఖ్యమైన మరో సున్నిత సమస్యను ఈ సభ దృష్టికి తెస్తున్నాను. స్వచ్ఛందసంస్థలు తమ సాంఘిక సేవాకార్యక్రమాలకు, ఇటీవల గ్రామీణ పునర్నిర్మాణ కార్యక్రమాలకు నిధులిచ్చే విదేశీ సంస్థలపైనే అధికంగా ఆధారపడుతున్నాయనే అభిప్రాయం కొన్ని వర్గాలలో వుంది. మనవంటి అభివృద్ధి చెందుతున్న దేశంలో సంక్షేమ చర్యలకు, మరియు అభివృద్ధి కార్యక్రమాలకు విదేశీ సహాయం పొందడం జీవితంలో తప్పని వాస్తవమని నేనూ అంగీకరిస్తాను. ఈ సహాయాన్ని పూర్తిగా ఆపేయలేం. అయితే స్వచ్ఛందసంస్థలు చేపట్టే వివిధ పథకాలకు కేవలం విదేశీ నిధులపై ఆధారపడే ధోరణి సరైందేనా? స్థానికంగా నిధులు సేకరించడానికి గల అవకాశాలను స్వచ్ఛందసంస్థలు ఎందుకు అన్వేషించడం లేదనే ప్రశ్న సహజంగానే మనముందుకొస్తోంది. నిర్దిష్టంగా చెప్పాలంటే జాతీయస్థాయిలో నిధులు సమకూర్చే సంస్థల గురించి మనం అన్వేషించడం ద్వారా, వస్తాయో రావో తెలియని విదేశీసహాయంపై అధికంగా ఆధారపడకుండా సొంతంగా నిధులు సమకూర్చుకునే, విదేశీసాయాన్ని కనిష్ఠస్థాయికి తగ్గించుకోగలగాలి. అయితే మన దేశంలోని ప్రస్తుత పరిస్థితిని బట్టిచూస్తే, మన అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలకు నిధులు సమకూర్చేలా, కొన్ని జాతీయ సంస్థలను మెప్పించి

ఒప్పించేందుకు సంబంధిత ప్రచారకార్యక్రమాన్ని చేపట్టడం అవసరం. భారతప్రభుత్వం కొన్ని రాయితీలు, మినహాయింపులిచ్చిన దృష్ట్యా పారిశ్రామిక సంస్థలు గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలకు నిధులు సమకూర్చవచ్చు. దీర్ఘకాలికదృష్టితో చూస్తే అధికంగా ఆధారపడదగ్గ కొన్ని సంస్థలు మాత్రమే పారిశ్రామిక సంస్థలనుండి నిధులు సేకరించగల్గుతున్నాయి. ఎక్కువ కాలం లభించే దేశీయ వనరులను సమీకరించడానికి మనం గట్టి ప్రయత్నాలేవీ చేయడం లేదనే దృఢాభిప్రాయం నాకుంది. ఈ అభిప్రాయంతో నా సహచరులెందరో ఏకీభవిస్తున్నారు. విదేశీ సహాయనిధులు పూర్తిగా ఆపేయమని నేను చెప్పడం లేదు. దేశంలో నిధుల సేకరణకు గల అవకాశాలను పరిశీలించాలని, విదేశీ నిధుల కంటే స్వచ్ఛంద సంస్థలకు దేశీయంగా లభించే నిధులు అధికం కావాలనేదే నా ఆకాంక్ష. అది ఆదర్శప్రాయ స్థితి. అలాంటి నిధులు లభించే అవకాశాలు ప్రస్తుతానికి అంత ఆకర్షణీయంగా లేకపోవచ్చు. అందుకోసం ఇప్పటినుండే ప్రయత్నాలు ప్రారంభిస్తే, పారిశ్రామికవేత్తలు, బడాగుత్తసంస్థలు అందుకు స్పందించి గ్రామీణ ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమాలకు నిధులు అధికాధికంగా సమకూర్చే పరిస్థితి ఏర్పడగలదు. ఇక్కడకూడా విదేశీ నిధులు – దేశీయ నిధులు అనే విషయమై మన వైఖరిని మార్చుకోవలసి వుంది. స్వచ్ఛందసంస్థలు విదేశీ నిధులపైనే అధికంగా ఆధారపడకుండా అంతర్గతంగా నిధులు సేకరించడానికి గట్టి ప్రయత్నాలు చేయాలి. అందువల్ల వివిధ పథకాలకు మన స్వదేశంలోనే అధికంగా నిధుల సమీకరణకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలనేదే నా 6వ సూచన. మొత్తం అవసరమైన నిధులలో ఎక్కువభాగం దేశీయంగానే సమీకరించగలగాలి.

13. కొన్ని స్వచ్ఛంద సంఘాల నిర్వహణ తీరు సరిగా లేదనే ఆందోళనకర వార్తలు వింటున్నందున నేను జాగ్రత్తగా వ్యవహరించవలసిందిగా ఈ సభ ద్వారా మీకు హెచ్చరిక చేస్తున్నాను. స్వచ్ఛంద సంఘాలు ఏ రాజకీయ పార్టీతో సంబంధాలు పెట్టుకోరాదనే విషయాన్ని ప్రాథమికసూత్రంగా పెట్టుకోవాలి. అభివృద్ధికి సంబంధించిన అంశాలు ఎంతగా ఆమోదయోగ్యకర మైనప్పటికీ, సంక్షేమ లేదా అభివృద్ధి కృషిలో ఎంతగా అభిలషణీయమైనప్పటికీ, అభివృద్ధి అంశాలను రాజకీయం చేయరాదు. కొన్ని సంస్థలు ఇటీవల కొన్ని రాజకీయ సంస్థలు, పార్టీలతో సన్నిహితంగా మెలగుతున్న వదంతులు వ్యాప్తిలో వున్నాయి. అందువల్ల స్వచ్ఛందసంస్థలు రాజకీయపార్టీలకు దూరంగా ఉండాలనేదే నా

7వ సూచన. సంక్షేమ అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించి ఎట్టి పరిస్థితులలోనూ ఏ పరిస్థితినీ రాజకీయం చేయరాదు. ఒక సమస్యను మనం రాజకీయం చేస్తున్నామనే భావనే ఏర్పడకుండా, స్వచ్ఛందసంస్థలు రాజకీయకార్యకలాపాలకు దూరంగా ఉండాలి. ఇది ప్రాముఖ్యం గల అంశం. అందువల్ల స్వచ్ఛందసంస్థలు 'రాజకీయాలకు దూరంగా ఉండాలి'. ఒక సుందరమైన ప్రైవేటు తోటలో, జాగ్రత్తగా నిర్వహిస్తున్న పచ్చికలో నడవకుండా దూరంగా ఎలా వెళతారో అలాగే రాజకీయాలకు దూరంగా వుండండి. వృత్తిపరమైన రాజకీయ నాయకులను రాజకీయాల గురించి జాగ్రత్త వహించనీయండి. మన కార్యనిర్వహణకు విశాలప్రయోజనాల దృష్ట్యా అభివృద్ధి పనులపై ఎక్కువ కేంద్రీకరించి పనిచేద్దాం. స్వచ్ఛందసంస్థలు ఒక రాజకీయపార్టీ తొత్తులనే అభిప్రాయం కలగడానికి అణుమాత్రం ఆస్కారం లేకుండా జాగ్రత్త వహించాలి.

14. స్వచ్ఛందసంస్థలకు శిక్షణ పొందిన, విశ్వసనీయులైన, అంకితభావం గల కార్యకర్తలకు సంబంధించిన అంశాన్ని ఈ సభ దృష్టికి తెస్తున్నాను. స్వచ్ఛందసంస్థల కోసం పనిచేసేందుకు అంకితభావం గల కార్యకర్తలకు శిక్షణ ఇవ్వడంలేదు. ఇందుకు కారణాలు తెలిసినవే. స్వచ్ఛందసంస్థలు యూనివర్సిటీల నుండి కొందరు నిరుద్యోగ పట్టభద్రులను, పోస్టుగ్రాడ్యుయేట్లను సమీకరించి, గణనీయఖర్చుతో వారికి శిక్షణ ఇచ్చి వారిని పనులలో నియమిస్తాయి. అయితే అలా శిక్షణ పొందిన యువతీయువకులు అంతకంటే మెరుగైన ఉద్యోగాలు ప్రభుత్వంలో లేదా ఇతర ప్రైవేటు సంస్థలలో లభించినపుడు స్వచ్ఛందసంస్థల నుండి వెళ్లిపోతున్నారు. ఈ విధంగా వారి శిక్షణ వృథా అవుతోంది. ఈ కారణాలవల్ల సరైన నడవడి, స్వభావం, అంకితభావం గల శిక్షణ పొందిన కార్యకర్తల కొరతను స్వచ్ఛందసంస్థలు ఎదుర్కొంటున్నాయి. స్వచ్ఛందసంస్థలలో పనిచేసే కార్యకర్తలకు వృత్తిపరంగా ఎదిగే ఆశాజనకమైన అవకాశాలు అంతగా లేకపోవడం వల్లనే యువతీయువకులు మెరుగైన ఉద్యోగాలకోసం వెళ్లిపోవడం అర్థం చేసుకోదగిందే. ఇలాంటి సేవలను తమ ఉద్యోగం స్వీకరించడానికి సిద్ధపడేవారికి తగు శిక్షణ ఇచ్చి, సంస్థలో మరింత ఎదిగేందుకు అవకాశాలను మెరుగుపరచడం ద్వారా స్వచ్ఛందసంస్థలు ఈ పరిస్థితిని అధిగమించవచ్చు. సమాజ సేవే ప్రధానస్ఫూర్తిగా స్వచ్ఛందసంస్థలకు కార్యకర్తల సేవలను

పొందగలమనుకోవడం సరికాదు. కొందరు అలాంటి వారుండవచ్చు. అయితే వాళ్ళు మన అవసరాలకు సరిపోరు. అందువల్ల ఈ ముఖ్యమైన అంశాన్ని సభ పరిశీలించి, అదనపు శిక్షణా సౌకర్యాల కల్పనకు తీసుకోవలసిన చర్యలను సూచించాలి. స్వచ్ఛందసంస్థలలో పనిచేయడమే తమ వృత్తిగా స్వీకరించే యువతీయువకులకు శిక్షణ ఇచ్చే నిమిత్తం ప్రస్తుత శిక్షణాసంస్థలను మరింత క్రియాశీలంగా పనిచేయించాలి. అదే సమయంలో అలా శిక్షణ పొందే అభ్యర్థులకు ఉద్యోగభద్రత, ఎదిగేందుకు తగు అవకాశాలుంటాయనే నమ్మకం కల్గించే చర్యలు తీసుకోవాలి. అందువల్ల స్వచ్ఛందసంస్థల నుండి శిక్షణ పొందిన కార్యకర్తలు ఇతర రంగాలకు మళ్లకుండా ఈ సభ నిర్దిష్ట చర్యలు సూచించాలనేదే నా 8వ సూచన. ఇది ప్రాముఖ్యంగల అంశం.

15. బ్యాంకుల వద్దగల వనరులను అభివృద్ధి కార్యక్రమాలకు ఉపయోగించుకోవడం అనేది బ్యాంకుల జాతీయీకరణ ముఖ్యలక్షణాలలో ఒకటనే విషయం సభ్యులకు విదితమే. ఆరంభంలో ఇలాంటి బాధ్యత స్వీకరించడానికి వాణిజ్య బ్యాంకులు, అర్థం చేసుకోదగ్గ అనాసక్తి వ్యక్తం చేశాయి. అభివృద్ధి కార్యక్రమాలకు నిధులు వెచ్చించడానికి అంతగా సుముఖత వ్యక్తం చేయని మాట నిజమే. అయితే కాలక్రమేణా వచ్చిన మార్పులతో వాణిజ్య బ్యాంకులు ప్రజావసరాలను దృష్టిలో వుంచుకుని బాధ్యతాయుతంగా వ్యవహరిస్తూ ఆర్థికాభివృద్ధికి తోడ్పడేందుకు ముందుకు వచ్చాయి. అయినప్పటికీ స్వచ్ఛందసంస్థలు ఆశించిన మేరకు ఈ సౌకర్యాన్ని వినియోగించుకోవడం లేదనేదే నా అభిప్రాయం. అందుకు కొన్ని మినహాయింపులున్నాయి. ఈ విషయంలో AWARE అత్యుత్తమ వైఖరిని కనబరచింది. ఈ సంస్థ తమ గిరిజన సంక్షేమ కార్యకలాపాలకు ఉద్దేశించిన అభివృద్ధి కార్యక్రమాలలో తన సొంత వనరులను వాడుతున్నది. అయితే జాగ్రత్తగా రూపొందించిన, అత్యుత్తమ పర్యవేక్షణలో అమలుచేసే ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలకోసం వివిధ వాణిజ్యబ్యాంకుల నుండి సంస్థాగత ఆర్థికసాయం పొందడానికి అవేర్ తన నిధులను వాడుతున్నది. ఇతర సంస్థలు కూడా ఇదే పద్ధతి పాటించాలనేదే నా సిఫార్సు. అందువల్ల బ్యాంకులనుండి సంస్థాగత ఋణాలు లభిస్తాయనే అవగాహనతో ఇకపై స్వచ్ఛంద సంస్థలు తమ అభివృద్ధి పథకాలకు నిధులు సమీకరించాలనేదే నా 9వ సూచన. ఇందువల్ల గ్రామీణ ప్రాంతాలలో వృద్ధిరేటును మరింత వేగవంతం చేయవచ్చు.

16. చివరగా స్థానికంగా వనరులు సేకరించడానికి స్వచ్ఛందసంస్థలు చేస్తున్న ప్రయత్నాలు ప్రస్తావిస్తాను. ప్రతి పథకమూ, కొంత మేర ప్రజల విరాళాలతో అమలవుతుందనే విషయాన్ని కాగితంపై రాస్తాము. అయితే అలా లభిస్తున్న మొత్తం కనీసస్థాయిలో వుంది. స్థానిక వనరులను అభివృద్ధి పథకాలకోసం గరిష్ఠంగా సమీకరించితే తప్ప గ్రామీణాభివృద్ధికై భారతదేశం చేస్తున్న ప్రయత్నాలు విజయవంతం కాజాలావు. విదేశీ నిధుల లభ్యత తక్కువ. అందువల్ల స్థానిక వనరులను ఎక్కువగా సమీకరించ గలిగితే గణనీయమైన ప్రగతి సాధ్యమవుతుంది. అందువల్ల సహజంగానే స్థానిక వనరులతో పూర్తిగా అమలు చేయగల పథకాలనే జాగ్రత్తగా ఎంపిక చేసుకోవలసి వుంటుంది. లేదా విదేశీ నిధులు అతి తక్కువ దామాషాలో అవసరమయ్యే పథకాలు చేపట్టాలి. అందువల్ల స్థానిక వనరుల సమీకరణకు స్వచ్ఛందసంఘాలు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వాలి. ఇదే నేను సభకు చేసే చివరి సూచన. ఇందుకోసం అవసరమైతే స్థానిక వనరులతోనే పూర్తిగా అమలు చేయగల అభివృద్ధి కార్యక్రమాలకు అధిక ప్రాధాన్యత ఇవ్వాలి.

17. మిత్రులారా! నా సంగ్రహప్రసంగంలో స్వచ్ఛందసంస్థలు ఎదుర్కొంటున్న కొన్ని తక్షణ మరియు ముఖ్యమైన సమస్యలను మాత్రమే మహాసభ దృష్టికి తెచ్చి కొన్ని సూచనలు చేశాను. మీరు ఈ అంశాలను జాగ్రత్తగా, క్షుణ్ణంగా పరిశీలించి మీ అభిప్రాయాలు తెలిపి, వాటి అమలుకు నిర్దిష్ట కార్యాచరణప్రణాళిక రూపొందించేందుకు తోడ్పడాలని కోరుతున్నాను. నేను ప్రస్తావించిన వాటిలో ఎన్నో సమస్యలు, చేసిన సూచనలు అందరికీ తెలిసినవే. ఈ సమస్యల పరిష్కారానికి కృతనిశ్చయంతో, సమన్వయపూర్వక కార్యాచరణ చేపట్టలేకపోవడమే గమనార్హమైంది. ఇక్కడ ప్రస్తావించిన మౌలిక సమస్యలకు పరిష్కాలను, తద్వారా నిర్దిష్టంగా చేపట్టవలసిన కార్యాచరణను ఈ సభ సూచించగలిగితే అది నాకెంతో సంతృప్తి కలిగిస్తుంది. స్వచ్ఛందసంస్థల సంఘాన్ని పటిష్ఠం చేసి, సంఘాల ప్రతిష్ఠను పెంచడానికై, సమైక్యకార్యాచరణకు మద్దతు పలకాలని సభ్యులను కోరుతున్నాను. ప్రజల జీవిత ప్రమాణాలను ముఖ్యంగా పల్లెల్లోని బడుగువర్గాలు, అవకాశాలు లేనివారి అభ్యున్నతి కోసం గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల అమలులో ఈ సంఘాలు మరింత క్రియాశీలంగా పాల్గొనే కార్యాచరణను సూచించాలని సభను అభ్యర్థిస్తున్నాను.

★ ★ ★

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | నవభారతనిర్మాత శ్రీ జవహర్ లాల్ నెహ్రూ | 409 |
| 2. | విశ్వరత్న - మన భారతరత్న ఇందిరాగాంధీ | 412 |
| 3. | ప్రపంచ నాయకుడు రాజీవ్ గాంధీ | 414 |
| 4. | నామీద డాక్టరు పట్టాభిగారి ప్రభావం | 416 |
| 5 | అమరజీవి పొట్టి శ్రీరాములు | 419 |
| 6. | శాంతి యాత్రికుడు - ప్రభాకర్ జీ | 422 |
| 7. | ఆంధ్రలో నీటివనరులు "ఆంధ్రభగీరథు" ని కృషి | 425 |
| 8. | ఆంధ్రప్రదేశ తొలి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి | 431 |
| 9. | నైతిక విలువలకు పట్టంగట్టిన శ్రీ నీలం సంజీవరెడ్డి | 435 |
| 10. | ప్రతిభ - రాజకీయ విజ్ఞత మూర్తీభవించిన నాయకుడు శ్రీ జలగం వెంగళరావు | 439 |
| 11. | సమైక్యతా సారథి శ్రీ జలగం వెంగళరావు | 443 |
| 12. | నవయుగ వైతాళికుడు- కందుకూరి వీరేశలింగం పంతులు | 450 |
| 13. | దేశోద్ధారక, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు | 453 |
| 14. | చరిత్రకెక్కిన వ్యక్తి - విశ్వనాథ | 457 |
| 15. | కోసూరు పున్నయ్య | 459 |
| 16. | పదవులను ఆశించని ప్రజానాయకుడు : రంగాజీ | 460 |
| 17. | కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి : కల్యాణకల్పవల్లి | 462 |
| 18. | మానవతావాది - ఇందిరాగాంధి | 464 |
| 19. | 'ఆంధ్రుల అభిమాన నాయకుడు' శ్రీ సంజీవరెడ్డి | 468 |
| 20. | నేనెరిగిన సంజీవయ్య | 473 |
| 21. | కాంగ్రెసు స్వరాజ్య ఉద్యమాలకు జీవగఱ్ఱ శ్రీ బారు రాజారావు | 476 |
| 22. | రాజకీయాలలో అదృష్టవంతుడు అనగాని | 478 |

# 1. నవభారతనిర్మాత శ్రీ జవహర్ లాల్ నెహ్రూ

భారత ప్రజల కోర్కెల గురించి ప్రభుత్వానికి తెలియజేయడానికి 1885లో ఏర్పడిన భారతజాతీయ కాంగ్రెస్ 1907లో "స్వరాజ్యం నా జన్మహక్కు" అని గుర్తించిన తిలక్ నాయకత్వంలో స్వతంత్రసమరాలకు నాంది పలికింది.

1920లో గాంధీజీ రాజకీయరంగప్రవేశంతో నూతనచైతన్యం వెల్లివిరిసింది. దేశప్రగతి, దేశస్వాతంత్ర్యం అవసరమని ఉద్బోధించి, సత్యం, అహింసలు ఆధారంగా సత్యాగ్రహ సమరాలు ఆరంభించారు. దేశపురోభివృద్ధికి, సమాజసంక్షేమానికి నిర్మాణాత్మక ఆలోచనలు, దృష్టి, కృషి అవసరమని గాంధీజీ 18 అంశాల నిర్మాణ కార్యక్రమాన్ని ప్రకటించారు. దేశంలో పేదరికం, నిరక్షరాస్యత నిర్మూలనకు కృషి ప్రారంభం అయింది. ఒక ప్రక్క స్వతంత్రసమరాలు చేస్తూనే, రెండో ప్రక్క నిర్మాణ కార్యక్రమాలను అమలు పరుస్తూ, మహాత్మా గాంధీ భారతరాజకీయాలలో ధ్రువతారగా నిలబడ్డారు. గాంధీజీ మహత్తర ఆలోచనలు, ఆచరణల ప్రభావం వలన భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. దేశప్రగతికి పునాదులు వేశారు. పోరాటం వలన త్యాగం, నిర్మాణకార్యక్రమం వలన సేవాభావం పెంపొందించి, ప్రజలలో నూతనచైతన్యానికి తోడ్పడినారు.

1938 లాహోర్‌లో నెహ్రూ అధ్యక్షతన జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ మహాసభలో "సంపూర్ణ స్వరాజ్యం" ధ్యేయంగా ప్రకటించింది. "నేను సామ్యవాదిని, ప్రజాస్వామ్యవాదిని" అని శ్రీ నెహ్రూ తన అధ్యక్షోపన్యాసంలో ప్రకటించి దేశరాజకీయ ఆర్థికవిధానాలకు నాంది పలికారు.

1938లో హరిపూర్‌లో శ్రీ సుభాష్ చంద్రబోస్ అధ్యక్షతన జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభలో దేశ అభివృద్ధికి ప్రణాళికలను రచించడానికి శ్రీ జవహర్ లాల్ నెహ్రూ అధ్యక్షతన జాతీయ కమిటీని నియమించారు. దేశ ఆర్థికాభివృద్ధికి అనేక రచనలు, చర్చలు ప్రారంభం అయినాయి. జాతీయ ప్రణాళిక రచనకు ఇది మార్గదర్శకమైనది. నెహ్రూ విధానాలకు రూపకల్పన చేశారు.

1946లో దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. భారత ప్రధానిగా శ్రీ నెహ్రూ నాయకత్వంలో స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పడింది. శ్రీ రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన భారత రాజ్యాంగ పరిషత్ ఏర్పడి, భారతదేశంలో ప్రజాస్వామిక, సామ్యవాద, లౌకిక రాజ్యాంగాన్ని ఏర్పాటుచేయటానికి నిర్ణయించారు. 1950 జనవరి 26 నుంచి నూతన రాజ్యాంగం అమలులోనికి వచ్చింది. 1950 మార్చి నెలలో రాజ్యాంగపరిధిలో దేశపురోభివృద్ధికి ప్రణాళికలను తయారుచేయడానికి ప్లానింగ్ కమిటీ ఏర్పడింది. ప్లానింగ్ కమిషన్ మెంబర్లతో, కేంద్రమంత్రి మండలి సభ్యులతో, అన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులతో జాతీయ అభివృద్ధి మండలి ప్రధాని అధ్యక్షతన ఏర్పాటు చేశారు.

తినడానికి తిండి, కట్టుకోడానికి గుడ్డ, ఉండటానికి ఇల్లు, విజ్ఞానానికి విద్య, ఆరోగ్యానికి వైద్యసౌకర్యాలు సర్వజనులకు చేకూరినప్పుడే మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చినట్లు అని గాంధీజీ అన్న మాటలను ఆశయంగా తీసుకొని, మన ప్రణాళికలను రూపొందించుట ప్రారంభించారు.

1951-56 ప్రథమ ప్రణాళికలో ఆహారధాన్యాల ఉత్పత్తికి, వ్యవసాయం, నీటి పారుదల, విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలకు ఎక్కువ కేటాయింపులు జరిగాయి.

1956-61 ద్వితీయ ప్రణాళికలో పరిశ్రమల అభివృద్ధికి ఉపాధికల్పనకు అవకాశం ఇవ్వబడింది.

1961-66 తృతీయ ప్రణాళికలో ఆర్థికప్రగతిలో సుస్థిరత, స్వయం పోషకత్వాలకు ప్రాధాన్యం ఇవ్వబడింది.

1964 జూలైలో తృతీయ ప్రణాళిక అమలు మధ్యకాలంలో 17 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా భారతప్రజల హృదయాల్ని ఆకర్షించి, వారి సంక్షేమానికి అవిరళకృషిచేసిన మహానాయకుడు, నవభారతనిర్మాత శ్రీ నెహ్రూ మరణించారు. వారి మరణానంతరం మహాత్యాగి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ప్రధానమంత్రి అయి పాకిస్తాన్‌పై జయభేరి మ్రోగించి, 1966లో తాష్కెంట్‌లో మరణించారు. మూడవ ప్రణాళిక పూర్తికాకముందే రెండవ ప్రధాని చనిపోయారు.

1974-79 అయిదవ ప్రణాళికలో 40 వేలకోట్ల ఖర్చుతో అమలు జరుగుతున్న సమయంలో 1977లో జనతా ప్రభుత్వం వచ్చి రోలింగ్‌ప్లాన్ ప్రవేశపెట్టింది. అభివృద్ధి కుంటుపడింది. 1980లో మళ్లీ ఇందిరాగాంధీ ప్రధాని అయి ఈ క్లిష్టమైన ఆర్థిక పరిస్థితిని ఎదుర్కొనవలసి వచ్చింది.

1980-85 అరవ ప్రణాళిక 158 వేల కోట్లతో తయారు చేయబడింది. 20 సూత్రాల నూతనపథకాన్ని ప్రవేశపెట్టి దేశప్రగతికి, అన్ని రంగాలలో అభివృద్ధికి, సామాన్యప్రజల సంక్షేమానికి ప్రాధాన్యం ఇచ్చి కృషి చేయబడింది. ఆరవ ప్రణాళికాంతంలో 1984 అక్టోబర్ 31వ తేదీన ఇందిరాగాంధీ దేశసమైక్యానికి తన ప్రాణాలను త్యాగం చేసింది. ఏడవ ప్రణాళికలో 18వేల కోట్లతో ఉపాధికల్పన కార్యక్రమాలను ప్రాధాన్యమిస్తూ తయారుచేస్తున్నారు. నిరుద్యోగనిర్మూలనకు ఈ ప్రణాళిక నాంది కాగలదు.

అలీనోద్యమం ద్వారా ప్రపంచశాంతికి పంచశీల మార్గాన్ని, సహజ జీవన సిద్ధాంతాన్ని నెహ్రూ పెంపొందించారు. వారి విధానం భారతదేశగౌరవాన్ని ఈ నాడు ప్రపంచంలో పెంచటానికి కారణం అయింది. అగ్రరాజ్యాలు కూడా అణకువగా ఉండి భారతదేశాన్ని మూడవ రాజ్యంగా చూస్తున్నాయి.

ప్రణాళికలద్వారా భారతదేశప్రగతికి తోడ్పడటానికి, విదేశాల సహాయ, సహకారాలను పొందుటకు శ్రీ నెహ్రూ తోడ్పడ్డారు. నవభారత నిర్మాణానికి వారి నిర్విరామకృషే ముఖ్యకారణం. వారి ఆలోచనలే పునాదులు. అందులకే నెహ్రూను నవభారతనిర్మాతగా భావిస్తున్నాం. చరితార్థుడు శ్రీ నెహ్రూ!

*(ఆంధ్రపత్రిక)*

# 2. విశ్వరత్న - మన భారతరత్న ఇందిరాగాంధీ

నాడు 1948 జనవరి 30, భారత స్వాతంత్ర్య పదాత, జాతిపిత మహాత్మాగాంధీ ఒక మతోన్మాది తుపాకి గుండ్లకు నేలకొరిగారు. హిందూ-ముస్లిం సామరస్యానికి, భారతజాతి సమైక్యతకు బాపూజీ ప్రాణాలు అర్పించారు. భారతజ్యోతి ఆరిపోయింది.

నేడు 1984 అక్టోబరు 31, భారత స్వాతంత్ర్య పరిరక్షణకు, ప్రగతికి, ప్రపంచశాంతికి అవిరళ కృషిచేస్తున్న భారతరత్న ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ తనను రక్షించవలసిన రక్షక భటుల మతమౌఢ్యానికి బలైనారు. హిందూ-సిక్కు సమైక్యతకు దేశ సమగ్రతకు చేస్తున్న కృషిలోనే అసువులు బాశారు.

1966 జనవరి 19వ తేదీన కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ నాయకురాలుగా ఎన్నికైన వెంటనే శ్రీమతి ఇందిరాగాంధీ మాట్లాడుతూ నామటుకు నేను "అబల"నని ఏనాడు అనుకోవడం లేదు. నేను ఒక నిర్దిష్టమైన కార్యాన్ని నిర్వర్తించవలసిన వ్యక్తినని భావిస్తున్నాను అన్నారు. నిజంగానే శ్రీమతి గాంధీ దేశంలోని అవినీతి, అజ్ఞానం, అహంభావం లాంటి దురాచారాలను ప్రతిఘటించి, దేశంలోని దారిద్ర్య నిర్మూలనకోసం ధ్వజమెత్తి చరిత్రాత్మక నిర్ణయాలు తీసికొని, కులమత ప్రమేయం లేని లౌకిక రాజ్యాంగాన్ని పదికాలాలపాటు నిలబెట్టటానికి, జాతీయ అంతర్జాతీయ రంగాలలో దేశ ప్రతిష్ఠను ఇనుమడింపచేయడానికి దీక్షా కంకణాన్ని ధరించి, కృషిచేసి ఆనాడు తాను అన్న మాటల్లో "నిర్దిష్టమైన కార్యాన్ని నిర్వర్తించవలసిన వ్యక్తి"గ నిలచింది.

శ్రీమతి ఇందిరాగాంధీ సామాన్య ప్రజల శ్రేయస్సు, దేశ సమైక్యత దృష్టిలో పెట్టుకుని ధైర్యసాహసాలతో చేసిన విజ్ఞతా పూర్వక నిర్ణయాలు సర్వజనుల ప్రశంసలు అందుకున్నాయి.

తెలంగాణ, ఆంధ్ర వేర్పాటు ఉద్యమాలను, విదర్భా ఉద్యమాలను, అస్సాం, పంజాబ్‌లలో చెలరేగిన అరాచకాలను ఎదుర్కొని మొక్కవోని ధైర్య స్థైర్యాలు ప్రదర్శించి దేశ సమైక్యాన్ని నిలబెట్టింది. ఉవ్వెత్తున ఉద్యమాలు వచ్చినా అరాచక శక్తులు పెచ్చు పెరిగినా, అతివాద శక్తులు అల్లర్లు జరిపినా టెర్రరిస్టులు చెలరేగినా ఆమె ఎంతో ఓర్పుతో, నేర్పుతో వాటిని ఎదుర్కొని దేశ సమగ్రతను కాపాడింది.

దేశంలో విశృంఖలంగ విజృంభించిన అరాచక శక్తుల వలన తన ప్రాణానికి ముప్పు అని తెలిసికూడ మొక్కవోని దక్షతతో దేశ సమగ్రతను కాపాడడానికి నిలబడి చివరకు తన ప్రాణాలనే అర్పించిన వీరనారి ఇందిర.

"మనది సర్వసత్తాక ప్రజాస్వామ్య వ్యవస్థ. దేనికైనా ప్రజలకు బోధించాలి, గాని నిర్బంధించకూడదు. విద్యాద్వారాను బోధన ద్వారాను వారి దృక్పథంలో మార్పులు తీసుకొని రావాలి" ఈ విధంగా మార్పుకోసం, దేశ భవితవ్యం కోసం సర్వతోముఖాభివృద్ధి కోసం శాయశక్తుల కృషిచేసిన ఇందిరాగాంధీ తన స్వార్థం కోసం ఏనాడు ఆశించలేదు. ఆమె తన ఆస్తి పాస్తులన్నింటినీ దేశానికి అర్పించిన త్యాగశీలి.

130 అలీన దేశాలకు నాయకత్వం వహిస్తూ ప్రపంచ శాంతికి కృషిచేస్తున్న శాంతిదూత మనకు లేరు. పెద్ద పెద్ద దేశాలు ఆమె నాయకత్వాన్ని చూచి యుద్ధపిపాసను వదలిపెట్టాయి. శాంతికి వ్యతిరేకమైన చర్యలు నిర్మోహమాటంగా ఆమె ఖండించింది. అభివృద్ధి జరగవలసిన, అభివృద్ధి జరుగుతున్న దేశాలకు ఆమె ఆశాజ్యోతిగా వెలుగొందింది. 4వ తేదీన ఆమె అంత్యక్రియలలో పాల్గొన్న వివిధ దేశాధిపతులు ఆమెనుగురించి చెప్పిన మాటలవల్ల ఆమె మీద ఎంత గౌరవాభిమానాలు ఇతర దేశాలలో ఉన్నవో మనకు అర్థమవుతుంది.

ఆమె కేవలం "భారతరత్న"మే కాదు. "విశ్వరత్న". విశ్వమే ఒక నేతను కోల్పోయింది. ఇదర ఆశయాలకోసం తన ప్రాణాన్ని త్యాగంచేసిందో ఆ ఆశయసాధనకు కృషిచేయడమే మన విధ్యుక్తధర్మం.

*(గాంధీక్షేత్రం మాసపత్రిక)*

# 3. ప్రపంచ నాయకుడు రాజీవ్ గాంధీ

వయసులో చిన్నవాడయినా, అనుభవం ఎక్కువగా లేకపోయినా, అనుభవజ్ఞులయిన వయోవృద్ధులకంటే పరిపాలన దక్షులైన మేధావులకంటే మిన్నగా దేశసమస్యలను సరిదిద్దటమే కాక, ప్రపంచసమస్యల పరిష్కారంలో విజ్ఞత చూపిస్తున్న రాజనీతిజ్ఞుడుగా పేరొందారు రాజీవ్.

అక్టోబరు 31వ తేదీన ప్రపంచచరిత్రలో దుర్దినం. అలీన రాజ్యాల నాయకురాలు, భారతప్రజల ఆశాజ్యోతి, పీడితప్రజల ప్రియతమనేత శ్రీమతి ఇందిరాగాంధి ప్రపంచశాంతి సందేశాన్ని విదేశ టి.వి.లో ఇవ్వడానికి వెళుతున్న సమయంలో, ఆమెను కాల్చి చంపివేశారు. అ దుర్వార్త మానవాళిని దుఃఖసముద్రంలో ముంచెత్తింది. ప్రపంచమే విచారసాగరంలో మునిగిపోయింది. ఆ క్లిష్టసమయంలో శ్రీ రాజీవ్ ప్రధానిగా పదవి స్వీకరించారు.

ఇందిరాగాంధీని కాల్చివేశారనే వార్త ప్రజలలో ఉద్రేకాన్ని రేకెత్తించింది. ఆ అదనులో అరాచకశక్తులు విజృంభించాయి. ఢిల్లీ నగరం అగ్నిగోళంగా తయారయింది. సెక్యూరిటీ అధికారులు వారించినా వినకుండా, అర్ధరాత్రి శ్రీ రాజీవ్ ఢిల్లీ నగరంలో పర్యటించి, అరాచకశక్తులను అణచివేయడానికి అధికారులకు బలాన్నిచ్చారు. పరిస్థితిని అదుపులోనికి తీసుకొనివచ్చారు. దేశంలో అరాచకాన్ని తెచ్చి ప్రజాస్వామ్యాన్ని మంటగలపాలని కొన్ని శక్తులు ప్రయత్నించాయి. ధైర్యంతో అణచివేశారు. ప్రజాస్వామ్యం రక్షింపబడింది. ఇందిరాగాంధీ అంత్యక్రియలకు హాజరయిన వందలాది మంది విదేశీ ప్రతినిధులు శ్రీ రాజీవ్ చాకచక్యానికి హర్షాన్ని తెలిపారు. సానుభూతిని తెలుపుతూ, పూర్తి సహాయసహకారాలు అందిస్తామని చెప్పారు. భారత సమైక్యానికి, రాజకీయసుస్థితరకు శ్రీ రాజవ్ గాంధీ పార్లమెంటు ఎన్నికలు ప్రకటించారు. 510 సభ్యులతో 410 సీట్లు కాంగ్రెసుకు వచ్చాయి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కాంగ్రెసు పార్టీకి ఇంత మెజారిటీ ఎన్నడూ రాలేదు. భారతప్రజలు ఇందిరాగాంధీ ఆ సమయాన భారత సమైక్యానికి, శ్రీ రాజీవ్ గాంధీకి అండగా నిలిచారు. శ్రీ రాజీవ్ గాంధీ తిరుగులేని నాయకుడుగా రూపొందారు. ప్రపంచంలో గౌరవం పెరిగింది. భారతదేశంలో ప్రజాస్వామ్యం పటిష్ఠమయింది.

రాజకీయాలలో అవినీతి తొలగించి, రాజకీయసుస్థిరతను చేకూర్చడానికి పార్లమెంటు ప్రథమ సమావేశంలో పార్టీల మార్పిడి నిరోధక బిల్లును ఆమోదింపచేశారు. పరిపాలన వ్యవస్థలో మార్పులు చేశారు. భారతదేశ సమైక్యానికి సవాలుగా నిలిచిన పంజాబ్, అస్సాం సమస్యలను పరిష్కరించి, పంజాబులో ధైర్యంగా ఎన్నికలు పెట్టి టెర్రరిజం కంటే ప్రజాస్వామ్యమే మిన్న అని నిరూపించారు.

అలీనోద్యమనాయకుడుగా ప్రథమంగా రష్యావెళ్ళారు. అక్కడ బ్రహ్మాండమైన స్వాగతసత్కారాలు లభించాయి. తర్వాత అమెరికా వెళ్లితే అంతకంటె మిన్నగా స్వాగత సత్కారాలు లభించాయి. ఈ రెండు అగ్రరాజ్యాలకు నిర్మొహమాటంగా ఆయుధాలను తయారుచేయడం వలన ప్రపంచశాంతికి ఎలా అవరోధం కలుగుతుందో వివరించారు. పాకిస్తానుకు ఆయుధాలను అమెరికా సరఫరా చేయడంవల్ల భారత ఉపఖండంలో శాంతికి విఘాతం కలుగుతుందని కచ్చితంగా చెప్పారు. రష్యా, అమెరికా పత్రికావిలేకరుల సమావేశంలో ఎంతో నేర్పుగా జవాబులు ఇచ్చారు. ఈ మధ్యనే బ్రిటన్, హాలెండు, అమెరికా, రష్యా, క్యూబా దేశాలు వెళ్ళివచ్చారు. బ్రిటన్‌లో టెర్రరిజం విషయమై ప్రధాని థాచర్‌తో చర్చించారు. కామన్వెల్తు రాజ్యాధిపతుల సావేశంలో శ్రీ రాజీవ్ కీలకమైన పాత్ర వహించి దక్షిణాఫ్రికా చర్యల విషయమై బ్రిటన్‌ను ఒప్పించి ఏకగ్రీవంగా తీర్మానం చేసేలా చేయగలిగారు. ఐక్యరాజ్య సమితి 40వ వార్షికోత్సవ సమావేశంలో ప్రసంగిస్తూ నిరాయుధీకరణకు తోడ్పడి, ప్రపంచశాంతికి దోహదం చేయాలని విజ్ఞప్తి చేశారు.

సమితి సమావేశంలో పాల్గొన్న సందర్భంగా శ్రీ రాజీవ్ గాంధీ పాకిస్తాను అధ్యక్షులు శ్రీ జియాతోను, అమెరికా అధ్యక్షులు శ్రీ రీగన్‌తోనూ చర్చలు జరిపారు. చైనా ప్రధానిని కలుసుకొన్నారు. తిరిగివస్తూ రష్యాలో శ్రీ గోర్బచేవ్‌తో సంప్రదింపులు జరిపారు. అమెరికా- రష్యా విభేదాలు తగ్గించి, జెనీవా సమావేశంలో నిరాయుధీకరణమార్గాన్ని అంగీకరించేందుకు, ప్రపంచశాంతికి దోహదం చేసేటట్లు ప్రయత్నాలు చేశారు. రష్యా, అమెరికా తరువాత రాజీవ్ రాజకీయచతురత వలన భారతదేశం మూడవరాజ్యంగా రూపొందింది.

శ్రీ రాజీవ్ ప్రధాని అయిన కొద్దికాలంలోనే ప్రపంచనాయకుడుగా రూపొందారు. ప్రపంచశాంతికి మహాత్మా గాంధీ మార్గంలో నెహ్రూ రూపొందించిన సహజీవన సిద్ధాంతాన్ని, ఇందిరాగాంధీ నిర్వహించిన అలీనోద్యమానికి నాయకత్వం వహిస్తూ, ప్రధాని అయిన సంవత్సరంలోనే శ్రీ రాజీవ్ గాంధీ విశ్వశాంతిని సాధించే ప్రపంచ నాయకుడుగా రూపొందడం భారతదేశప్రజల అదృష్టం!

(ఆంధ్రపత్రిక)

# 4. నామీద డాక్టరు పట్టాభిగారి ప్రభావం

**గాం**ధీజికి భాష్యకారుడుగా పేరొందిన డాక్టరు పట్టాభి, గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు చేయుటలో ఆదర్శమైన కార్యక్రమాలు నిర్వహించారు. ఆరోగ్య, వైద్య విషయాలలోనే కాదు, ఆర్థిక, రాజకీయరంగాలలో కూడా నిపుణుడే. పారిశుద్ధ్యము, పొదుపు, స్వయంపోషకత్వం సాధనలో వారికి వారేసాటి. ఆరోగ్యానికి పారిశుద్ధ్యము ఎంతేని అవసరం. తనకు తానే కాకుండా, తన పరిసరాలను పరిశుద్ధంగా ఉండాలని గాంధీజీ నిర్మాణ కార్యక్రమములో ప్రధానాంశం. "ఆరోగ్యమే మహాభాగ్యం" అన్నారు పెద్దలు. పట్టాభిగారు తన పరిసరాలను ఎంతో పరిశుభ్రంగా చేసుకొనేవారు.

జీవితంలో ప్రతివారు పాటించవలసిన ముఖ్యవిషయం పొదుపు. కనుక ప్రతి విషయంలోను పొదుపు పాటించాలి. జాగ్రత్తగా ఖర్చుపెట్టమనేవారు. పట్టాభిగారు తనకు వచ్చిన ఉత్తరాల కవర్లను చించి వాటిపైన కాంగ్రెసు చరిత్ర రాశారిన ప్రతీతి. బందరు హిందూ కాలేజీలో చదువుకొంటూ ఒక రోజున వారిని చూద్దామని వెళ్లాను. తనకు వచ్చిన ఉత్తరాల కవర్లను చించి సాఫీగా పెడుతున్నారు. నావంకచూచి కూర్చోమన్నారు. కూర్చున్నాను. నన్నుకుశల ప్రశ్నలు వేస్తూనే వాడిన కవర్లపై రాయడం ప్రారంభించాడు. నేను ఆశ్చర్యపోయాను. ఎంత పొదుపు! చిరిగిపోయిన పంచెలను తుండ్లుగా, చొక్కాలను జేబురుమాళ్ళుగా తయారుచేసేవారు. డబ్బుఖర్చు పెట్టడంలో ఎంతో జాగ్రత్తగా వుండేవారు.

డాక్టరు పట్టాభి మధ్యప్రదేశ్ గవర్నరుగా ఉన్నారు. డాక్టరు పట్టాభి పేరుతో బందరులో కాంగ్రెసు భవనం కొన్నారు. జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా ఉన్నప్పుడు దానిని రిపేరు చేయుటకు వారికి డబ్బు పంపవలసిందిగా రాసిన ఉత్తరానికి వారు 10.11.1954 తేదీన లేఖలో యిలా వ్రాశారు : "భవన మరమ్మత్తులకు వెంటనే ఎంత కావలసి వుంటుంది? రూ॥2803-73 పైసలు నిల్వ వుంది. ఒకేసారి అంతా కావాలా, లేక అయిదు వందల వంతున దఫాల వారీగా కావాలా? ఎన్నికలు రాబోతున్నాయి. ఈ డబ్బును జాగ్రత్తగా వినియోగించాలి. మీకు డబ్బు నిల్వ వుంటే, ఆ డబ్బును ఎన్నికలకు ఉపయోగించడానికి తరువాత సర్దవచ్చుననే ఆలోచనతో ఖర్చు చేస్తూ వుండడం సహజం. హరిజన నిధులను రాష్ట్ర కాంగ్రెసుకు ఖర్చు పెట్టారు.

మరల జమ చేయలేదు. వేరే భావించకండి. సలహా యిస్తున్నాను. మొత్తం డబ్బు అయ్యేవరకు అయిదు వందల వంతున చెక్కు పంపిస్తాను. ఆర్భాటాలు, వృథా ఖర్చులు చేయకండి".

జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా పట్టాభి భవనం మరమ్మత్తులు చేపట్టినప్పుడు రాసిన ఈ ఉత్తరం నాకు ఎప్పుడూ గుర్తుకు వస్తుంది. వారు చెప్పినది అక్షరాల నిజం. దేని కొరకు డబ్బు వచ్చినా అవసరాలు దానిని ఆకర్షించి అంతం చేస్తాయి. వారు చెప్పిన విషయాన్ని అప్పుడు పాటించినా ఇప్పుడు పాటించలేకపోతున్నాము. తప్పనిసరి అవుతూ వుంటుంది. పరిస్థితుల ప్రభావాల నుంచి తప్పుకోవడం కష్టము అవుతుంది. నిర్దేశించిన దానికే ఖర్చు పెట్టగల్గితే దేశంలో ఈ క్లిష్టస్థితే వుండదు. అంతా సవ్యంగా సాగిపోతుంది.

పట్టాభి మంచి ఆర్థిక శాస్త్రవేత్త. ఆర్థికంగా అభివృద్ధి కావడానికి, పొదుపుగా ఖర్చుపెట్టడానికి బ్యాంకింగు పద్ధతి అవసరమని ఆంధ్రా బ్యాంకు, భారత లక్ష్మీ బ్యాంకు, కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకులను స్థాపించారు. రైతులకు, వ్యాపారస్థులకు తక్కువ వడ్డీ రేట్లకు అప్పులు తీసుకోవడానికి, సంపాదించిన డబ్బు డిపాజిట్టు చేయడానికి, పొదుపు పాటించడానికి అవకాశం కల్పించారు. ఆంధ్ర ఇన్సూరెన్స్, హిందూస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెనీలు పెట్టారు. జీవిత బీమా పద్ధతిని ప్రవేశపెట్టారు. ఈనాడు దేశమంతా ఈ పద్ధతులు గ్రామ గ్రామానికి ప్రాకాయి.

ఎన్నోసార్లు వారిని కలుసుకొన్నాను. వారిని చూస్తూవుంటేనే ఎంతో నేర్చుకొనేటట్లు ఉండేది. తను ఆచరించడం ద్వారా యితరులను ఆచరించడానికి ప్రోత్సాహమిచ్చేవారు. ఎప్పుడు వారిదగ్గరకు వెళ్లినా నూలు వడకడమో, ఏదో విషయాలమీద రాయడమో తను కూర్చున్న పరిసరాలను శుభ్రపరచుకోవడమో ఏదో ఒక పనిలో నిమగ్నులై ఉండేవారు. పనిచేస్తూనే మాట్లాడుతూ ఉండేవారు. స్వయంపోషకత్వం వారి ఆశయం. నూలు వడికి తన బట్టలను తయారు చేయించుకొనేవారు. తన జీవిత విధానంలో స్వయంపోషకత్వాన్ని పాటించేవారు. ఆదర్శవంతమైన ఆర్థిక శాస్త్రవేత్త.

"క్విట్ ఇండియా" ఉద్యమంలో అరెస్టు అయిన తరువాత 1945లో విడుదల అయి, బందరు వచ్చారు. వారిని దర్శించడానికి వెళ్లాను. వారు కూర్చుండే కుర్చీలను వారే శుభ్రం చేస్తూ తుడుస్తున్నారు. రమ్మని పిలిచి నారు. "ఏం చేస్తున్నావు?" అన్నారు. "చదువుకొంటున్నాను. జాతీయ విద్యార్థి సంఘాలలో పనిచేస్తున్నాను" అన్నాను.

"రాజకీయాలు, చదువు రెండూ కుదురుతున్నాయా?" అన్నారు. "సమన్వయం చేసుకొంటూ నడుస్తున్నా"నని అన్నాను. "గట్టివాడవులాగా వున్నావ్! బాగా చదువుకో. ఉన్నత స్థాయిని అందుకోవా"లని అంటూ ఆశీర్వదించారు. వారి మాటలు నాలో ఎంతో చైతన్యాన్ని కల్గించాయి. వారి కార్యక్రమాలు నాకు మార్గదర్శకంగా కనబడింది. నిర్మాణ కార్యక్రమం మీద మక్కువ కల్గింది. వారి ఆశీర్వచనం నా ఉన్నత స్థితికి కారణం కావచ్చు. వారి చేతలు చూడడంతో నాలో కల్గిన చైతన్యం నిర్మాణ కార్యక్రమాల అమలుకు మేము రూపొందించిన గాంధీక్షేత్రం కావచ్చును. వారి మాటలు నాలో నిర్మాణాత్మకమైన దృష్టిని అలవరచుకొనే అవకాశం కల్గించాయి. నాలో ఎంతో మార్పులను తీసుకొనివచ్చాయి. పట్టాభిగారితో భేటీ నా జీవితంలో మరువలేని మాటల మూట.

ఆగష్టు ఉద్యమంలో కాంగ్రెసు నాయకులు అరెస్టు అయిన తర్వాత "ప్రజాయుద్ధం" నినాదంతో కమ్యూనిస్టులు ప్రభుత్వాన్ని బలపరుస్తూ పంచమాంగదళంగా రూపొందారు. కాంగ్రెసు వాదుల మీద దౌర్జన్యాలు ప్రారంభించారు. దివిసీమ కమ్యూనిష్టులకు కేంద్రమైంది. విశ్వనాధపల్లి కొత్తపాలెంలో డాక్టరు పట్టాభిగారిని ఆహ్వానించారు. వారు సాయంత్రం ఇంటికి తిరిగి వెళ్లటానికి వీలుగా ఉండాలని మధ్యాహ్నం కాంగ్రెసు వాదుల మీటింగు ఏర్పాటు చేశారు. విద్యార్థులము అవనిగడ్డ నుండి నడిచి మీటింగుకు వెళ్లినాము. డాక్టరు పట్టాభి గారికి ఘనమైన స్వాగతాన్ని యిచ్చారు. డాక్టరు పట్టాభి నూలుదండలు స్వీకరించేవారు పూలదండలు తీసుకొనేవారు కాదు. ఆ గ్రామంలో స్త్రీలలో ఎక్కుమంది రాట్నం వడుకుతుండేవారు. నాల్గయిదు పంచెలు నేయించు కోవడానికి వీలుగా చిలపలు వచ్చాయి. చిలపలన్నిటినీ జాగ్రత్తగా పరచి కారులో పెట్టించారు. వారి అనర్గళమైన ఉపన్యాసం, కమ్యూనిష్టులను గురించి చేసిన విమర్శలు నేటికీ నా చెవులలో గింగురుమంటున్నాయి. వారు చెప్పే అంకెల్లో రూపాయి పైసలతో సహా వుండేవి. తేదీలతో సహా చెప్పేవారు. ఆ మీటింగు జరగకుండ కమ్యూనిష్టులు అల్లరి చేస్తారని పుకార్లు వున్నాయి. అటువంటి పరిస్థితులలో మీటింగు జరిపి, పట్టాభిగారు వెళ్లారు. శ్రీ బాదర్ల నాగన్న గారు మీటింగు ఏర్పాటు చేశారు. తరువాత చాలా చోట్ల కమ్యూనిష్టులు దౌర్జన్యాలు చేశారు. అయితే వారి ఉపన్యాసం ప్రజలలో చాలా మార్పు తెచ్చింది. దివి సీమలో కాంగ్రెసుకు తిరిగి పునాదులు వేయబడినాయి. పట్టాభిగారి మీటింగు కాంగ్రెసు వాదులలో ధైర్యాన్ని కల్గించింది. ఆంధ్రదేశంలో కాంగ్రెసును పటిష్ఠవంతంగా పట్టాభిగారు రూపొందించారు.

*(భారత జాతీయ కాంగ్రెసు శతజయంతి సంచిక)*

# 5. అమరజీవి పొట్టి శ్రీరాములు

నలభై సంవత్సరాలపాటు ప్రత్యేక రాష్ట్రం కొరకు ఆందోళనలద్వారా, సత్యాగ్రహాలద్వారా, మహాసభల ద్వారా అవిశ్రాంత పోరాటం జరిపిన ఆంధ్రులు చివరికి పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ ద్వారా తమ చిరకాల వాంఛ నెరవేర్చుకున్నారు. పొట్టి శ్రీరాములు ఏకాకిగా నిలచి, ఆమరణ నిరశనవ్రతం బూని 1952 డిశంబరు 15న తన ఆత్మబలిదానంద్వారా ఆంధ్రరాష్ట్ర అవతరణకు కారకుడగుటేగాక దేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు దోహదకారిగ నిలచి అమరజీవి అయ్యారు.

మహాత్ముని ప్రియశిష్యుడు, అకలంక దేశభక్తుడు అయిన పొట్టిశ్రీరాములు 1901 మార్చి 16న చెన్నైలో జన్మించారు. వీరి పూర్వికులు నెల్లూరు జిల్లా జువ్వలదిన్నె కాపురస్థులు.

చిన్ననాటి నుండి దేశసేవచేయాలనే కోరిక శ్రీరాములు గారికుండేది. ఆయన తన చదువుకు స్వస్తిచెప్పి స్వాతంత్ర్య సమరంలో దూకుటకు సంసిద్ధుడయ్యాడు. కాని కుటుంబసభ్యుల కోరికను కాదనజాలక ముంబైలో "శానిటరీ ఇంజనీరింగు"లో డిప్లొమా పొందారు. తన విద్య ముగిసిన పిమ్మట ముంబైలోనే ఓ.వి.పి. రైల్వేలో నెలకు 250 రూపాయల వేతనంతో ఉద్యోగంలో చేరి నాలుగు సంవత్సరాలపాటు పనిచేశారు. ఆ రోజులలో ఆయనకు వివాహం జరుగుట, తరువాత కొద్దికాలంలో భార్యావియోగం సంభవించుటతో శ్రీరాములలో వైరాగ్యం ప్రవేశించింది. ఆయన హృదయం పూర్తిగా మారిపోయింది. అదే సమయంలో జలియన్ వాలాబాగ్ దురంతాలు జరిగాయి. రౌలట్‌చట్టం ప్రవేశపెట్టారు. దేశమంతటా అశాంతి ప్రబలినది. శ్రీరాముల హృదయాన్ని ఈ సంఘటనలు కదిలించివేసింది. తాను చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి వెంటనే గాంధీజీ గుజరాతులో స్థాపించిన సబర్మతీ ఆశ్రమంలో ప్రవేశించాడు. ఈ సబర్మతీ ఆశ్రమ జీవితం శ్రీరాములలో గొప్ప పరివర్తన తెచ్చింది. ఉత్తమ నిర్మాణ కార్యకర్తగా ఆయన రూపొందారు. తన సత్ప్రవర్తనతో తోటి ఆశ్రమవారులకేకాక గాంధీజీ అభిమానానికి కూడా పాత్రుడయ్యారు. "శ్రద్ధాసక్తులున్న స్వచ్ఛంద సేవకుడు" తీవ్రమైన దేశభక్తుడు, కొంచెం చాదస్తుడు" అని గాంధీజీ శ్రీరాములు గురించి ఆంధ్రకేసరి ప్రకాశంగారికి రాశారు.

11 సంవత్సరాలపాటు సబర్మతీ ఆశ్రమంలో గాంధీజీ చరణసన్నిధిలో శ్రీరాములు గడిపారు. తన పొదుపరితనం వలన, మితవ్యయం వలన నిరాడంబర జీవితం గడిపి ఆశ్రమంతో తనకిచ్చే నెలసరిభత్యంలో కూడ కొంతమిగిల్చి ఆశ్రమంకే సమర్పించేవారు. శ్రీరాములు గారి నియమబద్ధమైన ఆదర్శ జీవనానికి ముగ్ధుడై మహాత్ముడు "శ్రీరాములువంటి నిష్కామ కార్యధురంధరులును, సేవాతత్పరులును పదుగురున్నచోట్లయితే సంవత్సరకాలంలోనే నేను స్వరాజ్యం సాధించగలను" అని చెప్పారు. ఇంతకంటే శ్రీరాముల గుణసంపత్తికి కార్యదక్షతకు వేరే ప్రశంసలక్కరలేదు.

స్వాతంత్ర్య సమరంలో మూడుసార్లు శ్రీరాములు జైలుశిక్ష అనుభవించారు. 1927 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని ఆ ఉద్యమ వ్యాప్తికి తీవ్రకృషి చేశారు. 1930 ఉప్పుసత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. 1941లో వ్యక్తి సత్యాగ్రహోద్యమంలో, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొని ఆయన కారాగారవాసం అనుభవించారు.

శ్రీ శ్రీరాములు ఆదర్శ నిర్మాణ కార్యకర్త. ఖద్దరు, మద్యనిషేధం, హరిజనోద్యమాలలో తీవ్రకృషి చేసి "వ్యక్తిసత్యాగ్రహం ముగిసినపిమ్మట ఒకటిన్నర సంవత్సరాలు రాజకోట సంస్థానంలో ఆయన సాంఘిక సేవ చేశారు. ఆ తరువాత గుజరాతు రాష్ట్రంలోని "తరవాడ"లో రెండున్నర సంవత్సరాలు సాంఘిక సేవా కార్యక్రమాలు పట్టుదలతో చేశారు. అటుపిమ్మట ఆంధ్రదేశానికి వచ్చి "కొమరవోలు" గాంధీ ఆశ్రమంలో నాలుగు సంవత్సరాలపాటు సమాజసేవ చేశారు.

హరిజనోద్ధరణపట్ల శ్రీ శ్రీరాములు ప్రత్యేక శ్రద్ధ వహించి కృషిచేశారు. 1946లో నెల్లూరు పట్టణ మూలపేటలోని శ్రీ వేణుగోపాలస్వామి గారి దేవాలయంలో హరిజనులకు ప్రవేశం కల్పించుటకు 20 రోజులపాటు నిరాహారదీక్ష చేసి విజయం సాధించారు.

స్వరాజ్యం వచ్చిన పిదపకూడ హరిజనోద్ధరణకై 1948లో తిరిగి 11 రోజులు కఠోర ఉపవాసం చేసి టంగుటూరి ప్రకాశం ప్రభుత్వం వారిచే ప్రతినెలలో చివరిరోజును హరిజనోద్ధరణ దినంగా పాటింపచేయుటకు కారకుడయ్యారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించి నపిమ్మట క్రియాశీల రాజకీయం నుండి పూర్తిగా తప్పుకుని సమాజసేవకే తన జీవితాన్ని అంకితం చేసుకొన్నారు. ఆంధ్రదేశంలో గాంధీ స్మారకనిధికి సంచాలకుడుగా శ్రీరాములుగారు నియమితులయ్యారు. వారిచ్చే

గౌరవ వేతనం 150 రూపాయలలో ప్రయాణ ఖర్చులకు సరిపడు ధనాన్ని మాత్రమే గైకొని మిగిలిన ధనాన్ని స్మారకనిధికి విరాళంగ పంపేవారు. ఇవి ఆయన నిరాడంబరంగా, నిష్కళంక జీవితానికి ఉదాహరణ.

నలభై సంవత్సరాలపాటు ఎన్నెన్నో మహోద్యమాలుచేసినా, ఎందరో మహానాయకులు కృషిసల్పినా, ఆంధ్రుల ప్రత్యేకరాష్ట్ర వాంఛ గగనకుసుమంగ ఉండిపోయింది. ఈ అనిశ్చిత పరిస్థితి శ్రీ శ్రీరాములకు మిక్కిలి మనస్సు క్షోభం పెట్టింది. ఎలాగైనా ఆంధ్రరాష్ట్రాన్ని సాధించి తీరాలని పట్టుదల పెరగసాగింది. ఆంధ్రరాష్ట్రం సాధించాలంటే ఇక ఆత్మార్పణ ఒక్కటే మార్గం అని భావించి చెన్నైలోని బులుసు సాంబమూర్తిగారి ఇంటియందు 1952 అక్టోబరు 19న ఆమరణ నిరాహారదీక్షను ప్రారంభించి 58 రోజులు (నిరవధిక ఉపవాస వ్రతాన్ని పట్టుదలతో సాగించి డిశంబరు 15 రాత్రి 11 గంటల 23 నిమిషాలకు ఆయన అమరుడైనాడు. "క్రీస్తు శిలువకు అనంతరం, ఇది మరొక మహత్తర ఆదర్శపరిత్యాగం" అని మద్రాసు మెయిల్ పత్రిక తన సంపాదకీయంలో పేర్కొంది. ఆయన ఆత్మపరిత్యాగం యావద్భారత దేశాన్ని కలచివేసింది.

1952 డిశంబరు 191 ప్రధాని నెహ్రూ పార్లమెంటులో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం గురించి ప్రకటనచేశాడు. 1953 అక్టోబరు 1 ఆంధ్రకేసరి ప్రకాశం నాయకత్వంలో కర్నూలు రాజధానిగా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. 1956 నవంబరు 1న ఆంధ్రరాష్ట్రంలోని 11 జిల్లాలను, తెలంగాణలో 9 జిల్లాలను కలిపి 20 జిల్లాలతో "ఆంధ్రప్రదేశ్" అవతరించింది. పొట్టి శ్రీరాములు కనిన కలలు ఫలించినవి. ఆయన ఆత్మత్యాగంచేసి సాధించిన ఆంధ్రరాష్ట్రం సమగ్రతను నిలబెట్టడానికి క్రమక్రమాభివృద్ధికి సుస్థిరతతో పాటుపడటమే మనమా అమరజీవికి అర్పించే నివాళి.

*(గాంధీక్షేత్రం మాసపత్రిక)*

## 6. శాంతి యాత్రికుడు - ప్రభాకర్ జీ

నత్వహం కామయే రాజ్యం
న స్వర్గం నాపునర్భవం
కామయే దుఃఖ తప్తానాం
ప్రాణినాం ఆర్తి నాశనం.

అనగా నేను రాజ్యం కోరను. స్వర్గం కోరను, పునర్జన్మ లేకపోవుట కోరను, దుఃఖితులైన ప్రాణులబాధా నివారణ కోరెదను.

సేవాగ్రాం ఆశ్రమంలో గాంధీజీ నిత్యం ప్రార్థనా సమావేశంలో ఈ శ్లోకాన్ని పఠింపజేసేవారు. 1938 నుండి సేవా గ్రామంలో గాంధీజీకి అత్యంత సన్నిహిత అనుచరులుగా ఉన్న ప్రభాకర్‌జీ పై శ్లోకం విశేషమైన ప్రభావం కల్గించింది. తన జీవితం దీనజనుల సేవకు అంకితం కావాలనుకొన్నారు. ఆపద సంభవించినచోట, బాధితులను ఆదుకోవాడానికి, సహాయ కార్యక్రమాలు ప్రారంభించడానికి ప్రభాకర్‌జీ దుమికేవారు. శరవేగంతో చేరేవారు. కార్యకర్తలను ప్రోత్సహించేవారు. నిద్రాహారాలు లేకుండా సేవచేసేవారు.

1977 నవంబరు 19వ తేదీన ఈ శతాబ్దంలోనే ఎరుగని జల ప్రళయం వచ్చింది. ఉప్పెన, తుఫాను వలన వేలాది ప్రజలు, లక్షలాది పశువుల, కోట్లాది ఆస్తినష్టమైంది. ఆ భయంకర బీభత్స సమయంలో సేవా గ్రామమ్‌నుండి ప్రభాకర్‌జీ హుటాహుటిని అవనిగడ్డ వచ్చారు. గాంధీజీ నవఖాళీయాత్రను గుర్తుచేసే విధంగా, ప్రభాకర్‌జీ తుడిచిపెట్టుకుపోయిన గ్రామాలలో తిరిగి బాధితులను ఓదార్చి సహాయ కార్యక్రమాలు ప్రారంభించారు. సేవా కార్యకర్తలకు సేవాశ్రమం కేంద్రమైనది.

గాంధీ క్షేత్రం ఉప్పెన బాధతుల శిబిరంగా మారిపోయింది. సేవాశ్రమంలో రోజూ వేలకొద్ది బాధితులకు భోజన వసతులు, నెలరోజులపాటు కుంభమేళలాగా వుండిపోయింది. బీభత్స ప్రాంతంలో ప్రభాకర్‌జీ ప్రభాకరుడులాగా ప్రకాశించారు. శవసేన ఏర్పాటుచేసి శవాలు తీయించారు. సేవా సంస్థలను కార్యకర్తలను ప్రోత్సహించి గ్రామాలకు దారులు చేయడం, గుడ్డలు, బియ్యం, పాత్రలు పంచిపెట్టడం మొదలయిన

కార్యక్రమాలు చేపట్టారు. కర్ర చేతపట్టి పాదయాత్ర సాగించారు. పునరావాస కార్యక్రమాలలో ప్రభుత్వ సలహా సంఘాలతో సభ్యులుగా నియమింపబడ్డారు. ఆదర్శమైన గృహాల్ని కట్టాలన్నారు. ప్రతి యింటికి రాట్నం, కొబ్బరిచెట్లు, పశువుల కొట్టం, నాలుగు యిండ్లకు కలిపి గోబర్ గ్యాస్ ప్లాంటు ఉండేటట్లు ప్లానువేశారు. ఖాదీ మిషన్ సిబ్బంది విరాళాలతో కమ్మనమోలు గ్రాంధీగ్రాం నిర్మాణం చేపట్టారు. ఎదురు మొండి, ఎలిచెట్లదిబ్బ దీవుల అభివృద్ధికి పథకం తయారుచేశారు. ఉప్పెనలో నిరాధారులైన పిల్లలకు సేవాశ్రమంలో గాంధీ గురుకులం ఏర్పాటు చేశారు. పిల్లల్లో పిల్లవాడుగా, పెద్దలలో పెద్దగా మెలిగేవారు. ప్రభాకర్‌జీ రాగానే పిల్లలంతాచేరి కౌగిలించుకొనేవారు. తల్లిదండ్రులను మరచి పోయేవారు. స్త్రీలకు ప్రభాకర్‌జీ తండ్రికారు, తల్లిఅయి, తల్లిచూపే ఆప్యాయతను ప్రభాకర్‌జీ చూపేవారు.

ప్రభాకర్‌జీ జీవిత చరిత్ర చాల విచిత్రమైనది. అనంతపురంలో కాన్పులు చేసే మహత్తరమైన సేవలో నిమగ్నమైన మిడ్‌వైఫ్‌కు జన్మించిన జోసెఫ్ ప్రభాకర్‌జీ. అనంతపురంలో మంచి గడుగ్గాయిగా పేరుపొందాడు. పొగరుబోతుగా ఉండి మంచి స్పోర్ట్సుమన్‌గా ఉండేవారు. నాటకాలు వేసేవారు. అక్కడ జరిగిన చిన్న తగాదాతో అనంతపురం వదలి నడచి బందరుచేరి ఆంధ్రజాతీయ కళాశాలలో అడవి బాపిరాజుగారి శిష్యులుగా చేరారు. బందరులో వుండగా గాలివానకు పడిన చెట్టు కింద ఒక ముసలమ్మ పడిపోయి మూలుగుతోంది. ధైర్యం చేసి ఆ ముసలమ్మను బయటకు లాగి ఉపచారం చేశాడు. కాని ఆమె చనిపోయింది. ఎంతో దుఃఖించారు. శ్రీ భరతన్ కుమారప్పను కలిశారు. రౌడీగా ప్రారంభించిన తన జీవిత వివరాలను రాసి గాంధీజికివ్వమన్నారు. నీ చరిత్రను చూచి గాంధీజీ ఆశ్రమంలో చేర్చుకోరు అన్నారు. శ్రీ కుమారప్ప జరిగిన దానిని దాచకుండా గాంధీజీకి చెప్పడం నావిధి, ఇక వారి ఇష్టం అన్నారు. జోసెఫ్‌ను తీసికొనివెళ్లారు. గాంధీజీ వారు చేసిన తప్పులు తెలుసుకొని సిన్నర్ బికేం సెయింట్ అని, జోసెఫ్ కాదు ప్రభాకర్ అని గాంధీజీ పేరు పెట్టారు. అప్పటి నుండి ప్రభాకర్‌జీ అయ్యాడు. ఆశ్రమంలో గాంధీజీని బాపూజీ అనేవారు. ప్రభాకర్‌జీ ని భాయిజీ అనేవారు. వారిలో ఎంతో మార్పు వచ్చింది. గాంధీజీని ఆకర్షించారు. ఆశ్రమంలో మంచి కార్యకర్తగా తయారు అయ్యాడు. గాంధీజీ తరువాత సేవాగ్రామ్‌లో వివిధ సంస్థలను సమన్వయపరచి కార్యక్రమాలను నిర్వహించాడు. 30 సంవత్సరాలు సేవాగ్రాం ప్రతిష్ఠాన్‌కు కార్యదర్శిగా పనిచేశాడు. గాంధేయ వాదాన్ని పూర్తిగా జీర్ణించుకొని వేష భాషలలోనే కాకుండా ఆచరణలో చూపెట్టిన మహనీయుడు. హంతకుడు అయినా, దొంగ అయినా వచ్చి సహాయం

అడిగితే కాదనేవారు కారు. ఎంతో మందిని రక్షించారు. మంచి వారినిగా మార్చారు. పోషించారు. పెద్దలను చేశారు.

తిట్టినా, కొట్టినా మారుమాట్లాడక చిరునవ్వుతో జవాబు యిచ్చేవారు. మంచి సంధానకర్త. ఎన్నో కుటుంబాల తగాదాలను తీర్చారు. ఎంతో మంది పెద్దలమధ్య అభిప్రాయ భేదాలను తొలగించారు. ఎన్నో సంస్థలను సమన్వయ పరచారు. శాంతి యాత్రలు జరిపి ప్రశాంతవాతావరణాన్ని ఏర్పాటు చేయుటలో తోడ్పడేవారు.

సేవాగ్రామ్‌లో ప్రారంభించిన సేవాకార్యక్రమాలతో హైదరాబాదులో గాంధీ జ్ఞాన మందిరం, విజయవాడలో గాంధీ హిల్, శివరాంపల్లిలో సర్వోదయ ఆశ్రమం, అవనిగడ్డలో గాంధీ క్షేత్రం సేవాశ్రమాలను స్థాపించి, గాంధేయ మార్గాన్ని వ్యాపింపచేశారు.

భూదానోద్యమానికి మూల స్తంభంగా పనిచేశారు. ప్రభాకర్‌జీ అంటే వినోబాజీకి ఎంతో గౌరవం. భారతదేశంలో ప్రభాకర్‌జీ తో పెద్ద నాయకులంతా పరిచయం కలిగి ఉన్నారు. గోవధ నిషేధాన్ని గురించి కేరళలో పాదయాత్ర చేస్తూ అనారోగ్యానికి గురై కోలుకొన్నారు. 1979 మే నెలలో తుఫాను వచ్చి నెల్లూరు, ఒంగోలు జిల్లాలు దెబ్బతిన్నాయని తెలిసికొని మండుటెండలలో ఆ ప్రాంతాలలో తిరిగారు. జూన్ 6వ తేదీన కందుకూరులో ఎండదెబ్బ తిన్నారు. జ్వరం వచ్చింది. బాపట్ల చేరి ప్రకృతి వైద్యం చేయించుకొన్నారు. అకస్మాత్తుగా మెదడువ్యాధి రావడంతో 12వ తేదీన గుంటూరు ఆసుపత్రిలో చేర్చారు. 18వ తేదీన చనిపోయారు. 68 సంవత్సరాల ప్రభాకర్‌జీ కాయవంటి శరీరం కలవారు. ఇంత త్వరలో మృత్యువాత పడతారని ఎవ్వరూ అనుకోలేదు.

నా అనేది వారికి లేదు. బంధువులు లేరు. ఆస్తిలేదు. ఇల్లు లేదు. దేశమేనాది అనుకొన్నారు. సమాజ సేవే నా విధి అనుకొన్నారు. చివరకు బాధితులకు సహాయ కార్యక్రమాలను చేస్తూనే మనల్ని వీడిపోయారు. గాంధీజీ పెట్టిన ప్రభాకర్ పేరును సార్థకం చేశారు. సేవలో సూర్యుడుగా వెలుగొందారు. సమాజ సేవకులకు ఆదర్శాన్ని చూపారు. సేవే దైవంగా భావించిన మన భాయిజీ లేరు. కాలం ఎంతో వేగంగా నడుస్తుంది! వారు లేరు. సేవ, త్యాగం, కూడిన వారి మానవతా వాదం- మనకు మార్గాన్ని నిర్దేశిస్తుంది. ఆచరించడానికి ప్రయత్నిద్దాం.

*(గాంధీక్షేత్రం మాసపత్రిక)*

# 7. ఆంధ్రలో నీటివనరులు "ఆంధ్రభగీరథు" ని కృషి

వరద, మురుగునీటి వల్ల మునిగి తేలే కొల్లేరు ముంపు నివారణ స్కీముల దగ్గర నుంచి నీటిబొట్టయినా దొరకని రాయలసీమ ప్రాంతానికి నీటి వనరుల ఏర్పాటు వరకు ఆంధ్ర రైతాంగానికి కావలసిన పంట నీటి మురుగునీటి సౌకర్యాలను అమలు జరుపడానికి ఆంధ్రరాష్ట్ర అవతరణ నాటి నుండి మూడు సంవత్సరాల పాటు అవిరళ కృషి చేసి, పబ్లిక్ వర్క్సు శాఖను కడు సమర్థనీయంగా నడుపుతూ అనేక స్కీములను అమలు జరుపుతూ, పరిశీలన చేయించుతూ, ఆంధ్ర రైతాంగానికి పెన్నిధిగా శ్రీ నీలం సంజీవరెడ్డి గారు పేరెన్నికగన్నారు. ఆంధ్రదేశానికి "భగీరథుడు" అని అనిపించుకొన్నారు.

కృష్ణా, గోదావరి, వంశధార, నాగావళి, తుంగభద్ర, పెన్న మున్నగు నదులు మన రాష్ట్రంలో ప్రవహిస్తున్నవి. ఈ నదుల నుండి 150 మిలియనుల ఘనపుటడుగుల నీరు ప్రవహిస్తున్నది. ఈ నీటిలో వెనుకటి హైద్రాబాదు రాష్ట్రము, మైసూరు, బొంబాయి రాష్ట్రములు మూడవవంతు నీరు వాడుకొంటున్నవి. 20 మిలియన్ల ఘనపుటడుగులు మాత్రం ఆంధ్రప్రాంతములో వినియోగపడుచున్నది. మిగిలిన 80 మిలియన్ల ఘనపు టడుగుల నీరు వృథాగా సముద్రములో కలియుచున్నది.

1953 అక్టోబర్ 1వ తేదీన ఆంధ్ర రాష్ట్రము ఏర్పడినది. అప్పుడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగనున్న శ్రీ నీలం సంజీవ రెడ్డిగారు కాంగ్రెసు పార్టీ నాయకుడుగా ఎన్నిక అయినారు. అసెంబ్లీలో కాంగ్రెసుకు మెజారిటీ లేకపోయినప్పటికీ తన విజ్ఞత వలన శ్రీ ప్రకాశంగారిని ముఖ్యమంత్రిని చేసి, ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి రాష్ట్రపతి పాలన రాకుండా ఆయన నివారించారు.

ఒకవైపు కరువు కాటకాల వల్ల అల్లాడుతున్న రాయలసీమను, రెండవవైపు వరదలు, మురుగు ముంపు వల్ల నష్టపడుతున్న సర్కారు జిల్లాల పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, వీటిని పరిష్కారము చేయాలనే దృఢసంకల్పముతో శ్రీ సంజీవరెడ్డిగారు పబ్లిక్ వర్క్సు శాఖను స్వయముగా నిర్వహించాలని అభిలషించారు.

సామాన్య రైతు కుటుంబంలో జన్మించినవారగుటచే రైతాంగ కష్ట నష్టములను స్వయముగా చవిచూచిన వారగుటచే ఆంధ్ర రైతాంగానికి కావలసిన సౌకర్యాలను

చేకూర్చాలని దృఢనిశ్చయముతో ఈ మూడు సంవత్సరములు అహోరాత్రములు కృషి జరిపి, అనేక ఇరిగేషన్ స్కీములను అమలు జరిపించారు.

### కృష్ణా బ్యారేజి

ఆంధ్రరాష్ట్ర అవరతణ సంవత్సరములోనే కృష్ణ ఆనకట్ట దెబ్బ తిన్నది- కృష్ణాడెల్టాకు నష్టం సంభవించకుండా శాశ్వత నివారణ స్కీముగా కృష్ణా బ్యారేజీని 264 లక్షల ఖర్చుతో నిర్మించుటకు స్కీమును తయారు చేయించి, కేంద్ర ప్రభుత్వాన్ని శ్రీ సంజీవరెడ్డిగారు ఒప్పించి 13.2.1954వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారితో శంకుస్థాపన చేయించారు. కృష్ణాబ్యారేజి వల్ల కృష్ణా, గుంటూరు జిల్లాలలో అదనంగా లక్ష ఎకరాలు సాగు అవుతుంది. దాదాపు సగం నిర్మాణం పూర్తి అవుతున్నది. 1957 మే నాటికి బ్యారేజి పూర్తి కాగలదు.

### నాగార్జున సాగర్

భారతదేశములో గొప్ప ప్రాజెక్టులలో ఒకటైన నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణం విషయమై కేంద్ర, హైదరాబాద్ ప్రభుత్వాలతో సంప్రదించి, ఒప్పించి ప్రథమ పంచవర్ష ప్రణాళికలో పట్టుదలగా చేర్పించిన ఘనత సంజీవరెడ్డిగారికే దక్కింది. 122 కోట్ల ఖర్చుతో నిర్మించబడుతున్న నాగార్జునసాగర్ ప్రాజెక్టు వల్ల గుంటూరు, కర్నూలు, నెల్లూరు, కృష్ణా, నల్గొండ, వరంగల్ జిల్లాలలో 34 లక్షల ఎకరాలు సాగు కాగలదు. 11-12-1955వ తేదీన భారత ప్రధాని శ్రీ నెహ్రూ నాగార్జునసాగర్‌కు శంకుస్థాపన చేశారు. అప్పుడే కాఫర్ డామ్ పూర్తి అయినది.

### హైలెవెల్ ఛానల్

రాయలసీమలో నీటి వనరులు తక్కువ. తుంగభద్ర హైలెవల్ ఛానల్ రాయలసీమలో ముఖ్యమైన ఇరిగేషన్ స్కీము. ఆంధ్ర-మైసూరు ప్రభుత్వాలకు తుంగభద్ర జలాల విషయమై వచ్చిన తగువు వల్ల ఈ స్కీము ఆలస్యమైనది. శ్రీ సంజీవరెడ్డిగారు దీన్ని ఎలాగునైనా సాధించాలనే పట్టుదలతో కృషి చేశారు. జూన్ 18, 19 తేదీలలో బెంగుళూరులో సంప్రదింపులు జరిపి, తుంగభద్ర జలాల విషయమై తగాదా పరిష్కారము చేశారు. నూటికి 65 వంతులు ఆంధ్రకు, 35 వంతులు మైసూరుకు చెందునట్లు ఒడంబడిక కుదిరింది. దీని వల్ల మొదట్లో అనుకున్న ఆయకట్టు తగ్గకుండా ఉరవకొండ వద్ద పెన్నకు రెగ్యులేటరు నిర్మాణము చేస్తామని శ్రీ సంజీవరెడ్డిగారు చెప్పారు. తుంగభద్ర

హైలెవెలు ఛానలుకు 19 కోట్లు ఖర్చవుతుంది. అనంతపురం, కడప జిల్లాలలో మూడు లక్షల ఎకరాలు సాగు కాగలదు. అక్టోబరు 2వ తేదీన తుంగభద్ర హైలెవెల్ ఛానల్‌కు, అక్టోబరు 6వ తేదీన ఉరవకొండ రెగ్యులేటర్‌కు శంకుస్థాపనలు జరిగినవి.

**వంశధార**

వెనుకబడిన ప్రాంతమయిన శ్రీకాకుళం జిల్లాలో వంశధారకు ప్రాజెక్టు కట్టాలని చాలా కాలంగా ఆందోళన సాగుచున్నది. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి సంబంధించిన ఆంధ్ర-ఒరిస్సా ప్రభుత్వములకు అంగీకారము లేకపోవుటచే దాని నిర్మాణానికి ఆటంకము కల్గినది. జులై 7, 8 తేదీలలో శ్రీ సంజీవరెడ్డి గారు కటక్ వెళ్లి, ఒరిస్సా ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి 12 కోట్ల ఖర్చుతో వంశధార ప్రాజెక్టు నిర్మాణము చేయడానికి ఒడంబడిక కుదిర్చినారు. మూడు లక్షల ఎకరాలు శ్రీకాకుళం జిల్లాలో ఈ ప్రాజెక్టు వల్ల సాగు కాగలదు.

1956 ఆగస్టు మొదటివారములో శ్రీ సంజీవరెడ్డిగారు న్యూఢిల్లీ వెళ్ళి, ప్లానింగ్ కమీషన్‌తోను, కేంద్ర ప్రభుత్వంతోను చర్చించి తుంగభద్ర హైలెవెల్ ఛానల్ వంశధార ప్రాజెక్టులను ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్పించారు. నవంబరులో వంశధార ప్రాజెక్టు శంకుస్థాపన చేయవలసిందిగా భారత ప్రధాని శ్రీ నెహ్రూను ఆహ్వానించారు. ఈ ప్రాజెక్టుల నిర్మాణానికి కృషి చేయుటకుగాక, యీ దిగువ ప్రాజెక్టులకు ప్రాథమిక పరిశీలనలు పూర్తి చేయించారు.

**పరిశీలనలోనున్న ప్రాజెక్టులు**

నెల్లూరు జిల్లాలో పెన్నకు సోమశిల వద్ద 24 కోట్ల ఖర్చుతో డాము కట్టితే ఎనిమిది లక్షల ఎకరాలు సాగు అవుతుంది. గుంటూరు జిల్లాలో పులిచింతల వద్ద 32 కోట్ల ఖర్చుతో ప్రాజెక్టు కట్టితే 4 లక్షల ఎకరాలలో మొదటి పంట, ఒకటిన్నర లక్ష ఎకరాలలో రెండవపంట పండుతుంది. కర్నూలు జిల్లాలో కృష్ణానదికి సిద్ధేశ్వరము వద్ద ప్రాజెక్టు కట్టితే 4 లక్షల ఎకరాలలో మొదటి పంట, 3 లక్షల ఎకరాలలో రెండవ పంట పండుతుంది.

గోదావరి మీద 105 కోట్ల ఖర్చుతో రిజర్వాయరు కట్టితే 12 లక్షల ఎకరాలలో మొదటి పంట, 30 లక్షల ఎకరాలలో రెండవపంట పండుతుంది. 18.9.1956వ తేదీన కర్నూలులో శ్రీ సంజీవరెడ్డి గారు మాట్లాడుతూ, గోదావరి నీటిని కృష్ణలోనికి, కృష్ణనీటిని

పెన్నలోనికి కలిపే బహుళార్థసాధకమైన పెద్ద ప్రాజెక్టును నిర్మించాలని అన్నారు. దాని వలన రాయలసీమలో ఏడు, ఎనిమిది లక్షల ఎకరాలు సాగు అవడమే కాక, మద్రాసు రాష్ట్రానికి కూడ అదనపు నీరు సప్లయి చేయవచ్చు. ఈ ప్రాజెక్టు నిర్మాణంలో మద్రాసు కూడా సహాయపడవచ్చును. ఈ ప్రాజెక్టు నిర్మాణము జరిగితే గోదావరి జలాలను పూర్తిగా సద్వినియోగపరచవచ్చును. ఇటీవల మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్‌నాడార్ ప్రసంగిస్తూ, ఆంధ్ర దేశానికి సరిపోగా మిగిలిన నదీజలాలను మద్రాసు రాష్ట్రానికి తరలించుకోవాలనే ఆసక్తిని కనబరిచారు.

**అమలు జరుగుతున్న చిన్న ప్రాజెక్టులు**

అనేక చిన్న ప్రాజెక్టులను గత మూడు సంవత్సరాలలో శ్రీ సంజీవరెడ్డిగారు అమలు జరిపించారు. నెల్లూరు జిల్లా మన్నేరు నదిపై 50 లక్షల ఖర్చుతో రాళ్ళవాగు ప్రాజెక్టు, అనంతపురం జిల్లాలో పెన్ననదిపై 90 లక్షల ఖర్చుతో ఎగువ పెన్నార్ ప్రాజెక్టు వేదావతి నదిపై 102 లక్షల ఖర్చుతో బైరవానితిప్ప ప్రాజెక్టు, చిత్తూరు జిల్లాలో కాళహస్తి వద్ద స్వర్ణముఖి ఆనకట్ట నిర్మాణంలో వున్నవి.

మధ్యతరగతి నీటి వనరుల స్కీములకు 5 కోట్ల రూపాయలు శ్రీ సంజీవరెడ్డిగారు కేటాయింపచేశారు. అవి 17 స్కీములు. 1. కడప-కర్నూలు కాలువ మరమ్మతు - శ్రీకాకుళం జిల్లాలో 2. నాగావళి కుడివైపు కాల్వ 3. నారాయణపురం ఆనకట్ట, 4. వేదావతి ఆనకట్ట, 5. సీతానగరం ఆనకట్ట, 6. విశాఖ జిల్లాలో గంభీరగెడ్డ రిజర్వాయరు 7. పశ్చిమ గోదావరి జిల్లాలో బండకట్టు కాల్వ, 8. నెల్లూరు జిల్లాలో నక్కలగండి రిజర్వాయరు 9. పాలేరు రిజర్వాయరు 10. చిత్తూరు జిల్లాలో ఉప్పుటేరు దిగువ ఆనకట్ట 11. కాళింది రిజర్వాయరు 12. మల్లిమడుగు రిజర్వాయరు. కడప జిల్లాలో 14. దిగువసగిలేరు ప్రాజెక్టు 15. పంచనాడి రిజర్వాయరు. అనంతపురము జిల్లాలో 16. విద్యానారాయణ స్వామి రిజర్వాయరు 17. చెన్నరాయస్వామి రిజర్వాయరు. వీటి వలన షుమారు లక్ష ఎకరాలు సాగు కాగలదు. ఈ స్కీము లన్నిటి నిర్మాణము పూర్తి కావస్తున్నది.

**పరిశీలనలోనున్న స్కీములు**

ఈ స్కీములుగాక అన్ని జిల్లాలలో 29 ఇరిగేషన్ స్కీములు అమలు పెట్టాలని పరిశీలిస్తున్నారు. శ్రీకాకుళము జిల్లాలో మామిడిపల్లి ఆనకట్ట, పైడిగం ప్రాజెక్టు, గొట్టిపల్లిగెడ్డ రిజర్వాయరు, వట్టిగడ్డ రిజర్వాయరు, జంగావీరి రిజర్వాయరు. బాహుదా ఆనకట్ట, విశాఖజిల్లాలో గాదిగూమి రిజర్వాయరు, గోస్తానీ రిజర్వాయరు శారదా

రిజర్వాయరు, తాండవ రిజర్వాయరు, వరహా రిజర్వాయరు, తూర్పుగోదావరి జిల్లాలో తొర్రిగడ్డ పంపింగుస్కీము, పంపా రిజర్వాయరు, ఏలేరు రిజర్వాయరు, తిమ్మరాజు రిజర్వాయరు, తాతపూడి పంపింగు స్కీము, గుంటూరు జిల్లాలో పెదనందిపాడు స్కీము, కర్నూలు జిల్లాలో జుర్రేరు ఆనకట్ట, గాజుల దిన్నె ప్రాజెక్టు, సాగిలేరు ఆనకట్ట. వరదరాజ ప్రాజెక్టు. అనంతపురము జిల్లాలో బోరిగల్లు ప్రాజెక్టు, ధర్మవరము ప్రాజెక్టు, బుక్కపట్నము ప్రాజెక్టు, కడప జిల్లాలో చియ్యరు ప్రాజెక్టు, చిత్తూరు జిల్లాలో నిమానపల్లి రిజర్వాయరు, కల్యాణి రిజర్వాయరు పరిశీలనలు పూర్తి అగుచున్నవి. వీటి వలన మూడు లక్షల ఎకరాలు సాగు కాలగలదు. ఇవి గాక అన్ని జిల్లాలలో 123 మైనర్ ఇరిగేషన్ స్కీములు పరిశీలన చేసి అమలుకు సిద్ధముగా నున్నవి.

### ఏజెన్సీ అభివృద్ధి స్కీములు

ఏజెన్సీ ప్రాంతాలన్నిటిని అభివృద్ధి చేయుటకు 18 ఇరిగేషన్ స్కీములు తయారు చేసినారు. శ్రీకాకుళము జిల్లాలో పొడికొండగెడ్డ, కరింగెడ్డ, వనజరాజగెడ్డ, గోముఖీనది, విశాఖజిల్లాలో తాజంగిగెడ్డ, చిన్నెగెడ్డ. తూర్పుగోదావరి జిల్లాలో ఊట్ల కాల్వ, పుల్లంగివాగు ఆనకట్టలు కట్టాలని పరిశీలన జరుపుతున్నారు. ఈ స్కీములు అమలు జరిగిన ఏజెన్సీ ప్రాంతమునకు మేలు చేకూరగలదు.

### వరద నివారణ స్కీములు

కృష్ణ, గోదావరి జిల్లాలలో వరద, మురుగు నీటివలన ప్రతి సంవత్సరము విపరీతమైన నష్టము కలుగుచున్నది. ఉత్తరదేశములో 1954లో వచ్చిన వరదల వలన కల్గిన విపరీతమైన నష్టాన్ని దృష్టిలో పెట్టుకొని, వరదలను అదుపులో పెట్టుటకు కేంద్ర ప్రభుత్వము వదరల నివారణ బోర్డును ఏర్పాటు చేసి, ప్రత్యేక నిధిని కేటాయించింది. ఆంధ్రదేశములో ఏటా వరదల వలన కలుగుచున్న కష్టనష్టాలను దృష్టి నిడుకొని శ్రీ సంజీవరెడ్డిగారు 12 వరద నిరోధక స్కీములను కేంద్ర ప్రభుత్వానికి పంపించారు. బుడమేరు డైవర్షన్ రిజర్వాయరు, కర్రకట్టలు, తమ్మిలేరు రిజర్వాయరు, యర్రకాల్వ, బైనేర్ రిజర్వాయర్లు, ఉప్పుటేరు వెడల్పు చేయు స్కీము, దివిసీమ సముద్రకట్ట, గోదావరి వరద నిరోధక స్కీములు, తూర్పు తుంగభద్ర మురుగు కాల్వ స్కీము మొదలగునవి వాటిలో కలవు.

ఈ స్కీములలో కొల్లేరు ముంపు నివారణకు అయిదు కోట్లు అవుతుంది. 11.4.1956వ తేదీన కొల్లేరు స్కీములలో ఒక భాగమైన బుడమేరు డైవర్షన్ స్కీముకు

శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు గారు శంకుస్థాపన చేశారు. ఈ స్కీముకు 36 లక్షలు ఖర్చు అవుతుంది. 11.9.1956వ తేదీన కైకలూరులో కొల్లేటి ముంపు నివారణ పథకాల పరిశీలనకు కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాల శాసనసభ్యులను సమావేశపరచి శ్రీ సంజీవరెడ్డిగారు చర్చించారు. 11, 12 తేదీలలో ఉప్పుటేరు. కొల్లేరు స్కీములను స్వయముగా శ్రీ సంజీవరెడ్డిగారు పరిశీలించారు. ద్వితీయ ప్రణాళికలో వరద నిరోధక స్కీములకు మూడున్నర కోట్లు మాత్రమే కేటాయించారు. ఏ విధంగానైనా కొల్లేరు ముంపు నివారణ స్కీములను అమలు జరపాలని శ్రీ సంజీవరెడ్డిగారు కృషి చేస్తున్నారు.

ఆంధ్ర రైతాంగానికి కావలసిన పంట నీటి స్కీములను, మురుగు, వరద నిరోధక స్కీములను పరిశీలింపజేసి అమలు పరుస్తున్న శ్రీ సంజీవరెడ్డిగారి కృషిని ఆంధ్ర రైతాంగం ఎన్నటికి మరువలేదు. శ్రీ సంజీవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్‌కు నాయకత్వం వహించి, మిగిలిన ఇరిగేషన్ స్కీములన్నీ అమలు జరిపించాలని ఆంధ్ర రైతాంగము ఆశిస్తున్నది.

*(గోలకొండ పత్రిక, 1.11.1956)*

# 8. ఆంధ్రప్రదేశ తొలి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి

ఆంధ్రుల సంస్కృతి సముద్ధరణకు ఆంధ్రజాతి పురోభివృద్ధికి ప్రత్యేక రాష్ట్రము కావాలనే వాంఛ 1913మే నెలలో బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభలో మొగ్గ తొడిగి 1953 అక్టోబరు 1వ తేదీన ఆంధ్ర రాష్ట్రముగా పుష్పించి, 1956 నవంబరు 1వ తేదీన సువిశాల ఆంధ్రదేశము ఆంధ్రప్రదేశ్‌గా అవతరించి ముక్కోటి ఆంధ్రుల చిరకాల వాంఛ పండుగగా ఈడేరటం చరిత్రాత్మకమైన విశేషము. ఇది ఆంధ్రులకు మహదానంద సమయం.

సువిశాలమైన ఆంధ్రప్రదేశ్‌కు తొలి ముఖ్య మంత్రిగా శ్రీ నీలం సంజీవరెడ్డి గారు ఎన్నిక కావటం మరొక విశేషం. సామాన్య రైతు కుటుంబంలో జన్మించి, సామాన్య ప్రజా శ్రేయస్సు సాధనే తన లక్ష్యముగా, సోషలిస్టు సమాజ వ్యవస్థాపనకు కృషి చేస్తున్న శ్రీ నీలం సంజీవరెడ్డి గారు ఎన్నిక కావటం బీద ప్రజానీకపు అదృష్టం. కార్యదక్షతలో నేమి, రాజకీయ నీతిజ్ఞతలో నేమి, క్లిష్టాతి క్లిష్ట సమస్యలను పరిష్కరించుటలో వర్తమానాంధ్ర నాయకులలో శ్రీ సంజీవరెడ్డిగారు మేటి, సమర్థమైన ప్రజ్ఞా ప్రాభవములుకల నాయకుడు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కావటం ఆంధ్రుల మహద్భాగ్యం.

ఆంధ్రోద్యమ జననంతోపాటు అనంతపురం జిల్లా ఇల్లూరు గ్రామమందు 1913 మే 19 వ తేదీన సామాన్య రైతు కుటుంబంలో శ్రీ సంజీవరెడ్డి గారు జనన మొందినారు. ఇల్లూరు వీధిబడిలో, మద్రాసు నేషనల్ థియాసాఫికల్ స్కూలులో అనంతపురం ఆర్ట్సు కాలేజీలో విద్య నభ్యసించారు. ఆటల పందెములలో సాహసోపేతమైన కార్యక్రమాలలో పాల్గొని విద్యార్థి దశలోనే "సాహసుడు సంజీవరెడ్డి" అని అనిపించుకొన్నారు.

లోకోత్తర మహత్తర సత్యాగ్రహ పద్ధతిని భారత స్వాతంత్ర్య సాధనకు భారత ప్రజలకు గాంధీజీ పిలుపు నిచ్చారు. స్వతంత్ర భావాలు, సామాన్య ప్రజల శ్రేయస్సాధన దృష్టిలో ఉన్న శ్రీ సంజీవరెడ్డిగారికి గాంధీజీ పిలుపు నూతన ఉత్సాహాన్ని, నవ సందేశాన్ని యిచ్చింది. కాలేజీ వదలి జాతీయోద్యమంలో ప్రవేశించారు. జిల్లా యూత్ లీగ్ అధ్యక్షులుగా వుండి యువకులను సంఘటిత పరచారు.

వారి ఉత్సాహము, కార్యదీక్ష కాంగ్రెసు పెద్దలను ఆకర్షించినాయి. పాతిక సంవత్సరాలైనా వయస్సు నిండక మునుపే 1938లో శ్రీ సంజీవరెడ్డిగారు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా ఎన్నుకోబడినారంటే అది కాంగ్రెసుకు వారు చేసిన నిర్విరామ కృషి ఫలితమే. అప్పటినుండి 1946 వరకు రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేసి, కాంగ్రెసు సంస్థను తీర్చిదిద్దినారు. 1940లో సత్యాగ్రహము చేసి జైలుకు వెళ్ళారు. తిరుచునాపల్లి జైలులో 1942 వరకు ఉన్నారు. 1942లో చరిత్రాత్మకమైన ఆగస్టు తీర్మానము చేసి బొంబాయి నుండి వస్తుండగా రైలులోనే శ్రీ సంజీవరెడ్డిగారిని అరెస్టుచేసి డిటెన్యూగా తీసికొని వెళ్లి 1945 జనవరిలో విడుదల చేశారు. వెంటనే ఆంధ్ర కాంగ్రెసు కమిటీకి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడి ఆంధ్ర దేశమంతగా తిరిగి కాంగ్రెసు సంఘాలను పునరుద్ధరణ చేశారు.

1946లో అనంతపురం నియోజక వర్గము నుండి మద్రాసు శాసన సభకు అఖండ విజయంతో ఎన్నుకోబడి మద్రాసు శాసనసభా కాంగ్రెస్ పార్టీ కార్యదర్శిగా పనిచేశారు. 13.6.1948 వ తేదీన చీరాలలో జరిగిన ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి శ్రీ రంగాగారితో పోటీ చేశారు. కొద్ది ఓట్ల తేడాతో ఓడిపోయినప్పటికి శ్రీ రంగాగారితో సహకరించి కాంగ్రెసు సంస్థను బలపర్చటానికి తోడ్పడగలనని హామీ యిచ్చారు. సంజీవరెడ్డిగారి సహకార ధోరణి కాంగ్రెసు కార్యకర్తలకు ఉత్సాహాన్ని యిచ్చింది. భారత రాజ్యాంగ సభ్యుడుగా ఎన్నుకోబడి రాజ్యాంగ రచనలో తోడ్పడినారు.

1949లో శ్రీ కుమారస్వామి గారి మంత్రివర్గంలో మద్యనిషేధ మంత్రిగా వుండి సామాన్య ప్రజల శ్రేయస్సుకు ఉపయోగపడే మద్యనిషేధ చట్టాన్ని కట్టుదిట్టంగా అమలు జరిపి పరిపాలనా దక్షుడనిపించుకొన్నారు.

కాంగ్రెసు సంస్థకు తన జీవితాన్ని అంకితం చేసిన శ్రీ సంజీవరెడ్డి గారు మంత్రిపదవికి రాజీనామా చేసి 11.4.1951వ తేదీన జరిగిన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలో శ్రీ రంగాగారితో పోటీచేసి ఎన్నుకోబడినారు. అధ్యక్ష పదవి స్వీకరించిన వెంటనే శ్రీ రంగాగారి సహకారాన్ని అభ్యర్థించారు. ప్రజాస్వామిక యుగంలో ఎన్నికలు జరగటం, పోటీ చేసుకోవటం సహజం. అభిప్రాయ భేదాలుండవచ్చు. పోటీలు చేసుకోవచ్చు. కాని ఎన్నికలు అయిన వెంటనే అందరూ కలిసి మెలసి పనిచేసుకోవటం ఉత్తమమైన ప్రజాస్వామిక సూత్రం. రంగా వర్గానికి కార్యవర్గంలో సగం స్థానాలు యిస్తామని శ్రీ సంజీవరెడ్డిగారు ప్రకటించి సహకారాన్ని కోరారు. ఉత్తమమైన ఈ

సూచనకు శ్రీ నెహ్రూ హర్షామోదాలను తెలిపారు. ప్రజలు సంతోషించారు. అయినా శ్రీ రంగాగారు కాంగ్రెసు నుంచి విడిపోయారు.

అఖిల భారత కాంగ్రెసు వ్యవహారములలో శ్రీ నెహ్రూ, శ్రీ టాండన్ గార్లకు వచ్చిన అభిప్రాయ భేదాలు భారతదేశ భవిష్యత్తుకు ఒక క్లిష్ట సమస్యగా పరిణమించినవి. అప్పుడు శ్రీ నెహ్రూ తన నాయకత్వానికి ఒక సవాలును ఎదుర్కొనవలసి వచ్చినది. భారత దేశానికి శ్రీ నెహ్రూ నాయకత్వమే శరణ్యమని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా, ప్రప్రథమముగా ప్రకటించి, భారత దేశములో ఆదర్శప్రాయులైనారు శ్రీ సంజీవరెడ్డి గారు.

అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గ సభ్యులుగా, పార్లమెంటరీ బోర్డు సభ్యులుగా చాలాకాలం పనిచేశారు.

1952 ఎన్నికలలో కాంగ్రెసులో వచ్చిన విభేదాల మూలంగా కాంగ్రెసు ఓడిపోయింది. 27.2.52 తేదీన చిత్తూరులో జరిగిన ప్రదేశ్ కాంగ్రెసు సర్వసభ్య సమావేశములో శ్రీ నీలం సంజీవరెడ్డి గారు రాజీనామా చేసి కాంగ్రెసు నుండి చీలిపోయిన వారందర్నీ తిరిగి కాంగ్రెసులో చేరవలసిందిగా ఆహ్వానించారు. కాంగ్రెసు నుంచి శ్రీ ప్రకాశం శ్రీ రంగాగార్లు చీలిపోయిన మరుక్షణం నుంచి వారిరువురిని మరల కాంగ్రెసులో కలుపుటకు శ్రీ సంజీవరెడ్డిగారు తీవ్రకృషి చేస్తూనే వచ్చారు. 4.5.1952 వ తేదీన ఏకగ్రీవంగా శ్రీ సంజీవరెడ్డిగారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. 26.12.1952వ తేదీన మరల ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడి 26.12.1953 వరకు పనిచేశారు. 1953 సెప్టెంబరులో కాళహస్తి నియోజక వర్గము నుండి అఖండ విజయంతో శాసన సభకు ఎన్నుకోబడినారు.

1953 అక్టోబరు1వ తేదీన ఆంధ్ర రాష్ట్రం అవతరించింది, నవ్యాంధ్ర రాష్ట్రాన్ని నడిపించే బాధ్యత నీలం సంజీవరెడ్డిగారిపై బడింది. ఆంధ్ర శాసనసభా కాంగ్రెసు పార్టీ నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడినారు. 141 మంది శాసన సభ్యులుగల ఆంధ్ర అసెంబ్లీలో 41 మంది మాత్రమే కాంగ్రెసు పార్టి వారు. ప్రప్రథమ భాషా రాష్ట్రంగా ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రంలో గవర్నరు పరిపాలనను విధించబడింది. ప్రజాస్వామిక పాలనను ఏర్పాటుచేసే బాధ్యత ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు కాంగ్రెసు పార్టి నాయకులు అయిన శ్రీ సంజీవరెడ్డిగారిపై పడింది. ఆంధ్ర కేసరి శ్రీ ప్రకాశం పంతులుగార్ని ముఖ్యమంత్రిగా వుండవలసిందిగా ఆహ్వానించి తన రాజకీయ నీతిజ్ఞతను చూపారు. ఉప ముఖ్యమంత్రిగా శ్రీ సంజీవరెడ్డిగారు ఉండి అనేక క్లిష్ట సమస్యలను పరిష్కరించి తన కార్యదక్షతను,

రాజకీయ విజ్ఞతను చూపారు. మద్యనిషేధ సమస్యపై 6.11.1954వ తేదీన ఒక వోటు తేడాతో ప్రభుత్వం ఓడిపోయింది. వెంటనే ప్రభుత్వానికి రాజీనామా చేసి ఎన్నికలకు సిద్ధమయ్యారు. లోక్ పార్టీ ప్రజాపార్టీలను కలుపుకొని కాంగ్రెసు ఎన్నికలలో అభ్యర్థులను పెట్టి అఖండ విజయం పొందింది. శ్రీ సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి కాగలరని తలంచబడింది. భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షుని సలహాను పాటించి, పార్టీ నాయకుడుగా శ్రీ గోపాలరెడ్డిని ప్రతిపాదించి తన విజ్ఞతను శ్రీ సంజీవరెడ్డిగారు మరొకసారి ప్రపంచానికి చూపారు. మరల ఉపముఖ్యమంత్రి పదవి స్వీకరించి తన కార్యక్రమానికి ఉపక్రమించారు. 37 నెలలపాటు ఉప ముఖ్యమంత్రిగా ఆంధ్రరాష్ట్ర సర్వతోముఖ పురోభివృద్ధికి అవిరళ కృషి చేసి ఆంధ్ర ప్రజల అభిమాన నాయకులైనారు. కృష్ణా బ్యారేజి, నందికొండ, తుంగభద్ర ఎగువకాల్వ, వంశధార మొదలగు పెద్ద ప్రాజెక్టులు 141 ఇరిగేషన్ స్కీములు అనేక వరద నిరోధక స్కీములు అమలు జరుపటానికి ప్రయత్నించి, శ్రీ సంజీవరెడ్డిగారు సాధించారు. ఆంధ్ర రైతాంగానికి సంజీవిని లాగా పేరొందారు. విశాలాంధ్ర వెంటనే ఏర్పడాలని శ్రీ సంజీవరెడ్డిగారు తీవ్ర కృషి చేశారు. ఆంధ్ర, తెలంగాణాలలో అబాల గోపాలము కాంగ్రెసు సంఘాలు శ్రీ సంజీవ రెడ్డిగారు ముఖ్యమంత్రి కావాలని కోరారు. 21.10.56వ తేదీన కర్నూలులో జరిగిన ఆంధ్ర, తెలంగాణా లెజిస్లేచర్ కాంగ్రెసు పార్టీల సంయుక్త సమావేశములో నాయకుడుగా శ్రీ సంజీవరెడ్డి గారు ఎన్నుకోబడినారు. 1.11.1956వ తేదీనుండి ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి. తెలుగు ప్రజలకు ఆశాజ్యోతి శ్రీ సంజీవరెడ్డి.

*(ఆంధ్రజనత, 1.11.1956, గురువారం)*

# 9. నైతిక విలువలకు పట్టంగట్టిన శ్రీ నీలం సంజీవరెడ్డి

'బస్సుల జాతీయంపై సుప్రీంకోర్టు వ్యాఖ్య-ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి రాజీనామా' వార్త చూచి దిగ్భ్రాంతిచెందాను. హైదరాబాదులో శ్రీ సంజీవరెడ్డి గారిని కలుసుకోవడానికి అవనిగడ్డ నుండి బస్సులో బయలుదేరి విజయవాడ బస్టాండ్‌లో దిగాను. ఒక మిత్రుడు గబగబా వచ్చి సంజీవరెడ్డి గారు రాజీనామాచేశారని చేతిలో ఆంధ్రపత్రిక సాయంకాలం ఎడిషన్ చేతికిచ్చారు. నిలబడలేకపోయాను. కూర్చొన్నాను. నమ్మలేపోయినాను. మూడునాల్గుసార్లు చదివినదే చదివాను. 1963 జూన్ 10వ తేదీన కర్నూలు జిల్లాలో బస్సు రవాణా జాతీయాకరణ విషయమై సుప్రీం కోర్టు తీర్పునిస్తూ 'ఉద్దేశ్యపూర్వకంగా' జాతీయాకరణ చేపట్టారనే వ్యాఖ్య - ప్రజల సౌకర్యం కొరకు, కార్మికుల క్షేమం కొరకు చేపట్టిన బస్సుల జాతీయాకరణను గురించి ఇటువంటి వ్యక్తిగత వ్యాఖ్యలు రావటం సంజీవరెడ్డి గారికి బాధ కలిగించింది. తీర్పు వివరాలు తెప్పించలేదు, ఎవ్వరితోనూ ఆలోచించలేదు, సహచరులతో సమాలోచనలు చేయలేదు. దేశంలోని అత్యున్నత న్యాయస్థానం వ్యాఖ్యకు విలువనివ్వాలని, రాజకీయాలలో నైతికవిలువలకు స్థానం ఇవ్వాలని తనకుతానే ఆలోచించుకొనే వ్యవధి ఇవ్వకుండా ముఖ్యమంత్రి పదవికి రాజీనామాచేసి, రాజీనామాను కాంగ్రెసు అధ్యక్షులకు, ప్రధానమంత్రికి పంపారు. సన్నిహితులంతా తొందరపడ్డారని బాధపడ్డారు. పార్టీ అంతా ఆవేదనకు లోనయింది. దేశమంతా సంభ్రమాశ్చర్యాలతో ఈ వార్తను విన్నది. నైతిక విలువలకు నిలబడిన 'నీలం'అని అంతా ప్రశంసించారు.

ఆనాటికి-ఈనాటికి ఎంత తేడా? అప్పటి రాజకీయనాయకులకు, ఇప్పటి రాజకీయనాయకులకు ఎంత భేదం? ఒకసారికాదు నాల్గుసార్లు, హైకోర్టే కాకుండా సుప్రీంకోర్టు కూడా వ్యాఖ్యలు చేసినా పట్టించుకొనేవారు ఏరి? వాటికి విలువనిచ్చేవారు ఏరి? పదవికున్న ప్రాధాన్యం నైతిక విలువలకు లేదు. నైతికవిలువలంటే ఎవరికి తెలుసు? గాంధీజీ నైతికశక్తులతోనే స్వాతంత్ర్యాన్ని సాధించారు. ఆ స్వాతంత్ర్య పోరాటాలలో పాల్గొన్నవారికి ఆ విలువలు తెలుసు. స్వాతంత్ర్యపోరాటాలంటే తెలియనివారికి ఆ విలువలు అంటే తెలుసుకోవలసిన అవసరమేమిటి? పరిపాలన

ఏదో చేస్తున్నాం. న్యాయస్థానాలు ఏవో చెపుతున్నాయి. మనదారిని మనం నడుస్తున్నాం అనేధోరణి ఈ దేశాన్ని అధోగతిపాలుచేస్తుంది. హెగ్డే వంటి అనుభవజ్ఞుడు కోర్టుతీర్పుకు తలవంచి రాజీనామా చేసి రాజకీయవేత్తలకు లొంగి ఉపసంహరించుకొన్నారు. ఇంకెవ్వరు ముందుకు వస్తారు?

'నీతినియమాలు లేని రాజకీయాలు'మహాపాపమని గాంధీజీ అన్నారు. నైతికవిలువలను పోషించిన గాంధీజీ ఈనాడు లేరు. వారు చెప్పిన మాటలు మరచిపోయాం. పుస్తకాలలో భద్రంగా ముద్రించివున్నాయి. పుస్తకాలు బీరువాలలో నిద్రబోతున్నాయి. చదివే ఓపిక లేదెవ్వరికి. ఆచరించే ఆలోచనకు అవకాశాలు లేవు. పదవులు మనుషులను నడిపిస్తున్నాయి. పదవులకు బానిసలైనారు. ఎటు నడుస్తున్నామో, ఎచటకు పోతున్నామో అంతా అగమ్యగోచరంగా వుంది.

ఆలోచించేది చెప్పు, చెప్పేది చేయి అన్నారు గాంధీజీ, మనో వాక్కాయ కర్మణ సమన్వయ లోపమే నేటి ఈ దుఃస్థితికి కారణం. సంజీవరెడ్డిగారిని చూసి నేటి రాజకీయవేత్తలు నేర్చుకోవాల్సినవి చాలా వున్నాయి. రాజకీయాలలో నైతిక విలువలకు ప్రాధాన్యం ఇవ్వడం, నిర్మొహమాటంగా మాట్లాడటం,పెద్దలకు గౌరవంతోపాటు యువకులకు ప్రోత్సాహం ఇవ్వడం,న్యాయబద్ధమైన పరిపాలన, ప్రగతి సాధనకు అభివృద్ధి కార్యక్రమాల అమలుకు కృషిచేయటం ప్రధానమైనవి. శ్రీ సంజీవరెడ్డి నిర్మొహమాటంగా మాట్లాడేవారు. వినేవారికి కొంచెం కటువుగా వున్నా వారిమాటలు చేదుమందుటాంటివి. జబ్బు తగ్గాలంటే మందు చేదుగానే ఉంటుంది. వారి దగ్గరకు వెళ్ళాలంటే ఎవరికైనా భయంగా ఉండేది. ఆఫీసర్లయితే మరింత భయపడేవారు. అందుచేతనే పరిపాలనలో లోటుపాట్లు తక్కువగా వుండేవి. న్యాయబద్ధంగా పరిపాలన వుండేది.రాష్ట్రంలోని సహజవనరులను అభివృద్ధి పరచి, రాష్ట్రసంపద పెంచాలని అవిరళ కృషిచేశారు. అనేక ప్రాజెక్టులు, పరిశ్రమలు ఏర్పడటానికి కారకులైనారు. ఆంధ్రప్రదేశ్‌కు మొదటి ముఖ్యమంత్రిగావుండి రాష్ట్రానికి పటిష్ఠమైన పునాదులను వేశారు. ఎటువంటివారు పాలించినా ఈనాటికీ సాఫీగా నడస్తోంది.

## రాష్ట్ర కాంగ్రెసు సారథ్యం

1951 ఏప్రిల్ 11వ తేదీన ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక విజయవాడ ఆంధ్రరత్న భవనంలో జరుగుతుండటం వల్ల పట్టణమంతా కోలాహలంగా వుంది.

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య తూర్పు కృష్ణాజిల్లాలో మాకు నాయకులుగా వుండేవారు. వారితో పాటు ప్రదేశ్‌కాంగ్రెసు సభ్యునిగా వున్నాను. డా॥ పట్టాభి రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షులుగా వున్నప్పుడు గొట్టిపాటి బ్రహ్మయ్య రాష్ట్ర కాంగ్రెసు ప్రధానకార్యదర్శిగా, శ్రీ నీలం సంజీవరెడ్డి సహాయకార్యదర్శిగా వున్నారు. రైతునాయకుడు రంగాగారంటే అభిమానమున్నా ఈ ఎన్నికలలో సంజీవరెడ్డి గారిని బలపరచారు. వారితో పాటు నేను కూడా సంజీవరెడ్డి గారిని బలపరచాను. అయిదారువోట్లతో గెలిచారు. అప్పటి నుండి సంజీవరెడ్డి గారితో నాకు పరిచయం. నిర్మొహమాటంగా మాట్లాడటంలో సంజీవరెడ్డి మేటి. వారి దగ్గరకు వెళ్లి మాట్లాడటమంటే భయపడేవారం. జిల్లా యువజన కాంగ్రెసు అధ్యక్షులుగా బందరులో యువజన కాంగ్రెసు శిక్షణ శిబిరం ఏర్పాటుచేశాను. సంజీవరెడ్డిగారు వచ్చి శిబిరంలో పాల్గొని ఎంతో ఉత్సాహాన్ని ఇచ్చారు. యువకులకు ప్రోత్సాహం ఇవ్వడం,పెద్దలను గౌరవించటంలో నీలం సంజీవరెడ్డిగారికి మించినవారెవ్వరూ లేరు.

**యువకులకు ప్రోత్సాహం**

1957లో పార్లమెంటు ఎన్నికలలో బందరు పార్లమెంటు సీటుకు కాంగ్రెసు అభ్యర్థిగా నాపేరునే పేపర్లో చూసే వరకు నాకు తెలయదు. బ్రహ్మాండమైన పోటీ, పేరొందిన ప్లీడరు యలమంచిలి నాగభూషణం అన్ని పార్టీలు బలపరుస్తున్నాయి. కాంగ్రెసులో వున్న ధనాఢ్యులు వారికి సహకరిస్తున్నారు. 29 సంవత్సరాల యువకుణ్ణి. పద్మవ్యూహంలో చిక్కుకొన్నట్లుంది. సంజీవరెడ్డిగారి ఆశీర్వచనంవలన సామాన్య ప్రజల సహకారంతో గెలిచి బయటపడ్డాను. నా వంటి ఎంతో మంది యువకులను సంజీవరెడ్డిగారు ప్రోత్సాహించారు. కార్యకర్తలను నాయకులుగా రూపొందించారు.

ఖమ్మం జిల్లాపరిషత్తు భవనాల ప్రారంభోత్సవం తరువాత వరంగల్ కాంగ్రెసు కార్యకార్తల సభలో సంజీవరెడ్డి గారు మాట్లాడుతూ ఏనాటికైనా ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యమంత్రి కాదగినవారు వెంగళరావు అని బహిరంగ సభలో ప్రకటించారు. వారి ఆశీస్సులు నిజమయ్యాయి. వెంగళరావు ముఖ్యమంత్రి అయి సమర్థవంతంగా ఆంధ్రప్రదేశ్‌ను పరిపాలించారు. అంత దూరదృష్టి కలిగి ప్రోత్సాహం ఇచ్చే సంజీవరెడ్డి వంటి పెద్దలు రాజకీయాలలో బహు అరుదు. ఇప్పుడు అసలు లేరు. ఒకప్రక్క యువకులను ప్రోత్సహించటం, రెండవవైపు పెద్దలను గౌరవించటం సంజీవరెడ్డి గారి ప్రత్యేకత.

## పెద్దలకు పదవులు

స్వాతంత్ర్య సమరయోధులు ఆంధ్రకేసరి ప్రకాశం గారిని ఆహ్వానించి ఆంధ్రరాష్ట్రానికి ప్రథమ ముఖ్యమంత్రిగా చేశారు. పెద్దలందరి సహకారంతో ఆంధ్రప్రదేశ్ అవతరణకు కృషిచేసి ప్రథమ ముఖ్య మంత్రి అయ్యారు. విశాలాంధ్రోద్యమనాయకులు అయ్యదేవర కాళేశ్వరరావును ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకరుగా, ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావుగారిని ఆంధ్రప్రదేశ్ శాసన మండలి అధ్యక్షులుగా, శ్రీ కొండా వెంకటరెడ్డి గారిని ఉప ముఖ్యమంత్రిగా,రైతుపెద్ద గొట్టిపాటి బ్రహ్మయ్య గారిని ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా తరువాత శాసన మండలి అధ్యక్షులుగా చేసి గౌరవించారు.

వారిలోని ఉన్నత భావాలు,ధైర్యసాహసాలు, త్యాగనిరతి వలన పదవులు వారిని వెంటాడుతూ వచ్చాయి.మంత్రి పదవికి రాజీనామా చేసి, 1951 లో రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా పదవిని స్వీకరించిన దగ్గర నుండి ఆంధ్రరాష్ట్ర ఉపముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పదవులు ఆయనను వరించాయి. ముఖ్యమంత్రి పదవికి కోర్టు వ్యాఖ్యలకు రాజీనామా చేయడం మహోన్నత దశకు దారితీసాయి. కాంగ్రెసు అధ్యక్ష పదవి,కేంద్రంలో మంత్రి స్పీకరు పదవులు అధిష్ఠించారు. రాష్ట్రపతిగా కాంగ్రెసు అభ్యర్థిగా ఓడిపోయి ఇంటికి వచ్చి వ్యవసాయం చేశారు. జనతాపార్టీ సహకారంతో స్పీకరుగా ఎన్నికయి తరువాత రాష్ట్రపతి పదవిని అలంకరించారు. పట్టినపట్టును వీడని నాయకుడు. అనేక ఆటంకాలు ఎదురొచ్చినా, పోరాటాలతోనే విజయాన్ని సాధిస్తూ వుంటే నాలో నూతన స్ఫూర్తికలుగుతూ వుంటుంది. రాజకీయంలో అప్పుడప్పుడు కొంత ఛేదించినా వారి మీద నాకు ఎనలేనవి గౌరవం, నా మీద వారికి వున్న ఆప్యాయత తరగలేదు. పెరుగుతూనే వచ్చాయి. మే 19వ తేది వారి 74వ జన్మదినోత్సవ సందర్భంగా పూజ్యులు సంజీవరెడ్డి గారికి హృదయపూర్వక అభినందనలను అందజేసుకొంటున్నాను.

నేటి క్లిష్ట పరిస్థితులలో ఆదర్శంగా రాజకీయవేత్తలకు సలహాలు ఇవ్వడానికి,నైతిక విలువలను కాపాడటానికి వారు సంపూర్ణ ఆయురారోగ్యాలతో తులతూగుతూ శక్తియుక్తులు కలిగివుండాలని కోరుకొంటున్నాను.

*(ఆంధ్రపత్రిక, 19-05-1986)*

# 10. ప్రతిభ - రాజకీయ విజ్ఞత మూర్తీభవించిన నాయకుడు శ్రీ జలగం వెంగళరావు

శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా ఉన్న నాలుగు సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్‌లో "స్వర్ణయుగం"గా, పక్షపాత రహితమైన పరిపాలనగా పరిశీలకులు అభివర్ణిస్తారు. ఆంతరంగికమైన తగువులు లేవు. శాంతి భద్రతలు అందరికీ లభించాయి. ఆర్థిక, పారిశ్రామిక రంగాలలో రాష్ట్రం ఉన్నత స్థాయిని అందుకొంది.

శ్రీ జలగం వెంగళరావు పేరు వినిపించగానే ఆంధ్రప్రదేశ్ నలుమూలల నుంచి హార్థికమైన ఆప్యాయత వెల్లివిరుస్తుంది. సమర్థుడు, పరిపాలనా దక్షుడు, ప్రజాసేవకు అంకితమైన వ్యవహార దక్షత అయన సొత్తు. ఫైల్స్ మీద వెంట వెంటనే నిర్ణయాలు తీసుకోవడం, అసెంబ్లీలో సంక్షిప్తంగా, సూటిగా, అచరణయోగ్యంగాఉండే ఉపన్యాసాలు, పరమసత్యాలయినప్పటికీ ఛలోక్తులు మేళవించి ఇవ్వడం ఎన్నటికీ మరపురాని విషయాలు. ఆచరణసాధ్యమైన ఆశయాలు, ఒక కార్యక్రమం మంచిదని నమ్మకం కుదిరితే దానికి కట్టుబడి తప్పక నిర్వహించే ధైర్యం ఆయనలోని విశిష్టత.

1921లో జన్మించిన శ్రీ జలగం వెంగళరావు స్వాతంత్ర్య సమర వాయువులు ఆఘ్రాణించి, నిజాం నవాబు, ఆయన తాబేదారులు సాగించే నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా, హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెసు సాగించిన పోరాటంలో పూర్తిగా నిమగ్నమైనారు. హైదరాబాదు రాష్ట్రం ఇండియన్ యూనియన్‌లో విలీనం అయిన తర్వాత, 1948లో ఆయన మధిర తాలూకా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులైనారు. తరువాత ఖమ్మం జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులైనారు. పిమ్మట ఖమ్మం జిల్లా పరిషత్తు ప్రథమ అధ్యక్షులుగా ఎన్నికైనారు. ప్రజా సేవకు అంకితమైన ఆయన కృషి వలన ఖమ్మం జిల్లా ప్రగతి పథంలో పయనించి సంపన్నమైనది.

1962లోను, మళ్లీ 1972లోను రెండుసార్లు ఆయన వెంసూరు నియోజక వర్గం నుంచి ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నికైనారు. 1963 నుంచి 1968 వరకూ 6 సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్ పంచాయితీరాజ్ మండలి అధ్యక్షులుగా దాని కార్యక్రమాలకు మార్గదర్శకులైనారు.

ప్రాంతీయ దురభిమానాల కారణంగా తలయెత్తిన ఒకపక్క నక్సలైట్లుసాగిస్తున్న హింసాత్మకచర్యలు ఇంకొకపక్క రాష్ట్రాన్ని అల్లకల్లోలం చేస్తున్న క్లిష్ట సమయంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి మంత్రివర్గంలో హోంశాఖామంత్రిగా చేరవలసిందిగా శ్రీ వెంగళరావు ఆహ్వానింపబడినారు. నమ్మశక్యం కానంత అల్పవ్యవధిలో ఉద్యమాన్ని అదుపులో పెట్టడం నక్సలైట్ల చర్యలను అణచి వేయడం శక్తి సామర్థ్యాలకు నిదర్శనాలుగా చెప్పవచ్చు. శ్రీ పి.వి.నరసింహారావు మంత్రివర్గంలో పరిశ్రమల మంత్రిగా చేరి, వేగవంతమైన నిర్ణయాలు, సమర్థవంతమైన మార్గదర్శకత్వం ఉద్యోగుల, పారిశ్రామికుల, యాజమానుల ఆదరాభిమానాలను చూరగొనటం ద్వారా మళ్లీ తన శక్తిని నిరూపించుకొన్నారు.

రాష్ట్రం మళ్లీ ఇంకో ప్రాంతీయ ఉద్యమానికి గురికావడం మూలంగా పాలనాయంత్రాంగం చలనరహితమైంది. రాష్ట్రం కొంతకాలం ప్రెసిడెంట్ పాలనలో ఉంది. అటువంటి సమయంలో రాష్ట్ర పరిస్థితులను చక్కదిద్దగల వ్యక్తికోసం అన్వేషణ సాగినప్పుడు, ఆ భారాన్ని సహజంగా శ్రీ వెంగళరావు భుజస్కంధాలపై మోయక తప్పలేదు ఆ విధంగా 1973 డిసెంబరు 10వ తేదీన అత్యంత క్లిష్ట సమయంలో, శ్రీ పివీగారు రాష్ట్ర సారథ్యం వహించారు. భయమెరగని ఉత్సాహం ధైర్యం స్థైర్యం, ఆలోచనా శక్తి తోడుకాగా, అనితర సాధ్యమైన బరువు బాధ్యతలను చేపట్టి స్వల్పకాలంలోనే నమ్మశక్యం కానంతగా రాష్ట్ర సమగ్రాభివృద్ధిని ఆయన సాధించారు.

ప్రభుత్వోద్యోగుల సంక్షేమం కోసం శ్రీ వెంగళరావు ఎన్నో చర్యలు తీసుకున్నారు. ఈ కారణంగా ఆ ఉద్యోగులు నేటికీ వారిని కృతజ్ఞతాభావంతో స్మరించుకుంటున్నారు. ఉద్యోగమండలి మీద విశ్వాసం ఉంచారు. వారినుంచి నూటికి నూరుపాళ్లు విశ్వాసం పొందారు. పోలీసు శాఖ వారి వెనుక ఒక దుర్గం వలే నిలిచింది. ఆ శాఖను కట్టుదిట్టం చేసి బలపర్చటంలో ఆయన చూపిన విజ్ఞత అసాధారణమైంది. పరిశ్రమల రంగంలో ఆయన దేశం నలుమూలలనుంచి యువశ్రామికులను ఆకర్షించి, ఆంధ్రప్రదేశ్‌ను పారిశ్రామికంగా అభివృద్ధి సాధించిన రాష్ట్రంగా తీర్చిదిద్దారు.

రాష్ట్ర సారథ్యం వహించినప్పుడు అరవై మిలియన్ రూపాయల లోటు, అనేక బాధ్యతలు శ్రీ వెంగళరావుకు సంక్రమించాయి. కాని నాలుగేళ్ల తరువాత ఆయన పదవినుంచి విరమించుకొన్నప్పుడు 1,250 మిలియన్ రూపాయల ప్రణాళికా వ్యయం 1977-78 నాటికి 3,610,75 మిలియన్ రూపాయలకు పెరిగింది. సామాన్యంగా అందరికీ వినియోగపడే అనేక నిత్యావసర వస్తువులు అమ్మకం పన్నునుండి

మినహాయించినప్పటికీ పన్నుల వసూళ్లు బాగా పెరిగాయి. ఆయన రాష్ట్ర సారథ్యం చేపట్టినప్పుడు వసూళ్లు 1,130 మిలియన్ కాగా విరమించినప్పుడు 3,630 మిలియన్ అయినాయి. సాగుచేయబడిన భూమి, విద్యుచ్ఛక్తి, ధాన్యాలఉత్పత్తి, ఉద్యోగావకాశాలు, వైద్య సదుపాయాలు మొదలైన ఎన్నో రంగాలలో అభివృద్ధి కన్పించింది.

రాష్ట్ర సమైక్యతను కాపాడటానికి శ్రీ వెంగళరావు తీసుకొన్న ప్రథమ బృహత్తర కార్యక్రమము హైద్రాబాద్‌లో 1975 ఏప్రియల్ నెలలో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించడం, వేర్వేరు ప్రాంతాలకు చెందిన ప్రజలను కలిపి ఉంచే బంధం భాష ఒక్కటే కాదనీ, అందుకు 'సంస్కృతి' సముచితమైన పాత్ర నిర్వహించడం అత్యావశ్యకమనీ ఆయన గుర్తించారు. రాష్ట్రం నలుమూలలా వున్న తెలుగువారిలోనే కాక, దేశంలోనూ, విదేశాలలోనూ వ్యాపించిఉన్న తెలుగు మాట్లాడే ప్రజలందరిలోనూ, 'మనమంతా ఒక్కటే' అను భావన పెంపొందించడానికి, తెలుగు సౌభ్రాతృత్వ బంధం పటిష్ఠం చేయడానికి శ్రీ వెంగళరావు అపూర్వమైన ఈ ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించారు. ప్రపంచ నలుమూలలనుంచి వచ్చిన తెలుగు సమాజాల ప్రతినిధులు ఈ మహాసభలో ఒకే వేదికమీద కలుసుకొని తమ తమ ఆశయాలను సమస్యలను అరమరికలు లేకుండా చర్చించుకున్నారు. హృదయాలను విప్పి మాట్లాడుకొన్నారు. కనీవినీ ఎరుగని విధంగా విజయవంతంగా వారంరోజులు జరిగిన ఈ మహాసభలు తెలుగు మాట్లాడేవారందరిలో ఐక్యతాభావనకు అపూర్వమైన ప్రోత్సాహం కల్గించాయి, అంతేకాదు తమ చరిత్ర, సంస్కృతి, సమర్థతలపై వినయంతో కూడిన గర్వం కూడా కల్గించాయి.

శ్రీ వెంగళరావు బలహీన వర్గాలకు అండదండలుగా నిలిచారు. వారి సంక్షేమానికి ఎన్నో పథకాలు ప్రవేశపెట్టారు. ఆయన ముఖ్యమంత్రిగా ఉన్నకాలంలో 20 సూత్రాల కార్యక్రమం ఆంధ్రప్రదేశ్‌లో యథార్థంగా అమలుపర్చబడింది. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ దేశమంతటిలోనూ ప్రథమస్థానంలో నిలిచింది.

గోదావరి–కృష్ణ నదీజలాల సమస్యను కర్ణాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలలో సమరసంగా పరిష్కరించినప్పుడు శ్రీ వెంగళరావు రాజకీయ విజ్ఞత ఉన్నత శిఖరాలను అందుకొన్నది.

ఈ శతాబ్దంలో గొప్ప విషాద ఘట్టంగా పరిణమించిన 1977 నాటి హింసాత్మకమైన తుఫాను, ఉప్పెనల వల్ల దివిసీమ శ్మశానవాటికగా మారినప్పుడు ముఖ్యమంత్రిగా శ్రీ వెంగళరావు నిర్వహించిన సహాయ, పునరావాస కార్యక్రమాలు

అందరి ప్రశంసలను అందుకొన్నవి. ఆ సమయంలో జాతీయ, అంతర్జాతీయ స్వచ్ఛంద, సాంఘిక సేవాసంస్థలు అందించిన సహాయంతో వేలకొలదీ ఇండ్లు, వందలకొలదీ తుఫాను షెల్టర్లు నిర్మించబడ్డాయి.

ఇందిరా కాంగ్రెసుకు పెట్టనికోట అయిన ఆంధ్రప్రదేశ్ ఒక ప్రాంతీయ పార్టీకి వశమైనప్పుడు భారత కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ రాజీవ్‌గాంధీ శక్తిమంతమైన నాయకత్వంతో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్-ఐను పునరుజ్జీవింపజేసి బాధ్యతను స్వీకరింపలసిందిగా శ్రీ వెంగళరావును ఆహ్వానించారు.

పరిస్థితులన్నీ పూర్తిగా వ్యతిరేకంగా ఉన్న సమయంలో 30.04.1985న శ్రీ జలగం వెంగళరావు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షతను చేపట్టారు. అయినప్పటికీ సమర్థులైన మిత్రుల, విశ్వాసపాత్రులైన కార్యకర్తల సహాయంతో రాష్ట్ర మంతటా పర్యటించి, సమాజ అభ్యుదయసాధనకు అంకితమైన, విశిష్టమైన కాంగ్రెస్ పార్టీపట్ల సదవగాహనం, మైత్రీభావాన్ని ప్రజలలో పెంపొందించగలిగారు.

కార్యనిర్వహణ సామర్థ్యానికి శ్రీ జలగం వెంగళరావు సుప్రసిద్ధులు. ఆయన నిరాడంబరులు. ప్రచార విముఖులు. అసాధారణమైన వకానంలోనే ఆయన శక్తి ఇమిడి ఉంది. మితభాషి. కార్యవాది. దృఢ సంకల్పులు. ఆడినమాటకు కట్టుబడి తలపెట్టిన కార్యం సిద్ధించేవరకు విశ్రమించని ధీరులు.

(స్నేహలత)

# 11. సమైక్యతా సారథి శ్రీ జలగం వెంగళరావు

తెలుగువారు వేర్వేరు ప్రాంతాలలో నివసిస్తూ ఒకే రాష్ట్రం కిందికి రావాలని చిరకాలంగా కలలుకంటూ వచ్చారు. వారి స్వప్నాలు ఫలించాయి. తెలుగు ప్రాంతాల సమగ్ర సమైక్య స్వరూపంగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది. అయిదుకోట్ల హృదయాలు ఆనంద తరంగితమయ్యాయి. ఒకే భాష, ఒకే సాహిత్యం, ఒకే సంస్కృతి, ఒకే సంప్రదాయంతో వర్ధిల్లుతూ శతాబ్దాల ఎడబాటు అనంతరం సంఘటితమైన తెలుగుజాతి సమస్తం సమైక్యతాస్ఫూర్తితో స్పందించింది. ఈ స్పందన గీతాలాపనలో అపోహలు కారణంగా అపశ్రుతులు వినవచ్చాయి. ఏకాతాసూత్ర బద్ధులైన సోదరులమధ్య నిర్హేతుకమైన వాదోపవాదాలు, కలతలు తలెత్తాయి. తెలుగుజాతి భవిష్యత్తుపై క్రమ్ముకోవటానికి కారుమబ్బులు ఉరకలు వేస్తున్న తరుణంలో తెలుగుదేశం నలుదిక్కులా విశ్వాస జలధారలు కురిపించ ఉజ్జ్వల ఆశాకిరణాలు ప్రసరింపజేసిన సమైక్యతా భాస్కరుడు శ్రీ జలగం వెంగళరావు గారు.

భాషలో, వేషంలో తెలుగుతనానికి ప్రతీక అయిన శ్రీ జలగం వెంగళరావు గారు అన్ని ప్రాంతాలకు ఆదర్శప్రతినిధిగా నిలచిన సమైక్యతా మూర్తి. కార్యనిరతికి, పరిపాలనా దక్షతకు ఆయన మారుపేరు. ఉత్తమ పాలనానుభవం సంతరించుకుని 1973 డిసెంబరు 10వ తేదీన ఆయన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా రాష్ట్రసారథ్యం వహించారు. తెలుగుసీమను సౌభాగ్య విలసితం చేయటానికి దీక్షవహించి రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి, సోషలిస్టు సమాజస్థాపనకు, బలహీనవర్గాల సంక్షేమానికి మన మందరం భుజం భుజం కలిపి పనిచెయ్యవలసిన అవసరం వున్నది ముఖ్యమంత్రి బాధ్యతలు స్వీకరించిన వెంటనే రాష్ట్ర ప్రజలకు ఉద్బోధించారు.

దృఢదీక్షతో రాష్ట్రసమగ్ర సర్వతోముఖ అభ్యుదయం కోసం కృషి సాగిస్తున్న మన ముఖ్యమంత్రి నేతృత్వంలో ఆంధ్రప్రదేశ్ ఈ సంవత్సరంలో అద్భుత ప్రగతిని సాధించింది.

'అన్ని ప్రాంతాల వ్యక్తి'గా శ్రీ జలగం వెంగళరావు గారు అయిదు కోట్ల ఆంధ్రులలో భావసమైక్యాన్ని సుస్థిరం చేశారు. ప్రప్రథమంగా ఆరుసూత్రాల పథకం రూపొందించి,

రాష్ట్ర ప్రజలలో పరిపూర్ణ విశ్వాసాన్ని నెలకొల్పారు. ఇంతకాలంగా సందేహాలకు ఆస్పదంగా వుంటూ వచ్చిన మౌలిక కారణాల్ని ముఖ్యమంత్రి సాకల్యంగా అవగాహన చేసుకుని అన్ని ప్రాంతాల సమగ్రపురోభివృద్ధికి, ఉద్యోగావకాశాల కల్పనకు ఉత్తమ మార్గాలు అన్వేషించి వాటిని కార్యరూపంలోకి తెచ్చారు.

షట్సూత్ర పథకంలో నిర్దేశించిన ప్రకారం రాష్ట్ర ప్రణాళిక, అభివృద్ధి సంఘాన్ని, వెనుకబడిన ప్రాంతాలకు ఉప సంఘాలను నిర్మించేందుకు శ్రీ జలగం వెంగళరావు గారు సత్వర చర్యలు గైకొన్నారు. తత్ఫలితంగా రాష్ట్ర ప్రణాళిక, అభివృద్ధిమండలి, కోస్తా, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలకు విడివిడిగా ప్రాంతీయ ప్రణాళిక, అభివృద్ధి మండలుల రూపు ధరించాయి. వీటివల్ల వివిధ ప్రాంతాలలోని సోదరులలో పూర్తివిశ్వాసం ఏర్పడింది. వివిధ అభివృద్ధి కార్యక్రమాలను అమలుపరిచే నిమిత్తం ముఖ్యమంత్రి ఐదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ఆంధ్రప్రదేశ్‌కు రూ॥90 కోట్ల ప్రత్యేక గ్రాంటును కేంద్రం నుండి పొందగలిగారు. ఈ రొక్కాన్ని రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాల వికాసం కోసం వినియోగిస్తారు. ఇంతేకాకుండా రాజధాని నగరం అభివృద్ధికోసం కేంద్రప్రభుత్వం నుంచి రూ॥10 కోట్ల సహాయాన్ని కూడ పొందగలిగారు.

ఆరు సూత్రాల పథకం కింద హైదరాబాదులో కేంద్ర విశ్వవిద్యాలయాన్ని స్థాపించేందుకు తగు చర్యలు తీసుకోబడుతున్నాయి. స్థానిక అభ్యర్థి నిర్వచనం విషయంలో రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ అయ్యాయి.

రాష్ట్ర ప్రజలకు ఏకతాసూత్రంతో బంధించడానికి, వారిలో మానసికమైన సమైక్యత వర్ధిల్లజేయడానికి, భాష ప్రబల సాధనం కాగలదని ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు గ్రహించి రాష్ట్ర పాలనలో తెలుగుకు ప్రముఖ స్థానం ఇవ్వడానికి నిశ్చయించారు. సమావేశాల్లో తెలుగులోనే ప్రసంగించేందుకు ఆయన నిర్ణయం గైకొన్నారు. అధికార భాషా చట్టాన్ని కట్టుదిట్టంగా అమలు జరపాలనే స్థిర సంకల్పంతో ముఖ్యమంత్రి ఆనందనామ ఉగాది నుండి అంటే 1974 మార్చి 24వ తేదీనుండి తాలూకా స్థాయి కార్యాలయాలన్నింటిలో తెలుగు మాత్రమే ఉపయోగించాలని ఆదేశాలు జారీ చేశారు. ప్రభుత్వానికి ప్రజలమధ్య సన్నిహితం ఏర్పడాలంటే పాలనా రంగంలో తెలుగుభాష పరివ్యాప్తం కావాలని ఆశించారు. అందుకు నిరంతర కృషి సలుపుతున్నారు. రాష్ట్రమంతటా ఆ సందర్భంలో సాంస్కృతిక వారోత్సవాలు జరిగాయి. రాజధానిలో అఖిలభారత తెలుగు సాంస్కృతిక వారోత్సవాలు ఆనందోత్సాహాలతో జరిగాయి.

ఉత్సవాలను ప్రారంభిస్తూ శ్రీ జలగం వెంగళరావు గారు "ప్రజాబాహుళ్యానికి చెందిన భాష ఒక్కటే వారిని సన్నిహితులను చేసి, రాష్ట్ర అభ్యున్నతికి తోడ్పడగలదు. ప్రజాస్వామ్య వ్యవస్థను పటిష్ఠంచేయడంలో సహాయపడగలదు" అని ఉగ్గడించారు.

1975 ఉగాది నాటికి అధికార భాషగా తెలుగును జిల్లా స్థాయి కార్యాలయాలలో ప్రవేశ పెట్టడం జరుగుతుందని ప్రకటించారు. అధికార భాషగా తెలుగు వాడుకను విస్తృతం చేసే నిమిత్తం శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య గారి అధ్యక్షత కింద అధికార భాషా కమీషన్ ఏర్పాటయింది.

ఈ యేడు దసరా పండుగలందు అక్టోబరు 23 నుంచి నాలుగు రోజులపాటు రాజధానిలో జరిగిన అఖిలభారత తెలుగు బాలల మహోత్సవాలకు ముఖ్యమంత్రి తమ సంపూర్ణ సహకారం అందజేశారు.

"రాష్ట్రంలోను, దేశంలోను" మాత్రమే కాక యావత్ప్రపంచంలో వుండే తెలుగు వారందరితో ఉత్తమ భావసమైక్యాన్ని వర్ధిల్లజేయాలనే ఉద్దేశంతో ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు 1975 ఉగాది నుండి వారంరోజులపాటు రాజధానిలో ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలనే ప్రతిపాదనను బలపరచి ఈ మహాసభలను దిగ్విజయంగా నిర్వహించేందుకు సకల విధాల చేయూతనిస్తున్నారు. మహాసభల ఆహ్వానసంఘానికి అధ్యక్షులుగా ఉండి సన్నాహాలు జరిపిస్తున్నారు.

భావ సమైక్యతాభివృద్ధికి కృషిచేస్తూనే ముఖ్యమంత్రి రాష్ట్ర సర్వతోముఖ అభ్యున్నతికి దీక్షతో కార్యక్రమాలు నిర్వహింపజేస్తున్నారు. వ్యవసాయం, పరిశ్రమలు మొదలైన రంగాలన్నింటిలోను ఈ సంవత్సరం రాష్ట్రం గణనీయమైన ప్రగతి సాధించడం మన ముఖ్యమంత్రి కార్యదీక్షకు, పాలనాదక్షతకూ ప్రబల తార్కాణం.

ప్రాజెక్టుల నిర్మాణం పనిని త్వరితగతిని పూర్తిచేయాలని ముఖ్యమంత్రి పట్టుదల వహించారు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణంకోసం రూ॥100 కోట్లు సమకూర్చవలసిందిగా శ్రీ జలగం వెంగళరావు గారు, భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి గారు రాష్ట్ర పర్యటనకు విచ్చేసినప్పుడు ప్రత్యేకంగా కోరారు. రాష్ట్రానికి చెందిన పార్లమెంటు సభ్యులను సమావేశపరచి ముఖ్యమంత్రి రాష్ట్రంలోని ప్రాజెక్టులను సత్వరంగా పూర్తిచేసేందుకు కేంద్రసహాయం పొందడంలో కృషిచేయవలసిందిగా వారిని కోరారు. కేంద్రమంత్రి శ్రీ డి.పి.ధార్ 1974 ఆగష్టు మాసంలో గుంటూరు జిల్లా

చేజర్ల వద్ద నాగార్జునసాగర్ కుడికాలువ నుండి నీటిని విడుదలచేశారు. అయిదవ పంచవర్ష ప్రణాళికాకాలంలో నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు నిధులు విడుదల కాగలవని, ఆయన హామీ ఇచ్చారు. ఆగష్టు నెలలోనే ముఖ్యమంత్రి హుజూర్‌నగర్ తాలూకాలో నాగార్జునసాగర్ ఎడమ కాలువనుండి జలాలను విడుదలచేశారు. ప్రస్తుతం నాగార్జునసాగర్ ప్రాజెక్టు ద్వారా 10 లక్షల ఎకరాలకు నీరు లభిస్తున్నది. కాలువల నిర్మాణం పూర్తి అయిన మీదట మరో 16లక్షల ఎకరాలు సాగుకాగలవు. అప్పుడు తెలుగుసీమ మరింత సస్యశ్యామలమై సౌభాగ్యసంశోభితమవుతుంది.

పోచంపాడు, శ్రీశైలం ప్రాజెక్టుల నిర్మాణాన్ని శీఘ్రతరం చేయడానికి ముఖ్యమంత్రి పట్టుదలతో కృషిచేస్తున్నారు.

అదేవిధంగా గోదావరి బరాజ్ నిర్మాణం వీలైనంతత్వరలో పూర్తిచేసే నిమిత్తం ఈయేడు రూ॥2.10 కోట్లు వ్యయపరిచేందుకు ప్రభుత్వం నిర్ణయించింది.

దాదాపు 700 వరకు చిన్నతరహా నీటి పారుదల పథకాలను పూర్తిచేయాలని ప్రభుత్వం సంకల్పించింది.

రాష్ట్ర అభ్యుదయానికి పారిశ్రామికీకరణ అత్యావశ్యకమని శ్రీ జలగం వెంగళరావు గారు పదే పదే వక్కాణిస్తున్నారు. లోగడ పరిశ్రమల శాఖామంత్రిగా వుండగా ఆయన ఇందుకు తగిన పునాదులు వేశారు. ముఖ్యమంత్రిగా ఇప్పుడు ఎన్నో చర్యలు గైకొన్నారు. విశాఖపట్నం ఉక్కు కర్మాగారం పని త్వరలో చేపట్టేందుకు ముఖ్యమంత్రి కేంద్రంపై వత్తిడితెస్తూ వున్నారు. రాష్ట్రంలో చిన్న తరహా ఉక్కు కర్మాగారాలు త్వరలో ఏర్పాటు కాగలవని ఇటీవలనే ముఖ్యమంత్రి ప్రకటించారు.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందేందుకు వీలుగా ప్రతి జిల్లాకు జిల్లా కలెక్టరు అధ్యక్షుడుగా ఒక సంఘాన్ని ఏర్పరచాలని ముఖ్యమంత్రి సంకల్పం. రాష్ట్రమంతటా చిన్నతరహా పరిశ్రమలు పెక్కు ఏర్పాటవుతున్నాయి. ప్రభుత్వ, ప్రయివేటు, సంయుక్త, సహకార రంగాలలో మధ్యతరహా, లఘు పరిశ్రమలను పెంపొందించేందుకు తగిన ప్రోత్సాహం కల్పిస్తున్నారు.

ఇటీవలనే పటంచెరువు వద్ద రూ॥5 కోట్ల వ్యవయంతో ఆధునికమైన చెక్కబోర్డుల కర్మాగారం ఏర్పాటయింది. రూ॥30 కోట్ల ఖర్చుతో మంగళగిరి వద్ద టైర్ల కర్మాగారం నెలకొల్పేందుకు సన్నాహాలు జరుగుతున్నాయి. రైల్వే వ్యాగన్ల మరమ్మతు కర్మాగారానికి,

రాయనపాడువద్ద భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి ఏప్రిల్ 7వ తేదీన శంకుస్థాపన చేశారు.

ముఖ్యమంత్రి ప్రోత్సాహంవల్ల రాష్ట్రమంతటా పారిశ్రామికీకరణ కార్యక్రమం సమధికోత్సాహంతో జరుగుతున్నది. ఆయన కృషివల్ల భద్రాచలంలో కాగితపుమిల్లుకు కేంద్రం నుంచి అనుమతి లభించింది. అడవులను, తద్వారా అటవీ పరిశ్రమలను పెంపొందించేందుకు వీలుగా త్వరలో ఒక కార్పొరేషను ఏర్పాటు కాగలదని ముఖ్యమంత్రి డిసెంబరు 1వ తేదీన ప్రకటించారు. ఆనాడు పటంచెరువులో ప్రసంగించిన సభలో ముఖ్యమంత్రి ఈ సంవత్సరం రాష్ట్రంలో పరిశ్రమలకు మున్నెన్నడూ లేనంత నిధులను కేటాయించినట్లుకూడ వెల్లడించారు.

భారత రాష్ట్రపతి నవంబరు 20వ తేదీన రాజమండ్రివద్ద ఆసియాలో కెల్ల పెద్దదైన 2.9 కిలోమీటర్ల రోడ్డు-రైలు వంతెనకు ప్రారంభోత్సవం జరపడంతో రవాణాకు మరింత సౌలభ్యత ఏర్పడి రాష్ట్రపారిశ్రామిక చరిత్రలో నూతనాధ్యాయం ఆరంభమయింది.

హైదరాబాదు నగరాన్ని చలనచిత్ర పరిశ్రమకు ముఖ్యకేంద్రంగా అభివృద్ధి పరచి తద్వారా రాష్ట్రాన్ని, చలనచిత్ర రంగాన్ని పురోగమింపచేసే నిమిత్తం శ్రీ జలగం వెంగళరావు గారు గట్టి కృషి చేస్తున్నారు. ముఖ్యమంత్రి ఫిలిం పరిశ్రమ ప్రతినిధులతో చర్చలు జరిపారు. త్వరలోనే చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ ఏర్పాటు కానున్నది.

పరిశ్రమల అభివృద్ధికి ముఖ్యాధారమైన విద్యుచ్ఛక్తి విషయంలో ముఖ్యమంత్రి ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నారు. ఈ ఏడాది రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి పరిస్థితి మెరుగుపడింది. విద్యుచ్ఛక్తి వినియోగంపై విధించిన ఆంక్షలు తొలగించబడ్డాయి. రాష్ట్రంలో బొగ్గులభించే అన్ని తావులలోను థర్మల్ విద్యుత్ కేంద్రాలు స్థాపించేందుకు ప్రభుత్వం సంకల్పిస్తున్నట్లు శ్రీ జలగం వెంగళరావు గారు ఇటీవలనే ప్రకటించారు. రామగుండం వద్ద సూపర్ థర్మల్ కేంద్రాన్ని ఏర్పాటు చేయవలసిందిగా ముఖ్యమంత్రి భారత ప్రభుత్వాన్ని గట్టిగా కోరుతున్నారు.

'బలహీనవర్గాలవారి సంక్షేమానికి ఇంకా అనేక కార్యక్రమాలు రూపొందించి, వారి జీవన ప్రమాణాలను పెంపొందించడం నా ప్రథమ కర్తవ్యంగా భావిస్తున్నాను' అని ముఖ్యమంత్రి ప్రకటించడం ఈ వర్గాల శ్రేయోభివృద్ధులపట్ల వారికి గల ప్రగాఢ

ఆకాంక్ష వ్యక్తమవుతుంది. ఈ వర్గాల ప్రజలకు పెక్కు విధాల తోడ్పడే భూ సంస్కరణలు 1975 జనవరి 1వ తేదీనుండి అమలు జరగగలవని ముఖ్యమంత్రి వెల్లడించారు. భూ సంస్కరణల శాసనాన్ని రాజ్యాంగంలోని 9వ షెడ్యూలులో చేర్చటం మూలంగా న్యాయసంబంధమైన వివాదాలకు ఆస్కారం లేకుండా చేసినట్లు ముఖ్యమంత్రి వివరించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజన ప్రాంతాల సమగ్రమైన అభివృద్ధి నిమిత్తం రూ॥55 కోట్లు వ్యయం కాగల బృహత్ పథకాన్ని రాష్ట్ర ప్రభుత్వం రూపొందించి, పరిశీలనార్థం కేంద్రానికి పంపింది. ప్రాథమిక చర్యలు గైకొనేందుకు గాను కేంద్రం అప్పుడే రాష్ట్రప్రభుత్వానికి రూ॥30 లక్షలు అందజేసింది. వెనుకబడిన తరగతుల ప్రజల ఆర్థిక సహాయసంస్థ ఒకటి, షెడ్యూలు కులాల ప్రజల ఆర్థిక సహాయసహకారాల సంస్థ ఒకటి ఇటీవలే ఏర్పాటయ్యాయి. హరిజనులకు ఇండ్లస్థలాలు సమకూర్చడం, ఇండ్లు నిర్మించడం, పేదరైతులకు బంజరు భూములు కేటాయించడం, గిరిజనులకు అరకలు, ఎడ్లు, వ్యవసాయ పరికరాలు బహూకరించడం వంటి, అప్పుల మీద, పెనాల్టీలమీద రైతుల శిస్తు, రాయితీల యివ్వటం లాంటి కార్యక్రమాలవల్ల రైతాంగానికి సహాయం చేశారు. కార్యకలాపాలు చురుకుగా సాగుతున్నాయి.

రాష్ట్రంలో విద్యాభివృద్ధికి శ్రీ జలగం వెంగళరావు గారు ఆది నుంచి ఎంతో చేయూతనిస్తున్నారు. ఉపాధ్యాయుల సంక్షేమం పట్ల ముఖ్యమంత్రి ప్రత్యేక శ్రద్ధ వహించి ప్రయివేటు విద్యాసంస్థలలో ఉపాధ్యాయులను తొలగించడంపై ఆంక్షలు విధిస్తూ అక్టోబరులో ఒక ఆర్డినెన్సు జారీచేయబడింది. ఈ సంవత్సరం 11 ప్రభుత్వ జూనియర్ కళాశాలలు ప్రారంభమయ్యాయి. ఇంటర్మీడియట్ విద్యా సౌకర్యాలులేని అన్ని తాలూకాలలోను జూనియర్ కళాశాలలను ఏర్పాటు చేయాలన్నది ప్రభుత్వ విధానం. రాష్ట్రంలో ఈ యేడు ప్రయివేటు యాజమాన్యంలో 15 డిగ్రీ కళాశాలలు ప్రారంభించేందుకు ప్రభుత్వం అంగీకారం తెలిపింది. ఇప్పుడున్న పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రాలు కాక నిజామాబాదులోను, కర్నూలులోను పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రాలు నెలకొల్పే పథకాన్ని రాష్ట్రమంత్రిమండలి ఇటీవలనే ఆమోదించింది. ఇంతేకాకుండా కరీంనగర్, ఖమ్మం, కడప, శ్రీకాకుళం, విజయవాడ, నెల్లూరులలో ప్రభుత్వ కళాశాలల్లో పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులను ప్రవేశపెట్టాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. రాష్ట్రంలో వచ్చే విద్యాసంవత్సరం నుంచి కొత్తగా నాగార్జున, కాకతీయ విశ్వవిద్యాలయాలు పనిచేయగలవని ముఖ్యమంత్రి తెలియపరిచారు.

వైద్య, ఆరోగ్యరంగాలలోను, పశుపోషణ, రోడ్లు-రవాణా, మత్స్యపరిశ్రమ మొదలయిన రంగాలలో అభివృద్ధి కార్యక్రమాలు శీఘ్రగతిని సాగుతున్నాయి.

ప్రజల సమస్యలను సత్వరంగా పరిష్కరించేందుకు ఆయా జిల్లాల శాసనసభ్యులను ఆయా అధికారులను కలుసుకొని సమస్యలను చర్చించి త్వరితంగా పరిష్కరించడానికి తోడ్పడ్డారు. కల్తీని నిరోధించడానికి తీవ్రచర్యలు గైకొని నేరస్థులను శిక్షించడంలో తోడ్పడ్డారు. ఇది ప్రజాసామాన్యంలో సంచలనం కలగించిన చర్య.

మన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు అందించిన చైతన్య స్ఫూర్తితో రాష్ట్రం గత యేడాదికాలంలో గణనీయమైన ప్రగతిని సాధించింది. భావసమైక్యాన్ని వర్ధిల్లజేసి, రాష్ట్ర సర్వతోముఖ వికాసానికి ఆయన చేస్తున్న కృషి అమూల్యమైనట్టిది. సమైక్యతా మూర్తిగా ఆయన సారథ్యంలో ఆంధ్రప్రదేశ్ అతిశీఘ్రంగా పురోగతి సాధించి దేశంలో అన్ని రంగాలలోను అగ్రస్థానం వహించడానికి సమాయత్తమవుతున్నది.

*(వెంగళరావు ప్రభుత్వ తొలి వార్షికోత్సవ*
*అభినందన సంచిక - మచిలీపట్టణం 12-12-1974)*

## 12. నవయుగ వైతాళికుడు- కందుకూరి వీరేశలింగం పంతులు

మానవతావాది శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి జీవిత చరిత్రను పరిశీలిస్తే అధునిక యుగపు తెలుగు వైతాళికులలో అగ్రగణ్యులుగా కనిపిస్తారు. దేశ భవిష్యత్తును తీర్చిదిద్ది సామాజిక దురాచారాలను రూపుమాపుటకు నిరంతర కృషి సలిపిన వ్యక్తులలో పంతులుగారు ప్రథములు. భవిష్యత్తును దర్శింపజేసే వారికి, అష్టకష్టాలు ఏనాడు తప్పలేదు. తమ వ్యక్తిత్వాలతో నూతన శకాన్ని నిర్మించాలనే తపన యుగపురుషులకే దక్కింది. అట్టి యుగపురుషులు మన పంతులు గారు. తమ ఆశయ, ఆదర్శ సాఫల్యానికై, తాము నమ్మిన సిద్ధాంతాలకోసం తమపై విసిరివేయబడ్డ రాళ్లను సైతం పుష్పాలుగా స్వీకరించే ధైర్యం పంతులు గారి వంటి వారికే చెల్లింది. ఇట్టి యుగ ప్రవక్తలను సమాజ నిర్మాతలను మనం నిర్లక్ష్యం చేసినా వారి సేవలను కాలమే గుర్తించి పరితప్త స్వాంతంతో పూజించేలా చేస్తుంది.

శ్రీ కందుకూరి కర్మయోగి, కార్యశూరులు, కార్యాచరణకే ప్రాధాన్యం ఇచ్చేవారు. కాని కల్లబొల్లి కబుర్లతో కాలక్షేపం చేసే మనస్తత్వం వారిది కాదు. పంతులుగారు పుట్టింది నిరుపేద కుటుంబంలో. వృత్తి అధ్యాపకత్వం. తన ప్రవృత్తి నవ సమాజ నిర్మాణ ఆశయం. సంఘంలో దట్టంగా అల్లుకున్న మౌఢ్య దురాచార జాడ్యాలకు విధిగా చికిత్సకు పూనుకొన్నారు. అందుకు ఎన్నో ఎదురీతలు ఈదారు. వాటిని భ్రష్టం చేయడానికే పత్రికను సాధనంగా మలచుకొన్నారు. కలాన్ని పట్టారు. నిజమేదో తెలిపారు. నిద్రాణావస్థలో ఉన్న సమాజాన్ని మేల్కొల్పారు. పుస్తకాలను ప్రచురించి విశేష ప్రచారం గావించారు. ఉపన్యాస పరంపరలతో ఎందరినో కార్యోన్ముఖులను గావించారు. నవశకానికి నాంది పలికారు. వంగదేశంలో రాజారామ్మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహారాష్ట్రలో మహాదేవ గోవింద రెనడే గార్లవలె వారు తెలుగు జాతిని, సంస్కృతినీ, సంస్కరించడానికి నడుం బిగించారు. తెలుగు జాతి అభివృద్ధికి త్రికరణ శుద్ధితో కృషి సలిపిన పంతులుగారి ప్రబోధాలు, ప్రవచనాలు ప్రతి తెలుగింటిలో మారు మ్రోగాలి. వాటిని ప్రతి ఒక్కరూ అనుసరించాలి. ఆనాడే మన జాతికి, మనకు గౌరవం లభిస్తుంది.

పంతులుగారు కారణజన్ములు. అసాధారణ శేముషీ దురంధరుడైన శ్రీ కందుకూరి అవినీతి, అన్యాయం, అధర్మం, మతమౌఢ్యం దురాచారాలు నిండియున్న అస్తవ్యస్తమై ఉన్న సామాజిక వ్యవస్థను కనులార గాంచి వాటి నిర్మూలనకై కంకణ ధారులయ్యారు. ఎన్ని అవాంతరాలెదురైన వాటిని ధైర్యంతో ఎదుర్కొంటూ ముందుకే సాగిపోయారు.

మన తెలుగుజాతి ప్రతిభా సమన్వితంగా చైతన్యశీలిగా ఒక స్థితికి రావడానికి ప్రబలకారకులు శ్రీ పంతులు గారు. వారి దూరదృష్టి ధైర్యం సాహసం ప్రజలలో సంచలనాన్ని కలిగింపజేసే విప్లవ భావాలు అభ్యుదయ చింతన అసాధారణమైనవి. తన హేతువాద దృష్టితోనే మహాపురుషుల కోవకు చెందగలిగారు.

పంతులు గారి పట్టుదల అనన్య సామాన్యం. ఏ విషయంమీద ఎవరైనా, ఏ మూలనుంచైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా వ్యతిరేకించి, విమర్శించినా నిర్భయంగానే నిలబడి తన కార్యసిద్ధికి కృషిచేస్తూనేపోయారు. బాల్య వివాహాలు, బజారులో బహిరంగంగా ఆడపిల్లల్ని వేలంలో కొనడం, అమ్మడం లాంటి దురాచార సంప్రదాయాన్ని తుదిముట్టించడానికి విశేష కృషి సలిపారు. భర్తలేని స్త్రీకి బాసటగా నిలిచి స్త్రీత్వం ప్రసాదింపజేసి, కృత్రిమ నిర్బంధ వైధవ్యాన్ని నిర్మూలింపచేశారు.

ఆనాటి భోగం మేళాలనూ, పెరిగిన వేశ్యావృత్తి నీచకృత్యాలనూ, వివిధ శాఖలలో, కులాలలో ఏర్పడిన వైరుధ్యాలతో సతమతమవుతు సహపంక్తి భోజనం చేయడం మహానేరంగా పరిగణించే పాపాన్ని, పెరిగిన భావదారిద్ర్యాన్ని వదిలించడానికీ, విదేశాలకు వెళ్లి తిరిగి వచ్చినప్పుడు, సంఘం నుండి వెలికావింపబడే ఘోర దురన్యాయాన్ని, అంటరానితనమనే అమానుషకృత్యాలను సమూలంగా తుదముట్టించాలనే నిరంతరం పరితపించారు. అగాధాలతో నిండిన సామాజిక దుఃస్థితిని, అసమానతను, సంకుచిత వైషమ్య వాతావరణాన్ని ఛేదించడానికి వారు తదేక దీక్షతో పోరాటం సలిపారు. ఈ బహుముఖ పోరాటంలో ఎన్ని హేళనలూ, అవ హేళన, అపహాస్యాలు దాపురించినా వాటిని నిర్లక్ష్యం గావించి తన ఆశయ సంసిద్ధి కోసం పురోగమించారు.

సంఘంలో సిసలైన విద్యా గంధంలోపించి, కర్కశ పాషాణహృదయంతో దురాచారాలతో మత మౌఢ్యాలతో నిబిడీకృతమైన అధికార వర్గాల్లో ఎదురులేని నిరంకుశత్వం, అంతు తెలియని లంచగొండితనం, దట్టంగా పెరిగిన సమయంలో వాటి నిర్మూలనకూ కృషి సలిపారు. అప్పుడు 1874 అంటే తన 26వ యేట "వివేక వర్ధని" పత్రికా ప్రచురణ ప్రారంభించారు. ఆ పత్రికా లక్ష్యం "దేశాభివృద్ధి-

భాషాభివృద్ధి– సంఘసంస్కరణ, పతిత జనోద్ధరణ. సృజనాత్మక రచయితగా, తాను సంస్కరణ ప్రబోధాన్ని గావించారు. విజ్ఞాన వ్యాప్తికై విద్యాలయాలు ప్రారంభించారు. పండిత పామర జనావళిని తన ఉత్తేజకర రచనల ద్వారా మేల్కొల్పజేశారు. ఆనాటి అంటరానివారిని సైతం తాను ప్రారంభించిన విద్యాలయాల్లో స్థానం కల్పించారు. స్త్రీ విద్యాభివృద్ధికి అవకాశం కల్పించారు. దౌర్భాగ్యులైన బాల వితంతువులకు స్వేచ్ఛను, వ్యక్తిత్వాన్ని కాపాడి ఆశ్రయమిచ్చేందుకు శరణాలయాలను నెలకొల్పారు. ఆయన జీవితమంతా సంఘ సంస్కరణకూ సాహిత్య వికాసానికే అంకితమయింది. ఆయన సాధించిన విజయాలను పరిశీలించే ఎటువంటి వారికైనా ఆశ్చర్యం కలుగక పోదు. నిజంగా పదిమంది సాధించలేని మహా కార్యాలను తన ఒక్క జీవితకాలంలో సాధించారంటే అది వారి స్వాభిమానానికీ, తెలుగు జాతి సౌభాగ్యానికి, ఆత్మవిశ్వాసానికి తార్కాణం.

తెలుగు వాడవాడల్లో, పల్లెపల్లెల్లో స్వేచ్ఛా వాయువులు వీచినన్నాళ్లూ, తెలుగుజాతి హృదయంలో నిర్భయం, అభ్యుదయ భావ జ్యోతులు వెలిగినన్నాళ్లు వీరేశలింగం పంతులు గారు సజీవంగానే మన హృదయాంతరాళాలలో శాశ్వతంగా నిలుస్తారు. పంతులుగారిని, సంస్మరించుకొంటున్న ఈ శుభతరుణంలో వారు ప్రబోధించిన ప్రవచనాలను, చేపట్టిన కార్యాలను, ఆశించిన ఆశయాలను సఫలీకృతం చేయడానికి వారి అడుగు జాడల్లో నడవడానికి ప్రతిజ్ఞ గైకొనడమే నేటి మన కర్తవ్యం. అదే నేడు మనం భక్తి ప్రపత్తులతో పంతులుగారికి అర్పించే శ్రద్ధాంజలి.

# 13. దేశోద్ధారక, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

భారత స్వాతంత్ర్యసమర సేనానులలో అగ్రగణ్యులు దేశోద్ధారక, విశ్వదాత, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

పుట్టుక ద్వారా కృష్ణాజిల్లా ఎలకుర్రు కుగ్రామంలో, ఆంధ్రపత్రిక ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో, స్వాతంత్ర్య సమరసేనానిగా భారతదేశంలో, అమృతాంజనం ద్వారా విశ్వం అంతటా నాగేశ్వరరావు పంతులుగారి కీర్తి వ్యాపించింది. ఈయన విశ్వదాత, దేశసేవాపరాయణత్వానికి దేశోద్ధారకుడు, విజ్ఞానచంద్రికలకు కళాప్రపూర్ణుడు.

కాంగ్రెస్ పక్షావలంబియై, దేశదాస్యశృంఖలాలను త్రెంచివేయడానికి మూడుసార్లు కారాగార శిక్షననుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు. ఆర్థికంగా, శారీరకంగా, ఆత్మార్పణ చేసుకొన్న పుణ్యపురుషుడు. ఆశ్రిత విద్వజ్జన కోకిలవ్రాత సహకారం, ఆశ్రితజన మందారం. రమారమి 40 సంవత్సరాలు ఆంధ్రజాతికి ప్రపంచ జ్ఞానభిక్షపెట్టిన దేశగురువు. భారతజాతి భగవద్గీత ఎంతముఖ్యమో నాగేశ్వరరావు పంతులుగారి ఉదారగుణసంకల్పితమైన చరిత్ర ఆంధ్రజాతికి అంత ముఖ్యం.

మద్రాసు నగరంలో మహాత్ముని పిలుపునందుకొని ముందుకురకడానికి తటపటాయిస్తున్న నాయకులకంటే తానే ముందంజ వేసిన గాంధేయుడు. సహాయ నిరాకరణ, శాసనోల్లంఘన ఉద్యమాలలో ఆయనదే ముందుపద్దు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి 4 సార్లు అధ్యక్షత వహించిన మకుటం లేని మహారాజు. 1934 కేంద్ర శాసన సభ ఎన్నికలలో 25వేల మెజారిటీతో నెగ్గిన అజాత శత్రువు.

పక్కబొత్తాలతో లాల్చీ, కోసుగా గాంధీటోపి, ముందునడకను సూచించే తెల్లని కుచ్చెళ్ల పంచె, మెడమీద గోరంచు కండువా, ఆ మూర్తిలోని స్వచ్ఛతకు నిదర్శనంగా తెల్లని శుద్ధ ఖద్దరు దుస్తులతో స్ఫూరద్రూపి అయిన నాగేశ్వరరావు పంతులుగారు తేజోవంతంగా కనిపించేవారని ఆనాటి నాయకులే కాక ఈనాటి ఆయన చిత్రాలు కూడా సాక్ష్యం ఇస్తాయి.

అది కాంగ్రెస్‌పార్టీ కార్యకలాపం కానివ్వండి, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర అందోళన కానివ్వండి, హిందీ భాషా ప్రచారం కానివ్వండి, గ్రంథాలయోద్యమం కానివ్వండి, పత్రికారచయితల సమావేశం కాన్వివండి, దేశహితకరమైన ఏ సమావేశకార్యమయినా కానివ్వండి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు పాల్గొని దాన్ని విజయవంతం చేస్తారు.

ఆంధ్రపత్రిక ముంబై కారణాంతరాల వల్ల స్థాపించబడినా, ఆంధ్రదేశీయులకు ఆలస్యంగా అందటం, వారి అభీష్టాశయాలు ఉచితరీతిని ప్రచురించబడకపోవడం వల్ల, ఆనాటి అవిభక్త మద్రాసు రాష్ట్ర ప్రధాన నగరమయిన మద్రాసుకు మార్చవలసి వచ్చిందని పత్రికాసంపాదకులు తెలియజేసారు. "జాతి, మత పక్షపాతాన్ని విడనాడి, సకలమతావలంబులను, అన్ని జాతులవారును, భిన్నాభిప్రాయాలు కలవారును, అభివృద్ధి సాధించవలెనని ఉదారభావం ఆదర్శంగా పెట్టుకొని, నిష్పక్షపాతబుద్ధితో ఆంధ్రపత్రిక వ్యవహరించగలదను పరమోద్దేశ్యము"ను పత్రికాధిపతులు తొలి సంపాదకీయంలో స్పష్టపరిచారు.

పత్రిక చరిత్ర రెండు అధ్యాయాలు. మొదటి అధ్యాయం, స్థాపకులు శ్రీ నాగేశ్వరరావు పంతులు గారి జీవితపర్యంతం. పాతికేండ్లపాటు పత్రిక పంతులుగారి ఆధ్వర్యంలో, సంపాదకత్వంలో నడిచింది. పంతులుగారు ఒక నాయకుడేకాదు, బహుముఖ ఉద్యమం. ఆ ఉద్యమంలో పంతులుగారు ఒక భాగం. పత్రిక ఒక సాధనం. అప్పుడు పంతులుగారే "పత్రిక". "పత్రికే" పంతులుగారు. అది ప్రథమాధ్యమంలో ప్రధానఘట్టం.

ఇప్పుడు పత్రిక స్వంత వ్యక్తిత్వం, స్థిరత్వం స్థాపించుకొనవలసివచ్చింది. స్థాపకుల సంకల్ప బలం వల్ల, అదృశ్యశక్తుల సహాయ సంపత్తి వల్ల పత్రికకు వ్యవస్థ స్వరూపమేర్పడింది. స్వాతంత్ర్యం వచ్చింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. పత్రిక స్వరూపం, ఆకృతి మారినా ప్రమాణాలలో మార్పులేదు.

పంతులుగారి రోజుల్లో ఆంధ్రపత్రిక కాంగ్రెస్ పత్రిక, ఇప్పుడది ఆంధ్రుల పత్రిక అన్నారు శ్రీ మంతెన వెంకట్రాజు గారు.

1965 జనవరి 24న ఆంధ్రపత్రిక విజయవాడకు తరలివచ్చింది. 1975 నుండి రాజధాని హైదరాబాదు నుండి కూడా మరో ఎడిషన్ ప్రారంభమయినది.

దక్షిణాఫ్రికా నుండి మహాత్మాగాంధీ భారతదేశానికి తిరిగి వచ్చిన రేండేళ్లకు ముందుగానే పంతులుగారు తమ తల్లిగారయిన శ్యామలాంబగారి పేర ప్రాథమిక

పాఠశాలను స్థాపించి అందు హరిజనులకు కూడా ప్రవేశార్హత కలిగించారు. ఎలకుర్రు ఆనాడు అగ్రహారం. పంచములకు ఆ వూరిలో ప్రవేశం నిషిద్ధం. అటువంటి సనాతన సంప్రదాయ నిలయమయిన ఎలకుర్రులో హరిజన బాలురకు ప్రవేశార్హత కలిగించటంతో నాగేశ్వరరావు పంతులు గారు చూపిన సాహసం, సర్వమానవ సమానత్వదీక్ష ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆ పాఠశాలలోనే హరిజన నాయకులు వేముల కూర్మయ్యగారు చదివి అన్ని బహుమతులు అందుకున్నారు.

1917 నవంబరు నెలలో విజయవాడలో ప్రథమ పపంచ మహాసభ తలపెట్టినప్పుడు ఆవరణ దొరకడమే కష్టమయింది. పంతులుగారు సభ జరుపుకొనుటకు మైలవరం హాలుని ఇప్పించడంలోనేకాక, ఆ మహాసభ ప్రతినిధుల భోజనాలకైన ఖర్చునంతా ఆయన భరించినట్లు కూర్మయ్యగారే తెలిపారు (30-8-65). అటువంటి ఉదారపురుషుడు 1932లో ఆంధ్రరాష్ట్ర హరిజన సేవా సంఘానికి అధ్యక్షులు కావడంలో వింతలేదు. గూడవల్లి రామబ్రహ్మంగారు తీసిన తెలుగు చలనచిత్రం "మాలపిల్ల" పంతులుగారికి అంకితం చేశారు. పంతులుగారి అంతిమయాత్రను చిత్రీకరించారు.

పత్రికాప్రకటన, పార్టీ వ్యవహారాలలో నిమగ్నులయిననూ పంతులుగారు సంస్కృతాంధ్రాంగ్ల, హిందీ భాషలలో పరిశ్రమచేసి భగవద్గీతాది సంస్కృత గ్రంథాలకు సమగ్రవ్యాఖ్యానం కావించారు. ఆంధ్రవాఙ్మయ చరిత్ర రచించారు. విజ్ఞానకోశాన్ని ప్రచురించారు. ఆంధ్ర గ్రంథమాల నెలకొల్పి అపూర్వములైన భాషా సాహిత్య గ్రంథాలను పరిష్కరించారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ వారు పంతులు గారికి ఇచ్చిన "కళాప్రపూర్ణ" అన్వర్థనామమయినది.

నాగేశ్వరులు ప్రభవించినది ప్రభవచైత్ర ద్వాదశి 1-5-1867న అస్తమయం బహుధాన్య చైత్రశుద్ధ ద్వాదశి. వారు ప్రభవించి ఆంధ్రదేశాన్ని బహుధాన్యశోభిత మొనర్చారు.

వారు త్యాగి, భోగి, స్వాతంత్ర్య సాధనకు వారొనర్చిన పోరాటం, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి వారుపడ్డ ఆరాటం ఫలించి, పుష్పించాయి. వారు స్థిర సంకల్పులు. దీక్షాదక్షులు. దృఢవ్రతులు. కర్మవీరులు. జ్ఞానయోగులు.

వారిని గూర్చి మహాత్మాగాంధి మొదలయిన ప్రజానాయకులు పట్టిన నివాళి దేదీప్యంగా నేటికీ కాంతి పుంజాలను వెదజల్లుతూనేఉంది.

"వినయ, సత్యాల ప్రత్యక్షరూపమే నాగేశ్వరరావు. వారి స్నేహ సౌభాగ్యాలు నాకు గర్వకారణాలైనవి. ఆర్తులకు అవసరమయినప్పుడు ఆత్మార్పణ చేయగల త్యాగులు.

మా చిరకాల పరిచయంతో నేను ఆయనలో చూచిన గుణమిది. కుడిచేతితో నిచ్చిన సంగతి ఎడమచేతికి తెలియనివ్వదు" అని మహాత్మాగాంధీ 1934 జనవరి 14, హరిజన సేవక్ లో ప్రసంగించారు.

ఆంధ్రపత్రిక స్వాతంత్ర్య సంసిద్ధికి ముందు, స్వాతంత్ర్యోదమ సమయంలో నిర్భయంగా చేసిన మహత్తర సేవ ఒక ఆంధ్రులకే కాదు, ఇతర రాష్ట్రాలలోని అసంఖ్యాక ప్రజానికానీకి తెలుసు. సేవతో, త్యాగాలతో ఔదార్యంతో ప్రజల మనస్సులు చూరగొన్న కొద్దిమంది నాయకులలో దేశోద్ధారక నాగేశ్వరరావుగారొకరు. ఆంధ్రపత్రిక–నాగేశ్వరరావు పంతులుగారు విడదీయరానివి అని మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి పంపిన స్వర్ణోత్సవ సంచికలో పేర్కొన్నారు.

ఆంధ్రదేశంలో ఇంత రాజకీయ చైతన్యం, జ్ఞానదీక్ష, కళాపిపాస ద్యోతకమవుతున్నాయంటే అది దేశోద్ధారకులు స్థాపించిన పత్రికలు పెట్టినదే. నిద్రాణమైవున్న ఆంధ్రజాతిని జాగృతమొనరించినది ఆంధ్రపత్రిక అన్నారు. ముఖ్యమంత్రిగా ఉన్న శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారు. స్వర్ణోత్సవ సంచికకు సందేశమిస్తూ (30-8-1965).

"విశ్వదాత, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు ఒక వ్యక్తి కాదు, ఒక మహాసంస్థ. "ఆంధ్ర" అనే శబ్దం ఆలోచనకు వచ్చినప్పుడల్లా ఆంధ్రపత్రిక వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి పేరు నాకు స్ఫురణకు వస్తుంది" అన్నారు బూర్గుల రామకృష్ణారావు ఆంధ్రప్రదేశ్ అవతరణ సంచికకు ఇచ్చిన సందేశంలో (1-11-1956).

1916లో కలకత్తా కాంగ్రెస్ మహాసభకు డా॥ఎన్.అనిబిసెంట్ అధ్యక్షులు. ఆంధ్రులకు రాష్ట్రం వాంఛనీయమని బాలగంగాధర తిలక్ ప్రతిపాదించారు. భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతం వలన 1-1-1918న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఏర్పడింది. ఆంధ్రపత్రిక, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను చేసిన ఆందోళన ఫలితమే ఆంధరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఏర్పాటు.

ఏతీదృశగుణగణభూషితులయిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారికి, దేశ స్వాతంత్ర్య సిద్ధికి, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రావతరణకు అవిరళ కృషిచేసిన ఆంధ్రపత్రికకు కాంగ్రెస్ శతవార్షిక ఉత్సవాల సందర్భంగా ప్రశంసాఫలకాన్ని ఆంధ్రప్రదేశ్ కమిటీ అందజేస్తున్నది.

# 14. చరిత్రకెక్కిన వ్యక్తి – విశ్వనాథ

వెయ్యి సంవత్సరాల తెలుగు సాహిత్యచరిత్రలో వ్రేళ్లపై లెక్కింపదగిన మహాకవుల శ్రేణిలో విశ్వనాథ వారికి స్థానం ఉంది. సంప్రదాయకవితలోను, ఆధునికకవితలోను కూడ వారిది అందెవేసిన చేయి. 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం', 'వేయిపడగలు', 'నర్తనశాల', 'ఏకవీర', 'కిన్నెరసాని పాటలు' మొదలైనవి తెలుగుభాషా సారస్వతాలున్నంత కాలం ఉంటాయి.

చిన్నతనంలో కలం చేపట్టిననాటి నుండి కన్ను మూసేవరకు వారి మేధ అతినిశితంగానే ఉంది. వారి ఆలోచనే విలక్షణం. భావప్రకటన అంతకంటె వింతై కనిపిస్తుంది. వారు చాల నిర్భీకులు. తాము జీవించి ఉన్న కాలంలోనే శ్రీ సత్యనారాయణగారు చరిత్ర కెక్కిన వ్యక్తి అయినాడు. వారిని పొగిడినా, తెగడినా వారి స్థాయి ఉన్నతమే అయింది.

విశ్వనాథ వారి మాట కరుకు కావచ్చుకాని మనసు వెన్న. ఎంత ఆర్జించినా వారు ధనానికి దాసులు కాలేదు. చేతికి ఎముక లేకుండా వారెన్ని గుప్తదానాలు చేశారో! ఆతిథ్యానికి, ఆదరణ వారిది పెట్టింది పేరు. అసమానమైనది వారి ఆప్యాయత.

తెలుగువారి చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన మహత్తరఘట్టమైన ప్రపంచ తెలుగు మహాసభల సమయంలో వారు మాకు అండగా నిలబడి ఆశీర్వదించి, ఆ మహాసభలలో తాము స్వయంగా పాల్గొని అవి నిర్విఘ్నంగాను, ఎంతో వైభవంగాను జరగటానికి దోహదం చేశారు.

వారిని కవిసమ్రాట్టుగా తెలుగుదేశం చిరకాలం క్రితమే గుర్తించింది. ఆంధ్రవిశ్వవిద్యాలయం "కళాప్రపూర్ణ" పట్టంతో సన్మానించింది. భారత ప్రభుత్వం "పద్మభూషణ్"తో సత్కరించింది. దేశమంతటా అన్ని రాష్ట్రాలలోను, అన్ని భాషలవారు వారిని మహాకవిగా గుర్తించి గౌరవించారు. "జ్ఞానపీఠం" అవార్డు వారికి జాతీయ మహాకవి స్థాయిలో జరిగిన సన్మానం. విశ్వనాథ ఒక వ్యక్తికాదు. వారొక మహాసంస్థ. "రసము వేయిరెట్లు గొప్పది నవకథాధృతిని మించి" అన్న విశ్వాసంతో రసప్రపూర్ణమైన తమ భావనాసంపత్తిని బహుకృతులుగా చేసి తెలుగువారికి బహూకరించి పోయారు.

శ్రీ విశ్వనాథ ప్రచురణల ముద్రణకు 88 వేలు అవుతుంది. అంచనావేసి ప్రభుత్వ సహాయాన్ని కోరారు. 44 వేల రూపాయలు ప్రభుత్వం మంజూరు చేసింది. 2.4.76 తేదీన జైసీస్ వారు విజయవాడలో విశ్వనాథ వారికి సువర్ణపుష్పసమర్పణ మహోత్సవం జరిపారు. ఆ సభలో ప్రభుత్వపక్షాన మొదట దఫా 22 వేలు వారికి అందించాను.

రెండవ దఫాగా 11 వేలు చెక్కు యివ్వడానికి 27.09.76వ తేదీ రాత్రి వారి ఇంటికి వెళ్లాను. భోజనం చేయమన్నారు. దగ్గర కూర్చొని కులాసాగా కబుర్లు చెప్తూతూ భోజనం చేయించారు. వారు చూపిన ఆప్యాయత, చెప్పిన మాటలు నా జీవితంలో మరపురానివి.

కవిసమ్రాట్టును గురించి ఎంత మంది ఎంత చెప్పినా అది తరిగేది కాదు. వారి కథ అల్లాంటిది. వారి కవితాసృష్టి అట్లాంటిది. అయినా ఎవరి అనుభవాలు వారిప్పటికే చాలా మంది అక్కడక్కడ చెప్పారు.

"మీ పరిచయాన్ని పురస్కరించుకొని మీరు విశ్వనాథవారి వ్యక్తిత్వాన్ని తెలియచేసేటట్లుగా ఒక పుస్తకం రాయండి" అని నేను వెనుక శ్రీ జోశ్యుల సూర్యనారాయణ మూర్తి గారికి చెప్పాను. ఆ ప్రేరణతో జోశ్యులవారీ "విశ్వనాథ కథ" రచించి నాకే అంకితమిస్తానని తెచ్చినప్పుడు "అంకితమెందుకు?" అని అడిగాను. వారు "నేనీ కృతి రచించడానికి మీ ప్రేరణే సర్వథా కారణం. ఎప్పుడో "విశ్వనాథ భారతి" రచించి, వారి కవితావిశేషాన్ని స్థూలంగా పరిచయం చేసి సంతృప్తిపడిన నాకీనాడీవిధంగా యీ కృతి నిర్మితి ప్రేరణ యిచ్చిన మీకు కృతిని సమర్పించందే సంతృప్తి ఉండదు" అని వారన్నప్పుడు, కృతి స్వీకారాన్ని కాదనలేక పోయాను. వారికి నా అభినందనలు, కృతజ్ఞతలు.

*(విశ్వనాథ కథ ముందుమాట)*

# 16. కోసూరు పున్నయ్య

భారతదేశ స్వాతంత్ర్య సమరాలు ప్రజలను యెంతో ఉత్తేజపరిచాయి. చైతన్యవంతులను చేశాయి. రాజకీయంగానే కాకుండా వైజ్ఞానికంగా కూడా ఎంతో మంది కళాతపస్వులను తయారు చేశాయి. అట్టివారిలో అభ్యుదయభావాలు గల శ్రీ కోసూరు పున్నయ్య గారొకరు.

1947లో పూనాలో ప్రదర్శించిన, ప్రజాజీవితాన్ని ప్రతిబింబించే "మా భూమి" నాటకంలో "యల్లమంద" పాత్ర ధరించిన శ్రీ కోసూరు పున్నయ్య గారిని గురించి "దో బీఘా జమీన్" అనే చిత్రంలో రైతు పాత్ర ధరించిన ప్రఖ్యాత హిందీ నటుడు శ్రీ బాలరాజ్ సహానీ రాజమండ్రి సభలో మాట్లాడుతూ, "నేను ఆయన పాత్రాభినయాన్ని మించలేకపోయాను ఆయన నాకు మార్గదర్శి" అన్నారు. అఖిల భారతస్థాయిలో ప్రశంసలనందుకొన్న శ్రీ కోసూరు పున్నయ్య సామాన్యుడా!

శ్రీ కోసూరు పున్నయ్య ప్రసిద్ధనటుడుగ, హాస్యరసస్రష్టగ, కవిగ, గాయకుడుగ, భాగవతార్‌గా, యావద్భారతంలో కళారాధకులలో ఒకరని చెప్పడం అతిశయోక్తి కానేకాదు.

శ్రీ కోసూరు పున్నయ్య గారిది శ్రావ్యమైన, మధురమైన కంచు కంఠం. ఆయన రంగస్థలం మీద వీథిభాగవత సూత్రధారుడుగా, బుర్రకథ హాస్యగాడుగా, భిక్షుకకుటుంబాల (పలనాటి చరిత్ర) కథకులుగా, హరికథాగాయకులుగా, బహుముఖ ప్రజ్ఞావంతుడుగా వెలుగొందిన కళాశిల్పి.

శ్రీ కోసూరు పున్నయ్య గారు నటుడుగానే కాక, బాలచంద్రుడు, మగువ మాంచాల, జహ్వర్ బుర్రకథ, మాధవయ్య హరికథ, స్పుత్నిక్ వీథిభాగవతం మొదలగు గ్రంథాలను రచించి రచయితగా పేరొందారు.

అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంలో "దివి సీమ బాలనంద సంఘం" ప్రేరణ వలన "గోరంత దీపం" అనే బాలగేయ కావ్యం రాశారు. సరళ భాషలో బాలల విజ్ఞానానికి, వికాసానికి, వినోదానికి వినియోగ పడేటట్లు రచన సాగించారు. వారికి నా అభినందనలు.

*('గోరంతదీపం' ముందుమాట)*

# 16. పదవులను ఆశించని ప్రజానాయకుడు : రంగాజీ

ఏ పార్టీకి అయినా ప్రజలను ఆకట్టుకోవాలంటే ప్రజా సంక్షేమానికి తగిన ఆశయం, ఆ ఆశయం మీద నమ్మకం, అమలు చేయడానికి సుశిక్షితులైన కార్యకర్తలు ఎంతేని అవసరం. ఆ అవసరాన్ని గుర్తెరిగిన వారిలో ప్రథములు శ్రీ రంగాజీ. నిడుబ్రోలు రైతాంగ విద్యాలయం పేరుతో విద్యార్థులు, యువకులు, రైతులు, స్త్రీలు ఎంతోమంది కార్యకర్తలకు శిక్షణయిచ్చి కాంగ్రెస్ సంస్థను పటిష్ఠంగా నిర్వహించడానికి తోడ్పడినాడు. ఆ రైతాంగ విద్యాలయంలో శిక్షణపొందినవారే నేడు అనుభవజ్ఞులైన నాయకులయ్యారు. వారు ఆంధ్రప్రదేశ్‌లో అన్ని పార్టీలలోనూ వున్నారు. అనేక పదవులలో పనిచేస్తున్నారు.

రంగాగారు స్వతంత్ర ఆలోచనలు ఉన్న వ్యక్తి, స్వాతంత్ర్యం వస్తే కిసాన్‌మజ్దూర్ ప్రజారాజ్యంగా ఉండాలని శ్రీ రంగాజీ నిర్వచనం చేశారు. గాంధీగారితో ఒప్పించారు. ఇప్పటి సర్దుబాటుతనం యువకులుగా శ్రీరంగాగారికి ఉన్నట్లయితే ఎన్నో ఉన్నత పదవులను అందుకొనేవారు పార్లమెంటేరియన్‌గా పెద్ద పేరొందారు. కాని పరిపాలనలో భాగస్వాములు కాలేకపోయారు. 1952లో శ్రీ రాజాజీ మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయినపుడు వారికి ఉపముఖ్యమంత్రి పదవి ఇవ్వడానికి ఆహ్వానించారు. కానీ వారు అంగీకరించలేదు. పదవులకు అర్రులుచాచలేదు. వారు తయారు చేసిన మావంటి వారు ఎన్నో పదవులను అధిష్ఠించారు. వారి శిష్యులు పదవులలో వుంటే ఎంతో ఆనందించే నాయకులు శ్రీ రంగా. వారికి ప్రోత్సాహం ఇచ్చే మహత్తర త్యాగం గలవారు. శ్రీ రంగాజీ ఎవ్వరు పదవిలో వున్నా చూచి ఆనందించేవారు. వారిని ప్రోత్సహించేవారు. అటువంటి పెద్దలు రాజకీయాలలో వుండుట అరుదు. పనిచేసే కార్యకర్తలంటే వారికి ఎంతో ఆప్యాయత. వారికి ఉత్సాహం ఇస్తారు. పనిచేయని నాయకులంటే వారికి గిట్టదు. ఉత్సవ విగ్రహాలులాగా తయారు అయ్యారు అనేవారు పని చేయని వారిని కూడా పనిచేయించడానికి ఉత్సాహపరిచే శక్తి శ్రీ రంగాజీలో వుంది. అందుకనే వారు ఆర్గనైజర్లకు ఆర్గనైజరుగా పేరొందారు.

ఆప్యాయంగా పలుకరించడం, యోగక్షేమాలు అడిగి తెలుసుకోవడం చేస్తున్న కార్యక్రమాలను గురించి ప్రశ్నించడం, సలహాలు ఇవ్వడం శ్రీ రంగాజీ నిత్యమూ

చేసేపని. అందుకనే ఆంధ్రప్రదేశ్‌లో వేలాది మంది అభిమానులు కలిగిన మహా నాయకుడుగా శ్రీ రంగాజీ వున్నారు.

వారిలోని నీతి, నిజాయితీలు, ఇతరుల ఎడ వారు చూపే ఆప్యాయత, అనురాగము, వారి త్యాగమయ జీవితమును ఆంధ్రప్రదేశ్‌లో ఎవ్వరూ మర్చిపోలేరు. ఉన్నతపదవులు అధిష్ఠించిన అనేక మందిని ప్రజలు మర్చిపోవచ్చు. కాని ఏ పదవీ చేయకపోయినా రంగాజీని ప్రజలు మర్చిపోరు. మర్చిపోలేరు. ప్రజల హృదయాలను హత్తుకున్న ప్రజానాయకుడు రంగాజీ. ఆంధ్రప్రదేశ్‌లో ఆంధ్రకేసరి ప్రకాశంగారి తర్వాత అంతటి మహనీయుడు శ్రీ రంగాజీ.

శ్రీ రంగాజీ ఆశీస్సులతో రాజకీయాలలో పెరిగిన మావంటి కార్యకర్తలకు వారు ఆదర్శప్రాయులు. వారు ఇచ్చిన రాజకీయ శిక్షణే మాకు శ్రీ రామ రక్ష.

భారత జాతీయ కాంగ్రెస్ శతవార్షికోత్సవాల సందర్భంగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘం శ్రీ రంగాగారి 86వ జన్మదినోత్సవము నవంబర్ 7వ తేదీన హైద్రాబాదు గాంధీభవన్, ప్రకాశం హాలులో జరుపుట ఎంతేని ఆనందకరం.

# 17. కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి
# కల్యాణకల్పవల్లి

శ్రీ పాపయ్య శాస్త్రిగారూ!

పదాలకు రంగూ, రుచీ, వాసనా ఉన్నాయన్నాడు శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారు. మీ వంటి వారి పద్యాలను చదివితే వాటితోపాటు లాలిత్యం అన్నమాటను కూడా చేర్చాలి. మీరు వ్రాసిన ప్రతి పద్యంలోను తెలుగు పలుకుల్లోని లాలిత్యానికి పదిలమైన గుడి కట్టారు. మీ పద్యం కంఠతా రాని పదేళ్ల పిల్లవాడెవడూ లేడంటే అతిశయోక్తిలేదు. మధురగాయకుడు ఘంటసాల మీ పద్యాలను తెలుగునాట అమరం చేశాడు. ఆయన పాడిన పుష్పవిలాపాన్ని స్మరించుకుంటే చాలు, ఇప్పటికీ ఒళ్ళు పులకరిస్తుంది. ఆయన గొంతులోని మాధుర్యం, మీ కలంలోని కారుణ్యం, ఒక అనిర్వచనీయమైన లాలిత్యంతో కూడుకొన్న సన్నివేశం అది. ఇంత అందంగా, లలితంగా, మీరు తెలుగు పద్యాలను తీర్చడానికి కారణం ఏమిటి అని ఆలోచిస్తే నాకు ఒకటి అగుపిస్తుంది. మీరు తెలుగు సాహిత్యంలోని అంతశ్శక్తిని సంపూర్ణంగా సాక్షాత్కరింపచేసికొన్నారు. తెలుగు సాహిత్యంలోని అంతశ్శక్తి కంటే లాలిత్యంతో పెనవేసికొన్న మాధుర్యం. మీ ఆ సాక్షాత్కారానికి సంకేతమే ఈ కమనీయ కావ్యసంకలనం. కల్యాణ కల్పవల్లి.

"నన్నయ్య తిక్కన్నలు కూడా కవులేనా?" అనేవారు, "అసలు ఇంక వరకూ తెలుగులో కవిత్వం పుట్టనేలే" దని చాటి చెప్పుతున్న మహానుభావులూ ఉన్నారు ఈ రోజుల్లో. వీరిని చూచి, త్యాగయ్యగారిని మనస్సులో ఒకసారి స్మరించుకోవాల్సిందే. ఈ ఆధునిక కవిపుంగవుల ప్రభావం అభం, శుభం తెలియని కొందరు యువరచయితల మీద బాగా పడుతోంది. అలాంటివాళ్లకు మన ప్రాచీనసాహిత్యం గొప్పతన మేమిటో విశదీకరించాల్సిన బాధ్యత ప్రతి పెద్దవారికీ ఉంది. "సంప్రదాయాన్ని తిరస్కరించే వాడెవడూ ఏ క్రొత్తదనాన్ని సృష్టించలేడు" అన్న మాట ఈ రోజుల్లో చాలమంది మరచిపోతున్నారు. ప్రపంచవ్యాప్తంగానే ఆధునికకవిత్వానికి కవాటాలు తెరచిన శ్రీ టి.ఎస్.ఎలియట్ "సంప్రదాయం ప్రతిభ" అన్న అంశాల గురించి కూలంకషంగా చర్చిస్తూ సంప్రదాయంలోని గొప్పతనాన్ని ఎలుగెత్తిచాటారు. వ్యక్తి ప్రతిభకు

సంప్రదాయం సొనరాయి అన్నారు. నిజం చెప్పాలంటే తమ సంప్రదాయాన్ని తమ జాతి చరిత్రను గుర్తించుకొని గౌరవించుకోలేని వారిని ముందు తరాలవారు క్షమించరు.

ప్రస్తుతం ఏర్పడ్డ ఈ విచిత్రపరిస్థితిలో మీ ఈ "కల్యాణ కల్పవల్లి" లాంటి కావ్యసంకలనాలు, చాలా విలువైనవి. సామాన్యమైన భాషాపరిచయం మాత్రమే ఉన్నవారికి, తెలుగు సాహిత్యంతోటి సమగ్రమైన పరిచయం ఏర్పడటానికి ఈ సంకలనాలు రాజమార్గాల్లాంటివి. ఒకమారు ఈ సంకలనాన్ని చూచి నాలుగు పద్యాలు చదివారంటే చాలు, మొత్తం సాహిత్యాన్నే చదవాలన్న అభిరుచి ఏర్పడుతుంది. అలాంటి అభిరుచిని ఏర్పరచడమే ఏ సంకలనానికైనా నిజమైన సార్థక్యం.

ప్రాచీనసాహిత్యంలోని ఆణిముత్యాలను, అనర్ఘరత్నాలను ఇలా ఒక చోట ఏర్చి కూర్చడమనేది కత్తిమీద సాములాంటిది. ఏ మాత్రం అజాగ్రత్త కలిగినా, అన్ని విధాలా అపాయమే. సాహిత్యతత్త్వదర్శనంతోపాటు, సాహిత్యశక్తి ఏ చోట నిక్షిప్తమై ఉందో గుర్తించి, నలుగురికీ అందుబాటులోకి తేగలిగే ప్రదర్శన సామర్థ్యం కూడా ఉండాలి. ఆ దర్శనం, ప్రదర్శనం ముడిపడినవారు మీరు. తెలుగులో ఎన్నో కావ్య సంకలనాలు వెలువడినప్పటికీ, మీ సంకలనంతో సాటిరాగలిగేవి చాలా తక్కువే ఉంటాయి. విద్వత్తు, విదగ్ధత, విజ్ఞత అన్న మూడు త్రివేణీసంగమంలా కలిసిపోయి ఈ సంకలనానికి దారితీశాయి అంటే అతిశయోక్తి కాబోదు.

ప్రాచీనకావ్యాల్లోని ప్రసిద్ధపద్యాలతోపాటు, చాటువులు, చమత్కారపద్యాలు వగైరా వాటిని కూడ ఇక్కడ చేర్చడం చాలా సమంజసంగా ఉంది. దైనందిన ప్రార్థన కుపయోగించే దేవతాస్తుతులను కూర్చడం మరింత సముచితంగా ఉంది. ఇవన్నీ ఒక ఎత్తు. చివరలో మీరు చేర్చిన సంక్షిప్తమైన రసవద్ఘట్టాలు ఒక ఎత్తు. ప్రాచీనసాహిత్యం లోని చక్కటి నాటకీయమైన ఘట్టాలను ఇలా కూర్చడం బాగుంది. కేవలం ముక్తకాలను చదివామన్న అనుభవం కాకుండా, రసమయమైన సన్నివేశాలను చదివామన్న ఆనందం, అందమైన ఏ చిన్న కథనో చదివిన అనుభవం వీటి పఠనంవల్ల సిద్ధిస్తోంది. అందుకే అన్నాను- విద్వత్తు, విదగ్ధతలతోపాటు విజ్ఞత అన్నదికూడ కలిసి, త్రివేణీసంగమమై ఈ సంకలనానికి దారి తీసింది అని...

ఇంత విలువైన కానుకను నాకు ఇస్తున్నందుకు కృతజ్ఞతలు తెలియజేస్తూ, దీన్ని స్వీకరించే భాగ్యం నాకు కలిగినందుకు ఆనందిస్తున్నాను.

# 18. మానవతావాది - ఇందిరాగాంధి

భారతజాతి సమైక్యతకు ప్రాణత్యాగము చేసిన మహామనీషి ఇందిరాగాంధీ జన్మించిన రోజు నవంబరు 19.

తుఫానువచ్చి బందరు, దివికోస్తా ప్రాంతాలలో 100 గ్రామాలుతుడిచి పెట్టి, 10,000 మందిని పొట్టన పెట్టుకొన్న ఉప్పెన 8 సంవత్సరముల క్రితము ఇదే రోజున సంభవించింది.

మానవతావాది అయిన ఇందిరాగాంధీకి ఈ మారణహోమం ఎంతో వేదన కలిగించింది.

జలప్రళయం వార్త విన్నారు. నవంబరు 26వ తేదీ విమానంలో హైదరాబాదు వచ్చి కారులో నాగార్జున సాగర్ మీదుగా గుంటూరువచ్చి. అతివృష్టి వలన, తుఫాను వలన నష్ట పడిన పేదలవాడలను సందర్శించారు. రాత్రి గుంటూరులో ఉండి 27 ఉదయము తుఫాను దెబ్బతిన్న ప్రాంతాలను చూచుకుంటూ బందరు వచ్చి మధ్యాహ్నం 3 గంటలకు పులిగడ్డ అక్విడక్టుకు వచ్చారు. అచ్చట వారికి నేను స్వాగతంచెప్పి సెంట్రల్ బ్యాంక్ వ్యానులో ఎక్కించాను. వాన్‌లో శ్రీ అంజయ్య, రాజమల్లు, మదన్‌మోహన్, నేను ఉన్నాము. వెనుక సీటులో కూర్చున్నాము. ముందు సీటులో శ్రీమతి ఇందిరాగాంధీ కూర్చుని వున్నారు. వ్యాను బయలు దేరింది. సరాసరి భావదేవరపల్లి గ్రామమునకు వెళ్ళినాము, పెద్ద ఊరులో ఇండ్లు తుడిచిపెట్టుకుని పోయిన దిబ్బపై నిలబెట్టి ఎలా గ్రామాలు కొట్టుకుపోయినాయో చూపినాను. సుదూరములోవున్న సముద్ర తీర గ్రామాలను చూపాము. ఎంతో విచారవదనంతో "ప్రజలకు ఎంత కష్టము వచ్చింది" అన్నారు. ఆ గ్రామంలో 20 అడుగుల నీరు ప్రవహించిన ఎలక్ట్రిక్ స్తంభాలు, తాడిచెట్లపైన ఉన్న గుర్తులను చూపినాను. ఇండ్ల కప్పులపై ఎక్కి ఎలా బ్రతికింది బాధితులు చెప్పినారు. ఒక సహాయసంస్థ దుప్పట్లను పట్టుకొని వచ్చినారు. ఆ దుప్పట్లను ఆమె చేతితో బాధితులకు అందచేయించినాను. దేవాలయము దగ్గర గుమికూడిన స్త్రీలు, పురుషులను పరామర్శించినారు, ట్రాన్స్‌పోర్టు కార్పోరేషను, భారత సేవాశ్రమ సంఘంవారు గ్రామాలలోని ప్రజలకు దేవాలయంలో వంటలుచేసి పెడుతున్నారు. వారు వచ్చి కలుసుకున్నారు.

భావదేవరపల్లి, వక్కపట్లవారిపాలెం గ్రామాల మధ్య సెంట్రల్ ఛానల్ వెంటరోడ్డు 5 కిలోమీటర్ల దూరం ఇండ్లకప్పులతో, వేళ్ళతో లేచిపోయిన చెట్లతో, పశుకళేబరాలతో రోడ్డుపై రెండు మూడు గజాల ఎత్తున పడివున్నాయి. అప్పటికి నాలుగురోజుల నుండి రోడ్డు అంతా క్లియర్‌చేస్తూ వున్నారు. పోలీసులు, రాజమండ్రి జైలులోవున్న ఖైదీలు చెత్తాచెదారాలను లాగివేస్తుంటే సింగరేణి కాలరీస్ నుండి వచ్చిన కార్మికులు, విజయవాడ మున్సిపల్ సిబ్బంది, బొగ్గుతో శవాలను, కళేబరాలను కంప మీద పెట్రోల్ జల్లి కాల్చివేస్తున్నారు. పొగలతో, మంటలతో, శ్మశానముగా తయారయిన 4 కిలోమీటర్ల దూరం ఆమె ప్రయాణం, ఆమె వానులో వాసనకు ముక్కుమీద గుడ్డ పెట్టుకొని, కళ్ళవెంట నీరుకార్చుతూ చేసిన ప్రయాణం చారిత్రాత్మకమైనది. బిడ్డలను కోల్పోయిన తల్లిలాగా తల్లడిల్లిపోయింది.

రోడ్డుమీద చెత్త చెదారం తొలగిస్తూ మృతకళేబరాలను దహనం, ఖననంచేస్తూ ఉన్న పోలీసులు, సెంట్రల్ జైలు ఖైదీలు ఆమె వాను ఆపి తాము చేస్తున్న సేవలను తెలియచేసినారు. “చాలా మంచి పనులు చేస్తున్నారు. ఇటువంటి సమయంలో సేవచేయటమే అదృష్టంగా భావించాలి” అని అన్నారు. ఖైదీలు ఎంతో సంబర పడ్డారు. అలాగునే దహన ఖనన కార్యక్రమాలను చేస్తున్న విజయవాడ మునిసిపల్ సిబ్బంది, సింగరేణి కార్మికులు, అనేకమంది సంఘ సేవకులు ఆమె వాను ఆపి దర్శించుకొని సంతోషపడ్డారు. వారు చేస్తున్న కార్యక్రమాలు ఉత్సాహంగా, పట్టుదలగా చేయటానికి ఆమె దర్శనం తోడ్పడినది.

నాగాయలంకలోని బాధితుల సహాయ కేంద్రం చూడటానికి తీసుకొని వెళ్లినాను. ఆమె వస్తున్నారని తెలుసుకొని వేలాదిమంది వచ్చారు. సెంటరు అంతా జలప్రళయాన్ని మరచిపోయి జన ప్రవాహంతో నిండిపోయింది. శ్రీ రేమాల వెంకటేశ్వర్లుగారి మేడ ఎక్కించాము. బాధితులకు సానుభూతి తెలుపుతూ కష్టము వచ్చినపుడే ధైర్యంగా ఉండాలని శ్రీమతి ఇందిరాగాంధీ బాధితులను ఓదార్చుతూ అన్నారు.

అచటనుండి అవనిగడ్డ బయలుదేరినాము. దారిలో పొలాలలో పనిచేస్తున్న కూలీలు, గ్రామాలలో పడి పోయిన ఇండ్లలో సామానులను బయటకు లాగుతున్న స్త్రీలు ఎంతో మంది ఇందిరాగాంధీని చూచుటకు రోడ్డుమీదకు పరిగెత్తుకొని వచ్చినారు. దారిలో నేను మంత్రిపదవికి రాజీనామా చేసినాను అన్నాను. ఎందుకు అని ప్రశ్న వేశారు. సేవచేయటానికి అన్నాను. పదవిలో ఉండికూడా సేవ చేయవచ్చుకదా అన్నారు.

అమ్మ వచ్చింది అంటూ, భావదేవరపల్లి వెళ్ళి తిరిగి వచ్చేసరికి అవనిగడ్డ గాంధీక్షేత్రము జనముతో కిక్కిరిసిపోయింది. మా ఇంటిలో జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రసంగిస్తూ ఇంత ప్రళయం, విశేష నష్టం నేనెప్పుడూ చూడలేదన్నారు. సేవా కార్యక్రమాలలో రాజకీయాలకు తావివ్వకూడదని అన్నారు. గాంధీ క్షేత్రం కేంద్రముగా వేలాదిమంది బాధితులు ఉన్నారు. వారికి భోజన వసతులు ఏర్పాటుచేస్తాము. వారిని పరామర్శచేసి గాంధీక్షేత్రంలో జరిగిన సభలో ప్రసంగించారు. రాజకీయాలకు తావులేకుండా సేవాకార్యక్రమాలను నిర్వహించాలని విజ్ఞప్తి చేసారు. వచ్చిన కష్టాలను ధైర్యంగా ఎదుర్కోవాలని బాధితులను కోరారు. బంధువులు పోయి, ఆస్తులు సర్వస్వము కోల్పోయిన బాధితులకు ఇందిరాగాంధీ ఓదార్పు ఎంతో ఉపశమనం కల్గించింది. ఆమె ఉన్నంతసేపు బాధను మరచిపోయారు.

కష్టాలలో వున్న ప్రజలను ఓదార్చటం ఇందిరాగాంధి విధిగా తలచేది. ఆమెను చూడగానే ఆమెచూపిన సానుభూతికి బాధలలోనున్న ప్రజలకు కొంత ఉపశమనం కలిగింది. దేశంలో ఎచట ఎక్కువగా ప్రజలకు కష్టనష్టాలు కలిగితే ఇందిరాగాంధీ అచట ఉండేవారు. బెల్చిలో జరిగిన ఘోర హత్యాకాండకు గురిఅయిన హరిజనులను పరామర్శ చేయటానికి ఏనుగులమీద ప్రయాణముచేసి, నడచివెళ్ళి చూసివచ్చారు. పదవిలో వున్నాలేకపోయినా ఆమె మానవతాదృక్పథముతో వెళ్ళి పరామర్శించేవారు. సహాయకారిగా నిలబడేవారు. నిజమైన మానవతావాది ఇందిరాగాంధీ.

దివి సీమ పర్యటన ఆమె హృదయాన్ని కలచివేసింది. ఎలావున్నారో ఏ విధముగా పునరావాసము చేయబడినదో చూద్దామని 2.9.78లో మరల వచ్చారు. దీనినిబట్టి బాధితులంటే వారికి ఎంత సానుభూతో తెలుస్తుంది.

మొదట బాధలో వున్న ప్రజలకు సానుభూతిని తెలియజేయడానికి, తరువాత పునరావాస కార్యక్రమాల అమలు, బాధితులు ఎలావున్నారో చూడడానికి రెండుమార్లు ఇందిరాగాంధీ దివి సీమకు వచ్చారు. దేశస్వాతంత్ర్యాన్ని సాధించి భారత జాతి సమైక్యతకు ప్రాణాలు త్యాగంచేసిన మహాత్మాగాంధీజీ పేరిట గాంధీ క్షేత్రాన్ని నెలకొల్పి సేవాకార్యక్రమాలను అమలుజరుపుకొంటున్నాము. జాతీయ, అంతర్జాతీయ, ప్రాంతీయ సేవాసంస్థలకు అనేక మంది సంఘ సేవకులకు సహాయ కార్యక్రమాలకు సమన్వయ కేంద్రంగా గాంధీ క్షేత్రం రూపొందింది. గాంధీజీ అనుచరులు శ్రీ ప్రభాకర్‌జీ సమన్వయకర్తగా పనిచేశారు. గాంధీజీ కోడలు శ్రీమతి నిర్మలా గాంధీ, మనుమడు

కనూగాంధీ, మనుమరాలు శ్రీమతి ఆభాగాంధీ గార్లు రెండుమార్లు వచ్చి కార్యక్రమాల నిర్వహణలో ఉత్సాహాన్నిచ్చారు. భారతదేశ ఆర్థికాభివృద్ధికి ముఖ్యంగా పేదప్రజల అభ్యున్నతికి, వారిజీవనోపాధిని పెంపొందించే 20 సూత్రాల ఆర్థిక పథకమును అమలుజరుపుతూ భారతదేశ సమైక్యతకు ప్రాణాలర్పించిన ఇందిరాగాంధీ రెండుమార్లు గాంధీ క్షేత్రములో మా సేవాకార్యక్రమాలను చూచి ప్రోత్సాహమిచ్చారు.

# 19. 'ఆంధ్రుల అభిమాన నాయకుడు' శ్రీ సంజీవరెడ్డి

ఆంధ్రుల సంస్కృతి సముద్ధరణకు ఆంధ్రజాతి పురోభివృద్ధికి ప్రత్యేక రాష్ట్రము కావాలనే వాంఛ 1913 మే నెలలో బాపట్లలో జరిగిన ప్రధమాంధ్ర మహాసభలో ప్రారంభించింది.

ఆంధ్రోద్యమ జననముతోపాటు అనంతపురం జిల్లా ఇల్లూరు గ్రామములో 1913 మే 19వ తేదీన శ్రీ నీలం సంజీవరెడ్డిగారు జన్మించారు. ఆంధ్రోద్యమముతోపాటు శ్రీ సంజీవరెడ్డిగారు కూడా దిన దిన ప్రవర్ధమానమై నేడు ఆంధ్రులకు సహజమైన అభిమాన నాయకుడయినారు.

సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన శ్రీ సంజీవరెడ్డి సామాన్య ప్రజల శ్రేయస్సు చేకూర్చేది యెలాగున అని ఆలోచిస్తూ వుండేవారు. ఒక వైపున ఆంధ్రోద్యమము ఉధృతంగా సాగుతున్న రోజులవి. శ్రీ సంజీవరెడ్డిగారు అనంతపురం కళాశాలలో విద్య నభ్యసిస్తూ వున్నారు. భారత స్వాతంత్ర్యోద్యమములో గాంధీజీ నాయకత్వము వహించిన తర్వాత నూతన యుగము ప్రారంభమయినది. లోకోత్తర మహత్తర సత్యాగ్రహ పద్ధతిని స్వాతంత్ర్యోద్యమము నడుపుటకు నిర్ణయించి భారత ప్రజలకు గాంధీజీ పిలుపునిచ్చారు. స్వతంత్ర భావాలు, సామాన్య ప్రజల శ్రేయస్సాధన దృష్టి వున్న శ్రీ సంజీవరెడ్డిగార్కి గాంధీజీ పిలుపు నూతన ఉత్సాహాన్ని, నవసందేశాన్ని యిచ్చినట్లయింది. భారత స్వాతంత్ర్య సాధనే ప్రధానమని యెంచి బానిస విద్యావిధానాన్ని త్యజించి శ్రీ సంజీవరెడ్డిగారు జాతీయోద్యమములో పాల్గొన్నారు.

విద్యార్థులను, యువకులను సంఘటితపరచి జాతీయోద్యమానికి అండగా నిలిచారు. కాంగ్రెస్ ఉద్యమాలలో చేసిన నిర్విరామకృషి ఫలితంగా 25 సంవత్సరాలైనా నిండకమునుపే 1938లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా యెన్నుకోబడినారంటే కాంగ్రెసు కార్యక్రమాలలో యెంత వుత్సాహంగా, పటుత్వంగా పనిచేశారో తేటతెల్లము కాగలదు. అప్పటినుంచి 1946 వరకు రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా ఉండి ఆంధ్రదేశములో కాంగ్రెసు సంస్థను పటిష్ఠంచేశారు.

1940లో వ్యక్తిగత సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. జైలునుండి విడుదల కాగానే మరల ప్రభుత్వముడిటెన్యూగా నిర్బంధించి 1942లో

కారాగారమునుండి విడుదల చేశారు. 1942 ఆగస్టులో బొంబాయిలో జరిగిన చరిత్రాత్మకమైన అఖిల భారత కాంగ్రెసు సమావేశమునకు వెళ్ళి చర్చలలో పాల్గొన్నారు. ఆగస్టు విప్లవానికి నాంది అయిన క్విట్ యిండియా తీర్మానాన్ని ఆమోదించిన యీ సమావేశములో పాల్గొని తిరిగి వస్తుండగా రైలులోనే ఆరెస్టుచేసి డిటెన్యూగా నెల్లూరు జైలుకు తీసుకొని వెళ్ళారు. అచటి నుండి మధ్యప్రదేశ్‌లోని అమరావతి జైలుకు తీసుకొని వెళ్ళారు. ఆగస్టు తీర్మానానంతరం దేశములోని కాంగ్రెసు నాయకులంతా అరెస్టు కాబడిరి. కాంగ్రెసు కార్యకర్తలను నానా హింసలు పెట్టారు. కాంగ్రెసు సంఘాలు నిషేధించబడినాయి. కాంగ్రెసు కార్యాలయాలను మూసివేశారు. కాంగ్రెసును అణగద్రొక్కటానికి బ్రిటిషువారు అనేక విధాల కృషిచేశారు. ఎన్ని చేసినా ప్రజలలో రగుల్కొన్న విప్లవాన్ని ఆర్పలేకపోయింది. ప్రజావిప్లవానికి ప్రభుత్వం లొంగిపోక తప్పిందికాదు. 1945లో కాంగ్రెసు నాయకులను విడుదల చేసింది. జైలు నుండి విడుదల కాగానే కాంగ్రెసు సంఘాలను పునర్జీవింపచేయటానికి శ్రీ సంజీవరెడ్డిగారు నిశ్చయించుకొన్నారు. ఏలూరులో కాంగ్రెస్ వాదులంతా సమావేశమై కాంగ్రెసు సంఘము నిషేధములో వుండుటవలన కాంగ్రెసు అసెంబ్లీ అనే పేరుతో క్రొత్త సంఘాన్ని యేర్పాటు చేశారు. కాంగ్రెసు ఆసెంబ్లీకి శ్రీ సంజీవరెడ్డిగారు ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయినారు. తన భుజస్కంధాలపై బడిన యీ కార్యభారాన్ని నిర్వహించుటకు ఆంధ్రప్రదేశమంతా నిర్విరామంగా పర్యటన చేశారు. అన్ని ప్రాంతాలలో మరల కాంగ్రెసు సంస్థను పటిష్ఠము చేశారు.

1947లో అనంతపురం నియోజక వర్గమునుండి మద్రాసు శాసన సభకు అఖండ విజయముతో ఎన్నుకోబడినారు. మద్రాసు శాసనసభా కాంగ్రెసు పార్టీ కార్యదర్శిగా నియమింపబడినారు.

13-6-1949వ తేదీన చీరాలలో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సర్వసభ సమావేశములో ఆచార్య రంగాగారితో అధ్యక్ష పదవికి పోటీచేశారు. కొద్ది ఓట్ల తేడాతో ఓడిపోయినప్పటికీ ఆచార్య రంగాగారితో సహకరించి కాంగ్రెసు సంస్థను బలపరచటానికి తోడ్పడినారు. భారత రాజ్యాంగ సభ్యుడుగా ఎన్నుకోబడినారు. 1949లో శ్రీ కుమారస్వామి రాజాగారి మంత్రివర్గములో మధ్య నిషేధ మంత్రిగా నియమించబడి సామాన్య ప్రజల శ్రేయస్సుకు ఉపయోగపడే మధ్యనిషేధ చట్టాన్ని కట్టుదిట్టంగా అమలు జరిపి పరిపాలనాధ్యక్షుడనిపించుకొన్నారు. చేతిలో అధికారాన్ని వదులుకొని అనధికార సంస్థ నాయకత్వానికి యెవరైనా అంగీకరిస్తారా? మంత్రి పదవికి రాజీనామా చేసి సంస్థలోనికి రావటానికి సంజీవరెడ్డిగారు నిశ్చయించుకొన్నారు.

11-4-1951వ తేదీన జరిగిన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నికలో శ్రీ రంగాగారితో పోటీచేసి 5 ఓట్ల మెజారిటీతో అధ్యక్షులుగా యెన్నుకోబడినారు. అధ్యక్షపదవి స్వీకరించిన వెంటనే శ్రీ రంగాగారి సహాయాన్ని అర్థించారు.

ప్రజాస్వామిక యుగములో యెన్నికలు జరగటం, పోటీ చేసుకోవటం సహజం. అభిప్రాయ భేదాలుండ వచ్చు. పోటీలు చేసుకోవచ్చు. కాని యెన్నికలయిన వెంటనే అందరు కలిసి మెలసి పనిచేసుకోవడమే ప్రజాస్వామ్యానికి ప్రధానమైన సూత్రం. రంగావర్గానికి కార్యవర్గములో సగము స్థానాలు యిస్తామని శ్రీ సంజీవరెడ్డిగారు ప్రకటించి సహకారాన్ని కోరారు. ఈ వుత్తమమైన సూచనకు శ్రీ నెహ్రూహర్షామోదాలు తెలిపారు. ప్రజలంతా సంతోషించారు. అయినా శ్రీ రంగాగారు, ప్రకాశముగారు సమేతంగా కాంగ్రెసు నుంచి విడిపోయి ప్రజాపార్టీని పెట్టారు.

వారు విడిపోయినప్పటికీ అంతా కలిసి పనిచేసుకోవాలని అనేక మార్లు శ్రీ సంజీవరెడ్డిగారు ప్రయత్నించారు. అఖిల భారత కాంగ్రెస్ వ్యవహారాలలో శ్రీ నెహ్రూ, టాండన్ గార్లకు వచ్చిన అభిప్రాయ భేదాలు భారతదేశానికి ఒక క్లిష్ట సమస్యగా పరిణమించినవి. అప్పుడు శ్రీ నెహ్రూ నాయకత్వానికి ఒక సవాలుగా పరిగణించారు. భారతదేశానికి శ్రీ నెహ్రూ నాయకత్వమే శరణ్యమని శ్రీ సంజీవరెడ్డిగారు ప్రప్రథమముగా ప్రకటించి భారత దేశములో ఆదర్శ ప్రాయులైనారు. అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులుగా, పార్లమెంటరీ బోర్డు సభ్యులుగా చాలాకాలము పనిచేశారు. 1952 యెన్నికలలో కాంగ్రెసులో వచ్చిన అభిప్రాయ భేదాలు మూలంగా కాంగ్రెస్ ఓడిపోయింది. 27-2-1952 తేదీన చిత్తూరులో జరిగిన ప్రదేశ్ కాంగ్రెసు సర్వసభ్య సమావేశములో శ్రీ సంజీవరెడ్డిగారు రాజీనామా చేసి కాంగ్రెసు నుంచి చీలిపోయిన వారినందరినీ ఆహ్వానించారు.

4-5-1952వ తేదీన జరిగిన సర్వసభ్య సమావేశంలో శ్రీ సంజీవరెడ్డి గారు యేక గ్రీవంగా ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా యెన్నుకోబడినారు. 26-12-1952 వ తేదీన మరల యేకగ్రీవంగా యెన్నుకోబడి, 26-12-1953 వరకు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా కృషిచేశారు.

### ఆంధ్ర రాష్ట్ర అవతరణ

1953 అక్టోబరు 1వ తేదీన ఆంధ్రరాష్ట్రం అవతరించింది. భారత దేశములో కెల్లా మొట్ట మొదటి భాషా రాష్ట్రము. ఈనూతన రాష్ట్ర నడవడికపైనే భాషా రాష్ట్రాల

భవిష్యత్తు ఆధారపడియున్నది. 141 మందిగల ఆంధ్ర అసెంబ్లీలో 41 మంది మాత్రము కాంగ్రెసు శాసన సభ్యులు. ఆంధ్ర రాష్ట్రానికి మొదటిలోనే గవర్నరు పరిపాలన తప్పదనుకున్నారు.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ సంజీవరెడ్డిగారిపై యీక్లిష్ట పరిస్థితిని పరిష్కరించే బాధ్యతపడింది. కాళహస్తి నియోజకవర్గము నుంచి అఖండ విజయముతో ఆంధ్ర శాసనసభకు యెన్నుకోబడినారు. ఏవిధముగానైనా ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని యేర్పాటుచేయాలని శ్రీ సంజీవరెడ్డిగారు నిర్ణయించుకున్నారు. ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశము పంతులుగారిని ముఖ్య మంత్రిగా వుండమని ఆహ్వానించారు. హైకమాండ్‌తో అంగీకరింపచేసి శ్రీ ప్రకాశముగారి నాయకత్వాన ప్రభుత్వాన్ని ఏర్పాటుచేశారు. శ్రీ సంజీవరెడ్డిగారు ఉపముఖ్యమంత్రిగా ఆంధ్రప్రభుత్వ రథసారథ్యాన్ని చేపట్టారు. ఆంధ్ర రాష్ట్రములో గవర్నరు పరిపాలన తప్పించిన శ్రీ సంజీవరెడ్డిగారి రాజనీతిజ్ఞతను ఆంధ్రప్రజలు కొనియాడారు. అనేక అతిక్లిష్ట సమస్యలు శ్రీ సంజీవరెడ్డిగారి కార్యదక్షత వలన పరిష్కారమయినాయి. మూడోవంతు సభ్యులుగాగల కాంగ్రెసుపార్టీ నాయకత్వమువహించి ప్రభుత్వాన్ని నడపగలిగిందంటే శ్రీ సంజీవరెడ్డిగారి విజ్ఞతయే కారణము.

ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష్యపదవికి శ్రీ సంజీవరెడ్డిగారిని ఆహ్వానించి అధ్యక్షులుగా చేశారు. ప్రభుత్వానికి ఒకవైపు లోటుబడ్జెట్టుఅయినా రెండవవైపు ప్రజోపయోగ్యమైన అభివృద్ధి కార్యక్రమాలు అమలుజరపవలసి వచ్చినది. శ్రీ సంజీవరెడ్డిగారు కేంద్రములో తనకున్న పలుకుబడిని వినియోగించి కావలసిన డబ్బును, అప్పుగాతెచ్చి పనులు చేయించారు.

కృష్ణాఆనకట్ట దెబ్బతిని కృష్ణా డెల్టా పంటకు పూర్తిగా దెబ్బతినేపరిస్థితి యేర్పడింది. వెంటనే శ్రీ సంజీవరెడ్డిగారు పట్టుదలగా పనిచేసి కృష్ణాబ్యారేజి నిర్మాణాన్ని మొదలు పెట్టించారు. నందికొండ, వంశధార, తుంగభద్ర యెగువ కాల్వల నిర్మాణానికి, గౌతమి, పెన్నా, తుంగభద్ర నదులపై వంతెనలు కట్టించడానికి 141 మైనర్ ఇర్రిగేషన్ స్కీములు అమలుజరపడానికి, రాళపాడు స్వర్ణముఖి దిగువసగిలేరు మొదలగు చిన్నప్రాజెక్టులు కట్టించడానికి శ్రీ సంజీవరెడ్డిగారు కృషిచేసి పంచవర్ష ప్రణాళికలో చేర్పించినారు. వరద నిరోధస్కీములకు 12 కోట్ల రూపాయలు కేటాయించారు. బుడమేరు డైవర్షన్ స్కీము ప్రారంభించబడింది.

ఆంధ్ర రైతాంగము, శ్రీ సంజీవరెడ్డిగారు నీటివనరుల విషయమై చూపినశ్రద్ధకు సర్వదా ధన్యవాదాలు అర్పించింది.

13 నెలల పరిపాలనలో నవ్యాంధ్ర రాష్ట్రాన్ని అభ్యుదయ మార్గములో నడిపించి ఆంధ్రులు పరిపాలనాదక్షులని పేరు తెచ్చారు. మధ్యనిషేధ సమస్యపై ప్రభుత్వము ఓడిపోయింది. వెంటనే రాజీనామాచేసి ఎన్నికలు జరుపవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని శ్రీ సంజీవరెడ్డిగారు కోరారు. ఎన్నికలు వచ్చాయి, లోక్ పార్టీని, ప్రజాపార్టీని కాంగ్రెస్‌తో సహకరించవలసిందిగా ఆహ్వానించారు. ఐక్య కాంగ్రెసుగా అభ్యర్థులను పెట్టారు. కాంగ్రెసు అఖండవిజయాన్ని సాధించింది. కాంగ్రెసు పార్టీ నాయకుని ఎన్నిక వచ్చింది. భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షుని సలహానుసరించి శ్రీ గోపాలరెడ్డి గారిని పార్టీ నాయకుడుగా శ్రీ సంజీవరెడ్డిగారే స్వయంగా ప్రతిపాదించి, మరొకసారి తన విజ్ఞతను ప్రపంచానికి చూపారు.

విశాలాంధ్ర సత్వర నిర్మాణము కావాలని శ్రీ సంజీవరెడ్డిగారి ఆశయము. ఫజులాలీ కమీషను 5 ఏండ్ల తరువాత ఆంధ్ర-తెలంగాణా యేర్పాటు కావాలన్నారు. విశాలాంధ్ర నిర్మాణానికి కమీషను చేసిన యీ సూచన శాశ్వతము కాగలదని సత్వర విశాలాంధ్ర నిర్మాణమే ఆంధ్రప్రజల అభిప్రాయమని ఢిల్లీలోని కాంగ్రెస్ అగ్రనాయకులకు తెలియజేశారు. ఆంధ్ర ప్రజల అభీష్టాన్నీ ఆందోళనను తెలియజేసి విశాలాంధ్ర నిర్మాణానికి కృషి చేశారు. ముక్కోటి ఆంధ్రుల కోర్కెననుసరించి 1956 నవంబరు 1వ తేదీన "ఆంధ్రప్రదేశ్" పేరుతో విశాలాంధ్రను యేర్పాటు చేయడానికి కేంద్ర ప్రభుత్వము అంగీకరించింది.

మొట్టమొదటిగా కర్నూలు నగరంలో 21-10-56 తేదీన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ పార్టీ సమావేశమై శ్రీ సంజీవరెడ్డిగార్ని పార్టీ నాయకునిగా యెన్నుకొంది, 1956 నవంబరు 1వ తేదీన ప్రప్రథమ ముఖ్యమంత్రిగా శ్రీ సంజీవరెడ్డిగారు ప్రమాణ స్వీకారముచేశారు. నాటినుంచి ఆంధ్రప్రదేశ్ పురోభివృద్ధికి నిర్విరామ కృషి చేస్తున్నారు. ఆంధ్రా - తెలంగాణా సమైక్యతను సాధిస్తున్నారు" బస్సుల జాతీయా కరణ. పరిపాలన వికేంద్రీకరణ, పాఠ్యపుస్తకాల జాతీయాకరణ, భూస్వామ్య సంస్కరణలు మొదలగు అనేక సంస్కరణలను ప్రవేశపెడుతున్నారు. ప్రజలలో కలిసిమెలసి ప్రజా సమస్యలను పరిష్కరిస్తూ ఆంధ్రులకు అభిమాన నాయకుడు అయినారు.

సామాన్య కుటుంబంలో జన్మించి సామాన్య ప్రజల పురోభివృద్ధికి సోషలిస్టు సమాజ స్థాపనే ఆశయంగా నిర్విరామ కృషి చేస్తున్న శ్రీ సంజీవరెడ్డి గారికి 46వ జన్మదినోత్సవ సందర్భముగా ఆంధ్రప్రజల "జేజే"లు.

# 20. నేనెరిగిన సంజీవయ్య

**51** సంవత్సరాల వయసులోనే శ్రీ డి. సంజీవయ్య గారి అకాల మరణం చూస్తే, "దేవుడు ప్రేమించే వ్యక్తులు యౌవన ప్రాయంలోనే చనిపోతార"నే సామెత నాకు గుర్తొస్తుంది. శ్రీ సంజీవయ్య, అందరి ప్రేమాభిమానాలు చూరగొనడమే కాకుండా, ఆయన మంచితనం, బడుగు బలహీనవర్గాల ప్రజల పట్ల ఆయనకు గల విడదీయలేని బంధం ద్వారా దేవుని ప్రేమకు కూడా ఆయన పాత్రుడయ్యారు. సాధారణ గ్రామీణ ప్రాంతం నుండి వచ్చి, జీవితంలో ఎన్నో ఆటుపోట్లను తట్టుకుంటూ పైకెదిగిన వ్యక్తి శ్రీ సంజీవయ్య. జాతీయ ప్రాముఖ్యత గల అన్ని పదవులను నిర్వహించిన వ్యక్తి అతను. రాష్ట్ర మంత్రిగా, రాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్ర మంత్రిగా, జాతీయ పార్టీలలో అతి పెద్దదైన భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్షునిగా పనిచేశారు. గొప్ప ఖ్యాతి గడించిన రాజకీయ నాయకుడాయన. అజాత శత్రువుగా, మృదుస్వభావిగా, మర్యాదస్తునిగా మెలగడమే కాకుండా, అతని దగ్గరకు వచ్చిన ప్రతి వ్యక్తితో పార్టీల కతీతంగా చాలా హుందాగా వ్యవహరించేవారు. చాలా చిన్న వయసులోనే అనేక ఉన్నత పదవులు అలంకరించిన శ్రీ సంజీవయ్యను చూసి మిగతా వారు అసూయపడిన సందర్భాలు కూడా వున్నాయి.

ఆయన ఉన్నత గుణగణాల పట్ల గౌరవ భావం కల్గిన నాకు ఆయనతో సన్నిహిత సంబంధముండేది. పార్టీలోగాని, ప్రభుత్వంలోగాని అత్యంత బాధ్యతాయుతమైన పదవులు నిర్వహించునపుడు ఆయన ఓ ప్రత్యేక శైలితో పనిచేసి, ప్రజల మనసుల్లో చిరస్మరణీయ స్థానాన్ని సంపాదించారు. అతని గుణగణాలతో సరిపోల్చదగిన వ్యక్తి ఎవరూ నాకు తారసపడలేదు. అందరితో కలిసి మెలసి ఉంటూ, తాను ఎన్నుకున్న మార్గాన్ని విడిచిపెట్టేవారు కాదు. ఏదైనా పరిస్థితిని చక్కదిద్దాల్సి వచ్చినప్పుడు, దానిని చాలా నిక్కచ్చిగా, దృఢ చిత్తంతో చేసేవారు. రాజకీయ జీవితంలో, అనునిత్యమూ అతని మనసెరిగి ప్రవర్తిస్తూ ఉండేది ఆయన ధర్మపత్ని శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య. ఆమె హైదరాబాద్ లాంటి కాస్మోపాలిటాన్ నగరంలో సంస్కారవంతమైన కుటుంబంలో

జన్మించినప్పటికీ, సంజీవయ్య గారి రాజకీయ జీవితంలో, తన పూర్తిస్థాయి సహాయ సహకారాలందించడం, సంజీవయ్యకు దక్కిన అదృష్టమనే చెప్పాలి.

అందరితో నిర్మొహమాటంగా, ఉన్నది ఉన్నట్లుగా కుండబద్దలుకొట్టి మాట్లాడటం సంజీవయ్య గారి నైజం. నాయకత్వం పట్ల, పార్టీ అధిష్ఠానం పట్ల ఆయనకు గల విధేయతను ఎవరూ ప్రశ్నించలేరు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా, సమర్థవంతమైన పనితీరుతో మంచి పరిపాలన అందించారు.

శ్రీ సంజీవయ్య బహుముఖీన ప్రజ్ఞ కల్గిన వ్యక్తి. ఆయన ఆడగలరు, పాడగలరు. ఇంకా చాలా ఇతర పనులు చేయగలరు. మానసికానందాన్నిచ్చే సంగీత సాహిత్య చిత్రకళలతో ఆయన విడదీయరాని బంధముండేది. తెలుగు సాహిత్యంలో ఆయన చేసిన కృషికీ, సాహిత్యరంగంలో ఆయనకు చాలా మంచి పేరుంది. అనేకసార్లు అసెంబ్లీలో ప్రత్యర్థులు వేసే ప్రశ్నలకు సమాధానాలు చెప్పేటప్పుడు, ఏదైనా ప్రత్యేకమైన విషయం అందరి దృష్టికి తెచ్చే సందర్భంలో, ఆయన ఆశువుగా కవిత్వం, పద్యాలు చెప్తూ, శాసనసభ్యులను అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేసేవారు. ఆయన తెలుగు కవిత్వంలో మంచి ప్రావీణ్యాన్ని సంపాదించారు. తన అభిమానులచే తెలుగు పద్యాలను వల్లెవేయించేవారు. సమాజంలోని తోటి మానవుల సమస్యలపై ఆయనకు ఎంత పరిజ్ఞానమున్నదో, పురాణాలపై కూడా అంతే పట్టు ఉండేది.

శ్రీ సంజీవయ్య స్వతాహా హరిజనుడైనప్పటికీ, దళితుల సంక్షేమం పట్ల చాలా ఆసక్తి ఉన్నప్పటికీ, ఆయన ఏనాడూ కూడా అత్యుత్సాహంతో వారి సంక్షేమానికి అత్యంత ప్రాధాన్యత నివ్వలేదు. ఆయన రాజకీయ జీవితంలో ఎల్లప్పుడూ వారికి సహాయం చేసేందుకు ప్రయత్నించారు కానీ, పరిపాలనా ప్రక్రియలో కేవలం ఒత్తిడి చేయడం వల్లే వారి సంక్షేమానికి పెద్దపీట వేయాలనేది సరైన మార్గం కాదని ఆయన గట్టిగా నమ్మేవారు. బడుగు బలహీన వర్గాలకు సహాయం చేసే ప్రయత్నంలో, ఆయన ఇతర కులాలను కూడా కలుపుకునేవారు. అణగారిన వర్గాల సంక్షేమానికి సంబంధించి, ఆయన ఎటువంటి విమర్శలకు తావివ్వలేదు. అంత్యక్రియల నిమిత్తం అతని పార్థివ దేహాన్ని ఢిల్లీ నుండి హైదరాబాద్‌కు తీసుకొని వచ్చినప్పుడు, ఆయనకు కడసారి వీడ్కోలు చెప్పడానికి లక్షలాది ప్రజలు తరలిరావడం, ఆయన గొప్పదనానికి సాక్ష్యంగా నిలిచింది. అతని సన్నిహితుల హృదయాల్లో ఆ జ్ఞాపకాలు ఇప్పటికీ కదలాడుతూనే ఉన్నాయి. వాస్తవానికి ఆయనలో బలహీనత ఉంది. అదేమిటంటే ఆయన అమితంగా ఇష్టపడే వ్యక్తులు, వారు సరైన మార్గంలో పయనించకపోయినా, వారిని చేరదీసేవారు.

ప్రజా సమస్యలపై ఇతరులతో ఆయన తీవ్రంగా విభేదించినప్పటికీ, ఆయనకు వ్యక్తిగతంగా ఎవరిమీద అసూయగాని, ద్వేషంగాని ఉండేది కాదు. ఎవరితో శత్రుత్వం లేకుండా వ్యవహరించేవారు. భారతదేశం గర్వించదగ్గ అరుదైన అతి కొద్దిమంది రాజకీయ నాయకులలో శ్రీ సంజీవయ్య ఒకరు. ఆయన మరణించిన వెంటనే ఆయన గురించి మాట్లాడవలసి వచ్చినపుడు, నేను ఆయనను 'భారతదేశ ఆణిముత్యం'గా, 'దక్షిణ భారత అంబేద్కర్'గా అభివర్ణించిన సంగతి నాకిప్పటికీ గుర్తే. ఆయన అకాల మరణం భారతదేశానికే కాకుండా, బడుగు బలహీన వర్గాలకు కూడా తీరని నష్టం కల్గించింది. మంచి రాజనీతిజ్ఞుడు, చురుకైన రాయబారి, మంచి పేరు ప్రఖ్యాతులు గడించిన పెద్ద మనిషి అయిన శ్రీ సంజీవయ్య మన మధ్యలో లేకపోయినప్పటికీ, ఆయన ఉన్నత విలువలతో కూడిన జీవితం, ఆయన సత్ప్రవర్తన ప్రజలందరికీ మార్గదర్శనం చేయగలదు. ఆయన సిద్ధాంతవాద రాజకీయ నాయకుడు కాదు. ఆయన తాను చేపట్టిన పనిని సఫలీకృతం చేయడంలో, గొప్ప ధైర్య సాహసాలు ప్రదర్శించే ఆచరణాత్మక రాజకీయవేత్త. అతని సూత్రాలను అనుసరించడం తప్ప, ఇలాంటి గొప్ప భరతమాత పుత్రునికి అంతకంటే మంచి నివాళి మనమేమి అర్పించగలం!

# 21. కాం[గెసు స్వరాజ్య ఉద్యమాలకు జీవగఱ్ఱ శ్రీ బారు రాజారావు

శ్రీ మోతీలాల్ నెహ్రూ అలహాబాదులోని తమ స్వంత సౌధాన్ని కాంగ్రెసుకు ఇచ్చివేశారు. స్వరాజ్య ఉద్యమాలన్నింటికి కేంద్రమగుటచే ఆ భవనం స్వరాజ్య భవనమని పేరొందింది. భారత జాతీయ కాంగ్రెసు కేంద్ర కార్యాలయము స్వరాజ్య భవనములోనే పనిచేస్తూ వుంది. స్వరాజ్య ఉద్యమాలకు కార్యక్రమాలకు పథకాలను తయారు చేయుట, ఆదేశాలిచ్చుట, కాంగ్రెసు అగ్రనాయకుల సమావేశాలు, సందేశాలను దేశ ప్రజలకు అందజేయుటలో స్వరాజ్య భవనమే కేంద్రముగా వర్థిల్లినది.

అఖిల భారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా మంచి పేరు ప్రతిష్ఠలను, పలుకుబడిని సంపాదించిన ఆంధ్ర భీష్మ న్యాపతి సుబ్బారావుగారు, మేధా సంపత్తి గల ఒక యువకుని ఏరి, కోరి తీసుకొని వెళ్ళి, ఈ కార్యక్రమాల నిర్వహణకు స్వరాజ్యభవన్‌లో బాధ్యతలు అప్పజెప్పారు. ఆ యువకుడే శ్రీ బారు రాజారావు. అప్పుడే కలకత్తా విశ్వవిద్యాలయంలో బి.ఏ (ఆనర్సు) చదువుకొని జాతీయభావములతో దేశభక్తుడుగా తయారవుతున్న సునిశిత మేధాసంపన్నుడు. వారి చాకచక్యాన్ని కార్యనిర్వహణ పటుత్వాన్ని గుర్తించి ? కార్యాలయాన్ని నిర్వహించే బాధ్యతలను అప్పజెప్పారు. కొలదికాలంలోనే కాంగ్రెసు కార్యాలయాన్ని ప్రభుత్వ కార్యాలయ ఫక్కీలో తీర్చిదిద్దారు. కార్యక్రమాల సర్క్యులర్లను తయారు చేయడం, తీర్మానాల డ్రాఫ్టులను తయారుచేయడంలో మంచి సమర్థుడనిపించుకున్నారు.

రాజారావే ఒక కార్యాలయం అని శ్రీ మోతీలాల్ అన్నారు. "కాంగ్రెసు కార్యాలయ నిర్వహణలో సహాయ కార్యదర్శిగా సమర్థవంతంగా కృషిచేసినట్లు" శ్రీ బారు రాజారావును ప్రశంసిస్తూ 1928 కలకత్తా కాంగ్రెసులో సమర్పించిన వార్షిక నివేదికలో ఆనాటి జాతీయ కాంగ్రెసు కార్యదర్శులైన శ్రీ జవాహరులాల్, శ్రీ సుభాష్ చంద్రబోస్ పేర్కొన్నారంటే శ్రీ రాజారావు ఎంత సమర్థులో తెలుస్తుంది. "స్వరాజ్య ప్రభుత్వానికి దేశీయాంగ కార్యదర్శి శ్రీ రాజారావు" అని శ్రీ రాజాజీ ప్రశంసించారు. జాతీయోద్యమ అగ్రనాయకుల ప్రశంసలను అందుకొన్న జాతిరత్నం శ్రీ రాజారావు.

1917 నుండి 1934 వరకు కాంగ్రెసు కేంద్ర కార్యాలయంలో అనేక స్థాయిలలో పనిచేసి కార్యదర్శి పదవిని అందుకొన్నారు.

వయస్సులో పిన్న, ఆలోచనలో పెద్ద. ఆచరణలో మిన్నగా పేరొందారు. బ్రిటీషు ప్రభుత్వాన్ని ఎదుర్కోవడానికి నిర్వహిస్తున్న కాంగ్రెసు ఉద్యమాలను చైతన్యపూరితం చేయాలంటే కాంగ్రెసు కార్యాలయం ఎంత సమర్థవంతంగా నిర్వహించాలో యోచించండి. అటువంటి కీలకమైన పాత్రను కాంగ్రెసు కేంద్ర స్థానంలో నిర్వహించినవారు శ్రీ రాజారావు.

శ్రీ రాజారావు నర్సాపురంలో 17-9-1888న ఒక ఉన్నత కుటుంబంలో జన్మించారు. నర్సాపురం, పెద్దాపురం, కాకినాడ పాఠశాలలో విద్యనభ్యసించి రాజమండ్రి కళాశాలలో చేరారు. రాజమండ్రిలో బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసమువిని దేశభక్తుడుగా మారిపోయారు. తరువాత కలకత్తా విశ్వవిద్యాలయములో చదువుకొన్నారు. 1905లో బెంగాలు విభజన ఆందోళనలో పాల్గొన్నారు. 1917లో కాంగ్రెసు కేంద్ర కార్యాలయం స్వరాజ్య భవన్‌లో చేరారు.

1930లో శాసనోల్లంఘనము చేసిన శ్రీ మదన్ మోహన్ మాలవ్యా, శ్రీ ఎం.ఎ. అన్సారీ, శ్రీ విఠల్‌బాయ్ పటేల్‌లతో శ్రీ రాజారావు వున్నారు. 1931లో శ్రీ సర్దార్ వల్లభాయి పటేల్‌తో బొంబాయి, అహ్మదాబాద్, బార్డోలీ ఉద్యమాలలో పనిచేసి జైలుకు వెళ్ళారు. 1932లో సబర్మతీ జైలులో డిటెన్యూగా వున్నారు. 1935లో అస్వస్థులై స్వరాజ్య భవన్‌లో తమ బాధ్యతలను వదలుకొని స్వస్థానమైన రాజమహేంద్రవరము విశ్రాంతి కొరకు వచ్చారు.

1937లో రాజమండ్రి నుండి మద్రాసు శాసనసభకు కాంగ్రెసు అభ్యర్థిగా నిలబడి అత్యధిక మెజారిటీతో ఎన్నుకోబడ్డారు. కలకత్తాలో చదువుచున్నప్పుడు రామకృష్ణ పరమహంస బోధనలచే ఆకర్షింపబడ్డారు. బ్రహ్మానంద స్వామీజీ, శారదామాయిగార్లతో సన్నిహితంగా వుండి రామకృష్ణ పరమహంస బోధనలను బాగా తెలుసుకున్నారు. శ్రీ బారు రాజారావు బెంగాలీ భాషలో అనర్గళంగా మాట్లాడేవారు. బెంగాలీ ఉద్యమంతో సంబంధం ఉండటం, కలకత్తాలో చదువుకొనడం వలన శ్రీ సుభాష్ చంద్రబోస్ అన్నట్లు శ్రీ రాజారావు ఆంధ్రుడనేకంటే బెంగాలీవాడంటేనే అందరికీ బాగా తెలుసును. అందుచే శ్రీ రాజారావుకు ఆంధ్రప్రదేశ్‌లో పెద్దగా ఎరుకలేదు. రాజమండ్రిలో కొంతవరకు తెలుసును. భారతజాతి పెద్దల నోటిలో నాలుకలాగా పేరుపొందిన శ్రీ రాజారావు 1938 జూన్ 8న రాజమండ్రిలో చనిపోయారు. పిన్న వయస్సులో జాతీయోద్యమాలను నడిపించే మేధాసంపన్నుడిని కోల్పోవడం ఆంధ్రులకు దురదృష్టకరము.

## 22. రాజకీయాలలో అదృష్టవంతుడు అనగాని

**1952** అసెంబ్లీ ఎన్నికల ముందు కాంగ్రెస్ పార్టీ చీలిపోయింది. ప్రకాశంగారు ప్రజాపార్టీని, రంగాగారు కృషికార్‌లోక్ పార్టీనీ స్థాపించి ఎన్నికలలో దిగారు. అనేక ఉద్యమములు నడిపి త్యాగాలతో కమ్యూనిస్టు పార్టీవారు ప్రజల ప్రాబల్యాన్ని సంపాదించి, కాంగ్రెస్ చీలికను ఉపయోగించుకొని అసెంబ్లీలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో, ఆంధ్ర ప్రాంతంలో ఎక్కువ సీట్లను సంపాదించుకొన్నారు. 1953 అక్టోబర్ 1వ తేదీ ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం వచ్చింది. కర్నూలులో ఆంధ్రరాష్ట్ర నూతన మంత్రివర్గమును ఆంధ్రుల అభిమాన నాయకుడు ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం నాయకత్వాన ఏర్పడింది. శ్రీ సంజీవరెడ్డిగారు ఉపముఖ్యమంత్రిగా ఉన్నారు. 1954లోనే ప్రకాశం మంత్రివర్గం పెత్తనమైంది. 1955 అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్ వాదులంతా ఐక్యమయినారు. ప్రకాశంగారి ప్రజాపార్టీ రంగాగారి లోక్‌పార్టీ కాంగ్రెసుతో కలిసి ఐక్యకాంగ్రెస్ పార్టీగా పోటీచేసి అత్యధికమెజారిటీ అసెంబ్లీసీట్లను గెలుచుకొన్నారు.

రేపల్లె అసెంబ్లీ నియోజక వర్గానికి లోక్‌పార్టీ మద్దతులో శ్రీ అనగాని భగవంతరావు కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి కమ్యూనిస్టు అగ్ర నాయకులు శ్రీ మాకినేని బసవపున్నయ్యగారిని ఓడించడంతో శ్రీ భగవంతరావు రాష్ట్ర వ్యాప్తంగా పేరొందినారు. వెనుకబడిన వర్గాలలో న్యాయవాదిగా పేరు ప్రతిష్ఠలను పెంచుకొన్నారు. 1957లో పార్లమెంట్ ఎన్నికలు వచ్చాయి. మచిలీపట్నం పార్లమెంట్ నియోజక వర్గమునకు కాంగ్రెస్ అభ్యర్థిగా నన్ను శ్రీ సంజీవరెడ్డిగారు సెలక్షన్ చేశారు. మచిలీపట్నంలో పేరు పొందిన న్యాయవాది, మంచి పలుకుబడి కలిగిన శ్రీ ఎలమంచిలి నాగభూషణంగార్ని అన్ని పార్టీలు కల్సి స్వతంత్ర అభ్యర్థిగా పోటీ పెట్టి కృషిచేశాయి. కాంగ్రెస్‌లో కొన్ని వర్గాలు నాకు వ్యతిరేకంగా చేసినా, శ్రీ భగవంతరావుగారిపై ఎక్కవ వత్తిడి చేసినా శ్రీ భగవంతరావు నన్ను బలపర్చి గెలిపించుటకు కృషి చేశారు. ఏడు వేల ఓట్ల మోజారిటో నేను కాంగ్రెస్ అభ్యర్థిగా గెలిచాను.

1957 డిసెబర్‌లో గుడివాడలో కృష్ణాజిల్లా పంచాయితీ రాజ్య మహాసభ జరుగుతున్నది. సభకు నేను అధ్యక్షత వహిస్తున్నాను. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి

ప్రారంభోత్సవం చేయనున్నారు. ఆ రోజు ఉదయం విజయవాడ నుండి కారులో శ్రీ సంజీవరెడ్డి, శ్రీ బ్రహ్మానందరెడ్డి, మధ్యలో నేను వెళ్తున్నాము. శ్రీ సంజీవరెడ్డిగారు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. గన్నవరం సమీపంలో "ఏం కృష్ణా భగవంతరావు పార్లమెంట్ ఎన్నికలలో ఏమి చేశారు? అని అడిగారు. ఎన్ని ఒత్తిడులు వచ్చినా కాంగ్రెస్‌ను బలపర్చారు అన్నారు. "ఏం బ్రహ్మం లోక్‌పార్టీ తరపున మంత్రి వర్గంలో స్థానం ఇవ్వాలని కాంగ్రెస్ అధ్యక్షులు పదేపదే చెప్తున్నారు. భగవంతరావుకు ఇస్తే ఎలా వుంటుం"దని అన్నారు. "బాగానే వుంటుంద"ని శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు చెప్పారు. "కృష్ణా శ్రీ భగవంతరావుతో మాట్లాడు" అని శ్రీ సంజీవరెడ్డిగారు అన్నారు.

అవనిగడ్డ వెళ్ళి శ్రీ భగవంతరావుగారికి కబురుచేశాను. మా సోదరులు శ్రీ మండలి సుబ్రహ్మణ్యంగారితో కలిసి శ్రీ భగవంతరావు అవనిగడ్డ వచ్చారు. జరిగింది చెప్పాను. ఎంతో సంతోషించినారు. ముఖ్యమంత్రికి విశ్వాసంగా వుండాలని చెప్పాను. తప్పనిసరిగా అని శ్రీ భగవంతరావు అన్నారు.

ప్రకాశం బ్యారేజి ప్రారంభోత్సవానికి శ్రీ సంజీవరెడ్డిగారు వచ్చారు. శ్రీ భగవంతరావును శ్రీ సంజీవరెడ్డిగారి దగ్గరకు, తీసుకొని వెళ్లినాను. రేపు హైద్రాబాద్ రమ్మన్నారు. తెల్లవారే సరికి శ్రీ భగవంతరావు మంత్రిగా నియమితులైనారని ప్రకటన. కారులో శ్రీ భగవంతరావు గారితో కలిసి హైద్రాబాద్ వెళ్లి నియో మైసూరు కేఫ్‌లో 11 నెంబర్‌లో వున్నాం. శ్రీ సంజీవరెడ్డిగారితో ఫోనులో మాట్లాడినాము, మధ్యాహ్నం ఇంటికి రమ్మన్నారు. ఈలోగా శ్రీ గౌతు లచ్చన్న గారి దగ్గరకు చెప్పి వస్తానని వెళ్లారు. "నీవెవ్వరు మంత్రి వర్గంలో చేరడానికి పార్టీ అనుమతి అక్కర్లేదా? అని తీవ్రస్వరంతో మాట్లాడి చేరడానికి వీల్లేదని చెప్పా"రన్నారు. మరి ఎలా అన్నాను. "చేరడానికి నిశ్చయించుకొన్నాను" అన్నారు.

శ్రీ సంజీవరెడ్డిగారు ఉన్న గ్రీన్ లాండ్స్‌కి వెళ్లినాము. "భగవంతరావూ నీకు చిన్న పోర్టు ఫోలియో, చిన్నతరహా పరిశ్రమశాఖ ఇస్తున్నాను, దాన్ని జాగ్రత్తగా నిర్వహించుకో, మంచి అభివృద్ధిలోనికి వెళ్తావు. నేను కూడా ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఎక్సయిజ్ నిర్వహించినాను. అనుభవం వస్తుంది అన్నారు. సరేనని తిరిగి హోటల్‌కు వచ్చి రాజభవన్‌కు వెళ్లాము. రాజభవన్‌లో ప్రమాణ స్వీకారం అయిపోయింది. చిన్నతరహా పరిశ్రమలతో పాటు, దేవాదాయశాఖను కేటాయించారు. లేక్‌వ్యూ గెస్ట్ హౌస్‌కు వెళ్లినాము. ఆ పరిస్థితులలో ఆశ్చర్యకరంగా తలవనితలంపుగా వచ్చిన ఈ పదివిని చూసి శ్రీ భగవంతరావే నమ్మలేక "కృష్ణారావూ నేను మంత్రి అయ్యానంటారా?"

అని అన్నారు. ఇంకా అనుమానమెందుకు సంపూర్ణ అధికారాలతో ఇప్పుడు నీవు మంత్రివి అన్నాను. సాయంత్రం ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగార్ని కలుసుకొని కృతజ్ఞతలు తెలియచేశాం.

వారు, నేను ఆత్మీయంగా 25 సంవత్సరాలు కలసి రాజకీయాలలో పనిచేసినాము. శ్రీ సంజీవరెడ్డి గారు ఆశీర్వదించినట్లు శ్రీ భగవంతరావు చిన్నశాఖ నుండి అత్యంత కీలకమైన ఆర్థికశాఖ వరకు మంత్రి బాధ్యతలు నిర్వచించినారు. అనారోగ్యంగా వుందని తెలిసి నాల్గయిదుసార్లు నా మిత్రులు శ్రీ చక్రపాణి తదితరులతో కలసి విజయనగర్ కాలనీలోనికి వారి ఇంటికి వెళ్లిచూశాను. తర్వాత బాగా సుస్తీ చేయటం వలన మహవీర్ ఆస్పత్రికి వెళ్లి రెండుమూడుసార్లు చూసినాము. 1986 జనవరి 27న ఆసుపత్రికి వెళ్లి కడసారి చూసి కన్నీళ్లతో శ్రద్ధాంజలి ఘటించవలసి వచ్చింది. ఒక ఆప్తమిత్రుడిని, ఒక సన్నిహిత సహచరుడిని కోల్పోయినందులకుఎంతో బాధపడినాము. ధైర్యముగా నిర్మొహమాటంగా మాట్లాడే వ్యక్తి. కోస్తా ప్రాంతంలో బలహీన వర్గాలకు కొండంత అండ శ్రీ భగవంతరావుగారు. వారు లేకపోవడం బహుజనులకు తీరని లోటు.

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | మత్స్యపరిశ్రమ - మత్స్యపారిశ్రామికులు | 483 |
| 2. | వెనుకబడిన తరగతుల సంక్షేమం | 488 |
| 3. | భూ సంస్కరణలు - వాటి ఆవశ్యకత | 497 |
| 4. | ఆత్యయికపరిస్థితిలో అమోఘమైన ఒక ఏడాది | 503 |
| 5. | ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు | 508 |
| 6. | సాంఘికసంక్షేమం- హరిజనోద్ధరణం | 511 |
| 7. | అవినీతిని నిరోధించడం ఎలా? | 514 |
| 8. | సాంఘిక విప్లవము- అనివార్యము | 522 |
| 9. | కాంగ్రెసు శిబిరం, నాగార్జునసాగర్ ప్రస్తుత సమస్యలు: కొన్ని పరిష్కార మార్గాలు | 526 |
| 10. | సాంఘిక సంస్కరణలు- సమైక్యత | 537 |
| 11. | బస్సు రవాణా జాతీయం | 543 |
| 12. | సాంఘిక సమైక్యానికి మత, వర్ణాంతర వివాహాలు | 547 |
| 13. | పంచాయతీ రాజ్య వ్యవస్థ - గ్రామీణాభివృద్ధి | 550 |
| 14. | ఆంధ్రప్రదేశ్ సమైకత్యతపై అవనిగడ్డ నియోజకవర్గ ప్రజలకు విన్నపము | 556 |

# 1. మత్స్యపరిశ్రమ - మత్స్యపారిశ్రామికులు

జలసంపదను అర్థికాభివృద్ధికి వినియోగపరచటమే మత్స్యపరిశ్రమ.

మానవులకు కావలసిన ఆహారపదార్థాలు ఉత్పత్తికి మూలమైన సేంద్రియ పదార్థాలు నేలమీద, నీటిలో కూడా ఉత్పత్తి అవుతాయి. నీటిలో జీవించే చేపలుగా, రొయ్యలుగా యీ సేంద్రియపదార్థాలు రూపొంది మానవకోటికి ముఖ్యపోషక పదార్థమైన మాంసకృత్తులను సమకూరుస్తున్నాయి.

అనాదిగా అసంపూర్ణ ఆహారంతో బాధితులైన భారతీయులకు, పుష్కలంగా పోషకపదార్థాలు సమకూర్చే ఆహారపదార్థమైన చేపల విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహించడం ఎంతైనా అవసరం. ఆ కారణంగా నేటి సామ్యవాదవ్యవస్థలో, సామాన్య జనులకు చవుకగా లభించే పోషక ఆహారమైన చేపలను అందుబాటులోకి తెచ్చేందుకు ప్రాముఖ్యమిచ్చే మత్స్య పరిశ్రమాభివృద్ధి ప్రణాళికాచరణకో ధ్యేయమవ్వాలి.

మత్స్యపరిశ్రమ వనరులు మూడు విభాగాలు. అవి ఆంధ్రప్రదేశ్‌లో విస్తారంగా ఉండటం ఒక ప్రత్యేకత అనే చెప్పాలి. పశ్చిమకోస్తా రాష్ట్రాలకు ఫలవంతమైన సముద్ర మత్స్యపరిశ్రమ వనరులున్నప్పటికీ, మంచి నీటి వనరులు చెప్పుకోతగ్గవిలేవు. తూర్పు తీరంలోని బెంగాల్, ఒరిస్సా రాష్ట్రాల్లో మంచినీటి చేపల అభివృద్ధికి వనరులు వున్నప్పటికీ, సాగరప్రాంత అభివృద్ధికి అవకాశాలు తక్కువనే చెప్పాలి. నిజానికి ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలకు సముద్రమత్స్య పరిశ్రమ లేనేలేదు. అదృష్టవశాత్తు ఆంధ్రప్రదేశ్‌కు మత్స్యపరిశ్రమకు అవసరమైన మూడు రకాల వనరులూ విస్తారంగా ఉన్నాయి. సర్వదా నీరు నిల్వ ఉండేవి. చాలా కాలం ఉండేవి ఎన్నో చెరువులు, పెద్ద సాగరాలు, రిజర్వాయర్లు, కృష్ణా, గోదావరిలాంటి నదీనదాలు మత్స్యపరిశ్రమాభివృద్ధికి అవకాశం కల్పిస్తున్నవి. మన రాష్ట్రానికి 1000 కిలోమీటర్ల పొడవుగల సముద్రతీరంలో ప్రాథమిక సర్వే ప్రకారం మన సముద్రప్రాంతంలో అమితంగా రొయ్యలు దొరికే ప్రాంతాలు, ఎక్కువగా సుదుములు, గారసలు, చందువలు, వంజరాలు, గులివిందలూ దొరికే ప్రాంతాలూ కలవని తేలింది. తీరప్రాంతం పొడుగునా వేలాది ఎకరాలు అవరించుకొన్న ఉప్పుకయ్యలు, తంపరలూ మత్స్యపరిశ్రమ అభివృద్ధికి విస్తృత

అవకాశం కల్గిఉన్నవి. ఇంత అవకాశం ఉన్న నీటివనరులు మన రాష్ట్రానికి ఆర్థికాభివృద్ధికి, పోషక ఆహార అభివృద్ధికి అనంతమైన అవకాశం కలుగజేస్తున్నవి.

ఉత్పత్తి పెంచడం, దాన్ని సమంగా వినియోగించటం అనే రెండు విధాలుగా అభివృద్ధి ఆధారపడిఉంది. వ్యవసాయంలాగే చెరువులలోను, మంచినీటి వనరుల్లోను చేపల పరిశ్రమ అభివృద్ధి చేయడానికి ఒక అదుపులో ఉత్పత్తి సాధనకు అవకాశం ఉంది. అడవుల సంపదను వినియోగపరిచేవిధంగానే సముద్ర మత్స్యపరిశ్రమ కూడా సక్రమవినియోగమే. చాలాకాలం ఉత్పత్తి సాధనకు వీలు కలిగిస్తుంది. ఉప్పుల నీటి వనరులు తంపరలలో చేపల అభివృద్ధికి పైరెండు మార్గాలు ఉపయోగమైనవి. అభివృద్ధిసాధనలోని సాంకేతికవిషయాలు ప్రత్యేకంగా వివరించబడింది.

అభివృద్ధి సాధించిన తరువాతనే వాటిని వినియోగించడానికి తీసుకునే చర్యలలో అవి మంచినీటి వనరులు గాని– ఉప్పుతంపరలు గాని లేక లోతు నీటి సముద్రంకాని– మత్స్య పారిశ్రామికులకు ఉపయోగపడుతాయి.

పబ్లిక్ రంగంలో కాని, ప్రైవేటు రంగంలో నుంచి కాని ఎంత సొమ్ము పెట్టుబడి పెట్టినా, మౌలికంగా ఉత్పత్తి సాధనలో మత్స్యపరిశ్రామికుడే ప్రముఖపాత్ర వహిస్తాడు. వివిధ కార్యక్రమాల సాధనలలో మత్స్యపరిశ్రామికుడు కీలకపాత్ర వహిస్తాడు. ఆ కారణంగానే మత్స్యపారిశ్రామికుని ఉత్పాదనశక్తి పెంపుచేయడం ద్వారా అతడు పట్టే చేపల పరిమాణాన్ని, మేలురకాలని పెంపుచేయుట జరుగుతుంది. ఆర్థికంగాను, సామాజికంగాను మత్స్య పారిశ్రామికుల స్థితిగతులను అభివృద్ధిపరచటం, ఉత్పత్తిశక్తి పెంచటం మన సమాజం బాధ్యత అయివున్నది.

ప్రకృతిలోని ప్రతీ శక్తులతాకిడికి ఆకర్షణ, అప్రమత్తతతో తాళుకుంటూ, జీవితాన్నే పణంపెట్టి గంటలతరబడి సాగరంలో పోరాడి జీవించే మత్స్య పారిశ్రామికానికి తీరంచేరిన తరువాత చేతికి వచ్చే ప్రతిఫలం నామమాత్రమే! అందుకే సర్వదా మత్స్య పారిశ్రామికుని జీవితం ప్రకృతితో నిత్యపోరాటం – బ్రతుకుతో జూదం! నాగరిక ప్రాపంచికజ్ఞానం లేనివారు. నిజానికి దైనందిన జీవితంలో వ్యావహారిక పరిజ్ఞానం వారికి లేకపోవచ్చు. కాని వృత్తివిద్యలో వారికివున్న విజ్ఞాననైపుణ్యం ఆశ్చర్యం కలిగిస్తుంది. భౌతికశాస్త్రం, జీవశాస్త్రం, వాతావరణం, సముద్రంలో వచ్చే పోటు, వాటు–పోటు మొదలైన విషయాల్లో మత్స్యపారిశ్రామికులకు అనుభవపూర్వక పరిజ్ఞానం గణనీయమైనది. శాస్త్రీయమైన, సాంకేతికమైన సలహాలు, తరిఫీదు వారికి అందజేయగలిగితే మన కోస్తాలోని మత్స్య పారిశ్రామికులు జపాను, ఐరోపా లోని

మత్స్య పారిశ్రామికులతో సరితూగగలరనటం నిర్వివాదాంశం. మత్స్యపారిశ్రామికులు రూపొందించిన "వల"లో కావలసిన రొయ్యలు మాత్రమే పట్టగలుగుతున్నారు. "ట్రాల్" వలలో ఉపయోగమైనవి, నిరుపయోగమైనవి కూడా పట్టుబడుతాయి. దురదృష్టవశాత్తు యింతవరకు మత్స్యపారిశ్రామికులు విస్మరించబడ్డారు. నేటికి వారు వెనుకబడిన జాతులు, వెనుకబడ్డ తరగతుల వారికంటే కూడా వెనుకబడివున్నారు. రహదారి మార్గాలు లేక, దగ్గరలోని పట్టణాలలోగాని, రోడ్లలోగాని సంబంధం లేక వొంటరిగా జీవితాన్ని సాగిస్తున్నారు. మానవజీవితానికి అత్యవసరమైనటువంటి త్రాగే నీళ్లు, ఆసుపత్రులు, ప్రాథమిక విద్యావసతులు లేక హృదయవిదారకపరిస్థితుల్లో ఉన్నారు.

మత్స్యపారిశ్రామికులు సాంఘిక ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేకచర్యలు తీసుకుంటూనే ఉన్నది. 1961వ సంవత్సరం మంచి మత్స్యపారిశ్రామికులకు వడ్డీలేని పద్ధతిలో సబ్సిడీపై కాకినాడ పడవల నిర్మాణంలో నిర్మించబడిన యంత్రనావలు సరఫరా చేయబడుతున్నవి. ఇంజిను ఖరీదులో 50శాతం, నావ ఖరీదులో 25 శాతం సబ్సిడీ పోను మిగతా ఖరీదు ఆరు సంవత్సరాలలోగా చేపలు దొరకని కాలం మినహాయించి వసూలు చేస్తున్నారు. 80,000 ఖరీదు చేసే 32 అడుగుల యంత్ర నావలు, రూ॥1,35,000 ఖరీదు చేసే 37 యంత్రనావలు వాయిదా పద్ధతిలో యివ్వడం – మరే యితర రంగాలలోను లేదనే చెప్పాలి.

గత రెండు సంవత్సరాల నుండి సన్నకారు మత్స్యపారిశ్రామికులు తమ తెప్పలను, చిన్న నావలను మంచివి కొనుగోలు చేసుకొనటానికి రూ॥250లకు మించకుండా వారు కొన్న ఖరీదులో నూటికి 25 శాతం వరకు సబ్సిడీలు యివ్వబడుతున్నవి. చాలా సంవత్సరాలనుండి ఎక్కువ మన్నికగల నైలానుదారం, మత్స్యపారిశ్రామికులకు సబ్సిడీలపై సరఫరా చేయడం జరుగుతున్నది. సన్నకారు రైతుల సహాయకార్యక్రమాల పథకం క్రింద విశాఖ జిల్లాలో మత్స్యపారిశ్రామికులకు షెడ్యూలు బ్యాంకుల ద్వారా అప్పులు మంజూరు చేస్తున్నారు. మత్స్య పారిశ్రామికులకు నేరుగా షెడ్యూలు బ్యాంకుకే వేట పరికరాల కొనుగోలుకు ఋణాలు యిచ్చే ప్రత్యేక పథకం త్వరలో నెల్లూరు జిల్లాలో ప్రారంభించబడుతోంది.

### "వినీల విప్లవం" బ్లూ రివల్యూషన్

సముద్రంలో "మునగకట్టు" నైలాన్ వలలతో మత్స్యపారిశ్రామికులు "రొయ్యల" వేట సాగిస్తున్నారు. వేట బాగాసాగి ఎక్కువ రొయ్యలపాటు కలిగే పారిశ్రామికులకు

ఆర్థికంగా చెప్పుకోతగ్గ అభివృద్ధి కనిపిస్తోంది. విదేశీ ఎగుమతి ప్రాధాన్యం వుండటం చేత రొయ్యల ఖరీదు కూడ కిలో రూ॥1.50నుండి రూ॥10కి పైగా పెరిగింది. ఆ కారణంచేత రొయ్యల వేటకు మత్స్యపారిశ్రామికులు ఎగబడుతున్నారు. ఉత్తరకోస్తా ప్రాంతంలో అప్పుడే యీ "వినీలవిప్లవం" (బ్లూ రివల్యూషన్) సాధించబడుతోంది. దక్షిణాది కోస్తా ప్రాంతాల్లో కూడా, ముఖ్యంగా ఒంగోలు ప్రాంతంలో, యీ "వినీలవిప్లవం" రూపకల్పన పొందుతోంది.

అధునాతన చేపల వేటలోను, యంత్రనావలు నడపటంలోను మత్స్య పారిశ్రామికులకు శిక్షణ యివ్వడానికి కాకినాడలో స్థాపింబడిన ఫిషరీస్ ట్రైనింగ్ సెంటరులో యిప్పటికి సుమారు 500 మత్స్యపారిశ్రామికులకు నెలకు రూ॥ 65 స్టయిఫండు యిచ్చి తరిఫీదు యివ్వటం జరిగింది.

వరంగల్‌లో- మంచినీటి చెఱువులలో అధునాతన మత్స్యపరిశ్రమలో శిక్షణ యిచ్చేందుకు శిక్షణకేంద్రం నెలకొల్పబడింది. అలాగే రిజర్వాయర్లలోనూ, లోతు నీటిలోను చేపల వేటలో తరిఫీదు యివ్వడానికి అనంతపూరులో ఒక శిక్షణ కేంద్రం స్థాపించబడింది.

సాంకేతికంగా మత్స్యపారిశ్రామికుల శక్తిసామర్థ్యాలు పెంచడానికి కృషిచేయడంతోపాటు, వారి సామాజికాభివృద్ధికి కావలసిన అవసరాలు- మంచి నీటి బావులు, విద్యాసౌకర్యాలు, వైద్యసదుపాయాలు, రహదారులు, ఏర్పరచడానికి సహాయ కార్యక్రమాలకోసం మత్స్యశాఖ బడ్జెట్‌లో నుంచి కొంత సొమ్ము తక్కువగా వున్నప్పటికీ కేటాయించబడుతోంది. కోస్తా ప్రాంతంలోని ముఖ్యమైన అన్ని మత్స్యపారిశ్రామిక గ్రామాలనీ- ముఖ్య రహదారులతో కలిపే బృహత్తరపథకం సుమారు 5 కోట్ల రూపాయలకు తయారుచేయబడినది.

పెనుగాలులు, తుఫానుల బారినుండి మత్స్యపారిశ్రామికుల రక్షణ మరొక పెద్ద సమస్య. సముద్రంమీద వున్నవారికి ప్రాణనష్టం, తీరగ్రామాలే పెనుగాలులలో తుడిచిపెట్టుకుపోయే ప్రమాదం ఉన్నది. అందుచేత విస్తృతమైన వాతావరణ హెచ్చరికలు అందచేసే కార్యక్రమం, మత్స్యపారిశ్రామికులకు గృహనిర్మాణం, తుఫానులో చిక్కుకున్న మత్స్యపారిశ్రామికులకు రక్షణ కార్యక్రమం, విమానాల ద్వారా తప్పిపోయిన నావలు వెతకడం మొదలైన కార్యక్రమాలు తుఫాను అనంతరం తీసుకోవలసిన తక్షణచర్యలు, తుఫాను బాధితుల రక్షణకోసం సలహాలనిచ్చేందుకు, వాతావరణశాఖ డైరెక్టర్ జనరల్ గారి అధ్యక్షతన ఏర్పరచబడిన కమిటీ నివేదిక యింకా అందవలసివున్నది.

విదేశ మారకద్రవ్యం పెంచే విధంగాను, పోషక ఆహార ఉత్పత్తి అధికం అవడానికి లక్షలాది మత్స్యపారిశ్రామికులకు జీవనోపాధి కల్పనకు వీలుకల్పించే విధంగాను సహజ నీటి వనరులలోని మత్స్యపరిశ్రమాభివృద్ధి సాధించాలని యీ మధ్య జాతీయ వ్యవసాయ కమీషన్ సూచన చేసింది. రొయ్యలవేట కోసం షిప్పింగ్‌లూపర్స్, శీతల గిడ్డంగులు పెట్టి అమెరికా, జపాన్ దేశాలకు ఎగుమతి చేయుట మత్స్యపరిశ్రమాభివృద్ధి అని అభిప్రాయమైన యీ తరుణంలో పోషకాహార ఉత్పత్తికి యీ పరిశ్రమ మీద జీవించే లక్షలాది వెనుకబడ్డ మత్స్యపారిశ్రామికులకు సాంఘికాభివృద్ధికి శ్రద్ధతీసుకోవడం యెంతైనా ముదావహం.

1. పోషకాహారమైన చేపల ఉత్పత్తి, 2. మత్స్యపారిశ్రామికులు సాంఘికాభివృద్ధి, 3. ఆర్థికాభివృద్ధి, 4. విదేశమారక ద్రవ్య సంపాదన మొదలైన విషయాలలో యిప్పుడు నిర్ణయాలు తీసుకోవాలి. అంతేకాదు, మత్స్యపరిశ్రమాఅభివృద్ధి వాణిజ్యపరంగా పెట్టుబడి రాబడి సూత్రాలు అనువర్తించాలో లేక సామ్యవాదవ్యవస్థలో వెనుకబడిన వర్గమైన మత్స్యపారిశ్రామికులు సాంఘికాభివృద్ధి జయంగా రాష్ట్రప్రజలకు పోషకాహారం అందేవిధంగా అభివృద్ధి సాధించాలా అనే విషయాలపై నిర్ణయాలు చేయవలసివున్నది. వెనుకబడ్డ వర్గాల అభివృద్ధిని విస్మరించిన పక్షంలో మనం నాగరికులుగా, అభ్యుదయ వాదులుగా చెప్పుకొనలేమనే విషయం మనం యీ సందర్భంలో గుర్తించవలసివుంది. భావితరాల భవితవ్యానికి మనం అడ్డుగోడగా నిలువజాలము. అందుచే గిరిజనులకన్న, హరిజనులకన్న వెనుకబడ్డ మత్స్యపారిశ్రామికుల అభ్యున్నతిపైన, తరతరాలుగా అసంపూర్ణ ఆహారంపట్ల నిస్సత్తువతో నిర్వీర్యంగా వున్న జాతికి బలవర్ధక పోషక ఆహారం ఎక్కువగా వేరక అందుబాటు చేయటం పైన మత్స్యపరిశ్రమాభివృద్ధి సమాజానికి రక్షణ, జాతీయ, ఆర్థిక అభ్యుతి ఆధారపడివున్నాయి.

అందుకే మత్స్యపారిశ్రామికులకు విద్యాసౌకర్యం, సాంకేతికశిక్షణ, నవజీవనం సమకూర్చటం మన అందరి బాధ్యత అయి వున్నది. ఈ పరిశ్రమ శిక్షితులను, నిపుణులనూ తయారుచేయగల విధంగా, సమాజంలో వారికి సముచితస్థానం, సమాజవికాసకృషిలో సమానబాధ్యతలు, సమాన హక్కులూ కలుగజేయాలి.

*(స్నేహలత 2-7-1972)*

# 2. వెనుకబడిన తరగతుల సంక్షేమం

దేశంలోని పరిపాలకులకు ఈ దశాబ్దం చాలగడ్డు సమస్యలతో కూడివుంది. వెనుకబడిన తరగతులకు చెందిన శ్రేయస్సును పెంపొందించడానికి వారు కృతనిశ్చయులై వున్నారు. ఇది అంత సులభమైన పనికాదు. సమాజంలోని బలహీనవర్గాల ఆర్థిక, సాంఘిక, రాజకీయపరిస్థితులను అభివృద్ధిపరచగలమని నాయకులు ఎన్నికల సమయంలో ప్రజలకు వాగ్దానాలు చేశారు. ఈ వాగ్దానాల ఫలితంగానే వారు అత్యధిక మెజారిటీతో అధికారంలోకి రాగలిగారు. అధికారంలోకి వచ్చిన తరువాత, సమాజంలోని బలహీనవర్గాల ప్రజల శ్రేయస్సును గురించి, వారికి కొత్త ఆశలు రేకెత్తించిన తరువాత, ఈ లక్ష్యాన్ని సాధించడం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ప్రథమకర్తవ్యం కావడం సమంజసమే. వెనుకబడిన తరగతుల బలహీన వర్గాల ప్రజల జీవనప్రమాణాలను మెరుగుపరచడం త్వరగా జరిగే పనికాదు. అయితే సాంఘిక, ఆర్థిక, రాజకీయరంగాలలో ఈ వర్గం ప్రజలు అభ్యున్నతికై కార్యదీక్షను పూనుకోవడం చాలా అవసరం.

దేశంలో అనేకవర్గాలు సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా కూడా చాలా వెనుకబడివున్నందున వారి యోగక్షేమాలను దృష్టిలో పెట్టుకొని మన రాజ్యాంగంలో కొన్ని ప్రత్యేకమైన ఆదేశాలు పేర్కొనడం జరిగింది. ఈ ప్రజలకు ముఖ్యంగా షెడ్యూలు తరగతులు, షెడ్యూలు కులాల ప్రజలకు సాంఘికంగా అన్యాయం జరగకుండా, వారికి తగిన రక్షణ కల్పించే ఉద్దేశంతో మన రాజ్యాంగంలో 46వ సూత్రంలో రాష్ట్ర ప్రభుత్వలక్ష్యాలు నిర్దిష్టంగా పేర్కనబడివున్నాయి. రాజ్యాంగంలోని 15(4)వ సూత్రం ప్రకారం ఈ తరగతి ప్రజల అభ్యున్నతికి ప్రత్యేకచర్యలు తీసుకోవాడానికి ప్రభుత్వానికి ప్రత్యేక అధికారాలున్నాయి. 16 (4)వ సూత్రం ప్రకారం ప్రభుత్వం ఈ తరగతుల ప్రజల కొరకు ఉద్యోగాలలో రిజర్వేషను కూడా చేయవచ్చు.

రాజ్యాంగరీత్యా వెనుకబడిన తరగతులవారికి కల్పించవలసిన సౌకర్యాలు సమకూర్చబడినాయి. ఎన్నికల వాగ్దానాలను ప్రభుత్వం నిలబెట్టుకోవలసివుంది. శ్రేష్ఠతర జీవితం కొరకు. ఈ ప్రజలు చిరకాలంగా అనేక ఆశలు కల్పించుకొనివున్నారు.

ఆశయాలు కలిగివున్నారు. అంతేకాక వారి ఆర్థిక పరిస్థితినిబట్టి వారి సంక్షేమానికి కృషిచేయడం ప్రభుత్వ కర్తవ్యమైవుంది. పేదరికమనేది ఒక అంటువ్యాధి వంటిది. ఇది ప్రబలంగా వ్యాపిస్తే విపరీతమైన దుష్ఫలితాలు కలుగుతాయి. సమాజంలో ఒక వర్గంలో పేదరికం వుంటే, అది ఇతరవర్గాలకు కూడా వ్యాపిస్తుంది. ఈ ప్రకారం జాతి మొత్తాన్ని ఆవరిస్తుంది. కాలం జరిగేకొద్ది సమాజంలో శ్రీమంతులైనవారు కూడా బాధపడవలసివస్తుంది. బాగా అభివృద్ధి చెందిన దేశానికి కూడా ఇది వర్తిస్తుంది. అందుకనే కలిగిన దేశాలు వెనుకబడిన దేశాలకు, తక్కువ అభివృద్ధి చెందిన దేశాలకు సహాయం చేస్తున్నాయి. ఒక విధంగా ఇది ప్రాజ్ఞతతో కూడిన స్వార్థం.

రాజ్యాంగ ఆదేశాల ఫలితంగా, ఎన్నికల వాగ్దానాల ఫలితంగా న్యాయం కొరకు దళితప్రజలలో ఏర్పడుతున్న అశాంతి ఫలితంగా, పేదరికం ఇతరవర్గాలకు కూడా వ్యాపించే ప్రమాదం వున్న ఫలితంగా, వెనుకబడిన తరగతుల, బలహీన వర్గాల సమస్యలను పరిష్కరించడం తక్షణ కర్తవ్యమైవుంది.

అయితే భారతదేశ సమాజవ్యవస్థలో వున్న అనేకతారతమ్యాల ఫలితంగా సమస్యలను వెంటనే పరిష్కరించడం అంత సులభంకాదు. అందులో ఎన్నో చిక్కులున్నాయి. అవి దిగువ ప్రస్తావించబడినాయి.

మొదటి సమస్య ఏమిటంటే, వెనుకబడిన తరగతులు, బలహీనవర్గాలు ఏవి అని నిర్ణయించడం. ఒక వర్గాన్ని, వెనుకబడిన వర్గం అంటే దాని అర్థం ఏమిటి? వారు సాంఘికంగా వెనుకబడివున్నారా? లేక రాజకీయంగానా? వెనుకబడిన తరగతి అని ఏ సూత్రాన్ని ఆధారం చేసుకొని నిర్వచన చేయాలి? ఇక రెండవ సమస్య ఏమంటే, ఆర్థిక, సాంఘిక, రాజకీయాభివృద్ధి కొరకు కార్యక్రమాలు రూపొందించడం. ఇందులో కూడా చిక్కులు లేకపోలేదు. వివిధకార్యక్రమాలను రూపొందించేందుకు, వాటిని అమలు చేయవలసిన తీరుతెన్నులను కూడా నిర్ణయించవలసి వుంటుంది. ప్రస్తుతవ్యవస్థలో అసమానత్వానికి స్థానంలేకుండా చేస్తూ, ఆర్థికవ్యవస్థలో వడిదుడుకులు లేకుండా సమంజసమైన కాలంలో మన లక్ష్యం సాధించడానికి మనం కృషి చేయాలి. దీని భావమేమిటంటే చేపట్టిన కార్యక్రమాలను శీఘ్రగమనంలో అభివృద్ధికి దోహదం చేయాలి. ఈ అభివృద్ధికి ఫలితాలు అవి ఉద్దేశించబడిన ప్రజల అనుభవంలోకి రావాలి. వారిలో ఏర్పడిన అశాంతి తొలగిపోవాలి. భవిష్యత్తును గురించి వారిలో ఆశాకిరణం ఉదయించాలి. ఈ కార్యక్రమాలను సక్రమంగా, సమర్థంగా అమలుపరచడానికి

ఆర్థికవనరులు సమకూర్చడం అవసరం. మనల్ని ఎదుర్కొంటున్న మూడో సమస్య ఇది. వెనుకబడిన తరగతులు, బలహీనవర్గాల శ్రేయస్సుకై రూపొందించిన కార్యక్రమాలు అభివృద్ధి ప్రణాళికలను అనుసరించి వుంటాయి. అయితే నిధులకొరత కారణంగా ఈ పథకాలు అడుగున పడిపోయే ప్రమాదం ఉంది. అనుసరించబడిన ఈ కార్యక్రమాల అమలుకు విధానాన్ని రూపొందించడం నాల్గవ సమస్య. ప్రస్తుతపరిస్థితులలో కార్యక్రమాలను సమర్థంగా అమలు జరపడానికి నిర్దిష్టవిధానాన్ని అనుసరించడం అవసరం. అంతేకాకుండా పరిపాలన యంత్రాంగం, ఈ కార్యక్రమాలను అమలు జరుపడానికి కార్యాచరణ వ్యవస్థను ఏర్పాటు చేయాలి. వాటిని అమలు జరిపించి, కార్యక్రమాలవల్ల కలిగిన ఫలితాల ప్రభావాలను తెలుసుకొని, అవసరమైనప్పుడు కార్యక్రమాల అమలు తీరుతెన్నులలో మార్పులు సూచించాలి. అప్పుడు అన్ని విషయాలలో సమన్వయం ఏర్పడుతుంది. ఇది సర్వతోముఖాభివృద్ధికి దోహదం చేస్తుంది.

వెనుకబడిన తరగతులు, బలహీనవర్గాల సంక్షేమానికి సంబంధించిన ప్రధాన సమస్యలు దిగువిధంగా ఉన్నాయని భావించబడుతుంది.

1. వెనుకబడిన తరగతుల నిర్వచనం
2. తగిన సంక్షేమపథకాలను రూపొందించడం
3. వనరులు
4. విధాన అంశాలు
5. పరిపాలన సంబంధమైన సమస్యలు.

బలహీనవర్గాల వారు ఎవరు అనే సమస్య ఎప్పుడూ క్లిష్టంగానే ఉంటుంది. ఈ ముఖ్యమైన సమస్యపై అనేకులు అనేకవిధాలుగా నిర్వచించారు. కోర్టులు తీర్పులను ప్రకటించాయి. ఈ తరగతుల ప్రజల నిమిత్తం ప్రత్యేకంగా వ్యవహరించాలని మన రాజ్యాంగం నిర్దేశించినప్పటికీ వెనుకబడిన తరగతుల నిర్వచనం, వారి సంక్షేమానికి తగిన కార్యక్రమాల అమలు, ఆచరణరీత్యా క్లిష్టంగా తయారైంది. వెనుకబడిన తనానికి కులం ప్రాతిపదిక కారాదని కొందరి వాదం ఉండగా, మరికొందరు ఆ ప్రాతిపదికను బలపరుస్తున్నారు. ప్రస్తుత సమాజజీవితంలో కులం ప్రత్యేకమైన పాత్ర వహిస్తున్నప్పుడు దానిని కాదనే వీలులేదు. ఆంధ్రప్రదేశ్ సాంఘికంగాను, విద్యావిషయకంగాను

వెనుకబడిన వర్గాలను గుర్తించడం జరిగింది. వెనుకబడిన తనం గుర్తింపునకు కులం ఏకైక ప్రాతిపదిక కాకపోయినప్పటికీ, సాంఘికంగా వెనుకబడిన వారిని గుర్తించవచ్చుననే సుప్రీమ్‌కోర్టు అభిప్రాయాన్ని దృష్టిలో ఉంచుకొని వెనుక బడిన తరగతుల కమీషన్ తమ నివేదికను సమర్పించింది. సాంఘికంగాను, విద్యావిషయకంగాను, వెనుకబడిన వర్గాల 22 కులాను నివేదికలో సూచించారు. వారిలో 37 కులాలు ఆదిమజాతులకు చెందినవారు, విముక్తజాతులు, సంచార జాతులు, గిరిజనులు ఉన్నారు. వృత్తిబృందాలు, హరిజనులుగా మారినవారు 21 కులాలు. ఇతర వెనుక బడిన వారు 33 కులాలకు చెందినవారు ఉన్నారు. ఈ వర్గాలకు చెందినవారి సంఖ్య ఎంత అనేది నికరంగా తెలియదు. అయితే మన రాష్ట్రంలోని జనాభాలో 38 శాతం- అంటే కోటిన్నర మంది సాంఘికంగాను, విద్యావిషయకంగాను వెనుకబడిన వర్గాల ప్రజలు ఉన్నారని అంచనా వేయబడింది. వారికితోడు 14శాతం ఉన్న షెడ్యూలు కులాలవారు కలిసినప్పుడు ప్రభుత్వం ముందున్న యీ సమస్య ఎంత జటిలమైనదో తెలుస్తుంది. ముందే వెనుక బడివున్న యీ రాష్ట్రంలోని జనాభాలో సగానికి సగం వెనుకబడిన వర్గాలవారైనప్పుడు, వాని నిమిత్తం ప్రత్యేక శ్రద్ధ వహించడమనేది మరింత క్లిష్టసమస్య. అయినప్పటికీ సాంఘికంగాను, విద్యావిషయకంగాను ప్రత్యేకశ్రద్ధ వహించాల్సిన వర్గాలు ఉన్నాయనే విషయాన్ని ప్రభుత్వం గుర్తించింది.

వెనుకబడిన వర్గాలు ఏవి అనే విషయాన్ని నిర్దేశించిన ప్రభుత్వం వారి సంక్షేమం నిమిత్తం కొన్ని ప్రత్యేకకార్యక్రమాలను అమలు జరుపుతున్నది. కొన్ని దశాబ్దాలుగా అమలుజరుపబడుతూనే ఉన్న కార్యక్రమాలు సరిపోతాయని గానీ, సరి అయిన విధంగా అమలుజరుపబడుతున్నాయని గానీ చెప్పలేము. వెనుకబడిన తరగతుల కమీషను యీ పై కార్యక్రమాలను కొత్త దృక్పథంతో గమనించి, ఈ తరగతుల ప్రజల సంక్షేమానికి మరికొన్ని కార్యక్రమాలను సూచించింది. ప్రజల జీవనప్రమాణాన్ని పెంపొందించడానికి, వరుసగా పంచవర్ష ప్రణాళికలను అమలు జరుపుతూ, అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టిన దృష్ట్యా, వాటి ఫలితాలను యితరప్రజలతో పాటు వెనుకబడిన వర్గాల ప్రజలు కూడ అనుభవిస్తున్నారని పేర్కొనవచ్చు. ఈ ప్రణాళికల ద్వారా వారికి కూడా ప్రయోజనాలు సిద్ధిస్తున్నాయనే విషయాన్ని వారు గుర్తించేవిధంగా చేయాల్సిఉంది. ఉదాహరణకు విద్యారంగాన్ని అభివృద్ధిపరచడానికి ప్రణాళికలలో

అనేకపథకాలను రూపొందించి అమలు జరిపారు. వెనుకబడిన తరగతులకు చెందిన వారు వినియోగించుకునేందుకు వీలుగా ప్రత్యేకకార్యక్రమాలను అమలు జరిపారు. అదేవిధంగా వ్యవసాయరంగంలో కూడ జరిగింది. సస్యవిప్లవం ద్వారా లభించిన ఫలితాలను వారు కూడా అనుభవించే విధంగా చేయడం జరిగింది. రోగాలను తగ్గించి, తగిన ఆరోగ్యకరమైన జీవనపరిస్థితులను కల్పించడానికి ఆరోగ్య, పారిశుద్ధ్యపథకాలను అమలు జరిపారు. పంచవర్ష ప్రణాళికలలో ప్రతి అభివృద్ధిరంగంలో యితర సంక్షేమ కార్యక్రమాలతోపాటు అదనంగా వెనుకబడిన వర్గాలవారి నిమిత్తం ప్రత్యేకపథకాలను అమలుజరిపారు. ఈ వర్గాల వారి సంక్షేమానికి అమలుజరిపిన కార్యక్రమాల వివరాలు దిగువ ఇవ్వబడినాయి.

**విద్యా సౌకర్యాలు**

రాష్ట్రంలో ఆర్థికంగా వెనుకబడి ఉన్న యీ వర్గాల ప్రజలు విద్యాసౌకర్యాలను వినియోగించుకోలేని స్థితిలో ఉన్న కారణంగా, రెసిడెన్షియల్, నాన్‌రెసిడెన్షియల్ వంటి స్కాలర్ షిప్పులు, ఫీజుల మినహాయింపు, హాస్టల్ సౌకర్యాలతోపాటు వృత్తి విద్యాసంస్థలలో సీట్ల రిజర్వేషన్‌వంటి ప్రత్యేక ప్రోత్సాహకపథకాలను అమలు జరుపుతున్నారు. 1971-72 సంవత్సరంలో ఆర్థికంగా వెనుకబడిన తరగతుల వారికి రూ॥46.98 లక్షల ఖర్చుతో 20,763 పోస్ట్ మెట్రిక్ స్కాలర్ షిప్పులు యివ్వబడినాయి. నమోదు అయిన వెనుకబడిన తరగతులవారికి రూ॥14.63 లక్షల ఖర్చుతో 9,600 స్కాలర్ షిప్పులు యివ్వబడినాయి. ప్రిమెట్రిక్ నాన్ రెసిడెన్షియల్ స్కాలర్‌షిప్పులను మంజూరు చేయడానికి రూ॥10 లక్షలు జిల్లా కలెక్టర్లకు యిచ్చారు. మన రాష్ట్రంలో కళాశాలలో చదువుతున్న హరిజన క్రైస్తవులు, ఆర్థికంగా వెనుకబడిన తరగతుల వారికి ఫీజు రాయితీలు యివ్వబడినాయి. ఫీజు రాయితీలద్వారా నష్టపోయిన మొత్తాల మేరకు పరిహారంగా విశ్వవిద్యాలయాలకు 1971-72 సంవత్సరంలో రూ॥3 లక్షలు కేటాయించడం జరిగింది. వాటికితోడు, వెనుకబడిన తరగతుల వారి నిమిత్తం 3364 మంది అభ్యర్థులతో 68 ప్రభుత్వ హాస్టళ్లను ప్రభుత్వం నిర్వహిస్తున్నది. 1971-72లో యీ హాస్టళ్ల నిర్వహణ నిమిత్తం జిల్లా పరిషత్తులకు రూ॥14.10 లక్షలు మంజూరు చేశారు. ప్రభుత్వ హాస్టళ్ళకు తోడు 123 బాలల సబ్సిడీ హాస్టళ్ళు, 30 బాలికల సబ్సిడీ హాస్టళ్ళు ఉన్నాయి. 1971-72 సంవత్సరంలో ఈ హాస్టళ్ళకు బోర్డింగు గ్రాంట్లు మంజూరుచేయడానికి వీలుగా జిల్లా పరిషత్తులకు రూ॥16.19 లక్షలను

ప్రభుత్వం కేటాయించింది. ప్రభుత్వ హాస్టళ్ళలోను, సబ్సిడీ పొందిన హాస్టళ్ళలోను ఉన్న విద్యార్థులకు పౌష్టిక ఆహారం లభింపచేసే నిమిత్తం "కేర్" ఆహారం ఇవ్వబడుతున్నది. రవాణా, నిర్వహణ ఖర్చుల నిమిత్తం 1971-72లో రూ॥2 లక్షలు కేటాయించారు.

## నివేశనస్థలాలు

నివేశనస్థలాలు కేటాయించడం ద్వారా వారి జీవనపరిస్థితులను మెరుగు పరచడానికి ప్రభుత్వం యత్నిస్తున్నది. మెట్ట ప్రాంతాలలో కుటుంబానికి 5 సెంట్ల చొప్పున, మాగాణి ప్రాంతాలలో కుటుంబానికి 3 సెంట్ల చొప్పున యీ తరగతుల వారికి నివేశనస్థలాలను ఉచితంగా పంపిణీ చేశారు. ఈ తరగతుల ప్రజలకు నివేశన స్థలాలకు కేటాయించడానికి 1971-72 సంవత్సరంలో ఒక ప్రత్యేకకార్యక్రమాన్ని అమలు జరిపారు. సేకరించిన ప్రైవేటు భూములకు పరిహారం చెల్లించే విధానాలను సులభం చేయడమేగాక ప్రత్యేక సిబ్బందిని కూడా ఏర్పాటు చేశారు.

ఈ తరగతుల ప్రజల ఆర్థిక అభ్యున్నతి నిమిత్తం పాడిక్షేత్రాల వంటి అనుబంధ వృత్తులను చేపట్టడానికి ప్రోత్సహించడం జరుగుతున్నది. పాడిపశువుల సరఫరా నిమిత్తం కుటుంబానికి రూ॥1000 చొప్పున రూ॥2 లక్షలు మంజూరు చేశారు.

వారి విద్యాభివృద్ధిలో ప్రోత్సాహకపథకాలను అమలు జరపడంతోపాటు రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులో తగిన ప్రాతినిధ్యం కల్పించడానికి ఉద్యోగాలలో 5 శాతం సీట్లను వారికి రిజర్వుచేశారు. ఈ విధంగా వారికి ఉపాధి సౌకర్యం కల్పించడం జరిగింది. షెడ్యూలు కులాలకు చెందిన అభ్యర్థులకు గరిష్ఠ వయఃపరిమితికి 5 సంవత్సరాల మినహాయింపు యివ్వబడింది. వృత్తి కళాశాలలో 25 శాతం సీట్లను వారికొరకు రిజర్వు చేశారు.

వారి జనాభా దృష్ట్యా గతంలో జరిగినదంతా సరిపోదని భావించబడుతున్నది. దానికి కారణం ఆర్థికవనరుల కొరత అనిచెప్పవచ్చు. కేంద్రప్రభుత్వం యిచ్చే సహాయంతో సహా ఆర్థికవనరులు చాలా తక్కువగా ఉన్నాయి. మన రాష్ట్రంలో అన్ని రంగాలలో అభివృద్ధికి తగిన వనరులు లేనప్పుడు, యీ వర్గాల ప్రజల సంక్షేమానికి సంబంధించిన పథకాలను అదనంగా ఎక్కువ కేటాయించటం కష్టసాధ్యమైన విషయం.

దీనికి సాకుగా చెప్పడానికి వీలులేనప్పటికీ, మన వనరులు మన కార్యక్రమాల అమలును పరిమితం చేస్తున్నాయి. అయినప్పటికీ యీ నాటి పరిస్థితులకు అనుగుణంగా వనరులను సమీకరించడానికి ప్రభుత్వం నిరంతరం కృషిచేస్తూనే ఉన్నది. అవసరమైతే యీ వర్గాల ప్రజలకు తగినవాటా లభించే విధంగా అభివృద్ధి వేగం తగ్గించడం, మరో ప్రత్యామ్నాయమార్గం ఎన్నుకోవాలని నేను భావిస్తున్నాను. ఈ వర్గాల ప్రజల సంక్షేమానికి సంబంధించిన పథకాలను ఎక్కువ ప్రాముఖ్యం యిచ్చినప్పుడు నీటి పారుదల, విద్యుచ్ఛక్తి మొదలైనటువంటి యితర అభివృద్ధిరంగాలకు కేటాయించే మొత్తాలు తగ్గిపోతాయి. అదనపు వనరులను సేకరించలేనప్పుడు మరో మార్గం నాకు కనిపించలేదు. ప్రజలు యీ నాడు అభివృద్ధి వేగానికన్నా సాంఘికన్యాయానికి ఎక్కువ ప్రాముఖ్యమిస్తున్నారు. అభివృద్ధి వేగం పెంపుదలను అందరూ హర్షిస్తారనడంలో సందేహంలేదు. అయితే ఫలితాలలో యీ వర్గాల ప్రజలకు కూడా తగిన వాటా లభించాలి. ఈ వర్గాలతో ప్రమేయం లేకుండా అభివృద్ధిని యిలాగే కొనసాగించిన పక్షంలో, అంతిమంగా యీ ప్రజలలో రాజకీయంగాను, ఆర్థికంగాను అశాంతి పరిస్థితి ఏర్పడి- అభివృద్ధిగమనమే ఆగిపోయే ప్రమాదం ఏర్పడవచ్చు. ఈ నాడు సాంఘిక న్యాయం చేకూర్చే అభివృద్ధి చాలా అవసరం. అభివృద్ధి ఫలితాలలో తగిన వాటా వారికికూడా లభించినప్పుడు ప్రజలు నెమ్మదిగా పురోభివృద్ధిని సాధించడానికి సిద్ధంగా ఉన్నారు.

ఈ దృష్టితోనే రాష్ట్ర విధానాన్నంతటినీ తిరిగి రూపొందించుకోవాల్సి ఉంది. కేవలం ఆర్థికాభివృద్ధి పెరుగుదల ప్రాతిపదికపై అభివృద్ధినిమిత్తం వనరులను కేటాయించే రాష్ట్రవిధానం యిప్పుడు మారిపోయింది. అభివృద్ధిగమనానికి అంతరాయం కలిగినప్పటికీ, యీ వర్గాల ప్రజల సంక్షేమానికి ఎక్కువ నిధులను కేటాయించడం యీ నాడు చాలా అవసరం. ఆర్థికవనరుల కేటాయింపులోనేగాక సాంఘికవిధానాలలో కూడా ప్రభుత్వం అప్రమత్తతతో ఉండాలి. అదృష్టవశాత్తు మన రాష్ట్రంలో భూసంస్కరణలను త్వరితగతిని అమలు జరుపాలని మనం నిర్ణయించుకున్నాము. సమసమాజ నిర్మాణగమనంలో యిది సరిఅయిన ముందడుగని చెప్పవచ్చు. దేశ పునర్నిర్మాణంలో వారు పాల్గొనే విధంగా చేసే మన విధానాలుకూడా సరి అయినవనే చెప్పవచ్చు. పట్టణ ఆస్తులపై పరిమితి విధించడంతో యీ వర్గాల ప్రజలలో మరింత విశ్వాసం ఏర్పడుతున్నది.

ఈ వర్గాల ప్రజలకు వారికి తగిన వాటా లభింపజేయడానికి ప్రభుత్వం చిత్తశుద్ధితో కృషిచేస్తున్న విషయం ఇటీవల శాసనసభకు అభ్యర్థుల ఎంపిక, ప్రభుత్వం ఏర్పాటు విధానం ద్వారా ప్రజలకు వెల్లడి అవుతున్నది. ప్రస్తుత ముఖ్యమంత్రి నాయకత్వంలో యీ వర్గాల ప్రజల భవిష్యత్తు భద్రంగా ఉంటుందని నేను భావిస్తున్నాను. ఇది అందరూ కలిసి కట్టుగా చేయాల్సినకృషి. దీనికి మనందరమూ కట్టుబడి ఉన్నాము. మనకృషి అంతా యీ వర్గాల ప్రజలు యిచ్చే సహకారంపై ఆధారపడి ఉంటుంది.

ముగించేముందు ఈ తరగతుల సంక్షేమం విషయంలోగల పరిపాలన విషయాలగురించి ప్రస్తావిస్తాను. పాతకాలపు పరిపాలన పద్ధతిలో నూతనవిధానాన్ని విజయవంతంగా అమలు జరపడం సాధ్యంకాని విషయం. మనముందు ఉన్న లక్ష్యాన్ని సాధించడానికి ఉపయుక్తమయ్యే విధంగా పరిపాలన వ్యవస్థను తీర్చిదిద్దడానికి నేను కృషిచేస్తాను. వినూత్న పరిస్థితిని ఎదుర్కొడనానికి అందుకు అనుకూలమైన ఆర్గనైజేషను వుండాలి. ఇది చేయకుండా వున్నట్లయితే, మనం చేసే ప్రయత్నాలు నిష్ప్రయోజనమవుతాయి. ప్రభుత్వం ఈ విషయాన్ని కూడా పరిశీలిస్తున్నది.

1972 ఏప్రిల్ 9, 10 తేదీలనాడు జరిగిన సాంఘిక సంక్షేమ సదస్సులో ఈ విషయాలు చర్చించబడినాయి. ప్రభుత్వం ముందర ఇప్పుడు ఆచరణయోగ్యమైన సిఫార్సులు వున్నాయి. వాటిని అమలు పరచడానికి తగిన నిర్ణయాలు చేయబడుతాయి. ఏది ఎట్లావున్నా, ఈ సమస్యల అంతిమ పరిష్కారం ఈ ప్రజల చేతుల్లోనే ఉన్నదని నేను విశ్వసిస్తున్నాను. కృతనిశ్చయమై వున్న ప్రభుత్వం, కార్యదీక్షాతత్పరులైన ప్రభుత్వోద్యోగులు, పురోగామినాయకులు, తదితరులు ఈ వర్గాల ప్రజలకు చేయూతనివ్వవచ్చు. అయితే ఈ ప్రజలు చొరవ తీసుకొని ముందుకు వచ్చి ఇతరులతోపాటు ప్రగతిపథంలో నడవాలంటే, వారిలో ఆ సంకల్పదీక్ష వుండడం అవసరం. వారిలోకూడా ఇప్పుడు మార్పులు రావాలి. ఫిర్యాదులు చేసే పద్ధతిలో వారు వుండరాదు. తమకు రావలసినదానిని డిమాండుచేసే హక్కు వారికి వుంది. అయితే వారు నిర్వహించవలసిన విధులుకూడా వున్నాయి.

ఈ విషయాన్ని వారు ఎంత త్వరగా గుర్తిస్తే వారికి అంత క్షేమకరం. వారి ప్రయోజనాలను పరిరక్షించడానికి కృషిచేస్తున్న వివిధసంస్థలు, ఈ విషయాన్ని ఆ ప్రజలకు తెలియజేయాలి. నచ్చచెప్పాలి. రిజర్వేషనులు, రాయితీలు, ప్రత్యేక సదుపాయాలు ఇవన్నీ మంచివే. అయితే అవి కొంతకాలం వరకు మాత్రమే మంచివి.

దేశపరిపాలన వ్యవహారాలలో ఇవి శాశ్వతమైన సౌకర్యాలు కాజాలవు. ఈ సౌకర్యాలు అమలులో వున్న కాలంలో ఈ వర్గాల ప్రజలు తమ పరిస్థితిని చక్కదిద్దుకొని, తమ కాళ్లపై తాము నిలబడగలగాలి. ఆ తరువాత ఈ రాయితీల అవసరం వుండదు. ఈ వర్గం ప్రజలు ఈ విషయాన్ని గుర్తిస్తారని నేను విశ్వసిస్తున్నారు. ఎందుకంటే తాను వెనుకబడిన వాడిననీ, సమాజంలో వెనుకబడిన వర్గానికి చెందిన వాడిననీ చెప్పుకోడానికి ఎవ్వరికీ ఇష్టం ఉండదు. మన ప్రభుత్వం ఈ తరగతులవారికి సాంఘిక న్యాయం చేకూర్చగలదని, అనతికాలంలోనే ప్రతిరంగంలోనూ ఈ వర్గం ప్రజలు తమ హక్కులు బాధ్యతలు నిర్వహించగలరనే ప్రగాఢవిశ్వాసం నాకుంది.

*(ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక జులై 1972)*

# 3. భూ సంస్కరణలు - వాటి అవశ్యకత

నేడు భూసంస్కరణలను గురించి ముఖ్యంగా వ్యవసాయానికి అనువైన భూవసతి తగ్గించడానికి చేసే ప్రయత్నాలగురించి ప్రతి ఒక్కరూ మాట్లాడడం జరుగుతూవుంది.

ఇలా మాట్లాడేవారిలో ఎక్కువమంది యీ సంస్కరణలవల్ల నష్టపోయే భూస్వామి వర్గానికి చెందినవాళ్లే, పత్రికలలోను యితరత్రా భూ సంస్కరణల గురించి వస్తూన్న పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు విన్న మామూలు మనిషి అయోమయ పరిస్థితిలో పడటం జరుగుతున్నది. ఇందువల్ల యీ అభివృద్ధికరమైన భూసంస్కరణలనుగురించి వాస్తవాన్ని తెలుసుకోవడం చాలా అవసరం. కొంతమంది ఈ సంస్కరణల వెనుకనున్న నీతి నిజాయితీలను గురించి మాట్లాడుతుండగా, మరికొందరు ఈ సంస్కరణలు సమాజానికి ఎందుకూ పనికిరావనే ధోరణిలో మాట్లాడుతున్నారు. సామ్యవాద సమాజస్థాపకుడు మొదటి మెట్టయిన ఈ భూసంస్కరణల గురించి ఎందుకు ఈ దశలో భిన్నాభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నారో నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. మనం భూసంస్కరణల గురించి మాట్లాడటం యిది మొదటిసారికాదు. భారత జాతీయ కాంగ్రెసు ఏనాటినుండో ఈభూసంస్కరణలు కావాలని అభిప్రాయాన్ని తెలియజేస్తుంది. దైవదత్తమై ఈ భూమి ప్రభుత్వానిదేనని మహాత్మాగాంధీజీ అభిప్రాయం అందరికి తెలిసినదే. కాంగ్రెసు అధికారంలోకి రాగానే జమీందారీ, యినాందారీ హక్కులను రద్దుచేయడం జరిగింది. చరిత్రాత్మకమైన 1976 కరాచీ కాంగ్రెసు ప్రాథమిక హక్కుల తీర్మానంలో కౌలును తగ్గించడం ఒక అంశం. 1976 కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక, మీరట్ కాంగ్రెసు మహాసభ, 1947లో జవహర్‌లాల్ నెహ్రూ ఆర్థిక కమిటీ, జేసి. కుమరప్ప కమిటీ, 1951లో ఢిల్లీ కాంగ్రెసు మహాసభ, తరువాత జరిగిన అన్ని కాంగ్రెసు మహాసభలలోను భూసంస్కరణను అమలు పరచటం గురించి నొక్కి చెప్పటం జరిగినది. ఈ భూసంస్కరణను గురించి ఆలోచించినప్పుడు రెండు ముఖ్యమైన ప్రశ్నలు అడగడం జరుగుతుంది. నా దృష్టిలో ఈ రెండు ప్రశ్నలు సబబైనవే. మొదటిది- ప్రస్తుత భారతదేశ ఆర్థిక పరిస్థితులలో ఈ భూసంస్కరణలు ముమ్మందుగా తీసుకోవలసిన అవసరం వున్నదా? రెండవది- గ్రామీణుల ఆర్థిక దుస్థితిని

తొలగించడానికి ఈ సంస్కరణలకువున్న సంబంధమేమిటి? ఏ సంస్కరణ మంచిచెడ్డలైనా, సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులను దృష్టిలోపెట్టుకొని నిర్ణయించాలి. ఈ భూసంస్కరణలవల్ల సమాజానికి ఏమైనా లాభం వున్నదా? వెనుకబడిన తరగతులకు మేలు కలుగుతుందా? రాజకీయంగా యిది సమర్థనీయమా? ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వగలిగితే భూసంస్కరణల గురించి విమర్శించే వారికి సరైన సమాధానం యిచ్చినట్లే.

వీటికి సమాధానాలివ్వబోయేముందు నేనొకటి చెప్పదలిచాను. స్వాతంత్ర్యం వచ్చినదగ్గరనుండి అమలుజరిపిన ఎన్నో అభివృద్ధికరమైన మార్పులను దృష్టిలో పెట్టుకుంటే ఈ భూసంస్కరణలు అమలుపరచడం అనేది అనివార్యమని, చాలా సహజమని విదితమవుతున్నది. గతంలో వ్యవసాయ రంగం నుండి భూస్వామ్యవర్గాన్ని తొలగించడానికి ప్రయత్నం చేశాం. తత్ఫలితంగా జమీందారీ, ఈనాందారులు రద్దయినవి. తర్వాత కౌలుదారుల రక్షణకు చట్టాలు ప్రవేశపెట్టాం. ఈ రెండూ చేసిన తర్వాత మిగిలింది ఒకటే ఉన్నది. అదేమిటంటే, ఒక్కొక్క కుటుంబానికి ఎంత భూమి ఉండాలి అన్నది నిర్ణయించాలి. లోగడ ఈ భూమి పరిమితి ఎంతవుండాలో నిర్ణయించారు. కాని ఇప్పుడు యీ పరిమితి తగ్గించాల్సిన అవసరం చాలా కనబడుతున్నది. సాంఘిక న్యాయాన్ని అన్ని వర్గాలకు అందజేయాలంటే యీ అవసరం నేడు ఎంతయినా ఉంది.

ఆర్థిక కారణాలు, అందుబాటులోవున్న భూవసతిని బట్టి చూస్తే సొంత కమతాన్ని యింకా పరిమితం చేయకతప్పదు. జనాభా పెరుగుదల వల్ల భూమి కోసం వత్తిడి ఎక్కువే అవుతుంది. ఉన్న భూమిని సర్దుబాటు చేసి పంపిణీ చేయకపోతే మన ఆర్థిక వ్యవస్థ తారుమారయ్యే ప్రమాదం వున్నదని మన అందరికి తెలుసు. దేశంలో కొన్ని వస్తువుల ఉత్పత్తి తక్కువై వాటి అవసరం ఎక్కువైతే రేషనింగ్ పెడుతున్నాం. అలాగే భూమి విషయంలో కూడా యిది వర్తించాలి కదా! ఈ భూమిమీద ఆధారపడి బ్రతికేవాళ్ళు ఎక్కువైనప్పుడు ఒక పరిమితిని మించకుండా చూడడం న్యాయసమ్మతం. మన దేశంలో వ్యవసాయానికి అనువైన భూమి ఎంత ఉన్నదో యీ కింది వివరాలు పరిశీలిస్తే తెలుస్తుంది. 5 ఎకరాలు భూ వసతిగల 73,76 శాతం గ్రామీణ కుటుంబాలు, వ్యవసాయానికి పనికివచ్చే మొత్తం భూమిలో 19.82% భూమిని కలిగివుండగా 20 ఎకరాలుపైన భూవసతి కలిగిన 4.46% కుటుంబాలు మొత్తం భూమిలో 35.35% కలిగివున్నారు. దీన్నిబట్టిచూస్తే యీ భూకమతాలు ఎంత ఎగుడు దిగుడుగావున్నవో

విదితమవుతుంది. గ్రామీణుల ఆదాయానికి మూలమైన భూమికి సంబంధించిన యీ అసమానతలే వున్నవాడికి లేనివాడికి మధ్య అగాధాన్ని పెంచుతున్నాయి. ఇంతేకాదు- అభివృద్ధి ప్రణాళికలవల్ల కలిగిన లాభాలన్నీ పెద్ద పెద్ద భూస్వాములే దక్కించుకున్నారు. అది ఎలా అంటే ఒక కోటి రూపాయలు ఇరిగేషన్ ప్రాజెక్టు కింద ఖర్చుపెడితే దాని ఫలితం చిన్నకారు రైతుకంటే ధనిక రైతుకే ఎక్కువ దక్కుతుంది. ఇలాంటి లాభాలవల్లనే ధనిక భూస్వామి ఇంకా ఎక్కువ భూమిని ఆకట్టుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది. అంతేకాక వ్యవసాయరంగంలో వచ్చిన నవీన పద్ధతులు, శాస్త్రీయ విజ్ఞానం, ఇతరత్రా ఆర్థిక వనరులు యీ ధనిక భూస్వాములకే అందుబాటులో వున్నాయి. సాంఘికంగా వీరు ఒక వర్గంగా రూపొంది ఆర్థిక రాజకీయ బలాన్ని కూడా పుంజుకొని వున్నారు. ఇదే ధోరణి కొనసాగి ఎలాంటి ఆర్థిక పరిస్థితులకు దారితీసిందో తలసరి ఆదాయానికి సంబంధించిన ఈ కింది వివరాలను పరిశీలిస్తే తెలుస్తుంది. 1960-61లో గ్రామీణ ప్రజలలో 87% తలసరి ఆదాయం 35 పైసలుకాగా మిగతా ప్రజల తలసరి ఆదాయం 230 పైసలువుంది. అలాగే 43% ఏ గ్రామీణ ప్రజల తలసరి నెల వారి ఖర్చు రూ॥15లు. కాగా 6.4% ప్రజలకు మాత్రం తలసరి నెలవారి ఖర్చు రూ॥43/-లు వుంది. అంటే ఇది మూడురెట్లు ఎక్కువన్నమాట. ఈ స్థితి యింకెంతో కాలం కొనసాగకూడదు. అందునా సామ్యవాద వ్యవస్థ నిర్మాణానికి కట్టుబద్ధ యీ దేశంలో దారుణమైన ఈ అవమాన స్థితిగతులు మారకతప్పదు. అందువల్ల భూవసతి పరిమితిని తగ్గించడం అవసరం, లేకపోతే ధనికుడు మరీ ధనికుడైపోవడం, బీదవాడు మరీ బీదవాడైపోవడం జరుగుతుంది.

భూపరిమితిని తగ్గించడానికి రెండవ కారణమేమంటే పెద్ద పెద్ద వ్యవసాయ క్షేత్రాలలో ఉత్పత్తి ఎక్కువగా వుంటుంది. ఎన్నో పరిశోధనల వలన తేలిన విషయము వ్యవసాయక్షేత్రం పెద్దదైనకొలది బాగాపండించాలనే ఆసక్తి తగ్గిపోతుంది. ఎక్కడో ఒకటి అర మినహాయింపులలో ఎక్కువ ఉత్పత్తి చిన్న చిన్న కమతాలలోనే సాధించటం జరిగినది. చిన్న చిన్న భూకమతాలద్వారా ఉత్పత్తిని పెంచడానికి అవకాశం ఉంది. శాస్త్రీయపద్ధతులలో వ్యవసాయం చేసినవారు యింకా అధికఉత్పత్తిని సాధించవచ్చు. నూటికి ఎనభైశాతం గ్రామీణ ప్రజలుగావున్న భారతదేశంలో గ్రామీణ ప్రజల ఆర్థికాభివృద్ధిని సాధించనిదే వాళ్ళలో ఒక వున్నతస్థాయిలో జీవితాన్ని గడపాలనే ఆసక్తి కలుగదు. ఇయి ఈ సామాజిక వ్యవస్థలో కొన్ని మార్పులు తీసుకురానిదే సాధ్యమయ్యేపనికాదు. ఏ కాస్త భూమి వున్న వానికైనా సాంఘిక వ్యవస్థలో ఒకస్థానం ఉంటుంది. తద్వారా సాంఘిక వ్యవస్థలో తనూ ఒక భూ స్వామిగా వుండేహక్కు

తాహతు పొందగలుగుతాడు. ఇంతవరకు రాజకీయ అధికారాన్ని చేజిక్కించుకున్న ధనిక భూస్వామ్యవర్గమే యీ భూసంస్కరణను అమలు జరపకుండా అడ్డుగోడగా నిలిచివుంది. ఆర్థిక కారణాలవల్లనే కాకుండా, రాజకీయంగా కూడ యీ భూసంస్కరణలు ఎంత త్వరగా అమలు పరిస్తే అంత మంచిది. ఆదాయంలోని వ్యత్యాసాలు తగ్గించడం ప్రణాళిక ప్రధాన ఆశయం అయినా, ఈ వ్యత్యాసాలు ప్రణాళికా కాలంలో ఇంకా ఎక్కువగా పెరిగిపోవడం జరిగింది. 1961-61, 1965-66 మధ్య కాలంలో దారిద్ర్యంలో, అందునా అట్టడుగున ఉన్నవాళ్ళ సంఖ్య గ్రామీణ జనాభాలో నూటికి 37 నుంచి 70 వరకూ పెరిగిపోయింది. దీన్నిబట్టి తెల్లమయ్యేదేమిటంటే ఉత్పత్తి సాధనమైన భూమిని సక్రమంగా పంపిణీ చేయకపోతే సమాజంలో ఆర్థిక న్యాయాన్ని సాధించడం సాధ్యంకాదని, ఆర్థిక సంస్కరణలలో కొంతవరకు ఉపయోగపడవచ్చు. కాని పరిమితమైన భూకమతాలను ప్రవేశపెట్టడం అనివార్యమని తేలిపోయింది.

భారత రాజ్యాంగంలో పొందుపరచిన మూలసూత్రాలు నిర్ణయించిన ప్రకారం జాతీయ వనరులమీద ఆధిపత్యం, అజమాయిషీ ప్రభుత్వానికే వుండాలి. అవి ప్రజల క్షేమంకోసం ఉపయోగించబడాలి. 39వ ఆర్టికల్ లో రాష్ట్ర విధుల గురించి నిర్దేశించిన ప్రకారంకూడా ఒకేచోట ఆస్తిపాస్తులు పోగవడానికి వీలుగా మన ఆర్థిక విధానాలు ఉండకూడదు. భారత రాజ్యాంగంలో నిర్దేశించిన ఆశయాలు సాధించబడాలంటే భూమి పరిమితి, అంతేకాకుండా ఎంత తక్కువ భూపరిమితి ఉండాలో నేడు నిర్ణయించవలసిన అవసరం, అమలు పరచవలసిన బాధ్యత, ప్రజాప్రతినిధులమీద ఉన్నది. మనం ఒకసారి వెనుకకు తిరిగిచూస్తే ఇంతింత పెద్ద భూఖండాలు ఒక్కొక్క భూస్వామి ఎలా పొందగలిగాడో తెలుస్తుంది. కొంతమంది కష్టపడి సంపాదించిన మాట వాస్తవమేకావచ్చు. కాని చాలామంది వారసత్వపు హక్కు ద్వారానే పొందగలిగేరు. భూమిని ఒక ఆస్తిగా పరిగణించడం అనేది యీ మధ్య వచ్చినదేనని మనం గుర్తుంచుకోవాలి. ఈ భూమి ఎప్పుడైతే చాలదో, దానిమీద బ్రతకవలసిన వాళ్ళ సంఖ్య పెరిగిపోతుందో అప్పుడు భూమీమీద పరిమితి విధించడం అనివార్యం. అప్పుడుగాని సమాజంలో అట్టడుగువున్న బలహీన వర్గాలవారికి ఆర్థిక, సాంఘిక న్యాయాన్ని చేకూర్చలేము.

తారాజువ్వ చర్రున అకాశంలోకి లేచి తుస్సుమని కిందపడ్డట్టుగా ఉన్నాయి, అంధ్రప్రదేశ్ భూసంస్కరణల బిల్లులోని అంశాలు, రెండు పంటలూ మూడు పంటలూ

ఉన్న భూముల పరిమితి ఏదో వంకని 24 ఎకరాలకు 28 ఎకరాలకు పెంచుకునే సావకాశం ఈ బిల్లు ఇస్తుంది. అలాగే మెట్ట భూములనే వంకని మంచి భూములనే 54 ఎకరాలవరకూ ఒక కుటుంబం అట్టే పెట్టుకునే సావకాశం ఈ బిల్లు ఇస్తుంది. భూసంస్కరణలను గురించి ఆకాశం చిల్లులుపడేంత గట్టిగా ఉపన్యాసాలు దంచేసిన ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం ఆఖరికి పప్పులో కాలేసి భూస్వాముల ఒత్తిళ్ళకు లొంగిపోయారనో లేక ఇంకా గ్రామాల్లో పెత్తనాలు చెలాయిస్తున్న భూస్వాములు ఈ భూసంస్కరణల చట్టం గ్రామీణ పేద ప్రజానీకానికి ఉపయోగపడేట్టు చేస్తే పల్లెల్లో డబ్బు ఖర్చు పెట్టి తమ పార్టీ గెలిపించరని భయపడ్డారనో అనుకోవలసివస్తుంది.

పట్టణాల్లో వ్యాపారస్థులు లక్షలు లక్షలు ఆర్జిస్తుండగా, ఉద్యోగులు వేల కొద్దీ రూపాయలు జీతబత్యాలు పుచ్చుకుంటూ ఉండగా, అందరినీ వదిలేసి మా రైతాంగానికే ఇంతకంటె ఎక్కువ ఉండకూడదు అని పెట్టడం ఏమి సబబు? అని పేద రైతాంగానికి అందరికి కూడా ఈ భూ సంస్కరణలు చట్టం ప్రమాదం తెచ్చి పెట్టేస్తున్నట్టు భూస్వాములు రైతాంగం పేరు బలంతో తమ స్వార్థం చూసుకుంటున్నారు. సామాన్య రైతులు ఈ చట్టానికి అనుకూలురే. గరిష్ఠ పరిమితి ఎట్టి పరిస్థితిలో 10 ఎకరాలకు మించి ఉండకూడదు అని సన్నకారు రైతులను కూడగట్టిన నాయకుడెవరూ కనబడరు.

జూలై 26న ప్రధాని ఇందిరాగాంధీ హైదరాబాదు వచ్చినప్పుడు బ్రహ్మాండమైన ర్యాలీ లక్షమంది ప్రజలతో ఏర్పాటుచేసి కాంగ్రెసు, కమ్యూనిష్టు పార్టీలు చెప్పుకో తగిన పనిచేశారు. అయితే 5,6 నెలల నుంచీ అయినా పల్లెల్లో వ్యవసాయ కార్మికులను భూస్వాములకు వ్యతిరేకంగా సంఘటిత పరచడంకాని, పల్లెల్లో వ్యవసాయం జీవనాధారంగాగల వారిలో దృఢకాయులను సమీకరించి భూ సైన్యంగా తయారు చెయ్యటం కాని జరుగలేదు.

ఇప్పుడు మెట్ట భూములు 54 ఎకరాలు వరకూ ఉండవచ్చు అని అనటంవల్ల పంటలు పండి సమృద్ధిగా తమ గాదెలు నింపుకుంటూనే ఆ భూములను మెట్ట భూములుగా కాగితాల్లో చూపించే సావకాశం భూస్వాములకిచ్చారు.

తర్వాత హిందూ చట్టాన్ని మార్చనిదే ఇదెలా చేస్తారూ అనేవారు కూడా ప్రజాస్వామ్య ఆర్థిక, సాంఘిక పరిస్థితులు మెరుగు పడకూడదని కోరుకొనేవారే.

తమ తమ మిగులు భూములు పరాయివారికి ప్రభుత్వం పంచటం ఏమిటి? అని అప్పుడే చాలామంది భూ స్వాములు తమ అదనపు భూములను తమకు లోకువయి

జన్మ జన్మలకూ ఎదురించలేనివారి పేర ఏనాడో పెట్టేశారు. ఈ రహస్యాలన్నీ కరణం, మునసుబులకూ ఆయా గ్రామ ప్రజలకూ పూర్తిగా తెలిసే ఉంటుంది. కరణం, మునసబులు, గ్రామంలోని పేద ప్రజలూ ఐకమత్యంగా ఉండి ఏ భూస్వామికి ఎంత అదనపుభూమి ఉందో సరిగ్గా తేల్చాలి. కరణాలూ రెవిన్యూ ఉద్యోగులూ లంచగొండులయి దొంగరికార్డులను సృష్టిస్తే తీవ్రంగా శిక్షించాలి.

ముఖ్యంగా ఒక వ్యక్తి ఏదో ఒక వృత్తి మీద జీవించవలసిందేకాని పట్టణంలో ఉద్యోగం చేస్తూ పల్లెలో భూములు అమర్చుకొని, పైగా వడ్డీ వ్యాపారం చెయ్యటంలాంటిది ఒప్పుకోకూడదు. వ్యవసాయం చెయ్యని వానికి భూమి ఉండకూడదు. అట్టి భూములు నష్టపరిహారం ఇవ్వనిదే రాజ్యాంగం ఒప్పుకోదు గనక కొంచెం నామమాత్రపు నష్టపరిహారం ఇచ్చి వ్యవసాయం చెయ్యనివారి భూములను ప్రభుత్వం తీసుకుని భూములు లేని పేదలకు పంపాలి. లేక వాటిని ఇంతవరకూ దున్నుతున్నవారికే ఇవ్వాలి.

ముఖ్యమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు తమ ఉత్సాహాన్ని ముందుగా అర్డినెన్సు జారీచెయ్యటంలో ఎలా ప్రదర్శించారో అలాగే సాహసంగా ఈ చట్టం ఫలితాలు సవ్యంగా ప్రజలకు ఉండేట్లు చేసి చిరకీర్తి సంపాదించుకోవాలని ప్రజలు కోరుతున్నారు.

*(1972)*

# 4. అత్యయికపరిస్థితిలో అమోఘమైన ఒక ఏడాది

**26** జూన్, 1975 స్వతంత్ర భారతచరిత్రలో సంచలనాన్ని కలిగించిన రోజు. ఆ నాడు చకాచకా జరిగిపోయిన సంఘటనలు జాతిని విస్మయంలో ముంచి ఎత్తినాయి. భారతచరిత్రలోనే అతివిశిష్టమైన ఆ నాటి సంఘటనలు ప్రజలలో భిన్న ఆలోచనలకు తావిచ్చిన మాట నిజం. జాతి సంఘ విద్రోహులకు ఆ నాడు జీవితంలో మళ్ళీ కోలుకోలేనంత చావుదెబ్బ తగిలింది. నిత్యశంకితులు ఇంతటి తీవ్రమైన చర్య తీసుకోవలసింది కాదనుకున్నారు. దేశం లోపల, వెలుపల ఉన్న విరోధులకు భారతదేశంలో ప్రజాస్వామ్యం పతనమై పోయిందని దుష్ప్రచారం చేయటానికి సామగ్రి లభించింది. దేశంలోని ఆర్థిక, రాజకీయ, సాంఘికరంగాలలో అల్లకల్లోలాన్ని నివారించడానికి, జాతీయసమగ్రతను పరిరక్షించి, ప్రజాసందోహంలో నిరాశా నిస్పృహలను పోగొట్టి క్రమశిక్షణతోను, ఆత్మవిశ్వాసంతోను కూడుకున్న దృక్పథాన్ని నెలకొల్పడానికి సకాలంలో తీసుకున్న సరియైన చర్య అని ప్రజలు గుర్తించారు.

### ఆశాజ్యోతి వెలిగింది

మన దేశంలో ఆత్యయికపరిస్థితిని ప్రకటించి సరిగ్గా ఒక సంవత్సరం అయింది. అంతకు ముందు మరోరకమైన పరిస్థితులు ఉండేవా అని దిగ్భ్రమ పొందవలసినంతగా యావత్ దేశంలోను పరిస్థితులు సంపూర్ణంగా మారిపోయినాయి. ఈ నాడు మన దేశం ప్రశంసనీయంగా తయారైంది. మన దేశం ఆర్థికవ్యవస్థలో సర్వతోముఖమైన అభివృద్ధి వచ్చింది. నిరాశానిస్పృహల స్థానంలో ఆశతోను, అభ్యుదయ పతీక్షతోను కూడుకున్న వాతావరణం ఏర్పడింది. అన్నింటికి ముఖ్యంగా, ఒక సంఘటితజాతిగా మన రాజ్యాంగంలో ఏ ఆదర్శాలను మనం వరించామో వాటి వల్ల అంకితభావం, క్రమశిక్షణ ఆవశ్యకతను గుర్తించిన క్షణాలు బాగా ప్రస్ఫుటం అవుతూ వున్నాయి.

### ఉద్యోగుల వైఖరిలో మార్పు

మొత్తం దేశం పారిపాలన కంతా బాధ్యత వహించే పేర ఉద్యోగులు మన ప్రధాని పిలుపును అందుకున్నారు. తత్పరతతో , ఉత్తమపద్ధతిలో ఉద్యోగనిర్వహణ

చెయ్యడానికి వారు పూనుకున్నారు. ఆ ఉద్యోగుల వైఖరిలో గణనీయమైన మార్పు వచ్చింది. న్యాయంగా తాము ప్రజాసేవకులమని, ఉద్యోగులుగా తమ మనుగడ ప్రజాసేవ చెయ్యటంపైననే ఆధారపడి ఉందని ఇప్పుడు వారు గుర్తించారు. ఇంత తక్కువ కాలంలో వచ్చిన ఈ మార్పు నిజంగా ఆశ్చర్యం కొలుపుతుంది. కార్యస్థానాలకు సరియైన వేళలలో రావడం, హాజరుగా ఉండటం, తాము చేయవలసిన విధులను నిర్వహించటం, తమ వద్దకు వచ్చే జనాన్ని మర్యాదగా ఆదరించడం- వీటన్నింట్లోను ఎంతో మెరుగుదల వచ్చింది. సర్వజన శ్రేయస్సుకోసం తలపెట్టిన కార్యకలాపాలలో పాల్గొనాలని వారు చూపుతున్న ఆసక్తి ప్రశంసాపాత్రంగా ఉంది. సమాజంలో మార్పు రావాలంటే ఈ ఉద్యోగులే ప్రశస్తమైన సాధనాలు అని గుర్తించినప్పుడు, వీరిలో వచ్చిన ఈ పరివర్తన దేశంలో ఆత్యయికపరిస్థితిని ప్రకటించడం వల్ల వచ్చిన ఉత్తమలాభాలలో ఒకటి అని చెప్పవచ్చును. అధికారంలో ఉన్న రాజకీయపక్షాలు అసమర్థులను, అవినీతిపరులను ఏరివేయటం విషయంలో కాఠిన్యం చూపించటం వల్ల అధికారుల ప్రభుత్వ ఖజానాకు, ప్రజాసౌకర్యాలకు చెఱుపు కలిగిస్తూ ఆటలాడలేమని గ్రహించి బాధ్యతలను గుర్తించడం జరిగింది. ఈ వైఖరి కనుక నిలబడి అభివృద్ధి పొందితే మన దేశం సాధించవలసి ఉన్న లక్ష్యాలను సుకరంగా సాధించగలమనటంలో అతిశయోక్తి లేదు.

### ధరలు తగ్గాయి

దేశంలో ఆర్థికపరిస్థితి క్షణక్షణమూ పెరిగి, అదుపు తప్పిపోతున్న ద్రవ్యోల్బణ శక్తుల పాదాల క్రింద నలిగిపోక తప్పదని ఆర్థికవేత్తలు నిట్టూర్చే స్థితినుంచి బయటపడి, స్థిరత్వాన్ని సాధించింది. అభివృద్ధి చెందిన ఇతరదేశాలతో పోల్చి చూసినప్పుడు, ద్రవ్యోల్బణం సాలుసరి రేటు తిరోగమనముఖం పట్టింది. ధరలు తగ్గడం మొదలైంది. ప్రజలు కొంతరవకు ఊపిరి పీల్చుకొని అమ్మయ్య అనుకుంటున్నారు. ఆత్యయిక పరిస్థితి ముందు రోజురోజుకూ ధరలు పెరిగిపోతూ ఉండేవి. ఇప్పుడు ధరలలో నిలకడ ఏర్పడింది. ఆత్యయికపరిస్థితి ప్రకటించడం వలన వచ్చిన మరోలాభం ఇది. ధరల తగ్గుదల వల్ల జీవనప్రమాణం మెరుగైంది. రూపాయి విలువ పెరిగి ఇప్పుడు అదే మొత్తానికి ఎక్కువ సామానులు, సౌకర్యాలు, సేవలు సామాన్యమానవుడికి లభిస్తున్నాయి. అగత్యమైన ఆ నాటి పరిస్థితులలో మన ప్రధాని మెలకువతో ఆత్యయిక పరిస్థితినే ప్రకటించి ఉండకపోతే ఇది సాధ్యమయ్యేదేనా? అని ఆలోచించవలసి ఉంది. నిజంగా సాధ్యమయ్యేది కాదు.

## పారిశ్రామికప్రశాంతి

ఆర్థికరంగంలోనే యింకా గమనిస్తే, ఈ సంవత్సరకాలంలో పుష్కలమైన పంటలు పండి వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో అధికోత్పత్తి జరిగినట్లు చూడవచ్చు. ఆ మాటలకు వస్తే వ్యవసాయ ఉత్పత్తులు ఎంతగా పెరిగినాయంటే, ఈ ధాన్యాన్ని, గోధుమలను సురక్షితంగా నిల్వచేయడం ఎట్లా అనేది ఒక పెద్ద సమస్య అయింది. గణాంకశాస్త్రవేత్తలుగాని, ఆర్థికవేత్తలుగాని, యింత సమృద్ధి అయిన ఉత్పత్తి జరుగుతుందని ఊహించనైనా ఊహించలేకపోయినారు. మన ఆర్థికరంగంలో వచ్చిన ఈ సంతోషకరమైన సంఘటనలకు వారు నివ్వెరపోతున్నారు. అయితే ఇందువల్ల ధాన్యం కొంచెం తగ్గి, ఉత్పత్తి దారులకు కాస్త యిబ్బంది కలిగిన మాట నిజమే. కాని ఉత్పత్తి దారులకు మద్దతు ధరలను యిచ్చే విషయమై జాతి ముందుకు రాగలిగింది. అత్యయికపరిస్థితి కారణంగా ఏర్పడిన పారిశ్రామికప్రశాంతి మూలాన పారిశ్రామిక ఉత్పత్తి కూడ గణనీయంగా పెరిగింది. అడ్డదిడ్డంగా జరిపే సమ్మెలూ, ట్రేడ్ యూనియనులలో చేరిన కొందరు అతివాదుల హానికరధోరణి, పారిశ్రామిక ఉత్పత్తి పెంపుదల సాధించటానికి పెద్ద అవరోధంగాను, తలనొప్పిగాను పరిణమించింది. కాని ఈ సంవత్సరకాలంలో అది లేకుండా చక్కని సుహృద్భావవాతావరణం సాధించగలిగి నందువల్ల ఉత్పత్తులు పెరిగి, జాతీయసంపద పెరిగి, ఆ సత్ఫలితాలను పరిశ్రమలు, కార్మికులు అనుభవించగల స్థితి ఏర్పడింది.

## విద్యారంగంలో క్రమశిక్షణ

విద్యారంగంలో చూస్తే పూర్వం మాదిరిగా విద్యార్థులు తమ తమ విద్యాలయాలకు, చదువులకు తిరిగి వెళ్లిపోవటం జరిగినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. విద్యాసంస్థలకు ఒక ప్రయోజనకరమైన పాత్ర ఉన్నది. అందుకు భిన్నమైన మన ఆటలు సాగవు అనే ఎరుక వారిలో ఏర్పడింది. మన రాష్ట్రంలో సంగతే చూస్తే పబ్లిక్ పరీక్షలలో ఫలితాలు తక్కువైనప్పటికీ తాత్కాలికంగా రాష్ట్రంలోని విద్యాపాలన రంగంలో కొన్ని చిక్కులు ఏర్పడినప్పటికీ మొత్తం మీద విద్యాప్రమాణాలను పూర్వం మాదిరిగా ఉన్నతస్థాయికి తీసుకుపోగలిగామన్న సంతృప్తి నాకు ఉన్నది. విద్యార్థులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు శ్రేష్ఠమైన విద్యనేర్పాలని అభిలషించటం, ఆశించటం మొదలుపెట్టగానే అటువారికి, ఇటు విద్యార్థులకు తృప్తి కలిగించాలనే ఒత్తిడితో ఉపాధ్యాయులు మరింతగా బాధ్యత తీసుకుంటున్నారు. ఆరాటంతో ఉన్న

తల్లిదండ్రులు, కుతూహలంతో వచ్చే విద్యార్థులు వృత్తిరీత్యా తాము సఫలత సాధించకపోతే ఊరుకోరనే విషయాన్ని ఉపాధ్యాయులు గుర్తించారు. పాఠాలు చెప్పడం, పిల్లలచేత హోంవర్కు చేయించడం, వారిని సక్రమంగా పరీక్షించడం మొదలయిన వాటిలో ఉపాధ్యాయులు చూపవలసిన శ్రద్ధ చూపుతున్నారు. ఇందువల్ల మనదేశంలో భావిపౌరులకు సముచితశిక్షణ లభిస్తుందని నమ్మకం కలుగుతున్నది. ఒక్క సంవత్సరం అత్యయికపరిస్థితి వల్లనే ఇంతటి మార్పు సంభవిస్తే, అత్యయిక పరిస్థితిని ఉపసంహరించిన తర్వాత కూడా ఈ చిత్తశుద్ధి కొనసాగితే ఎంతెంత ప్రయోజనాలు సిద్ధిస్తాయో మీరు ఊహించగలరు.

## 20 సూత్రాల పథకం వరప్రసాదం

అత్యయికపరిస్థితిని ప్రకటిస్తూనే మన ప్రధాని దేశ ఆర్థిక, సాంఘికజీవితాన్ని తీర్చిదిద్దే 20 సూత్రాల ప్రణాళికను కూడా ప్రకటించారు. శ్రద్ధాసక్తులతో ఈ కార్యక్రమాన్ని దేశమంతటా అమలు జరుపుతున్నారు. ప్రధాని 20 సూత్రాల ప్రణాళికను బాగా అమలు పరచటంలో వివిధ రాష్ట్రప్రభుత్వాల మధ్య వాంఛనీయమైన స్పర్ధకూడా గోచరిస్తున్నది. మూడు దశాబ్దాలుగా మన దేశం సాధించిన ప్రగతి అనుభవించడానికి నోచుకొనే దళితవర్గాలవారికి, వెనుకబడిన వర్గాల వారికి ప్రధాని 20 సూత్రాల ప్రణాళిక ఒక వరప్రసాదమైంది. ఈ ప్రణాళికద్వారా వెనుకబడిన వర్గాల వారికి సంక్షేమపథకాలు లభ్యంకావడంతో పాటుగా సమాజంలోని ఒక భాగం వారు నికృష్టజీవనం గడుపుతుంటే తక్కిన వారు సుఖభోగాలలో ఓలలాడటం సాధ్యంకాదనే జాగృతి ఏర్పడింది. సంపన్నవర్గాల వారు కూడా ఈ సత్యాన్ని యిప్పుడు గుర్తించారు. ఇంత స్వల్పకాలంలోనే సంపన్నవర్గాలలో ఇంత పరివర్తన రావటం, క్రొత్తగా ఏర్పడిన పరిస్థితులకు అనుకూలంగా మారిపోవడం, తమకున్న కలిమిని దురదృష్టవంతులయిన సోదరప్రజలతో చేరి పంచుకు తినవచ్చుననే త్యాగబుద్ధి అలవడటం జరిగిందంటే ఆశ్చర్యం కాక మరేమిటి? భూసంస్కరణలు, పట్టణపు ఆస్తులపై గరిష్ఠపరిమితుల విధింపు మొదలైన చర్యలు తీసుకుంటున్నప్పుడు సంపన్న వర్గాలవారు ఎంతమాత్రం వాటిని నిరోధించడం లేదు.

## ప్రజాసంక్షేమం కోసం

సంఘవిద్రోహశక్తులకు చక్కటి గుణపాఠం అబ్బింది. నల్లబజారు వర్తకులు, స్మగ్లరులు మొదలయిన వాళ్లంతా తమ ఎత్తు ఎంత మాత్రం సాగదని గ్రహించారు.

పన్నులెగవేసిన వారందరూ పశ్చాత్తాపపడి ఆదినుంచి నిజాయతీగా ఉండకపోతిమే అని అనుకుంటున్నారు. సంఘవిద్రోహశక్తులలో వచ్చిన ఈ మార్పు దృష్ట్యా మునుముందు బలహీనవర్గాల వారి శ్రేయస్సుకై ప్రభుత్వం చక్కని ప్రణాళికలను చేపట్టగల అవకాశాలు పెరిగినాయి. ఆత్యయికపరిస్థితి వల్ల ఏర్పడిన యిన్ని రకాల ప్రయోజనాలదృష్ట్యా, ఇంతచక్కని ఫలితాలదృష్ట్యా ఈ పరిస్థితి చిరకాలం సాగితే బాగుందనే భావన కూడా లేకపోలేదు. ఐతే ఇది ఎట్లాఉన్నా ముఖ్యంగా కొనసాగవలసింది ఈ రకమైన చిత్తవృత్తి. మనోవైఖరి, క్రమశిక్షణ, అంకితభావం వల్ల మేలు పొందేది దేశమేకాదు, తాముకూడా అని ప్రజలు గుర్తించారు. ఆత్యయిక పరిస్థితిని ప్రకటించి, దేశాన్ని విపత్తునుండి రక్షించడంలో మన ప్రధాని తీసుకున్న వివేకవంతమయిన ఈ చర్యలవల్ల మనం యితర దేశాలముందు తలఎత్తుకునే నిలబడగలిగాం. ఇందుకోసం మనమంతా ప్రధానిపట్ల కృతజ్ఞులమై ఉండి, సత్వరంగా ఇతోధికమైన అభివృద్ధి సాధించడానికి ఆమె నాయకత్వం చిరకాలం మనకు లభించాలని కోరుకోవాలి.

*(26-6-1976)*

# 5. ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు

బాలలూ, పెద్దలూ అన్న భేదం కేవలం వ్యావహారికమైనది. నిన్న మొన్నటిదాకా బాలలుగా ఉన్న మనం ఈ నాడు పెద్దలమై మన బాలల సాంస్కృతికావసరాలు తీర్చడానికి, వారిలోని నిగూఢశక్తులు సమగ్రవికాసం పొందేట్టు దోహదం చేయడానికి బాలల అకాడమీ స్థాపించి, ఈ నాడు ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలనూ, ఉత్సవాలనూ జరుపుకుంటున్నాం. ఇలాగే ఇవాళ బాలలుగా ఈ ఉత్సవాలలో పాల్గొంటున్న వారు మన కళ్ల ఎదుట పెరిగి పెద్దవారై డాక్టర్లో, ఇంజినీర్లో, లాయర్లో అయి, మళ్లీ వాళ్లతరం బాలల శ్రేయస్సుకోసం కృషి చేస్తారు. మానవజీవితం ఎడతెరిపిలేని ఒక నిత్యవాహిని. దీనిలో బాల్యం, యౌవనం, వార్ధక్యం అనేవి కేవలం దశాభేదాలు మాత్రమే.

ఇప్పుడు పెద్దలమైన మనలో చాలామంది బాల్యం అస్వతంత్ర భారతదేశంలో గడిచింది. అప్పుడు మనకు పాఠ్యగ్రంథాలు తప్ప మనం ముచ్చటపడి సరదాగా చదువుకోవాలనిపించే బాలసాహిత్యం ఎక్కువగా లభ్యం అయ్యేది కాదు. బాలలకు కొత్త నీతులు బోధించడానికి రుక్మిణీపరిణయం, సుమతి శతకాల్లాంటి ప్రాచీన గ్రంథాలూ, శ్రీ కందుకూరి వీరేశలింగం, శ్రీ వావిలికొలను సుబ్బారావు వంటి పెద్దలు బాలలకోసం వ్రాసిన నీతిగ్రంథాలూ మనచేత పెద్దవారు చదివించేవారు. కాని అవి మనల్ని ఎక్కువగా ఆకర్షించి అలరించ గలిగేవికావు. అందుచేత పెద్ద వాళ్లకోసం వ్రాసిన అగ్గిరాముడు, భలేరాముడు మొదలైన డిటెక్టివ్ నవలలే పెద్దవాళ్లు చూడకుండా మనమూ ఆ రోజుల్లో చదువుతూ ఉండేవాళ్లం !

శ్రీయుత వేంకట పార్వతీశ్వరకవులు, శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ చింతా దీక్షితులు, డా॥ గిడుగు సీతాపతి లాంటి పెద్దలు ఈ రోజుల్లోనే బాలలకు సరదా కలిగించి చదివించే సృజనాత్మకరచనలు అవసరమని గుర్తించారు. తెలుగులో బాలసాహిత్యసృష్టికి ఆ నాడే అంకురార్పణం జరిగింది. తరువాత స్వతంత్ర భారతదేశంలో ఇతరరంగాలన్నిటిలో లాగానే బాలసాహిత్యాభివృద్ధికి వీలుగా తగినంత ప్రోత్సాహం లభించడంతో, శ్రీ న్యాపతి రాఘవరావు (రేడియో అన్నయ్య), శ్రీమతి

న్యాపతి కామేశ్వరి (రేడియో అక్కయ్య) రేడియో ద్వారానూ, బాల పత్రిక ద్వారానూ, దేశమంతటా బాలానంద సంఘాల ద్వారానూ బాలలలో నూతనోత్తేజం, నూతనోత్సాహం కలిగించడానికి కృషిచేశారు. 'బాల' పత్రిక, చందమామ, బాలమిత్ర వంటి ఇతర పత్రికలూ బాలసాహిత్యరచయితలకు ప్రోత్సాహాన్నిచ్చి, బాలసాహిత్యం విరివిగా వెలువడడానికి దోహదం చేశాయి. వివిధప్రచురణకర్తలు కూడా బాలసాహిత్యం ప్రకటించేందుకు ముందు వచ్చారు.

తెలుగు వాఙ్మయం, తెలుగు కళాప్రతిభ వివిధ రంగాలలో సర్వతోముఖాభివృద్ధి సాధించాలంటే కేవలం ప్రజల ఉద్యమాలవల్లనే సాధ్యం కాదనీ, ప్రజాప్రభుత్వ సహకారం కూడా అందుకు అవసరమనీ గుర్తించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వివిధ అకాడమీలను స్థాపించింది. తరువాత బాలవాఙ్మయం సమగ్రాభివృద్ధికి తోడ్పడడానికి, తెలుగు బాలలోని విశిష్ట సృజనాత్మకశక్తుల వికాసానికి, ప్రతిభా పాటవ పోటీలు నిర్వహించి వారిని ఉత్తేజపరచడానికి ఒక బాలల అకాడమీ కూడా స్థాపించాలని సంకల్పించింది. తత్ఫలితంగానే 1976 మార్చి నెలలో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ వెలసింది. భారతదేశంలో మొట్టమొదటి బాలల అకాడమీ మన రాష్ట్రంలోనే వెలసినందున తెలుగువారు గర్వపడవచ్చు. ఇంకా ఏడాది కూడా పూర్తిగా నిండని బాలల అకాడమీ సాధించిన దానికంటె సాధించవలసింది సహజంగా ఎక్కువగా ఉంటుంది. శాఖోపశాఖలుగా అకాడమీ కార్యక్రమాలను విస్తరింపజేసుకునేముందు దేశంలో బాలసాహిత్యాభివృద్ధికి కృషి చేస్తున్న పెద్దలందరినీ సమావేశపరచి తాను సంకల్పించిన కార్యక్రమాల విషయంలో వారి అమూల్యమైన సలహా సహకారాలను పొంది వక్తృత్వం, వ్యాసరచన, పద్యరచన, చిత్రలేఖనం, ఫోటోగ్రఫీ, నాటకాలు, నృత్యం, సంగీతం మొదలైన వివిధరంగాలలో ప్రతిభ ప్రదర్శించే బాలలనందరినీ రప్పించి, వారికి ఆయా రంగాలలో సిద్ధహస్తులైనవారిచేత సందేశాలు ఇప్పించాలని ముఖ్యంగా ఈ మహాసభలను ఏర్పాటు చేయడం జరిగింది.

మహాసభల సందర్భంగా ప్రత్యేకసంచిక ప్రకటించే సంకల్పంతో వ్యాసాలు పంపవలసినదని అర్థించినదే తడవుగా, దేశంలో బాలసాహిత్యాభివృద్ధికి కృషిచేస్తున్న ప్రముఖరచయితలందరూ తమ ముఖ్యవ్యాసాలు పంపి మా సంకల్పాన్ని సఫలం చేసేందుకు వారినందరికీ నా కృతజ్ఞత. సంచిక ముఖచిత్రానికి సోవియట్ భూమి నెహ్రూ అవార్డు నందుకొన్న చిరంజీవి బి. సుధారెడ్డి రచించిన చిత్రాన్ని ఎన్నుకొన్నాము.

చిరంజీవికి ఆశీస్సులు. చర్చాసదస్సులతో, వినోదకార్యక్రమాలతో బాల చిత్రకళా, పుస్తకప్రదర్శనలతో నాలుగు రోజుల పాటు జరుగుతున్న ఈ ఉత్సవాలు నిర్దిష్ట లక్ష్యాలు సాధించి, విజయవంతంగా పూర్తికాగలవని ఆశిస్తున్నాను.

*(ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు ప్రత్యేక సంచిక 1977)*

# 6. సాంఘికసంక్షేమం- హరిజనోద్ధరణం

మహాత్మా గాంధీజీ నాయకత్వాన లోకోత్తర మహత్తర సత్యాగ్రహసంగ్రామంలో అశేషప్రజానీకం పాల్గొని, చేసిన త్యాగాల ఫలితంగా స్వాతంత్ర్యం వచ్చింది. స్వాతంత్ర్య భారతదేశ పౌరులుగా 24 సంవత్సరాలు అనుభవించాం. 25వ స్వాతంత్ర్యోత్సవ శుభసమయంలో అడుగిడుతున్నాము.

స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా మనం సాధించిన పురోగతిని గురించి పరిశీలించి, ముందు జరుగవలసిన కార్యక్రమాలను గురించి సమీక్షించవలసిఉన్నది. ముఖ్యంగా మనం పరిశీలించవలసినది హరిజనసమస్య. ఆర్థికంగా అట్టడుగున అణగారిపోతూ, సామాజికంగా అంటరానివారిగా నికృష్టమైన జీవితం గడుపుతూ ఉన్న బలహీనవర్గాలలో బలహీనులైన హరిజనుల గురించి ఆలోచించటం ప్రతి భారతీయుని ప్రథమకర్తవ్యం.

స్వాతంత్ర్యం రాకముందే వారి పరిస్థితులను గాంధీజీ గమనించి, హరిజనుని పేరుపెట్టి, అంటరానితనాన్ని పోగొట్టుటకు సమాజంలో వారికి సముచితమైన గౌరవస్థానం కలిగించుటకు ప్రత్యేకకృషి చేశారు. దేశమంతటా పర్యటించి హరిజన సేవకసంఘాలను నెలకొల్పి, అంటరానితనం నిర్మూలించటానికి తీవ్రమైన ఉద్యమాలను నడిపారు. వారికి ప్రత్యేక సదుపాయాలను నెలకొల్పుటకు పునాదులు వేశారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆ బాధ్యతను కేంద్ర-రాష్ట్రప్రభుత్వాలు స్వీకరించాయి. భారత రాజ్యాంగ చట్టంలో హరిజనులకు ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో ముందుకు తీసుకొని వెళ్లటానికి రక్షణలు కల్పించబడినాయి. అందువలన కేంద్ర రాష్ట్ర మంత్రి వర్గాలలో ప్రాతినిధ్యం కలిగి హరిజనులు రాజకీయ ప్రాధాన్యాన్ని పొందకలిగారు. కీ.శే. శ్రీ దామోదరం సంజీవయ్య గారు ప్రథమ హరిజన భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులుగా పీఠం అధిష్ఠించారు. బాబూ జగ్జీవనరాం దేశరక్షణ మంత్రిగా అతి చాకచక్యంగా నిర్వర్తించారు. మన ఆంధ్రప్రదేశ్‌లో శ్రీ పి.వి. నరసింహారావుగారు తన మంత్రి వర్గంలో నలుగురు హరిజనులకు స్థానం కల్పించి అందరి ప్రశంసలకు పాత్రులైనారు.

అంటరానితనాన్ని పోగొట్టేందుకు అనేకచట్టాలు చేయబడ్డాయి. హరిజనులపై అత్యాచారాలు జరుగకుండ సాంఘికన్యాయం చేకూర్చేందుకు సర్వీసులలో రిజర్వేషను అమలు జరుపుటకు, ఆర్థిక, విద్యాభివృద్ధి కార్యక్రమాలను సమీక్షించుటకు ముఖ్యమంత్రి అధ్యక్షతన ఉన్నతాధికారసంఘాలను నియమించుటకు, కలెక్టరు అధ్యక్షులుగా జిల్లా స్థాయి సంఘాలను వేయుటకు నిర్ణయాలు తీసుకొనబడినవి. అంటరానితనం నిర్మూలించుటకు సాంఘిక సేవాకార్యకర్తలను ప్రోత్సహించుటకును, వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించుటకు ప్రభుత్వం నిర్ణయించినది.

మన రాష్ట్రంలో హరిజనులకు ఆర్థికంగా తోడ్పడి వారి జీవనస్థాయిని పెంచుటకు అనేక అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుపుతున్నాము. బలహీనవర్గాలకు మన రాష్ట్రంలో పంచిపెట్టబడిన 20 లక్షల ఎకరాలలో మూడువంతులు హరిజనులకు ఇవ్వబడ్డాయి. పెద్ద పెద్ద భూస్వాముల అక్రమాలలోనున్న ప్రభుత్వభూములను హరిజనులకు యివ్వాలి అని ఆదేశించడం జరిగినది. ఆర్థికవ్యత్యాసాలు తొలగించుటకు భూసంస్కరణల చట్టం తేబడినది. ఈ దఫా సక్రమంగా, నిర్దుష్టంగా చట్టాలను అమలు జరపాలని పీడిత ప్రజల ఆశాజ్యోతయిన మన ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు గారు అన్యాక్రాంతాలను నిషేధిస్తూ ఆర్డినెన్సులను తెచ్చారు. భారతదేశంలోని ఆదర్శమైన చర్యలను మన ముఖ్యమంత్రి తీసుకొని సర్వజనుల ప్రశంసలకు పాత్రులైనారు. ఈ చట్టాలద్వారా మిగులు భూములను హరిజనులయిండ్లస్థలాలలోను, వ్యవసాయమునకు యివ్వడానికి ప్రాధాన్యం యివ్వబడుతున్నది. పేదలకు యిచ్చిన బంజరు భూములను సాగుబడిచేసి సద్వినియోగపరచుటకు, పంపిణీలో లోటుపాట్లను తొలగించుటకు త్వరలోనే ప్రభుత్వం ఉన్నతాధికార పరిశీలకసంఘాన్ని నియమించుటకు నిర్ణయించింది.

హరిజనులు వారి ఉపవృత్తులను అభివృద్ధిపరచుకొని, జీవనోపాధిని పెంపొందించుకొనుటకు ఆర్థిక సహాయకార్యక్రమాల క్రింద వ్యవసాయ పరికరాలు, పాడిపరిశ్రమ, చిన్నతరహా వ్యాపారం చేసుకొనేందుకు గత సంవత్సరం 64 లక్షలు, యీ సంవత్సరం 74 లక్షలు ప్రభుత్వం ఖర్చుపెడుతూంది. ఈ ఆర్థికసహాయ కార్యక్రమాలను పెంచాలని ప్రభుత్వం భావించి, హరిజనాభివృద్ధి, ఆర్థికాభివృద్ధి కార్పొరేషను ఏర్పాటు చేయాలని నిర్ణయించింది. లెదర్ బోర్డును పటిష్ఠం చేయుటకు ఆలోచించుతున్నది. ఎక్కువ సంఘాలను గౌరవస్థానం కలుగవలెనంటే ఆర్థికసౌష్ఠవం కావాలి. ఆర్థికవ్యత్యాసాలు తొలగితేనే సాంఘికవ్యత్యాసాలు తగ్గుతాయి. అందుకని హరిజనుల ఆర్థికస్థితిగతులను మెరుగుపరచడానికి ప్రభుత్వం తీవ్రచర్యలు

తీసుకుంటున్నది. వాటి అమలుకు పూర్తి సహకారం లభిస్తే సత్ఫలితాలు కలుగుతాయి. అనారోగ్యమునకు ఆలవాలమై, అగ్నిప్రమాదాలకు గురై విపరీత కష్టనష్టాలు పొంది చిన్న చిన్న గుడిసెలలో నివసిస్తున్న హరిజనుల గృహవసతి కల్పించాలని ప్రభుత్వం తలపెట్టింది. జీవితబీమా సంస్థ వద్ద 10 కోట్ల రూపాయల ఋణాలు తీసుకొని 55,000 యిండ్లను కట్టిస్తున్నాము. 20,000 ఇండ్లు పూర్తయినాయి. ఇటువంటి బృహత్తరపథకాలు అమలు జరిపిన కీర్తి ఆంధ్రప్రదేశ్‌కే దక్కింది.

హరిజనులకు యిండ్లస్థలాలను ఉచితంగా యిస్తున్నాము. ఈ పథకం క్రింద గత సంవత్సరం కోటిన్నర రూపాయలు ఖర్చుపెట్టినాము. ఈ సంవత్సరం అంత మొత్తాన్ని ఖర్చుపెట్టడానికి నిర్ణయించాము. గ్రామాలలో 14 లక్షల వ్యవసాయ కూలీలకు యిండ్ల స్థలాలను యివ్వటానికి 64 కోట్లతో బృహత్తరపథకం తయారు చేయించి భారతప్రభుత్వానికి పంపాము. హరిజనవాడలో మంచినీరు, రోడ్లు, పాయిఖానాలు, మురుగు పారుదల సౌకర్యాలకు, విద్యుచ్ఛక్తి సప్లయికి అత్యధిక ప్రాధాన్యం యివ్వబడుతున్నది.

స్వాతంత్ర్య రజతోత్సవముల సందర్భంగా సమాజంలో హరిజనులకు, రాజకీయ, ఆర్థిక, సాంఘికరంగాలలో సముచితమయిన గౌరవస్థానం కల్పించేందుకు దీక్షతో ప్రభుత్వం కృషిచేస్తుందని, అందులకు సర్వజనులు సహకరించవలసిందిగా అర్థిస్తున్నాము.

*(ఆకాశవాణి ప్రసంగం 6-8-72)*

# 7. అవినీతిని నిరోధించడం ఎలా?

(**1972** అక్టోబరు 22వ తేదీన గుంటూరులో జరిగిన అవినీతి నిరోధక కార్యక్రమాల గోష్ఠి సందర్భంగా యిచ్చిన ప్రారంభోపన్యాసం పూర్తిపాఠం)

**ఒక కొత్త తరహా సదస్సు**

సదస్సులు, సమావేశాలు, గోష్ఠులు, సమష్టి చర్చలు, వర్క్‌షాపులు మొదలగునవి ఏ సమాజంలోనైనా ఆధునికచర్చాసాధనాలు. అభివృద్ధి పొందుతున్న సమాజాలలో యివి మరింత ప్రయోజనకరమైనవి. వీటిలో చర్చించబడే సమస్యలు అనేకవిషయాలకు సంబంధించి- దాదాపు మానవజీవిత వ్యవహారాలన్నింటికీ సంబంధించివుంటూ వుంటాయి. అయినా అవినీతి నిరోధకచర్యలను గురించిన గోష్ఠి అనేది ఒక కొత్త తరహా ఊహగా ఎవరికైనా అనిపిస్తుంది. నాకూ అలా అనిపించింది. అవినీతి నిరోధక చర్చాసదస్సుకు ప్రారంభోత్సవం చేయమని నన్ను కోరినప్పుడు, నేను కొంచెం తటపటాయించాను. ఎందుకంటే యిది చాలా ఆధునికమైన ఊహగా కనిపించింది. కాని దేశంలో ఎక్కడ చూసినా అవినీతిని గురించిన చర్చ సాగుతున్న ప్రస్తుత సమయంలో, యీ ఆహ్వానాన్ని అంగీకరించటమే సరైన విధానమని తోచి, దీనికి అంగీకరించాను. అంతేగాక తరచుగా వినపడుతున్న యీ అవినీతి పరిస్థితులకు సంబంధించిన ముఖ్యవిశేషాలను యీ సదస్సు వెలుగులోకి తెస్తోందని కూడా ఆశించి నేను యీ ఆహ్వానాన్ని అంగీకరించాను.

**అస్తమానం అవినీతిని గురించే ...**

ఏరోజు చూసినా ఉదయం నుండి సాయంత్రం దాకా ప్రతివాడూ అవినీతిని గురించిన మాటలే వినడమో, చదవడమో జరుగుతూవుంటుంది. మామూలు ప్రసంగాల్లోనూ, వ్యక్తిగతసంభాషణల్లోనూ, బహిరంగసమావేశాల్లోనూ, పత్రికల్లోనూ, కార్యక్రమాల్లో కలిసిన సందర్భాల్లోనూ అవినీతిని గురించిన చర్చలు అనంతంగా వినిపిస్తుంటాయి. చివరకు యిదికూడా ఒక జీవిత విధానం అని విశ్వసించేటంత ఎక్కువగా యీ మాటలు మనం వింటున్నాం. ఒకొక్కప్పుడు వ్యక్తులను గురించి,

మహోన్నతులైన వ్యక్తులను గురించి యిటువంటి అభాండాలు విన్నప్పుడు మనసులో చింతపడడం, మన దేశం ఏమైపోతున్నదా అని విచారించడం తప్పనిసరిగా జరుగుతుంటుంది. ఈ అవినీతి యింతభారీ ఎత్తున ఉన్నదేశం మనదేశం ఒక్కటేనా? యితర దేశాల్లో అవినీతి లేనేలేదా? అనే ఆలోచన నాకు తరచు కలుగుతూ ఉంటుంది. లేదా అతిశయోక్తులకు అలవాటుపడ్డ జాతిగా మనం చీమంత దాన్ని కొండంతగా భావించుకుంటున్నామా అనికూడా అనిపిస్తుంటుంది. ఈ ప్రశ్నలకు జవాబులు చెప్పుకోవడం సులభమే. ఈ అవినీతి అనే దురభ్యాసం ప్రతి దేశంలోనూ వుంది. మన దేశంలో కొంచెం ఎక్కువగా వుండివుండవచ్చు. లేక మనమే అతిశయోక్తిగా దానిని గురించి చెప్పుకుంటూ వుండవచ్చు. మనదేశంలో అవినీతిని గురించి ఒక విషయం మాత్రం గట్టిగా చెప్పవచ్చు. ఒక్కొక్కప్పుడు అవినీతిని గురించి స్వేచ్ఛగా, హృదయపూర్వకంగానే మాట్లాడుతూ వుంటారు. కాని ఎక్కువ భాగం ఇతరులమీద ఈర్ష్యాద్వేషాలతోనే యీ ఆరోపణ చేస్తుంటారు. ఏదయినా ఒక ఉత్తర్వు చేసినా, ఒక చర్యతీసుకున్నా అవినీతికరమైన ఉద్దేశాలతో ఆ పని జరిగినట్లుగా విమర్శ చెలరేగుతుంటుంది. అంటే ఎటువంటి చర్య తీసుకున్నా అది అవినీతికరమైన దురుద్దేశంతోనే తీసుకోబడినట్టుగా వ్యాఖ్యానించడం జరుగుతుంది. ఏ రంగానికి చెందినవారైనా అవినీతిపరులైన వారిని వెనకేసుకురావడం నా అభిమతం కాదుకాని అవినీతిని గురించి యింత విచ్చల విడిగా మాట్లాడుతూ వుండడం మన సంఘానికి చాలా నష్టాన్ని కలిగించిందని నాకు దృఢమైన విశ్వాసం ఉన్నది. అందువల్ల మనలో ప్రతి ఒక్కరు యీ అవినీతి భూతాన్ని తుదముట్టించడానికి ప్రయత్నించడమేకాక గడియ గడియకూ బాధ్యతా రహితంగా దానిని గురించి మాట్లాడాలనే అలవాటునుకూడా తొలగించుకోవాలని నా అభిప్రాయం. అందువల్ల ఓం ప్రథమంగా యీ సదస్సులో యీ నా అభిప్రాయాన్ని నివేదిస్తున్నాను. అవినీతిని తుదముట్టించడానికి తగు చర్యలు తీసుకుందాం. కాని దానిని గురించి అనవసరంగా అతిగా మాట్లాడడం మానుకుందాం. ఇప్పటికే అవినీతిని గురించి ఎంతో ఎక్కువగా మాట్లాడాం. బిగ్గరగా కేకలు వేసాం. ఇంకా దానిని గురించే మాట్లాడవలసిన అవసరం లేదు.

**అవినీతి ఎందుకు జరుగుతున్నది?**

అవినీతి అనేది ఉన్నది అని మనం అంగీకరిస్తే ఎక్కడవున్నది? ఏ విధంగా వున్నది? అనే విషయాలు ఆలోచించినా మన జీవితం ప్రతిరంగంలోనూ అవినీతి ఉన్నది అనే విషయం అంగీకరించడానికి నేను వెనుకాడను. ప్రభుత్వోద్యోగుల

విషయంలోనూ, రాజకీయ వేత్తల విషయంలోనూ అవినీతిని గురించి ఎక్కువగా వినపడుతూవున్నప్పటికీ ప్రతి యితర వర్గం ప్రజలలోనూ యిది వున్నదనే విషయాన్ని నిరాకరించడానికి వీల్లేదు. ఉన్న భేదమల్లా అది ధరించే రూపాలలోనూ, అది నడిచే మార్గాలలోనూ, కాని సాధారణంగా ప్రజలు అనుకుంటున్న అవినీతి మాత్రం ప్రభుత్వోద్యోగులు, స్థానిక, రాష్ట్ర, కేంద్ర పరిపాలన నిర్వహిస్తోన్న ప్రజా ప్రతినిధులలో వుంటున్న దానిని గురించే. రాష్ట్రమంత్రిమండలి సభ్యునిగా యీ అవినీతిని గురించి నాకు కూడా చాలా ఆందోళన కలుగుతుంది. సాధారణంగా ధనరూపంలోనూ, వస్తురూపంలోనూ స్వీకరించిన దానికి ఫలితంగా చేసిన ఒక చర్య లేదా తీసుకున్న ఒక నిర్ణయం అవినీతి కరమైనదని చెప్పవచ్చు. ప్రజలెందుకు అవినీతి పరులు అవుతున్నారు? సమాధానం సులభమే. ధనవంతులై, జీవితంలో సుఖాలనుభవించి భవిష్యత్తుకోసం నాలుగు డబ్బులు వెనుకేసుకొందామనే ఆశతో అవినీతికి పాల్పడుతున్నారు. ఒక్కొక్కప్పుడు కారణం లేకపోయినా ఒక హేలగా దానికి పాల్పడుతున్నారు. బాగా ధనవంతులైనవారే అవినీతికి పాల్పడడం దీనికి నిదర్శనం. వీరి విషయంలో దీనిని దురాశగాను, లేదా మానసిక దౌర్బల్యంగాను చెప్పుకోవచ్చు. దీనిని మరి ఎలా ఆపడం? ఇది వేరే విషయం. అయినా చాలా ముఖ్యమైన సమస్య. ఈ సదస్సులో యీ సమస్యకు ఒక పరిష్కారం సాధిస్తారనే నా విశ్వాసం. ఈ సందర్భంలో నాకుతోచిన కొన్ని సూచనలు సభ్యులకు నివేదిస్తాను.

**ఇచ్చేవాడికి శిక్ష**

మొదటి సూచన యిచ్చిన వాడినీ, తీసుకున్నవాడినీ ఉభయులను తీవ్రంగా శిక్షించాలి. తరచుగా ఏదైనా ఒక పని చేసిపెట్టడానికిగాను చూపించిన ఆకర్షణవల్లనే అవతలివాడు అవినీతి పరుడు కావడానికి అవకాశం కలుగుతున్నది. కొన్ని పనులు చేయించుకోవాలనే పట్టుదలతో కొందలు అమాయకులైన ప్రభుత్వోద్యోగులనుకూడా యీ రంగంలోకి దింపి వారిని పీడించి, ఒప్పించి లేదా భయపెట్టి ఒప్పించి అవినీతి పరులుగా వారిని చేయడం జరుగుతున్నది. ఉద్యోగులను ఒప్పించడానికి వారు అనేక మార్గాలలో ప్రయత్నిస్తారు. చివరకు ఉద్యోగి లొంగిపోక తప్పనంత ఎక్కువగా వారి ప్రయత్నం వుంటుంది. ఉద్యోగి ఒకసారి బురదలో కాలుపెట్టాడా యింక దానిని వెనుకకు తీసుకోలేడు. అందువల్ల యిచ్చిన వాడినీ, పుచ్చుకున్నవాడినీ శిక్షించే చట్టం వున్నట్లయితే అది అవినీతి నిరోధకంగా పనికి వస్తుంది లేకుంటే లంచం యిచ్చినవాడు తప్పించుకోవడం జరుగుతుంది.

## ప్రవర్తనా నియమావళి

రెండవ సూచన - ప్రజా ప్రతినిధులకు మనం ఒక ప్రవర్తనా నియమావళిని రూపొందించాలి. మంత్రులు, శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు మొదలైన పదవులలోని ప్రముఖులందరూ తమ స్వంత ఆస్థి వివరాలను, కుటుంబం యొక్క ఆస్థి వివరాలను ప్రకటించేట్టు చేయాలి. మంత్రులు, తదితరులు పదవులలో వున్న కాలంలో, ప్రభుత్వ సేవకులకు వర్తించే ప్రవర్తనా నియమావళిని వారికికూడా వర్తింపచేయడం ఎంతవరకు ఆచరణీయం అని ఆలోచించాలి. ఉదాహరణకి ప్రతి ప్రభుత్వోద్యోగీ ప్రతి ఏటా తన ఆస్తికి సంబంధించిన వివరాలను ప్రభుత్వానికి నివేదించవలసియుంటుంది. అంతేకాదు ఆస్తిని కొనేటప్పుడుగాని, అమ్మేటప్పుడు గాని ముందుగా ప్రభుత్వం అనుమతిని వీరు పొందవలసి ఉంటుంది. ఇదే పద్ధతిని మంత్రులకు, తదితరులకు కూడా వర్తింపచేయడం సమంజసం అని నా అభిప్రాయం. ఆస్తికి సంబంధించిన వివరాలను రహస్యంగా వుంచకుండా బహిరంగ పరచడం చాలా అవసరం అని కూడా నేను భావిస్తున్నాను. అందువల్ల అర్థంలేని ఆరోపణలను బాధ్యతా రహితంగా ఎవరూ చేయడానికి వీలువుండదు.

## సవాలును ఎదుర్కోవడం

మూడవ సూచన ఆరోపణలకు సంబంధించినది. తరచుగా బాధ్యతారహితంగా ఎవరైనా ఆరోపణలు చేసినప్పుడు వాటిని గట్టిగా ఎదుర్కోవడం జరగడంలేదు. ఏ వ్యక్తిపైనైనా ఆరోపణలు జరిగినప్పుడు ఆరోపణలను ఖండించి, అది శుద్ధ అబద్ధం అని నిరూపించబడితే బాధ్యతా రహితంగా ఆరోపణలు చేయడం అనేది జరగకుండా నిరోధించవచ్చు. అందువల్ల ఎప్పుడైనా ఎవరిమీదనన్నా ఆరోపణలు చేయబడినప్పుడు వాటిని వెంటనే ఖండించి నిజం నిరూపించడానికి సంసిద్ధంగా వుండాలని, అప్పుడే ఆ వ్యక్తిని గురించిగాని, లేదా ఆ వ్యవస్థను గురించి గాని ప్రజలలోగల తప్పుడు భావం తొలగిపోగలదని దృఢ విశ్వాసం. అలా చేసినప్పుడు, ఆ వ్యక్తిలో ఏదోలోపం వుందిగాబోలని ప్రజలు సందేహపడడానికి వీలుండదు. కనుక ఈ విషయాన్ని గట్టిగా ఆలోచించాలి ప్రభుత్వానికి, ఆయా వ్యక్తులకు విన్నవిస్తున్నాను.

## అంతర్గత ఏర్పాటు

నాలుగవది- ప్రజా ప్రతినిధులలోనూ, ప్రజలలోనూ అవినీతిని నిరోధించేందుకు అంతర్గతమైన ఏర్పాటు ఒకటి వుండాలి. అది ఎలా వుండాలి అనేది బాగా ఆలోచించి

నిర్ణయించాల్సిన విషయం. ప్రభుత్వ సేవకులకు సంబంధించి ఒక విజులెన్స్ సెల్లు, అవినీతి నిరోధక శాఖ మొదలైనవి వున్నాయి. మంత్రులు తదితరులకుకూడా అలాటివి వుండాలి. అది పరిపాలనా యంత్రాంగంలో ఒక భాగంగా వుండాలా? లేక పార్టీ వ్యవస్థలో ఒక భాగంగా వుండి పనిచేయాలా అనేది బాగా ఆలోచించాల్సిన విషయం. ఏమయినా యిటువంటి ఏర్పాటు వుండడం మాత్రం చాలా అవసరం. పైన పేర్కొన్న పద్ధతుల్లో ఒక ఏర్పాటు వుంటే ప్రజలలో కొంత విశ్వాసాన్ని కలిగించడానికి వీలవుతుంది. ఏవైనా పొరపాట్లు, తప్పులు జరిగినప్పుడు వాటిని గురించి విచారణ చేసేందుకై ఏ కమీషన్‌నో, మరో సంఘాన్నో వెయ్యడం యిప్పటికే వున్నదనుకోండి, అయితే నా సూచన ఏమంటే, యిటువంటి వాటిని గుర్తించడానికి అంతర్గతంగా పరిపాలనా యంత్రాంగంలోనే ఒక శాశ్వతమైన ఏర్పాటు వుండడం అవసరం అని. అయితే బాధ్యతగల వ్యక్తులను బాధించి, వారు సమర్థవంతంగా పనిచేయకుండా అడ్డుపడే వ్యవస్థలుగా మాత్రం యివి తయారవ్వకుండా వుండాలి పదవులలో వున్న వ్యక్తుల సంఘ వ్యతిరేక చర్యలను నిస్సందేహంగా నిరోధించేవిగా కూడా యిది పనిచేయాలి.

### మధ్యదళారీల నిర్మూలన

అయిదవది- ప్రభుత్వోద్యోగులు, రాజకీయవేత్తలు కాని యితర వర్గాల ప్రజల్లోవుండే అవినీతిని నిరోధించడానికి మనం ప్రయత్నించాలి. ఈ దేశంలో పాతికేళ్ళ స్వాతంత్ర్యం ఒక కొత్తరకం వర్గాన్ని సృష్టించింది. వీరే యితరుల మీద ఆధారపడి జీవించే వర్గీయులు. వీళ్ళను నిరోధించకపోతే యీ దేశాన్ని వీరు నాశనం చేసేస్తారు. పనులు కావడానికి ఏజంట్లుగా వ్యవహరిస్తుంటారు వీరు. వీరినే "దళారీలు" అంటుంటాం. ఫలానా ఫలానా వ్యక్తులకు యింతింత ఫీజు చెల్లిస్తే యీ పనిచేసి పెడతాము అందుకు కొంత కమీషను కావాలని చెప్తుతుంటారు సాధారణంగా యిటువంటివారు చెప్పేది నిజంకాదు. అది వట్టి అబద్ధం. ప్రజల అమాయకత్వాన్ని ఆసరాచేసుకుని బ్రతుకుతుంటారు. అధికారంలో వున్న వ్యక్తులు యిటువంటి వారిని గురించి పట్టించుకోకపోతే వారి పేరు ప్రతిష్ఠలే దెబ్బతినగలవు. ఈ దళారీలు ప్రముఖుల వద్ద తమకు గల చనువు రాజకీయమైన సాన్నిహిత్యాన్నీ స్వప్రయోజనానికి వినియోగించుకుంటూ వుంటారు. పరిస్థితులను తమకు అనుకూలంగా మార్చుకుంటారు. ఇటువంటి సంఘ వ్యతిరేకుల కారణంగా ఎంతో మంచి పేరు నాశనం అయిపోయే ప్రమాదం వుంది. ఇటువంటి వారిమీద ఎప్పుడూ ఒక కన్ను వేసివుండడం ప్రస్తుత పరిస్థితుల్లో చాలా అవసరం. అవినీతిని సమర్థవంతంగా

దేశంనించి రూపుమాపాలంటే సంఘంలోని ప్రమాదకరమైన యీ మధ్య దళారీల కార్యకలాపాలను ఎక్కడికక్కడ నిరోధించే ఒక ఏర్పాటును గురించి తీవ్రంగా మనం ఆలోచించాలి. ఫలానావ్యక్తి యీ పని చేసిపెట్టాలంటే ఫలానా వ్యక్తిని పట్టుకుంటే సరి అనే ధోరణి తరచు మనం వింటూవున్నదే. నన్నడిగితే అసలు యిచ్చేవాడినీ, పుచ్చుకునేవాడినీ కన్న యీ మధ్య దళారీ వ్యక్తులనే గట్టిగా శిక్షించాలంటాను. అవినీతి వ్యాపకులు వారు.వీరి మార్గాలు రకరకాలు. మానవ సమాజమనే దేహంలో వీరు పుట్టకురుపు లాంటివారు. ఈ పుండును సమూలంగా తీసివేస్తేగాని మనకు ముక్తి లేదు. కేవలం ప్రజల్లో వీరు వుంటారనుకోవడానికి వీల్లేదు. ప్రభుత్వోద్యోగుల్లోనూ వీరున్నారు. ఈ సమస్యకు ఒక పరిష్కారాన్ని యీ సదస్సు సాధించగలదని నా విశ్వాసం.

**అవినీతికి కారణాలు**

అవినీతికి కారణాలు ఏమిటి? పరిశీలించినప్పుడు రెండు విషయాలు మనకు ప్రధానంగా గోచరిస్తాయి. ఒకటి భద్రత, రెండవది కోర్కె. ఆధునిక ప్రపంచంలో మానవుడి కోర్కెలకు అంతులేదు. కోర్కెలు మనిషిని వశపరచుకొని, శాశ్వతంగా మనస్సును స్వాధీనంచేసుకుని కూర్చుంటాయి. ఇంతటితో దీనికి తృప్తి అనే మాట వుండదు. లక్షరూపాయలు సంపాదిస్తావు. కోటి కావాలనే కోర్కె లోపల రేగుతూనే ఉంటుంది. సంపాదించాలనే ఆకాంక్షే అవినీతికి ప్రథమ కారణం అని చెప్పవచ్చు. దీనికి సమాధానం కొంతవరకు సోషలిజంలో దొరుకుతుంది. ఎందుకంటే ఆ వ్యవస్థలో ఒక పరిమితికి మించి, ఏ రూపంలోగాని సంపదకూడబెట్టడానికి అవకాశం వుండదు. మరొక ముఖ్యమైన అంశం భద్రత. అధికారంలో ఉన్నవ్యక్తికి తాను ఎన్నాళ్ళు అలా వుంటాడో తెలియదు. భవిష్యత్తు అస్పష్టంగా వుంటుంది. అందువల్ల కొన్ని ఆస్తులు వగైరా సంపాదించుకుని మునుముందు భద్రత పొందడానికి ప్రయత్నిస్తాడు. అంతేకాక మనదేశంలో రాజకీయ రంగంలో నిలబడగలగాలంటే కొంత ఖర్చుతోకూడిన విషయంగా తయారయింది. రాజకీయ వేత్తగా మనుగడ సాగాలంటే డబ్బుచేతిలో వుండాలి. ఏదైనా ఒక ఉన్నత పదవికి పోటీచేయాలంటే యింకా ఎక్కువ డబ్బుకావాలి. అందువల్ల వీటి అన్నిటికోసం డబ్బు పోగుచేసుకోవడం అవసరం. దీనికి పరిష్కారమార్గం నిరాడంబర జీవితంలో వుంది. జాతిపిత ప్రబోధించిన విధంగా బ్రతకడం నేర్చుకోవడంలో వుంది. జీవితంలో ఒక ఆదర్శం, లక్ష్యం లేని వ్యక్తి, సహజంగా జీవితంలోని ప్రలోభాలకు సులభంగా లొంగిపోతాడు. రాజకీయ జీవితంలో యిటువంటి ఆదర్శవంతమైన ప్రవర్తన వర్ధిల్లాలంటే ఉన్నత పదవులకు, పార్టీలోని పదవులకూ,

నీతి నిజాయితీగల, ప్రజా విశ్వాసపాత్రులైన వ్యక్తులనే నియమించుకోవడం అవసరం. పార్టీ సభ్యుల పట్ల తానెట్టి దృక్పథం అనుసరించాలో పార్టీ నిర్ణయించుకోగలిగితే, ఆ కష్టనష్టాలను భరించగలారే పార్టీలో వుంటారు. లేనివారు రాజకీయ జీవితం వదలి మరొక రంగంలోకి వెళ్తారు.

### సాంఘిక చైతన్యం అవసరం

అవినీతి పట్ల ప్రజలకు గల అవగాహన, దృక్పథం, వారిలో వుండే సాఘిక చైతన్యం వల్లనే దీనిని తుదిముట్టించడానికి వీలుంటుంది. క్రమశిక్షణగల ప్రజలు మాత్రమే అవినీతిని తుదముట్టించగలుగుతారు. మానవుడిలో స్వార్థం వున్నంతవరకు అవినీతి వుంటూనే వుంటుంది. ప్రయాణంలో రిజర్వేషన్ కావాలనుకుని ఎవరిచేతులో తడిచేసి నీకు కావలసిన పని చేయించుకుంటే నీవు స్వార్థపరుడవు అన్నమాటే. ఇచ్చేవాడు వునంతకాలం తీసుకునేవాడు వుండనే వుంటాడు. సాంఘికమైన క్రమశిక్షణ, చట్టబద్ధమైన ప్రవర్తన- యివే దీనికి సమాధానాలు. ఇంట్లోనూ, చిన్నప్పటినుండి బళ్లోనూ కూడా యీ క్రమశిక్షణ అలవరచుకోవాలి. అవినీతి పరుడైన వాడిని చిన్నచూపు చూడగలిగే స్థితిలో సంఘం వుండాలి. అంతేగాని, వాడివద్దనున్న డబ్బునుచూసి, వాడి హోదానుచూసి వాడికి లొంగిపోకూడదు.

### యువజనుల పాత్ర

బీద దేశమైన మనదేశంలో అవినీతికరమైన విధానాలను అనుసరించడం ద్వారా ధనవంతులం కావచ్చుననే అభిప్రాయం ఏర్పడి వుండవచ్చు. ఇటువంటి సంఘవ్యతిరేక చర్యలపై ఒక కన్నువేసి వుంచడం వాటిని ఎప్పటికప్పుడు బయట పెట్టడం దేశంలోని యువజనుల ప్రత్యేక కర్తవ్యం. ఊరకే అవినీతిని గురించి కబుర్లాడుకోవడం కాకుండా, అవినీతికి సంబంధించిని నిర్దిష్టమైన సంఘటనలను బహిర్గతంచెయ్యాలి. అవినీతి పరులైన వారిని సంఘం అగౌరవంగా చూసే విధంగానూ, సంఘంలో వారికి అవమానం జరిగే విధంగాను సంఘ వాతావరణాన్ని మార్పుచేసుకోవాలి.

### నాలుగు దారుల కూడలిలో...

ఇప్పుడు మనం నాలుగు దారుల కూడలిలో ఉన్నాము. సరియైన దారిని ఎన్నుకుంటేనే ప్రయాణం సజావుగా సాగుతుంది. న్యాయబద్ధమైన సమాజ నిర్మాణ దిశగా మనం పురోగమించాలి. లేదా యీ అవినీతి రక్కసి కోరల్లో చిక్కుకొని

సర్వనాశనం అయిపోతాము. దీనిని తుదముట్టించడానికి ప్రయత్నించడం తప్ప మనకు గత్యంతరంలేదు. ఏ ఒక వ్యక్తిగానీ, ఒక సంస్థ గానీ యీ పని చేయలేదు. ఈ పీడను గురించిన చైతన్యం ప్రజల్లో కలిగితేనే యీ అవినీతిని మనం నిరోధించగలుగుతాము. సంఘంలో యీ చీడపురుగును లేకుండా చెయ్యాలి. ఈ పని ఎంత త్వరగా జరిగితే, మనకు అంత మంచిది. దేశానికి మంచిది. అవినీతివల్ల దేశాలకు దేశాలే సర్వనాశనమైపోయిన ఉదాహరణలు చరిత్రలో కోకొల్లలుగా వున్నవి. చరిత్రనుండి మనం తగిన పాఠాలు నేర్చుకోవాలి. మనదేశంలో ఆ చరిత్ర మళ్ళీ పునరావృతం కాకుండా జాగ్రత్తపడాలి.

**సి.ఐ.ఎ. కార్యకలాపాలు: అవినీతి**

ఇటీవల మన దేశంలో సి.ఐ.ఎ. కార్యకలాపాలను గురించి కొన్ని విషయాలు వినిపిస్తున్నాయి. అవినీతి కరమైన మార్గాలకు అలవాటుపడి, స్వార్థం వల్ల, సి.ఐ.ఎ. వంటి వాటికి సాధనాలుగా ఉపయోగపడే వ్యక్తులు లేనిదే యీ జాతీయ వ్యతిరేక కార్యక్రమాలు సాగడానికి అవకాశం ఉండదు. అవినీతి అనేదానిని కేవలం సాంఘిక వ్యతిరేక చర్యగా మాత్రమే కాకుండా, జాతి ద్రోహకరచర్యగా భావించి దానిని అణచి వేయడం, తగినట్లు శిక్షించడం అవసరం. ఇంత విస్తృతంగా పెరిగిపోయిన యీ అవినీతి భూతాన్ని ఒక్కరోజులో తుదిముట్టించడం అసాధ్యం అనే విషయం నేను అంగీకరిస్తాను. కాని దాని ఉనికిని గురించి, దాని వల్ల కలిగే దుష్ఫలితాలను గురించిన చైతన్యం మనలో కలిగినప్పుడు, దానిని జీవితపు అన్ని రంగాలలో, అన్ని స్థాయిలలో నిర్మూలించడానికి ప్రయత్నం ప్రారంభమైతే, దానిని నిర్మూలించడం అంతకష్టం ఏమీకాదు. అదృష్టవశాత్తు, మనకు దీక్షా బద్ధులైన ప్రజలున్నారు. చైతన్యవంతమైన నాయకత్వం వున్నది. అందువల్ల మరికొంత ప్రయత్నం జరిగితే, అవినీతి భూతం కోరలనుండి బైట పడవచ్చు. ఆ విధంగా మన చరమలక్ష్యమైన, వర్గరహిత, కులరహిత సమాజం నిర్మించుకోవచ్చు. అందరికీ సమాన అవకాశాలతో, గౌరవంగా, హుందాగా, హాయిగా, సుఖవంతమైన జీవితం గడుపుకోవచ్చు.

# 8. సాంఘిక విప్లవము- అనివార్యము

అహింసా పద్ధతుల ద్వారా స్వరాజ్యాన్ని సాధించిన దేశాలలో భారతదేశానికి అగ్రస్థానమున్నది. అంతేకాకుండా వయోజన ఓటింగు హక్కుతో పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని స్థాపించుకొన్న ఘనతకూడా భారతదేశానికే దక్కింది. మన రాజ్యాంగం దేశదేశాలా గౌరవించబడుతున్నది. నిరక్షరాస్యులు ఎక్కువగా ఉన్న దేశాలలో ప్రజాస్వామ్యం విజయవంతం కావడం సామాన్య విషయంకాదు. ఇది మన దేశంలో సాధించబడినది. భారతదేశం విముక్తి పొంది 25 సంవత్సరాలు అయినది. మనం రాజకీయంగా, ఒక జాతిగా నిలబడే దశకు చేరుకున్నాము. మనదేశం ప్రాచ్యదేశాలలో ఒక శక్తివంతమైన దేశంగా గుర్తించబడుతున్నది. నిస్వార్థపరులైన దేశభక్తుల అకుంఠితదీక్ష, కృషి ద్వారాను, సరియైన రాజకీయ అవగాహన గల శక్తిమంతమైన నేటి నాయకత్వము ద్వారాను యీ ప్రగతిని సాధించగలిగాము. ఎన్నో ఏళ్లగా బానిసత్వములో క్రుగ్గిపోయిన మనదేశము యింత అభివృద్ధిని సాధించడం చిన్న విషయమేమికాదు. నేడు మన దేశం నిజమైన ప్రజాస్వామ్యదేశంగా రూపొందింది. అన్ని రాజకీయ పార్టీలకు స్వేచ్ఛ ఉన్నది. కేంద్రంలోను రాష్ట్రాలలోను బలమైన ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. మన రాజకీయ విప్లవం విజయవంతంగా ముగిసిందని చెప్పవచ్చు.

ఆర్థిక రంగంలో కూడా మనము చెప్పుకోదగ్గ ముందడుగు వేశాము. అన్ని రంగాలలోను సర్వతోముఖాభివృద్ధిని సాధిస్తున్నాము. జనాభా పెరుగుతున్నప్పటికి శ్యామల విప్లవం ద్వారా ఆహార సమస్యను పరిష్కరించుకోగలిగాము. విదేశాలనుండి దిగుమతులపై ఆధారపడే దశను దాటి నిలబడ్డాము. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత చాలా కాలం మన శక్తినంతా ఆహార సమస్యను పరిష్కరించడానికే ఉపయోగించడం జరిగినది. సాంకేతిక విజ్ఞానం ద్వారా, రైతులు కష్టించిపనిచేయడం ద్వారా రాష్ట్రాలలోను, కేంద్రంలోను, నాయకత్వపు వ్యవహార దక్షత వల్లను యీ ఆహార సమస్యను పరిష్కరించుకోగలిగాము. వ్యవసాయ రంగంలోనే కాకుండా పశుగణము, పాడిపరిశ్రమ, అడవులు, మత్స్యపరిశ్రమ రంగాలలో కూడా పంచవర్షప్రణాళికలద్వారా గణనీయమైన అభివృద్ధిని సాధించగలిగాము. నాగార్జునసాగరు, భాక్రానంగల్,

పోచంపాడు, తుంగభద్ర మొదలైన బృహత్తర ప్రాజెక్టులు వ్యవసాయానికే కాకుండా పశుగణాభివృద్ధికి కూడా యెంతో దోహదాన్ని యిచ్చేయి. మత్స్య పారిశ్రామిక రంగంలో యంత్రనావలను ప్రవేశపెట్టడం ద్వారాను, హార్బరు సదుపాయం కలిగించడం ద్వారాను దేశానికి ఎంతో అవసరమైన విదేశీమారక ద్రవ్యాన్ని కూడా సంపాదించ గలుగుతున్నాము. వ్యవసాయ రంగంలో సాధించిన విజయాలను పారిశ్రామిక రంగంలో సాధించనిమాట వాస్తవమే. మన ఉక్కుకర్మాగారాలను ఇంధనపు పరిశ్రమలు, బట్టల మిల్లులు, పంచదార ఫ్యాక్టరీలు యింకా ఎన్నో అనుబంధ పరిశ్రమలు, ప్రజలకవసరమైన వస్తువులను చిన్నతరహా పరిశ్రమల కవసరమైన వస్తువులను ఉత్పత్తిచేస్తున్నాము. 25 సంవత్సరముల నాటి పరిస్థితితో పోల్చిచూస్తే నేటి రవాణా సౌకర్యాలు ఎంతో విస్తృతంగా ఉన్నాయి. మన జాతీయ ఆదాయం 1960-61. 1969-70 మధ్యకాలంలో 13,174 కోట్ల రూపాయల వరకు పెరిగింది. పారిశ్రామిక రంగంలో ఉత్పత్తి 50% పెరిగింది. 1960-61లో 3.42 మిలియను టన్నులుగా ఉన్న ఉక్కు ఉత్పత్తి 73-74కు 10.8 మిలియను టన్నులవరకు పెరిగింది. వ్యవసాయానికి అవసరమైన క్రిమి సంహారక ద్రవ్యాల ఉత్పత్తి 1960-61లో 8వేల టన్నులుకాగా 73-74లో 65వేల వరకు పెరిగింది. ఇదే కాల పరిమితిలో 0.41 మిలియను టన్నుల ముడి ఇంధనము 8.6 మిలియను టన్నుల వరకు పెరిగింది. పారిశ్రామిక రంగంలో ఉత్పత్తినికరమైన అభివృద్ధిని సూచిస్తుంది. సాంఘిక రంగంలో కూడా అద్వితీయమైన అభివృద్ధిని సాధించాము. ఉచిత విద్యసాంకేతిక విద్యతో సహా ఉచిత వైద్య సౌకర్యాలు తదితర సౌకర్యాలు కూడా కల్పించబడ్డాయి. 1973-74 అంతానికి ప్రాథమిక విద్యాసౌకర్యాలు మూడు రెట్లు, సెకండరీ విద్యా సౌకర్యాలు మూడు రెట్లు పైగాను కల్పించబడనున్నాయి. 1960-61తో పోల్చిచూస్తే విశ్వవిద్యాలయాలలో చేరేవాళ్ల సంఖ్య నాలుగు రెట్లుగా వుంటుంది. డాక్టర్ల సంఖ్య రెట్టింపు అవుతుంది. నర్సుల సంఖ్య మూడురెట్లు అవుతుంది. జనాభా వైద్యుల నిష్పత్తి చెప్పుకోతగినంతగా అభివృద్ధి చెందింది. మనరాష్ట్రంలో యీ అభివృద్ధి యింకా ఎక్కువగా ఉంది. అయితే మనం సాధించిన యీ అభివృద్ధి విద్యారంగంలో కొత్త సమస్యలను తెచ్చిపెట్టింది. అదే నిరుద్యోగ సమస్య. కాని మనం సాధించిన యీ అభివృద్ధి భవిష్యత్తుకి పునాదిని వేసింది. అయితే ఒక ప్రధాన సమస్య మనముందు నిలబడుతూంది. అర్థికాభివృద్ధి రాజకీయ స్థిరత్వము మీదట మనం అంతా సాధించినట్లేనా? జాతిపిత మహాత్మాగాంధి, జవహర్‌లాల్ నెహ్రూ కనిన కలలు మనం యింత వరకూ సాధించిన అభివృద్ధితోనే పరిసమాప్తమైనవా? ఎన్నటికి కాదు. బహుళసంఖ్యాకులైన బీదప్రజలకు ఆర్థిక సాంఘిక న్యాయాన్ని చేకూర్చునంతరవకు మన జాతిపితల కలలు కలుగానే

నిలిచిపోతాయి. అందువల్ల సాంఘిక విప్లవం ఆవశ్యకత నేడున్నంతగా మరెన్నడులేదు. దేశాభివృద్ధి అంటే ముడి పదార్థాల అభివృద్ధిమాత్రమే కాదు. ఈ సందర్భములో "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" మహాకవి గురజాడ అన్నమాటలు మనం మరొకసారి మననం చేసుకోవడం అవసరం. అన్నివర్గాలలోను కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి. నేడున్న సామాజిక వ్యవస్థలోవున్న మన ప్రజలలో చైతన్యము చాలా తక్కువ స్థాయిలో వున్నది. ఈ మందకొండి స్థితిలో సాంఘిక విప్లవాన్ని సాధించలేము. అందువల్ల ప్రజలలో నిద్రాణమైయున్న చైతన్యాన్ని మేలుకొల్పాలి. ప్రతివ్యక్తి తన విధ్యుక్తధర్మమేదో తెలుసుకొనేటట్లు చేయాలి. ఈనాటి వరకు యీ బాధ్యతను విస్మరించిన కారణాలేమిటో తెలియకుండావున్నది. ఎక్కడ చూచినా గడియారం వంకచూసేవాడేకాని తమ పనిమీద దృష్టిని నిలిపేవాడు కనిపించడంలేదు. తను భౌతికంగా పనిచేసేచోట వుండడమే తాను పని చేసేనన్న భావన చాలామందికి వున్నట్లుకనిపిస్తూంది. ఈరకమైన ధోరణి మంచిదికాదు. మన సమాజంలో విధ్యుక్తధర్మాన్ని పాటించవలసిన అవసరాన్ని గుర్తించలేము. ఏజాతికైనా వుండవలసిన మరొక ముఖ్య లక్షణం నిజాయితీ. అది మన జాతిలో చాలా తక్కువగా వున్నందుకు చింతిస్తున్నాను. అంటే నా వుద్దేశ్యం అందరూ నిజాయితీ పరులుకారని కాదు. నిజాయితీ అంటే నా అభిప్రాయం మనం చేసే పనిలో నిమగ్నమైపోవడం. మనం చేసే పనిలో మనకు పూర్తి నమ్మకంవుంటే ఆ పనిని విజయవంతంగా నెరవేర్చగలుగుతాము. ఇది సాంఘిక చైతన్యము ఆత్మవిశ్వాసము వున్నప్పుడు సాధించగలుగుతాము. కాని జరుగుతున్నదేమంటే సంస్కరణలు అమలు జరపడానికి బాధ్యులుగావున్న అధికారులలోను, నాయకత్వములోను, నిజాయితి, పట్టుదల, చేసేపనిలో విశ్వాసము లేకుండా వుండడం కూడా జరుగుతూంది. ఈ పరిస్థితులలో ఏరకమైన సాంఘిక విప్లవాన్ని కూడా సాధించలేమేమోనన్న అనుమానం కలుగుతూంది. పోతే ముఖ్యమైనది మరొకటి వుంది. దేశంలో నానాటికి ప్రబలిపోతున్న అవినీతిని గురించి మాట్లాడడం మనం వింటూనే వున్నాం. నీతినియమాలులేని జాతి ఏ రంగంలోను ముందంజ వేయలేదు. మనశక్తి స్తోమతలు యీ అవినీతిని అరికట్టడానికి వుపయోగించడం కూడా జరుగుతూంది. అవినీతి నిరోధక శాఖ విజిలెన్స్ కమీషన్ యిందుకు తార్కాణములు. అలాగే కల్తీవ్యాపారాన్ని అరికట్టడానికి కూడా కొంత అర్థబలాన్ని, అంగబలాన్ని ఉపయోగించుకోవలసి వస్తుంది. నేడున్న పరిస్థితిచూస్తే అనాదిగా సంప్రదాయసిద్ధంగా వస్తున్న నీతి నియమాలు ఈరోజు దాదాపు లేనట్టుగానే కనిపిస్తున్నవి. ఇలా జరగడానికి చాలా కారణాలు వుండవచ్చు. కారణాలు ఏవైనా

జాతికి ప్రధానలక్షణమైన నీతి నిజాయితీ మన ప్రజలలో పునరుద్ధరించబడడం తప్పని సరి అని నేను భావిస్తున్నాను. తమ పనిచేసుకోవడానికి లంచం యిచ్చే వాళ్ళసంఖ్య రోజురోజుకి పెరుగుతూంది అనే అభిప్రాయం చాలా మందిలో ఉంది. కొందరు తమ పనిని సాధించుకోటానికి అవినీతికరమైన ప్రక్కదారులు అన్వేషించడం సాధారణంగా మనం చూస్తూనే ఉన్నాం. మనం యే దుస్థితికి దిగజారామంటే 5 ఎకరాల భూమికోసం భార్యభర్తకు విడాకులు యివ్వడానికి సిద్ధమైన సంఘటనలు కూడా మనం చూస్తున్నాము. అందువల్ల నీతి నిజాయితి లేని ఏ జాతి కూడా తన లక్ష్యాన్ని సాధించలేదని నాదృఢమైన విశ్వాసము. నేను ఇటీవలే జపాను వెళ్లి రావడం జరిగినది. రెండవ ప్రపంచ మహాసంగ్రామములో అణుబాంబులతో సర్వనాశనమైన ఒక చిన్నదేశం యిది. కాని జపాను ఈనాడు ఎంతో అభివృద్ధి సాధించినది. అమెరికా వంటి దేశాలతో పోటీపడే స్థితికి వచ్చింది. దీనికి కారణం ఆ జాతిలో కష్టించి పనిచేసేగుణము నీతి నిజాయితీ వుండడమే నన్న సంగతి వేరే చెప్పనక్కరలేదు. వాళ్లు 8 గంటలు అంటే అక్షరాలా 8 గంటలు అందులో ప్రతి నిమిషము వంచినతల ఎత్తకుండా పనిచేస్తారు. భారత ప్రజలు ఈ ధోరణిలో ఏ కొంత అనుసరించినా మనదేశం చాలా శక్తివంతమైన దేశంగా రూపొందగలదు. మనలో లోపించిన ముఖ్యలక్షణమేమంటే శిక్షణ లేకపోవడం. ఇది విద్యార్థులలోను, కార్మికులలోను యీ అరాజక ప్రవృత్తి ఎక్కువగా కనిపిస్తూంది. దీనిని మనం అరికట్టాలి. జాతి జీవనానికి ముఖ్యమైన పైచెప్పిన యీ లక్షణాలు దేశ ప్రజలలో ఎలా కలిగించగలుగుతాము? అన్నది మన ముందున్న ప్రశ్న. అవినీతి, అరాజకము జీర్ణించుకొనిపోయిన వ్యక్తులను మనమెంతప్రయత్నించినా మార్చలేము. అందువలన మన మొక క్రొత్త సమాజాన్ని సృష్టించుకోవాలి. మన నూతన సమాజ పౌరులు ఈనాడు మనకళ్లముందు పెరుగుతున్న బాలబాలికలు. వీళ్లకు చిన్ననాటినుంచే శిక్షణ ఇవ్వాలి. జాతి మనుగడకు అవసరమైన యీ లక్షణాలన్నీ మన భావి పౌరులలో దృఢంగా నెలకొనేటట్లు చూడాలి. ఇది ప్రభుత్వము మాత్రమే చేయవలసిన పనికాదు. స్వచ్ఛంద సంస్థలు, వ్యక్తులు, దేశభవిష్యత్తునుకోరే వారందరూ చేయవలసిన పని. మనదేశం గొడ్డుపోలేదు. ఎందరో మహానుభావులు పుట్టారు. పుడతారు కూడాను. న్యాయం కోసం, ధర్మంకోసం ప్రాణాలను త్యాగంచేసినవారూ ఉన్నారు. వెలుగులోకి రానివారెందరో వున్నారు. వీరందరిని వెతికి బయటకు తీసుకురావడం మనవంతు. ఇది జరిగినరోజున మనం కొనసాగిస్తున్న సాంఘిక విప్లవంలో మరొకమెట్టు ఎక్కినట్లే భావించవచ్చు.

*(1972)*

# 9. కాంగ్రెసు శిబిరం, నాగార్జునసాగర్ ప్రస్తుత సమస్యలు: కొన్ని పరిష్కార మార్గాలు

బౌద్ధమతాన్ని ప్రపంచమంతటా పరివ్యాప్తం చేసిన ఆచార్య నాగార్జునుడు అలంకరించినట్టి పవిత్ర స్థలములో మనం సమావేశమయ్యాం. ఇది భౌతిక అధ్యాత్మిక విజ్ఞానాన్ని వెదజల్లిన కేంద్రము మాత్రమేకాదు. బహుళప్రయోజక ప్రాజెక్టు జలాలు అతి విశాల ప్రాంతాలను సస్యశ్యామలం చేస్తాయి. అందుచేత ఆర్థికంగాను, రాజకీయంగాను దేశం ఎదుర్కొంటున్న క్లిష్ట సమస్యలకు ఇక్కడ తగు పరిష్కార మార్గాలను అన్వేషించటం ఎంతో సముచితంగా వుంటుంది.

స్వాతంత్ర్యం సముపార్జించటానికి ఒక దశాబ్దం పూర్వమే అంటే 1936 నుంచే కాంగ్రెసు ప్రజాస్వామిక సోషలిజం స్థాపించేందుకు ఉత్తమ కృషి ప్రారంభించింది. భారత రాజ్యాంగంలో కూడా మనం ఈ పవిత్ర ఆశయాన్ని పొందుపరచుకున్నాం మనం ఆత్మ పరిశీలన చేసుకోవలసిన సమయమిది. మన ఆశయాలను ఎంతవరకు సాధించుకున్నామనే ప్రశ్న వేసుకోవటం అవసరం. దేశం ఆర్థికంగా ఎంతో పురోగతి చెందినమాట వాస్తవమే. అయితే నేటికి కూడా మనం సామాన్య మానవునికి సరియైన న్యాయం చేకూర్చులేక పోతున్నాం అతని కనీస అవసరాలు తీరలేదు. ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. తత్కారణంగా అతని జీవితం దుర్భరంగా పరిణమించింది. పాలనా యంత్రాంగంపట్ల అతనికి నిరాశ ఏర్పడుతున్నది. ఈనాడు మనకు కన్పిస్తున్న పరిస్థితులను గమనించినట్లయితే నకిలీ నోట్లు, అక్రమ నిల్వలు, చీకటి వ్యాపారం స్మగిలింగు, సంఘ విద్రోహక శక్తులు జాతి విద్రోహక కార్యకలాపాలు- ఇవన్నీ విలయతాండవం చేస్తున్నాయి. దేశ ఆర్థిక పరిస్థితి నానాటికి క్షీణిస్తున్నది. అయితే నేటి పరిస్థితులకు అంతర్జాతీయ ఆర్థిక విధానాలు కొంతవరకు కారణమైనమాట నిజమే. ఇటువంటి సాంఘిక ప్రతీప శక్తులు లేకపోయినట్లయితే క్రమ శిక్షణగల జాతిగా మనం నేటి అవాంఛనీయ పరిస్థితులను ఎదుర్కోనవసరం లేకుండానే పురోగమించి ఉండేవారు. ఈ పరిస్థితిలో ముస్ముందు కొనసాగినట్లయితే జాతి భవిష్యత్తు ఏ విధంగా ఉండగలదో ఊహించటం కష్టం. అందుచేత మనమందరం ఆచరణపూర్వక

దృక్పథంతో ఈ పరిస్థితులను సాకల్యంగా పరిశీలించి ఇందుకు తగిన పరిష్కారాలను అన్వేషించవలసి ఉన్నది.

మన దేశ ప్రజాబాహుళ్యానికి ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వంపై అచంచల విశ్వాసం ఉన్నది. పేదరికాన్ని నిర్మూలించి ఆదాయ సంపదలలోవున్న అసమానతలను తొలగించేందుకు ఆమె అభ్యుదయకరమూ, సాహసోపేతమైన విధానాలను రూపొందించి అమలుపరుచుట ఇందులకు కారణం. అయితే దురదృష్టవశాత్తూ నేటి ఆర్థిక క్లిష్ట పరిస్థితులను ఆసరాగచేసుకొని ఆమె రాజకీయ ప్రత్యర్థులు ఆమె నాయకత్వాన్ని సవాలుచేస్తూ పెక్కు ఆందోళనలు ప్రారంభించారు. క్లిష్టపరిస్థితులను ఎదుర్కొంటున్న ఈ తరుణంలో శ్రీమతి ఇందిరాగాంధీ దేశ నాయకత్వం వహించి ఉండటం నిజంగా మన అదృష్టం. కాబట్టి జాతి యావత్తూ సంఘటితమై ఆమె నాయకత్వాన్ని, త్రికరణశుద్ధిగా బలపరచి ఆమె రూపొందించిన అభ్యుదయకర విధానాలను అమలు పరుచటంలో సంపూర్ణ సహకారం అందించటం అవసరం.

ఇందుకు ఆర్థికంగాను, రాజకీయంగాను కూడ ద్విముఖమైన కార్యక్రమం వెంటనే చేపట్టి నిర్వహించటం మిక్కిలి ఆవశ్యకమని నేను భావిస్తున్నాను.

## రాజకీయ రంగం

ఇటీవల రాజకీయ రంగంలో గుత్తాధిపత్యం ప్రబలుతూందని కొంతమంది రాజకీయవేత్తలు. కార్యకర్తలు అభిప్రాయపడుతున్నారు. కొద్దిమంది రాజకీయవేత్తలు పెక్కు రాజకీయ పదవులను వహించి ఉండటంచేత ముఠాతత్వానికి ఆస్కారం ఏర్పడి అభిప్రాయ భేదాలకు దోహదం చేకూరుతున్నది. రాజకీయ అధికారాన్ని ఎక్కువమందికి సంక్రమింపజేసే విషయంలో ఉపేక్ష వహించబడుతున్నదనే భావం ఇందుకు కొంత కారణం. ప్రమాదకరమైన మరొక ధోరణికూడా ఈ సందర్భంలో కానవస్తున్నది. ఉత్సాహంతో పనిచేసే కార్యకర్తలలో కూడా ఈనాడు రాజకీయ పరంగా మనదేశంలో అలసత్వం, ఉపేక్షా భావం ఏర్పడటం మిక్కిలి శోచనీయం. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఆర్థికపరమైన వికేంద్రీకరణ ఎంత అవసరమో రాజకీయంగా కూడా వికేంద్రీకరణ అంత అవసరమని వ్యక్తిగతంగా నేను భావిస్తున్నాను. ఎందుచేతనంటే రాజకీయాధికారాన్ని హేతుబద్ధంగాను, న్యాయంగాను, సమానంగానూ సంబంధించిన వారందరికీ సంక్రమింప చేయనిదే వారు దేశ సేవలో పూర్తిగా భాగస్వాములు

కాజాలరు. అందువల్ల రాజకీయరంగంలో ఒక్కొక్కరికి ఒక పదవి అనే రాజకీయ సంప్రదాయాన్ని నెలకొల్పడం అవసరమని నేను సూచిస్తున్నాను. ఈ ఆశయాన్ని నెరవేర్చేందుకు అవసరమైన రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టాలని కూడా నేను సూచిస్తున్నాను.

సాంఘికంగాను, ఆర్థికంగాను వెనుకబడివున్న తరగతులవారి స్థితిగతులను మెరుగుపరచేందుకు, మనం బృహత్తర కార్యక్రమాన్ని చేపట్టవలసివున్నది. ఈ మహత్తర కృషిలో మనం విజయం సాధించాలంటే ఈ వర్గాలవారికి రాజకీయంగా తగు స్థానాన్ని కల్పించి దేశాభ్యుదయ కృషిలో వారిని భాగస్వాములుగా చేయటం ఎంతైనా అవసరం. అంటే మన దేశంలో బలహీన వర్గాలకు చెందిన ప్రజల రాజకీయ ఆకాంక్షలను తెలుసుకొని వారికి తగు రాజకీయాధికారం కలుగజేయాలి. అప్పుడు వారు ఈ దేశ పాలనలో తమకు భాగం వున్నదని అది తమకు చెందినట్టిదని అభిప్రాయం పెంపొంది ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి తీర్చిదిద్దిన వివిధ ప్రగతిశీల విధానాలను అమలు జరపటంలో సమధికోత్సాహంతో పాల్గొంటారు. కార్యక్రమాల నిర్వహణలో బలహీన వర్గాల ప్రజలు క్రమంగా పాల్గొన్నప్పుడు ఈ కార్యక్రమాలు మరింత శీఘ్రగతిన విజయవంతమవుతాయి. ఈ సూచన చేయటంలో ముఖ్యంగా పంచాయితీరాజ్ పాలన విధానాన్ని నేను దృష్టిలో ఉంచుకోవటం జరిగింది. ఈనాడు పంచాయితీరాజ్ సంస్థలు ఎక్కువగా ధనిక వర్గాలవారి చేతులలో ఉన్నాయనే అభిప్రాయం ఉన్నది. ప్రభుత్వాన్ని, ప్రజలను సన్నిహితపరిచే ఈ ప్రాథమిక సంస్థలలో, తమకు తగిన ప్రాతినిధ్యంలేదని బలహీన వర్గాల ప్రజలు భావిస్తున్నారు. ఈ పరిస్థితిని చక్కదిద్ది ప్రభుత్వవిధానాలను అమలు పరచటంలో వీరిని భాగస్వాములుగా చెయ్యాలంటే వీరికి రాజకీయ బాధ్యతలను అప్పగించటం మిక్కిలి ఆవశ్యకమవుతుంది. మనం వాస్తవ పరిస్థితులను సరిగా అవగాహన చేసుకోనట్లయితే దేశంలో రాజకీయ పరిస్థితి మరింత క్షీణించే ప్రమాదం ఉన్నది. ఇది దేశ శ్రేయస్సుకు దోహదకారి కాదు. కాబట్టి నేను రాజకీయ సంస్కరణకు చేస్తున్న రెండవ సూచన ఏమంటే– బలహీన వర్గాల ప్రజలకు గ్రామస్థాయి మొదలుకొని అన్ని దశలలోనూ రాజకీయ అధికారం సంక్రమింపచెయ్యాలి.

దేశంలో కులతత్వం విశృంఖలంగా విహరిస్తున్నది. రాజకీయాధికారం కుల ప్రభావంతో ముడిపడివున్నదన్న భావంకూడా గమనిస్తున్నాం. ఇది చాలా దురదృష్టకరమైన పరిస్థితి. అయితే దీనిని తొలగించేందుకు ఇంతవరకు మనం గట్టి కృషి జరపకపోవడం చాలా విచారకరం. అయితే సమాజంలో వివిధ వర్గాలవారు

పరస్పరం సంబంధాలను పెంచుకొని ఏకం కావడానికి వారిలో నూతనోత్సాహం వెల్లవిరియటం మనలో ఆశారేఖలను వెలిగింపజేస్తున్నది. ఈనాడు వర్ణాంతర, మతాంతర వివాహాలు అధిక సంఖ్యలో జరుగుతున్నాయి. ఇది నిజంగా శుభసూచకం. వర్ణ విభేదాలను తొలగించుకొని ఐక్యతా పథగాములు కాదలచిన ప్రగతి శీలురను మనం ప్రోత్సహించాలి. దేశ రాజకీయ కార్యకలాపనిర్వహణలో అటువంటి వారి సేవలను మనం వినియోగించుకోవాలి. అయితే రాజకీయ బాధ్యతలను అప్పగించటంలో వర్ణాంతర వివాహాలను మాత్రమే లెక్కలోనికి తీసుకోవాలని నా ఉద్దేశం కాదు. ఇతర అంశాలతోపాటు దీనినికూడా పరిశీలించాలని నేను సూచిస్తున్నాను. దీనివల్ల దేశంలో ప్రబలివున్న కుల విభేదాలు సమసిపోగలవని నా విశ్వాసం. ఈ సూచనను కార్యరూపంలోకి తీసుకురావడం కొంత కష్టమైన విషయమని నేను గుర్తించకపోలేదు. కాని ఈ కార్యక్రమాన్ని ఎంత శీఘ్రంగా అమలులోనికి తీసుకువస్తే దేశానికి అంత ఎక్కువ మేలు చేకూరుతుంది. కాబట్టి నేను చేసే మూడవ సూచన ఏమంటే వర్ణాంతర సమైక్యతా సాధనకు కృషిచేసిన వారికి దేశ రాజకీయాలలో ప్రాధాన్యతనివ్వాలి.

ఈనాడు మనం ఎక్కడ చూసినా అవినీతిని గురించిన మాటలు వింటున్నాం. కొన్ని సందర్భాలలో తగిన ఆధారం లేకుండానే అవినీతిని గురించిన ప్రస్తావన తీసుకురావటంకూడా జరుగుతున్నది. ఏమైనప్పటికీ దేశంలో అవినీతి కొంత ప్రబలివున్న సత్యాన్ని గుర్తించవలసి ఉన్నది. ఇది దేశ శ్రేయస్సుకు భంగకరమైనట్టిదే. రాజకీయవేత్తలలో అవినీతి, ప్రభుత్వోద్యోగుల అవినీతి, వర్తక వ్యాపారాలలో అవినీతి, పరిశ్రమలలో అవినీతి, వాణిజ్యంలో అవినీతి– ఈ విధంగా అన్ని రంగాలలో అవినీతి గురించి వింటున్నాం. నేడు ఉన్న ఎన్నికల విధానం రాజకీయ రంగంలో అవినీతికి దోహదంచేస్తున్నదనడంలో సందేహంలేదు. రాజకీయ పరమైన ఈ అవినీతిని నిర్మూలించేందుకు మనం తగిన మార్గాలు అన్వేషించవలసి ఉన్నది. రాజకీయ పదవులు నిర్వహించేవారు ప్రకటించిన ఆస్తుల వివరాలను తరచు సమీక్షిస్తూ ఉండాలి. వాటిని నిరూపించడానికి వీలుంటుంది. ఎందుచేతనంటే ఒక వ్యక్తి రాజకీయంగా నీతి నిజాయితీలు వున్నవాడైనంతమాత్రాన సరిపోదు. ఆ వ్యక్తి నీతిమంతుడనే, నిజాయితీ పరుడని ప్రజలందరూ గుర్తించాలి. ఇందుకుగాను రాజకీయ నాయకులకు వారి దగ్గర బంధువులకు వున్న ఆస్తిపాస్తులను తరచు సమీక్షిస్తూ ఉండడం అవసరం. ఒక రాజకీయ పక్షం తన సభ్యులలో నీతి నిజాయితీలు ఉండేటట్లు చేసేందుకు అనుసరించవలసిన విధానం గురించి సవివరంగా చర్చించవలసి ఉన్నది. ఏమైనప్పటికి

ఈ సమస్యకు సముచితమైన పరిష్కారమార్గాలను రూపొందించడం కష్టమని నేను భావించడంలేదు. కాబట్టి నేను చేసే నాల్గవ సూచన ఏమంటే- ప్రజల దృష్టిలో నీతి నిజాయితీలు కొరవడివున్నవారిని రాజకీయ అధికారానికి దూరంగా ఉంచాలి.

మనదేశ రాజకీయవాదులలో ఒక విచిత్ర ప్రవృత్తి కానవస్తుంది. పార్టీలో వివిధ ప్రభుత్వ విధానాలను బలపరుస్తూనే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో- తరచు న్యాయస్థానంలో ఈ విధానాలను సవాలు చేయటం జరుగుతుంది. పార్టీలో ఒక సంస్కరణ చర్యకు అనుమతి తెల్పి చాటు మాటుగా ఆ చర్యను ప్రతిఘటించడం గమనిస్తున్నాం. కాబట్టి నేను చేసే అయిదవ సూచన ఏమంటే- అటువంటి కార్యకలాపాలు సాగించే వ్యక్తులను రాజకీయ అధికారం నుంచి, బాధ్యతలనుంచి దూరంగా ఉంచాలి. ముఖ్యంగా భూ సంస్కరణలు, అక్రమ నిల్వలు, చీకటి వ్యాపారం, మొదలైనవాటి విషయంలో మనకు ఎన్నో నిదర్శనాలు కానవస్తాయి.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు రాజకీయపరమైన అవినీతిని నిర్మూలించేందుకు "లోక్ ఆయుక్త"ను నియమించడం గురించి చేసిన ప్రకటన దేశంలో విజ్ఞులందరి హర్షామోదాలను పొందగలదు. రానున్న శాసన సభ సమావేశంలో ఇందుకు తగు శాసనం చేయటం జరుగుతుందని విశ్వసిద్దాం. మన రాష్ట్రంలో "లోక్ ఆయుక్త" నియామకం సాధ్యమైనంత త్వరలో జరగాలని నేను గట్టిగా కోరుతున్నాను.

## 2. ఆర్థిక రంగం

భూ సంస్కరణలను గురించి చాలా కాలంగా వింటున్నాం. ఈ సంస్కరణలు ఇంకా అమలు జరగలేదు. మన రాష్ట్రంలో భూములపై గరిష్ఠ పరిమితిని విధించడం జరిగింది. ఇది త్వరలోనే అమలు జరుగగలదు. వ్యవసాయ భూములపై గరిష్ఠ పరిమితి శాసనాన్ని తు.చ.తప్పకుండా అమలుపరచాలని శ్రీ జలగం వెంగళరావుగారి చైతన్యవంతమైన నాయకత్వంక్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కృతనిశ్చయమై ఉన్నది. సరైన యంత్రాంగంద్వారా మిగులు భూములన్నిటిని ప్రభుత్వం అప్పగింత చేసుకొని అది భూమిలేని పేదవారికి పంపిణీ జరిగేటట్లు తగు చర్యలు తీసుకోవాలి. ఈ విషయంలో ఎన్నో ఇబ్బందులున్న సంగతి నేను ఎరుగుదును. అందులోనూ వ్యవసాయ ప్రధానమైన మనదేశంలో ఇటువంటి సంస్కరణను తీసుకురావటంలో ఎన్నో ఇబ్బందులు ఎదురవటం సహజం.

అనూచానంగా భూమిపై అధిక వ్యామోహమున్నవారు ఈ విషయంలో ప్రభుత్వాన్ని ప్రతిఘటించేందుకు అనేక పద్ధతులు అన్వేషిస్తూ ఉంటారు. వీలైనంత శీఘ్రంగా ఈ సంస్కరణలను జయప్రదంగా అమలుపరచేందుకు మనం కార్యదీక్షతోను, స్థిర సంకల్పంతోను కృషిచేయాలి. ఈ సంస్కరణలను మనం విజయవంతంగా అమలుపరచినట్లయితే సమాజంలో బలహీనవర్గాల ప్రజలందునూతన విశ్వాసం పెంపొంది, తమ సంక్షేమంపట్ల ప్రభుత్వానికి శ్రద్ధాసక్తులున్నాయనే నమ్మకం వారిలో ఏర్పడుతుంది. ఈ విషయంలో కాంగ్రెసుపార్టీ ప్రముఖ పాత్ర వహించగలదు. ఇందుకోసం ఏర్పాటైన పరిపాలన యంత్రాంగానికి పార్టీ కార్యకర్తలు అవసరమైన సమాచారాన్ని అందజేయడానికి, ఈ సంస్కరణ దేశ శ్రేయస్సుకు దోహదకారి అని ప్రజలలో విశ్వాసం కల్గించడానికి వీలున్నది. మిగులు భూములను గురించి ప్రకటించడం, ఆ భూములను స్వాధీనపరచుకోవడం అన్నవి శాసనపరంగా జరుగవలసిన పనులు. అయినప్పటికీ వీటిని జయప్రదంగా అమలుపరచటంలో ప్రభుత్వ యంత్రాంగానికి పార్టీ తోడ్పడగలదు. ఈ సందర్భంలో నేను ఒక సూచన చేయదలుస్తున్నాను. అదేమంటే- రానున్న మహాత్మాగాంధీ వర్ధంతి అంటే 1975 జనవరి 30వ తేదీన మిగులు భూములను భూమిలేనివారికి పంచేందుకు అప్పగింతచేసుకొనే రోజుగా ప్రకటించాలి. దీనివలన మహాత్ముడు ప్రబోధించిన ఒక మహత్తర సంస్కరణకు మనం పునరంకితులం అయ్యే అవకాశం లభిస్తుంది. ప్రభుత్వంలోనూ, కాంగ్రెసు పార్టీలోనూ కూడా ప్రజలకు వెనుకటి విశ్వాసం పెంపొందేందుకు ఇది మంచి అవకాశం కలుగజేస్తుంది.

భూములపై గరిష్ఠ పరిమితి విధించి పట్టణ ఆస్తులపై మాత్రం అట్టి పరిమితి ఇంకా విధించలేదనే విమర్శ ఒకటి ఉన్నది. తమపట్ల నిష్పక్షపాతంగా వ్యవహరించటంలేదని రైతులు భావించటానికి ఇది అవకాశం ఇచ్చింది. ఇందులో సబబు లేకపోలేదు. వ్యవసాయ భూములపై గరిష్ఠ పరిమితిని అమలుజరపటంతోపాటు పట్టణ ఆస్తులపైకూడా గరిష్ఠ పరిమితిని విధించేందుకు మన తగు చర్యలు తీసుకోవాలి. భూమిపై గరిష్ఠ పరిమితి అయినా పట్టణ ఆస్తిపై గరిష్ఠ పరిమితి అయినా అది ఒక వ్యక్తి యొక్క ఆదాయంపై గరిష్ఠ పరిమితిని విధించేందుకు ఉద్దేశించబడినట్టిదే. ఆదాయంపై ఇట్టి గరిష్ఠపరిమితి విధానం ద్వారానే దేశంలో మనం సమసమాజాన్ని నిర్మించుకోగలుగుతాం. కాబట్టి మన దేశంలో అదాయాలపై గరిష్ఠ పరిమితిని విధించేందుకు తగు చర్యలను గురించి మనం ఆలోచించవలసి ఉన్నది. ఆర్థిక

సంబంధమైన కొన్ని చర్యలు ఇదివరకే తీసుకున్నాం. కాని వీటి వల్ల ఆశించిన ఫలితాలు చేకూరలేదు. కాబట్టి వ్యక్తుల ఆదాయాలను పరిమితం చేసేందుకు మనం మరింత కట్టుదిట్టమైన చర్యలను గురించి పరిశీలించవలసి ఉన్నది. ఇట్టి చర్యలద్వారానే ఆదాయ సంపదలలో కానవచ్చే వ్యత్యాసాలను తొలగించగలుగుతాం. కాంగ్రెసు పార్టీ ఈ కార్యక్రమంపై కృషిని లగ్నం చేయవలసి ఉన్నది.

భారతదేశం లోగడ ప్రధానంగా మత ప్రమేయం ఉన్నట్టిది. పూర్వం వితరణశీలం గలవారు మతపరమైన సంకల్పాలతో దేవాలయాలు, మసీదులు, చర్చులు మున్నగువాటికి విస్తారమైన ఆస్తులు దానంచేశారు. ఈ ఆస్తులు ముఖ్యంగా తమ మత ప్రజలలో ఆధ్యాత్మిక దృక్పథం పెంపొందించడానికి ఉద్దేశించబడినాయి. కాని దురదృష్టవశాత్తూ వివిధ మత సంస్థలకు ఇచ్చిన ఆస్తులు దుర్వినియోగమవు తున్నాయి. మతం పేరుతో కొంతమంది వ్యక్తులు దేవాలయాలు మున్నగువాటికి చెందిన ఆస్తులద్వారా అన్యాయంగా ఎన్నో ప్రయోజనాలు పొందుచున్న సందర్భాలు చాలా ఉన్నాయి. ప్రభుత్వం దీని గురించి శ్రద్ధగా పరిశీలించి దురాశాపరులైన వ్యక్తుల కబంధహస్తాలనుంచి మత సంస్థల అస్తులను కాపాడేందుకు నిర్మాణాత్మక కృషి చేయగలదని ఆశిస్తున్నాను. దీనివల్ల ఈ సంస్థల ఆదాయాలను దేశాభ్యున్నతికి వినియోగించేందుకు వీలు చేకూరుతుంది.

సహకార సమాజాన్ని స్థాపించుకోవాలని మనం చాలాకాలం క్రిందటనే నిర్ణయించుకున్నాం. అంటే మన ఆర్థిక కార్యకలాపాలలో సహకార విధానం ప్రజల శ్రేయోభివృద్ధికి తగిన సాధనమని మనం అంగీకరించాము. అయితే నేటి పరిస్థితిని పరిశీలించినట్లయితే ఈ విషయంలో ఇంకా ఎంతో కృషి జరుగవలసి ఉన్నదని విదితమవుతున్నది. కాబట్టి సముచితమైన పరిపాలనా చర్యలద్వారా సహకార సంఘాలను పటిష్ఠం చేయాలని నేను సూచిస్తున్నాను. అప్పుడు వినియోగదార్ల సహకార సంఘాలు, ఉత్పత్తిదార్ల సహకార సంఘాలు, మార్కెటింగు సహకార సంఘాలు, పారిశ్రామిక సహకార సంఘాలు- ఇవి అన్నీ ప్రతి వారికీ జీవన విధాన భాగంగా పరిఢవిల్లగలవు. ఈనాడు దేశ సహకార వ్యవస్థలో ఉన్న ప్రాథమిక లోపాల్ని తొలగించి, ఈ సహకార సంస్థలు పౌరులందరి శ్రేయస్సుకూ దోహదం చేయగలవిధంగా వాటిని తీర్చిదిద్దవలసి ఉన్నది. ఈ సంస్థలు రాజకీయంగా అభిమానం చూపేందుకు ఉపకరించే సాధనాలుగానో, కొందరి వ్యక్తుల కీర్తి ప్రఖ్యాతులు ఇనుమడింపజేసేందుకు పనికివచ్చే వేదికలగానో ఇటుపై కొనసాగడానికి వీలు లేదు.

నిత్యావసర సరుకులు, ఉత్పత్తికి, అవసరమైన వస్తువులు పంపిణీ విషయంలో ప్రభుత్వపరమైన పంపిణీ పద్ధతి ఎక్కువ బాధ్యత వహించవలసి ఉంటుంది. ప్రైవేటు వర్తకుల ద్వారా జరిగే పంపిణీ కార్యక్రమాలు దేశ శ్రేయస్సును ఎక్కువగా దృష్టిలో ఉంచుకొని జరుగుతున్నట్టివి కావు. ఈ వర్తకులు ఆదాయ సముపార్జనకు తోడ్పడే ప్రతి చిన్న అవకాశాన్ని వినియోగించుకుంటారు. ఆవిధంగా ప్రైవేటు వర్తక రంగం దేశ ఆర్థిక వ్యవస్థలో ఉత్తమ స్థానాన్ని పొందలేకపోయింది. సమాజ అవసరాలకు అనుగుణంగాగాని అందుకు బాధ్యత వహిస్తూగాని ఈ రంగం పనిచేయలేకపోతున్నది. ఈ పరిస్థితిని చక్కదిద్దేందుకు ప్రభుత్వపరమైన పంపిణీ విధానాన్ని పటిష్ఠం చేయడం ఒక మార్గం కాగలదు.

దేశంలో ఈనాడు పరిపాలనా రంగంలో అవినీతి విపరీతంగా పెరిగిపోయింది. అవినీతి నిరోధక శాఖ, నిఘా విభాగం మొదలైన వాటి ద్వారా అన్ని స్థాయిలలోనూ అవినీతిని అరికట్టేందుకు మనం చర్యలు తీసుకుంటున్నాం. అవినీతిని నిర్మూలించేందుకుగాను, పరిపాలనకు సంబంధించిన ప్రతి కార్యకలాపంలోనూ ప్రభుత్వం నిఘా కార్యక్రమాన్ని విస్తరింపజేయవలసి ఉంటుందేమోనని నేను భావిస్తున్నాను. పరిపాలన కార్యకలాపాలపైన, ప్రభుత్వోద్యోగులపైన నిఘావేయటం ఎక్కువ వాంఛనీయంకానప్పటికీ అనివార్యమైన పరిస్థితి నేడు ఏర్పడనున్నది. అన్ని దశలలోనూ ప్రభుత్వ శాఖలన్నిటికి నిఘా విభాగాలను ఏర్పరచి, తప్పుత్రోవలు త్రొక్కుతున్న ఉద్యోగులను ఎప్పటికప్పుడు ఒక కంటకనిపెడుతూ ఉండటం అవసరమనికూడా సూచిస్తున్నాను. అయితే ఈ చర్యలు ఆయా వ్యక్తులను బాధలకు గురిచేసేవిగా పరిణమించకూడదు. ఇవి ప్రజా శ్రేయస్సుకు దోహదకారులు కావాలి. ఉద్యోగుల గురించిగాని, ప్రభుత్వ యంత్రాంగం గురించిగాని ఎవరూ ఫిర్యాదు చేయకుండా ఉండేటట్లు వ్యవహరించాలి. పరిపాలనాపరమైన అసమర్థతవల్లను, అవినీతి వల్లను ప్రభుత్వాలు ఎక్కువగా ప్రజాదరణ కోల్పోయి విమర్శకు గురి అవుతున్నాయి. నేడు దేశం ఎదుర్కొంటున్న క్లిష్టపరిస్థితుల దృష్ట్యా పరిపాలనాపరమైన అవినీతిని తక్షణమే రూపుమాపడం అత్యవసరం.

**ప్రభుత్వం, ప్రజలు, పార్టీ :-**

ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రభుత్వానికీ ప్రజలకు మధ్య అనుసంధానంగా ఉండేది పార్టీయే. పార్టీ ఒక వైపున ప్రజల ఆశయాలను, ఆకాంక్షలను ప్రభుత్వానికి తెలియజేస్తుంది. మరొకవైపున ప్రజల శ్రేయోభివృద్ధి నిమిత్తం ప్రభుత్వంచేపట్టిన వివిధ

అభ్యుదయకర విధానాలను అమలు పరచటంలో ప్రభుత్వానికి తోడ్పడుతుంది. దీనినిబట్టి పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలో పార్టీ ముఖ్యపాత్ర వహిస్తుందని ద్యోతకమవుతుంది. పార్టీ తనపై ఉన్న గురుతర బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించాలంటే దీక్షాబద్ధులైన కార్యకర్తలు ఎందరో అవసరమై ఉంటారు. గతంలో కాంగ్రెసువాదులందు ఇట్టి అకుంఠిత దీక్ష ఉండటంచేత మహాత్మాగాంధీ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభభాయి పటేల్ వంటి మహానాయకుల సారథ్యంలో భారతదేశం స్వరాజ్యాన్ని సాధించుకోగలిగింది. దురదృష్టవశాత్తూ ఇటీవల కాంగ్రెసు కార్యకర్తలలో ఇట్టి దీక్ష కొంత సన్నగిల్లటం మనం గమనిస్తున్నాం. దేశంలో రాజకీయ ప్రమాణాలు, నైతిక ప్రమాణాలు క్షీణించటానికి ఇదొక కారణం. దీనివల్ల దేశ రాజకీయ సుస్థిరతకు భంగం వాటిల్లే ప్రమాదం కూడా ఉన్నది. పార్టీ కార్యకర్తలు ఒక విధంగా అవకాశవాదులయ్యారు. రాజకీయాధికారాన్ని పంచుకొనేటప్పుడు తప్ప ఇతర సమయాలలో వారి జాడ కానరావడంలేదు. గొప్ప రాజకీయ సంస్థగా కాంగ్రెసు తన వెనుకటి శక్తిస్తోమతలను కోల్పోయింది. కాంగ్రెసు పార్టీలో ఏర్పడిన ఈ బలహీనతే దేశంలో ఈనాడు కానవచ్చే అనర్థాలకు చాలావరకు కారణభూతమని చెప్పవలసి ఉన్నది. సంస్థ ఈ సత్యాన్ని గుర్తించవలసి ఉన్నది. పార్టీ కార్యకర్తలలో క్రమశిక్షణను, సేవానిరతిని, కార్యదీక్షను పెంపొందించేందుకు పార్టీ పూర్తి శ్రద్ధ చూపలేదు. నిస్వార్థ సేవ అనేది ఒక నినాదంగా మాత్రమే ఉండిపోయింది. పార్టీ కార్యకర్త దీక్షాపరుడైన కార్యకర్త కావాలంటే ముందుగా అతడు పార్టీ విధానాలను పూర్తిగా విశ్వసించాలి. ఎన్నికల సమయంలో కేవలం నినాదాలు చేసినంతమాత్రాన ఏ పార్టీకూడ బలపడటంగాని ఉపయోగకారి కావటంకాని జరుగదు. అందుచేత తగిన శిక్షణ కార్యక్రమాలద్వారా వివిధ వర్గాల కార్యకర్తలకు శిక్షణ యిచ్చేందుకు సంస్థ కట్టుదిట్టమైన విధానం రూపొందించాలి. సాంకేతికంగా ఎంతో అభివృద్ధిచెందిన ఈ రోజులలో లభ్యమైన అన్ని సాధనాలను ఉపయోగించుకోవడం అవసరం. పార్టీ కార్యకర్తలకోసం గైడ్లు, మాన్యువళ్లు తయారు చేయటం, పార్టీ విధానాలను ప్రభుత్వ విధానాలను బలపరుస్తూ సాహిత్యాన్ని సమకూర్చటం, పార్టీ విధానాలను ప్రచారం చేసేందుకు బుర్రకథనం జనాదరణ పొందే సాధనాలను ఉపయోగించటం, సాహిత్యాన్ని ప్రచురించటం మొదలైన కార్యక్రమాలను మనం చేపట్టాలి. ఈ ప్రచురణకార్యక్రమాన్ని చేపట్టేందుకు అవసరమైతే ప్రత్యేకంగా ఒక ట్రస్టును ఏర్పాటు చేయాలని నేను సూచిస్తున్నాను. క్రమశిక్షణ, కార్యదీక్షగల కార్యకర్తలను తీర్చిదిద్దినప్పుడు మాత్రమే

రాజకీయ విధానాలకు కార్యరూపం తీసుకువచ్చి ప్రజా బాహుళ్యంలో పార్టీ విధానాలకు అనుకూలమైన అభిప్రాయాన్ని ఏర్పరచేందుకు వీలుపడుతుంది. నిరక్షరాస్యత ఇంకా ఎక్కువగా వున్న మనదేశంలో ప్రజానీకంలో రాజకీయ పరిజ్ఞానం పెంపొందించేందుకు మన పార్టీ దృశ్య, శ్రవ్య సాధనాలను విస్తారంగా ఉపయోగించవలసి ఉంటుంది.

ఈ పవిత్ర భారతదేశంకోసం ఎందరో త్యాగం చేశారు. మనకు వెనుకటి తరంలో లక్షలాది ప్రజలు చేసిన నిస్వార్థ త్యాగ ఫలంగా మనం ఈనాడు స్వేచ్ఛావాయువులను పీల్చగలుగుతున్నాం. వారి త్యాగాలవల్ల లభించిన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవాలంటే దేశ శ్రేయస్సుకోసం మన పెద్దలు చేసిన త్యాగాలను మనసులో ఉంచుకొని అదే విధమైన త్యాగనిరతిని అలవరచుకోవాలి. మనకు కావలసింది చేతలేకాని మాటలుకాదు. నినాదాలు శక్తిమంతమైన రాజకీయ సాధనంగా ఉపయోగపడగల కాలం గడిచిపోయింది. ప్రజలు ఈనాడు ఏ ఉత్తమ కార్యరూపం ధరించే వరకూ దానిని ఆమోదించరు. పేదరికంలో జీవిస్తున్న అసంఖ్యాక ప్రజానీకాన్ని సముద్ధరించేందుకు కాంగ్రెసు పార్టీ బద్ధ కంకణమై ఉన్నదని ప్రజలకు నిదర్శనపూర్వకంగా చూపవలసిన తరుణం ఆసన్నమైంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సహజ సంపదలు సమృద్ధిగా ఉండడం మన అదృష్టం. ఈ సంపదను సక్రమంగా వినియోగించుకున్నట్లయితే మన రాష్ట్రం దేశంలో ఉన్నత స్థానాన్ని వహించగలదు. ఇందుకుగాను మన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు ఇదివరకే వ్యవసాయ అభివృద్ధికి, సత్వర పారిశ్రామికీకరణకు ఆచరణ పూర్వకమైన కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఈ ఉత్తమ కృషిలో మనలో ప్రతి ఒక్కరం వారికి పూర్తి సహకారం అందివ్వాలి.

కులం, భాష, మతం మొదలైన వాటికి సంబంధించి ఏర్పడివున్న అవరోధాలను తొలగించేందుకు మనం కట్టుదిట్టంగా వ్యవహరించాలి. ఇందుకుగాను మనం శ్రీ జలగం వెంగళరావు గారి సారథ్యం క్రింద ప్రపంచ తెలుగు మహా సభలను జరపటానికి సంకల్పించాం. తెలుగు ప్రజలందరిలోను భావ సమైక్యాన్ని పెంపొందించేందుకు ఈ మహాసభలు ఉద్దేశిస్తున్నాయి. ఈ మహా సభలను దిగ్విజయం చేసేందుకు మనందరం మన ముఖ్యమంత్రి గారికి శాయశక్తులా సంపూర్ణ సహకారం అందిద్దాం. ఆలోచనలలోను, ఆచరణలలోను ఏకత్వం ఉన్నప్పుడు మనం శీఘ్రంగా పురోగమించగల్గుతాం. ఇదేవిధంగా భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి విధానాలను, కార్యక్రమాలను విజయవంతంగా అమలుపరచడంలో చురుకుగా పాల్గొనటంద్వారా

ఈ విధానాలకు బలంచేకూర్చాలి. ఆడంబరాలను విడనాడవలసిన సమయమిది. ఈనాడు మనం ఎంతో పొదుపరితనాన్ని చూపటం చాలా అవశ్యకమని మనం గుర్తించాలి. ప్రజాస్వామ్య పరిరక్షణకు, సోషలిజం స్థాపనకు, పేదరికం నిర్మూలనకు అంకితం కాగలమని మనం ప్రతిజ్ఞ తీసుకొందాం. ఇది మన నూతన సంవత్సర ప్రతిజ్ఞ. నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తూ ఈ సంవత్సరం దేశంలోని కాంగ్రెసు పార్టీ కార్యకర్తలందరిలోనూ రాజకీయ సంస్కరణ తీసుకువచ్చి వారిలో సేవాతత్పరతను పెంపొందించగలదని విశ్వసిస్తున్నాను. ఇట్టి సంస్కరణ సేవాతత్పరత ద్వారానే దేశం సౌభాగ్య సంశోభితమవుతుంది.

జై హింద్

## 10. సాంఘిక సంస్కరణలు- సమైక్యత

### సాంఘిక సంస్కరణల ఆవశ్యకత

ఇరవయ్యో శతాబ్దంలో ఏడవ శతాబ్దం చరిత్రాత్మకమైనది. ఈ దశాబ్దంలోనే ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ సామ్యవాద వ్యవస్థకు పటిష్ఠమైన పునాదులు వేశారు. ఈ దశాబ్దంలోనే అధికార పార్టీకి బహుళ ప్రజాదరణకూడా లభించింది. అందువల్ల ఎన్నికల వాగ్దానాలను అమలు పరచవలసిన బాధ్యత ప్రభుత్వయంత్రాంగం మీద, నాయకత్వం మీద వున్నది. భూ సంస్కరణలపట్ల దేశవ్యాప్తంగా ఎంతో ఉత్సాహం కనపడుతూంది. మన రాష్ట్రంలో ఈ సంస్కరణలు చట్టబద్ధమైనాయి. దేశం మొత్తంలో ముమ్మందుగా భూ సంస్కరణల చట్టాన్ని రూపొందించిన గౌరవం ఆంధ్రప్రదేశ్‌కి దక్కినది. ఇంత త్వరలో యీ సంస్కరణలు చట్టరూపం పొందడానికి మన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ పి.వి.నరసింహారావు గారి శక్తిసామర్థ్యాలే ప్రధాన కారణము. అందుకు ప్రధాన మంత్రి అభినందనలు ముందుగా అందుకున్న రాష్ట్ర ముఖ్యమంత్రులలో మన పి.వి.నరసింహారావు గారే ప్రథములు. దీనితోపాటు పట్టణ ఆస్తులపై పరిమితి విధించడానికి రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు సమాలోచనలు జరుపుతున్నవి. ఈ ఆర్థిక సంస్కరణల తర్వాత ఆదాయం మీద పరిమితి, ఆర్థికరంగంలో గుత్త వ్యాపారం అదుపుచేయడం, ఉత్పత్తిని సక్రమంగా పంపిణీ చేయటం, కనీస ఆదాయాన్ని, కల్పించటం మొదలైన అనేక సంస్కరణలు అవసరం కూడా ఎంతో ఉంది. విద్యా వైద్య సదుపాయాలు, గృహ వసతి మొదలైనవి బీద జనానికి కల్పించాల్సిన అవసరముంది. ఇలాంటి ఆర్థిక సదుపాయాలు కల్గించినంతమాత్రంచేత వర్గాలు, కులాలులేని సాంఘిక వ్యవస్థను సాధించటం సాధ్యం కాదు. వర్గరహితమైన వ్యవస్థలో వ్యక్తి అభివృద్ధికి సమానమైన అవకాశాలు ఉన్నప్పటికి కులాలులేని సమాజం ఏర్పడే అంతవరకు మన ఆశయాలన్ని ఎండ మావులుగానే ఉండిపోతాయి. వర్గరహిత సమాజం నిలబడాలంటే యీ కులాలను కులతత్వాన్ని ముందుగా నిర్మూలించాలి. గతంలో ఎన్నో అరలుగా విభజించబడిన మన సాంఘిక సంస్థ చాలా దుష్పరిణామాలకు ఆలంబనంగా ఉంది. హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు, సిక్కులు, శాంతియుత

సహజీవనం చేస్తూవున్నా కూడా ఒక మతానికి సంబంధించినవారు మరొక మతంతో సంబంధం లేకుండా వుంటూ వచ్చేరు. హిందువులలో, బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర తెగలేకాకుండా అవి మళ్లీ అనేక ఉపతెగలుగా చీల్చబడి ఉన్నాయి. ఈ శాఖోపశాఖలు జాతి ఆర్థిక పురోభివృద్ధికి సమైక్యతకు అడ్డగోడగా నిలిచి ఉన్నాయి అని చెప్పడానికి మన చరిత్రలో ఎన్నో ఉదాహరణలు దొరుకుతాయి. శతాబ్దాలుగావున్న యీ కులాలు మరికొన్ని శతాబ్దులు కొనసాగవచ్చును. హిందూ సమాజంలో ఉన్న ఎన్నో మంచి లక్షణాలు అంతరించిపోయినవికాని యీ కులాలు మాత్రం పోలేదు. ఈ రోజు ఏ రంగంలో చూచినా కులము, మతము, ప్రాంతీయతాభావాలు వెర్రితలలువేసి తాండవం చేస్తున్నాయి. ఈ జబ్బు రాజకీయాలలోకూడా బాగా ప్రవేశించింది. ఒక పార్టీవాళ్లు ఒక కులంవాళ్లని అభ్యర్థిని నిలబెడితే ఎదురు పార్టీవాళ్లు ఆ కులంవాడినే నిలబెట్టడం జరుగుతూంది. ఈ కులతత్వం ప్రభుత్వ యంత్రాంగంలో కూడా చొరబడింది. లంచాలు తీసుకొనేచోటకూడా లంచం తీసుకొన్నప్పటికీ తనకులం వాడిమీదే అభిమానం చూపించడం జరుగుతూంది. ఇంట్లో నౌకర్ని పెట్టుకునే సందర్భంలోకూడా తమకులంవాడినే పెట్టుకోవడానికి యిష్టపడుతున్నారు. ఈ పరిస్థితులలో కులాన్ని మనం ఎలా నిర్మూలించగలం?

**మతాంతర, వర్ణాంతర వివాహాలు**

మతాంతర, కులాంతర వివాహాలు కులతత్వ నిర్మూలనానికి ఒక మార్గం కాగలదు. కులాంతర వివాహాలు చేసుకున్నవారి సంతానానికి కులం అంటూ ఒకటి ఉండదు. పోతే యిలాంటి వివాహాలు ప్రభుత్వం ప్రోత్సహించగలదేగాని నిర్బంధంగా చేయించలేదు. అందువల్ల సాంఘిక సంస్కరణలు యీ పనిని సాధించగలవు. ఈ సందర్భంలో కుల నిర్మూలన సంఘం యొక్క కృషిని నేను అభినందిస్తున్నాను. మతాంతర, వర్ణాంతర వివాహాల వల్ల కులతత్వంతో క్రుళ్లిపోతున్న మన సమాజానికి కొంత మేలు కలుగుతుందని నాదృఢ విశ్వాసం. అలాగే ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి యీ వివాహ బంధాలు పెరిగితే ప్రాంతీయతత్వంకూడా అంతరించడానికి అవకాశం ఉంది. పట్టణాలు అభివృద్ధి చెందుతున్న యీ రోజులలో మతాంతర వర్ణాంతర వివాహాలు జరగడంచూస్తూనే ఉన్నాం. ఐనా అడపా దడపా అక్కడక్కడ జరిగే యీ వర్ణాంతర వివాహాల వల్ల వర్ణరహితమైన వ్యవస్థ ఏర్పడడానికి ఎన్నోయుగాలు పట్టవచ్చు. అందువల్ల కొంతప్రత్యేక కృషి చేయవలసిన అవసరం ఉంది. ప్రభుత్వం కూడా చేయగల్గింది కొంత ఉంది. ఈ వర్ణాంతర వివాహాలు ఎక్కువగా జరగాలంటే

కొన్ని ప్రత్యేక సదుపాయాలు కల్పించాల్సిన అవసరం ఉంది. ఇలా వర్ణాంతర వివాహాలుచేసుకున్నవాళ్లు సంఘంలో సానుభూతిని కోల్పోతున్నారు. కొన్ని సందర్భాలలో సంఘ బహిష్కృతులౌతున్నారు. ఎన్నో యిబ్బందులను ఎదుర్కోవలసి వస్తూంది. సంఘంలో వీళ్లకున్న ప్రతిపత్తి వీరనుభవిస్తున్న బాధలు చూచి వాళ్లు యిలాంటి వివాహాలంటేనే విముఖత చూపించడం జరుగుతూంది. ఆ కారణంగా వర్ణాంతర వివాహాలు చేసుకోవడానికి యువతీయువకులు వెనుకంజవేయడం కూడా జరుగుతుంది. ఈ పరిస్థితులను ఎదిరించి ఎంతో ధైర్యమున్న వారుతప్ప తక్కినవారు ముందుకు రాలేకపోతున్నారు. ప్రభుత్వం ఈ వర్ణాంతర వివాహాలు చేసుకున్నవారికి ఆదరణ, అదరవు చూపించాలి. వాళ్లు నిరుద్యోగులైతే ఉద్యోగాలు యివ్వాలి. ఇలాంటివాళ్లకోసం ఉద్యోగాలలో కొంతశాతం కేటాయించడం అవసరమేమోననికూడా నేను భావిస్తున్నాను. గ్రామాలలో నివసించే వారైతే వాళ్లకు కొంత భూమిని కేటాయించవచ్చును. ఈ వర్ణాంతర వివాహాలకు ఒక గౌరవాన్ని ప్రతిపత్తికలిగించడం అవసరం. అలాంటి వివాహాల సందర్భములలో పరిసర ప్రాంతాలలో ఉన్న ఉన్నత ప్రభుత్వాధికారులు పాల్గొనడం ఎంతో సముచితంగా ఉంటుంది. వివాహాల రిజిస్ట్రారు వివాహ వేదిక మీదనే రిజిస్ట్రేషను కార్యక్రమాలను పూర్తిచేయవచ్చును. రిజిస్ట్రేషను ఫీజు వర్ణాంతర వివాహాలకు లేకుండా చేయడం మరొక మార్గం. ప్రభుత్వ ఉద్యోగుల్ని యిలాంటి వివాహాలకు హాజరు కమ్మని ప్రభుత్వ ప్రోత్సహించవచ్చు. ఇన్‌ఫర్‌మేషన్ పబ్లిక్ రిలేషన్స్ శాఖ వారు యీ వర్ణాంతర వివాహాలకు ప్రజలను ప్రోత్సహిస్తూ ప్రజలలో ప్రచారం చేయటం అవసరం.

కులతత్వాన్ని నిర్మూలించడానికి మరొక పద్ధతిగూడా మనం అవలంబించవచ్చు. మన పిల్లలకు రెడ్డి, చౌదరి, నాయుడు, శాస్త్రి అని పేర్ల చివర్నతగిలించటం మానకుంటే, పేర్లనుబట్టి కులాలను నిర్ణయించే దుస్థితి నుండి మనం కొంత వరకు బయటపడతాం. కనీసం ప్రభుత్వోద్యోగులలోనైనా యిది సాధ్యమవుతుందేమో ప్రయత్నించి చూడడం అవసరమేమోనని భావిస్తున్నాను.

**సాంఘిక సమైక్యత**

సాంఘిక సమైక్యత యొక్క అవసరం నేడున్నంతగా ముందెన్నడులేదు. మతాంతర వర్ణాంతర వివాహాల ద్వారా కొంతవరకు సమాజంలో సాంఘిక సమైక్యాన్ని సాధించవచ్చును. మనదేశంలో మరొక "అంటరానితనము" అనే జాడ్యం విస్తృతంగా ఉన్నది. గాంధీ నెహ్రూలు పుట్టిన ఈ దేశంలో యింకా అంటరానితనము కొనసాగడం

చాలా దురదృష్టకరమైన విషయం. చట్టరీత్యా అంటరాని తనాన్ని కొనసాగించడం నేరమైనా, యింకా అక్కడక్కడ యీ దురాచారం కొనసాగుతున్నట్టు మనకు కొన్ని సంఘటల ద్వారా తెలుస్తూనేఉంది. పైగా నిమ్నజాతులమీద అత్యాచారాలు జరుగుతున్నట్లు కూడా మనం అప్పుడప్పుడు వింటూనే ఉన్నాము. ఈ పురాతన భావాలు యింకా మన సమాజంలో వేళ్లుతన్నుకొని వున్నట్టు ఋజువవుతూనే ఉన్నది. ఈ దురాచారాన్ని రూపుమాపడానికి ప్రభుత్వం తగు చర్యలు తీసుకుంటూనేఉంది. ఈ మధ్యే జరిగిన ఒక బాలిక విషాదగాథ ప్రిన్స్‌పాల్ యొక్క ధోరణికి మచ్చుతునకగా కనబడుతూ ఉంది. ప్రభుత్వాధికారం ఒకటే యీ పరిస్థితులను బాగుచేయజాలదు. ఎంతోమంది సంఘ సంస్కర్తలు పూనుకొని యీ సాంఘిక దురాచారం అంతమొందించడానికి పరిష్కారమార్గం అన్వేషించాలి. అంటే ప్రభుత్వం తన బాధ్యతను వదిలేసి చేతులు దులుపుకొని కూర్చుంటుందనికాదు. జిల్లా కలెక్టరు ఛైర్‌మెన్‌గా జిల్లాస్థాయిలో పోలీస్ సూపరింటెండెంట్ మొదలైనవారు సభ్యులుగా కమిటీలను వేయాలని ప్రభుత్వం ఆలోచనలోవుంది. అలాగే రాష్ట్ర స్థాయిలో ముఖ్యమంత్రి ఛైర్మన్‌గా సంక్షేమ శాఖమంత్రి వైస్‌ఛైర్మన్‌గా సీనియర్ ఆఫీసర్లు సభ్యులుగా ఒక కమిటీని వేయాలని ఆలోచనకూడా ఉంది. ఈ జిల్లా రాష్ట్ర కమిటీలు బలహీన వర్గాలమీద జరిగే అఘాయిత్యాలను అరికట్టడానికి ఉపయోగపడతాయి. నిమ్నజాతి వర్గాలు నివసించే చోట యితర కులాలవారికి కూడా గృహవసతి కల్పిచబడుతుంది. అలాగే వారికోసం నిర్మించబడే ఇళ్లు గ్రామాలలోనే ఏర్పరచడం జరుగుతుంది. నిమ్నజాతి వారికోసం కట్టిన ఇళ్ళలో యితర కులాలవారికి అలాగే యితరత్రా కట్టిన ఇళ్ళల్లో నిమ్నజాతులవారికి ఇల్లు ఇవ్వడం వలన ఇతరులు నిమ్నజాతివారితో కలిసి మెలిసి నివసించడానికి అవకాశం కలుగుతుంది. అంతేకాకుండా గ్రామానికి అవసరమైన పోస్టాఫీసు, స్కూలు, పోలీస్ స్టేషను వగైరా సదుపాయాలను నిమ్నజాతులు నివసించే ప్రాంతంలో నెలకొల్పడం వలన అన్ని జాతువారికి మధ్య సంబంధాలు ఏర్పడడం జరుగుతుంది. అంటరానితనం రూపుమాపడం, వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించడం వలన సాంఘిక సమైక్యతనే మనం సాధించుకోవచ్చు. ఇవి ముఖ్యంగా సాంఘికమైన సంస్కరణలు. జాతి నడవడికలో కొన్ని పద్ధతులను అలవరచుకోకపోతే యీ సంస్కరణలు ఎంతోకాలం మనలేవు. నీతి, నిజాయితి, క్రమశిక్షణ, కార్యదీక్ష వ్యక్తి జీవితంలోను సంఘజీవనంలోను మనం ఒక భాగంగా విధిగా అలవరచుకోవాలి. ఏ సంస్కరణలైనా చిత్తశుద్ధితో అమలు జరిపినప్పుడే ఫలితాన్ని పొందగలుగుతాము. చిత్తశుద్ధిలేని ఏ జాతి పురోగమించలేదు. దీనికి తోడు క్రమశిక్షణకూడా అవసరం.

## స్వచ్ఛంద సాంఘిక సంస్థల పాత్ర

జాతి మనుగడకే అవసరమైన పైన ఉదహరించిన లక్షణాలు కొరవడినప్పుడు మనం చేయగలిగిందేముంది? అనే ప్రశ్న మనముందు నిలబడుతుంది. అందువల్ల మనం నవసమాజ నిర్మాణానికి పూనుకోవాలి. రేపటి పౌరులైన యీ నాటి బాల బాలికలను నూతన పౌరులుగా తీర్చిదిద్దాలి. కల్మషంలేని యీ చిన్నారి పాపల మనస్సులలో నవ భావాలను నెలకొల్పాలి. సమాజంపట్ల వారి బాధ్యతలను గుర్తించేట్టుచేయాలి. ఇది అక్షరాభ్యాసం దగ్గర నుంచి పిల్లలకు నేర్పాలి. ఈ కార్యక్రమాన్ని నిర్వహించాలంటే సుశిక్షితులైన యువకులు ముందుకు రావాలి. స్వచ్ఛంద సంస్థలు ఇలాంటి యువకులకు శిక్షణ యిచ్చి కార్యరంగంలోకి దించాలి. గురజాడ, వీరేశలింగం మొదలైన సాంఘిక సంస్కర్తలు మన రాష్ట్రానికి ఒక వెలుగుబాటను చూపించేరు. అది మన అదృష్టంగా భావించాలి. ఆ మహానీయుల అడుగుజాడలలో నడవడానికి సిద్ధమైన నిస్వార్థపరులైన యువకులు ముందుకు వచ్చిననాడు మనం కోరుకున్న నూతన సాంఘిక వ్యవస్థను నిర్మించుకోగలం. భౌతిక సంపద, ఆర్థిక సౌష్ఠవం ఎంతవున్నప్పటికి మతాలు, కులాలు, అంటరానితనముచే పీడించబడుతున్న సాంఘిక వ్యవస్థలో ప్రజల జీవనం దుర్భరమైనదిగానే వుంటుంది. గాంధీమహాత్ముడు కన్న కలలు కలలుగానే వుండిపోతాయి. భారతస్వాతంత్ర్య రజోత్సవం జరుపుకుంటున్న యీ సంవత్సరంలో సాంఘిక దురాచారాలను రూపుమాపడం ప్రతి ఒక్కరు తమ విధిగా భావించి సాంఘిక సంస్కరణలకోసం కృషిచేయాల్సివుంటుంది. ఆర్థిక సంస్కరణలతోపాటు సాంఘిక సంస్కరణలుకూడా తీసుకురాగలినప్పుడే వాటి సత్ఫలితాలు అందరికీ అందుబాటులోకి వస్తాయి. సాంఘిక సంస్కరణాభిలాషవున్న ఉత్సాహవంతులైన యువకులకు సరియైన శిక్షణ యివ్వడం ఎంతైనా అవసరం. దీనికోసం శిక్షణ కేంద్రాలను నెలకొల్పాలి.

## సాంఘిక సంస్కరణల సదస్సు

ఈరోజు మనం సదస్సు జరుపుకుంటున్నాము. ఈ సదస్సు నిర్మాణ యుతమైన సలహాలను, అందరికి ఆమోదకరమైన సలహాలను యిస్తుందని ఆశిస్తాను. ప్రాచీన దేశ గౌరవాన్ని నిలబెట్టడానికి నేటి యువతరాన్ని ప్రగతిపథంలో నడిపించడానికి అవసరమైన నిర్మాణ కార్యక్రమమేదో యీ సదస్సు అన్వేషించి మీముందు పెడుతుందని ఆశిస్తున్నాను. ఇన్ని దురాచారాలతో అస్తవ్యస్తంగా ఉన్న నేటి మన సమాజం

అభివృద్ధికరమైన దేశాలలో ఒకటిగా అంతర్జాతీయంగా నిలబడలేదు. స్వచ్ఛంద సంస్థలూ, ప్రభుత్వము కార్యరంగంలో దిగి నేడు అత్యంతావశ్యకమైన సాంఘిక సంస్కరణలు త్వరలో తీసుకురావలసిన సమయం ఆసన్నమైంది. మత, కుల ప్రసక్తి లేని నూతన సమాజ వ్యవస్థను స్థాపించుకొని అనతికాలంలోనే ఆశయ సిద్ధిని పొందగలుగుతామని ఆశిస్తున్నాను.

*(1972)*

*(హైదరాబాదు లో జరిగిన సాంఘిక సంస్కరణల సదస్సు సందర్భంగా ప్రచురితమైన వ్యాసం)*

# 11. బస్సు రవాణా జాతీయం

సోషలిస్టు రాజ్యస్థాపనే మన ఆశయంగా భారత ప్రభుత్వం భారత జాతీయ కాంగ్రెసు అంగీకరించినవి. స్వరాజ్యం వచ్చిన నాటి నుండి సామాన్య ప్రజల శ్రేయస్సుకు సురాజ్యాన్ని రూపొందించాలని శ్రీ నెహ్రూ నాయకత్వాన భారత ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వములు అవిరళ కృషి చేస్తున్నాయి. ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద ప్రశంసనీయమైన అభివృద్ధి సాధించబడింది. నవ భారత నిర్మాణమనే బ్రహ్మాండమైన కార్యక్రమమునందు ఈ ప్రణాళిక తొలి ప్రయత్నము మాత్రమే మనము అమలు జరుపుచున్న అభివృద్ధి ప్రణాళికల ఆశయం కేవలం ప్రజల జీవన ప్రమాణమును అధికము చేయుటయే గాక, ప్రజల భౌతిక శ్రేయస్సుతోపాటు, సాంఘిక, సాంస్కృతిక అభ్యున్నతికి దోహదము కల్గునట్లు దేశ ఆర్థిక వ్యవస్థను రూపొందించుటయే మన ఆశయమై యున్నది.

అందులకే ద్వితీయ పంచవర్ష ప్రణాళికతో సోషలిస్టు సమాజమే మన ఆశయమని పేర్కొన్నారు. మన ఆర్థిక వ్యవస్థ ప్రధాన లక్ష్యం సోషలిస్టు సమాజ వ్యవస్థను స్థాపించడమే. ఈ వ్యవస్థలో అభివృద్ధి అనేది వ్యక్తిగత ప్రయోజనాల కోసం గాక సమాజపు సమిష్టి శ్రేయస్సు కొరకే సాధించబడుతుంది. వ్యక్తిగత లాభాలను తగ్గించుటకు జాతీయం చేసి సమష్టి ప్రయోజనాలకు ఉపయోగించుట ప్రభుత్వ ధర్మము, ప్రస్తుతము ప్రజల సౌకర్యాల కొరకు జాతీయము చేస్తున్న సంస్థలలో ముఖ్యమైనది రోడ్డు రవాణా.

**రవాణా సౌకర్యములు**

దేశము యొక్క అభివృద్ధి రవాణా సౌకర్యాల మీదనే ఆధారపడి యున్నది. మన దేశములో (1) రైల్వేలు (2) రోడ్డు రవాణా (3) జలమార్గముల ద్వారా రవాణా వ్యవహారమంతా సాగుచున్నది. ప్రయివేటు కంపెనీలు, మేనేజిమెంట్లు, కొన్ని చోట్ల స్టేట్లు సొంతంగా రైల్వేలను నడిపిస్తూ వుండేవారు. 1944లో మొత్తము రైల్వేలన్నింటిని భారత ప్రభుత్వం జాతీయం చేసింది. ఇప్పుడు 86 వేల మైళ్ళ మార్గములలో రైళ్ళను నడుపుతూ సంవత్సరానికి 70 కోట్ల నికరాదాయాన్ని ప్రభుత్వం గడిస్తున్నది.

నదులు, కాల్వలమీద కూడా రవాణా జరుగుతున్నది. ఇది చాలా తక్కువ జలమార్గాలను అభివృద్ధిపరచటాన్కి ప్రభుత్వము పరిశీలన జరుపుతున్నది.

భారతదేశములో అత్యంత ప్రధానమైనది రోడ్డు రవాణా. ప్రస్తుతం ప్రయాణికుల రవాణా సౌకర్యాలో మూడుపాళ్ళు, సరుకుల రవాణాలో అత్యధిక భాగం ప్రయివేటు కంపెనీల చేతులలోనే వున్నాయి. ద్వితీయ ప్రణాళికలో రోడ్డు రవాణాలో ప్రయాణికుల సౌకర్యాలు క్రమంగా జాతీయం చేయబడాలని సరుకుల రవాణా మాత్రము మరికొంత కాలము ప్రయివేటు కంపెనీల చేతులలోనే వుండవచ్చునని ప్లానింగ్ కమీషన్ సిఫార్సు చేసింది. ప్రయాణీకుల రవాణా విషయమై భారత ప్రభుత్వము శ్రద్ధ వహిస్తున్నది. 8-8-68వ తేదీన డా॥ నాగేంద్ర సింగ్ అధ్యక్షుడుగా అంతర్రాష్ట్ర ట్రాన్స్‌పోర్టు పాలనను పటిష్ఠంగా నడిపించడానికి కేంద్ర ప్రభుత్వమువారు డా॥ సుబ్బరాయన్ అధ్యక్షతన కమిటీ నియమించారు. త్వరలోనే రహదారి అభివృద్ధి కౌన్సిల్‌ను ఏర్పాటు చేయనున్నారు.

## వివిధ రాష్ట్రాలలో

వివిధ రాష్ట్రాలలో జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సౌకర్యాల అభివృద్ధి కార్యక్రమాల నిమిత్తము ప్రథమ ప్రణాళికలో 12 కోట్లు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 17 కోట్లు కేటాయించబడింది. 1950వ సంవత్సరములో రోడ్డు రవాణా కార్పొరేషన్‌లను నెలకొల్పవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాలకు సలహా యివ్వబడింది. రైల్వేలు కూడా ఈ కార్పొరేషన్‌లో పాల్గొనగలందులకు రూ. 10 కోట్లు కేటాయించబడింది. మొత్తము మీద ఈ కార్యక్రమము క్రింద 5000 మోటార్లు బస్సులను ప్రవేశ పెట్టడానికి నిర్ణయించింది. అవసరమైన వర్క్‌షాపులను నెలకొల్పుతారు.

బొంబాయి ప్రభుత్వము 8162 బస్సులను 2127 రూటర్ల మీద నడుపుతున్నది. మొత్తము రాష్ట్రమంతా సమర్థమైన మోటారు ట్రాన్సుపోర్టును నెలకొల్పింది. పశ్చిమ బెంగాల్‌లో 500 బస్సులు రోజుకు 50 వేల మైళ్ళు ప్రయాణం చేస్తున్నాయి. ఇంకా అభివృద్ధి చేయటానికి ప్రభుత్వ కృషి చేస్తున్నది. ఒరిస్సా రాష్ట్రములో 10 సంవత్సరాల క్రితమే బస్సులు జాతీయం చేయబడినాయి. ప్రభుత్వమునకు సాలీనా 60 లక్షలు లాభం వస్తుంది. మద్రాసు ప్రభుత్వము సుమారు 500 బస్సులను నడుపుతూ మంచి

లాభాల్ని గడిస్తున్నది. 8 సంవత్సరాల క్రితము ఢిల్లీలో బస్సులను జాతీయం చేశారు. ఇప్పుడు 584 బస్సులను సమర్థవంతంగా నడుపుచున్నారు. ఇతర రాష్ట్రాలలో కూడా బస్సు రవాణా అభివృద్ధికి కృషి చేస్తున్నారు.

## హైదరాబాద్‌లో

1932 జూన్‌లో హైదరాబాద్ ప్రభుత్వము రోడ్డు రవాణాను ప్రారంభించింది. మొట్టమొదటి హైదరాబాద్ ప్రభుత్వము - నిజాంపేట రైల్వే వారు కలసి రోడ్ ట్రాన్స్‌పోర్టును నిర్వహించారు. ప్రజలకు అవసరమైన ప్రయాణ సౌకర్యాలను కలుగజేస్తూ రోడ్డు రవాణాకు రైలే రవాణాకు పోటీ లేకుండా చూడాలనే ఆశయంతో ప్రారంభించారు. అప్పుడు ప్రయివేటు సంస్థలు నడుపుతున్న మంచి బస్సులు, సామాన్లు మాత్రమే ప్రభుత్వము ఖరీదు చేసింది. పరిహారము మాత్రము ఇవ్వలేదు. 1-4-1950వ తేదీన రోడ్డు రవాణాను రైల్వే నుంచి రాష్ట్ర ప్రభుత్వము స్వీకరించింది. రోడ్డు ట్రాన్సుపోర్టు డిపార్టుమెంటు (ఆర్.టి.డి.)ను ప్రభుత్వము ప్రత్యేకంగా నెలకొల్పింది. ఆర్.టి.డి.ని సమర్థవంతంగా పనిచేయడానికి 1954 మే నెలలో రోడ్డు రవాణా సలహా సంఘం నియమించారు. ఈ సంఘం వల్ల కూడా ఆశించినంత ఫలితము కలుగలేదు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత 1956 నవంబరులో రోడ్డు రవాణా సలహా సంఘాన్ని రద్దు చేసి హోంశాఖ బాధ్యత స్వీకరించింది. 1-12-57వ తేదీన ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా కార్పొరేషన్‌ను నెలకొల్పుటకు భారత ప్రభుత్వము ఉత్తర్వులు ఇచ్చింది. 11-1-1958వ తేదీన ఆంధ్రప్రదేశ్ చీఫ్ సెక్రటరీ శ్రీ పాయ్ అధ్యక్షతన ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా కార్పొరేషన్ ఏర్పాటు చేయబడింది.

1932లో 27 బస్సులతో జాతీయ చేయబడిన ఆంధ్రప్రదేశ్ ఏర్పడే ముందు 775 బస్సుల దాకా పెరిగింది. 197 రూట్లలో రోజుకు 5940 మైళ్ళు తిరిగేవి. ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం మహారాష్ట్రకు సంబంధించిన 1490 మైళ్ళ ప్రాంతములో తిరిగే 48 రూట్లు బొంబాయి ప్రభుత్వానికి, కర్నాటకమునకు చెందిన 849 మైళ్ళు తిరిగే 24 రూట్లు మైసూరుకు అప్పచెప్పబడినాయి. పోతే 576 బస్సులు, 28 లారీలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి మిగిలినాయి. వీటిలో 5వ వంతు బస్సులు హైదరాబాద్, సికింద్రాబాద్, నగరాలలో తిరుగుచున్నాయి. వీటికి చాలా తక్కువ రాబడి వస్తుంది. మంచి లాభం వచ్చే రూట్లు మహారాష్ట్ర, కన్నడ ప్రాంతాలకు పోయినవి. అయినప్పటికీ రూ. 7 లక్షలు నికరాదాయము ప్రభుత్వానికి వస్తుంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటినుండి బస్సు రవాణాను అభివృద్ధిపరచి ప్రభుత్వానికి ఆదాయాన్ని, ప్రజలకు సౌకర్యాలను పెంపొందింపజేయాలని ప్రభుత్వము అలోచన చేస్తూ వుంది. హైదరాబాద్‌కు చేరువలోనున్న కృష్ణా జిల్లాలో బస్సులు జాతీయం చేయాలని 16-8-57న ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గము నిర్ణయించింది. కృష్ణా జిల్లాలో 827 బస్సులను నడుపుచున్న 184 మంది బస్సు యజమాన్లు ప్రభుత్వ నిర్ణయానికి కలవరపడినారు. 11-9-57న బెజవాడలో ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి గార్ని బస్సు యజమానులు కలుసుకొని వారి కష్టనష్టాలను వివరించారు. శ్రీ సంజీవరెడ్డి గారు సావధానంగా విని జాతీయం చేయడం తథ్యమని, కొత్త బస్సులున్న వారికి సహాయము చేయగలనని చెప్పారు. బస్సు యజమాన్లు మరింత ఆందోళన చేశారు. ఈ విషయమై ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘం, ఆంధ్రప్రదేశ్ శాసనసభా కాంగ్రెస్ పార్టీ తీవ్రంగా చర్చించి ఏకగ్రీవంగా ఆమోదించినాయి. "బస్సు రవాణా జాతీయం చేయుట వలన ప్రభుత్వానికి ఆదాయము, ప్రజలకు ప్రయాణ సౌకర్యాలు, కార్మికులకు సంక్షేమము కలుగగలవు. వ్యక్తిగత లాభాలను అరికట్టి, సమిష్టి శ్రేయస్సు కోసం ఉపయోగపడటానికి జాతీయం చేయుట ఎంతో అవసరం. సోషలిస్టు స్థాపనే ఆశయమైన ప్రభుత్వాలు ఇటువంటి సంస్కరణలు అమలు జరుపుట విధిగదా!"

*(ఆంధ్రప్రభ 1958)*

# 12. సాంఘిక సమైక్యానికి మత, వర్ణాంతర వివాహాలు

ఇరవయ్యో శతాబ్దంలో ఏడవ దశాబ్దం చారిత్రాత్మకమైనది. ఈ దశాబ్దంలోనే ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ సామ్యవాద వ్యవస్థకు పటిష్ఠమైన పునాదులు వేశారు. ఈ దశాబ్దంలోనే అధికార పార్టీకి బహుళ ప్రజాదరణకూడా లభించింది. అందువల్ల ఎన్నికల వాగ్దానాలను అమలు పరచవలసిన బాధ్యత ప్రభుత్వ యంత్రాంగంమీద, నాయకత్వం మీదవున్నది. భూసంస్కరణపట్ల దేశవ్యాప్తంగా ఎంతో ఉత్సాహం కనబడుతున్నది.

మన రాష్ట్రంలో ఈ సంస్కరణలు చట్టబద్ధమైనాయి. దేశం మొత్తంలో మున్ముందుగా భూసంస్కరణల చట్టాన్ని రూపొందించిన గౌరవం ఆంధ్రప్రదేశ్‌కు దక్కింది. ఇంత త్వరలో ఈ సంస్కరణలు చట్టరూపంపొందడానికి మన రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు శక్తి సామర్థ్యాలే ప్రధాన కారణం. అందుకు ప్రధాన మంత్రి అభినందనలు ముందుగా అందుకున్న రాష్ట్ర ముఖ్యమంత్రులలో ఆయన ప్రథములు.

దీనితోపాటు పట్టణ ఆస్తులపై పరిమితి విధించడానికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు సమాలోచనలు జరుపుతున్నవి. ఈ ఆర్థిక సంస్కరణల తర్వాత ఆదాయంమీద పరిమితి, ఆర్థిక రంగంలో గుత్త వ్యాపారం అదుపుచేయడం, ఉత్పత్తిని సక్రమంగా పంపిణీ చేయడం, కనీస ఆదాయాన్ని కల్పించడం మొదలైన అనేక సంస్కరణలు తీసుకురావలసివుంటుంది. దీనితోపాటు సాంఘిక సంస్కరణల అవసరంకూడా ఎంతోవుంది. విద్యా, వైద్య సదుపాయాలు, గృహ వసతి మొదలైనవి బీదజనానికి కల్పించవలసిన అవసరం ఉంది. అంత మాత్రంచేత వర్గాలు, కులాలులేని సాంఘిక వ్యవస్థను సాధించటం సాధ్యంకాదు. వర్గరహితమైన వ్యవస్థలో వ్యక్తి అభివృద్ధికి సమానమైన అవకాశాలు వున్నప్పటికీ, కులాలు లేని సమాజం ఏర్పడేటంతవరకు మన ఆశయాలన్ని ఎండమావులుగానే వుండిపోతాయి. వర్గరహిత సమాజం నిలబడాలంటే ఈ కులాలు,కులతత్వం ముందుగ నిర్మూలించాలి.

**మతాంతర, వర్ణాంతర వివాహాలు**

మతాంతర, కులాంతర, వివాహాలు కులతత్వ నిర్మూలానికి ఒక మార్గం కాగలవు. కులాంతర వివాహాలు చేసుకున్నవారి సంతానానికి కులం అంటూ ఒకటి ఉండదు.

పోతే, ఇలాంటి వివాహాలు ప్రభుత్వం ప్రోత్సహించగలదేగాని నిర్బంధంగా చేయించలేదు. అందువల్ల సాంఘిక సంస్కరణలు ఈ పనిని సాధించగలవు. ఈ సందర్భంలో కుల నిర్మూలన సంఘం కృషిని నేను అభినందిస్తున్నాను. మతాంతర, వర్ణాంతర వివాహాలవల్ల కులతత్వంతో క్రుళ్ళిపోతున్న మన సమాజానికి కొంత మేలు జరుగుతుందని నా దృఢ విశ్వాసం. అలాగే ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి ఈ వివాహబంధాలు పెరిగితే ప్రాంతీయతత్వం కూడా అంతరించడానికి అవకాశంవుంది. పట్టణాలు అభివృద్ధి చెందుతున్న ఈ రోజులలో మతాంతర, వర్ణాంతర వివాహాలు జరగడంచూస్తూనేవున్నాం. అయినా, అక్కడక్కడ జరిగే ఈ వర్ణాంతర వివాహాల వల్ల వర్ణరహితమైన వ్యవస్థ ఏర్పడడానికి ఎన్నో యుగాలు పట్టవచ్చు. అందువల్ల కొంత ప్రత్యేక కృషిచేయవలసిన అవసరం వుంది.

ఈ వర్ణాంతర వివాహాలకు ఒక గౌరవాన్ని, ప్రతిపత్తిని కలిగించడం అవసరం. అలాంటి వివాహాల సందర్భాలలో పరిసర ప్రాంతాలలో వున్న ఉన్నత ప్రభుత్వాధికారులు పాల్గొనడం ఎంతో సముచితంగా వుంటుంది. వివాహాల రిజిస్ట్రారు వివాహ వేదిక మీదనే రిజిస్ట్రేషను కార్యక్రమాలను పూర్తిచేయవచ్చు. రిజిస్ట్రేషను ఫీజు వర్ణాంతర వివాహాలకు లేకుండా చేయడం మరొకమార్గం. ప్రభుత్వ ఉద్యోగులను ఇలాంటి వివాహాలకు హాజరుకమ్మని ప్రభుత్వం ప్రోత్సహించవచ్చు. సమాచారశాఖ వారు ఈ వర్ణాంతర వివాహాలకు ప్రజలను ప్రోత్సహిస్తూ ప్రజలలో ప్రచారం చేయడం అవసరం.

**సాంఘిక సమైక్యం**

సాంఘిక సమైక్యం అవసరం నేడున్నంతగా ముందెన్నడులేదు. మతాంతర, వర్ణాంతర వివాహాల ద్వారా కొంతవరకు సమాజంలో సాంఘిక సమైక్యతను సాధించవచ్చు. మనదేశంలో మరొక అంటరానితనం అనే జాడ్యం విస్తృతంగా వున్నది. గాంధీ, నెహ్రూలు పుట్టిన ఈ దేశంలో ఇంకా అంటరానితనం కొనసాగడం దురదృష్టకరమైన విషయం. చట్టరీత్యా అంటరాని తనాన్ని కొనసాగించడం నేరమైనా, ఇంకా అక్కడక్కడ ఈ దురాచారం కొనసాగుతున్నట్లు మనకు కొన్ని సంఘటనలద్వారా తెలుస్తూనే ఉంది, పైగా, నిమ్నజాతులపై అత్యాచారాలు జరుగుతున్నట్టుకూడా మనం అప్పుడప్పుడు వింటూనే వున్నాము. ఈ పురాతన భావాలు ఇంకా మన సమాజంలో వేళ్ళు తన్నుకొని వున్నట్టు ఋజువవుతూనే వున్నది. ఈ దురాచారాన్ని రూపు మాపడానికి ప్రభుత్వం తగు చర్యలు తీసుకుంటూనేవుంది. ఈ మధ్యే జరిగిన ఒక బాలిక విషాధగాథ

ప్రిన్సిపల్ ధోరణికి మచ్చుతునకగా కనబడుతూ వుంది. ప్రభుత్వాధికారం ఒకటే ఈ పరిస్థితులను బాగుచేయజాలదు. ఎంతోమంది సంఘ సంస్కర్తలు పూనుకొని ఈ సాంఘిక దురాచారం అంతమొందించడానికి పరిష్కారమార్గం అన్వేషించాలి. అంటే ప్రభుత్వం తన బాధ్యతను వదిలివేసి, చేతులు దులుపుకొని కూర్చుంటుందనికాదు. జిల్లా కలెక్టర్ చైర్మన్‌గా జిల్లా స్థాయిలో పోలీస్ సూపరింటెండెంట్ మొదలైన వారు సభ్యులుగా కమిటీలను వేయాలని ప్రభుత్వం ఆలోచనలో వుంది. అలాగే రాష్ట్ర స్థాయిలో ముఖ్యమంత్రి చైర్‌మన్‌గా, సంక్షేమ శాఖ మంత్రి వైస్ – చైర్మన్‌గా, సీనియర్ ఆఫీసర్లు సభ్యులుగా ఒక కమిటీని వేయాలని ఆలోచన కూడా వుంది. ఈ జిల్లా, రాష్ట్ర కమిటీలు బలహీన వర్గాలమీద జరిగే అఘాయిత్యాలను అరికట్టడానికి ఉపయోగపడతాయి. నిమ్నజాతి వర్గాలు నివసించేచోట ఇతర కులాలవారికి గృహ వసతి కల్పించబడుతుంది. అలాగే వారికోసం నిర్మించబడే ఇళ్లు గ్రామాలలోనే ఏర్పరచడం జరుగుతుంది. నిమ్నజాతివారికోసం కట్టిన ఇళ్ళల్లో ఇతర కులాలవారికి, అలాగే ఇతరత్రా కట్టిన ఇళ్ళలో నిమ్నజాతులవారికి ఇళ్లు యివ్వడంవలన ఇతరులు నిమ్నజాతివారితో కలిసిమెలసి నివసించడానికి అవకాశం కలుగుతుంది. అంతేకాకుండా గ్రామానికి అవసరమైన పోస్టాఫీసు, స్కూలు, పోలీస్ స్టేషను వగైరా సదుపాయాలను నిమ్నజాతులు నివసించే ప్రాంతంలో నెలకొల్పడం వలన అన్ని జాతుల వారి మధ్య సంబంధాలు ఏర్పడడం జరుగుతుంది. అంటరానితనం రూపుమాపడం, వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించడం వలన సాఘిక సమైక్యతనే మనం సాధించుకోవచ్చు. ఇవి ముఖ్యంగా సాంఘికమైన సంస్కరణలు. జాతి నడవడికలో కొన్ని పద్ధతులను అలవరచుకోకపోతే ఈ సంస్కరణలు ఎంతోకాలం మనలేవు. నీతి, నిజాయితీ, క్రమశిక్షణ, కార్యదీక్ష వ్యక్తిజీవితంలోను, సంఘజీవనంలోను మనం ఒక భాగంగా విధిగా అలవరుచుకోవాలి. ఏసంస్కరణలనైనా చిత్తశుద్ధితో అమలు జరిపినప్పుడే ఫలితాన్ని పొందగలుగుతాం. చిత్తశుద్ధిలేని ఏ జాతి పురోగమించలేదు.

# 13. పంచాయతీ రాజ్య వ్యవస్థ - గ్రామీణాభివృద్ధి

భారత దేశములో అనాదిగా పంచాయతీ వ్యవస్థ గ్రామ పరిపాలన వ్యవస్థగా కొనసాగినదని చెప్పడానికి చారిత్రకాధారాలు చాలా వున్నాయి. పంచాయతీలు స్వయం పోషకంగా వుండేవి. గ్రామ పంచాయతీ సభ్యులు ప్రభుత్వముతో సంబంధం లేకుండా తమ సమస్యలను తామే పరిష్కారం చేసుకునేవారు. న్యాయ స్థానాలకు తగవులను పోనీయకుండా గ్రామాలలో తాము ఏర్పాటు చేసుకొన్న న్యాయపంచాయతీల ద్వారా పరిష్కారం చేసుకొనేవారు. ఈ పంచాయతీ వ్యవస్థ బ్రిటిష్ వారు మన దేశాన్ని ఆక్రమించుకునే వరకు కొనసాగింది. 1800 సంవత్సరంలో సీడెడ్ జిల్లాలకు కలెక్టరుగా పనిచేసిన థామస్ మన్రో, ఈ గ్రామ పంచాయతీ వ్యవస్థను ఎంతో శ్లాఘించారు. మన దేశానికే పరిమిత మయిన ఈ వినూత్న వ్యవస్థ బ్రిటిష్ వారి రాకతో పతనము చెందింది. కేవలము భూమిశిస్తు వసూళ్లకే పరిమితమయిన బ్రిటీష్ పరిపాలన ఈ పంచాయతీ వ్యవస్థను చిన్నాభిన్నం చేసింది. పరిపాలనకు, ఆర్థిక విషయాలకు పంచాయతీ ప్రతిపాదికగా వుండటం మానేసింది. రానురాను ప్రజల్లో ఆత్మ విశ్వాసం పోయి పరాధీనత హెచ్చింది. స్వయం కృషిలో నమ్మకం సడలి ఆశ్రయింపు ప్రబలింది. గ్రామం ప్రతిదానికి ప్రభుత్వంపై ఆధారపడటం ఆరంభమైంది.

1931వ సంవత్సరంలో "యంగ్ ఇండియా" పత్రికలో జాతిపిత మహాత్మా గాంధీ గారు పంచాయతీ వ్యవస్థను గురించి వ్రాస్తూ పంచాయతీ అనేది ప్రజలచే ఎన్నికయిన అయిదుగురు ప్రతినిధులని, ఇది ఒక వ్యవస్థకు చిహ్నమని, భారతదేశములోని లక్షల కొలది గ్రామాలు ఈ వ్యవస్థ ద్వారా పరిపాలించబడేవని, కాని బ్రిటీష్ వారు భూమిశిస్తు వసూళ్లకయి అవలంబించిన కఠోర విధానాల వల్ల ఈ పురాతన వ్యవస్థ నాశనమయినదని పేర్కొన్నారు. 1946లో హరిజన్ పత్రికలో వ్రాస్తూ "స్వాతంత్ర్యం అట్టడుగు నుండి మొదలు కావాలి. ఆ విధముగా ప్రతి గ్రామము ఒక గణ వ్యవస్థగా లేక పంచాయతీగా పూర్తి అధికారాలతో రూపొందాలి. ఆ పంచాయతీలో సభ్యులు తమ భావాలు స్వేచ్ఛగా వ్యక్తీకరించడానికి స్వచ్ఛందంగా తాము వ్యవహరించడానికి వీలుగా వుండాలి. గ్రామ పంచాయతీలు న్యాయ నిర్ణయాలు చేసే అధికారాలు కలిగి వుండాలి. పేదరైతు న్యాయం

కోసం తన గ్రామాన్ని వదలి ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి పట్టణాలకు వెళ్లే పరిస్థితి మారాలి. న్యాయస్థానం గ్రామంలోనే ఉంటే న్యాయవాదుల ప్రమేయం లేకుండా తన కేసును తానే గ్రామ పంచాయతీ ముందు వాదించుకోగలడు, అని వ్రాశారు. 1959లో భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ రాజస్థాన్‌లోని నాగోల్‌లో ప్రసంగిస్తూ "ప్రజాస్వామ్యం భారత దేశానికి పూర్తిగా క్రొత్త కాదు. అది దేశంలోని పురాతన వ్యవస్థ అయిన పంచాయతీ విధానంలో వున్నది" అని చెప్పారు.

అనాదిగా దేశంలో అమలులో వున్న ఈ వ్యవస్థ బ్రిటిషు వారి రాకతో ఛిన్నాభిన్నమయింది. ఈ వ్యవస్థలో ఉన్న మేలును అధ్యయనం చేసిన కొంత మంది బ్రిటిష్ అధికార్లు దీనిని పునరుద్ధరించడానికి చేసిన ప్రయత్నాలలో 1871వ సంవత్సరంలో తెచ్చిన లోకల్‌ఫండ్ బోర్డులు ఏర్పడి వైద్య ఆరోగ్యాలు, విద్యా, రహదారులు వగైరా సంక్షేమ కార్యక్రమాలను చేపట్టాయి. స్థానిక సంస్థల పునరుద్ధరణకు తరువాత గణనీయంగా కృషిచేసిన ఘనత గవర్నరు జనరల్ అయిన లార్డ్ రిప్పన్‌కు చెందుతుంది. ఆయన ఆధ్వర్యంలో 1885 మద్రాసులో లోకల్ బోర్డుల చట్టం వచ్చింది. ఈ చట్టంలో జిల్లా స్థాయిలో జిల్లా బోర్డు తాలూకా స్థాయిలో తాలూకా బోర్డులు, వైద్య గ్రామాల స్థాయిలో యూనియన్ బోర్డులు ఏర్పడ్డాయి. తరువాత వచ్చిన 1920 సంవత్సరపు చట్టం ఈ స్థానిక సంస్థలను మరింత పటిష్ఠం చేసాయి. అదే సంవత్సరంలో వచ్చిన మరొకచట్టం మద్రాసు గ్రామ పంచాయతీల చట్టం. ఈ చట్టం ప్రకారం గ్రామ పంచాయతీలను ఏర్పరచడానికి తొలిసారిగా వీలు కలిగింది.

జిల్లా బోర్డులు, తాలూకా బోర్డులు, పంచాయతీలు వాటి పరిధిలో సంక్షేమ కార్యక్రమాలు, వైద్య ఆరోగ్య సర్వీసులు, మంచినీటి సరఫరా, రహదార్లు, విద్య మొదలగు ప్రజాహిత కార్యక్రమాల్ని నిర్వహించాయి. స్థానిక సంస్థల గ్రామీణ సేవలో తరువాత పేర్కొనదగినది 1945వ సంవత్సరంలో మద్రాసు ప్రెసిడెన్సీలో ప్రకాశం పంతులుగారు ప్రవేశపెట్టిన ఫిర్కా డెవలప్‌మెంటు స్కీము. భారతదేశములో తరువాత 1952లో వచ్చిన కమ్యూనిటీ డెవలప్‌మెంట్ స్కీముకు ఇది మార్గదర్శకమయింది.

గ్రామ స్థాయిలో సుపరిపాలనకు, సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడానికి అధిక సంఖ్యలో పంచాయతీలను స్థాపించడానికి 1950 సంవత్సరపు పంచాయతీల చట్టం దోహదము చేసింది. ముందు చెప్పిన విధంగా 1952 సంవత్సరంలో గాంధీ జయంతి రోజున కమ్యూనిటీ డెవలప్‌మెంట్ స్కీము మొదలయింది. ఈ స్కీము బ్లాకు స్థాయిలో

అమలు చేయడం వల్ల గ్రామ స్థాయిలో ఆ గ్రామావసరాలను తగిన విధంగా అభివృద్ధి పథకాలను చేపట్టడానికి వీలుకాలేదు. ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని 1957లో నియమించిన బల్వంతరాయి మెహతా కమిటి మూడు అంచెల స్థానిక స్వపరిపాలనా విధానాన్ని సూచించింది. ఈ విధానం ప్రకారము జిల్లా పరిషత్తు, బ్లాక్ స్థాయిలో పంచాయతీ సమితి, గ్రామ స్థాయిలో గ్రామ పంచాయతీలు ఏర్పరచబడ్డాయి. సంక్షేమ పథకాలతోపాటు, ఈ మూడు రకాల సంస్థలు అభివృద్ధి పథకాలు కూడా చేపట్టబడ్డాయి. మన దేశములోనే రాజస్థాన్‌తో పాటు ఈ పథకాన్ని 1959లో ప్రథమముగా ప్రవేశపెట్టిన ఘనత ఆంధ్రప్రదేశ్‌కు దక్కింది.

ఈ సంస్థ వ్యవహారం తీరుతెన్నులను పరిశీలించడానికి తరువాత రాష్ట్రస్థాయిలో ఎన్నో కమిటీలు వచ్చాయి. 1964 సంవత్సరంలో యం.పి. పాయ్ కమిటీ సిఫార్సుల మేరకు పంచాయతీ సమితుల సంఖ్యను కుదించి తగ్గించారు. మన్య ప్రాంతాలలో గిరిజన పంచాయతీ బ్లాక్‌లను ప్రత్యేకంగా ఏర్పాటు చేసి, అధిక మొత్తంలో గ్రాంట్లు ఏర్పరచారు. 1967లో యం.టి. రాజు కమిటి సిఫార్సుల మేరకు జిల్లా అభివృద్ధి బోర్డులను ఏర్పాటు చేసి, జిల్లా కలెక్టరుకు మరిన్ని అధికారాలు యిచ్చి, జిల్లా స్థాయిలో అభివృద్ధికి సంబంధించిన పశుసంవర్ధక శాఖ, మత్స్య శాఖ మొదలయిన శాఖల జిల్లా అధికారులను కలెక్టరు అజమాయిషీ క్రిందకు తీసుకు వచ్చారు. తరువాత వచ్చిన వెంగళరావు కమిటి, నరసింహం కమిటీలు ఎన్నో విప్లవాత్మకమయిన మార్పులకు దోహదం చేశాయి. 1978, 1981 సంవత్సరాలలో వచ్చిన జిల్లా పరిషత్తు, పంచాయతీ సమితుల సవరణ చట్టం, పంచాయతీల సవరణ చట్టాలు ఈ స్థానిక సంస్థల చరిత్రలో విప్లవాత్మకమయిన మార్పులను తెచ్చింది. పంచాయతీ సమితుల అధ్యక్షులను, గ్రామ సర్పంచ్‌లను నేరుగా ప్రజలు ఎన్నుకొనడానికి వీలు కలిగింది. కొన్ని పంచాయతీ సమితులను, షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల వారికి ప్రత్యేకంగా కేటాయించారు. అలాగే కొన్ని జిల్లా పరిషత్ చైర్మన్ల పదవులను షెడ్యూలు కులాల వారికి షెడ్యూలు తెగల వారికి, వెనుకబడిన జాతుల వారికి కేటాయించారు.

పంచాయతీ రాజ్ పునరుద్ధరణకు జాతీయ స్థాయిలో 1978లో నియమించబడిన అశోక్ మెహతా కమిటి నివేదిక ననుసరించి ఆంధ్రప్రదేశ్‌లో 1986లో బ్లాకు స్థాయిలో మండలాలను ఏర్పాటు చేస్తూ ఒక చట్టాన్ని ప్రవేశపెట్టింది. ఈ చట్టం ప్రకారం జిల్లా స్థాయిలో జిల్లా ప్రజా పరిషత్, అధ్యక్షులు, మండల స్థాయిలో మండల ప్రజాపరిషత్

అధ్యక్షులు, ప్రజలచే నేరుగా ఎన్నుకొనబడతారు. గ్రామ స్థాయిలో పంచాయతీలను పటిష్ఠం చేయడానికి మరిన్ని చర్యలు తీసుకున్నారు.

స్థానిక సుపరిపాలనా వ్యవస్థ అయిన ఈ పంచాయతీ వ్యవస్థకు ఆ విధముగా వంద సంవత్సరాలకు పైగా చరిత్ర వున్నా, అది గ్రామీణ జీవితంలో పూర్తిగా పాతుకు పోలేకపోయింది. కొన్ని రాష్ట్రాల్లో పంచాయతీలకు ఏళ్ల తరబడి ఎన్నికలు జరగలేదు. మరికొన్ని పంచాయతీలకు ఆదాయానికి మించిన, ఖర్చులు ఉండడంతో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టలేకపోయాయి. అందువలన ప్రజలలో పంచాయతీ వ్యవస్థపై నమ్మకం సడలి పోయే ప్రమాదం ఏర్పడింది. గ్రామీణాభివృద్ధికై జిల్లా స్థాయిలో ప్రణాళికలు రూపొందించి, బ్లాకు స్థాయిలో అమలు పరచడము వలన, మూలస్తంభమయిన గ్రామ పంచాయతీకి తగిన ప్రాముఖ్యత లేకుండా పోయింది.

భారత రాజ్యాంగ చట్టములో పంచాయతీ రాజ్య వ్యవస్థను ఏర్పాటు చేసే అధికరణ వున్నా, పంచాయతీ వ్యవస్థకు రాజ్యాంగ చట్ట పరంగా అధికారాలు లేవు. అందువల్ల మన ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ గారు గత రెండేళ్ళుగా ప్రాంతీయవారీగా జిల్లా మేజిస్ట్రేట్లతోనూ, పంచాయతీ సభ్యులతోను విస్తృతమయిన చర్యలు జరిపి పంచాయతీ వ్యవస్థకు రాజ్యాంగ బద్ధమయిన అధికారాలు యివ్వడానికి సంకల్పించి ఈ సంవత్సరము మే నెల 15వ తేదీన పార్లమెంటులో బిల్లును ప్రవేశపెట్టారు. భారత ప్రధాని స్వయముగా బిల్లును పార్లమెంటుకు ప్రతిపాదించడము స్వతంత్ర భారతదేశ చరిత్రలో ఇది మూడవసారి. మొట్టమొదటిగా భారతదేశములో గోవా విలీనం బిల్లును నెహ్రూ, తరువాత రాజభరణాల రద్దు బిల్లును ఇందిరాగాంధీ, పార్లమెంటులో స్వయంగా ప్రతిపాదించారు. ఈ పంచాయతీ బిల్లును స్వయంగా ప్రధాని రాజీవ్ గాంధీ గారు పార్లమెంటులో ప్రతిపాదించడం చూస్తే మన ప్రధానికి పంచాయతీ వ్యవస్థను పటిష్ఠం చేయడానికి ఎంత ఆతురత వుందో ఊహించుకోగలం.

ఈ బిల్లులో జిల్లా పరిషత్ అధ్యక్షులను, బ్లాక్ పంచాయతీ అధ్యక్షులను, గ్రామ సర్పంచ్‌లను పద్దెనిమిది ఏండ్లు నిండిన ప్రతి వ్యక్తి నేరుగా ఎన్నుకునే అవకాశము కల్పించారు. ఎన్నికలు సక్రమంగానూ, నిర్ణీత కాలములోనూ నిర్వహించడానికి ఒక ప్రత్యేక ఎలక్షను కమీషను ఏర్పాటుకు సంకల్పించారు. ఈ వ్యవస్థ వనరుల సమీకరణకు, ఆ వనరులను సక్రమముగా వినియోగింప చేయడానికి ఒక ప్రత్యేక ఫైనాన్స్ కమిషనును ఏర్పాటు చేశారు. గ్రామ స్థాయిలో పంచాయతీలకు అభివృద్ధి కార్యక్రమాలు నిరూపించే

బాధ్యతను అప్పగించారు. ఈ బిల్లు ప్రకారం పంచాయతీలకు ప్రత్యక్ష ఎన్నికలు జరిగి, పవర్ బ్రోకర్ల పాత్ర నిర్మూలన సాధ్యమవుతుంది. షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల వారికి రిజర్వేషన్లు కల్పించబడతాయి. స్త్రీలకు ముప్ఫయిశాతం రిజర్వేషన్లు కూడా ఈ బిల్లులో ప్రతిపాదించబడింది. ఆ విధంగా గాంధీ, నెహ్రూ, ఇందిరాగాంధీ గార్ల ఆశయాల సాధనకు ఈ బిల్లు దోహదం చేస్తుంది.

ముందుగా వివరించినట్లు పేద ప్రజల సంక్షేమము కోసం చేబట్టిన కార్యక్రమాలు, గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి కార్యక్రమాలు జిల్లా స్థాయిలో అధికారుల చేతుల మీదుగా జరుగుతున్నాయి. ఈ పథకాలకు ఉద్దేశించిన కేంద్ర ప్రభుత్వ గ్రాంట్లు పూర్తిగా వాటి అమలుకు వినియోగించకుండా వేరే పథకాలకు మళ్లించడము వలన, ఈ పథకాలలో ఉద్దేశించబడిన గ్రామీణ అభివృద్ధి సాధ్యం కాలేదు. కేంద్రం తల పెట్టిన క్రొత్త చట్టం ప్రకారం గ్రామ స్థాయిలో పంచాయతీలు అభివృద్ధి పథకాలను చేబడతాయి. ప్రధాని ప్రకటించిన జవహర్ రోజ్‌గార్ యోజన పథకం పూర్తిగా పంచాయతీ స్థాయిలోనే అమలు చేయబడుతుంది. సుమారు 2,200 కోట్ల రూపాయల ఖర్చుతో అమలు చేయబడి ఈ పథకం గ్రామాలలో ప్రతి నిరుపేద కుటుంబంలో ఒకరికయినా ఉపాధి సమకూరుస్తుంది. గ్రామాలకు అత్యంత ఆవశ్యకమయిన మంచినీటి సరఫరా, పాఠశాలల నిర్మాణం, రహదార్లు నిర్మించడం, స్కూలు, భవనాల నిర్మాణం వంటి సంక్షేమ, అభివృద్ధి కార్యక్రమాలు కూడా పంచాయతీలే నిర్వహిస్తాయి. ప్రధాని ప్రతిపాదించిన పంచాయతీ చట్టం ప్రకారము గ్రామీణులు తమ అవసరాలను తామే తీర్చుకుంటూ, తమ సమస్యలను తామే పరిష్కరించుకుంటూ, గ్రామాలలో అభివృద్ధి కార్యక్రమాలు తామే నిర్వహించుకోడానికి అవకాశం కల్పించింది. ఇందువల్ల పంచాయతీలపై ఎక్కువ బాధ్యతలు, ఆ బాధ్యతలు నిర్వహించడానికి గ్రామీణులకు ఉత్సాహం, ఆ విధముగా గ్రామస్థాయికి అధికార వికేంద్రీకరణ జరిగి దేశములో ప్రజాస్వామ్యం పటిష్ఠం కావడానికి, అభివృద్ధి కార్యక్రమాలు మరింత చురుకుగా సాగడానికి వీలవుతుంది. గ్రామ స్థాయిలో పంచాయతీలు తమ ప్రజల యోగ సంక్షేమాలు చూసే అవకాశం ప్రథమంగా ఈ పంచాయతీ బిల్లు వల్ల కలిగింది. గ్రామ పంచాయతీలు ఈ బిల్లు వల్ల సంక్రమించిన అధికారాలను, వనరులను సక్రమంగా వినియోగించుకొని గ్రామీణాభివృద్ధికి మరింత ఇతోధికంగా కృషిచేసి, గ్రామ సీమలను స్వర్గ సీమలుగా మార్చి, జాతిపిత గాంధీజీ, జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరా గాంధీ గార్ల కలలను నిజం చేయగలవని ఆశిద్దాం.

మహాత్మాగాంధీ ఊహించిన గ్రామరాజ్య వ్యవస్థలో, గ్రామ ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వానికి ఉండే పరస్పర సంబంధాలు ఎలాంటివో వివరిస్తూ తమ "లాస్ట్ ఫేజ్" అనే గ్రంథంలో శ్రీ ప్యారేలాల్ నీటి తరంగ వలయాలను ఉదహరించారు. ప్రతి గ్రామము కేంద్ర బిందువు. మిగతా వ్యవస్థలన్నీ దాని చుట్టూ ఏర్పడే తరంగ వలయాలు. గ్రామం అనే కేంద్ర బిందువు చుట్టూ తాలూకా, జిల్లా, రాష్ట్ర, కేంద్ర ఇత్యాది పరిపాలనా వ్యవస్థల తరంగ వలయాలు ఉంటాయి. కేంద్ర బిందువుకు దూరమైన కొద్దీ తరంగ వలయాలు శక్తి తగ్గుతూ ఉన్నట్లుగానే గ్రామం కన్నా తాలూకాకు, తాలూకా కన్నా జిల్లాకు, అలా అనంతంగా ఉండే ప్రభుత్వ వ్యవస్థల అధికార క్షేత్రాల ప్రభావం తగ్గుతూ ఉండి కేంద్ర బిందువు మీద ప్రత్యక్ష ప్రాబల్యాన్ని కోల్పోతూ ఉంటాయి. ఈ విధంగా అధికార వికేంద్రీకరణ జరుగుతుంది.

గాంధీజీ వంటి దేశ నాయకులు కలలు గన్న పంచాయతీ వ్యవస్థ వల్ల గ్రామీణాభివృద్ధి కేవలము చట్టాల ద్వారా సాధ్యం కాదు. గ్రామస్థులందరూ ఐకమత్యంతో మెలిగి, రాజకీయాలను వెనుక్కునెట్టి సంఘటితంగా నడుము కట్టుకొని తమ గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించాలి. చట్టములో నిర్దేశించినా లేకపోయినా అన్ని సామాజిక అభివృద్ధి కార్యక్రమాలను పంచాయతీ చేపట్టాలి. స్థానిక సహకార సంఘాలతో సంఘటితమయి, వ్యవసాయాభివృద్ధికి అవసరమయిన విత్తనాలు, ఎరువులు మరియు క్రిమి సంహారక మందుల సరఫరాలో తోడ్పడాలి. పంచాయతీ హద్దుల్లో ఉన్న నీటిపారుదల కాల్వల మరమ్మతులు, డ్రైనేజి కాల్వల మరమ్మతులు స్థానిక ప్రజల తోడ్పాటుతో పంచాయతీలు చేబట్టే అధికారం ప్రభుత్వం ఇవ్వాలి. బాలబాలికల విద్య, వయోజన విద్య, స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు, ఆరోగ్య సంబంధమయిన పథకాలు, అన్నీ నిర్వహించే అధికారము ప్రభుత్వము వారు గ్రామ పంచాయతీలకు దత్తత చేయాలి. ఖాదీ కమిషన్ వారు ప్రోత్సహించే చేతి పనులు, కుటీర పరిశ్రమలు గ్రామ పంచాయతీలే నిర్వహించాలి. ఈ నిర్వహణలో ప్రభుత్వము వారి జోక్యం అవసరానికి మించి ఉండరాదు. ఇప్పుడు గ్రామీణ ప్రాంతాలలో సామాజిక స్పృహ కలిగి, సమాజానికి కావలసిన సంక్షేమ మరియు అభివృద్ధి కార్యక్రమాలు వారు పంచాయతీల ద్వారా నిర్వహిస్తారు.

# 14. ఆంధ్రప్రదేశ్ సమైకత్యతపై అవనిగడ్డ నియోజకవర్గ ప్రజలకు విన్నపము

మిత్రులారా!

అందరూ అనుమానపడి అనేకమంది వ్యతిరేకించే పని ఈనాడు చెయ్యవలసి వస్తోంది. ఇది ప్రవాహానికి ఎదురీత! జనవాక్యానికి ఎదురు నిలవడం! ఇది సాహసంతో కూడుకున్నది. అంతకుమించి ప్రమాదకరమైందికూడ. కాలప్రవాహంలో కొట్టుకు పోవడమో, రానున్న పరిణామాలలో తుడుచుకుపోవడమో జరుగవచ్చు! అన్నిటికీ సిద్ధపడే అడుగు వెయ్యాలి కదా!

ఇది అంతా తెలిసి చేస్తున్న పనా? తెలియక చేస్తున్న పనా? అన్నీ తెలిసి ఎందుకు ఇలా చెయ్యాలి! నలుగురికీ నచ్చనిది-ఎవరూ మెచ్చనిపని ఎందుకుచెయ్యాలి? ఈ ప్రశ్నలే శూలంలాగ గుచ్చుకుంటున్నాయి. ఈ బాధ మధ్యన – ఈ ఆవేదనతోనే మీకు వ్రాస్తున్నాను.

**ఆనందమా? ఆవేదనా?**

ఈనాడు పదవిలో ఉండడం గొప్పతనం కాదు. అధికారాన్ని అంటిపెట్టుకోవడం శ్రేయస్కరం కాదు. మంత్రిపదవి మరింత ప్రమాదభరితం అయింది. ఇందులో ఉండడంలో గౌరవం లేదు. ఘనత లేదు. బయటకు రావడంలో పేరూ ఉంది. ప్రఖ్యాతీ ఉంది. ప్రజామోదము ఉంది. అంతా తెలిసి రాజీనామా ఎందుకు చెయ్యలేదు? ఇప్పుడైనా ఎందుకు ఇవ్వకూడదు? ఇందులో ఏమి ఆనందం ఉంది? ఏమి సుఖం ఉంది? కష్టాలు కొని తెచ్చుకొనేందుకా పదవి?

ఇది అధికారంలో ఉండడంకాదు. అగ్నిహోత్రంమధ్య ఉండడం. కుర్చీ ఖాళీచేసి కత్తిమీద బ్రతుకునుండి తప్పించుకోచ్చు. పదవిని బలిపెట్టి, కీర్తిని క్షణంలో చేబట్టవచ్చు. ఒక్క రాజీనామాతో రాష్ట్రం అంతటా పేరు మార్మ్రోగుతుంది. ఇంత సులభంగా ఘన గౌరవం పొందకుండా, అప్రతిష్ఠ పాలు కావడం ఎందుకు?

## మనిషి నడక - కాలగమనం

పదవులు, అధికారాలవల్ల గొప్పతనం వస్తుందని నేను ఎన్నడూ అనుకొనలేదు. ఉన్నతపదవులూ, మంత్రిపదవులూ లభించాలని ఎప్పుడూ ఆరాటపడలేదు. అధికారదాహం, పదవీవ్యామోహం ఎక్కడున్నా, ఎవరికి ఉన్నా అసహ్యించుకున్నాను. అహంకారం, అహంభావం ఏ రూపంలోనూ, దగ్గరకు రానియ్యలేదు. పదవిలో ఉన్నా, లేకున్నా జీవితం ఒకేస్థాయిలో, అదే బాటలో నడపాలని నమ్మినవాడ్ని. పెద్ద అన్నా, చిన్న అన్నా అదే నమ్రతతో, అదే చనువుతో తిరిగినవాడ్ని. ఒకరిచేతుల్లో ఉన్న అధికారానికి అందరమూ వాటాదార్లమని, ఇది మన అందరి వారసత్వం అని నమ్మి, ఆవిధంగా ప్రవర్తించినవాడిని. అధికార గర్వంగాని, అహంకారభావంగాని, ఏ ఒక్కరోజున తలకెక్కినా ఆనాడే అధఃపతనం చెందినట్లు భావించుకున్నవాడ్ని. మన అందరి మంచికోసం, మన ప్రాంతం క్షేమం కోసం ఉపయోగపడడమే పదవికి లక్షణం అని త్రికరణశుద్ధిగా విశ్వసించి ఆవిధంగా నడుచుకున్నవాడ్ని. ఒక్కరిచేతిలో ఉన్న పదవిని అందరి చేతుల్లో ఉన్నట్లుగా భావించుకొని నలుగురి మాటప్రకారంగా అందరికీ ఆమోదకరంగా వినియోగించాలని ఆత్రుత చెందినవాడిని. నా భావంలో, స్వభావంలో, ప్రవర్తనలో అందరిపట్లా – ముఖ్యంగా – నన్ను గెలిపించి ముందుకు నడిపించినవారిపట్ల యీవిధంగానే మెలిగేను.

పదవిమీద మోజుగాని, అధికారంమీద వ్యామోహంగాని లేవు. పదవుల్లో ఉన్నవాళ్లకి నమ్రత కావాలని – అణకువ ఉండాలని అందరు చెప్పినదీ. ఒక్కడినై చెయ్యగలగాలని తపనపడ్డాను. ఒక మంచి సాధించేందుకు, పదవి – ఒక పనిముట్టు. అందరి మంచికోసం ఉపయోగించే సాధనం అధికారం. ప్రజాస్వామ్యం నమ్మినవాళ్లు, ప్రజలను సరిసమానులుగా – సోదరులుగా భావించినవాళ్లు, ఇంకో రకంగా ఊహించుకోడానికి, ప్రవర్తించడానికి వీల్లేదు. ఇంతకాలమూ అదే చేసేను. ఆ రకంగానే నడిచేను. ఇది ఎంతవరకూ నిజమో అనుభవంచేత మీకూ తెలుసు.

## ఆదర్శం ఉండాలి

ఒక ఆశయంకోసం బ్రతకాలి. ఒక ఆదర్శంకోసం జీవించాలి. ఒక లక్ష్యంకోసం పనిచెయ్యాలి. పదవి అయినా – పలుకుబడి అయినా – ఏదైనా ఇందుకోసమే. ఆశయాలు వదులుకొని బ్రతికితే ఎంత. లేకుంటే ఎంత? మనిషి విలువ తాను పొందిన పదవిలో ఉండదు. తనముందు ఉంచుకొన్న ఆదర్శంలో ఉంటుంది. అందుకు తగిన విధంగా పనిచెయ్యడంలో ఉంటుంది. పేరుకోసం గాని, ప్రఖ్యాతుల కోసం గాని, కష్టాలను, ఇబ్బందులను తప్పించుకొని ఆశయాలను వదులుకోడానికి వీల్లేదు.

### ఏది త్యాగం? ఏది ఘోరం?

పదవిలో ఉండడమే ఆశయం అయితే అది మహా నీచమైనది. ఆశయాలు వదులుకొని పదవిలో ఉండడం నీచాతినీచమైనది. ఆశయాలకు తిలోదకాలు ఇవ్వడానికే పదవులు వదిలిపెట్టడం అంటే అది మరీ అన్యాయం. ఆశయంకోసం పదవిని వదిలిపెడితే అది త్యాగం అవుతుంది. ఆశయాలను పడగొట్టడంకోసం పదవుల నుండి బయటకువస్తే అది ఘోరం అవుతుంది.

### ఎన్నో నోములపంట

ఆంధ్రప్రదేశ్ ఐక్యత అన్నది ఒక ఆశయం. విశాలాంధ్ర అన్నది మన ఆదర్శం. ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే వారసత్వం కలిగిన తెలుగుజాతి వెలుగుజాతిగా, ఏకజాతిగా భారత జాతీయ జీవనంలో ఉన్నత స్థానం ఆక్రమించాలని ఆశించేము. ఒకేరక్తం పంచుకొని, ఒకే కర్తవ్యం ముందుంచుకొని రాష్ట్రాభ్యుదయాన్ని, దేశ ప్రగతిని తెనుగు ప్రజలు సాధించగలరని ఆశించేం. మహోజ్జ్వలమైన ఆంధ్రచరిత్రను – మహోన్నతమైన మన వారసత్వాన్ని మనముందు ఉంచుకొని – మన సాంస్కృతిక వారసత్వ సంపదను సుసంపన్నం చేసుకుంటూ పురోగమించాలి. యీ ఆశయంతో, యీ ఆదర్శంతో దశాబ్దాల తరబడి ఆంధ్రమహానాయకులు జరిపిన పోరాటం ఫలితంగా విశాలాంధ్ర నిర్మాణం జరిగింది. శతాబ్దాల క్రితం ఒకేపాలన క్రింద పనిచేసిన ఆంధ్రప్రజలు మళ్లీ ఒకే రాష్ట్రంలో సమైక్యమయ్యేరు. ఈ లక్ష్యంకోసం అశేషమైన త్యాగాలు చేసిన ఆంధ్ర నాయకుల కలలు ఫలించేయి.

### కర్తవ్యం ఏమిటి?

ఈ ఆశయాన్ని యీనాడు మనం భగ్నంచేయడమా? ఈ ఆదర్శాన్ని మనం తిరస్కరించడమా? మళ్లీ రాష్ట్రాన్ని ముక్కలు చెయ్యడమా? సమైక్యరాష్ట్రం ఉండాలని నమ్మేవాళ్లు ఏం చెయ్యాలి? రాష్ట్ర సమగ్రతమీద విశ్వాసం ఉన్నవాళ్ల కర్తవ్యం ఏమిటి? విశాలాంధ్ర ఆదర్శంగా భావిస్తున్న నాబోటివాళ్లు ఏం చెయ్యాలి? ఇది ఆదర్శంగా భావించి – యీ ఆదర్శాన్నే పడగొట్టేందుకు ఎలా పనిచెయ్యాలి? ఈ ఆదర్శాన్ని వ్యతిరేకిస్తే ప్రస్తుతం పేరు ప్రఖ్యాతులున్నాయి. కాదంటే అపవాదులు, అపకీర్తి ఎదురు అవుతున్నాయి. ఆదర్శాన్ని వదలుకొనడమా? అపకీర్తి పొందడమా?

## పరీక్షా సమయం

ఇది విషమసంధి. ఇది కఠినమైన పరీక్ష. పదవులు వదిలిపెట్టగలం. యీ ఆశయాన్ని ఎలా వదలాలి? పదవి వదలిపెట్టి "విశాలాంధ్ర" కావాలంటే అంగీకరించే, పరిస్థితి ఉందా? – లేదని తేలిపోయింది. "రాష్ట్ర విభజన జరగాలి" అని కోరాలి. ఇందుకు మనసు అంగీకరించడంలేదు. ఇంతకాలం నమ్ముకున్న "విశాలాంధ్ర" అన్న ఆశయం పోయినతర్వాత మనంఉంటేనేమి? లేకుంటేనేమి? ఈ ఆదర్శంతోపాటు నిలవడమో – పడిపోవడమో చెయ్యడమే ధర్మం. ఈ నిర్ణయంలోనే త్యాగం ఉంది. ఇదే ఆదర్శ ఋజుప్రవర్తన అవుతుంది" అని అనిపిస్తోంది. ఈ అభిప్రాయాలతో కొంతవరకైనా కొందరు అంగీకరించవచ్చు. మరికొందరు తిరస్కరించవచ్చు. అయినా ఇందులో స్వార్థపరత్వం ఉందా? ద్రోహచింతనఉందా? మీరు ఆలోచించండి. మీరే తీర్పు చెప్పండి.

## ఆద్యంతాలు

ఆదర్శాలు వల్లిస్తూ కూర్చొనే సమయం దాటిపోయింది. ఆంధ్రప్రాంతానికి అన్యాయం జరిగిపోతోంది. ఆంధ్రుల హక్కులకు నష్టం కలుగుతోంది. రాజధానిలో తెనుగు ప్రజల ఆత్మగౌరవానికే భంగం కలుగుతోంది. ఇవన్నీ ఎలా సహించడం? వీటికి సమాధానం ఏమిటి? అని కూడా ఆలోచించుకోవాలి. ఈ పరిస్థితుల్లో మేము చేసిన దేమిటి? చేస్తున్నదేమిటి? ఈ విషయాలు కూడా మీకు చెప్పుకోవలసి ఉంది.

ముల్కీ నిబంధనలు విషయంలో సుప్రీంకోర్టు తీర్పు చెప్పక పూర్వం అంతా సవ్యంగానే జరిగింది. అంతా సర్దుబాటు చేసుకుంటూనే నడిచేరు. అన్యోన్యంగానే గడిచింది. సుప్రీంకోర్టు చెప్పినతీర్పు అనంతరం మాత్రం అనుమానాలు, అపోహలు కలిగేయి. భయాందోళనలు వ్యాపించేయి. కోర్టుతీర్పు అనంతరం ఏర్పడిన పరిణామం ఇది. అందుచేత ఈ తీర్పురాక పూర్వం ఉండే పరిస్థితే ఉంటే ఎలా ఉంటుంది. ఈ తీర్పువల్ల కలిగే ఫలితాలు ఎట్టివి? ఇది ఆలోచించాలి కదా!

## సుప్రీంకోర్టు తీర్పు

ముల్కీ నిబంధనలు చెల్లుతాయని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. అంటే అర్థం ఏమిటి? తెలంగాణా ప్రాంతంలోని అన్ని ఉద్యోగాలు తెలంగాణావారికే చెందుతాయి అన్నమాట. అతిచిన్న ఉద్యోగం నుండీ, అత్యున్నత పదవివరకూ, తెలంగాణావారికే

కేటాయించడం జరుగుతుంది అన్నమాట. ఆంధ్రప్రాంతంవారికి తెలంగాణా ప్రాంతంలో ఉద్యోగం దొరకదు. అందుకే ఇవి రద్దుకావాలని ఆందోళన బయలుదేరింది. రద్దు అయితే తెలంగాణాలో ఆంధ్రప్రాంతం వారికి కూడా ఉద్యోగాలు లభిస్తాయి. ముల్కీరూల్సు అమలు జరగాలంటే అర్థం ఏమిటో – రద్దుకావాలనడంలో ఉద్దేశం ఏమిటలో ఇప్పుడు తేలింది.

**ఉద్యోగాల విషయాలు**

ముల్కీ అంటే ప్రాంతీయుడు – స్థానికుడు, దేశీయుడు అని అర్థం. అంటే ఇక్కడివారికే ఉద్యోగాలు అన్న సూత్రం ఇది. ఇది కేవలం ఉద్యోగాలకు సంబంధించినది. తెలంగాణాలోని ఉద్యోగాలు ఎవరికి చెందాలన్న రూల్సు ఇవి. ఉద్యోగాలకు తప్ప మరిదేనికీ ఇవి వర్తించవు. "కోర్టు తీర్పు చెప్పక పూర్వం ఏమి జరుగుతూ ఉండేది" అన్నది కూడా ఆలోచించాలి. ఇప్పుడూ అదే జరిగితే బాగుంటుంది కదా! తీర్పు రాకపూర్వం ఉండేపరిస్థితినే నెలకొల్పితే సరిపోతుందికదా! అది ఎలా చెయ్యాలి? అన్నదే ప్రశ్న. ఇదే అందరం ఆలోచిస్తూ వచ్చేం.

**తీర్పుకు ముందు పరిస్థితి**

ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలు కలిసి, ఆంధ్రప్రదేశ్ ఏర్పడి నప్పుడు ఉభయ ప్రాంతాల పెద్దలు ఒడంబడిక చేసుకున్నారు. దానికే పెద్దమనుషుల ఒప్పందం అన్నారు. ఈ అగ్రిమెంటును అనుసరించి ముందు ఒక జి.ఒ. పుట్టింది. ఆ జి.ఒ. ఉద్దేశాలు నెరవేరుస్తూ పార్లమెంటు ఒక చట్టం చేసింది. దానినే పబ్లిక్ ఎంప్లాయిమెంటు యాక్టు అంటారు. ఆ చట్టం 1959లో చేసేరు. ఆ చట్టంలో ఉన్న అంశాలు ఏమిటి? సుప్రీంకోర్టు తీర్పుకు పూర్వం ఉండే పరిస్థితి ఎట్టిది? చూద్దాం.

ఇదివరకు ఉమ్మడి కార్యాలయాల్లో – సెక్రటేరియట్‌లోనూ, డైరెక్టర్ల ఆఫీసుల్లోనూ ఆంధ్రులకు రెండు – తెలంగాణాకు ఒకటిచొప్పున ఉద్యోగాలు ఇవ్వాలని నిర్ణయం ఉంది. సుప్రీంకోర్టు తీర్పువల్ల యీ ఉద్యోగాలు అన్నీ తెలంగాణావారికే పోతాయి. అలా జరగకుండా మళ్ళీ 2:1 నిష్పత్తి ఏర్పాటు చెయ్యాలి.

తెలంగాణా జిల్లాలలో తహసిలుదారు ఉద్యోగం నుండి క్రింది వరకూ ఉద్యోగాలు తెలంగాణావారికి కేటాయించేవారు. స్థానిక సంస్థలలో రూ. 300/–లు జీతంవచ్చే ఉద్యోగాల నుండి క్రింది ఉద్యోగాల వరకూ తెలంగాణావారికి కేటాయించేవారు. ఆపైన

ఉండే ఉద్యోగాలు అందరికీ లభించేవి. ఆంధ్ర తెలంగాణా తేడాలేకుండా అందరూ అనుభవించేరు. కోర్టు తీర్పుకు పూర్వం ఈ విధంగానే ఉండేది.

పబ్లికు ఎంప్లాయిమెంటు యాక్టు ఉంటే ఆ విధంగానే జరిగి ఉండేది. సుప్రీంకోర్టు ఈ చట్టాన్ని రద్దుచేసింది. ఇది రాజ్యాంగం ప్రకారం చెల్లదన్నారు.

ఈ చట్టం పోయిన తర్వాత మిగిలింది ఏమిటి? అంతకుముందు ఉండే చట్టం మిగులుతుంది. అంతకు ముందు ముల్కీ రూల్సు ఉండేవి. అందుచేత అవే ఉంటాయి అన్నారు. ముల్కీ రూల్సు స్థానంలో (జెంటిల్‌మెన్సు అగ్రిమెంటు ప్రకారం తయారైన) పబ్లిక్ ఎంప్లాయిమెంటు యాక్టు ఉండేది. ఈ యాక్టు రద్దు అయినప్పుడు మళ్ళీ ముల్కీ రూల్సు అమల్లోకి వస్తాయి అన్నారు. భారత రాజ్యాంగం పుట్టకపూర్వమే ఇవి అమలులోకి వచ్చాయి, కాబట్టి యివి రాజ్యాంగం ప్రకారం చెల్లుతాయన్నారు.

## న్యాయసంబంధమైన సమస్య

రాజ్యాంగం ప్రకారం పబ్లిక్ ఎంప్లాయిమెంటు యాక్టు చెల్లదని కోర్టు తీర్పు చెప్పింది. రాజ్యాంగం ప్రకారం ముల్కీరూల్సు చెల్లుతాయని తీర్పు వచ్చింది. ఇది న్యాయసంబంధమైన చిక్కు ప్రశ్న. ఇది కోర్టులకు సంబంధించిన తగువు. ఈ సమస్య ఆవిధంగానే ముందు తల ఎత్తింది. ఆఖరికి ఎక్కడి వరకు వెళ్లిందో చూడండి. ఇప్పుడేం చేయాలి?

## పెద్దమనుష్యుల ఒప్పందమే మూలం

కోర్టు చెల్లుతాయన్న ముల్కీరూల్సును చెల్లవన్న పబ్లిక్ ఎంప్లాయిమెంట్ యాక్టు మేరకు కుదించాలి. అలాచేస్తే సరిపోతుందికదా! ముల్కీరూల్సు అని పేరు ఉంటుంది. అందులో ఉన్న విషయాలు మాత్రం పబ్లిక్ ఎంప్లాయిమెంటు యాక్టులో ఉండే విషయాలే ఉంటాయి. ఈ విధంగా చేస్తే న్యాయ సంబంధమైన చిక్కులు పోతాయి కదా! కోర్టు తీర్పును అనుసరించినట్లు కూడా అవుతుంది కదా! అని అనుకుంటూ వచ్చాము. ముల్కీ రూల్సు అన్న పేరు ఎందుకు ఉంచవలసి వచ్చిందో చూడండి. కోర్టు తీర్పువల్ల అలా జరిగింది. అయితే అందులో ఉండే విషయాలు ఏమిటి? పబ్లిక్ ఎంప్లాయిమెంటు యాక్టులో ఉన్న పెద్దమనుషుల ఒప్పందంలోని విషయాలే. ఈ విధంగా చేస్తే పేరు ఎలా ఉన్నా నిర్ణయాలు మాత్రం మన పెద్ద మనుషులు చేసినవే ఉంటాయికదా అనుకున్నాం.

ఆఖరికి అంతే జరిగింది. పార్లమెంటులో ప్రధానమంత్రి ప్రవేశపెట్టిన ముల్కీ రూల్సు బిల్లు దాదాపు పబ్లిక్ ఎంప్లాయిమెంటు యాక్టు ప్రకారంగానే ఉంది. సుప్రీంకోర్టు తీర్పు చెప్పక పూర్వం తెలంగాణా ప్రాంతంలోని ఏ ఉద్యోగాలు వారికి కేటాయించారో ఆ ఉద్యోగాలకే ఇప్పుడు ముల్కీ రూల్సు వర్తిస్తాయి.

**ఈ బిల్లు లేకపోతే....**

1956లో ఈ చట్టం చేసేవరకూ తెలంగాణాలోని ఎన్నో ఉద్యోగాలలో ఆంధ్రులు చేరారు. కొన్ని వేల ఉద్యోగాల్లో ఆంధ్రులు ఉన్నారు. సుప్రీంకోర్టు చెల్లుతాయని చెప్పిన ముల్కీ రూల్సు ప్రకారంగా అయితే ఇంతమంది ఉద్యోగాలు కూడ చెల్లవు – అన్నీ పోతాయి. పార్లమెంటులో ప్రధాని ప్రవేశపెట్టిన ముల్కీ రూల్సు బిల్లు ప్రకారం యీ ఉద్యోగాలు – అన్నీ చెల్లుతాయని ఖాయపరిచేరు. ఈ బిల్లు పెట్టడం మంచిదా? కాదా? ఇప్పుడు ఆలోచించండి. ఈ బిల్లు పెట్టకపోతే ఈ ఉద్యోగాలు ఏమి అయి ఉండేవి?

**నిజానిజాలు**

ఇంతవరకూ మీరు గ్రహించినట్లు – ముల్కీరూల్సు అన్నవి ఉద్యోగాలకు సంబంధించినవి. అందులోనూ తెలంగాణాలోని ఉద్యోగాలకు వర్తించేవి. తెలంగాణా ప్రాంతంలోని ఉద్యోగాలు తెలంగాణా వారికే కాక వాటిలో ఆంధ్ర ప్రాంతం వారికి కూడ లభించే అవకాశాలు ఉండాలన్న ఆందోళనయిది. ఈ ఆందోళన ఆఖరికి ఎక్కడికి తీసుకువెళ్లిందో చూడండి. రాష్ట్రాన్ని ముక్కలు చెయ్యాలన్న వరకూ తీసుకు వెళ్తున్నారు. రాష్ట్రం ముక్కలు కావాలన్న వారు దేశభక్తులుగాను, కాదన్నవారు దేశద్రోహులుగాను చిత్రించబడుతున్నారు. నిజానిజాలు పరిశీలించండి.

కేవలం ఉద్యోగాలకు సంబంధించినవే ముల్కీ రూల్సు – అయినప్పటికీ యీ సందర్భంలో ఇతర కోర్కెలు గురించి కూడా పట్టుదల వహించవలసి ఉంటుంది అని నిశ్చయించుకున్నాం.

**కేంద్రం చేసిన మరికొన్ని నిర్ణయాలు**

(1) ఆంధ్రులకు విద్యావకాశాలు విరివిగా లభించాలి. హైస్కూలు తరగతులలో ఎట్టి విచక్షణా ఎన్నడూ లేదు. కాలేజీలకు వచ్చేటప్పటికి సీట్లు తక్కువ కేటాయిస్తున్నారు. ఇది పనికిరాదని అడుగుతూ వచ్చాం. పార్లమెంటులో ప్రధాని ఇచ్చిన వాగ్దానం ప్రకారంగా కొత్తగా కాలేజీలు పెట్టి మరీ పూర్తి అవకాశాలు విరివిగా కల్పిస్తున్నారు.

(2) వెనుకబడిన తాలూకాలు : తెలంగాణా ప్రాంతాలలోవలె ఆంధ్రప్రాంతంలో కూడా ఉన్నాయి. ఈ వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికై కేంద్రప్రభుత్వం ఉదారంగా ఆర్థిక సహాయం చెయ్యాలి. ప్రణాళికలో కేటాయించిన మొత్తాలకన్నా అధికంగానూ అదనంగానూ ఇట్టి సహాయం జరిపించాలి అని, ఆంధ్రమంత్రులం కోరుతూ వచ్చాం. మంత్రిమండలి కూడా తీర్మానించింది. ఈ విషయంలో కూడా ప్రత్యేకించి ప్రధాని వద్దకు రాయబారం వెళ్లి మరీ మేము విజ్ఞప్తి చేసినట్లు పత్రికా ముఖంగా చూసే ఉంటారు. ఈ విధంగా చెయ్యగలమని పార్లమెంటులోనే ప్రధాని ప్రకటించేరు.

(3) తెలంగాణా ప్రాంతంవారికి ప్రత్యేకంగా రీజినల్ కమిటీ ఒకటి ఉంది. అటువంటి కమిటీ మాకు ఏర్పాటు చేయాలని కూడా ఆంధ్రమంత్రులు కోరడం తమకు తెలుసు. మంత్రిమండలి కూడా తీర్మానం చేసింది. ఈ కోరికను అంగీకరిస్తూ పార్లమెంటులో ప్రధాని ప్రకటన చేసేరు. ఆంధ్ర ప్రజానాయకులు కోరినట్లు రీజినల్ కమిటీలను గాని, అభివృద్ధి మండలులనుగాని ఏర్పాటు చేయుటకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది.

(4) ఇంతేకాదు. ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు లభించే ఆర్థిక వనరుల విషయంలో సమగ్ర పరిశీలనలు జరిపి ఉభయ ప్రాంతాలకు న్యాయతహా ఇవి ఖర్చు అగునట్లు చూడగలమని కూడా ప్రధాని ప్రకటించేరు. ఒక్క రాజధానీ నగరంలోనేకాక అన్ని ప్రాంతాలకు సంబంధించిన ఆదాయవ్యయాల సరళిని లోతుగా పరిశీలించే సదవకాశం లభించింది. అందరం కోరిందికూడా ఇదే.

(5) రాజధాని నగరంలో 1977 తోనూ, తెలంగాణా జిల్లాల్లో 1980 తోనూ యీ ముల్కీ రూల్సు రద్దు కాగలవని కూడా ప్రధాని స్పష్టం చేసేరు. అనగా నాటి నుండి ఎంత చిన్న ఉద్యోగం కూడా తెలంగాణా వారికే కేటాయించడం అన్నది జరుగదు. ఈ కాల నిర్ణయం మరి మారదని, తిరుగులేనిదని కూడా ప్రధాని ప్రకటించేరు.

(6) ప్రత్యేక రక్షణలు శాశ్వతంగా నిలిచేవి కాదని, ఇవి తాత్కాలికమైనవనికూడా ప్రధాని ప్రకటించేరు. చిత్తశుద్ధితో సమస్య పరిష్కరించేందుకు భారత ప్రధాని కృషి చేసేరు.

**ఏది మంచిది?**

ఈ సమస్యను పరిష్కరించుకొనే బాధ్యత రాష్ట్ర నాయకుల మీదనే ఉన్నట్లు కేంద్ర ప్రభుత్వం ముందుగా స్పష్టం చేసింది. తమలో తాము పరిష్కరించుకోవడం సాధ్యం

కాలేదని, ప్రధాని నిర్ణయానికి కట్టుబడి ఉంటామని కూడా ఆంధ్ర మంత్రులు శ్రీ సుబ్బారెడ్డిగారి నాయకత్వంలో శ్రీమతి ఇందిరాగాంధీకి తెలియచేసేరు. మీ నిర్ణయానికి కట్టుబడి ఉంటామని చెప్పేరు. అవిధంగానే ప్రధాని ప్రకటించిన పంచసూత్ర పథకాన్ని ఆంధ్రమంత్రులు – మొత్తం మంత్రిమండలి కూడ ఆమోదించేరు. ఆ తర్వాత శాసనసభా కాంగ్రెస్ పార్టీలో కూడ వీటిని ఏకగ్రీవంగా ఆమోదించేరు. ఇన్ని విధాలా దీనిని ఆమోదించిన తర్వాత – ఆంధ్రమంత్రులు కోరిన అన్ని విషయాలను ఆమె అంగీకరించిన తర్వాత కూడ – నిర్ణయాన్ని మార్చుకున్నారు. ఇది బాగుందా? అప్పుడు నేను ఏమి చెయ్యాలి?

ఆంధ్రప్రదేశ్ ఐక్యతమీద నమ్మకం ఉందని అనేక పర్యాయములు బహిరంగంగా ప్రకటించి, ఆంధ్రప్రదేశ్ సమైక్యతనే కాంక్షిస్తున్నాం అని ప్రధానితో చెప్పి – ఆ విధంగా చెప్పినట్లు పత్రికాముఖంగా ప్రకటించి, ఆ తర్వాత రాష్ట్ర విభజన జరగాలని అన్నారు.

కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులుగా ఎన్నిక అయి, శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వం మీద ప్రజలకు ఉన్న విశ్వాసం మీద ఎన్నికలలో విజయం సాధించి – సమగ్రమైన ఆంధ్రప్రదేశ్ శాసనసభకు సభ్యుడిగా ఎన్నిక అయి – అటు పార్టీ నిర్ణయాన్ని – ఇటు శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వాన్ని – తిరస్కరించి ఆంధ్రప్రదేశ్ విభజనకు పోరాటం చెయ్యడం సమంజసమేనా?

**ఏది ఆదర్శవాదం? - ఏది అవకాశవాదం?**

ఇవన్నీ ఆలోచించుకోవలసి ఉంది. ఎంత ఆలోచించినా న్యాయానికి కట్టుబడి – కలిగే కష్టనష్టాలు అనుభవించడమే ధర్మం అనిపిస్తోంది. పదవులు కావలసినపుడు పార్టీ కావాలని – జాతీయ నాయకత్వం కావాలని – కష్టాలు వస్తాయన్నప్పుడు అన్నీ త్రోసిపుచ్చడం ధర్మం కాదు. ఆదర్శాన్ని విడిచిపెట్టడం త్యాగం అవదు. ఆదర్శానికి అంటిపెట్టుకొని కష్టనష్టాలను అనుభవించడం త్యాగం అవుతుంది. ఆదర్శాన్ని త్యాగం చేసి, వ్యక్తిగా రాణించడానికి ప్రయత్నం చెయ్యడమే త్యాగమా? ఇదే నీతిమార్గమా? పదవుల్లో మొన్న లేము. రేపు ఉండకపోవచ్చు. ఎవరికీ ఇవి శాశ్వతం కాదు. రాష్ట్ర పురోభివృద్ధి, రాష్ట్ర భవిష్యత్తు శాశ్వతం అయినది. రాష్ట్ర సమైక్యత అన్నది శాశ్వతం అయినది. రాష్ట్రం బాగుంటే ఒక వ్యక్తి పాడయినా పరవాలేదు. ఒక వ్యక్తి బాగుండి రాష్ట్రం పాడయితే ఏం లాభం?

## పచ్చని పైరులో నిప్పులు చెరగడం ఎలా?

మూడువందల సంవత్సరాల అనంతరం ఆంధ్ర ప్రజలు ఏక రాష్ట్రం ఛత్రచ్ఛాయలోకి వచ్చేరు. అనేక దశాబ్దాలుగా మనం కన్న కలలు ఫలించి ఆంధ్రప్రదేశ్ అవతరించింది. నేటి ఉద్రేకంలో రాష్ట్రాన్ని ఎలా ముక్కలు చెయ్యడం? క్షీరభాండాన్ని ఎలా పగులగొట్టడం? పచ్చనికొంపలో ఎలా చిచ్చులు రేపగలం? అన్నదమ్ముల మధ్య కలిగిన యీనాటి అనుమాన విద్వేషాలవల్ల చల్లని తెనుగు తల్లి కడుపులో నిప్పులు పొయ్యలేము.

నాకు చేతకావడంలేదు - నోరు రావడంలేదు. మనసు అంగీకరించడం లేదు. యీవేళ నాకొచ్చిన పదవిని - పదికాలాలు నిలిచే పచ్చని రాష్ట్రంలో చిచ్చుపెట్టేందుకు, ఆ చిచ్చు పెంచేందుకు ఉపయోగించలేను. మన ఆశలు, ఆశయాలు ఫలించి, అవతరించిన విశాలాంధ్ర పోతే నేను మాత్రం ఎందుకు మిగిలి ఉండాలి?

ఇదీ నా బాధ. ఇదే నా ఆవేదన. ఇదే నా వివరణ. మీ అభిమానానికి సర్వదా నేను కృతజ్ఞుడిని...

